శ్రీ సత్యదేవతాయైనమః

# నానారాజ సందర్శనము

## శ్రీ
## తిరుపతి వేంకటకవి
## ప్రణీతము...


ప్రకాశకులు.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిసన్సు

వేంకటేశ్వర [illegible] నివేశము

కడియం P.O.

తూర్పుగోదావరి జిల్లా.

1957.

ఆంధ్రదేశంలోని రాజుల్నీ మహారాజుల్నీ సందర్శించడానికి తిరుపతి
వేంకటేశ్వరులు వెళ్ళినప్పటి సందర్భాలలో చెప్పిన
చాటుపద్యములన్నీ యిందు పొందుపరుపబడి
ప్రకటింపబడినవి.



పర్యవేక్షణ:
"విద్వాన్"
## చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి



ఆరవ ముద్రణ: 1000 ప్రతులు
వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్
ఆలమూరు

# ఉపోద్ఘాతము

(ద్వితీయ ముద్రణము)

చదువరులారా !

నానారాజసందర్శన మను నీ పొత్తము మీకుఁ జిరపరిచితమే యగుటచే నింమనుగూర్చి విశేషించి చర్చింపనవసరములేదు. ప్రథమముద్రణము నందు దీనికిఁ గొందొక దీర్ఘమైన యుపోద్ఘాతము లిఖింపఁ బడుటయే కాక యిందు మా జాతకచర్యనుండి కొన్ని భాగములు సయితమెత్తి యుదాహరింపఁబడినవి. కొలదికాలములో నాపొత్తముగూడ ముద్రింప నిశ్చయించుటచే నిపుడా భాగముల సుదాహరింపలేదు. వెనుకటి ముద్రణము నాటికి మా వయస్సు సుమారు నలువదికి దాదాపు. ప్రస్తుతమో ? అఱువదికి మించినది. కావున నప్పటికన్న నిప్పు డెన్నియో పద్యములు పెరిగినవి. ఇప్పటికిఁ బదివత్సరములకుమున్ను మా యిరువురలో నొకరు స్వర్గస్థులైన విషయము మీ రెఱుఁగనిదికాదు. అయినను, "తిరుపతివేంకటీయము"ని యే గద్యములలో వాడుటకు దూరదృష్టిగలవారు సంశయింపకున్నను, గొందఱేని సంశయింపకమానరు. ఈ పొత్తముమాటకేమి దీనిలో నిరువుర కవిత్వము కలదు గాన నెట్లో సమాధానము చెప్పికొననగు. కేవలము నొకరేరచించిన పొత్తములయందుఁగూడ నట్లే వ్రాయుట కర్థమేమేనిగలదా ? యని యందురేని వినుఁడు.

"ఒక్కరు రచియించిరేనియును
గాఁ దగుఁ దిర్పతి వేంకటీయమై."

అని నేను జాతకచర్యలో వ్రాసియే యున్నాను. మా యేర్పాటట్టిది మే మిరువురము గలసి సంచారమొనర్చు కాలమునందలి రచనలు విడదీయు శక్యము గాకున్నను నిటీవలి రచన యందలి విషయములను బట్టి యాయా కర్తృత్వము విజ్ఞులకు సుబోధమే గాన దానికై యిందుఁ గొన్ని పంక్తులు వ్రాయవలసిలేదు. ఇప్పటి ముద్రణమున మునుపటికన్న రెట్టింపు గ్రంథము పెరిఁగినది. కాని యిప్పుడేని యాయా ప్రస్తావముల యందలి పద్యము

లన్నియు నిందు సేకరింపఁబడినవని యనుకొనరాదు. మా మా [illegible] లోపము వలన నెన్నియోపద్యము లంతరించినవి. వెనుకటి ముద్రణమున గ్రంథభాగమునఁ జేర్ప మఱచినవి మూఁడుపద్యములు పీఠికలో [illegible] రింపఁబడినవి. మరల వాని నిటఁ జూపుచున్నాఁడను.

శ్లో. కంఠస్థం యదిపాణినీయమఖిలం మాద్య స్వదృక్సన్నిధౌ
నిర్భీకంకురు తావదేకమపివా శ్లోకం విపాకాకరమ్
నో చేత్తాదృశ భాగ్య మస్తినచమే కిం వాకరోమీశ్వరం
శోకం వాకురుకింతు మాకురు ముధా పద్యాని గద్యానివా.

శ్లో. వక్తా వ్యస్తాక్షరణాంచ్యుతి సహితతయా షోడశా[illegible]
పద్యానాంచ త్రియాణాం కథమపిచభవేద్యోఽపివాఽ[illegible]
సోఽయం సాక్షిన్మహాకాళ్యధికతర దయాపాత్ర [illegible]
స్పర్ధాళుశ్చేత్కథంవా నభవతు[illegible]లహో వ్యాఘ్రమార్జాల [illegible]

క. పురుహూతుసుతుఁడు గురుగురు
గురులును సుగుణుండు సూనుకులుఁడు [illegible]
డురు సుగుణు సుగుణు సురులు సు
పురుషు సుసుతు శూరు సూనుభూపుఁ [illegible]

ఇట్టి వింకను నిందుఁ జేరఁదగిన వుండునుగాని యవి [illegible] మునకు స్ఫురింపవు. మాకు స్ఫురింపకున్నను గంతపాతముగా [illegible] వా రందందుఁగలరు గాని వారు మాత్రము సమయమున [illegible] దరు? కావున నీలోప మట్టె నిలువవలసినదయ్యె. మఱియు [illegible] ముద్రణము నందలి ప్రమాదములు నీ ముద్రణమున [illegible] తలఁచికూడఁ బూర్వార్ధమున మాత్ర మప్పని నెఱవేర్పఁ[illegible] యుత్తరార్ధము ముద్రించునప్పటికి నేను తగినంత యారోగ్యములో [illegible] డని హేతువున వెనుకటి తప్పులట్టె నిలిచిపోవలసినవయ్యెను......... ...

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

శతావధాని

# విషయసూచిక

ఓం

శ్రీ మత్సరదేవతాయై నమః

# నానారాజసందర్శనము, పూర్వార్ధము

—॰ వేంకటగిరిలో శ్రీరాజావారి బావమఱఁది చెలికాని గోపాలరావుగారి కంపిన అర్జీపద్యములు ॰—

సీ. దర్శనీయంబు గోదావరీతీరంబు
వాసంబు సద్గుణావాస ! మాకు
షడ్దర్శనీవేది చర్లబ్రహ్మయశాస్త్రి
గురువరేణ్యుఁడు ధరాభరణ ! మాకు
అష్టశతావధానాదిసత్క్రియ మంచి
నిశ్శ్రప్రాయము కలానిపుణ! మాకు
శబ్దశాస్త్రప్రశస్త ప్రభావం బాత
పత్రమ్ము దివ్యచారిత్ర ! మాకు

తే. గీ. పండితప్రీతి నొప్పు మీవంటి నృపతు
లధికదివ్యప్రతాప ! మాన్యమ్ము మాకు;
విమలమధురాశుధారాకవిత్వసరణి
కేళికాభూమి మాకు గోపాలరాయ !

సీ. కాశీసహస్రాదికావ్యమ్ములు రచించి
కాశీకృపం జెందఁ జాలినాము
ధాతురత్నాకరోద్దామచంపు రచించి
పాణినీయస్తుతుల్ వడసినాము
వేగ మాపాణినీయామమ్ము పఠించి
మించి దేశికుల మెప్పించినాము
కాకినాడాదిసద్గ్రామమ్ముల శతావ
ధానమ్ముచేఁ గీర్తిఁ బూనినాము

ఓం
శ్రీ మత్సరదేవతాయై నమః

# నానారాజసందర్శనము, పూర్వార్ధము

—• వేంకటగిరిలో శ్రీరాజావారి బావమఱఁది చెలికాని గోపాలరావుగారి
కంపిన అర్జీపద్యములు •—

సీ. దర్శనీయంబు గోదావరీతీరంబు
వాసంబు సద్గుణావాస ! మాకు
షడ్దర్శనీవేది చర్లబ్రహ్మయశాస్త్రి
గురువరేణ్యుఁడు ధరాభరణ ! మాకు
అష్టశతావధానాదిసత్క్రియ మంచి
నీళ్ళప్రాయము కలానిపుణ! మాకు
శబ్దశాస్త్రప్రశస్త ప్రభావం బాత
పత్రమ్ము దివ్యచారిత్ర ! మాకు

తే. గీ. పండితప్రీతి నొప్పు మీవంటి నృపతు
లధికదివ్యప్రతాప ! మాన్యమ్ము మాకు;
విమలమధురాశుధారాకవిత్వసరణి
కేళికాభూమి మాకు గోపాలరాయ !

సీ. కాశీసహస్రాదికావ్యమ్ములు రచించి
కాశీకృపం జెందఁ జాలినాము
ధాతురత్నాకరోద్దామచంపు రచించి
పాణినీయస్తుతుల్ వడసినాము
వేగ మాపాణినీయామమ్ము పఠించి
మించి దేశికుల మెప్పించినాము
కాకినాడాదిసద్గ్రామమ్ముల శతావ
ధానమ్ముచేఁ గీర్తిఁ బూనినాము

తే. గీ. ఇఁకను భవదీయ సన్నిధి నెపుడు మన్న
నలు లభించు నటంచు నిన్నాళ్ళనుండి
కాచియున్నాము శ్రీచెలికానివంశ
వారిధిశశాంక ! రాజగోపాలరాయ ! 2

శ్లో. రాజానో విరళా స్తతోఽపిగుణిన స్తత్రాఽపి విద్వత్ప్రియా
స్తత్రాఽ ప్యుత్తమపాండితీపరిచితా గోపాలభూమీపతే !
విద్వాంసో విరళా స్తతోఽపి కవయ స్తత్రాఽఽశుధారాచణా
స్తత్రాఽపి హ్యవధానిన స్తదుభయం దైవేన రాశీకృతం. 3

శ్లో. యస్యాఽఽస్తేబుధత త్త్వవి త్త్వమతులం సోఽయం దరిద్రాయతే;
యస్యైశ్వర్య మతీవ భాతి స పుమాన్ విద్యావిహీనాయతే;
శ్రీగోపాలనరేంద్ర! సర్వత ఇదం స్వాభావికం దృశ్యతే;
కిం త్వస్మాక మదృష్ట మద్య ఫలితం య త్త్వం ధనీ పండితః. 4

—• ప్రసంగవశమునఁ జెప్పినది •—

మ. "సభ చేయించునొ లేదొ" యంచు మొదలన్ సందేహ, మాపైఁద "నీ
సభలో నేమిట లోప మౌనొ" యనుచున్ సందేహ, మాపైఁద "నీ
సభలో నింతకు లాభ మేమొ ?" యనుచున్ సందేహ, మూహింప నీ
సభలం జేసెడివారెపో ! జగతిలో సందేహ సంరక్షకుల్. 5

—• అంటుజోడిచ్చినప్పుడు చెప్పినది •—

క. శ్రుతిహితకార్యరతుం డను
నుతికిన్ గోపాలరాయ ! నూనముగా నీ
వ తగుదు వీసంగతి స
త్కృతిగను నాశ్రితులఁ జూడఁ దెల్లమకాదే ! 6

—• సెలవుసమయమునఁ జెప్పినది •—

√ సీ. పండితుండనెడి శబ్దము కర్ణపథమందుఁ
బడినమాత్రి నపిల్వఁ బంపునతనిఁ
బంపి యాతనికెంత పాండితీపటిమంబు
గలదొ యంతయును దాఁగలయఁజూచుఁ

జూచి యాతఁడు తన్నుఁజూడ నేమి ప్రసక్తి
గల్గెనో యట్టిసంగతుల నడుగు
నడిగి యాతనికోర్కె కధికమ్ముగానిచ్చి
యును "గొంచెమిచ్చితి" ననుచుఁగుందుఁ

తే. గీ. గుంది తిరిగియు నిచ్చు ద్విగుణముగాఁగ
నిచ్చి మరలయు నిచ్చు నిట్లిచ్చియిచ్చి
మరలనిచ్చును మఱియిచ్చు మఱియునిచ్చు
నహహా ! గోపాలవిభువదాన్యత్వమహిమ. 7

—• వీరితో తిరుపతివెళ్ళినప్పుడు స్వామిసన్నిధిని జెప్పినవి •—

సీ. కాసుచొప్పున నింతగానార్జనముచేసి;
తెంతదెచ్చినను మా కింతలేదు
గడగడలాడి నిన్ గానంగ నేతెంత్రు;
గానఁ బోయినమమ్ముఁ గాంచుటరిది
ప్రీతితో నీకు నర్పింతు రెంతైన; మా
కింతయిచ్చియు నెంతు రెంతొయనుచు;
సేవించి నీకు వాంఛితము లిత్తురు; సేవ
గావించినను మాకుఁ గాసునీఁడు;

తే. గీ. వేయిమాటలఫలమేమి ? పేరులోక్క
మైనను నదృష్టములు వేఱువేఱై చెలంగు
సరస తిరుపతివేంకటేశ్వర కవీంద్రి
శరణ ! తిరుపతి వేంకటేశ్వర ! నమోఽస్తు. 8

సీ. ఆసించె దేలొకో కాసులార్జింపంగ ?
శుద్ధదారిద్ర్య విస్ఫూర్తి తనర
లక్షించె దేలొకో లంచమిచ్చినవారిఁ ?
బక్షపాతివిధమ్ము బయలు పడఁగ

హింసించె దేలొకో ఋణమిచ్చి నృపకోటిఁ?
బెద్దకోమటిసెట్టి విధముదోఁప
వసియించె దేలొకో పర్వతాగ్రమ్ముపై?
వేట లాడెడి బోయసాటిదెలియ

తే. గీ. నాకు నివి యన్నియును నవ్వునడక లంచుఁ
దోఁచు, నీ చిత్తమున కేమి దోఁచు నొక్కొ?
సరస తిరుపతి వేంకటేశ్వర కవీంద్ర
శరణ! తిరుపతి వేంకటేశ్వర! నమోఽస్తు. 9

—• సంస్థానాధిపతి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులకు అర్జీ •—

చ. తిరుపతివేంకటేశకవిధీరుల మేము శతావధానమున్
గరము రచింపఁగా బటిమ గల్గినవారము శబ్దశాస్త్రధీ
వరులము సర్వపాపచయభంజన రాజదఖండ గౌతమీ
సరిదురుతీరవాసులము; సారకళాకర! యాచభూపతీ! 10

ఉ. పండితమండలీహృదయపంకజభాస్కరుఁడంచుఁ బండితా
ఖండలు లెల్లదిక్కుల నఖండభవద్యశ ముగ్గడింపఁగా
నిండుమనమ్ముతోడ విని నేఁటికి నీదగు రాజధానికిన్
బండువుగాఁగ వచ్చితిమి పాలనసేయుమి, యాచభూపతీ! 11

సీ. ఒకచాయ వికచాంబుజకచాకచికచాక
చకికాచణాక్షనుజన్ము లొప్ప
నొకదండ మతిచండిమకరండనలజాండ
మండనపండితోద్దండు లొప్ప
నొకపక్క శుకతజ్జనకనాకుజనకనా
కకవీంద్రసమకవిప్రకర మొప్ప
నొకచోట సకలవాగ్వికసనప్రకుశల
ద్వాందిమాగధజనుల్ వఱలుచుండ

తే. గీ. నిండుపేరోలగమ్మున నుండునిన్నుఁ
బండువుగఁజూచుభాగ్యమ్ము పండెమాకు

నిపుడు, శ్రీరాజగోపాలకృష్ణయాచ
భూపబహాదర్ ! మహారాజ ! భూరితేజ ! 12

—• ఎదుటఁ జదివినవి •—

సీ. ఆవాస మెన్న గోదావరీతీరమ్మ
కుల మెన్న బ్రాహ్మణకులము మాకు
వయసునెన్నంగ నిర్వదికించుమించు వ
ర్తనమునెన్నఁగఁ గవిత్వమ్మమాకు
గురువునెన్నఁగ బ్రహ్మగురుపండితుండు శా
స్త్రమ్మ నెన్నంగ శాబ్దమ్మమాకు
దారిద్ర్య మెన్న విస్తారమ్మ మఱికుటుం
బమ్మ నెన్నఁగ విస్తృతమ్మమాకు
తే. గీ. దానపాత్రులమేము దాతలునుమీరు
పైని మీచిత్తమును మాదుభాగ్యమును న
రేంద్ర ! శ్రీరాజగోపాలకృష్ణయాచ
భూపబహాదర్ ! మహారాజ ! భూరితేజ ! 13

సీ. అలభోజుఁ జెప్పంగ నారంభమును జేసి
కాళిదాసునిఁ జెప్పి గాని మాన
రల విక్రమార్కుయోగ్యత చెప్పఁగాఁ బూని
భట్టిఁ జెప్పకమున్నె గట్టిపెట్ట
రల్ల రాజనరేంద్రు నారంభమునుజేసి
నన్నయఁ జెప్పకమున్నె మాన
రలకృష్ణదేవరాయలఁ జెప్పఁగాఁ బూని
పెద్దనఁ జెప్పక రద్దుసేయ
తే. గీ. రిప్పటిది గాదు మీకుఁ గవీంద్రులకును
గలదు సంబంధ మిది పూర్వకాలమున న
రేంద్ర ! శ్రీరాజగోపాల కృష్ణయాచ
భూపబహాదర్ ! మహారాజ ! భూరితేజ ! 14

సీ. ఆహ్లాదమునఁ జంద్రుఁడని తెల్పుఁ జందిప
ర్యాయమై తనరారు రాజపదము
ఐశ్వర్యమున నింద్రుఁడని తెల్పు దేవేంద్ర
వాచకంబైన గోపాలపదము
శ్రితరక్షణమ్మున శ్రీవిష్ణువని తెల్పు
విష్ణువాచకమైన కృష్ణపదము
యాచించువారల కభ్యసుజ్ఞనొసంగు
నర్థింసం బోధ్యమౌ యాచపదము

తే. గీ. మండలాధీశ్వరున కొప్పు మహిమలన్ని
నామమే తెల్పు నౌర! కర్ణాట ధారు
ణీంద్ర! శ్రీరాజగోపాలకృష్ణయాచ
భూపబహదర్! మహారాజ! భూరితేజ! 15

చ. వెనుకను బుష్యమాసమున వేఱొకపత్రికఁ బంపుకొన్న యం
తన "యిది బత్తె" మంచుఁ దగు ద్రవ్యము నంపిరి దానిచేతనే
మన మతితృప్తినొందె నిఁక మా మనవొక్కటి చిత్తగింపు మో
జనవర! చూడఁ గోరెద మసాధ్య విచిత్ర శతావధానమున్. 16

ఉ. దేవరవారి సన్నిధి నతిప్రతిభాపటిమమ్ము మీఱఁగా
నే వగనైన నొక్కపరి యీ యవధాన మొనర్చు కోర్కెచే
నీవఱకీ పురమ్మునన యిచ్చ వసించుచు నున్నవార మో
భూవర! నిన్నుఁబోలు నృపపుంగవుఁ డెంతటివారి కబ్బెడున్. 17

ఉ. ఎందఱఁ జూచినారము మఱెందరియొద్ద శతావధానముల్
పొందుగఁ జేసినార మిఁక భూవర! తావకమైన సత్సభన్
దందరలేక యొక్క యవధాన మొనర్చిన దానిఁ బోలునే?
కుందసుమమ్ముఁ బోలుటకుఁ గోటిసుమమ్ములకైనఁ జెల్లునే? 18

ఉ. గంటకు నూఱుపద్యములు గట్టిగఁ జెప్పఁగఁ జాలినట్టి మా
వంటి కవీంద్రసంతతినిఁ బండితులై తనరారునట్టి మీ

వంటి ధరాపురందరు లవారణ కారుణికత్వ మేర్పడన్
గంటికి జెప్పరీతిగను గన్గొను టొప్పునుగాదె, భూవరా ! 19

ఉ. ఎచ్చటనో భవాదృశనరేంద్రులు కొందఱు పండితేంద్రులన్
హెచ్చుగఁ బూజ సేయుటకు నిచ్చ వహించుచు నున్నవార లీ
సచ్చరితమ్మ మీకిపుడ సంభవ మందెనె ? మీదువంశమం
దెచ్చటఁ జూచినన్ గల; దిదే నృపధర్మము కాదె, భూవరా ! 20

—• శ్రీముద్దుకృష్ణయాచేంద్రులకు అర్జీ •—

క. తిరుపతి వేంకటసూరుల
మరయంగ శతావధాన మష్టవధానం
బుఱువడిగఁజేయుదుము వ్యా
కరణపుశాస్త్రమునఁ బ్రజ్ఞగలదు నరేంద్రా ! 21

చ. అరయ శతావధానముల నచ్చటనచ్చటఁ బెక్కుసార్లు మే
మరుదుగఁజేసినారము మహాయశముం గనినార మైన మీ
దరి నొనరింప లేదనుట దక్క మఱొక్కటిలేదు లోప మీ
వఱకును దీనిఁదీర్చి మముఁ బాలనసేయుట చెల్లదే, నృపా ! 22

—• నెల్లూరు వెళ్ళుచుఁ జెప్పికొన్నవి •—

శా. ఈశుండో! హరియో! చతుర్ముఖుఁడో! దేవేంద్రుండో! యీముద్దుకృ
ష్ణేశుం; డీతని దర్శనమ్మునకుఁ గా నింతేల, చింతింపఁగాఁ
గాశీసేతులమధ్య నిప్డు నృపతిశ్రేష్ఠుమ్మ జన్మించెనే !
ఆశా ! నన్నిటులేలవేఁ పెదవు, నీ కాయాసమున్ బుట్టదే ? 23

మ. "శని తాఁ బట్టిన నేడువత్సరములే చల్పాదియై బాధ సే
యును; నీవో, పదునాలుగేం" డ్లనెడు సామ్యోక్తుల్ స్మరింపంగఁ జే
సె నహో ! "ముద్దులమూఁట కృష్ణుఁ డితనిన్ సేవింపఁగారా" దటం
చన వో యాశ! దురాశ నీకుఁ గడుఁ బెద్దైయుండఁ గాన్పించునే? 24

మ. కరు లర్పించునొ, యగ్రహారములు దాఁగల్పించునో, వాజులన్
గర మిప్పించునొ, సేలుజోడుల నొగిన్ గప్పించునో యెక్కడౌ

సిరు లందించునొ, యేటి కూరక యిటుల్ శ్రీముద్దు కృష్ణేశుభా
స్వరసందర్శనపుం బ్రసక్తివిడ వాశా! యెందులేరే నృపుల్? 25

—• రెండవ అర్జీ •—

సీ. పరదేశసంపాదనరతి మీకు నరేంద్ర!
పరదేశ సంపాదనరతి మాకు
లసదుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర!
లసదుత్తమ పదాభిలాష మాకు
సకలనుత్యశ్లోకసక్తి మీకు నరేంద్ర!
సకలనుత్యశ్లోకసక్తి మాకు
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర!
మనుమార్గవర్తనంబనువు మాకు

ఆ. వె. మీకు రాజపదము మాకును గవిరాజ
పదము కలదిఁ కెందుఁ గొదవ లేదు
గావ సామ్యమిచ్చి మానించుటొప్పదే?
ముద్దుకృష్ణ యాచభూవరేణ్య! 26

సీ. కఠినమ్ములగు తాళ్ళు కలపి కట్టిన రామ
భజనాలయమ్ములే పడక కాయెఁ
దాఁకినమాత్రనఁ దనువు కఱ్ఱగఁ జేయఁ
జాలిన చలిసీటస్నానమాయె
మడికియు నుడుకని కడువేఁడి మెతుకులే
యాఁకొన్న కడుపున కడ్డమాయెఁ
బ్రభు విచ్చె వేనూటపదియాఱు లనునట్టి
స్వప్నమ్ములే ధనార్జనములాయె.

తే. గీ. వీని నన్నిఁటి గోపాలవిభుఁడు దీర్చె
మరల నీలాటికష్టముల్ మాకు దూర
తరములై యుండఁజేయు మిత్తఱినిఁ గీర్తి
సాంద్ర! శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప! 27

సీ. పరదేశములుదివ్యతరదేశములుగాఁగఁ
బరుల గ్రామములు కాఁపురముగాఁగఁ
బరగేహములుసౌఖ్యకర గేహములుగాఁగఁ
బరులయన్నము బుష్టికరముగాఁగఁ
బరసజ్జనావళుల్ పరమబంధులుగాఁగఁ,
బరులసంపదలు సంపదలుగాఁగఁ
బరులుకష్టసుఖమ్ము లరయువారలుగాఁగఁ,
బరులెల్లఁగార్యతత్పరులుగాఁగఁ

తే. గీ. జేసి పుట్టించినట్టి జేజేలపెద్ద
పండితప్రీతినొప్పు మీవంటి నృపతి
మఱలఁ గొందఱ సృజియింప మఱచిపోయె
నేమనందుము ? ముద్దుకృష్ణేంద్ర ! విధిని. 28

సీ. ఏరాజు కవిరాజు నేనుంగు నెక్కించి
యూరేగఁజేసె నీయూరియందు
నేరాజు కవిరాజుచే రాజితశతావ
ధానమ్ము చేయించి పూనెఁ గీర్తి
నేరాజు వేదాంతసారబోధకసుప్ర
బంధముల్ రచియించి వన్నె కెక్కె
నేరాజు 'సర్వవిద్యారా' జటంచును
గవులచే సన్నుతిగాంచి మించె

గీ. నట్టి విద్వత్కుమారభూపాగ్రగణ్య
పూర్వకృతపుణ్యరాశి ! యో ముద్దుకృష్ణ !
స్వాగతంబుగ దర్శనం బీఁగదయ్య !
ఘనతఁ దిరుపతివేంకటకవుల కిపుడు. 29

సీ. శ్రీనాథముఖకవిశ్రీనాథు లేవంశ
సంస్థానమందు నాస్థానకవులు

రాయవేశ్యాభుజంగాయిత సింగభూ
పాలుఁ డేవంశ సంపత్కరుండు
ఖడ్గనారాయణఖ్యాతి గాంచిన పోత
భూపాలుఁ డేవంశభూషణంబు
మఱియు నెంతయు మహామహులై చెలంగిన
రాజన్యు లేవంశ రాజిమణులు.

గీ. అట్టి వెలుగోటివంశ భూపాగ్రగణ్య
పూర్వకృతపుణ్యరాశి ! యో ముద్దుకృష్ణ !
స్వాగతంబుగ దర్శనం బీఁగదయ్య !
ఘనతఁ దిరుపతివేంకటకవుల కిపుడు. 30

ఉ. దేవరయాజ్ఞ గైకొనక తెంపున నెల్లురిపట్టణమ్ము మున్
బోవుట మంచిగా; "దయినఁ బోవుట కేమినిమిత్త?" మన్న నో
భూవర ! శుద్ధవై దికుల బుద్ధిమహత్త్వపటుత్వసంపదల్
దేవరవారి చిత్తఫణితిన్ జొరఁబాఱి ముదమ్ము సేయఁగన్. 31

ఉ. ఎచ్చట నుండె నీ నగర ! మెచ్చట మా ధవళేశ్వరం బహో !
యిచ్చటి కేగుదెంచునెడ నెందఱు మధ్యఁ గలారు రాజు ! తే
మచ్చటి కేగ కిచ్చటికి నచ్చుగ వచ్చుట కిచ్చఁ జూడ నీ
సచ్చరితంబ కాక నృపసత్తమ ! వే ఱొక హేతు వున్నదే ? 32

క. ఎచ్చట గోదావరి ! మఱి
యెచ్చట నీ వేంకటగిరి ! యింతవఱకు నీ
సచ్చరితము విని కాదే,
వచ్చితిమి నృపాల ! సుకవిపండితపాలా ! 33

క. ఈ రైలుబండి పొగచే
దారిని దొరకొన్న యట్టి తాపము నీ స
త్కారుణ్యామృతశీతల
ధారల బోనడఁపవలయు ధరణీపాలా ! 34

క. కవులవలనఁ బ్రభువులకుఁ బ్రి
భువుల వలనఁ గవుల కిలను భూరియశము సం
భవమందుఁ గానఁ గవులఁ బ్రి
భువు లత్యాదరముతోడఁ బూజింతురి నృపా! 35

క. ఈవిషయం బంతయుఁ దమ
కే విశదము వేఱె చెప్పనేల? యయిన నీ
మా వైదికచాదస్తం
బీవిధమున వ్రాయఁ జేసె నిపుడు నృపాలా! 36

—• అవధానకవితావిషయకము •—

ఉ. వీనుల విందు సేయఁగల విద్య కవిత్వము; దాని కెంతయున్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగఁగావలెన్;
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగుకాల మం
దైనను, బంధచిత్రికవితాదులు చెప్ప నతిప్రియాసమౌ;
గాన సువృత్తవర్ణనలుగా రచియింపుఁ డటంచుఁ గోరుఁ డో
మానవులార! మీరు మతిమంతులు, దీని నెఱుంగకుందురే?
వాననె కోరు హాలికుఁడు పైరు ఫలింపఁగ, నంతె కాని యెం
తో పినదమ్ముతోఁ బిడుగు లుప్పతిలం బడఁ గోరునే! "మతి
స్థానము గాసిపెట్టు నవధానమునం దెటు లా చతుర్విధా
నూన కవిత్వముల్ సలుప నూ కొనుటౌ?" నని శంక నొంద "కె
లైనను బంధచిత్రకవితాదులు చెప్ప" మటందు రక్కటా!
మానము తన్మరందరసచోరమధువ్రతపాదఘాతమున్
మానుగ సైఁచు నం చనెడి మాటలు విందుము కాని యెచ్చటన్
గానము దుష్టపక్షిపదఘాతము సైఁచు నటన్న మాట; లు
త్తానశయాను లొమ్మన నధర్మముగా బరు వెత్తినట్లు, "బం
ధానఁ గవిత్వ మల్లు మవధానమునం" దన మర్త్యకోటి నె
వ్వానికి శక్య మౌను? కలవాణికి వాణికిఁగాక; పెద్ద "లౌ
ఔ" నన సర్వపండితు "లహో!" యనఁ గోరుఁడు, తప్పత్రోవలన్

మానసవీధిఁ గైకొనుట మంచిది గాదు యథార్థపుం గతిం
బూనిన మీకు మాకు మన భూపునికిన్ యశ మప్రమేయమౌ. 37

—• బహుమానానంతరము చెప్పినది •—

చ. ఒకఁడిడె నింద్యమైన యెము కొక్కటి, వే ఱొకఁడిచ్చెఁ జర్మ, మిం
కొకడిఁడె మూఁడుపాదముల కూనముగా భువి, వీరు దాతలా?
సకలకవీంద్రసంతతినిఁ 'జా' లనిపించెడి ముద్దుకృష్ణరా
జకులవతంసుఁ జెప్పెదను జంకక యిందఱిలోన దాతగా. 38

సీ. "పలువురు దను నవ్వఁ బసులఁ గాఁచినవాఁడఁ
బరికింప నిదియొకపరువుగాదు
పాలీయ వచ్చిన పడఁతిఁ జంపినవాఁడఁ
బరికింపనిదియొక పరువుగాదు
గోపాలకుఁడనయ్యుఁ గోవుఁ జంపినవాఁడఁ
బరికింప నిది యొక పరువుగాదు
గొల్లకొంపల వెన్నఁ గొని తిట్లఁబడినాఁడఁ
బరికింప నిది యొక పరువుగాదు

తే. గీ. ఇఁకను గొన్నియకృత్యము లే యొనర్చి
యుంటి నీ లోపములు దీర్చు టొప్పుఁగాదె?"
యనుచు సుగుణంపుఁ బ్రోవయి యలరు ముద్దు
కృష్ణుఁడై పుట్టఁబోలు శ్రీకృష్ణుఁ డిపుఁడు. 39

—• శ్రీ వేంకటకృష్ణయాచేంద్రులకు అర్జీ •—

సీ. చాతకపక్రకరమ్ము జలదోదయము మాడ్కిఁ
జక్రవాకములు భాస్కరునిపగిది
నాఁకొన్నమానవుం డన్నమ్ము భంగిని
హాలికుల్ మేఘోదయమ్ము వోలె
వనధిశుక్తులు స్వాతివర్షోదయము లేవ
మావిగున్న వసంతుమహిమ కరణి

దారిద్ర్యఖిన్నుండు ధననిధానముపోల్కి
మౌని శ్రీవిష్ణుధామమ్ము వరుస
తే. గీ. నీదు దర్శనలాభమ్ము నెమ్మిఁగోరి
యిచట వసియించి యున్నార మింతదనుక
వేగ దర్శన మిప్పించి విపులమైన
సభను మాశక్తి గనుటొప్పుఁ బ్రభువరేణ్య! 40

సీ. సురవంద్యుఁడయ్యును నరునకొక్కనికి సా
రథ్యమ్ము చేసిన రట్టు వోవ
శూరుఁడయ్యును నొక్క సుందరి ప్రాపంది
రణ మొనర్చిన యవగుణము వోవ
విజితేంద్రియుండయ్యు విధి విరామము లేక
జారుఁడైనట్టి నీచత దొలంగఁ
బశుపతీడ్యుండయ్యుఁ బసులఁగాచుచు నలు
గురనోళ్లలోఁ బడ్డ గుఱుతువోవ
తే. గీ. నొక్కయెడ జన్మమంది వేఱొక్క యెడకుఁ
బ్రాణరక్షకుఁ జనిన లోపమ్ము వోవ
సరసవెలుగోటివంశాబ్ధిచంద్రుఁడగుచుఁ
గృష్ణుఁడిప్పుడు వేంకటకృష్ణుఁడయ్యె. 41

✓ సీ. ప్రాసాదనిర్మాణశక్తి మీకు నృపాల!
ప్రాసాదినిర్మాణశక్తి మాకు
సాధువృత్తివిధానసక్తి మీకు నృపాల!
సాధువృత్తవిధానసక్తి మాకు
నవరసాసంపాదనరతి మీకు నృపాల!
నవరససంపాదనరతి మాకు
సతతసద్గుణగణాసక్తి మీకు నృపాల!
సతతసద్గణగణాసక్తి మాకు

ఆ. వె. మీకు యాచబిరుదు మాకును యాచక
బిరుదుగలదు వర్ణభేదమాత్రి
ముండె దీని నెన్న కొసఁగుమీ, వేంకట
కృష్ణయాచభూప! యిపుడు సమత. 42

—• (సమస్య) గానమువంటి విద్యనిఁకఁగానము •—

ఉ. జ్ఞానవిహీనులం దనుపు, జ్ఞానులఁ దన్పును, రాగశూన్యులౌ
మౌనులఁ దన్పుఁ, గ్రూరఫణిమండలిఁ దన్పును, సర్వపక్షిసం
తానముఁ దన్పుఁ, గుబ్జులను దన్పు, మృగమ్ములఁ దన్పు, నెన్నఁగ
గానమువంటి విద్య నిఁక గానము వేంకటకృష్ణభూవరా! 43

—• వసుచరిత్రలో "తమ్ములు పదానుజన్ములై" అను సీసగీతికి సంస్కృతము •—

శ్లో. జఘనరమాయా శ్చక్రిః, పాల్యః కింవా కనిష్ఠసముదాయః
తత్పాదకనీయాన్ కిమ్, ప్రసవాని తదీయనఖరశిశవః కిమ్? 44

—• (సమస్య) రాగములలోన మేఘమల్లారనంగ •—

తే. గీ. శ్రేష్ఠములు మూఁడు వేంకటకృష్ణభూప!
నాగములలోన నైరావణం బనంగ
యోగములలోన లంబికా యోగమనఁగ
రాగములలోన మేఘమల్లారనంగ. 45

—• విశాఖపట్టణం, గోడే గజపతిరావుగారికి అర్జీ •—

ఉ. సంగరశక్తి లేదు, వ్యవసాయము సేయుట సున్న, సంతలో
నంగడి వేసి యమ్మ టది యంతకు మున్నె హుళక్కి, ముష్టికిన్
బొంగు బుజాన వైచుకొని పోయెద మెక్కడికేని, ముష్టిచెం
బుం గొనిపెట్టు మొక్కటి యమోఘ మిదే కద! దంతిరాణ్ణృపా!

—• అచ్చటి డిప్యూటీ కలెక్టరు జయంతి రామయ్యగారు •—

సీ. ఒకనాఁడు రాజరాజోద్యానదివ్యసీ
మలలోన సంతోషకలన గనుట

యొకనాఁడు దుర్గంధయుతపట్టణముల దో
మలతోడ సంగ్రామకలన గనుట
యొకనాఁడు సర్వభోగోన్నతుల్ గల్గువా
రల, పంక్తి మృష్టాన్నకలన గనుట
యొకనాఁడు చేయిగాల్చుకొని వండినవంట
కము మెక్కి యాయాసకలన గనుట

గీ. యొక్కరోజున సారటు నెక్కి తిరుగు
టొక్కరోజున నడుచుట యొక్క విషయ
మందునను నిశ్చయము లేక యలరుకతన
గడియ కొకరీతి మా జాతకముల రీతి. 47

—• మొదటి సంవత్సరం గద్వాలసంస్థానము •—

శా. శ్రీరస్తు శ్రితరక్షణక్షణగుణశ్రీరస్తు నిత్యోత్సవ
శ్రీరస్తు ప్రథమానకీర్తివిభవశ్రీరస్తు గీరస్తు తే
శ్రీరస్త్విత్యతివేలపండితవచశ్శ్రీరస్తు భూరస్త్వహో
శ్రీ గద్వాలపురోత్తమప్రభుమణే! శ్రీరామభూపాలకా! 48

సీ. భూదేవతాగారగోదావరీతీర
కంకణగ్రామమ్ము కాఁపురంబు
రమణీయషట్ఛాస్త్రరత్నసంచయవారి
రాశి బ్రహ్మయశాస్త్రి దేశికుండు
అత్యద్భుతప్రభావాష్టావధాన శ
తావధానములు స్వాభావికములు
గురుపాదసేవనాదరలబ్ధమగు విద్య
నాగరాజముఖోదితాగమంబు

తే. గీ. లలితకవితావిలాసిని వలపుసాని
దర్శనీయులు మీవంటి ధరణిపతులు

తగు నుపాస్యమ్ము కాళిపదమ్ము మాకు
దళితపండితలోప ! గద్వాలభూప ! 49

సీ. శతఘంటకవనమ్ముసల్పుసంగతి యన్నఁ
గరతలామలకమ్ము గాదెమాకు
అష్టావధానకష్టావలంబన మన్న
"నంబికొండయ దండనంబు" మాకు
ఆశుధారాకవిత్వాడంబరం బన్న
"నల్లేరుపై బండినడక" మాకు
సత్కావ్యనిర్మాణ చాకచాక్యంబన్న
షడ్రసోపేత భోజనము మాకు
తే. గీ. వ్యర్థమగు వాదము లొనర్చునట్టివారి
డంబమణఁగించు టాపోశనంబు మాకు
దానరాధేయ ! కవిసముదాయగేయ !
పండితవిధేయ ! రామభూపాలరాయ ! 50

సీ. ముద్దుముద్దుగఁ జెప్పఁబూనితిమా, వన్నె
లాఁడి తీయనిమోవి లంచమిచ్చుఁ
గఠినమ్ముగాఁ జెప్పఁగడఁగితిమా, ప్రౌఢ
కాంతవక్షోజముల్ కాన్కలొసఁగుఁ
దీక్ష్ణరీతినిఁ జెప్పఁ దెరకొంటిమా, వాలుఁ
గంటి లేఁజూపు సుంక మ్మొసంగు
మిశ్రరీతినిఁ జెప్ప మేకొంటిమా, బోఁటి
బిగువుకౌఁగిలి పన్నుఁ బెట్టి తీఱు
తే. గీ. నాశుధారాకవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండమిచ్చితీఱు
నాంధ్రగీర్వాణభాషలయందు మాకు
దళితపండితలోప ! గద్వాలభూప ! 51

సీ. విద్వాంసుఁ డను మాట విన్నంతమాత్రాన
మనమున నానందఘనత చెందుఁ
జెంది, "యాతఁడుతన్నుఁజేరనెప్పుడువచ్చు
నో?" యటంచును మదినూరుచుండు
నుండి, యాతం డూరుదండ కేతెంచిన
"నిల్పు" మంచును బ్రధానికినిఁ జెప్పుఁ
జెప్పి, యాతఁడుతన్నుఁజేరవచ్చినయప్పు
డతనినెంతయును సత్కృతునిఁజేయు
తే. గీ. ననుచు నీకీర్తి విని యిట కరుగుదెంచి
నారమో రామభూపాల ! పేరు వినుము
తిరుపతియతండు వేంకటేశ్వరుఁడ నేను
వెరసి తిరుపతివేంకటేశ్వరులమేము. 52

సీ. కోటిబ్రాహ్మణుల్లోఁగ్రామరొప్పనొక్కండు
చదువుకొనంగనిచ్చను వహించుఁ
జదివిన వారు లక్షలు గల్గినను నందుఁ
బండితుం డొక్కండు బయలుదేరు
నట్టి పండితులలో నరయ వేయికి నొక్క
రుండు కవీశ్వరుండుండు నేమొ
అట్టి కవీశ్వరులందు నూటికి నొక్క
రుం డవధానియై యుండునేమొ
తే. గీ. అట్టియవధాను లెల్ల వహ్వా ! యనంగ
నలుపనేరుతు మవధాన సరణిమేము
గాన, సభఁజేసి మాశక్తిఁగాంచవలదె ?
దళితపండితలోప ! గద్వాలభూప ! 53

చ. ఒకచరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్క టాతఁడున్
సకలకవీంద్రసంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగాఁ

బ్రికటతరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య ! "నూ
టికినెల"గయ్య ! నిక్కమిది డెబ్బదిమాటలు సెప్పనేటికిన్ ? 54

ఉ. చెప్పెద యొక్కమాట కడుఁ జేవ దలిర్పఁగ నోనృపాగ్రణీ !
గుప్పితి మేనిఁ బద్యములగుంపుల నర్జునుఁ డాహవమ్ములోఁ
గుప్పలుగాఁగ బాణములు గుప్పినరీతిగఁ నెవ్వదేనిఁ దాఁ
జెప్పగలాఁడె "వ్రాతు" నని ? చెప్పినఁ జేయమె కృష్ణధరాగమున్.

సీ. పండితులను గౌరవము సేయుటకు మంచి
పండితుల్ దగ్గఱనుండవలయు
నుండిననేమి ? యా యుండుపండితకోటి
పరులయున్నతి సహింపంగవలయు
సైఁచిననేమి ? యా సత్పండితులమాట
లింపుగా రాజు మన్నింపవలయు
మన్నింపనేమి ? యా మన్ననలకు నొద్ద
నుండు దివాను దా నొప్పవలయు
తే గీ. నిన్నియును గల్గు రాజ వీవే యటంచు
వచ్చినారము లేకున్న వత్తుమయ్య ?
దానరాధేయ ! కవిసముదాయగేయ !
పండితవిధేయ ! రామభూపాలరాయ ! 56

సీ. పికకాకములకు నొప్పిదమౌనె భేదమ్ము ?
స్వరముచేఁ గాక రూపమ్ముచేత
హంసబకములకు ననువౌనె భేదమ్ము ?
నడకచేఁ గాక వర్ణమ్ముచేత
నుప్పుకప్పురముల కొప్పునే భేదమ్ము ?
రుచులచేఁ గాక స్వరూపగరిమ
స్ఫటికవజ్రములకు స్ఫుటమౌనె భేదమ్ము ?
రంగుచేఁ గాక భారమ్ముచేత

తే. గీ. పండితకవీంద్రులకును గేవల కవులకు
నలవియే భేదమెన్నంగ? నలఘుతరప
రీక్షచేఁ గాక వేఱొక రీతిచేతఁ
బండితవిధేయ! రామభూపాలరాయ! 57

—• సభచేయకయే సన్మానించినప్పుడు చెప్పినవి •—

ఉ. ఏ కవి యెట్టివాఁడో? మఱి యేకవి కెట్టి విశేషపండిత
శ్రీ కలదో? విచారణము సేయుటయే కనకాభిషేకమౌఁ
గాక, తదన్యపద్ధతి జగమ్ము సమస్తము ధారవోసినన్
చేకుఱునే ముదమ్ము? పరిశీలన సేయుమి, రామభూవరా! 58

ఉ. పండితులైన వారు ప్రతిభాగతి భాసితులౌట సర్వ భూ
మండలి నుండు రాజులును మన్నన సేతురు వారిఁ బండితా
పండితులైనవారల సభాస్థలి నీవలెఁ బూజసేయు ధా
జుండునె? రామభూవర! సమున్నతదానవిధానధీవరా! 59

—• విజయనగరం మహారాజావారి దివాన్ కోదండరావుగారు •—

చ. "కులుకుచుఁ బోయి యుండిరటకున్ బ్రభుదర్శన మీ మొగాలకే
యలవడునే" యటంచు జను లందఱు నాడఁగలా రటంచుఁ జిం
తిలెదము, చింత సేయము మదిన్ మఱియొండు; మగండుకొట్టినం
దులకు సహింపవచ్చు నది తోడిది దెప్ప సహింపవచ్చునే? 60

చ. ధనమున కేమిగాని తగుదాతలు గల్గిన మంచిమంచి ప
త్తనములవంకఁ బోయి యవధాన మొనర్చి గడింపవచ్చు న
చ్చిన దొకమాట చెప్పెదము చిత్తమునందిడు మిట్టి రాజ ద
ర్శన మిలలోన మా కిఁకను జన్మశతమ్ముల కైనఁ గల్గునే? 61

ఉ. "రా జతిపండితుండఁట బరాబరి యౌనఁట మంత్రి రాజుతో
పేజప మొప్పునట్టి కవిధీరులు తిర్పతివేంకటేశు లా
రాజును జూడఁ బోయిరఁట రాజును దర్శన మీయలేదఁటౌ
రా! జగ" మంచు లోకు లను నాయపకీర్తికిఁ దాళఁ జెల్లునే? 62

మ. అటు గద్వా లిటు చెన్నపట్టణము మధ్యన్ గల్గుదేశమ్ము౯నన్
జటులస్ఫూర్తి శతావధానములు మెచ్చన్ జేసియున్నట్టి మా
కిట రా జీయకయున్న దర్శనము నింకెవ్వాని కీ రా జొసం
గుట ? చెప్పంగదవయ్య, పాలితబుధా ! కోదండరామాభిధా ! 63

శ్లో. రాజా విద్వాన్ భవాన్ విద్వా నహో ! భాగ్యం మహాకవేః
అత్రాఽపి దర్శనం నోచే త్కవితాయై నమో నమః. 64

శ్లో. యస్యానందగజేశ్వరః ప్రభు రభూ దానందతీర్థో గురు
ర్యస్యానందమహత్తరంచ హృదయం సర్వా స్వవస్థాస్వపి
యత్కారుణ్య ముపేయుషాం చ విదుషా మానందలబ్ధి ర్ధ్రువం
సశ్శ్రీమానపి పండితో విజయతే కోదండరామప్రభుః. 65

—• విజయనగరం మహారాజావారి దివాన్ రామమూర్తి పంతులుగారు •—

మ. తమ రిప్పించినయట్టి యీ ధనముచేతన్ దృప్తి మా కయ్యె నిం
క మహారాజవిలోకనం బొకటి వేడ్కన్ జేయఁగాఁ గోర్కె, దీ
ని మనమ్మందున నుంచి యెన్నఁటికిఁగానీ పూర్తిచేయంగ భా
రము మీమీఁదను బెట్టినారము సుఁడీ, రామప్రధానాగ్రిణీ ! 66

—• శ్రీ మహారాజావారి యెదుటఁ జదివిన పద్యములు •—

సీ. అల పతంజలికృతం బైన భాష్యమునకే
పరిఢవిల్లును మహాభాష్యపదము
అల దేవదేవుఁడై యలరారు శివునకే
తేజరిల్లును మహాదేవపదము
అల త్రివిష్టపవిభుం డైన పాకారికే
యెన్నంగఁదగును మహేంద్రపదము
అల కాళికాదాసుఁ డౌ కవీశ్వరునకే
గణన కెక్కును మహాకవిపదమ్ము
గీ. రమణఁ బరికింప నల మహారాజపదము
నీక తగుఁగాక యన్యులౌ లోకపతుల

కొాకరికై నను జెల్లునే ? యోగరూఢి
విజయనగరమహారాజ ! విపులతేజ ! 67

సీ. రాజు రాజనఁగనే రాజాయనే చంద్రుఁ ?
డల రాజశేఖరు నాశ్రయించె
రాజు రాజనఁగనే రాజాయనే యింద్రుఁ ?
డర్యమాత్మజుని దానడిగికొనియె
రాజరా జనఁగనే రాజరాజా కుబే
రుఁడు ? కింనరేశత్వరూఢిగాంచె
రాజరా జనఁగనే రాజరాజా సుయో
ధను ? డధికర్ణత్వ మనుగమించె
గీ: రాజనిన రాజరాజన్న రాజులందు
నీక తగుఁగాక యన్యులౌ లోకపతుల
కొాకరికైనను జెల్లునే ? యుర్విలోన
విజయనగరమహారాజ ! విపులతేజ ! 68

శ్లో. తత్కిం చంద్రాతపోఽయం, ననుభవతి దివాఽప్యస్య కస్మాత్ప్రచార
స్సత్త్వాచ్చంద్రస్య, సత్త్వేఽప్యరుణకిరణతోఽజాగళస్థస్తనోఽయం
నోచేదానందదంతీశ్వరవిమలయశ, స్సత్య, మిత్యాదివాక్యై
శ్శాస్త్రార్థంకుర్వతే త్వద్యశసి నృపమణే తార్కికా స్తర్కరీత్యా. 69
తే. గీ. అర్థవత్తని యనఘీనమని సమస్త
దేశసంగతమనియు నదేహమనియు
నర్థవత్సూత్రమందు నీయశముకొంత
గూఢముగఁ జెప్పెఁ బాణిని కువలయేశ ! 70

శ్లో. ఆయాతోపద్రవేవ ప్రజసి నను దివా కింను భోశ్చక్రవాకి !
భ్రాత శ్చంద్రోఽయ మన్యః కిల విజయపురే జాత ఆనందనామా
సూర్యాలోక్య స్స ముగ్ధే ! నను పర మపరో వర్తతే కీర్తిచంద్ర
స్సోఽపి శ్రీ చక్రిరక్షాజను, రితి కవయ శ్చక్రవాక్యైవదంతి. 71

శా. నీకీర్తివ్రతతుల్ ధరాతలము నెందే నిండ నందొక్కఁడా
యాకాశమ్మున కేగి పుష్పవతియై యాపూర్వపశ్చాద్గిరి
వ్యాకీర్ణం బగుచుండు వాయుగతిచే నద్దానఁ "జంద్రోదయ" మి
త్యాకారభ్రమ నొందుచుండు జగ మో యానందభూపాలకా! 72

శా. తానా రాజు, సుతుండు కోమటి, కళత్రంబెన్న నక్షత్ర, మెం
తో నైల్యమ్ము, నిశాకరత్వమును, శ్వైత్యోపాధియుం గల్గు తా
రానాథుండన దేహగేహవితతత్రైవర్ణ్యసాంకర్యకుం
డౌనా యెన్నటికేన్ భవాదృశుఁడు? కాఁ డానందభూపాలకా! 73

చ. వితరణితాకృతప్రభుఁడు విశ్వజనీనకళాకరుండు స
ద్వ్రతపథచారి సౌమ్యగురుఁ డీనృపుఁ డీతనికిన్ ధరాస్థలిన్
బ్రతిమను జెప్పనోపము బరాకునఁ జెప్పిన రాజు తోడుగా
ప్రతిసురభూజమా! విజయరామనృపాలక పుణ్యపుంజమా! 74

సీ. దీనపోషకుఁ డన్న తేటమాటకు మహా
రాజ! నీ నగరి కాలేజి సాక్షి
విద్వత్ప్రభు వటన్న విఖ్యాతి కో శాంత
నిధి! భవన్నగర పండితులుసాక్షి
శ్రితపోషకుం డన్న వితతకీర్తికి మహా
మతి! భవన్నగరహర్మ్యములు సాక్షి
ఆనందమున కాలయం బన్న మాట కో
చారుప్రతాప! నీ పేరు సాక్షి
తే. గీ. నీ యశము దేశములనిండ నిండె ననుట
కితరదేశాటకులమైన యేము సాక్షి
పూషవాడకులాంబోధిపూర్ణచంద్ర!
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర! 75

క. కొందరు పచాద్యజంతం
బందురు మఱికొంద ఱర్శ ఆద్యంతంబే

యందురు మే ముభయం బని
యందుము నీ నామధేయ మానందనృపా ! 76

శా. ఏభూమీంద్రుని( జూడ( బోయినను నీవే పద్యమున్ జెప్పి నీ
వే భావమ్మును జెప్పికోవలయు నింకీ భూవిభుండన్న( దా
నే భావమ్ము గ్రహించువా( డగుట నీ కీ కష్ట మీడేఱె నా
హా. భో ! సత్కవి పూర్వజన్మసుకృతంబా ! నీకు దీర్ఘాయువౌ. 77

సీ. విక్రమార్కునితోడ వేంచేయ కుండునే ?
భోజభూపాలుండు పుట్ట(డేని
భోజభూపాలుతో( బోకుండునే ? రాజ
భూపాలవర్యుండు పొడమ(డేని
రాజరాజనరేంద్రుతో( జనకుండునే ?
కృష్ణరాయలు జన్మమెత్త(డేని
గృష్ణరాయలతోడనే పోకయుండునే ?
భవదీయ వంశమ్ము ప్రబలదేని
తే. గీ. భావుకంబైన భవదీయవంశ్యగరిమ
ధరణి నిందాక సత్కవితావధూటి
నిలిచియున్నది నిలుచును నిలువ(గలదు
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర ! 78

చ. తిరుపతి వేంకటేశులని ధీరులు పిల్తురు మమ్ము. బ్రహ్మ స
ద్గురువరుపాదసేవన మకుంఠితసత్కృప మాకు నిచ్చె వ్యా
కరణము, నీకవిత్వ మన(గా నది పిన్నటనా(డ పుట్టెన
బ్బురముగ( బెంచుకొంటి మిది పొమ్మనినన్ మఱి పోదు భూవరా !

ఉ. ఒక్కొకచోట నొక్కొకనియొద్ద నొకొక్కొక మాట చెప్పనన్
జక్క(గ సంగ్రహించితిమి చాతురిమీఱ(గ( జెప్పపర్జ్ఞ, నొ
క్కొక్క( డొకొక్కరోజున కొకొక్క ప్రబంధము సేయనేర్తు మిం
కిక్కడ దా(పనేల ? పచియించెద మున్నది యున్నరీతిగా.

ఉ. ఎందఱిఁ జూపెనేని వరియింపదు మాకవితాకుమారి, కీ
న్నందుకు దేశముల్ దిరుగు టబ్బెను సౌఖ్యము లేరపోయె నా
నందనృపాల ! నీదు సుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దలయూచెఁ గావునఁ దటాలున దీనిఁ బరిగ్రహింపుమా ! 81

మ. కవితామాధురిఁ దా గ్రహించి "యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబు గా
దు, విశేషం బిట నిర్విశేష మిట, మాధుర్యం బిటన్, పహ్వారే !
కవిరాజా !" యని మెచ్చి యిచ్చు నృపుఁ డొక్కండైనఁ గన్పట్టఁడే
గవినై పుట్టుటకన్నఁ బాపపరిపాకం బుండునే ? భూవరా ! 82

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణుల సభల్
వొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ
బడవలెఁ బడరాని పాటులెల్ల
వినఁగావలెను బూర్వ విద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃపరిశంస
తే. గీ. కవులు కవు లన్నమాత్రాన కవులుగారు
ఎంత భారమ్ము గలదొ కవీశ్వరులకు
నెఱుఁగకుందురె మీవంటి నృపతిమణులు ?
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర ! 83

సీ. పురుషాయిత మొనర్చు పూఁబోడి ముద్దుచే
ష్టల రంగు లొక్కొక్కసమయమందుఁ
బ్రణయకోపాకులప్రౌఢకాంతామనః
పాటవం బొక్కొక్కపట్టునందు
ఈషద్బలాత్కారరమ్యదితాధరోష్ఠీదృ
శాలీల లొక్కొక్క వేళయందు

అనునీతఖండితాహాళవఖావాదిసాం
కర్యమ్ము నొక్కొక్క కాలమందుఁ
తే. గీ. దవిలి వర్తించు మా కవితావధూటి
రస మెఱింగిన మీవంటి రసికవరుల
కే తగునుగాక యన్యుల కెట్లు తగును ?
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర ! 84

మ. "కనుఁగొంటిన్ గవులార ! మి మ్మిచట నాకష్టంబు గట్టెక్కెఁ ర
మ్మనె నానందనృపాలకుండు మిము నే నానందభూపాలకీ
ర్తిని "దేఖో హుకు" మంచు నిచ్చె ననురక్తిన్ బత్రికన్, దానఁ జ
య్యన నేతెంచితిమయ్య ! వాస్తవ మిదే యానందభూపాలకా ! 85

సీ. అమ్మ వంకను జుట్టమా యేమి ? భోజభూ
పాలవర్యున కల్ల కాళిదాసు
అబ్బవంకను జుట్టమా యేమి ? విక్రమ
ప్రభువరేణ్యున కల్ల భట్టి సుకవి
అత్తవంకను జుట్టమా యేమి ? రాజధ
రాధీశ్వరునకు నన్నయ్యభట్టు
మామవంకను జుట్టమా యేమి ? కృష్ణరా
ద్ధరణీశ్వరునకుఁ బెద్దన్న గారు
తే. గీ. కవి యయినవాని నెల్లను గౌరవింప
రాజయిన వానికెల్ల ధర్మమ్ముగాక
పూషవాడకులాంభోధి పూర్ణచంద్ర !
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర ! 86

సీ. "అష్టావధానమా, యానందదంతీంద్రి
జనపాలుదర్శనం" బనెడివారు
"ఆశుకవిత్వమా, యానందదంతీంద్ర
జనపాలు దర్శనం" బనెడివారు

"శతఘంటకవనమ్మ సల్పుటా, యానంద
జనపాలుదర్శనం" బనెడివారు
"ఆకాశపుఁబురాణ మల్లుటా, యానంద
జనపాలుదర్శనం" బనెడివారు

తే. గీ. కాని సులభమటంచు నొక్కరును జెప్ప
రట్టి భవదీయ దర్శనం బాచరించి
ధన్యతను జెందె మాకవిత్వప్రశంస
శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర! 87

మ. కవులెల్లన్ దలలూచి మెచ్చ బుధలోకం బెల్ల వహ్వా! యనం
గ విచిత్రమ్ముగ వందమందికయినన్ గాదేని యష్టావధా
నవిశేషంబయినన్ రచింపఁగల మానందక్షితీశాన! మా
యవధానమ్మను జూడుమా! మనములో నానందముం జెందుమా! 88

ఉ. స్థైర్యములేని చిత్త, మవధాన మెఱుంగని సత్కవిత్వ, మౌ
దార్యము లేని హస్తము, యథార్థత లేని రసజ్ఞ, మంచి మా
ధుర్యము లేని గానము, మృదుత్వము లేని వచఃప్రసంగ, మై
శ్వర్యము లేని భోగము, వసారము లియ్యవి దంతిభూవరా! 89

సీ. కాశీసహస్ర మొక్కటి చేసితిమి భవా
దృశులెల్ల విని వహ్వారే! యనంగ
ధాతురత్నాకరోద్గ్రంథ మొక్కటి చేసి
తిమి శాబ్దికులకు మోదము ఘటిల్ల
వీధి నొక్కటిని సంప్రీతిఁ జేసితి మెల్ల
రసికాగ్రణులు నద్దిరా! యనంగ
శుకరంభికావాద మొకటి చేసితిమి వే
దాంతిశృంగారు లౌరా! యనంగ

తే. గీ. సంస్కృతమ్మున నివి తెల్గుసరణి శ్రవణ
నందనము చేసినార మానందముగను

దక్కఁగల చాటువుల కింక లెక్కలేదు
విజయనగరమహారాజ ! విపులతేజ ! 90

క. సుగుణావతంస ! యానం
దగజపతీ ! సత్యమైనదానిని లోకా
నుగతి నొడివితిమి కానీ
జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెంబేలా ? 91

క. మాపసమా నీపాగమ
గాపసమా మాపథాపగాగమనిసమా
మాపస నీపస గని గా
దా ! పరిపరి తుష్టి చెందె, నానందనృపా ! 92

శ్లో. అస్యా ప్తమానవహయో నగజాఽధినేతాఽ
ప్యత్యాగమోదితయశా అపదాతిభూషః
శంభు ర్భవేదపి తథా కిము రాజమౌళి
రానందభూమిపతి రేవహి రాజమౌళిః. 93

—• క్రొత్తపల్లిలో శ్రీ రావు జగ్గారాయనింగారు •—

ఉ. దూరపుదేశముల్ దిరిగి తోరముగా గడియించునిచ్చచే
వారకపోయి యచ్చటను బత్తెముపెట్టుక యున్న నాజమీం
దారుల దర్శనమ్ము లతిదారుణకష్టముచేతఁ గాని యె
వ్వారికినైనఁ గా; వటుల వారల దర్శన మెట్టులేనిఁ జే
కూరిన వారి పండితులకున్ "గడుఁ బండితు" లంచు వీరిపై
గౌరవబుద్ధి గల్గు టతికష్ట; మటుల్ సమకూరె నేని యా
సూరిజనంబు పల్కు విని సొంపుగ నా తఁడు వీరియందు వి
స్తారపుభక్తితోడ సభ సల్పుట కల్గదు; కల్గె నేని యా
భూరమణుండు తద్రసము పూర్తిగ నాకలనమ్ము చేయువాఁ
డై రహినుండఁ; డొక్కయెడనట్లు రసగ్రహణం బొనర్చు భూ
మీరమణుండు గల్గిన నమేయముగా ధన మీయఁజాలఁ; డె

ప్లే రహి నెక్కడౌ ధనమునిచ్చిన నందున మూఁడు భాగముల్
దారిని రైలు కద్దునను దాఁపవలెన్, దరువాతి భాగమున్
జోరుల పొట్టఁబెట్టకయ సూటిగ నింటికిఁదెచ్చెనేని యా
యూరున నుండునప్పులకు నొప్పఁగఁ జెప్పవలెన్; గవీంద్రసం
సారపుఁజర్య లిట్లుగుట సౌఖ్యము సున్న; భవాదృశుల్ జమీం
దారులు దూరదేశములదారులు ద్రొక్కఁగనీక స్వీయసం
సారములోనఁ జేర్చుకొని సాలునకుఁ సరిపడ్డ ఖర్చు వి
స్తారపు భక్తితోడను నొసంగుచుఁ బోషణ సేయఁగావలెన్;
భూరియశోధనుండయిన భోజుఁడు రాజనరేంద్ర కృష్ణరా
డ్భూరమణుల్ కవీంద్రులను బోషణ చేయుటచేతఁ గాదె? వి
స్తారయశశ్శరీరములఁ దాల్చి వెలుంగుచునున్న వార; లీ
ధారుణిలో భవాదృశసదస్యులలో, నవధాన మిప్పుడీ
తీరునఁ దీరుగా జరిగె ధీవరు లద్భుతమందఁగా; జమీం
దారులఁకెవ్వ రింతవడి తాలిమిఁ బూని కవీంద్రులన్ మహో
దారగుణమ్ముచేతను ముదమ్మునఁ దన్పెడివారు? మీకు సా
టేరును లేరటంచు వచియించెడి తిర్పతివేంకటేశ స
ద్ధీరుల శక్తిసంపదలు తెల్లముగాఁ గనుఁగొంటి రాఁగదా!
వీరలు దూరదేశములవెంబడిఁ బోక యిఁకొక్కచో జమీం
దారులరీతి నుండఁగ ముదమ్మునఁ జేసి యశమ్ము నొందుమీ,
శ్రీరమణాంఘ్రియుగ్మ సరసీరుహబంభరితాంతరంగ! వి
స్ఫారయశోనుషంగ! నరపాలశిఖామణి! జగ్గభూపతీ! ॥14

—• చిత్రాడలో శ్రీచెలికాని జగన్నాథరాయనింగారు •—

సీ. భవదీయసత్రాన్న భక్షణమ్మునఁ జేసి
చదివినారము శబ్దశాస్త్రమెల్ల
భవదీయమిత్రులౌ బ్రహ్మశాస్త్రులవారి
శిష్యత్వమునఁ గీర్తిఁ జెందినాము

భవదీయవంశ్య గోపాలరాయాఖ్య భూ
పతిచేత మెప్పును బడసినాము
భవదాశ్రితులమంచు నవనీపతుల సభ
లందుఁ జెప్పుచు ముదం బందినాము
తే. గీ. భవదనుజ్ఞనె యీచెన్నపట్టణంపు
సీమనెల్లను జూచి ప్రసిద్ధిఁజెంది
నార మిఁక నొక్కచోనుంట న్యాయముకద
నయగుణవిధేయ ! శ్రీజగన్నాథరాయ ! 95

—• రెండవ సంవత్సరం గద్వాల •—

చ. విను మొకమాట రామపృథివీవర ! పోయినవత్సరమ్మ మి
మ్మను గనినార మేము పనిఁబూని, భవన్నికటమ్మనందు నాఁ
డనవరతావధానుల మటంచును దెల్పిన నాలకించి, మీ
రును, "నవధానశక్తి నొకరోజునఁ జూచెద" మంచు నాజ్ఞ యి
చ్చిన. నది నమ్మి మేము నివసించితి మిచ్చటఁ గొన్నినాళ్లు; మీఁ
దను నొక రాజకార్యమునఁ దాము నువేఱొకయూరి కేగ నా
దినమున మేము మాదు దురదృష్టపురేఖకుఁ జింత నొందుచున్
జని, మఱి మాఖమాస మిఁకఁ జయ్యన నెప్పుడువచ్చు ? నంచునె
మ్మనమున నూహసేయఁగను మా సుకృతమ్మన వచ్చె; నిప్పుడై
నను మముఁ జుల్క నేయక ఘనమ్మగఁ జూచి శతావధానరీ
తిని నొకరోజు చేయుట కతిప్రమదమ్మన నాజ్ఞ యిచ్చి దా
నినిఁగని మంచిచెడ్డల గణించి బహూకృతి సేయుమా ! యదే
మనఁ, బ్రతివత్సరమ్మను ననంతముగా ధన మిచ్చి పుచ్చినన్.
బనిగొని వచ్చువార మని మమ్ముఁ దలంపకుమయ్య ! యొక్కయే
టను నిట కేగుదెంచు టకటా ! కడుఁగష్టము; మా నివాసమే
డను ! భవదీయ రాజ్య మకటా యిది యేడను ! నెంతదూరమో
మనమునఁ జూడఁ దెల్లము రమారమి డెబ్బదియామ దుండు; రై

లును నిట కెన్మిదామడకు లోపున లే, దిఁక మాకుకష్ట మిం
తని వచియింపఁగాఁ దరమె ? తప్పక మా మొగముల్ గనుంగొనం
గను విశదమ్ము దేవరకుఁ గాఁగల; దింతటి కష్ట మోర్చియై
నను నిట కేగుదెంచుటకు నారద శారద నీరదోపమం
బనఁదగు నీదుకీ_ర్తియ సుమా ! యొకకారణ; మన్యకారణం
బనినను జెన్నపట్టణము నాదిగ శ్రీవిజయాభిధాన ప
_త్తన మది యంతమందుఁ గల ధారుణి నున్న నృపాలచంద్రులం
గని యవధానముల్ సలిపి కానుక లందియు, వీరిలోఁ బురా
తనమగు కీ_ర్తిగల్గియు నుదారగుణమ్మున నొప్పి శాంతమే
ధనముగ నెల్లవిద్యల యథావిధిఁ జూడఁగఁ గంకణంబు గ
ట్టిన నినుఁబోటి రాజుఁ గని తీవి దలిర్ప శతావధాన రీ
తిని నొనరింపకుండు టది ధీరులు మెచ్చ రటన్న మాటయే
కనుక మదీయశ_క్తి గనఁగావలె నంచు వచించు వేంకటే
శునిఁ దిరుపత్యభిఖ్యుని నసూయ నెఱుంగనియట్టి మంచి స
జ్జనములచేఁ బరీక్షగొని సమ్మద మందుమి ! నెమ్మనమ్మునన్. 96

—• ప్రవేశ పరీక్ష — త్రిపాద సమస్య •—

శ్లో. రామాయరామభద్రాయ తపస్స్వాధ్యాయనిరతం
వేణీసంహార నాటకం

శ్లో. తపస్స్వాధ్యాయనిరతం — గురుంనత్వా కరోత్కృవిః
రామాయ రామభద్రాయ. వేణీసంహారనాటకం 97

—• కేళాకూళిని వర్ణించుట •—

చ. పనిగొని లోపలన్ దిగుడుబావిఁ జెలంగు జలంబు నింటిలోఁ
గొనఁగ సితోపలమ్ము లొడఁగూర్చి రచించిన యంత్రరాజమున్
మనమున నెంతు రామనరనాయకు దానము నాలకించి ల
జ్జను గొని నేవఁజేయ సరసం బయి వచ్చిన నీరదం బనన్. 98

—• అవధానము విఘ్నమైన తత్క్షణము చెప్పినది •—

సీ. ఆవాసమా, గౌతమాపత్యతటినీత
టీరాజితం బైన యూరు మాకుఁ
బాండిత్యమా, నవప్రౌఢగీర్వాణాంధ్రి
కవితావిలాసినీకలన మాకు
సహవాసమా, శాస్త్రసహపాఠనాగత
క్షీరనీరన్యాయ సిద్ధి మాకు
సౌజన్యమా, సమస్తభువనస్థసుజన
స్తవనీయ వాక్యభాజనము మాకు
తే. గీ. అట్టి మే మిట్టి గద్వాల కరుగుదెంచి
కుటిలధర్మాధికారి వాక్కులను వినిన
రాజుచే మన్ననలు పొందరాక యూర
కేగుచుంటిమి మాశక్తి యీ నృపాలు
చెవిని వేయు మీవైనఁ గేశవ! మహాత్మ! 99

—• అప్పు డా సంస్థానములో నున్న ఆదిపూడి ప్రభాకర కవిచే
సమయోచితముగఁ జెప్పబడిన శిఫారసు పద్యము •—

సీ. కనకాభిషేకమ్ము గావింపు మనలేదు
వెయ్యాఱు లిమ్మని వేఁడలేదు
బోగాలనిచ్చి యూరేగింపు మనలేదు
సింహాసనమ్ము లాసింపలేదు
పల్లకీలిచ్చి సంభావింపు మనలేదు
పడగ లిమ్మనియైన నొడువలేదు
గండపెండేరమ్ము గావలె ననలేదు
మాన్యమ్ము లిమ్మని మనవి లేదు
తే. గీ. ఒక్క సభచేసి తోఁచిన పక్కలాకు
లిచ్చి పంపించు మనుటకే యింతలాయె

నిలఁ గవీశ్వరులనుట నవ్వులకుఁ జేటు
కాక యేమున్నదయ్య యీకాలమందు ? 100

— అవధానమునాఁటి ఉపన్యాసము —

ఉ. భూసురవర్యులార ! పరిపూర్ణకలాకలనాభిరాములా
రా ! సరసమ్ముగాఁ గవన మల్లుట యన్నఁ బురాభవమ్మునన్
జేసిన పుణ్యలేశమునఁ జేసికదా లభియించు; గట్టి య
భ్యాసము జేసినన్ గలుగునా ? యిది వేదమ, లేక శాస్త్రమా ?
రోసము లేల ? జందెముల ప్రోవులు వ్రేళ్ళకుఁ జుట్టఁబెట్టి పే
రీసునఁ గ్రిందుమీఁదుఁ బడి యెంతయు దన్నుక చచ్చెనేనియున్
వీసము గాని లేక యఱవీసము గాని కవిత్వధార రా
దే ! సరి, యెట్టకేలకుఁ బదింబదికట్టలు కాగితాల్ వృథా
చేసి కవిత్వ మల్లిన రుచించునె ? యయ్యది గడ్డిపచ్చడిన్
జేసినయట్టు లుండుఁ గడుఁ జిన్నెలు వన్నెలు గల్గి యెంతయున్
భాసిలు బాలికామణికిఁ బ్రాక్కృతకర్మవశమ్ము చే రసా
భాసపు దున్నపో తొకఁ డభాగ్యుఁడు దాపరమైన వానితో
నాసతి యాసలూరఁ గడు నందముఁ జందము చూపునే వృథా
యాస మటంచు లో నొగులు నంతియ కా కొకవేళఁ జూపినన్
రోసి యసహ్యమూని యిసిరో ! యివి యేమిటి కంచు నెంచి యా
కాసర మార్చుఁగాని యివి కాంతల వింత లటంచు నెంచునే ?
భాసురరీతి నొక్కఁడు ప్రబంధము చేసినఁ దద్రసమ్ము నెం
తో సరసమ్ముగాఁ గొను బుధుల్ పచరించిన పుణ్య మన్యమే !
వేసటఁ గొంద అన్నఁ బదివేలు పఠించినఁ గాని గ్రంథముల్
చేసినఁ గాని సత్కవులు చెప్పిన పద్యములన్ రసంబు పే
రాస గ్రహింపలేక దమయజ్ఞత బైటకుఁ బెట్టు కైవడిన్
దోసము లేనిచోటులను దోషము లున్నవటంచు బల్కుచున్
దోసము లున్నచోటులను దోసము లేదని సంతసించుచున్

హాసము చేసినంత సరి యౌనె? మహాకవితావివేచనా
భ్యాస మనంగ నంతఁ బయిపైఁ బడియున్నదె? యద్దియున్ జపు
ర్వ్యాసనయే సుఁడీ! యది యు వారలు వారలు చేయు భాగ్యముం
జేసి లభించు నట్టి పరిశీలన గల్గినవారి కేము వే
యేసి నమస్కృతుల్ సలిపి యెంతయు భక్తి నుతింప కుందుమే? 101

—• అవధానశక్తిం గూర్చిన యాక్షేపణల కుత్తరము •—

చ. బళి బళి! యెంత, వింతయొ సభాసదులార! వినుండు మా సుడిన్;
గలియుగరీతియో, కవిత గానని హేతువుచేతనో, మహా
త్ములమని పేరుబూను తమబోఁటుల గౌరవ మూనునంచునో,
తెలియ దదేమొకాని కడుఁ దేలికయౌనఁట! వందమంది కో
ర్కెలు మది నూని వారలు వరించిన వృత్తములన్ గ్రహించి వా
రల కొకపాదము న్నొడివి వ్రాసిన పిమ్మటఁ దక్కుపాదముల్
గలయఁగఁ జెప్పి పిమ్మట నఖండముగాఁగను నూఱుపద్యముల్
బలువడి నప్పగించుపని; పల్కఁగవచ్చును గాని చేయుటల్
చులకన గాదు; వేఱొకటి చోద్యము పుట్టె, నదేమనంగ, "గం
టలు పది పైనిఁ బట్టునె? తటాలున గంటకొ లేక రెండుగం
టలకొ రచింపఁగావలె హుటాహుటి" నంచు వచింతురంట, వా
రల మతిచాకచక్య మది రాజసభన్ బ్రకటమ్ము సేయఁగా
వలెఁ, దమయింట డాఁగికొని పల్కుట కష్టముగాదు; చేయువా
రల మొగ మెన్నఁడైనఁ గనిరా, వినిరా? యల నూజివీటిలో
పల నల మాడభూషికులపావనుఁడై తనరారు వేంకటా
ర్యులు రచియింపలేదె! బుధు లుబ్బి నుతింపఁగఁ; బీఠికాపురిన్
సలలితరీతి నాతఁ డొకసారి యొసర్పఁడె! కాకినాఁడలో
పల సమలాపురమ్మునను బందరు నెల్లురు చెన్నపట్టణ
మ్ముల విజయాఖ్యపట్టణము ముఖ్యముగాఁ గల రాజధానులన్
బలుమఱు మేమొనర్పఁగ సభాసదు లందఱు మెచ్చి మెప్పులన్
దెలియఁగఁజేయు పత్రిము లనేకము లీయరె! వారిబుద్ధు లీ

లను ముత్తైదువు లీయ సత్కృవులు పల్మాఱుఁ బ్రశంసింప స
త్యనిదానమ్ముగ రాజ్యమేలు మిఁక సీతారామభూపాలకా ! 115

సీ. సామంతరాజన్యసంఘమ్ము లొకవంక
నొకవంక రాజబంధూత్కరంబు
తులలేని మంచి యుద్యోగస్థు లొకవంక
నొకవంక దివ్యవై దికగణంబు
సకలభాషాకవిత్వకలాపు లొకవంక
నొకవంకఁ బ్రథితవైణికకులంబు
శాస్త్రమర్యాదావిశారదు లొకవంక
నొకవంక గాంధర్వయువతిచయము
తే. గీ. నిండు పేరోలగమ్మున నుండి కొలువ
మేలుగా నేలుకొనుము గద్వాలపురము
"పట్టినదియెల్ల బంగారు ముట్టినయది
ముత్యముగ" రామభూపాలు ముద్దుతనయ ! 116

సీ. హరునియంకమునందు మురువుమీఱ వసించు
బాహులేయునికాంతిపటిమ మించి
కమలలోచనుని యంకమునందు వసియించు
చిల్కబాబారౌతుచెలువుగాంచి
యింద్రు పెందొడమీఁద నింపుగుల్కెడు జయం
తునిముద్దులేచెల్వు ననుసరించి
యలకాధిపతి యంకతలమందుఁ జెలువొందు
నలకూబరునిసొగసు గలయఁగాంచి
తే. గీ. రామభూపాలరాయధరామహేంద్రు
నంకపీఠమ్మునందున నధివసించి
మేలుగా నేలుకొనుము గద్వాలపురము
పద్మదళనేత్ర ! రామభూపాలపుత్రి ! 117

సీ. కసులు విప్పిననాఁడె కరుణారసకటాక్ష
వీక్షణామృతమహావృష్టి గురిసె
చేతు లెత్తిననాఁడె శ్రితబహుశ్రుతకవి
ప్రతతిదారిద్ర్యభారమ్ము సడలె
మాటలాడిననాఁడె మహనీయకేశవ
స్వామినామపవిత్రభావము చెలంగె
నడుగు పెట్టినఁనాఁడె యరిరాజగురుశిరః
కలితకోటీరముల్ గదలఁజొచ్చె

తే. గీ. ననుచు జనులెల్లనుతియింప నలరి తౌర!
రామభూపాలరాయపురాకృతప్ర
శస్తభాగ్యస్వరూప! విశాలరూప!
మాకుమార! మహాలక్ష్మమాకుమార! 118

సీ. గర్భస్థితుఁడవైన కాలమందుననె భ
క్తినొసంగఁ బోలు మీ కేశవుండు
జాతకర్మ మొనర్చుసమయమ్మననె దాతృ
తను నేర్పఁబోలు మీతండ్రిగారు
వ్రేలిని గుడిపించువేళనే లోకమ
ర్మము దెల్పఁబోలు మీ మంత్రసాని
మించుటుగ్గును రంగరించువేళనె కవి
త్వరుచి నీఁబోలు మీ తల్లిగారు

తే. గీ. లేకయుండిన నేడేండ్లలేఁత వయసు
నందె యీ తీవు లెటులబ్బుననుచుఁ గవులు
రమణ నుతియింప నలరి తౌరా! మనోజ
భవ్యతరగాత్ర! రామభూపాలపుత్ర! 119

సీ. అతఁడుభాస్వత్కులుండితఁడు భాస్వత్కులుం
డాతఁడీతఁడొ లేక యాతఁడతఁడొ

అతఁడు బుధస్తవ్యుఁ డితఁడు బుధస్తవ్యుఁ
డాతఁడీతఁడో లేకయీతఁ డతఁడో
అతఁడుదుష్టవిరాముఁ డితఁడుదుష్టవిరాముఁ
డాతఁడీతఁడో లేక యీతఁడతఁడో
అతఁడుసీతారాముఁ డితఁడు సీతారాముఁ
డాతఁడీతఁడో లేక యీతఁడతఁడో

తే. గీ. అనుచు నుతియింప నపరరామావతార
మహిమనొప్పిన నిన్నెన్న మాతరంబె?
రామభూపాలరాయపుత్రా! సురూప!
మాకుమార! మహాలక్ష్మమాకుమార! 120

సీ. మత్స్యధ్వజప్రభల్ మదనమూర్తి యటంచు
శంఖచక్రములు కేశవుఁడటంచు
జైవాతృకత్వంబు చందమామ యటంచు
భువనబంధుత్వంబు రవియటంచు
బుధపాలకత్వంబు పురుహూతుఁడేయంచు
రత్నాకరత వారిరాశియనుచు
రమణీయమగుపేరు రామమూర్తియటంచుఁ
జతురాస్యతసరోజజాతుఁ డనుచు

తే. గీ. దెలుపు నినుఁ బ్రోతు రెల్లరుదేవతలును
రామభూపాలరాయ పురాకృతప్ర
శస్తభాగ్యస్వరూప! విశాలరూప!
మాకుమార! మహాలక్ష్మమాకుమార! 121

సీ. పుట్టించెనెవ్వాఁడు భువనత్రయము సృష్టి
సేయఁ జాలినయట్టి చిన్నికొమరుఁ
గలిగించె నెవ్వాఁడు తులలేనికలుషముల్
హరియింపఁ జాలినయట్టి కూఁతు

ధరియించె నెవ్వాడు దారిద్ర్యభారమ్ము
సడలఁజేయఁగజాలు దానమిన్న
వహియించె నెవ్వాఁడు భక్తకోటికిఁ గొంగు
బంగారమై యొప్పు భవ్యముద్ర

తే. గీ. ధరణి గద్వాలకోటలో వఱలు నెవఁడు
మీకుఁ గులదైవతంబయి మెలఁగు నెవ్వఁ
డట్టి కేశవమూర్తి మిమ్మరసిప్రోచు
భవ్యతరగాత్ర ! రామభూపాలపుత్ర ! 122

—• బహుమానసమయమునఁ జెప్పినవి •—

శా. ఎంతోమంది నృపాలకుల్ గలరు వా రెంతేసి రాజ్యమ్ముల
త్యంతప్రాభవరీతిఁ జేసినను విద్వత్పక్షపాతమ్ము లిం
తింతల్ గల్గెనె ! వింతకాదె యిది ! నీవే నీకు సాటెన్నఁగా
సంతోషించె మనమ్ము రామనృపతీ ! సత్యప్రభావాకృతీ ! 123

శా. దూరమ్మందున నుంటిమంచు మనమందుఙ్ జూడఁగాఁబోకు మో
శ్రీరామక్షితిపాల ! సన్నిధికవిశ్రీనాథులంజూచు నా
యా రీతిన్ మముఁజూడఁగోరెదము నిత్యమ్మున్, గటాక్షాళికిన్
దూరమ్మంచును దగ్గఱంచుఁ గలదే ? దూరమ్మె ముఖ్యంబగున్. 124

ఉ. పెద్దనకిచ్చె మున్ను పృథివీపతిరత్నము కృష్ణరాయలం
చద్దయ గండపెండెరము, సత్కవులెల్లరు మెచ్చమీరలున్
దద్దయు మమ్మనుగ్రహవిధమ్మునఁ జూచి యొసంగినారుగా !
ముద్దుఁగడాని నున్ బిరుదముల్, భువి నింతటి దాత లుందురే ! 125

చ. సలలితకీర్తి ! రామనృపసత్తమ ! శ్రీకర ! మీర లిప్పుడే
సెలవు నొసంగినారుగద, చెచ్చెర దేశముచేరి మాఘమా
సలలితపూర్ణిమన్ జపమునల్పుచు వచ్చినతోడ వేగ మి
మ్ములఁగనునట్టి బల్ సుకృతమున్ గొని వచ్చెదమయ్య ! క్రమ్మఱన్,

ఆ. వె. ఎట్టివానికైన నిలలోన వెలఁజెప్ప
వచ్చుఁగాని కవులపద్యములకుఁ

ప్రభుకటాక్షమునకుఁ బరికింప వెలలేదు
గాన రామభూప ! దానినిమ్ము. 127

—• మొగల్తుర్తి రాజుగారు •—

సీ. శిష్టరక్షణదుష్టశిక్షాకృతులకు బల్
దండివా రల్ల కల్దిండివారు
కోరువారలకు విస్తారసంపద లిచ్చు
చుండువా రల్ల కల్దిండివారు
గర్వించు శత్రువర్గముల లోఁగుండెలోఁ
బండువా రల్ల కల్దిండివారు
కేతకీనామ సాకేతపట్టణమునం
దుండువా రల్ల కల్దిండివారు

తే. గీ. దివిజపతిపై భవులు కలిదిండివారు
తేజమున సూర్యసములు కల్దిండివారు
దివ్యకీర్తియుతుల్ కలిదిండివారు
తెలివిగలిగినవారు కల్దిండివారు. 128

సీ. ఎఱుఁగమే ! మీపూర్వు లెన్నియో యగ్రహా
రములిచ్చి కవులగ్రంథములుగొనుట
ఎఱుఁగమే ! మీపూర్వు లెన్నియో మాన్యమ్ము
లిచ్చి పండితులఁబోషించుచుంట
ఎఱుఁగమే ! మీపూర్వు లెన్నియో దేవాల
యములుగట్టించి ప్రఖ్యాతిగనుట
ఎఱుఁగమే ! మీపూర్వు లెన్నెన్నియో ముఖా
సాలు బాంధవుల కొసంగుచుంట

తే. గీ. ఎన్నితరముల నెందఱనేనిఁగాని
సర్వవిధములఁ బోషింపఁజాలు నవియె

యప్రతిహతప్రమోద ! దైవప్రసాద
శ్రీకుమార ! లక్ష్మీనరసింహభూప ! 129

ఉ. వారును వారు వారు మఱివారును వారును జేసినట్టి స
త్కారములుండుగా ! ప్రళయకాలముదన్క, నృసింహభూప ! వి
స్తారధరాధిరాజసుఖసంగమలోలమనస్కుయైన యీ
వారవిలాసినీసుఖ మవార్యమె ? శాశ్వతమే ? సమగ్రమే ? 130

ఉ. విద్దెలు పెద్దఁజేసి తమ పెద్దలు పూర్వపుఁగాలమందు మా
పెద్దలకుఁ గోరుసీమలనె పెద్దగ నిచ్చిన భూమిఖండముల్
హద్దులు పద్దులుంగలవె ! యా ఫలసాయము మాకుఁ జాలదే
పెద్దలుఁ బిన్నలున్ మఱియుఁ బిన్నలుఁగూడ సుఖింప భూవరా ! 131

చ. వినుమొకమాట చెప్పెదము వీనుల కింపుగ, నెల్లవారలన్
గని వినుతింపఁ బోము, పది గంపలు కెంపు లొసంగుఁ గాక; లే
దని వినుతింప మానము రసాధికులన్; గవితామతల్లికిన్
ధనము ప్రధానమా, రసికతాధికతాసుఖతల్ ప్రధానమా ? 132

సీ. అల మురారి మురారి నధిక స్తవముజేసె
నతని కాతఁడు గంపెఁడంపినాఁడె ?
యల దండి దశకుమారుల చరిత్రి వచించె
నొకఁడైన నొకడబ్బునొసఁగినాఁడె ?
యల పురూరవు నబ్బనామాత్యుఁడు నుతించె
నతని కాతం డేమి యాచరించె ?
నల తమ్మన మనీషి యాళ్వారు నుతియించె
నిరువుర కేమైన నెఱుకగలదె ?

తే. గీ. సత్కులీనుల సరసుల సజ్జనులను
సన్నుతించుట కవులకు సహజగుణము
అప్రతిహత ప్రమోద ! దైవప్రసాద !
శ్రీకుమార ! లక్ష్మీనరసింహభూప ! 133

ఉ. క్షత్రియులందు భూభరణచాతురిదక్కఁ గవిత్వచాతురీ
వైత్తృత లేఁదు నేని గలవే? యను సంశయమున్ హరించె సా
విత్రిచరిత్ర చెప్పి సుకవిప్రతతిన్ గరఁగించు దివ్యచా
రిత్రుఁడు రామరాజు, బళిరే! భవదీయుఁడు గాఁడె! భూవరా! 134

మ. కవితాకన్యక లెంద ఱేనిఁ గల రీ కాలమ్మునం దల్లవా
రు విచారింపఁగ గ్రుడ్డికన్ను గలవారో కుంటివారో సుఖా
పవిహీనాత్మలొ కాఁగలారు వివరింపన్; 'సర్వసంపన్న మా
కవితాకన్య' యటంచు నొక్కి పలుకంగా నేల? మీదోఁట్లతోన్. 135

—• బహుమాన సమయమునఁ జెప్పినవి •—

ఉ. మానవదేహధారులు నమానుషచర్యులు మీ కులీను ల
న్యూనము గాఁగ నెవ్వనిమహోత్సవముల్ జరిపింతు రట్టి ల
క్ష్మీనరసింహమూర్తి కలిమిన్ బలిమిన్ జెలిమిన్ గుమారల
క్ష్మీనరసింహభూప! కలిగించుత మీకు వరప్రదాతయై. 136

చ. తిరుపతివేంకటేశ్వరు లతి ప్రతిభాపటిమమ్ము మీఱ స
త్వరగతిఁ జేసినట్టి యవధానముఁ జూచి నృసింహరాజు సా
దరహృదయాంబుజాతుఁడయి తద్జ్ఞులు మెచ్చ నొసంగె రంగు బం
గరు బిరుదమ్ములన్ స్థిరముగాఁ దనకీర్తి ప్రకాశమందఁగన్. 137

ఉ. హాటకభూషలన్ బిరుదు లాదర మొప్పఁగ నిప్పు, డిచ్చియు
న్నాటపదాఱు లిచ్చితివి మాతనకుభ్రియశోవిశాల! యు
త్పాటితశత్రుమండల! యపారమహావిభవానుభావ! నీ
లాటినృపోత్తముల్ గలరె లక్షలఁ గోట్ల! నృసింహభూవరా! 138

—• కొణితివాడ ప్రొప్రయిటరు రామచంద్రజగన్నాథరావు గారు •—

చ. పసిగొని వచ్చినారము భవన్నికటమ్మున కట్లు గాస మా
మనవిఁ జిత్తగించి తగుమన్నన మీఱఁగ మావధానశ
క్తిని గనుమా! యదేమన, నకించనతాఘనతా మరుద్ఘనా
ఘనత వహించుసంగతియ కా కిటువంటి శతావధాన ప్ర

జ్ఞను గనియుండియున్ గరము సాతురె పిల్వని పేరటమ్ముగాఁ?
గనుఁగొను మిట్టివారలప్రకార, మఖండధరాపురందర
ప్రణుతులు గొంచు వారల సభాస్థలులం దవతంసభావమున్
గొని నివసించుచున్ యశము గొంటయు వారలకున్ యశంబుఁదా

మనిశము నిచ్చుచుంటయుఁగదా! యటులాపఁగఁ గల్గురాజు లే
డను గనరామిఁగాదె! యకటా, కట! మా కవితాప్రవాహ మీ
సును గొని మిమ్ముబోఁటిసరసుల్ పరిపూర్ణతఁ గొందుఁగాక యం
చును జగతిన్ బడెన్, నిజమునమ్మది వారును వారు వారు దీ

నినిఁ బ్రకృతవ్యయమ్మును గణింపక శక్తికొలంది నాఁపుకొ
న్నను నిది వారివారికి ననంతముదం బొడఁగూర్చి సంపదృ
ద్ధినిఁ గనఁ జేయకుండునొకో! దీని నుపేక్ష యొనర్చినన్ బునః
పునరభిసారకాత్వమును బొందునె? దీని సమానమౌ నిద

ర్శన మొకఁ డుండె, దానినిఁ బరాకును బూనక చిత్తగింపుమా!
ఘనఘనసారపూరము లఖండముగాఁ దనుఁ జుట్టుముట్ట నే
పునఁ గొని వాయుసంచలితపూర్ణతర ప్రతిమానశూన్యవే
గనియతరంగదుజ్జ్వలితగాఢతరంగకమై తనర్చు నీ

ఘనతరగౌతమీనదినిఁ గట్టియుఁ గట్టక లేక యున్న గం
డినిఁ బడఁజేసి యెంతయుఁ గడింది రయమ్మున నూరు నూరు జే
రినఁ గని ప్రస్తుతవ్యయమురీతి గణింపక కొద్దికొద్దిగా
మునుకొని యాఁపుకొన్న నది ముందటిసాలున కెంతపంట పం

డునటులఁ జేయు నెంతటిపటుత్వము భూమి కొసంగు లాభమెం
త నయమదెంత యింత యని తప్పక చెప్పఁగ నెవ్వఁడోపు? మీ
రన సరసాగ్రిగణ్యు లిదియంతయు మీర లెఱుంగరే? ప్రసం
గనియతిఁ జెప్పఁగావలసి కాదె, పనింగొని చెప్పినార; మిం

కను భవదీప్సితం బెటులు గల్గునొ యట్లు లొనర్పుమీ! యశో
ధన! ఘనకాఁకివాడపురధామ! బుధాశ్రయ! రామచంద్ర నా

మ: నిరుపమావధానకవిమాన్యులఁ దిర్పతివేంకటేశులన్
ఘనముగఁ జూచి వారిసభఁ గన్గొన నిచ్చయొనర్చు టొప్పదే? 139

—• పిఠాపురం—వాడ్రేవు వెంకటరత్నంగారు •—

చ. పనిగొని వాడరేవుకులపావన! వేంకటరత్నమంత్రి! మా
వినుచు విశేషమున్ విను వివేకమెలర్ప, శతావధానముం
బొనరుచుటన్నఁ గష్టతరమో సుఖమో విబుధైకవేద్యమౌ
టను వివరింపఁబూను టిచటన్ బునరుక్తము గాదె! తత్ప్రసం
స నటు ముగించి యిప్పుడు ప్రసంగవశమ్మునఁ జేయు మా ప్రతి
జ్ఞను సభవార లందఱు నకారణకారుణికత్వ మేర్పడం
గ నవధరింతురిగాక! తగుకల్పన లాశుకవిత్వమందుఁ జె
ప్ప నిపుణుఁడైనయట్టి మగవాఁడయినన్ సభ కేగుదెంచి శ
క్తిని బ్రకటింపరాదె? తన ధీబల మన్యుల ధీబలమ్ము! గూ
డను బయటంబడున్, మఱియుఁ డక్కరివేషము లెన్నియేని యూ
ల నిఱికి వేయలేరె, సభలన్ బ్రకటింపఁగలేరు గాని, నా
మున కొకపద్యము న్నొడువుపూనికయుం గఠినంబె! తా మొనం
గినయది తప్పొ యొప్పొ తమకే వివరింపఁగరానివారలం
బనిచిన దాన నేమగు? నెటా సనఁగా సభ కేగుదెంచి చె
ప్పినయది యాలకించి తమ పెద్దఱికమ్మును దాఁచుకొంట నే
ర్పునకగు లక్షణంబు; పనిఁబూని వివాద యొనర్ప నిచ్చఁగ
ల్గిన "నిది నీవు చెప్పు, మది లేనియెడ న్ననుఁ జెప్పుమంచుఁ బ
ల్కిన రచియింతు నే" నన "బళీ" యని మెచ్చెద రెల్లవారు, మూ
ల నిఱుకునట్టివారికిఁ దలంకుదుమే? యదిగాక తాము యో
జనఁ గొని చెప్పి పంపిన యసాధ్యపు శ్లోకమునందుఁ దప్పుదే
దని యనిపించుకోఁ దగినయంత సమర్థతగల్గి యట్లొన
ర్చినఁడమ కేమి భక్తిమెయిఁ జేసెద మీసభలోన నిల్చి వే
యి నతులు; వంధ్య పుత్రిపతి హేళనచేసినఁ జెల్లుఁగాక! తా
ము నగి పెంచి కష్టసుఖముల్ తుదముట్ట నెఱింగినట్టి మా

నిను లొనరింపఁ బూనఁదగునే? యటుచేసిన వేతొకప్డు త
మ్మనుగని నవ్వకుందురె కనుంగొనుఁడీ, యెవరేనిఁగాని "యి
ప్పని నిటు మే మొనర్తు" మని పల్కిన "వారలకన్న మించి యే
మొనరుపఁ జాలువార" మని యోటమిలేక వచించుచుంటి; మా
ధునికులు దీని కొప్పినను దుష్టియె మా, కటు లొప్పరేని "వే
డ్కనుగొని రండు వేగమె ముఖాముఖ వాద మొనర్ప" నంచుఁ జె
ప్పిన తిరుపత్యభిఖ్యకవి వేంకటసత్కవివాక్యముల్ వృథా
యనఁదగు శక్తి గల్గిన రయమ్మున డీకొని నిల్వరాదొకో? 140

మూడవ సంవత్సరం గద్వాల

—• తాతాచార్యులుగారి యవధానవిషయమునఁ జెప్పిన పద్యములు •—

శా. ఆర్యుల్ మెచ్చి బహూకరింపఁగను దాతాచార్యవర్యుండు ధీ
ధైర్యం బేర్పడఁగా వధానకృతి నాస్థానమ్మునన్ జేసె నీ
చర్యల్ చూచిన మాకు నెంతయును నాశ్చర్యంబు ప్రాపించె స
త్కార్యాలోచనతత్పరా! గురుయశస్కా! రామభూపాలకా! 141

ఉ. ఈపనినే వచింతురు కవీశ్వరు 'లష్టవధాన' మంచు మా
పై పున, దాక్షిణాత్యు లిది వాకొనుచుంద్రు 'శతావధాన' మం;
చేపు దలిర్ప నూర్వురకు నెంతయు ధాటి చెలంగఁ జెప్పఁగా
దా! పలుకన్వలెన్ "శతవధాన" మటంచును, రామభూవరా! 142

(మ.) గముతై పండితులెల్ల 'వహ్వారె' యనంగా సత్కవుల్ మెచ్చ దు
ర్గమదుర్గాకరుణాకటాక్ష విసరప్రాప్తాశుధాటీవిశే
ష మెలర్పంగ శతావధాన కవితాసామ్రాజ్య పట్టాభిషే
కము పొందంగను మాకుఁదక్కఁగలఁడే! గద్వాల భూపాలకా!

—• అష్టావధాన విషయము •—

చ. నిరుడు శతావధానమును నేర్పు మెయిన్ బచరించియుంటి మా
దరమునఁ గాంచి మాకు బిరుదమ్ముల నిచ్చితిగాదె, రామభూ
వర! యిఁక నొక్కమాటను సభాజనభాజనమై చెలంగు ని
ప్పరుసునఁ జెప్పఁబూనితిమి పండితులెల్లరు నక్కజమ్ముగా

నరయఁగ మే మొనర్పగల మష్టవధానము, దానిరీతి నే
ర్పఱచి వచింతు; మెట్లనినఁ, బండిత సమ్మతిగాఁ గవిత్వ మెం
ద ఱడిగిరేని యందఱకుఁ దప్పులు చొప్పడకుండ నాంధ్రముం
దు రహిని దేవభాషను సుదుష్కర కల్పన లొప్పఁజెప్పి, యెం
దఱయినఁగాని కష్టపు విధమ్మున నెన్నిఁటినైనఁగానియ
క్కరము లొసంగిరేని యవిగైకొని తప్పక చెప్పి, యంతఁటో
కరయము మీఱ లౌకిక ప్రకారముగా వచియించువారి కు
త్తరము లొసంగి, మీఁదను ముదంబలరన్ జదరంగ మాడి, యొం
దఱకు గురుత్వమూని పఠనమ్ములఁ జెప్పి పురాణగాథలన్
దుర మొనరన్ బఠింపఁగ నెదుర్కొని యర్థముచెప్పి, పుష్పముల్
గరమును వీపుఁపై విడువఁగా సరిగా గణియించి. ఘంటికల్
నెఱయఁగఁగొట్ట వానిని గణించి, నిషేధ మొనర్చునట్టియ
క్కరములు మాని పద్యములు గల్పనచేసి, మనోహరమ్ముగా
విరచనసేయ నేర్తు; మిది వేఁడుకఁమీఱఁగఁ జిత్తగించి మా
కరుదగునట్టి సద్యశము నర్పణచేయఁగ నీకుఁదక్క నొం
డొరులు సమర్థులౌదురె? మహోజ్జ్వల రాజ్యరమాధురంధరా! 114

సీ. కవనమ్ము చెప్ప సత్కవులందఱును మెచ్చి
యద్భుతానందమ్ము నందవలయు
వ్యస్తాక్షరినిఁ జెప్పునడువున "నిది యేమి
యక్కజం" బని శంకనందవలయు
లౌకికాలాపమ్ము లూఁకొనివచియింప
'నద్దిరే' యని మోద మందవలయు
నాకాశపుఁబురాణ మల్లిన "నిదియేమి
వైచిత్ర్య" మని తల లూఁచవలయుఁ

తే గీ. దక్షిణ పరీశంసలకును మోహంబు విస్త
రింపఁగావలె నట్లొనరించి సభ ము

దంబు గనఁజేతు మష్టావధాన కృతులఁ
గ్రియయె కేవలముత్తరంబయి యెసంగు. 145

—• మఱియొకప్పుడు చెప్పినవి •—

మ. సుకవిశ్రేష్ఠుల నొక్కనాఁడు తగు నౌత్సుక్యమ్ము పెంపార గా
యకగానం బొకనాఁడు వైదికుల గేయం బొక్కనాఁడిట్లు స
ర్వకలల్ చూచుచు వారికిం దగిన మర్యాదాకృతుల్ సేయు నా
యకుఁ డింకొక్కఁడు భూమిపైఁగలఁడె? రాజా, రామభూపాలకా!

శా. ఏవంశమ్మునఁ బుట్టుఁగాక మఱి వాఁడేవాఁడెయౌఁ గాక యా
యా విద్యల్ పఠియించి మించి తను డాయన్ వచ్చినం జూచుచున్
దైవాజ్ఞప్తము నిచ్చి పుచ్చు వసుధానాధుండు నీకన్నఁబా
రావారావృత మేదినిన్ గలఁడె? రాజా, రామభూపాలకా! 147

శా దేవీ భాగవతంబు తెల్గొనరుపన్ దీక్షాపరత్వమ్ము మా
కావిర్భావము చెందె నియ్యది మహాయాసమ్మునన్ గాని సం
భావింపన్ దుదముట్ట దిట్టికృతి చెప్పంబూని యున్నట్టి మా
కీ వావత్సరభుక్తికిం దగిన దీవే, రామభూపాలకా! 148

సీ. బ్రహ్మదేవుఁడు వ్రాయు వ్రాతలైననుగాని
తలచుగా నష్టపు తిరిగిపోవు
హరుఁడొసంగినయట్టి వరములైననుగాని
తలచుగా నష్టపు తిరిగిపోవు
ఫల్గునుండొనరించు ప్రతినలైననుగాని
తలచుగా నష్టపు తిరిగిపోవు
సత్కవీశ్వరుల వాక్సరణులైననుగాని
తలచుగా నష్టపు తిరిగిపోవు

తే. గీ. రామభూపాలరాయ భూస్వామి కవుల
కెలమి నొనరించు వార్షికములకుఁ దిరుగు
లే దనుచుఁ జెప్పఁగావచ్చుఁ లేచి యెంత
మందిగల సభనైన నిష్పందరీతి. 149

—• మైసూరు రాజుగారు "నీకెన్నికోట్లు" వచ్చునని ప్రకృతపరిషత్తు
నడిగిన దాని బట్టి చెప్పినది •—

సీ. కోటివచ్చెడి రాజకోటీరమణియైన
నిటువంటి సత్కీర్తి నెనయఁగలఁడె
పదికోట్లువచ్చెడి పార్థివోత్తముఁడైన
నిటువంటి ప్రఖ్యాతి నెనయఁగలఁడె
నూఱుకోటులువచ్చు భూరమణుండైన
నిటువంటి విఖ్యాతి నెనయఁగలఁడె
వేయికోటులువచ్చు పృథివీశ్వరుండైన
నిటువంటి సద్యశం బెనయఁగలఁడె
తే. గీ. బళిబళీ ! యంచు నుతిసేయు పండితపరి
కాండవచనంబులెల్లఁ దార్కాణ మయ్యె
భావుకంబైన నీదాన పటిమచూడఁ
బండితవిధేయ ! రామభూపాలరాయ ! 150

—• ఆసంవత్సరమే చేయించిన వెండిద్వారము •—

సీ. తనకీర్తి కెనగాక మొనసివచ్చినయట్టి
రజతపర్వతకాంతిరాశియొక్కొ
తనపవిత్రత కోడి మొనసి సేవయొనర్చు
గంగామహాదేవి కాంతియొక్కొ
తనదు శీతలభావమున కోడి పడియున్న
చందిరికాకాంతి ప్రసారమొక్కొ
తనదానపటిమ కెంతయు నోడి వెలవెలఁ
బాఱి తీండ్రించు నభ్రరుచియొక్కొ
తే. గీ. యనఁగ గద్వాల కేశవద్వారసీమ
రామభూపాలరాయండు రజతమయము
గా నొనర్పంగఁజేసి కైంకర్యవిధిని
దాపడముచేయఁజేసిన ద్వారమొప్పు. 151

—• శ్రీ చిన్నదొరవారిమీఁది పద్యములు •—

మ. ప్రతిసంవత్సరమాఖమాసమున శుంభద్డంబరారంభసం
భృత సంరంభభరంబు డంబలర నీవిట్టన్ భవద్వంశ్యు లు
ద్ధతిఁ గళ్యాణమొనర్తు రెవ్వనికి నాతం డుత్సహింపంగ సం
తతమున్ రాజ్యము సేయుమయ్య ! యిఁక సీతారామభూపాలకా! 152

శా. కారుణ్యమ్ము మనమ్మునం బెరుఁగ, నాకారమ్ము మారుం దిర
స్కారమ్ముం బొనరింపఁ, బండితకవిశ్లాఘ్య ప్రతిష్ఠాకరా
గారానూనయశోవిభూతులు సెలంగన్, శుక్లపక్షస్ఫుర
త్తారానాథునిఁ బోలి యేలు మిఁక సీతారామభూపాలకా ! 153

శా. ఆరామమ్ములపెంపు సౌధముల సొం పశ్వాదిసంపత్తియున్
నీరేజాక్షుల డంబు సర్వకవిరాణ్నిత్యానురాగంబు సు
శ్రీరూపమ్ములతీరు నిస్తులయశశ్శ్రీసొంపు నిండార సీ
తారామప్రభుఁబోలి యేలు మిఁక సీతారామభూపాలకా ! 154

శా. వక్షోవాసితనీరజాలయుఁ డదభ్రస్వచ్ఛకీర్తిప్రభుం
దక్షీణక్షణదాయి భక్తజనపాపారణ్యదావానలుం
డుక్షారూఢసుహృత్తముండు సముపిధ్యుక్తుండు యావజ్జగ
ద్రక్షాదక్షుఁడు బ్రోచు ని న్నెపుడు సీతారామభూపాలకా ! 155

మ. కడునింపారెడి పద్యముల్ మదికి వేడ్కల్ నింప విద్వాంసు లె
క్కుడు మోదమ్మున సన్నుతింపఁగను నీకుం గావ్య మర్పింప నీ
యెడ మా మానసమందుఁ దోఁచెఁ; నిఁక నీ వెంతే మదిన్ గోర్కె సం
దడిచేయం దగ నాజ్ఞ మా కిడుము సీతారామభూపాలకా ! 156

—• ఎల్లప్పుడును మాటపసియాఱులే యిమ్మనుట •—

శా. రానుం బోను రమారమీ మునురకున్ రైల్ఖర్చు లాసీఁదటన్
నానాఖర్చులు గూడి యైదుపదు లుండంగావలెన్ మీఁద మా
స్థానమ్మున్ దగఁ జేరి "చూపుఁ దల గద్వాలప్రభుం డిచ్చు స
న్మానం" బన్న, మఱేమి చూపవలె ? రామారాయభూపాలకా ! 157

గోపాలరాయభూమీపాలుసభలోన
నిరుపమాను లటంచు నెగడినాము
రావుజగ్గారాయరాజన్యుసభలోన
శతఘంటకవనమ్ము సల్పినాము
కాకినాఁడాదిసద్గ్రామమ్ముల శతావ
ధానమ్ముచేఁ గీర్తిఁ బూనినాము
కాశీసహస్రాదికావ్యమ్ములు రచించి
కాశీకృపం జెందఁజాలినాము
ధాతురత్నాకరోద్దామచఁపు రచించి
పాణినీయస్తుతుల్ వడసినాము

తే. గీ. నిరుడు గద్వాలరాజసన్నిధిని శత్రు
మధ్యమందు జయంబంది మహీపువలన
బంగరుబిరుదులును జయపత్రికయును
బడసి యీయేఁడు నినుఁ జూడవచ్చినార
మాత్మకూరుపురీరాజ ! యతులతేజ !

తే. గీ. గళము నమలాపురమ్మును గద్దవాల
పురము విజయపురమ్మును బుచ్చుకొనియెఁ
జేయి కేతకీపురము కైసేసె, నొక్క-
చేయి నీకయి మిగిలెఁ గైసేయు మధిప ! 169

— మఱియొకనాఁడు చెప్పినవి —

శా. దేవీభాగవతాది గ్రంథముల నెంతే యుక్తినైపుణ్యలీ
లావైచిత్ర్యము లొప్పఁ గూర్చితిమి పోలం జూడ మీటోంట్లుగా
కేవా రింకఁగలారు యోగ్యు ? లెపుడో యేవేళనో మీరు శ్ర
ద్ధావిస్ఫూర్తి వినంగ మామనవి సీతారామ భూపాలకా ! 170

శా. పాండిత్యమ్మున మించి యింపగు కవిత్వం బొప్పువాఁ డెల్లభూ
ఖండమ్మందున మృగ్యుఁడో విభవసాకల్యమ్మునం బొల్చుఁ బ్రి

హామ్మంశమ్మై తగు విద్యచే నెగడి దానాఢీనుఁడౌ రాజమా
ర్తాండుం డట్టులె, నీకుఁబట్టె నిది సీతారామభూపాలకా! 171

—• రాఘవాచార్యులు వారి గానమునుగూర్చి •—

శా. ఆర్యుల్ మెచ్చఁగఁ దక్కు గాయకులు వహ్వా! యంచు నీ గాన సౌ
కర్యమ్ముం గొనియాడ మూర్ఖులును వేడ్కం జెందఁగా రాఘవా
చార్యా! భైరవి నాలపించితివి నీచాతుర్య సంపత్తియున్
ధైర్యస్థైర్యములున్ ముదం బొసఁగె సీతారామభూనేతకున్! 172

క. "గరిసరిసమ" యని కీర్తిన్
"గరిసమగరిమ" యని యొఱపుగల విక్రమతన్
సిరిని "ధనిసమ" యనియె ము
క్కర సీతారామభూప! కనుమీ! వీణన్. 173

—• ఆ ల స్య మై న ం దు ల కు •—

శా. శ్రీరంజిల్ల శతావధానమును మాచేఁ జేయఁగాఁ జేసి మ
మ్మారాధించుట సర్వసమ్మతము; లేదా, వేగ మా దేశమున్
జేరంబోయెద; మన్య మొల్ల మిట గాసింజెంద మాకేల? సీ
తారామావనిపాల! మాకు జయపత్రిం బిచ్చి బంపించుమా! 174

—• (సమస్య) అఱవిరిపాన్పు చేరఁ జనరా, విటరాయఁడ! నేనువచ్చెదన్ •—

చ. పుఱఁదియు బావయున్ మగఁడు మామయు నత్తయు నింటిలోనఁ జి
చ్చఱ పిడుగుల్, సుఖమ్ము గొనసాఁగ దటంచుఁ దలంచి, పాను పే
ర్పఱచితిఁ దోఁటలో; సగమురాతిరి పోయినమీఁదనీవు గ్రి
చ్చఱ విరిపాన్పు చేరఁజనరా, విటరాయఁడ! నేనువచ్చెదన్. 175

—• (సమస్య) రంధ్రిమ్మయ్యె శిలీంధ్రి మాంధ్రిమున సైరంధ్రీపురంధ్రీమణీ •—

(శా.) ఆంధ్రింబందు శిలీంధ్రిశబ్ద మది తా నౌనేమొ రంధ్రంబు, కా
దాంధ్రాభిఖ్య నెసంగు దేశమున వర్షాధిక్యమున్ జేసె నీ
రంధ్రి ప్రక్రియగా శిలీంధ్రిము లెలర్పన్ మీఁద సద్దాన నీ
రంధ్రమ్మయ్యె శిలీంధ్రి మాంధ్రిమున సైరంధ్రీపురంధ్రీమణీ!

— రాజుగారికిఁ బుత్రికాజననము —

మ. "వనరాశిన్ జనియించి యాత్మధవు సద్వక్షం బధిష్ఠించి నిం
దను గైకొంటినిఁ జంచలాత్మయని, యాతప్పం బెడంబాయ నే
రనె" యంచున్ దలపోసి భూమిపతివై రాణించు నీకడ్డునన్
దనయా రూపముచే జనించె సిరి, సీతారామభూపాలకా !

— శ్రీనివాస విలాసమును గూర్చిన మాలిక —

చ. పరిలస దాత్మకూరు నరపాలక ! శీలకళాభిరామ ! ము
క్కరకులరత్న దీపకలికాయిత ! సోమనరేంద్రచంద్రపూ
ర్వరచితభాగధేయ ! పరిపాలిత సత్కవి సార్వభౌమ ! మ
'మ్మరయుఁ' డటంచు మీ రొసఁగినట్టి మహాపరకాలనామ భా
స్వరకవిసార్వభౌమకృత చంపువు నింపుదలిర్ప నిన్న రా
తిరి పఠియించినార మది తియ్యని పల్కులకెల్ల నెల్ల, వ
హ్వారె ! నుతియింపఁగాఁదరమె? యా రస మా సొగసా చమత్కృతి
స్ఫురదురభావ మా గుణవిభూతి నవోదయ మా పదాదిసం
స్కరణ విశేష మా దురవగాహసుకల్పన లా విశేష చి
త్రరచన లా విలోమకవితా నిపుణత్వము లెట్టి సత్కవీ
శ్వరులయినన్ రచించిన ప్రబంధములందుఁ బొసంగునే ? యొకొ
క్కరస విశేష మొక్కొక ప్రకారమునన్ వివరించుచుంటి, మా
దరమునఁ జిత్తగింపుము; పదంబుల డంబల యాణిముత్తెపుం
సరములతోడఁ బోరి జయసంపదలం బొదలంగఁ జాలు; వా
క్యరచన లా మృణాళలతికాకృతికాగతి కానవెట్టు, న
బ్బురపు సమాసమన్నఁబువుఁబోణి మెఱుంగు హొరంగు రంగు ని
బ్బరపు నునుంగనుంగొనలఁ బాఱు నొ యాఱపుఁ జూపుకోపు లం
దరుమఁగ నోపు, శయ్యమదన ప్రమదాసుమశయ్య, తద్రసం
బరసి నుతింప మాకుఁ దరమా ? పరమాదర మాని మానసాం
బురుహము దాన నోలకయి పోయి పదంపడి రాసమర్థతన్
బొరయక లోన నాటికొనిపో నటఁ గుత్తుకబంటియయ్యె; నా

దర మెసకంగ "దీనిని బుధప్రకరంబు కరంబు మెచ్చఁగా
సరసముగాఁ దెలుంగునఁ బొసంగఁగఁజేయుఁ" డటంచు మాకు దే
వర తగ నానతిచ్చుటది భాగ్యముగాదె, నృపేంద్ర ! యెంతయున్
బరుసదనమ్ముచే నెగడి భావము శక్యముగాక యొప్పు నీ
ప్పరమకృతిన్ దెలుంగొనరుపం దగు దార్ఢ్యము మాకు లేదు గా
ని రసికులైన మీరలు పనింగొని దీని రచింపఁజేయ సు
స్థిరముగఁ బూనినప్డు ప్రతి చెప్పఁగనోపక యొప్పికొంటి; మ
క్కఱగొని యిట్టిదాని నెసకమ్మునఁ బై నిడుకొన్న మాపయిన్
గురుమతి వేంకటేశ్వరునకున్ దయలేకయెపోవునే ? జగ
ద్గురువయి యిప్పు డొప్పు వసుదుర్గమువంశ్యుఁడు కృష్ణసూర్యదు
స్తరకవిసార్వభౌముఁడు ముదంబెదనొంది సహాయభూతుఁడై
కరుణయొకింతయైనఁ జిలుకం గల భారము పూనకున్నె ? మా
గురువగు బ్రహ్మపండితునకున్ దయదప్పునె ? మాకు నెట్టి దు
ష్కరమగుకార్యమైనఁ గొనసాగఁగఁ జేసెడి తల్లి కాశియున్
బరమకృపారసమ్ము పయిపై వెదఁజల్లి యనుగ్రహింపదే ?
విరచనజేసి తెత్తు మిది వేగ మెలర్పఁగ వచ్చునట్టి వ
త్సరమునకున్ రసారసవిచారము మాయదికాదు మిక్కుటం
పు రసికులైన మీ కెఱుఁగఁబోలని దొక్కరసమ్ము గల్గునే ౹
తిరుపతి వేంకటేశ్వరుల ధీబలబాకదకిఞా గ్రహింపుమా ! 178

—• మీసములఁబట్టి చూడ వీరు పండితులు గారన్నందుకు •—

ఉ. దోసమటంచెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము "రెండుభాషలకు మేమె కవీంద్రుల" టంచుఁ దెల్పఁగా,
రోసము గల్గినన్ గవివరుల్ మము గెల్వుఁడు గెల్తురేని యీ
మీసముదీసి మీ పదసమీపములన్ దలలుంచి మ్రొక్కమే. 179

—• దేవీభాగవతములో "నాపలు కాలకింపుము" యను పద్యములో "గుణాలయ"
అను పదమును గూర్చిన చర్చ •—

సీ. ఆంధ్రభాషకు నన్నయ రచించినట్టి భా
రతము కవీంద్రసమ్మతమయేని
అస్మత్ప్రయుక్త "గుణాలయ" పదము భా
రతసుప్రయోగానుగతమయేని
"అప్పులోపం" బన్నయట్టి మీ ధర్మాధి
కారి వాదము పట్టి కల్లయేని
"మన పండితున కద్దుమాటాడి" రని పట్టు
దల నీ మనమ్మునఁ దగిలెనేని
తే. గీ. కుర్మతిక్ష్మాధరస్వామి దుర్మతులకు
శిక్షకుం డయ్యెనేని మా చేయు ప్రతిన
త్రిప్పివేయంగ నల బ్రహ్మదేవు తరమె ?
యాత్మకూరుపురీరాజ ! యతులతేజ ! 180

—• రాజాగారు న్యాయము చెప్పక సభనుండి యరిగినందులకు •—

సీ. మదనాభిరామరాణ్మణి బిల్హణకవీంద్రు
తో విరోధించి తాఁజేవచెడఁడె
రాజకళింగగంగాధిరాజు భీమకవీంద్రు
తో విరోధించి తాఁ జేవచెడఁడె
అల్లసీలాద్రిరా జల జగ్గసుకవీంద్రు
తో విరోధించి తాఁ జేవచెడఁడె
మున్ను డమ్మన పిండిప్రోలి లక్ష్మణకవి
తో విరోధించి తాఁ జేవచెడఁడె
తే. గీ. యేము గెల్చితి మను మాట కీవె సాక్షి
తగ వెఱింగియుఁ బక్షపాతమ్ము పూని
మమ్ము నిరసించు టంత క్షేమమ్ముగాదు
ఆత్మకూరుపురీరాజ ! యతులతేజ ! 181

—• "50 రూపికలను పేజ్జోడును మాత్ర మిచ్చెదము సభ చేసెదరా" అని కబురంపినందుకు •—

క. తక్కినబహుమానము మా
కక్కఱయే లేదు బత్తె మది చాలు నయో!
నిక్కమిది "దంపినమ్మకు
బొక్కినదే కూలిగాదె?" భూపలలామా! 182

సీ. శివుఁ డెవ్వరికినైన సేవనీయుఁడుగాఁడె?
వైష్ణవోత్తముల పాపమ్ముగాక
యబ్జుఁ డెవ్వరికైన నానంద మీయఁడే?
సరసీరుహముల దోషమ్ముగాక
మధు వెవ్వరికినైన మాననీయుఁడు గాఁడె?
జాతిదౌర్భాగ్య లేశమ్ము గాక
విష్ణు వెవ్వరికైన వినతిపాత్రుఁడు గాఁడె?
శైవుల దురదృష్ట సరణిగాక
తే. గీ. మాదు దురదృష్టమును బట్టి మమ్ము గార
వింపకున్నంతనే మీకు వెలితియగునె?
వితరణాపరభోజ! పృథ్వీబిడౌజ!
యాత్మకూరుపురీరాజ! యతులతేజ! 183

—• "మా పండితులకు మీకును గలహమేల?" అన్నందుకు •—

శా. ఎట్టో విద్యల నభ్యసించికొని యా యీ దూరదేశమ్ములం
బట్టంబంచును బల్లెయం చనక విద్వద్ద్వేషముం బూని బల్
తిట్టుల్ తిట్టుచుఁ దిట్టులం బడుచు నిన్ ద్రిప్పన్ ఫలంబేమి? యో
పొట్టా! నీ దురదృష్ట మిట్లయినచో భూపాలకు ల్నిందుృలే! 184

—• వివాదానంతరము చెప్పిన పద్యములు •—

సీ. భారతమ్ము తెలుంగుపఱప రాజనరేంద్రు
నృపతి నన్నయకవి కిచ్చినట్లు

రామాయణంబు నాంధ్రము సేయు మని మార
నృపతి భాస్కరకవి కిచ్చినట్లు
కాశిఖండము తెల్గు గావించు మని వేమ
నృపతి శ్రీనాథుని కిచ్చినట్లు
మాఘమ్ము తెల్గుగా మార్చ వేంకటగిరి
నృపతి వేంకటకవి కిచ్చినట్లు

తే. గీ. శ్రీనివాసవిలాస మాంధ్రీకరింప
సరస తిరుపతి వేంకటేశ్వరుల కిప్పు
డానతిచ్చుట మిగుల భాగ్యమ్ముగాదె?
యాత్మకూరుపురీరాజ! యతులతేజ! 185

మ. భవదీయమ్ముగు నానతిన్ శుభగభంభద్దంబరారంభసం
భవగంభీరవచోనిగుంభము లెలర్పన్ గాళికాసత్కటా
క్షవిశేషమ్మునఁ దెల్గొనర్చికొని వేడ్కన్ గుర్కత్ప్రశీశు సు
త్సవకాలమ్మున కేగుదెంచెదము సీతారామభూపాలకా! 186

ఉ. వేసవి దగ్గరాయె మిము వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బరవాసమొనర్చుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు "లిదిగో నదిగో" నని చూచుటాయె వి
శ్వాసమెలర్ప వే సెలవొసంగినఁ బోయెదమయ్య, భూవరా! 187

సీ. అల్లరాజనరేంద్రుఁ డలనన్నయకవీంద్రు
సిరుల నొసంగి పోషించినట్లు
అలమనుమాధిపుఁ డలతిక్కనకవీంద్రుఁ
బ్రాణమెత్తుగను గాపాడినట్లు
అలవేమభూపాలుఁ డల్ల శ్రీనాథుని
మించుసత్కృపను రక్షించినట్లు
అల కృష్ణదేవరాయలు పెద్దనకవీంద్రు
నంచితాదృతి నాదరించినట్లు

తే. గీ. సరస తిరుపతి వేంకటేశ్వర సుకవుల
నెల్లకాలమ్ము నాదరం బెసక మెసఁగఁ
బోషణ మొనర్పఁ గోరిక; పోయివత్తు
మాజ్ఞ యీవయ్య ! యోనృపాలాగ్రగణ్య ! 188

—• మొదటి సంవత్సరము కిర్లంపూడి సంస్థానము •—

ఉ. చూచితి మెల్లరాజులను జూచుచునుంటిమి చూడనుంటి మీ
నీ చతురబ్ధివేష్టితమహీవలయమ్మున నూత్న మన్మధుం
డై చెలువారు నిన్ విడిచి యన్యుల కర్థ్మముగాదు రాజరా
డ్వాచక ! చిన్న రాయనరపాలక ! శీలకళాసమంచితా ! 189

మ. నృపతిత్వమ్మున మించరో ; కవుల నెంతేఁబేర్మి మన్నించరో !
కృపణత్వమ్మును ద్రుంచరో ! రుచిరమౌ నీవిట్టి బ్రకాశించరో !
యుపకారమ్ము లొనర్పరో ! ప్రకృతరాజోత్తంసులం దెందు నం
దపుఁ జందమ్మున నెవ్వరేని మనచిన్నా రాయభూపాలురే ! 190

మ. ప్రకటంబౌ నగుమోము గాంచిన మహారాజత్వసంపత్తి బో
ధకమౌ నేత్రియుగమ్ము శ్రుత్యసుగతత్వప్రాప్తికిన్ మేను వ్యం
జకమౌఁ "బట్టిన దెల్ల బంగ రగు నీసన్మాన్యుఁ" డన్నందు కెం
త కలాదాగ్రణియో కదా సలువ ! చిన్నా రాయభూపాలకా ! 191

శా. "రూపమ్మిచ్చిన విద్యనీయఁ డది యారోపించినన్ సంపదల్
ప్రాపింపం డవి గల్గినన్ దగినయోగ్యత్వమ్ము చేకూర్పఁ డీ
పాపాత్ముం" డని తన్ను నెల్లజనులున్ బల్మాఱు నిందింప ని
న్నాపైఁజేసె విధాత చిన్ననృపతీ ! యాలంబితాలంకృతీ ! 192

సీ. "చందురు సృజియించి కందందుఁగల్పించె
విద్వాంసులకులేమి వెన్కఁబెట్టె
రాజుల సృష్టించి రాజ్యమత్తులఁజేసె
సంపదల్ చేసి చంచలతఁగలిపె

నతివలఁ జేసి నీచానురక్తతఁ జొన్పె
సౌఖ్యమ్మునకు దుఃఖసంగ మునిచెఁ
బాగ్రియమ్మునకు జరాఘోరమ్ము జోడించెఁ
గుసుమమ్ములకు వాడుగుణము వెట్టె
గీ. నెన్నియో మంచివస్తువు లెన్ని చేసి
యన్నిటికి నన్నియును గూర్చె నవగుణములు''
అనెడి నింద్రను బాసె బద్మాసనుండు
నిన్నుఁ జేసినకతన నో చిన్నరాయ ! 193

శా. ధీరత్వమ్మున దాతృతామహిమ పర్థిష్ణుత్వసంపత్తి గం
భీరత్వమ్మున సత్కళాకలనఁ బేర్మిన్ గూర్మి నోర్మిన్ గృపా
పారత్వమ్మునఁ జాతురీగరిమ దివ్యద్భవ్యరూపమ్మునం
దేరాజన్యులు నిన్నుఁ బోలఁ గలరోయీ ! చిన్నరాయాధిపా ! 194

శా. క్షీరాబ్ధిన్ బురుడించి చందురునిసుశ్రీమించి నీహారమున్
జేరందీసి విభూతిరాజుమెఱు వాసిన్ గ్రిందుగాఁజేసి ము
క్తారోచుల్ గడకొత్తి వజ్రములపైఁ గాల్ ద్రవ్వు నీకీర్తు, లో
నారీమన్మథ ! సత్కవిప్రవణ ! చిన్నారాయభూపాలకా ! 195

శా. నీవిద్వాంసులు వర్ణనీయులు కడు న్నీమంత్రు లత్యుత్తముల్
నీవంకందగు చుట్ట లెల్లరును వర్ణింపదగున్ వారు పా
రావారావృతమేదినీవలయమం దౌరౌర ! నిన్ బోలి సు
శ్రీవర్ధిల్లెడి రాజులున్ గలిగిరే ? శ్రీచిన్నరాయాధిపా. 196

శా. రాజు ల్లేరొకొ ! వారికిన్ దగిన రాష్ట్రమ్ముల్ దగన్ లేవొ ! స
త్తేజంబొప్ప ధరిత్రి నేలరొ ! ధనాధిక్యమ్మునన్ మించరో !
భోజుం డొక్కఁడు డక్క విద్యలకు నామోదించెనే యిట్లు సు
శ్రీఁజెన్నారెద వింతకన్నను గడున్ శ్రీచిన్నరాయాధిపా ! 197

క. కనుగొంటిమి కనుంటిమి
కనుఁగొనుచున్నాము కాని కలరాజుల మా

కనుగొన్న దేశములలో
మన చిన్నారాయనృపతి మణిపూస సుఁడీ! 198

శా. శ్రీయింపారెడి భక్తి చెన్నలరు నీచే నిప్పు డత్యంతవి
ద్యాయుక్తిం బొగడొందు నా త్రిపురసుందర్యంబ మేలెంచి దీ
ర్ఘాయుర్దాయమహాసుభావఘనరాజ్యప్రాజ్యపూజ్యాత్మజ
శ్రీయోగంబు లొసంగి నిన్ను మనుచున్ శ్రీచిన్న రాయాధిపా! 199

శా. శ్రీరంజిల్లుచు కాక పూర్వకవులౌ శ్రీనాథముఖ్యుల్ సుక
స్తూరీముఖ్య పరీమళంపు సొబగుల్ తోరంపు బంగారపుం
గారామొప్పెడి చేలముల్ గలిగి వేడ్కన్ మించుటల్ నాఁడు ను
న్నారంచున్ దెలుపున్ భవాదృశులు చిన్నారాయభూపాలకా! 200

క. ఈవా, విద్యల, భోజుఁడ
వౌ వారాంగనయు గానమందున నేర్పున్
జేవయుఁ గలయది, సభ్యులు
కోవిదు లో చిన్నరాయ! కొదవయుఁ గలదే! 201

చ. పురుషులు గానశాస్త్రపరిపూర్ణత గాంచియునైనఁ బాడిరే
ని రసము గల్గు టబ్బురము, నీ రజనేత్రలు శాస్త్రహీనల
య్యు రసము నొల్కఁజేయుదు రహో! యిపు డీ సరసీరుహాక్షి శా
స్త్రరుచిరరీతిఁ బాడె నిది సజ్జనసమ్మతిగాదె! భూవరా! 202

క. ఈ టెక్కులాఁడి యెంతయు
నీటగుగతిఁ బాడె నితని నేరుపు చెప్పఁగ
మేటియె యీ మార్దంగికు
పాటవ మొకకోటి సేయుఁ బార్థివముఖ్యా! 203

సీ. నీవాసమున కోడి నిను నుతించు పయోద
రవముగాని మృదంగరవము గాదు
నిను వసంతభ్రాంతి గని కూయు కోకిలా
ధ్వని గాని తంబురాధ్వనము గాదు

నిను మదనభ్రాంతిఁ గని కేకు చిల్కల
రవముగాని ఫిడేలురవము గాదు
నిను నుతింపఁగ నింద్రుఁడనిపిన యప్సరో
వనజాస్యగాని రోవనిత గాదు

తే. గీ. జనములందఱు 'మద్దెల' యనియుఁ 'దంబు
రా' యని 'ఫిడే' లనియు 'వెలరమణి' యనియుఁ.
బల్కుచున్నార లీమాట వట్టికల్ల
చిన్నరాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! 204

ఆ. వె. "రాళ్లకైన గానరసము సోకినయంత
రసము గల్గు" ననుచు రసికులంద్రు
వెన్నవంటిది మన చిన్నరాయని మది
కరఁగెనను టదేమిఘనము తరుణి ! 205

చ. అనువెనయన్ మనమ్ములు రసాంబుధి నోలలనాడఁబోయె, నా
మనముల వెంట నింద్రియ సమాజము సేవయొనర్పఁబోయె. సీ
జనములు సభ్యులందఱును జంత్రపు బొమ్మల పోల్కనైరి, చె
ప్పనగునె నీదు నైపుణి ! సెబాసుగఁ బాడితివే మనోన్మనీ ! 206

ఉ. చేసిన దోసముల్ బయలు చేసిన నీసునఁబోవుఁగాన నే
నీ సభ బాస చేతు; నది యేమనఁగా, మన చిన్న రాణ్కృపా
గ్రేసరుఁబాసి మత్కవితఁగీసును బాసును లేక గాత్రసవుం
గాసులకోస మాసపడి కాసర కూసర చేసి రోసితిన్ ! 207

శా. శ్రీనొప్పారెడి నీదు వర్ణనకు నైచేయూప శబ్దార్థముల్
"నేనే వచ్చెద నేనె వచ్చెదను నేనే వత్తు నేవత్తునే
నే నేనే" యని వచ్చి మీఁదఁబడు మే మెద్దానిఁగైకొందు మె
ద్దానిన్ వీడుదుమోయి చిన్ననృపతీ ! దానపత్రిధానాకృతీ ! 208

సీ. ఆశ్రయించినవారి నవలఁబొమ్మని చెప్ప
టన్యాయమని మదినరయువాఁడ !

అభిమానముగల విద్యావంతులకు దరి
ద్రత్వ మిక్కట్టని తలఁచువాఁడ!
ధనహీనులకు ధనంబునొసంగుట మహోప
కారంబనుచు మదిఁగాంచువాఁడ!
యెవరికిచ్చినను గవీంద్రులకీకున్న
యశమబ్బ దనుమాట నరయువాఁడ!

తే. గీ. యిచ్చువేళలఁ జేతికి నెమ్మిలేని
వాఁడ! యో చిన్నరాయఁడన్ వన్నెకాఁడ!
నిన్నపర్ణనిఁ జేసి మన్నించి ప్రోచు
నా యపర్ణా మహాదేవి యతిరయమున. 209

సీ. కలికాలమున భక్తిగల్గి దేవీపూజఁ
గావించు కాశ్యపీకాంతులెవరో?
చెన్నుమీఱు పదాఱువన్నె బంగారు మేల్
చాయగల్గిన సత్యసంధులెవరో?
సంగీతసాహిత్యసరసగోష్ఠుల నాద
రమ్మెసంగెడి మహారసికులెవరో?
యీవివేళలఁ జేతి కెమ్మిలేక యొసంగు
ధాటిగల్గిన గొప్పదాతలెవరో?

తే. గీ. అనుచుఁ గట్టుకతల్ వేసికొనుచు, విప్పి
కొనుచు, దంపతులెల్ల నీగుణములెపుడుఁ
జెప్పి కొనుచుందురోయి! మాయప్ప! చిన్న
రాయభూపాల! విపులసామ్రాజ్యలోల! 210

సీ. "దాతృత్వమెల్ల నిన్ దవిలియుండుటనెక
ల్పనగమ్ము భూమిలోఁబాతుకొనియె
గాంభీర్యమెల్ల నీకడన యుండుటఁగాదె
కడలి పాతాళలోకమున కరిగె

ధైర్యమ్ము నీయంద తవిలి యుండుటఁగాదె
నగరాజు చదలిపై కెగసిపోయె
సౌందర్యమెల్ల నీయంద యుండుటఁగాదె
పంచబాణుఁడు కంటఁబడుటమానె"

తే. గీ. అనుచుఁ గొనియాడుచుందురి నిన్నఖిల జనులు
భాసురాకార ! వేంకయాంబాకుమార !
రాజగోపాల వేంకటరామ చిన్న
రాయభూపాల ! విపుల సామ్రాజ్యలోల ! 211

సీ. నినుఁ బురూరవుఁడని కన వచ్చినట్టి యూ
ర్వశి గాని యిది వారవనిత గాదు
వెనువెంటఁ బ్రభునాజ్ఞఁగొనివచ్చు గంధర్వ
ఘనుఁడు గాకితఁడుగాయనుఁడుగాఁడు
అతని సేనాంగమై యలరారు చిత్రివా
ద్యమ్ము గాకిది మృదంగమ్ము గాదు
దాఁబత్తెమునకై "తత్తదానీలా" మృ
తమ్ముగాని యిది గానమ్ముగాదు

తే. గీ. తదమృతాస్వాదనాప్తి నెంతయును దనిసి
నూత్న సురతానుభూతికై యత్నమంచు
నరులు సభ్యులు కేవల నరులుగారు
చిన్న రాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! 212

క. జగుసు ఫిడేలున కీతఁడుఁ
దగు నీ మగువయును బాడఁ, దగుగతి వాయిం
పఁగ నీతఁడు దగు, దేవుఁడు
మగురన్ సమకూర్చె నేఁడు భూపలలామా ! 213

క. ఉబుమలరవమో ! యల హిమ
గిరిపై శివు శిరమునుండి కెరలిపడెడి యా

సురనది యార్భటియొ ! మృదం
గరవమొ ! వివరించిచెప్పఁగాఁదరమె ? నృపా ! 214

తే. గీ. కోకిలల్ గూయఁ దుమ్మెదల్ గుంపుగూడఁ
గేకులును బించియముఁవిప్పి కేకలిడఁగ
హాయి యనిపించె నారసింహాయి పాట
బుచ్చి తమ్మయ చిన్న రాడ్భూపులార ! 215

సీ. అనుపమానప్రౌఢి నలరారునట్టి ర
మణనొప్పు రామలక్ష్మణులనంగ
విజయ సంపత్తిచే వెలసి యెన్నఁడుగాని
కవను వీడని కుశలవులనంగ
శిష్టరక్షణబుద్ధిఁ జేసి భూస్థలి విహ
రించెడి బలరామకృష్ణులనఁగ
నధిక బలస్ఫూర్తినంది యెంతయుఁ బూర్తిఁ
గొమరారు భీమఫల్గును లనంగ

తే. గీ. నిండు పేరోలగమ్మునుండి కాంచు
వారినెల్లను నానందవార్ధి ముంచు
మిమ్ము వర్ణింపఁదరమె ? యో మేటులార !
బుచ్చి తమ్మయ చిన్న రాడ్భూపులార ! 216

సీ. గోచివెట్టక మున్నె కోమల కవిత చె
ప్పఁగ నేర్చితిమి ధరాపాలురార !
యన్నమ్ము ముట్టించునంతకు మున్నె దే
శాలు చూచితిమి భూపాలురార !
శతఘంటకవనమ్ము సల్పినచోటు లేఁ
బది కెక్కుడగు ధరాపాలురార !
వెరసిచేయఁగ మేము విరచించినవి లక్ష
పద్యముల్ గలవు భూపాలురార !

తే. గీ. వయసు ముదిరినమీఁద మాదయిన బుద్ధి
విల్చునో విల్వదో గాన నేఁడె మా శ
తావధానము చూడుఁడో యలఘులార !
బుచ్చితమ్మయ చిన్నరాడ్భూపులార ! 217

ఉ. మాడకు మాడ యెత్తుఁగల మాటలు నేరిచి సత్కవిత్త్వమే
మీఁదుగ జోడుఁగాఁ జెవుల కింపుగఁ జెప్పఁగ నేర్చినాము మా
చూడనివారు లేరు మముఁ జూడనివారును లేరు గాన మా
పోఁడిమి బుచ్చితమ్మయవిభూ ! కనఁగావలెఁ జిన్నరాట్ప్రభూ ! 218

సీ. పినతల్లి పెదతల్లిబిడ్డ లయ్యును సగ
ర్భ్యులరీతిఁ జెన్నారు యోగ్యులార !
రమణఁ గిర్లంపూడి రాజధానిగఁ జేసి
కొని యేలుకొను రాచగున్నలార !
పులినైన మీసాలు మెలిపెట్టి పెకలించు
చేవ గల్గిన జగాజెట్టులార!
సంగీత సాహిత్య సరసవిద్యల నాద
రమ్మొ చూపెడి మహారసికులార !

తే. గీ. కవులపాలిటి కల్పవృక్షమ్ములార !
నిరుపమానపరీక్ష నొప్పునిపుణులార !
సరస తిరుపతి వేంకటేశ్వరుల మనవి
నెమ్మదిం బెట్టి వారి మన్నింపవలయు. 219

సీ. సుకవితారసము వాచో పెఱుంగనివారి
కనుపమ కవనమ్మొ వినుట గల్గె
సంగీతరసము వాచవి యెఱుంగనివారి
కెనలేని గానమ్మొ వినుట కల్గె
దేవతాభక్తి బొత్తిగ నెఱుంగనివారి
కమిత దైవతభక్తి యతిశయిల్లె

అంగనామయమంచు నఖిలమ్ము మను దలంచు
పుడమి పేండ్లకుఁ గూడ బుద్ధివచ్చె

ఆ. వె. కవుల మంచిమంచిగాయనగాయనీ
జనులఁ బిలిచి లోకజననిపూజ
సేయువేళ సభలు సేయించుచో నీవు
చిన్న రాయభూప ! వన్నెకాఁడ ! 220

సీ. పటుతరంబైన వేంకటనృసింహారాయ
పూర్వసంచితపుణ్యపుంజ మనుచు
తులలేని సద్గుణంబులకుఁ దానకమైన
వేంకయాంబాతపోవిభవ మనుచు
వెలమవంగడమందు వినుతికెక్కిన మేటి
యినుగంటివంశ పావనుఁడటంచు
పుణ్యపుంజంబైన బుచ్చిసీతాంబికా
దౌహిత్రిరూప సాధర్మ్యమనుచు

తే. గీ. నిన్ను జనములు గొనియాడఁ గన్నులారఁ
గాంచఁగా నేఁడు మాకుఁ దార్కాణ మయ్యె
రాజగోపాలవెంకటరామచిన్న
రాయభూపాల ! విపులసామ్రాజ్యలోల ! 221

సీ. ఉరువు పట్టువ గబ్బి యిరుకుగుబ్బల చొక్క-
పుం జవరా ల్బంటిపోటుకన్న
నొడలొక్కటిగ సూదికెడమీని చలినాఁటి
వింతజవ్వని కౌఁగిలింతకన్న
రతివేళ మెచ్చి మెచ్చితినంచుఁ జెలిమిన్న
తనయిచ్చు నధరామృతమ్ముకన్న
పొలయల్క విడిచి యొప్పులకుప్పయైన నె
చ్చెలి యొనర్చెడి మగనేఁతకన్న

తే. గీ. సొగసు గల మృదుకవిత నీ మొగము చూచి
నంతనే కల్గు నిది యేమి వింత ? భోజ
భూపతివొ ! లేక కృష్ణరాడ్భూమిపతివొ !
చెప్పుమా, తప్పు కిప్పుడో చిన్నరాయ ! 222

శా. నిన్నీరీతి మహోత్సవమ్ములపసం దీపింపఁగాఁ జేయు మా
చిన్నారాయని సర్వసంపదలవాసిన్ బెద్దఁగాఁ జేయు మ
ట్లున్నన్ మంచిది లేకయుండినను నిన్నూరారఁ జాటింప మా
కన్నన్ లేరిఁకఁ దిట్టులంబడెదుసుమ్మా ! యమ్మ, కామేశ్వరీ ! 223

సీ. వేల్పురాసిరికన్న విభవాతిశయముచే
నలరారునట్టి రాజ్యమ్ము గల్గి
రంభాముఖాప్సరోరమణీమణులకన్న
మేలైన భోగినీస్త్రీలు గల్గి
పాలసంద్రమ్ములోపలి నిగ్గుపసకన్న
డాలు చెన్నారు గుఱ్ఱాలు గల్గి
యాకాశచుంబితాయతిచేత నొప్పారు
తపనీయ దివ్యసౌధములు గల్గి

తే. గీ. కవులయెడఁ బక్షపాతంబు గల్గి మంచి
బుద్ధిగల్గియు ననుపదవృద్ధి గల్గి
యెసక మెసఁగంగ నీ రాజ్యమేలుకొమ్ము
చిన్న రాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! 224

తే. గీ. రాజసం బింత లేక గర్వమ్ము లేక
స్వయముగా దేవిఁ బూజించు సరసుఁ డెవ్వ
రిట్టి నినుఁ దక్క దేవి యిం కెవని మీఁదఁ
జిలుకుఁ గారుణ్యపూరమ్ము చిన్నరాయ ! 225

క. అను సంవత్సర మీరీ
తినె యుప్పైశ్వర్యగరిమ దేవీపూజం

బోనరించుచు నాశ్రితులం
దనుపుచు వర్ధిల్లుమయ్య ! ధరణీనాథా ! 226

—• ఆత్మకూరు చిన్న దొరవారిమీఁది పద్యములు •—

మ. ధరణీనాథులు రాజరాజనుచు, విద్వాంసుల్ బుధుం డంచు, సుం
దరులెల్లన్ మదనుం డటంచుఁ, గరుణాధారుం డటంచున్ బ్రజల్,
సరసుండంచుఁ గవీశ్వరుల్ పొగడ రాజ్యశ్రీల వర్ధిల్లు ము
క్కరవంశాంబుధిచంద్ర ! నిస్తులయశస్కా ! రామభూపాలకా ! 227

మ. కరుణాశీతలదృష్టిపాతమును రాకాయామినీనాథసుం
దరసుశ్లోకము దేహసౌష్ఠవము విద్వత్పక్షపాతంబు రా
జ్యరమాధిక్యము దానవృద్ధియును వాచాసుష్ఠుభావంబు సు
స్థిరమై యొప్పఁగ నేలుమయ్య ! జగతిన్ శ్రీరామభూపాలకా ! 228

మ. సరసంబై శుభమై మనోహరకలాసందర్భగంభీరమై
శరదంభోరుహపద్మ సంభవసతీశానప్రభాపూర్ణిమా
స్ఫురదింపుప్రతిభావిభాసియగుచున్ బొల్పారి యెల్లప్పుడున్
సిరుల న్నినగ విచ్చుఁబండితులకున్ శ్రీరామభూపాలకా ! 229

—• శ్రీనివాసవిలాసమును వినిపించుసమయమునఁ జెప్పినవి •—

ఉ. కేవలవైదికుల్ మఱియుఁ గేవలశాబ్దికసార్వభౌములున్
గేవలతార్కికుల్ మఱియుఁ గేవలకావ్యవిదగ్రిగణ్యులున్
గేవలగాయకుల్ మఱియుఁ గేవలు లెందఱునైనఁ గావ్యకృ
ద్భావము నిర్ణయించి రసపాక మెఱింగి సుఖించి మించి వ
హ్వా ! వహవా ! యటంచు ముద మందఁగ నేరరు, కొద్దికొద్ది యా
యావిషయమ్ము లన్నియును నారసి లౌకిక చాతురీమతి
శ్రీవిభవమ్మునన్ జెలఁగి చేటున కాకరమౌ నసూయకున్
ఠావము లొంగనీ కనుభవమ్మున మించిన మిమ్ముబోఁటి వి
ద్యావిదులౌ రసజ్ఞులకుఁ దదర్శిసముల్ పొడకట్టుఁ; గాశిదా
సే పచియించెఁ గాదె ! తను నెంతయు మూర్ఖులు బాధ పెట్టభో

జావనిపాలకోత్తమసభాంతరమందుఁ "గవిత్వతత్త్వముల్
భావజుకేళిఁ గూడునెడఁ బంకజగంధులఁ మోవివాచవుల్
చేవగలట్టి చన్నుఁగవచిక్కఁదనమ్మును సొంపునింపు ను
న్వావిరిచిన్ని కన్గొనలవాఁడియు నా ననుభూతి లేనిచోఁ
గోవిదులైననున్ దెలిసికో నసమర్థు" లటంచు; నిక్క మీ
ఠీవి జగత్త్రియమ్మనఁ గడింది రసజ్ఞులయందుఁ గన్పడున్
గేవలశాస్త్రు లెంతయినఁ గ్రిందును మీఁదును బొర్లులాడినన్
భావ మెఱుంగలేరు తల బ్రద్దలుకొట్టుక పోరి చెప్పినన్;
శ్రీ వెలయంగ సత్కవిత చెప్పెడివాఁ డనఁ బండితుండునుం
గావలె లౌకికోత్తరుఁడుఁ గావలె బుద్ధివిశేషధుర్యుఁడుం
గావలె భోగి యోగియును గావలెఁ గొంటెలలోనఁ గొంటెయుం
గావలె మంచిచెడ్డ యనకన్ సకలమ్ము నెఱుంగఁగావలెన్;
గావున నందఱున్ గవులు గాఁదగ రట్టి కవీంద్రుభావమున్
గేవలు లాదరింతురె? యొగిన్ వగలాఁడి రసానుభూతికిం
ద్రోవ యెఱుంగనట్టి యొకనూతనవైదిక సార్వభౌము డె
మ్మోమ్రపని వొక్క వాఁడు మొగమున్ గడకొత్తి "యిసీ! తుథూ, తు థూ!
సీ! వెఱిదాన! మంచియును జెడ్డయు నేర వపాత్రురాల! నా
పావనమైనయోష్ఠమును బాడుగఁజేసితి వింకఁ గాశికిన్
బోవలెఁ బంచగవ్యమును బుచ్చికొన న్వలె" నంచుఁ దిట్టుగా
నీ "వగలాఁడి చేష్ట లివి యీగతినుండు" నటం చెఱుంగునే?
భావజతుల్యరూప! కవిపండితనుత్యయశోవిశాల! సో
మావనినాథపుత్త్రి! భవదాజ్ఞ శ్రమంపడి చెప్పినట్టి యీ
పావనమైన గ్రంథమును బట్టి పలార్చి కలంచునట్టి దు
ష్కోవిదకోటితోఁ దగులుకొల్పక మంచి రసజ్ఞులైన వి
ద్యావిదులన్ యథార్థగతితత్పరులన్ బిలిపించి చక్కఁగా
భావము నిర్ణయించి పరిపాటిగ మమ్మును గారవించి మీ
కోవిదులందుఁ జేర్చుకొనఁగోరెదమయ్య! వృథావివాదకున్

ఘావము జొన్పమయ్య ! వెడపరిశ్నల కోరువఁ జాలమయ్య ! మో
దావహమైన పరిశ్నలకు నచ్చగ నుత్తరమిత్తుమయ్య ! రా
జా ! వినలేనిమూర్ఖులు రసంబు విసంబుగఁ జూతురయ్య ! మా
కీవలఁ కొక్కవత్సర మదిందుకుఁ బట్టెగదయ్య ! రామరా
మా విసువెత్తుచున్న దిఁక మందులఁ జేర్పకుమయ్య ! మంచి దీ
దేవిరిగొట్టుపరిశ్నలకు ధీవరులొప్పి సహింతురయ్య ! మా
చేవ యెఱుంగుమీ యెదుటఁ జెప్పెడి దేటికి మాటిమాటికిన్ ? 230

ఉ. మమ్ము నెఱింగి మాదగు శ్రీమమ్ము నెఱింగి రచించినట్టి గ్రం
ధమ్ము నెఱింగి దేశపువిధమ్ము నెఱింగి యనుగ్రహించి వే
గమ్ముగ గ్రంధమున్ విని తగన్ మముఁ బంపవలెన్ "శుభస్య శీ
ఘ్ర" మ్మనఁగావలెన్ బరుల కష్టసుఖమ్ము లెఱుంగఁగావలెన్. 231

సీ. చెవులునుం జవరాలి చిన్నారి పొన్నారి
ముద్దుపల్కులకునై మొగమువాచె
కన్నులానన బోఁడి చిన్ని వెన్నెలమోము
మురువుచెయ్వులకునై మొగమువాచె
చేతు లావాల్గంటిజిల్గుబంగరు రంగు
పొగరు గుబ్బలకునై మొగమువాచె
నాలుకా వగలాఁడి చాలునుంజిగురాకు
మోవితేనెలకునై మొగమువాచె

తే. గీ. మేను నాముద్దుసుద్దులమించుఁబోడి
సొగసుకీల్ జడపేట్లకై మొగమువాచె
పోయి వచ్చెదమయ్య ! నీ పున్నె మాయెఁ
బంపఁగదవయ్య ! యాత్మకూర్పార్థివేంద్ర ! 232

—• గ్రంథమును వినునప్పుడు కుత్సితాక్షేపణలను జేయువారినిగూర్చి చెప్పినది •—

మ. అల శ్రీహర్షుఁడు వేదవాక్యముల కన్యాయార్థముం జెప్పి బా
ములపాలై చెడె, ఉత్తమాసనము వస్తుంజేయఁ బోరాడి పే

రలుకన్ జెందినయటి విశ్వపతి పాడాయెన్ బ్రమాణమ్ముగాఁ
గలదే, నీ వనినట్టి దోషమిట? పక్కాణింపు మింతేటికిన్. 233

—• అసూయా గ్రిస్తులను గూర్చినది •—

ఉ. ఔనె యసూయ! నీదయిన యాగడమెల్ల నెఱుంగ నాయె, నీ
దీనత తెల్లమాయెఁ ద్వదధీనుల దుర్గతి స్పష్టమాయె, నీ
హీనికరంపుఁ జేష్ట లవి యందఱకున్ విశదమ్ములాయె. నీ
జ్ఞానము గాననాయె; నినుఁగాంచిన కార్యము చక్కనాయె, నీ
మానము గాలిపోను! దగుమన్నన గల్గు ప్రశస్త రాజసం
స్థానములందుఁ బూజ్యత నెసంగెడి పండిత మండలిన్ నివా
సానుగుణమ్ముగాఁ దలఁచె దయ్యది మంచిదిగాదు; విన్ము నీ
కేనొక మాట దెల్పెద; నదేమన ధర్మ్యములైన రాజసం
స్థానములన్ వసించు బుధసత్తములన్ గలఁగించి యస్యులే
దేనొకసత్ప్రబంధము నహీనరసమ్ము లెసంగఁ జెప్పినన్
గాని త్వదీయ చేష్టల వికారముచేఁ గయి పెక్కఁజేసి యు
ద్దానగుణమ్ము వోవిడిచి "తప్పులు చొప్పడఁజేతు" నంచు నెం
తేని యహంకృతిన్ జొనిపె; దెయ్యెడలం దొసఁగుల్ పొసంగ క
న్యూనగుణాతిరేకమున నొప్పెడి మేటి ప్రబంధమందు న
జ్ఞానికిఁగాని జ్ఞానికి దొసంగు లెసంగునె? నీదు ప్రేరణం
బూని గుణంబు దోసమని బొంకినఁ బోవునె? తక్కుపండితుల్
దానిగుణాగుణంబుల విధం బది బైటకుఁ బెట్టరే? నిజం
బేని యొకండు కాదనిన నేమగు? వెన్నెల చూచి పంకజం
బూనునె మోద? మంతటనె యొల్లకు నయ్యది నింద్యమౌనె? కా
నీ వినుమెచ్చవచ్చుఁ ద్వదధీనులు లోకులొనర్చు నిందకుం
గాని యసత్య మాడుటకుఁగాని యమార్గములందుఁ బోకకున్
గాని యయుక్తవర్తనకుఁ గాని పరాకృతిం బొనర్పఁగాఁ
గాని యిహమ్మునందయినఁ గాని పరమ్మునఁ గాని నందియం

బూనరు పాపమెంచరు మహోద్ధతులై చరియింతురి: దానికిన్
స్థానబలంబె కారణము, తత్ స్థలమున్ విడనాడి యన్యసం
స్థానము పొంతఁ బోయినఁ బదంపడి వారల శక్తి సంపదల్
గానఁగరావె ? వారి ననఁగాఁ బనిలే దిది నీ మహత్త్వ, మే
మైనను భూమి పుట్టినది యాదిగ నిన్ గ్రహియించినట్టి యె
వ్వానికిఁ గీర్తివచ్చెఁ ? బరవంచన సేయగఁ నెంచి దానిచేఁ
దానె వృథాగతిన్ మదినిఁ దద్దయునుం దిగులూని సత్కళా
హీనతఁ గాంచి సిగ్గుపడి యెంతయుఁ జింతఁ గృశించు, నంతియే
కాని నినున్ గ్రహించిన యొకండును మెప్పును బొందలేదు; ని
న్నాని పరస్పరమ్ముగ దమ యాత్మ లెఱుంగఁగలేక పంతముం
బూని నిరర్థకమ్ముగను బుక్కటివాద మొనర్చి దాన సం
స్థానములందు రాజుల కసహ్యత పుట్టగఁ జేయు పండితా
జ్ఞానులవల్ల విద్యలకు సత్కృతి దప్పఁగనున్న దింతకున్;
భానునిమీఁద మంచుగతి బైబడఁ జేసెదు, తారతమ్యముల్
గానఁగనీవు నీదయిన గర్వము సాగునె మేటిచోటులన్ ?
బో, పసుదాల్చెనేని బుధపుంగవుఁడున్ దగు మంచిచెడ్డలన్
గానక రిక్తుఁడై యశముగాంచక తాఁ జెడిపోవు నిచ్చలున్. 234

—• బహుమానసమయమునఁ జెప్పినది •—

చ. పనిగొని విన్ము, కంఠమునఁ బ్రాణము గల్గిన యంతలోన నో
జనవర ! యింతకన్న సరసమ్ముగ దీనిఁ దెలుంగు చేసినన్
వినయమునన్ నమస్కృతులు వేయొనరించి భవద్వితీర్ణమౌ
ఘనమఖిలంబు నాతనికి దానముచేసి తరింపకుంటు మే. 235

ఉ. పానకమందుఁ బుల్లవలెఁ బండితకోటుల కిచ్చువేళ నే
మానవుఁడైనఁగాని చనుమానమునన్ బహుమానమందునన్
న్యూనత గల్గఁజేయుటకు నూల్కొనుఁ దద్వచనమ్ము లెక్కనే ?
దానమునందుఁ గర్ణునకు దాఁటిన చేతులయొద్ద భూవరా ! 236

శా. ఊరేగించుట యూరులిచ్చుట మహాయోగమ్ము చెన్నార పే
యాఖుల్ బంగరుభూషణమ్ములు మణీహారమ్ము లిత్యాది సు
శ్రీ రంజింపుట. వేయునేల ? కవిదారిద్ర్యమ్ము పోఁగొట్టు సీ
తారామావనిపాల ! వేళ యిది నీదాతృత్వముం జూపుమా ! 237

ఉ. నూటపదార్లు తెచ్చినవి నూటికి నెక్కుడుగాన మాకు వే
నూటపదార్లుమిచ్చు టది నూతన, మెంతకుఁ జాల వీపు ! మేల్
హాటక మీయలేవా ! మణిహారము లీయఁగలేవా ! నీకు వే
నూటపదార్లు లెక్కయగునో, యటు కాదొ ! నృపాలశేఖరా ! 238

మ. ఒక సంవత్సరమాయె నీదయిన పేరూహించి యూహించి "తా
రకమంత్రం" బని నిష్ఠఁబూని జపముం బ్రారంభముంజేసి నే
టికి సిద్ధించె, మదీయదేశనృపకోటిశ్లాఘ్యమౌ ఠీవి విం
తకుఁబాత్రంబగు నీవి చూపవలె సీతారామభూపాలకా ! 239

ఉ. 'రాజులసొమ్ము రాళ్ళ' కని బ్రాహ్మణులాడెడు మాట కర్థ మో
రాజవరేణ్య ! 'యెంతయుఁ దిరమ్ముగ తాళ్ళవలెం జెలంగు వి
భ్రాజితసత్కృతీంద్రముల పా' లని లక్షణఁ జెప్పఁజేసి రా
భోజుఁడు కృష్ణరాయలును బూర్వపురాజగు విక్రమార్కుఁడున్. 240

మ. "రుకు" నేతెంచి నిజామురాజులను నీరూఢిన్ బ్రివర్తింపఁజే
సికదా యేగెను, నీవు "సత్కృతులకున్ జేసాచురాజన్య వి
ట్టిక్రియన్ బూజలొనర్పుఁడీ సుకవికోటిన్ మేటిగా" నంచు బో
ధకమౌ ఠీవి నొనర్పఁగావలయు సీతారామభూపాలకా ! 241

క. నీవంటి రాజమణికిన్
గోవిదు లెల్లరును మెచ్చుకొనఁ గృతి నిడియున్
భూవర ! యిం కొక్కరునిన్
జీవికకయి దేవిరింపఁ జెల్లునె మాకున్ ? 242

ఉ. "పొట్టకుఁ బుట్టెఁ" డంచు జనముల్ వచియింతురు మాదుసీమ, మా
పుట్టెలునాల్గు మీకు నొకపుట్టెఁడు, భార్యలతోడఁ గూడ మా

పొట్టలు నాలుగింటికిని( బుట్టె(డుధాన్యము వచ్చు మాన్యపుం
బట్టు నొసంగ నీవు తగవా ! గ్రహియింప(గ మేము చాలమా. 243

ఉ. దగ్గరనున్నవారల విధమ్మున మమ్మును గారవింప(గా(
దగ్గకృతిన్ రచించి బుధతల్లజు లెల్లరు మెచ్చ నిచ్చి మే
మొగ్గితిమిప్డు చేతుల, నహో ! యన మా కిడు మగ్రహారమున్
దగ్గనె యింతమాత్రమున( దామరతంపరగాక భూవరా ! 244

తే. గీ. కుజు(డు భూకారకుండట( కుజునిలోన
రాజ(ట యతండు వసతిధర్మమ్మునందు(
జేయున(ట భూమిలాభముచేయకున్నె ?
జ్యోతిష మబద్ధమొనరింప( జనునె, రాజ ! 245




(వెం॥ శా॥ జాతకము)
అప్పటికి కుజమహాదశలో
చంద్రాంతరము.

—• సెలవుసమయమున( జెప్పిన పద్యములు •—

మ. కరినెక్కించితి వృత్తినిచ్చితివి బంగారంపుహారమ్ము లం
బరముల్ సేల్వాలు నూఱులాఱులును సమ్మానమ్ముగావించి మా
తరుణుల్ సంతసమంద( జీరలు ప్రశస్తంబైన వర్పించి యా
దరముం జూపితి సంతసించితిమి సీతారామ భూపాలకా ! 246

ఉ. ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానములందినాము బహుమానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కఁ బెట్ట కనివారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధు లంచుఁ బేరు గొనినారము నీవలనన్ సరస్వతీ! 247

—। నాల్గవ సంవత్సరం గద్వాల ।—

మ. గదవాలాఖ్య పురీసురాధిప దిశాఘంటాపథ ప్రాంతవా
స దశాధాసురమై సమస్తజనులన్ సంతుష్టి గావించి మె
ప్పొదవన్ వర్తిలు నీకు నింబ మొకఁ డోహో! యెట్లు తోఁచెన్ సహా
ఖ్యదమా, చూతమ ! రామభూపతికి రంగారెడ్డి తోడొాగతిన్. 248

— గ ద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలసరస్వతీ
బాలసరస్వతీ శతావధాని తిరుపతివేంకటేశ్వరులచే రచింపఁ
బడిన నా నారా జ సం ద ర్శ న మ్మ న ం డుఁ
బూ ర్వా ర్ధ ము.



ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# నానారాజసందర్శనము, ఉత్తరార్ధము



రెండవ సంవత్సరం కిర్లంపూడి.

చ. హితుల్ పురోహితులు బుధు లహీనవచోవి భవాభిరాము లు
స్సుతులు కవీశ్వరుల్ యశమునందగు మిత్రులుఁ జుట్టుముట్ట సం
గతముగ నెల్లలోకములు గాచెడి శక్తినిఁ బూజసేయు నీ
ధృతి జగతీత్రయమ్మునను దెంపరియై చరియించు భూపతీ! 1

క. అవనీ నాయకులుం గల
రవనీనాథులకు నెక్కుడై యొప్పెడి వై
భవములునుం గల వయినన్
గవులకు నీవంటినృపతి కన్పడఁడు నృపా! 2

ఉ. అన్నిటికేమిగాని నిజమాడెద నా గురువాన మేలుమేల్
చిన్ననృపాల! యెక్కుడగు శ్రీఁదులఁదూఁగియు నొక్కసారి నిన్
గన్న మనుష్యునిన్ మరలఁ గన్గొనినంతన పల్కరింతు నిన్
బన్నినబమ్మ వేఱొకఁడు, పార్థివులం దిటులెందుఁ గల్గునే! 3

తే. గీ. ఇతర దేశాధిపులఁ జూడనేగి యచటఁ
గలుగు నష్టంపుఁ గన్నుల కాఁక నేఁడు
నీ శరీర మహా స్తపనీయబాసు
రాంజనముశోఁకఁ గడుఁ జల్లనయ్యె భూప! 4

ఉ. "కోడలు నత్తయున్ మిగులఁ గోరికలీరికలెత్త నొక్కెడన్
గూడి వసించుచుండుటొనఁగూడ" దటంచు వచించుచుందు రీ
పోఁడిమి విద్యకున్ సిరికిఁ బుట్టిన యిల్లుగ నొప్పు నీ సభఁ
జూడఁగ నన్యథాగతికిఁ జొన్పెడిఁజిత్తముఁ జిన్నభూపతీ! 5

ఉ. ఏపునుజెందనీ మఱియు నెంతయు సంపదఁబొందనీ కడున్
రూపమునందనీ మఱియు రూఢికి నెక్కుయశంబు గాంచనీ
భూపతులందు ధైర్యమునఁ బోల్పఁగ నీ కెనలేరు చిన్నరా
యా! పరిపూర్ణసౌఖ్యముల నందెద వందునఁజేసి నిచ్చలున్. 6

చ. జనని జగద్విరోధిజనసంహరణప్రవణప్రభావమో
హిని పరతత్త్వరూపిణి మహేశ్వరి కామితదాత్రియౌ జగ
జ్జనని విధాత్రి నీ కధికసంపదలిచ్చి సతంబు నా సుద
ర్శనునివిధమ్మునన్ బ్రియమెసంగఁగఁ బ్రోవుతఁ జిన్నభూపతీ! 7

ఉ. ఎన్నఁగ సర్వభూపతుల నెన్నికలోఁ దలఁదాటి యీగిలో
నున్నతిలోనఁ బెద్దయననున్న నినున్ మది శంకఁ దక్కచున్
జిన్ననృపాలుఁడంట కవిశేఖరులందఱి కెన్న నీడుపై
నున్న స్వతంత్రభావమని యోపిక సేయుము చిన్నభూపతీ! 8

మ. పరదేశజ్వరబాధచేత మిగులన్ బ్రాల్మాలి నానాఁటి ఁ
క్కుఱె మా యాశుకవిత్వధార, యది నిన్ గన్గొన్నమాత్రినఁ ...
దురునిన్ గాంచిన చంద్రికాంతమణినాఁ దోరంబుగాఁ గొంతి కొం
త రసమ్ముం గనుచున్న దిప్పటికిఁ జిన్నారాయభూపాలకా! 9

మ. అనుసంవత్సరమున్ యథోక్తముగ బల్యాదిక్రియల్ పొప్పడం
గను బూర్వమ్మ సుదర్శనాదినృపతుల్ గావించుచందమ్మునన్
దనివిందీఱెడి పూజ నీకితమునన్ దాఁ గాంచు నీదేవి నిన్
ధనపుత్రుంబలెఁ బ్రోచు నెల్లపుడు చిన్నారాయభూపాలకా! 10

సీ. సత్యవ్రతునిఁ బ్రోవఁజాలె నేజగదంబ
యఖిలవిద్యాప్రౌఢి నందఁ జేసి
యలసుదర్శనుఁ బ్రోవఁ గలిగె నేజగదంబ
నేలనాల్గుచెఱంగు లేలఁ జేసి
శ్రీరఘురామమూర్తిని బ్రోచె నేయంబ
రిపుని రావణుని హరింపఁ జేసి

బ్రహ్మాదిదేవతాప్రభుల సంరక్షించె
నేయంబ సృష్ట్యాదు లెఱుఁగఁ జేసి

తే. గీ. అట్టి పరశక్తిమహిమంబు నరసి పూజ
సేయు నినుఁ బ్రోవకున్నె బల్ సిరులొసంగి
యింతకన్నను మఱియు నింకింతకన్నఁ
జిన్నరాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! 11

మ. నిరు దేతెంచినయప్డు పద్యములఁ గొన్నింటిందగన్ జెప్పి శ్రీ
కరుని న్నిన్నుఁ బ్రశంసచేసితిమి వేడ్కల్ మిన్నుముట్టంగ, మా
కల వద్దానను దీఱదాయె నవు, డాకర్వెల్లఁ దీఱంగఁ గొం
త రహిన్ నేఁడు ప్రశంస చేసెదము చిన్నారాయభూపాలకా ! 12

మ. ఇనుఁ గంటిన్ నినుఁ గంటి భేద మొకయింతేనిన్ గనన్ రాదు, సో
మునిఁగంటి న్నినుఁగంటి భేదము లవమ్మున్ గానగారాదు. మే
ఘునిఁ గంటి న్నినుఁగంటి భేద మరయన్ గోరంతయున్ లేదు, మీ
యినుగంట్యన్వయ మెంత చేవగలదోయీ ! చిన్నరాయాధిపా ! 13

చ. ప్రియము నయమ్మునన్ సొబఁగు పెంపెసఁగన్ వినుమయ్య! బుచ్చిత
మ్మయ నరపాల ! యెక్కుడగు మన్ననఁ దమ్ముఁడు నీవుఁగూడి యు
చ్ఛ్రయముగ మావధానము గరంబును జూడఁగ నిచ్చ నేయరా
దె ? యిది యశస్కరం బనుచుఁ దెల్లమకాదె ! నృపాలకోటికిన్. 14

తే. గీ. నిరుడు మా యవధానంపు నేర్పు చూడ
ననుమతించియు రాజకార్యప్రసక్తి
పొసఁగుటంజేసి యది "పోస్టుపోను" జేసి
రది యిపుడు తీర్పవలయుఁ దమ్మయనృపాల ! 15

క. నిరు డూరకున్న కారణ
మరయఁగా విను, మేనృపాలు నరయుటకై మే
మరిగిన నదేమొ! తొలివ
త్సర మవధానసభ లేదు చర్చింపంగన్. 16

క. అందఱురాజు లొనర్చిన
చందమునకు మాఱురీతి సంధింపక యా
నందముగ శతవధానకృ
తిం దగఁ గనుఁగొనుట కనుమతింపఁగరాదే ! 17

సీ. శంఖచక్రగదాది సాధనమ్ములు దాల్చి
హవణించు నాల్గు బాహువులతోడ
క్రొత్తకాఱుమెఱుఁగునాఁ గొమరారు పదియాఱు
వన్నెబంగారు దువ్వలువతోడ
ఘగరాలనత్తు పెన్నిగనిగల్ నగఁజాలు
సొగసుగల్గిన చిన్ని నగవుతోడ
శ్రీనతోడఁదులఁదూఁగఁదగు నొయారముగల్గి
యలరారు నెయ్యంపుఁ జెలులతోడ

తే. గీ. భక్తులకు నెల్లవేళఁ జూపట్టు జనని
సిరుల దయచేసి మిమ్ము రక్షించు నెపుడు
శ్రీమ దినుగంటి వంశాబ్ధి సోములార !
బుచ్చితమ్మయ చిన్నరా డ్భూపులార ! 18

సీ. బంగారు సింగారముం గాఱు మీ దేహ
ముల సొరు బలులన్న చెలువు దెలుపు
తమ్మి రేకులతోడ దొమ్మియుద్ధము సేయు
మీ కన్ను లాకర్ణమితము దెల్పు
మాటమాటకుఁ దేట మూటగట్టెడు మీదు
పల్కులు సురగవీపటిమ దెల్పు
చంద్రబింబముతోడ సఖ్యమ్ము సేయు మీ
మోములు రామాభిరామతఁ దగు

తే. గీ. పండితులకును జగతిలోఁ బామరులకు
వేతె వర్ణింపవలెనె మీ వితరణంబు ?

శ్రీమ దినుగంటి వంశాబ్ధిసోములార !
బుచ్చితమ్మయ చిన్నరా డ్భూపులార ! 19

ఉ. మేరుపునందుఁ జెన్నలరు మిక్కుటమైన పసిండి చాలునో !
తారకశైలదుర్గమున దండిగ నొప్పెడి వెండి చాలునో !
గారవ మొప్ప నీవు కవికాంతులకుం దగ నిచ్చువేళ నీ
చేరువనుండెనే నొకటి చేతికి నడ్డమె? చిన్న భూపతీ ! 20

చ. ఇతర నృపాలకుల్ శతములిచ్చెడివేళను గల్గుమోద మా
ధృతికినివాసమైన నిను దేటి కసుంగొనినంతఁ గల్గు ని
చ్చ్రుతటిముదం బదింత యనుచున్ వివరింపఁ దరంబె? సుందరా
కృతి వధికాదరోదయుఁడ వీగిని మేటివి చిన్న భూపతీ ! 21

మ. స్మరునిం జూడని గొప్పలోపమును రంభాజారునిన్ జూడ మున్
దురదృష్టమ్ము జయంతుఁ జూడమను కందున్ నిత్యసంపూర్ణుఁ జం
దురునిం జూడని సేగియున్ జెలులకున్ దోడ్తోడనే తీఱు సుం
దరునిన్ నిన్ గనుఁగొన్న మాత్రమునఁ జిన్నారాయ భూపాలకా! 22

శా. "దారిద్ర్యజ్వరమున్ హరించుటకు విద్వచ్ఛ్రేణి కిస్సంటి చి
న్నారాయాభిధమైనమం దొకటి విన్నాణమ్ముగా మంచి బం
గారమ్ముంగొని చేసె ధాత యదియుం గన్నంతనే పాయు న
ద్దారిద్ర్యం" బని చాటు నీ యశము విద్యాభోజ ! చిన్నాధిపా ! 23

మ. కరుణాశాలినిపంచు నిన్ గొలిచినన్ గార్యంబు చేకూరు ట
బ్బురమే యంచు మదిం దలంచుకొని నిన్ బూజించుచిన్నావనీ
వరునిన్ బ్రోవక యుంటివేని నిను అవ్వన్ జేతు మోహాంకరీ !
గురుఁడున్ దైవములేఁడు సత్కవులకుం గోపంబు రా నీకు మీ ! 24

సీ. ఏకరంభాశుభాలోకంబు నాకం బ
నేకరంభాశుభాలోక మిద్ది
ఏకైక బుధ కవిశ్రీకంబు నాకం బ
నేక సత్కవిబుధ శ్రీక మిద్ది

ఏకవాసవ చాతురీకంబు నాకం బ
నేక వాసవచాతురీక మిద్ది
ఏకనిర్జరగవీశ్లోకంబు నాకం బ
నేక నిర్జరగవీశ్లోక మిద్ది

తే. గీ. అనుచు నిర్జరలక్ష్మి దా నరసి మీదు
కొలువు లోపలనే పాదుకొని యెసంగె
శ్రీమ దినుగంటి వంశాబ్ధి సోములార!
బుచ్చితమ్మయ చిన్నరా డ్భూపులార! 25

సీ. కోటిసూర్యులకాంతి గోటమీటఁగఁజాలు
దంబైన కాంతిపుంజంబుతోడ
చండముండాది రాక్షసరాజసంహార
కారకంబైన బింకంబుతోడ
పార్శ్వద్వయ స్థాయి భక్త ప్రసారితా
కృత్రిమసద్దయాదృష్టితోడ
శ్రీ గిరిజాముఖ ప్రేయసీసంయుత
హరిహర బ్రహ్మాది సురలతోడ

తే. గీ. పోతురక్కసుతోఁ బోరి పొలియఁజేసి
జగము లేలిన చల్లనిజనని శక్తి
సిరులదయచేసి మిమ్ము రక్షించుఁగాత
బుచ్చితమ్మయ చిన్నరా డ్భూపులార! 26

సీ. చక్కఁదనమునందుఁ జర్చింపఁగాఁ జెర్కు
వింటివా రంద ఱిన్గంటివారు
శత్రువిజయమందుఁ జర్చింపఁగా బేసి
కంటివా రంద ఱిన్గంటివారు
గాంభీర్యమందు సాగరమందు మోకాలి
బంటివా రంద ఱిన్గంటివారు

సర్వకార్యములందు సంపూర్తిగా నొంటి
పంటివా రంద ఱిన్గంటివారు
తే. గీ. వారిలోపల మణిపూసవంటివాఁడు
తొంటిరాజుల నీగికో గెంటువాఁడు
మింటికిని నేలకును గీర్తినంటువాఁడు
శ్రీకరాకారసుకృతి మా చిన్ననృపతి. 27

సీ. నీకీర్తి కెనయఁగా నెగడిన తెల్లుపూ
వునకు సుగంధమ్ము పొలియఁజేసె
నీరూప మెనయఁగానెగడిన సుమబాణు
సిడము నట్టేటిలోఁ గలయఁజేసె
నీధైర్య మెనయఁగా నెగడిన బంగారు
పర్వతంబును నేలఁ బాఁతిపెట్టె
నీయీగి కెనయఁగా నెగడిన ధారాధ
రంబును దగ నీరదంబుఁజేసె
తే. గీ. జగతి నెక్కుడువారితో సమతగోరు
నల్పులకు ధాత గర్వంబు లణఁపకున్నె?
రాజగోపాలవేంకటరామచిన్న
రాయభూపాల! విపులసామ్రాజ్యలోల! 28

ఉ. ఈపికవాణి నేయుకృతు లెంతయు వర్ణనసేతునన్న నా
కోపికలేదు గాని యవియున్ గణియింపఁగ రావు నిక్క మా
యేపున నాఫణిస్వరము నింకొకమా టిఁకనొక్కమాటటం
చోపిక గల్గెఁ జూచుటకు నోనరనాయక! చిన్నభూపతీ! 29

సీ. చెక్కుపైఁగల చిఱుచెమటబిందులతోడ
జూకాలముత్యాలు జూదమాడ
పైఠిణీరైకలోఁబడియు సందుగొని చం
దోయి సభ్యులఁ దొంగి తొంగిచూడ

చందోయి తాఁకుచే జడిసిన మెడకంటి
తలదాఁటి పాఱిపోఁదలఁచుచుండ
సరిగంచుగల పైఁట చెఱఁగు మేల్నడికట్టు
మలయమారుత సౌఖ్య మొలుకఁజేయ

తే. గీ. కందుకక్రీడ మంచి నాగస్వరంబు
సోయగము మించు గచ్చనకాయ లాట
పూలకోఁతయు మొగ్గలు మొదలు పనులు
చేసె నీసాని యిన్గంటి చిన్నరాయ ! 30

ఆ. వె. మేటిరాజ వయ్యు మిత్రుండ వైతివి
మాగృహములు సిరులఁ దూఁగకున్నె
రాజు మిత్రుఁడన్న రాణ కవీంద్రుల
కున్న యదియకాదె, చిన్నరాయ ! 31

మ. నిను నెల్లప్పుడు నాశ్రయించెడి బుధానీకమ్ములన్ సంతతం
బును నీ వేగతిఁ బ్రోవ నెంచెదవొ సంపూర్ణానురాగమ్మునన్
దను నేచేటను బూజసేయు నిను నేతద్రీతి రక్షింపఁ గ్రి
న్నన నద్దేవి కెఱుంగఁ జేసెదము చిన్నారాయభూపాలకా ! 32

ఉ. రాజులలోన సంపదల రాజిలువారలు లేరె? నీవలెన్
దేజముసొంపు పెంపు జగతి న్నుతికెక్కఁగఁ బూర్వకాలమా
భోజునిరీతి సద్యశము వొందఁగ నేరరు కాని, వహ్వారే !
రాజ ! మనోజతేజ ! కవిరాజిమణిస్తుత ! చిన్న భూపతీ ! 33

సీ. పగపాలు సౌఖ్యంబొసంగి జారుని వీడి
చనసాఁగు నొక్క విశాలనయన
మోము మోమునఁ జేర్చి ముద్దాడి బతిమాలి
మెల్లనఁజను నొక్క పల్లవోష్ఠి
వీవి విప్పెడి జారునికరం బవలఁ ద్రోచి
పరుగిడు నొక్క శంపాలతాంగి

ప్రేమఁగౌఁగిటఁ జేర్చు ప్రియు నొప్పఁజేసిపో
వఁగఁ జొచ్చునొక్క బంభరసువేణి

తే. గీ. తమ మెసంగెడి సంకేతితస్థలముల
యందుఁ గ్రీడించు నభిసారికాంగనలకుఁ
ద్వద్యశశ్చంద్రికల కెంత తలఁకవలనెఁ ?
జిన్నరాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! 34

సీ. కఱవు దీఱఁగఁ జేయు కవనమ్ముగలవారి
చెఱఁగుబంగారు మా చిన్నరావు
శాస్త్రప్రసంగంబు చర్చింపఁగలవారి
చెంబులో ధనము మా చిన్నరావు
సంగీత విద్యా ప్రసంగంబు గలవారి
చేతిహోంబట్టు మా చిన్నరావు
అభినయమ్మున నేర్పు నందంబు గలవారి
సెజ్జపై పైఁడి మా చిన్నరావు

తే. గీ. అంచు జగములయందు నీ యశము చాటు
చున్నదయ్య ధరాపాల ! చిన్నరాయ !
సుఖముగానున్న దే మేగి చూచినాము
సరస తిరుపతి వేంకటేశ్వరుల మేము. 35

శా. కన్నారన్నినుఁ గన్న కామినులకున్ గంజాస్త్రుచే బాధ నీ
యౌన్నత్యంబు నుతించు సత్కవుల కాహా ! పారవశ్యంబఁ టో
చిన్నారాయనృపాల ! నీ వెవరి మంచిం జూచుచున్నావు ! నీ
పున్నెంబిట్లు జగత్ప్రసిద్ధి గనునేపుం గీర్తియున్ గల్గుటన్. 36

సీ. దీనాననమ్ముతో దేవనాధునివంక
లోఁతుగాఁ జూచెఁ బులోమతనయ
అభినయించుచుఁ జేతులాడక రంభయు
నిలువున నీరయి విలిచిపోయె

భూలోకమున కేను బోయి వచ్చెదనంచు
　　నెలవుగోరెను లక్ష్మి జలజనయను
నశ్వినీ నక్షత్ర మతిభీతిచేతఁ గు
　　టుంబవైరంబు చేటునకు జంకె

తే. గీ. నల జయంతుని యక్షరాజాత్మజాతు
　　సాంగమదనాశ్వినేయుల రంగుఁ గాంచి
　　స్వారికై నీవు వేంచేయుసమయమందుఁ
　　జిన్న రాయనరేంద్ర! సుశ్రీమహేంద్ర! 37

ఉ. మంగళరీతి గాయకసమాజము పాడెడిపాటలా! శుభా
పాంగతరంగరంగహృదయంగమసంగధనాంగనాకలా
సంగతులా! ముదంబెద కొసంగెడి పండితమౌళిగోష్ఠులా!
రంగగు నెల్లరీతులఁ గరమ్మను నీసభ చిన్నభూపతీ! 38

సీ. ఆకారసర్వస్వ మరయ జేజేరాణి
　　చంటివాఁ డొకఁడు నీవంటివాఁడు
అరిపురవిజయమ్ము నందెన్నఁ గొండరా
　　వింటివాఁ డొకఁడు నీవంటివాఁడు
ఆశ్రితావనకృప నరయఁ గల్మలకల్కి-
　　యింటివాఁ డొకఁడు నీవంటివాఁడు
ఐశ్వర్యవిభవమ్ము నరయఁగా నెక్కుడు
　　కంటివాఁ డొకఁడు నీవంటివాఁడు

తే. గీ. గాని యితరులు నీకెనగారు తలఁప
　　భాసురాకార! వేంకయాంబాకుమార!
　　రాజగోపాలవేంకటరామచిన్న
　　రాయభూపాల! విపులసామ్రాజ్యలోల! 39

ఉ. చందురుఁ డంద్రు కొందఱు, వసంతుఁ డితండని కొంద ఱందు రా
యింద్రుఁ డటంద్రు కొంద, అల యిక్షుశరాసనుఁ డంద్రు కొంద ఱీ

చందమునన్ జగమ్ము పలుచాయలఁ బోలిక లెంచుఁగాని నీ
యందమునన్ శతాంశమున కందరు వారలు చిన్నభూపతీ ! 40

సీ. "ఊరేగవలె నీ శుభోత్సవమ్ములవెంటఁ
గాళ్ళలోపల శక్తిగల ఫలమ్ము
చూడంగవలె నీదు సుందరాకారమ్ము
కన్నులలోఁ బాపగల ఫలమ్ము
ఎన్నంగవలె నీమహోన్నతవిభవంబు
కవులకుఁ గవనమ్ముగల ఫలంబు
పాడంగవలె నీదుపదముల నెంతయు
గాయకులకుఁ బాడఁగల ఫలమ్ము
తే. గీ. కాదె" యని భృత్యులును స్త్రీలు కవులు గాయ
కులును విన్నె నుతించుచుఁ గులుకుచుంద్రు
రాజగోపాలవేంకటరామచిన్న
రాయభూపాల ! విపులసామ్రాజ్యలోల ! 41

సీ. చెలికాని సూర్యునిఁజేరియు వితత ప్ర
భాయుక్తిఁ జెన్నొందఁ బరఁగువాఁడు
సంతతభోగీంద్రసహితుఁడయ్యును వింత
వింతకళలచేత వెలయువాఁడు
పగలు సంప్రాప్తింపఁ బలుమాఱు సాధించి
వితతతేజస్కుఁడై వెలుఁగువాఁడు
సతతసన్మార్గసచ్ఛాయ గల్గియు వర్ణ
సాంకర్య మెఱుఁగని సరణివాఁడు
ఆ. వె. అధికమిచ్చువాఁడు బుధసమ్మతుండును
క్షయము లేనివాఁడు కందుగనఁడు
చంద్రుతోడఁ బురుడుసల్పఁగవచ్చునే ?
చిన్నవన్నె ప్రోవు చిన్నరావు. 42

—• ఉత్సవమునుగూర్చిన దండకము •—

శ్రీ శ్రీమద్దిగ్గంటివంశాబ్ధి రాకాశరచ్చంద్రుఁ డేతాదృశస్ఫీతి భూతి ప్రకాశస్ఫురద్రోదసీమండలుం డంగనా పంచబాణుండు దానాంబుధారా సరిత్పంగ మారంగ దంభోధినుత్యుండు శ్రీచిన్నరాయావనీనాథుఁ డేటేటఁ జేయించు దేవీశరద్రాత్రి పూజామహం, బందులోనన్ విలంబ్యబ్దమందైన యీయుత్సవమ్మున్నుతింతున్ మహాదండకం బొండుసంధించి, దీనన్ దొసంగుల్ తొలంగన్ క్షమింపన్ బుధానీకమున్ వేఁడెదన్ ముందుగా నిందిరానందసంధాయకంబైన యాస్థానశాలన్ గొటాయీని నిర్మించి యద్దానికిం బైఁడిపత్రిమ్ములున్ గొమ్మలున్ బొమ్మలున్ జిత్రములేసి యంటించి వల్వెపులందున్ గొలల్గల్గి యెంతేని వింతం బ్రకాశించు రంభాతరుల్ నాటి యాకోఁటలో దేవదేవిన్ మహాదేవురాణిన్ దయావారిరాశిన్ దటస్థింపఁగాఁ జేసి బేతాళరూపంబు గాఁగన్ గటారిన్ హంటాయించి నిత్యంబు సత్యంబుగా సత్యమౌ బత్తి దళ్కొత్తఁగాఁ గొత్తగానంటిపండ్లుక్కెఱల్ చక్కెఱల్ నారికేళంబులున్ నాగవల్లీదళంబుల్ దళంబైన పూగంబులున్ జాతిపత్రీలవంగమ్ములున్ జాజికాయల్మొదల్గాఁగ సంభారముల్గూర్చి వారాంగనల్ రంగమం దంగ ముప్పొంగ నాడంగఁ బాడంగ రంగత్సురీ మంగళారంభ వాదిత్రముల్ చిత్రమై మోయఁగాఁ దేవియల్ సోనలం బూనఁగాఁ జాలు నాళుత్వమొప్పం గవిత్వమ్ము చెప్పంగనొప్పం గవిశ్రేష్ఠు లార్యామహాదేవిపైఁ బద్యముల్ సెప్పుచుండంగఁ బాండిత్యభూషా విశేషమ్ములం బోషితమ్మైన విద్వన్మహామండలం బర్థవాదమ్ము మోదమ్ముగాఁ జేయఁ బూజించు; తత్తద్విశేషమ్ములం జూచువారందఱున్ "చిన్నభూపాలరాయా ! మహారాజ ! నీయంతవా రెంత భూమిన్ విలోకించినన్ గానరా" రంచుఁ బంచన్మరందద్రవాసారపూరంబు తోరంబుగా సన్నుతుల్ సేయఁగా గేయమోదంబుచేఁ గొంతకాలంబు సంగీత మోదమ్ముచేఁ గొంతకాలంబు సాహిత్యమోదమ్ముచేఁ గొంతకాలంబు శాస్త్రార్థమోదమ్ముచేఁ గొంతకాలంబు హాస్యప్రమోదంబుచేఁ గొంతకాలంబు దాఁబుచ్చుచున్ నిత్యకల్యాణమౌ

రీతిగాఁ గల్యమందున్ దివారాత్రి మేకప్రకారంబుగా సౌను తోరంబుగా దేవి గారంబుగా నిన్న మున్నైనరీతిన్ దగన్ బుచ్చుచున్ వచ్చుచుం బోవుచున్నట్టి వారందఱన్ యోగ్యరీతిన్ సపర్యావిధానంబు గావించి యా చిన్నరాయండు దేవీమఖంబు న్నివర్తించి యామీఁద నుద్వాసనంబున్ దగన్ జేసి బేతాళునిన్ దేవినిన్ బల్లకీ నుంచి తా మంచి సింగారముం గారు బంగారురంగారు నంగీ చెలంగన్ దురాయీ శిరమ్మందు నూల్చొల్పి సర్పేషు గీలించి ముత్యాలహారమ్ములం దాల్చి బల్ హీరపుం బీరముం జూపఁగా నుంగరా లంగుళీసంగతత్వమ్ముచే మించి మించుం దుటా యించఁగా మించుగాఁగా నిలాయీలునున్ గాగడాలున్ సహస్రేందుకాంత స్ఫురచ్చంద్రికాబుద్ధి పుట్టింపఁగా బాణసంచాలలో గారకాయల్ తుపాకీలు నున్ గూడ బ్రహ్మాండ మంతన్ బగుల్పన్ మతిన్ గొన్ని మేల్తార జువ్వల్ దగన్ మిన్నుముట్టంగ దానన్ దగఁజా జాయమిణ్గుర్లు చూడన్ సమాలోకనాయాత దేవాంగనా హస్తవిభ్రష్టరత్న ప్రభాభ్రాంతిఁ జేయన్ సురేంద్రుండు దేవీమఖంబుఁజా బొనర్పంగఁ దా సంతసం బూనుచున్ గాన్కఁగా నంపు నైరావణంబో యనన్ దీపకాంతిన్ సుధాశుభ్రమై యున్నతం బైన యా యేనుఁగున్ బైఁడిపుట్టమ్ములున్ బైఁడికట్నమ్ములున్ దొట్టికట్టించి యామీఁద నంబారి వేయించి యద్దానిపై సూనబాణుండు నాఁగా నధిష్ఠించి యూరేగుచోఁ బౌరకాంతామణుల్ సంతసం బూరఁగాఁ జేరఁగా వచ్చి యీ యందమున్ జందమున్ సోయగంబున్ హొయల్ సూచి "యన్నన్న! కన్నుల్ జరేజమ్ములే మోము రాకాశరచ్చంద్రుఁడే చేతు లాజానులంబమ్ములే" యంచు "రావే" యటం "చక్కఁగా రేమిఁయుం జేయ దే నుందునే చెల్లెలా" యంచు "నప్పా" యటంచున్ దలన్ గొప్పు లల్లాడ వేణీ భరమ్ముల్ చలింపన్ గరంబుల్ పదంబుల్ గగుర్పాటు చెందన్ మొగంబున్ గురుల్ గప్పఁగా దప్పుకొంచుఁజా బదంబందు ఘల్ఘా రవం బొప్పఁగా నందియల్ మ్రోయఁగాఁ బైటలున్ జాఱఁగా వ్రీడచేఁ గప్పికొంచున్ "మరుండో! కుబేరాత్మజుండో! సురేంద్రాత్మజుండో! వసంతుండొ!" యంచున్ బ్రశంసించుచున్ మించి యాయించువిల్కాని

బారిం దగుల్కొంచు "నెమ్మోము డాల్ సూచితే? కౌను సింగారముం గాంచితే?" యంచు లోలోన నూహించికొంచున్ దదేకాతురాయత్త చిత్తమ్ముతో నత్తభీతిన్ విసర్జించుచున్ బ్రోవులై చూడఁగా నందులోఁ గొందఱత్తింటి కోడండ్రు భీతిం గృహం బేగఁగా నెంచ వారిన్ మఱిన్ గొంద "జేమే భయం బేల? పో చాలునే. యత్తలుం దాము కాలమ్ములో నీదృశంబుల్ విలోకింపఁ బోరే" యటంచు న్నివారింపఁగా నత్తయే తెంచి "మా కోడలిచ్చోటనే యున్నదా యింటికిన్ రాదు కాఁబోలు" నంచుఞా బ్రశంసింపఁగాఁ జూచి యాగుంపులో డాఁగుచున్ "లేదు లే" దంచు నవ్వారిచేఁ జెప్పఁగాఁజేయుచున్ జోడుగాఁగూడు పూఁబోఁడులన్ గూడుచున్ "జూడఁగా నందునీవే" యటంచున్ మఱిం గొంద "తీవే కనుం గొమ్మ పో" మ్మంచుఁ గోపించుచున్ దూరముం బోవుచున్ గోడలుఞా మేడలున్ గూడఁ దామంతఁదా మెక్కుచున్ నిక్కుచుం జూచుచుండన్ మఱిం గొంద అత్యంతవృద్ధాంగనల్ దీవన ల్సేయుచున్ నేసలం జల్లి నీరాజనంబీయఁగా నొక్క పద్మాస్య కే లొక్క పద్మాస్య గీలించుచున్ జూచుచున్నంత నూరేగి యాతేఁడు నారేయిలో నంత్యయామమ్మునన్ మేడలోఁ జొచ్చి యచ్చోట భృత్యుల్మనస్సందుందయా ర్చేయఁగా మంత్రులుద్యోగులున్ బండితుల్ సత్కవుల్ గొల్వఁగానింద గొల్వుండియందుష్ గవీంద్రుల్ నుతింపన్ మహావృద్ధు లాశీర్వదింపన్ సదా దాస దాసీజనంబుల్ పదద్వంద్వమున్ మ్రొక్కఁగాఁ "బుత్రపౌత్రాభివృద్ధి స్సదాదాన దాసీసమృద్ధి స్సదాభోగవృద్ధి స్సదాత్యాగబుద్ధి స్తథా స్తంచు దీర్ఘాయుర" స్తంచు విద్వాంసు లాశీర్వదింపన్ ముదమ్మొప్పఁగా బైఁడిపుట్టమ్ములున్ రాఁకవమ్ముల్ ధనంబుల్ మఱిం గొన్నిఁటిం దెచ్చి యాపండితస్వాములన్ భృత్యుల న్నిత్యసంతృప్తులన్ జేసి యీ వేల పాలించుచున్నాఁడు; తల్లీ! జగత్కల్పవల్లీ! సమస్తాయురారోగ్య సంపత్తులున్ బత్తు లేస్మల్ గుణాలంగనా దాసదాసీజనంబుల్ కడున్ వృద్ధిచెందంగ నేచేట విమ్నాఞా సమర్పించు మా చిన్నభూపాలుపై రాజగోపాలుపై దానరాధేయుపై రూపమూనాంకుపై శీతలామానదృష్టి ప్రసారంబు గావించి పాలింపవమ్మా!

మహాదేవ దేవీ! మనోహారిణీ! శాంకరీ! గౌరి! దుర్గే! నమస్తే నమస్తే నమః.

మ. అరవిందాసనుఁడాయు విచ్చి హరుఁడష్టైశ్వర్యముల్ గూర్చి తా
మరసాక్షుండు ప్రభుత్వమిచ్చి నిను సంపత్కాముని న్ లోకసుం
దరునిన్ బ్రోచెద, రాపయిన్ జనని నిత్యమ్మున్ జయంబిచ్చి ముం
దర నీకుం బొడకట్టు నిక్కమిది చిన్నారాయభూపాలకా! 43

క. అనుసంవత్సర మీరీ
తివి దేవీపూజ నేసి దేవీకరుణన్
గొనుమయ్య జయమ్ము సుద
ర్శనురీతిన్ జిన్నరాయ! సరసవిధేయా! 44

—• శ్రీ పిఠాపురపు మైనరురాజాగారిగెల్పు •—

సీ. భాష్యమయ్యంగారి పాండిత్యమునకు వ
న్నియదెచ్చె నీగెల్పు నృపవరేణ్య!
మంగయాంబాతపోమహిమమ్మునకు సాక్ష్య
మిచ్చె నీగెల్పు భూమీశమౌళి!
చెల్లయాంబిక నిన్నుఁ జేపట్టుటకుఁ బొల్పు
గల్పించె నీగెల్పు కాశ్యపీశ!
అల జగన్నాథరాయని పరిశ్రమము స
మర్థించె నీగెల్పు మానవేంద్ర!

తే. గీ. నీదుప్రో పాసపడియెడి నిఖిలరాజ
బంధువులకును గవుల కపారముద మొ
సంగె నీగెల్పు విజయానుషంగ! దివ్య
తేజ! శ్రీసూర్యరాయపృథ్వీబిడౌజ! 45

—• విరవ - రావు వెంకటసూర్యారావుగారు •—

మ. వినుమీ, వేంకటసూర్యరాయనృప! పృథ్వి న్నిన్నుఁ బోలంగ స
న్యుల కెవ్వారికిఁ గాదు, సత్కవులయందు న్నీకుఁ దా నింత యొ

ప్పునె యానందము! దృవ్యమెంత యిడినన్ బోకున్నె, యీయాదర
మ్మునకున్ గోటులు సాటివచ్చునె? ధనమ్ముల్ మన్ననందెచ్చునే?

మ. కలిమిన్ లేమిని నొక్కరీతిగను ప్రఖ్యాతి ప్రదంబైన జ్ఞా
నలతన్ బుష్పమమై సుధీజనుల నానందమ్మునం జూచు నీ
యలఘుప్రాభవ గౌరవాదికము లాహా పుట్టఁగాఁజేయు యో
గ్యులకున్ వేంకటసూర్యరాయనృప! నీకుం దుల్యులే యన్యులున్! 47

ఉ ఇచ్చిన నీయుకున్న మన మిచ్చి తనుం దగ గారవించు ను
ద్యచ్చరితుండు సత్కవులధాటికిఁ దాశెడువాఁడు గాక, పై
కిచ్చకమాడులుబ్ధమతు లెక్కడ? సత్కవులేడ! దృవ్యమా
సచ్చరితుం బొనర్చు! విలసద్యశ! వేంకటసూర్యరాణ్మణీ! 48

మ. ధనమున్నంతన సేవనీయుఁ డనినం దప్పౌ; నదేమన్న ర
త్ననివాసమ్ములు గావె వార్ధియు ధరాధ్రింబుల్, జనుం డెవ్వఁడే
నిని సేవించిన నించుకేని యిడునే! నీవంటి గాంభీర్యవం
తుని సేవించిన నెమ్మనంబు గడుసంతోషించు సూర్యాధిపా! 49

ఉ. తా వచియించుసంగతులు తత్పరుఁడై విని నిన్నుఁబోలె వి
ద్యావిదులన్ గరంచు నృపతల్లజుఁ డెవ్వఁడొ నూటికొక్కఁ; డెం
తే విభవమ్ముఁ గల్గియును దెల్వియుఁ దేటయు లేనివారిపై
లేవదు వాక్కు; లేచియుఁ జలించును వేంకటసూర్యరాణ్మణీ ! 50

ఉ. ఇంతకుఁ జెప్పుమాట యొక యింతయులేదు, మదీయకార్య మా
వంతయు లోటు లేక యెటులైనను దీరు, మనంబునందు న
త్యంతమునీకు నున్నతపదం బొడఁగూర్పఁగ నెల్లవేళ దీ
వింతు, నుతింతు నాసిరిని వేమరు వేంకటసూర్యరాణ్మణీ ! 51

—• కోటరామచంద్రపురం, కాకర్లపూడి రామచంద్రరాజుగారు •—

సీ. స్వస్త్యస్తు శ్రీరామచంద్రపురీనూత్న
సౌధనిర్మాణసంసక్త! నీకు
పుత్రిలాభశ్చ సంభూయాత్సుకవిరాజ
మాననామితకీర్తిమాన్య! నీకు

దీర్ఘాయురస్తు సందీపిత కాకర్ల
పూడివంశామృతాంబోధి! నీకు
జగదతీతాతిప్రశస్తి రస్తు ధరాసు
రాశీర్వచనసంభృతాత్మ ! నీకు
తే. గీ. సంతతారోగ్యబుద్ధిప్రశస్తిసీతి
భూతయ స్సంతు రాజేంద్రపుత్ర ! నీకు
అస్తు సత్సంగతిశ్చ విద్యాదరశ్చ
సత్కవివిధేయ ! శ్రీరామచంద్రరాయ ! 52

మ. సుకవుల్ రాజులఁ జూడకున్న యశ మస్తోకమ్ము గాకుండు, రా
జకులైకాభరణుల్ భవాదృశులు విశ్వాసమ్ముమై సత్కవీం
ద్రకదంబమ్ముల నాదరింపమియు నౌన్నత్యంబు దేకుండు, నిం
తకు నన్యోన్యసమాదరమ్మున యశంబౌ రామచంద్రాధిపా ! 53

మ. తమదాతృత్వముపేర్మి సత్కవులచిత్తం బెక్కఁగాఁ జేసి పూ
ర్వమహీశుల్ కృతులంది నేఁడును నవార్యంబౌ యశోరూప కా
యమునం బొల్చుటఁ జూడ రాజుల కవశ్యమ్మున్ గవీంద్రావన
ప్రమదంబున్ విధియించు నాగమముతేవన్ రామచంద్రాధిపా ! 54

చ. సదయుఁడు సద్గుణాకరుఁడు సత్కులజాతుఁడునైన రాజు భూ
విదితయశస్కుఁడైన సుకవి ప్రవరుండును గూడు టెన్నఁడో
యొదవెడిఁ దాదృశంబగు మహోదయవేళఁ దదాభిముఖ్యమున్
బొదలరె? రామచంద్రనృప! భూమిపతుల్ యశమిచ్చగించినన్. 55

ఉ. తొల్లిఁటినాఁటనుండి కవిధుర్వహులన్ గరఁగించు నేర్పువా
టిల్లి యశంబునం దగి కడింది రసజ్ఞత మించు మీరలే
యెల్లరఁబోలి సత్కవుల నేలకయున్నను రామచంద్రభూ
వల్లభ! వార లింకఁ గృషివర్తులు గావలెఁ బొట్టకూటికై. 56

ఉ. భూసురులందు హూణకలపొంతకుఁ బోక కవిత్వసత్కలా
భ్యాసము చేసి పేర్వడసి యాచకులై తిరుగాడువారికే

దోసము లేనివార లని తొల్లిఁటినుండి ప్రసిద్ధి గన్న మీ
రే శరణంబు గా కితరు లెవ్వరు సేవ్యులు? రామభూవరా! 57

చ. వెనుకటిరీతి రాజ్యపదవిన్ దమ రుండిరయేని మాకుఁ గా
లినడక లేల ఫాలమున లేఖన సేయు విధాత? రామచం
ద్రనరవరేణ్య! శిష్టకులతల్లజుఁడై తనరారు కృష్ణమూ
ర్తిని శిబికాధిరూఢు నొనరింపరె! మీపెదతాత లుద్ధతిన్. 58

మ. "శతఘంటాకవనమ్ము సల్పఁగల బల్ సామర్థ్య మున్నట్టి ధీ
యుతులౌవారికిఁ నైతముఁ గటగటా! యూరూర గోర్మృష్టియే
గతి యౌనే?" యను దుర్యశమ్మునకు మాకాలమ్ము గాకుండ ను
న్నతి కల్పింపఁగదయ్య! పాలితకవీంద్రా! రామచంద్రాధిపా! 59

చ. సరసుఁడు గర్వదూరుఁడు ప్రశస్తగుణాఢ్యుఁడు పూర్వరాజబా
స్వరుఁడు విశుద్ధవంశజుఁడు పండితమాన్యుఁడు రామచంద్రభూ
వరుఁడు యశోఽర్థియై యిపు డవారణఁ జేయఁగఁ జేసె నొప్పుగం
దిరుపతివేంకటేశ కవిధీరులచే నవధానసత్క్రియన్. 60

మ. తమపూర్వుల్ కవు లెంద ఱెంచఁ బనొ సత్కారమ్ములంజేసి ని
ల్పి మహీయస్త్వము గాంచి రంచు విని తల్లిలన్ యశంబున్ వహిం
ప మదిం గౌతుకమంది సత్కవుల సంభావింపఁగాఁ బూనె ను
త్తముఁడై యిప్పెడి రామచంద్రవిభుఁ డేతద్రీతి సామాన్యమే! 61

ఉ. అందముగల్గుఁగాక ధన మబ్బెడుఁగాక జగమ్ములన్ని యే
లం దగుఁగాక యెక్కుడు విలాసము చొప్పడుఁ గాక యేరికే
నిం దరమే నిగర్వగతి నెక్కొను? టయ్యది రామచంద్రరా
జేంద్రునియందుఁ బొల్పడియె, నియ్యది వంశపుఁజేవ గాఁదగున్. 62

చ. తెలియని ద్రవ్యవంతుల సుధీమణు లెల్లరుఁ గొల్చుకంటె మేల్
తెలివిచెలంగియున్ ధనములేని నృపాలుర మెచ్చులై ననున్
జెలువముదెచ్చు, మంచియును జెడ్డయు లేని యమాత్రురాలితోఁ
గలయికకంటె నేర్పరిని గన్గొనుపాటియె చాలు భూవరా! 63

—• క్రొత్తపేట, రామయ్యగారు •—

శ్లో. జీవనదాతాఽపిఘనోఽప్యపరిహతసత్పథప్రచారోఽపి
అచపలహృదయేనకథం రామయ్యారుణా సమత్వమపిగచ్ఛేత్.

శ్లో. మేఘద్వారే వాసో, జీవనదాతు ర్నవా సముచిత ఇతి
రామయ్యర్ నామాఽసౌ, జీమూతఃకోనసీమ్ని సంరేజే.

శ్లో. శిఖివరసంతుష్టికరో, వర్ధితశుభశాలికో దయాసారః
మితభాషిణా కథం స్యా, ద్రామయ్యారుణా సమ స్సజీమూతః.

శ్లో. రామయ్యర్ నామా నబ్, ద్విజన్మాఘీసమః కలాశాలీ
గోదావర్యోరుభయో, ర్మధ్యస్థాయాం చకాస్తి డెల్టాయాం. 67

—• గురువుగారు •—

మ. కలిమానంబొక యైదువే లరుగ నేకత్రిస్థసప్తగ్రహ
మ్ములకున్ శాంతి యొనర్చుచుౕ శ్రమలవమ్మున్ లేకయే బ్రహ్మమున్
గలిసెన్ బ్రహ్మగురూత్తముండు దశమీకంజాప్తవారంబు నా
ద్యలసత్పక్షముఁ గార్తికమ్మను వికార్యబ్దమ్మునుం గూడఁగన్. 68

—• తామరాడ. ఆరిశ జోగన్న •—

చ. పదముల సౌష్ఠవమ్ము కవివర్ణ్యములై తగు మంచిరీతులున్
మదికి ముదమ్మొసంగు రసమాధురియున్ దగునట్టివృత్తులున్
బొదలెడి కావ్యకన్యక నపూర్వకృపాపరమౌ మనీషతో
నిదె భవ దంకితమ్ముగఁ గవీంద్రహితమ్ముగ నిచ్చినార; మి
య్యది సరసప్రచారగతి నబ్బురపున్ యశ మబ్బఁజేయు న
భ్యుదయము గల్గఁజేయుఁ గడు యోగ్యతయున్ బ్రబలింపఁజేయు స
మ్మదము వొనర్చు సత్సభల మాన్యతయు న్నెగడంగఁజేయు ని
య్యది యది నాఁగనేమిటికి? సన్నిశుభమ్ములు దీనఁగల్గు; ని
ట్టిదియని లోనెఱింగి కడు శీఘ్రిగ దీనిఁ బరిగ్రహించి యె
న్నఁదగిన యాయువున్ సిరియు నందుము! యారిశజోగనాఖ్య! మ
మ్మెద మఱవంగఁబోకు మిదియే పదివేలకు నీకు దీవనల్. 69

—• మూడవ సంవత్సరం కిర్లంపూడి •—

ఉ. కోప మెఱుంగవైతి వొక కొండెమునన్ వినఁజాలవైతి వే
పాపపుఁగార్యముల్ సలుపు పద్ధతులన్ జొరవైతి యొక్కసం
బేపుగఁ గూర్పవైతి వొక యించుక గర్వము దాల్పవైతి పృ
థ్వీపతి వెట్టులైతివో ! సుధీజనచందన ! చిన్నరాణ్మణీ ! 70

—• పాలతేరులోని వివాహమును గూర్చి •—

సీ. ఇనుగంటివంశ పావనుఁడు శ్రీబుచ్చిత
మ్మయనృపాలకుఁ డతిమాన్యుఁడొకఁట
నీనృపాలునకు మాతృష్వసేయుఁడు చిన్న
రాయభూపతి కవిగేయుఁడొకఁట
వీరిబావయు మేటిధీరుం డుదారుండు
వేంకటరావు ప్రవీణుఁడొకఁట
తద్‌జ్ఞాతివర్గమై తనరారు దామెరా
న్వయజాతులైన భూవరులు నొకఁట

తే. గీ. వేడ్కఁ జెన్నార బరిణయవేదికావి
రాజమానగృహాంగణరాజమందుఁ
గూఁతులకుఁ బెండ్లిచేసె బల్ కోర్కె దనరఁ
గల్మి కనువగురీతి వేంకటవిభుండు. 71

ఆ. వె. ధీరులైన మేటిపాలుల సౌరు గం
భీరులయిన వెలమవారి తీరు
చారుతయును గల్గి సారెకుఁ జెన్నారుఁ
బాలతేరు మారు పూలతేరు. 72

క. ఆ జనపదమున సన్నుతి
భాజనమగు దామెరాన్వవాయమ్మున వెం
తే జననుతుండు భూసుర
పూజనరతుఁ డొక్క వెలమపుంగవుఁ డలరున్. 73

క. ఆవీరుపేరు వేంకట
రావందురు, తనయ లిర్వురకుఁ బరిణయమున్
గావింపనెంచి బంధుల
రావించె నతండు పృథుతరమ్మగు పేర్మిన్. 74

చ. సతియు సుతుండుఁ బుత్త్రికలు చారులుఁ బౌరులు గాయకుల్ బుధుల్
హితులుఁ బురోహితుల్ శ్రితు లహీనులు భృత్యులుఁ గొల్వ సోదరీ
సుతల వివాహపున్మహము చూడఁగఁ గిర్లమపూడినేత యా
ప్తతముఁడు బుచ్చితమ్మయనృపాలుఁడు వచ్చెను బాలతేరికిన్. 75

సీ. శతఘంటకవనంబు సారెసారెకు సల్పు
తిరుపతి వేంకటేశ్వరులతోడ
నమృతంపువెల్లి కర్ణములఁ బోయఁగజాలు
చకచకగల్గు గాయకులతోడ
దామెరాన్వయసముద్భవము చెందినసాధ్వి
బహుమాన్యయగు ధర్మపత్నితోడ
నాజ్ఞానుసారులై యలరు వందలకు వం
దలు దాసదాసీజనంబుతోడ

తే. గీ. రాజగోపాల వేంకటరామ చిన్న
రాయభూపాలకుండు సామ్రాజ్యలీలఁ
దా వివాహమ్మునకు వచ్చె నధికమైన
గౌరవమ్మును మోదమ్ము గడలుకొనఁగ. 76

ఉ. బెబ్బులిఁబోలువాఁ డహితభీముఁడు సౌమ్యుఁడు రాజమానితుం
డబ్బురమైన మేటిఘన మార్జనచేసినవాఁడు వేఁడుకన్
బొబ్బిలి నేలువాఁడు పరిపోషితభృత్యుఁడు వచ్చెఁ బెండ్లికై
నిబ్బరమైన పేర్మి ధరణీపరిణేత సిరంగ రాయొగిన్. 77

ఆ. వె. మఱియుఁ బెక్కుమంది మాన్యులు రాజబాం
ధవులు వచ్చి యొప్పుదవ్వులఁజేయు

కతనఁ బాలతేరు కళ్యాణ మలరారు
పూలతేరుభాతిఁ బొలుపుమీఱె. 78

సీ. విద్వద్వరేణ్యసంవిద్గోష్ఠి యొకచోట
నొకచోట శాస్త్రశోధకులగోష్ఠి
సుకవిరాజన్యభాసురగోష్ఠి యొకచోట
నొకచోట మంచివైణికులగోష్ఠి
పారిహాసిక పరస్పరగోష్ఠి యొకచోట
నొకచోట వెలవెలందుకలగోష్ఠి
వ్యావహారికవచఃపరగోష్ఠి యొకచోట
నొకచోట దాసికాయువతిగోష్ఠి
తే. గీ. దనరఁ దనరమ్యసంపద కనుగుణముగ
దామెరాన్వయవార్ధిసుధామరీచి
యైన వేంకటరావు ప్రఖ్యాతియెసఁగ
సరసగతిఁ జేసెఁ బెండిలి జనులు మెచ్చ. 79

క. తరువాత జన్యులందఱు
దరలిచనిరి పిదప సరసతరకవులగు నా
తిరుపతి వేంకటకవు లు
త్తరముగఁ జేసిరి శతావధానము పేర్మిన్. 80

— దామెర చినవెంకటరాయనింగారు —

శ్లో. అగదంకారశ్శిల్పీ సుకవిః కార్తాంతికశ్చమేధావీ
దామెర చినవెంకట రాడ్జయతి పయోరథసమాఖ్యకే గ్రామే. 81

శ్లో. జాతోఽయం కిల పద్మనాయకకులే గర్వం నధత్తే తథాఽ
ప్యాశీర్వాద మపేక్షతే సుకవి రప్యుర్వీసురాణాం ముహుః
ఈషచ్చ వ్యసనే మతిం నకురుతే విద్యాసు తత్త్వం తనో
త్యేష శ్రీకర దామెరాన్వయమణి శ్రీవేంకటాఖ్యోవిభుః. 82

శ్లో. జాతోఽపి పద్మనాయక, వంశేఽనూచానసంపదభిరామే
జ్ఞాతా యేనతు దైవీభాషా, తత్రాఽపి ప్రాప సుకవిత్వం. 83

శ్లో॥ శ్రీఫలసఫలీకరణే, చాతుర్యంయేన సాక ముత్పన్నం
యస్య శ్రవణే నామ్నః. ప్రకుపితరోగోఽపి రోగిణం త్యజతి. 84

శ్లో. సరసా సుగుణా సుపదా, సాలంకారా సువృత్తరీతిశ్చ
చకమే కవితాకన్యాఽయంకృతినం ప్రాక్కృతేన సుకృతేన. 85

శ్లో. య స్సిద్ధాన్త వ్యాప్తం; జాతకవిషయం సమ స్తమపి లేభే
అయ మయ మిద మితి యత్కిం, సర్వం ప్రాప్తం చ మతిమతాయేన.

ఉ. దామెరవంశసంభవుఁ డుదారగుణాఢ్యుఁడు చిన్నవేంకటా
ఖ్యామహితుండు మామహితు డార్జితసత్కవితాలతావృతా
రామవిహారహారి కృతిరంజితసూరి మనోంబుజోల్లస
త్స్వామి చిరాయురుచ్ఛ్రతరసంపదలన్ బొదలున్ నితాంతమున్ 87

సీ. సాహితీగ్రంథముల్ చర్చసేయఁగ నేర్పుఁ
గవనంబు మిగులఁ జక్కఁగరచించు
శిల్పవిద్యలయందుఁ జెల్వు మిక్కిలిగాంచు
వైద్యమ్మునందుఁ బేర్వాసిఁ జెంచు
వినయమ్మునందు మేటి నయమ్మునందు మా
ర్దవమందు నెక్కుడౌ రాణఁగాంచు
తనకన్న గొప్ప విద్వద్వరేణ్యుల సంశ
యంబులు వివరించి యడుగుచుండు

తే. గీ. గర్వదూరుండు సంపత్ప్రకాశమానుఁ
డవనిపాలక బాంధవుఁ డమల దామె
రాన్వయాభరణంబు శ్లాఘ్యతరకీర్తి
పటుతరవిభుండు చిన్న వేంకటవిభుండు. 88

— గజపతినగరము —

సీ. ఆర్జించుచున్నాఁడు యశము రాజులకన్న
నధికమౌ ధర్మకార్యములొనర్చి

పోషించుచున్నాఁడు బుధులను గవులనుఁ
దగుగతి నెలకు జీతములొసంగి
చెప్పించుచున్నాఁడుఁ శ్రీమించు నాటక
ప్రకరంబు తగునట్టి బాలకులకు
పెట్టించుచున్నాఁడు ప్రీతిమైఁ దనసత్ర
మందు శాల్యోదన మతిథితతికి
తే. గీ. నెవరినెటుగారవించిన నెసఁగునో య
శంబు తద్రీతి నెఱిఁగిన సజ్జనుండు
ఘనుఁడు పొట్టాన్వయుం డెఱకయ సుతుండు
హాళిఁజెన్నారుఁ బెద్దచ్చనార్యుఁడెందు. 89

—• విశాఖపట్టణం—విక్రమదేవవర్మగారు •—

సీ. ఓఢ్రభాషయుఁ దెల్గుహూణభాషయుసంస్కృ
తమును నేర్చినయట్టిధన్యతముఁడు
అన్ని భాషలయందు ననుగుణంబగురీతిఁ
గవిత చెప్పఁగ నేర్చుఘనయశుండు
జయపురం బేలురాజన్యుల సద్వంశ
మందు జన్మించిన యనఘమూర్తి
దృశ్య ప్రబంధమ్ము లెన్నెని రచియించి
ప్రజలకుఁజూపించు భవ్యయశుఁడు
తే. గీ. భూవరాగ్రణి విక్రమదేవవిభుఁడు
మమ్ము సభఁజేయ రావించి మన్నె నేఁడు
గాన మిమ్మిటఁ దన్పు భాగ్యమ్ముగల్గె
సరసతరచర్యులార! యోసభ్యులార! 90

—• వీరవరము—తోఁట సర్వారాయఁడు •—

చ. సరసత నాత్మకూరు నృపసత్తముఁ డొక్క ప్రబంధరాజమున్
విరచనచేయఁజేసి యది విద్వదుపాస్యమటంచు మెచ్చి యా

దరమునఁ జంద్రహారములు దివ్యము సేలువ లట్టులుండ ది
క్కరి కెనయైన యేన్గుపయి గ్రంథముతో మముఁ బాదుకొల్పి త
త్పురవరమేగఁజేసి యిడె భూమియుఁ గొండొక శాశ్వతమ్ముగా
వెరవరి వాడరేవుకులవేంకటరత్నము కబ్బమొక్కఁడీ
తిరుపతివేంకటేశ్వరసుధీద్వయిచేఁ గృతిగాంచి ద్రవ్య మ
స్థిరమని యెంచికొంత యది తేఁకువనిచ్చియు నంతఁ బోక సు
స్థిర యొకకొంత యిచ్చెఁ; గడు దెంపరి యారిశ జోగనాఖ్యుఁ డి
క్కరణిఁ గృతింగ్రహించి కలకాలము కీరితి నిల్చునట్టుగా
ధరణి యొకింత యిచ్చుటకు దానపుఁబత్రము వ్రాసియిచ్చె; శ్రీ
కరుఁడు జమీనుదారుఁ డొకకబ్బము వేంకటకృష్ణరావు దా
విరచనచేయఁజేసె నదివిన్కలిసేయుదు మెల్లినేఁట, నా
పరసవతంసుఁడున్ వెస నొసంగఁదలంచియ యున్నవాఁడు మే
ల్తరమగు భూమిఖండ; మమలాపురవాసియు న్యాయవాదియున్
ధరణిసురాగ్రగణ్యుఁడును దాతయు శ్రీ యివటూరి వంశ్యుఁడున్
గురుమతి యయ్యనాభిధుఁడు గొండొకకబ్బముగోరి ''మీకు నిం
జరమను మీనివాసముకు సన్నిధి నొప్పెడి కాటరేవు కో
న రస నొసంగి గ్రంథము గొనంబడు కాలమునందు మిమ్ము బం
గరుపనిపల్లకీ నునిచి గ్రామము నేగఁగఁజేయువాఁడ'' నం
చు రహిఁ బ్రతిజ్ఞచేసెఁ గడుశూరుఁ డుదారుఁడు మేటి సద్గుణా
కరుఁ డినుగంటివంశతిలకంబగు చిన్ననృపాలమౌళి మొ
క్కరమున మొన్నఁగోరెనొక కబ్బ, మతండది స్వీకరించువే
ళ రస నొసంగుటన్న నొకలక్ష్యమె ? యీనృపమౌళి 'కిచ్చుచోఁ
గరమున కెమ్ము లే' దనెడి గౌరవ మెవ్వ రెఱుంగ ? రింతకున్
జరణభవాగ్రగణ్య ! సరసా ! వరసాహితి ! సర్వరాయ ! సు
స్థిరమగు కబ్బమిప్పగిదిఁ జేకొనినందుకు నీవు మాకు నుం
దిరమగు వృత్తికొంత యిడితేని యశంబు కృశంబుగాక యీ

ధరగలయంతకాలమును దా నెగడున్; మఱియొక్కమాట, భూ
సురులకు నాస యెక్కుడనుచున్ మదినెంచెదవేమొ! దీని కి
త్తఱి నిటుసేయుటే యుభయతారకమంచు వచించినార మం
దఱివలెఁగాక యెక్కుడగుదవ్యము భూమియుఁ దెల్వితేటలున్
సరసతయున్ మహాకవనసారమెఱింగిన సాహితీధురం
ధరతయుఁ గల్గు నీకిది మనమ్మునఁ దోఁచకయున్న నన్యు లె
వ్వరికిది దోఁచు? నిక్కవులపై ఖరి నీ కెఱుఁగంగరానిదే! 91

—• విక్టోరియామహారాజ్ఞిగారి మృతివిషయము •—

చ. కడుపెఁడు బిడ్డలం గనుటెకాక జగంబులనెల్ల నేలి యే
ల్బడి నిసుమంతయైనఁ బొరపాటనునట్టిది లేక లోకులం
గడుపునఁగన్న వారిగతిఁ గాచెడు "నెంప్రెసఫిండియా"ను గో
ల్పడితి మటన్నవార్త దెలుపన్వలసెంగద, నేఁటి కక్కటా! 92

మ. "పసిదంచుం దలపోయ కుద్ధతధరాభారంబు మోయించినా
రిసిరో! భూజనులం గరంచుపని మేలే!" యంచుఁ బట్టాభిషే
కసమారంభమునంద యేడ్చిన దయాక్రాంతాత్మ యేతాదృశ
ప్రిసువింకన్ మనయిండియాకు లభియింపన్బోదు నిక్కంబుగన్. 93

సీ. నెలలేగుభూమి రోజులకేగుగతి ధూమ
శకటంబు లేనాఁడు సంభవించెఁ
బరదేశములవార్తఁ బడయు విద్యుత్తంతు
సంపత్తులేనాఁడు సంభవించె
వర్ణభేదములేక పలువిద్యలను నేర్పు
చదువుబళ్ళేనాఁడు సంభవించె
మగవాండ్రితో సమంబుగ నాఁడువాండ్రకుఁ
జదువుకో లేనాఁడు సంభవించె

గీ. నువ్వు పండని భూముల కప్పు లొదవి
శాలిధాన్యంబు లేనాఁడు సంభవించె

నట్టి యెంప్రెసు విక్టోరియామతల్లి
మరణవార్తకుఁ గడుపులు చెఱువుగావె? 94

మ. విశదస్వీయగుణాభిరామయగు మావిక్టోరియారాజ్ఞి మే
లశలన్ నైఁపక చేతఁగానిపని యేలా చేయఁజేయాడెఁ? జే
యి శిలాకారముగాక, క్రీస్తుశకమద్ధ్యైకాధికేకోనవిం
శశతాబ్దంబ! భవన్ముఖం బిల నిఁకేచందాలుఁడుం జూచునే! 95

మ. "చదువుల్ నేరిచె నేల నాల్గు చెఱఁగుల్ శాసించి పెంపొందె న
ర్వదియైదేండ్లు, తనూజులం దనుజులం బ్రాపించె నింకేమిటం
గొద వీరాజ్ఞి" కటంచు లోదిటముగై కొన్నన్ భవత్ప్రేమముం
బ్రదయత్వంబుఁ దలంపఁగాఁ గడుపు చుమ్మల్ చుట్టు విక్టోరియా! 96

సీ. ముదుకనై తినిరాజ్యమును మోయుటిఁకఁగష్ట
మనియెంచి స్మరణీయవై తివొక్కొ
చెలికత్తెయగు 'చెర్చియలు' ముందుగ గతించె
ననియెంచిచేరంగఁ జనితివొక్కొ
భువికిఁజేసినమేలు దివికిఁగూడ నొనర్పఁ
దలఁచి యీ కాయంబుఁ దొరఁగితొక్కొ
యఱువదేండ్లు గతించినట్టి పెద్దకుమారు
ధరణియేలింపఁ గన్గొఱఁగితొక్కొ

గీ. అంచుఁబలువురు దలపోయునట్టి యూహ
లన్నియు నబద్ధ మీ యిండియా యొనర్చి
నట్టి దురదృష్టమే నిన్ను నట్లుచేసె
నంచుఁ దలఁచెద విక్టోరియామతల్లి! 97

సీ. మనుమరాండ్రును మన్మలును సంతుఁగనునట్టి
భాగ్యంబుఁగనుదాఁక బ్రదికియుంటి
వెగ్గొనర్చినవారు నుగ్గునూఁచముగాఁగ
సంగ్రామములయందు జయముఁగంటి

కలకాల మల్లతమ్ములవిందు పెంపొందు
దీవులేలి ప్రతిష్ఠఁ దెచ్చుకొంటి
వా సేతుతుహినాచలావనీ స్థలికెల్లఁ
జక్రవర్తినివై యశంబుఁ గంటి
గీ. వెందునేనియుఁ జూడ నీకేమి కొదవ
శాంతనవమూర్తి వనుటకు సాక్షిగాఁగ
మకరసంక్రాంతికై వేచి మాయమైతి
వకట ! కరుణకు దూరంబవగుచుఁ దల్లి ! 98

సీ. పసితనంబునఁ దల్లిపనుపుఁ జేయుచు మెప్పు
గాంచిన కన్యకా గౌరవంబు
తారుణ్యమున భర్తృదాసివౌచుఁ బొగడ్త
గన్న జాయాపత్య గౌరవంబు
వైధవ్యమునఁ బతివ్రతవై మహాకీర్తి
గైకొన్న జితమనో గౌరవంబు
వార్ధక్యమునఁ బుత్రపౌత్రదౌహిత్రాది
గణ్యతఁ గాంచిన గౌరవంబు
గీ. నొజ్జలకునెల్ల నొజ్జయై యొక్క ధర్మ
శాస్త్ర మొనరింపఁగాఁజాలు జనులకొఱకు
మేలుబంతివి మా నీవె స్త్రీలకెల్ల !
నో మహారాజ్ఞి ! విక్టోరియామతల్లి ! 99

సీ. "ఏను క్రీస్తుమతంబుదాననైనను మీ మ
తములజోలికి రాను, తాము పదవి
నందఁగాఁ దగువారలైన నిచ్చెదఁ గాని
తమతమ వర్ణభేదంబుఁ జూడ
వీరు మావా రను భేదంబుఁజూడ కం
దఱిపై సమంబుగా దయ నునిచెద

మీ తృప్తి నాతృప్తి మీవృద్ధి నావృద్ధి
మీకృతజ్ఞపుజేఁత నాకు గొప్ప

తే. గీ. బహుమతి" యటంచు మున్ను మా పదమునకును
జక్రివర్తిని వగునాఁడు సలిపిన ప్రీతి
నలకు నలుసంత భేదంబు గలుగకుండ
నవని భరియించి మిగుల కృతార్థవైతి
వోమహారాజ్ఞి ! విక్టోరియామతల్లి ! 100

ఉ. వారనికాలధర్మ మనివార్య మటంచు దలంచినం గుణో
దారుల పూర్వరాజుల కథల్ దలపోసిన నీవయస్సమా
చారముఁగన్న నీదగు యశంబునువిన్న భవత్కుటుంబ వి
స్తారముఁజూచినన్ భవదుదారభుజాబలసంచితావనీ
సారముఁజూడ జాతకవిచారముఁగూడదు గూడిమాడ నీ
మారకమంతగాఁగ బెడమార్గములోనికి మామనంబులం
జేరఁగనీక మేటిధృతి చెందఁగఁజేయును గాని, నీవలెన్
ధారుణి యేని సుంతయును ధర్మముఁదప్పక సౌఖ్యరాశిఁ బెం
పారఁగ మర్త్యకోటిఁ గడుపారఁగ గాంచిన తల్లిపోలికన్
గూరినపేర్మిఁ బ్రోచుచు నకుంఠితమౌ కరుణారసంబు నే
కూరఁగ వారికిం బొడము కోరికలెల్లను దీర్చునట్టి యా
కారము మాకిఁకెట్లు దొరకంగల దన్న విచార మెట్లు చ
ల్లారును తల్లి! నీ వహరహం బుపదేశముఁజేయు యోగ్యతల్
కారుణికత్వ బుద్ధికుశలత్వములం బడి పెద్ద పెద్ద నీ
కూరిమిబిడ్డ మాయెడలఁ గూర్మియుఁ బేర్మియుఁ జూపి యెప్డు నీ
తీరుపు తప్పకుండఁ గడతేర్చినఁ దాదృశలోపమెల్లఁ బో
కారునుగాని, యింతకు నొకండు కొఱంత యదేమి చేసినం
దీఱదు తీఱ దేదియనఁ దెల్పెదఁ, దొల్లిటిరాజచంద్రు లే
వారును జేయలేని సిరిఁ బండఁగఁజేసి సమస్త సౌఖ్య సం

ఖారము మీఱఁజేసి యశుభంబులు వాపి శుభంబులిచ్చియుం
బేరు సమస్త దిక్కులను బెంపువహింపఁగ నేలినట్టి నీ
కారహి నిండియాను గనునంతటి పుణ్యము, నిన్నుఁజూచి పెం
పారుట యిండియా ప్రజకు నాస్తియొనర్చిన మాలదైవముం
దూఱని వారలుందురె! మనుష్యుల కాయువు వందయేండ్లుగా
సారససంభవుండు మితిఁ జక్కఁగ జేసియు నట్లు నీకుఁగా
నీ రచియింపఁడయ్యె; గణనీయమె తన్మితికాల? మేలొకో
దారుణమైన గండములు దాపరమైనను వాని నెల్లఁ బో
కారిచి నిన్నుఁబ్రోచిన జగంబుల పుణ్యము నేఁడు నేడకుం
జేరెనొ? మాపయిం గరుణ చెల్లుట న్యాయమె? 'లే' ట్పదంబు సే
కూరెనె? నీకునుం బ్రజలకున్ ఋణబంధము తీఱిపోయెనే?
గౌరవ మిట్టులెవ్వరికిఁ గల్గెను రాచవెలందు లందు? వి
క్టోరియ! ముగ్గి రాలిన పటోలఫలంబన వ్రగ్గితే! త్వదా
కారము లండనందుఁ గలకాలముఁ జూచెడి జాతివారికిం
దూరమునయ్యెనే? యకట తోరముగాఁ దలపోయ మేమె య
వ్వారలకంటె బల్ సుకృతవంతుల; మేమనఁగా, భవచ్ఛుభా
కారము మున్నుగన్నటులె కాంచుచునుంటిమి చిత్రిమంద; వి
స్తారముగాఁగ లండనునివాసులపై దయగల్గుదానిఁగా
మోఱకులెల్ల నిన్ననుట మోసముగాని నిజంబుగాదు, మా
వారలపైని నీకు దయ వాస్తవ మెక్కుడు; గావునం ద్వదా
కారము మేముచూడఁగ నొకప్పుడునైనను నిండియాకు నీ
చేరమిగల్గె మాప్రథమసిద్ధికి నేఁటికి మాకు లోటు ల్వే
దూరక నీదు సద్గుణసమూహము లోనఁదలంచి యెన్న నే
వారలువింద్రు? మానవులవాక్కులు నీదరి కెట్లువచ్చు? నీ
చేరినలోకమందు గుణసింధులతో సహవాసమబ్బ చే
కూరుసుగాత నీకు సుఖగుంభము, నీ పెదబిడ్డ మేలుకె
ల్లారసి యేలుఁగాత జగమంతయు, మా ప్రజకెల్ల మేలు చే

కూరునుగాత! నేఁడు దొరకొన్న మహాసమరంపు వేఁడి చ
ల్లాఱునుగాత! నీకొడుకునందు భవత్ప్రభుశక్తి కీర్తియున్
జేరునుగాత! నీకొడుకు నీవలె హాయిఁగఁ బెక్కువత్సరాల్
ధారుణి యేలుఁగాత! కుశలంబగుఁగాత భవత్కుటుంబపు
న్వారలకెల్ల! ధర్మములు వర్ధిలుఁగావుత! లేకపోవుఁగా
కేరికి నీవులేనికొఱ వెన్నఁడు నెంత్రపెసఫిందియామణీ! 101

—• పోలవరపు జమీందారుగారు •—

మ. సరిగా గోడలు లేచె ద్వారములతో సత్యవ్రతా! యింకఁ బై
బరువేగా తరువాయి, దానికగు కల్పన్ వేగ నిప్పించినన్
ద్వరలో లోఁగిలికట్టికొంట యది సందర్శించు; మీదైన స
త్కరుణాదృష్టికిఁ బాత్రిభూతులకు నేతత్కార్యమెంతో నృపా! 102

శా. పాకన్ వాసమొనర్చు టొక్క టటుపై భార్యాసమాయోగ మె
ట్లో కాలమ్మను గడ్పుచుండుటకునై యూహింపఁగా నంత వ
ర్షాకాలమ్మరుదెంచె నీపయి నుపేక్షం జేసినన్ గోడ లే
వీఁకన్ నిల్చును? గృష్ణరాయనృపతీ! వేవే గటాక్షింపవే! 103

క. కృతులన్ నిర్మించుటకుఁ
శతావధానములు సారెసల్పుటకున్ మా
ప్రతినలు చెల్లింగానీ
యితరకృతులు మాకు శక్యమే? నరనాథా! 104

మ. ధనవంతుండవు రాజ్యవంతుఁడవు విద్యావత్తయున్ రూపవ
జ్జనమాన్యత్వము గల్గుప్రోడవు నినున్ శ్లాఘింపఁగానేల? నీ
యనురాగమ్మున కాలవాలములమై యానందమున్ జెందు మా
జననమ్మున్నుతియించుకొందు మిఁకఁ గృష్ణారాయ విద్వత్ప్రభూ! 105

చ. తిరిగితిమెల్లదేశము లదే పనిగా నిఁకమీఁదఁ దేశ సం
చరణ మొనర్పఁగా విసువు చాల మనంబునఁగల్గెనయ్య! యీ
తిరుపతివేంకటేశకవిధీరుల నొక్కెడ నుండఁ జేసి భూ
వరసభలందు ఖ్యాతిని నవశ్యము చెందుమి, కృష్ణభూపతీ! 106

—• ఉర్లాము •—

శా. శ్రీవయ్యూరు గడు వాసిఁ జెన్నలరి కాశీసేతుమధ్యస్థవి
ద్యావంతుల్ నుతియించుకీర్తిగను నీ యౌన్నత్యమున్ విన్నచో
నేవారే శిరసావహింతు, రిది యేమీ క్రొత్తయే! మున్ను శ్రీ
దేవిన్ విన్నది లేదొ! రాణి వినమో! శ్రీల్గారె! లక్ష్మ్యంబికా! 107

సీ. నీయన్న వియ్యన్న నిరుపమానప్రౌఢి
నఖిలభాషారూఢుఁడైనవాఁడు
నీమామ బసవరాజీమహీతలమెల్లఁ
బేరుఁజెందిన జమీందారుబిడ్డ
నీభర్త విశ్వనాథాభిఖ్య సార్థకం
బుగఁ జేయఁజాలు సత్పుణ్యశాలి
నీతమ్ము లెల్ల విఖ్యాతిచేఁ జెన్నొందు
నీతిగల్గిన మహానిపుణమతులు

తే. గీ. పుట్టినింటను నత్తింట నిట్టి నట్టి
దని వచింపఁగరాని ప్రఖ్యాతి నొప్పు
నిన్నుఁగొనియాడ తరమె? విస్ఫురితకీర్తి
లక్ష్యశశిబింబ! యోమహాలక్ష్మమాంబ! 108

ఉ. ఎన్నిదినాలనుండియొ యనేకులు పండితు లెన్న నేఁటికిన్
గన్నులకర్వ్వదీలఁ గనఁగాఁ గలిగెన్ మది సంతసించె నే
విన్నటువంటిదానికిని వేఁడుక నిప్పుడు గన్నదానికిన్
జెన్నుగ నొక్కటాయె నిటు చేకుఱు టబ్రము లక్ష్మమాంబికా! 109

ఉ. ధారుణి నచ్చటచ్చట బుధప్రకరమ్ములు మెచ్చు మేల్ జమీం
దారులు పూరుషాకృతులు దాల్చినవారలలోనఁ గల్గి ర
వ్వారికినైన నెల్లరకుఁ బండితరీతు లెఱుంగ రావు నీ
కీరుచి సత్కవిత్వమున నీశ్వరుఁడే యిడె లక్ష్మమాంబికా! 110

మ. చదువన్ శక్యమె కావ్యపంచకము ? స్వచ్ఛంబైన ధీశక్తి యె
ట్టిదియున్ గానియెడన్, బురాణపరిపాటిన్ సంస్కృత మ్మాంధ్రమున్
ముదమొప్పన్ విని తద్విశేషముల కామోదించు నేర్పన్నచో
సది పైపైఁ బడియున్నదే ! తదితరం బైశ్వర్యమే ? లక్ష్మమా ! 111

క. వేదాంతమనిన నెట్టి మ
హాధీరులకేని దెలియు టది దుర్లభ; మే
లా దానియందు లక్ష్మాం
బా ! దార్ఢ్యము నీకుఁ గలిగెనని మది నెంతున్. 112

ఉ. శ్రీపరిపాలనమ్ము గల చిన్నజమీనులఁ బెద్దచోట్లు నె
న్నోపరికించి చూచితిని నొక్కెడ నిక్కడఁ గల్గునంత వి
ద్యాపరిశీలనంబు మఱి దాతృతయున్ గనఁ జోల; దింతయున్
శ్రీపతి సాక్షి నిక్క, మిటు చెప్పుట నీస్తుతిగాదు, లక్ష్మమా ! 113

తే. గీ. ఏను జూచినరాజులందెల్ల నొక్క
విజయనగరమహారాజు వేత్త; రెండు
పోలవరపుజమీందారు, బూటకమ్ము
గాదు, స్త్రీలను నీకన్న లేదు, నిజము. 114

సీ. అధికాన్నదాత్రివై యలరారుటకు నీవు
తగ నిల్పినట్టి సత్రమ్ము సాక్షి
బంధుగులం బ్రోచుచుందు వన్నందుకు
సవిధాన నుండు బంధువులు సాక్షి
విద్యాభివృద్ధి సల్పెద వన్నమాటకుఁ
బురిఁ గలార్థులును విబుధులు సాక్షి
కవులయం దాదృతి గలదాన వనుట క
స్మద్దత్తమగు బహుమతియె సాక్షి

తే. గీ. వైదికులఁ బ్రోతువనుటకు వారె సాక్షి
యింతమంది పోష్యులు గల్గు టెంతవారి

కబ్బు! నొకపొట్ట నించుకొం టబ్బురంబె!
లలితసుగుణావలంబ! శ్రీలక్ష్మమాంబ! 115

క. ధన మిచ్చెడు నృపతులు నూ
ర్లును వేలును నుంద్రుగాక, రుచియింతురె యీ
తనిశక్తి యిట్టి దని యెఱిఁ
గినవారిం బోలెఁ! గవులు కేవలధనులే? 116

క. సంతోష మయ్యె మది కా
ద్యంత మ్మవధాన మరసి యంతటితోఁ బో
కెంతటి శక్తియొ యెఱుఁగుట
వింతా, మఱి వింతకన్న వింతా! చెపుమా! 117

—• బహుమాన సమయమునఁ జెప్పినవి •—

శా. బాలత్వమ్మననే ననున్విడిచి తాఁ బైకేగె దారిద్ర్య మే
మూలో కొంచెము డాఁగియుండినను నీమూలాన నీనాఁటితోఁ
దూలెం దా నదియున్, మనమ్మునకు సంతోషమ్మ వాటిల్లె నే
లా లక్ష్మీకృపగల్గు పండితుల నాలంబించు దారిద్ర్యముల్! 118

శా. వారుం బండితు లేముఁ బండితులమై వర్తించు టట్లుండఁగా
గారాబంపుఁ గవిత్వమల్లు టతిశీఘ్రమ్మందులో ధారణా
ధార మ్మేర్చుట యిన్నిగల్గుకతనన్ బైవారికిన్ మాకు నే
లా రాజిల్లెడి నంతరం బని మహాలక్ష్మ్యంబ! వారొప్పరో? 119

ఉ. వారలొనర్చునట్టిపని వారక యేనొనరించి సర్వముం
దీఱుపనేర్తు, నాపనిని దీర్పఁగ వారికి శక్యమే? మహా
ధీరతగల్గు మీమదికిఁ దెల్లముగాని దొకఁడు గల్గునే!
వారిని మమ్ము నొక్కటిగఁ బార్థివులెవ్వరు చూతు రంబికా! 120

క. ఈలాటివార్త్రి కమ్మన
కే లక్ష్యము చేసి మేము కేవల మేగం
జాలుదుము కాని చూడు మ
హాలక్ష్మ్యంబా! యితరము లరయుట కలదే? 121

ఆ. వె. ఆత్మకూరురాజు నడిగిన నిచ్చె మే
ల్వసతి రెండునూర్లు వచ్చునదియు
నొక్కయేటనయిన నొట్టుచుమీ ! శిస్తు
కొఱకు నేగలేదు కువలయేశ ! 122

తే. గీ. ఒక్క కిర్లమపూడికిఁదక్క వార్షి
కమునకంచును మే మెటకయినఁ జనుట
యిప్పటికిలేదు పండితులెల్ల వచ్చు
స్థలము గాన నిచ్చటికి రాఁ దలఁపుగలిగె. 123

చ. ఒక నెలరోజు లేము మఱియొక్కెడ కేగిన రెండు మూఁడు పే
రుకలుగు సత్సభల్ జరుగు రూపికలున్ ద్రిశతమ్ము వచ్చు వా
ర్షికమవఁ బక్షమౌ నదియుఁ జేమునఁగన్ దగ లేకయున్నచో
నకట ! వృథాప్రయాస మని యాత్మ మమున్ వెనుదీయఁజేయదే.

చ. "నెలకొక మూఁడువందలను నేమమ్మై మఱి మీరు తెచ్చినన్
గలుగును వేలసంఖ్యకు నఖండధనం" బని యందురేమొ, నేఁ
బలుక నసత్య, మిప్పటికిఁ బ్రాఁతధనం బొకచిల్లిగవ్వయే
నలవడ; దున్నచోఁ బయన మౌటయు కల్గదు లక్ష్మమాంబికా ! 125

క. అడిగితి నటంచు మదిలో
బెడిదమ్ముగ నెంచుకొనక పేశలకరుణన్
దడిసినమదితో మము నె
ప్పుడు చూడఁగ వేఁడికొందు మమ్మాటికినిన్. 126

క. అడుగుట మంచిది కాదని
నొడివి యడుగు టంతయుక్తి నొప్ప దనుచు మీ
రడుగ రొకవేళ నడిగిన
"నడుగనిచో నమ్మ పెట్ట" దను టెఱుఁగనిదే. 127

క. అక్షరలక్షలు తెచ్చెడి
దక్షత సుకవులకె కాక తక్కొరులకు లే

దీక్షింపు లక్ష్మమాంబ ! వ
లక్షయశోనిర్మలితకలానిధిబింబా ! 128

—• ఈ ఉర్లామునందే దివాన్ గారింటి విందులో చెప్పిన పద్యము •—

మ. కురపాౕమందు దివానుతండ్రి మఱి నీ కుర్లామునం దత్పదం
బరవిందాసనుఁ డిచ్చె నందుకు ఫలంబై యొప్పు పేరొప్పునన్
వరవిద్వత్కవిరాజనుత్యయశమున్ బ్రాపించి నీదౌ సమా
ఖ్య రహిన్ సార్థముచేయుచుంటివి ప్రకాశా ! బోడపాడన్వయా ? 129

—• ఆరోజున నీయన చెప్పించిన పద్యము •—

ఆ. వె. వారు వీరు నెల్లవారును గుమిగూడి
శతవధానకవికి జడతగూర్ప
గాఁ బ్రియత్నమంది కడకుఁ దద్బుద్ధివా
త్రప్రచలితశారదఘను లైరి. 130

—• మందసా సంస్థానం దివాన్ గారిమీఁది పద్యములు •—

చ. బలమగు పాండితిం దగు దివానఁట యెవ్వరి కెందునేనియుం
దలఁకని సత్కవీంద్రుఁ డఁట దాతలకెల్ల శిరోవతంసమై
తెలివియుఁ దేటయుం గలుగుధీరుఁడు రాజఁట యిట్టికూట మో
చలపతిశాస్త్రి ! యెక్కడు యశమ్ము గడింపక పోవ నేర్చునే ! 131

తే. గీ. అపుడు మీరాజుఁ జూడ మే మరుగుదెంచి
నదియు మొదలీనృపునిఁ జూడ నాత్మ నెంత
యేని యూహించి యాఁతేండ్లకిపుడు రాక
నృపునిఁగన కేగుటెట్లు ? చలపతిశాస్త్రి ! 132

క. సరసులగురాజు లెచటనొ
పరికింపఁగ నూటి కొకరు, పండితు లచ్చో
టెఱిఁగి, యతిదూరదేశము
లరిగి వ్యథాచనుట యెంతయన్యాయ మహో ! 133

చ. చలపతిశాస్త్రి! ముఖ్య మగు సంగతి చెప్పెద రాజటంచు మే
మెలమినిఁ జూడ నెచ్చటికి నేగిన నూరక "హొం" డటంచు వా
ర్పలుకుట లేదు; మిక్కుటపుఁబట్టు భవాదృశుఁ డిచ్చటం దగన్
గలిగియు నట్టులౌటయును గల్గునె! సత్సభ కాకపోవునే! 134

చ. అలరెడివేడ్క నొక్కసభయైనను జేయఁగఁ జేసి దానిలోఁ
గలిగినవట్టి నాదయిన కైత నృపాలునిచిత్త మెక్కఁగా
సలిపి విశేషమై తగుయశమ్ము గొన న్వలె నంచుఁ గోర్కె ని
ష్ఠలకులదీప! నీకెఱుఁగఁజాలని దొక్కవిశేష ముండునే! 135

—• శ్రీ వాసుదేవరాజమణిరాజదేవుగారు •—

శ్లో. రాజానశ్చ మయా దృష్టా స్త్వయాచ కవయ స్తథా
మాదృశా బహవో రాజ న్నత్వాదృ గుపలభ్యతే. 136

శ్లో. ఏకోదరస్య పరిపూరణతో నదత్తం
రాజ్యం ప్రజావనపరేణ రమేశ్వరేణ
య స్త్వన్యథాచరతి తేన గతాధరా యో
దాతా న తేనతు గమిష్యతి కిం వదాన్య! 137

సీ. తగ నాత్మకూరు సీతారామభూపాలుఁ
డేన్గునెక్కించి యూరేగఁ జేసె
నానందగజపతిక్ష్మానాథుఁ డెక్కుడు
కవిచంద్రులని మెచ్చి కాన్కలొసఁగె
గద్వాలరామభూకాంతుండు జయపత్రి
మటులుండ బిరుదు నూటారు లిచ్చె
వేంకటగిరిలోన విభుఁడుఁ దదనుజులుఁ
జేరి వేనూటపదాఱు లిడిరి

తే. గీ. ఆంధ్రగీర్వాణములఁ గవు లభినుతింప
శతపధానాదిచిత్రముల్ సలుపు టట్టు
లుండ సరసకవిత్వమ్ము నొప్పఁ జెప్పు

టిప్పటి కవీంద్రులందు మాకిచ్చె వాణి
మందసారాజ! రాజదమందతేజ! 138

శ్లో. ఆస్తాం శ్రీః కిము తావతా జననిధౌ రత్నాని నోవా నకిం
గోత్రే కాంచనవృద్ధి రంచతి కవి ర్వాః కోఽపి నైనం నతం
యో రాజాఽపిచ విద్వదీడ్యచరితో దాతా చ యుష్మాదృశ
స్తస్మైస్స్యా ద్భగవా నతీవ ధనద శ్రీమందసాభూపతే! 139

శ్లో. కింవా బాలక పఠ్యతే వద, మయా గీర్వాణభాషా; తతో
లాభో నాస్తి; కుతో, యతో జగదిదం హూణైస్సమాలంబితమ్;
రాజానోఽపిచ సంతి, వాతులశిశో సర్వేఽపిహూణాయితా;
ఏవం మావద విద్వదాదృతివణ శ్రీమందసాభూపతిః. 140

—• ఆలస్యమగుటచేఁ జెప్పినది •—

శ్లో. దేశో దూరతరో యువాఽప్యహ మహోవృద్ధౌ గురూ గేహిసీ
నూత్నాయంచ బుభుర్హ్మిమ ప్రచుర ఏషోఽప్యత్ర సీత శ్శ్రీమాత్
విద్యాజ్ఞానవతశ్చ దేవ భవతః కిం వక్తు మీహామహే
భావ్యం బుద్ధిమతా పరేంగితవిదా శ్రీమందసాభూపతే! 141

—• ఐదివ సంవత్సరం గద్వాలసంస్థానం •—

మ. ప్లవసంవత్సర చైత్రమాసమున శుక్లద్వాదశిన్ దిగ్మరు
గ్దివసమ్మందు నుదారతాఖని మహాతేజస్వి శ్రీరామభూ
పవరుం డాశ్రితపక్షపాతి గనె నిర్యాణంబు, వేదమ్ములున్
గవితల్ శాస్త్రము లెల్లవిద్యలును నింకన్ వృద్ధి నెట్లందునో? 142

ఉ. ఏఁబదితొమ్మిదేఁడ్లు ధర నేలి యఖండవదాన్యుఁడై కలా
శ్రీబహుమాన్యులౌ కవులచే యశముం గొని తమ్ముఁ డీఁగ సు
శ్రీబలు నొక్కయాత్మజునిఁ జేకొని రాజ్యమునందు నిల్పియున్
దాఁ బరమాత్మునిం గలిసె ధన్యుఁడు గాఁడొకొ రామరాజిలన్. 143

శా. శ్రీరామక్షితిపాలుఁ డిట్టిఁ డని నేఁ జెప్పన్ దొరంకొంట యే
లా, రాజన్య లెఱుంగుదుర్ బుధులు వాలాయమ్ము దా మెచ్చుదుర్

జారుల్ చోరు లెఱుంగుదుర్ మఱియుఁ గోశం బెగ్గు నేతాదృశ
శ్రీ రాజిల్లిన రాజులుం గలరె! ధాత్రి న్నిక్క మెక్కాలమున్. 141

ఉ. ఆతఁ డొనర్చు సత్కృతుల నన్నిఁటిఁ దుల్పగ భారతమ్ము గా
దే! తగుభంగిఁ జెప్పఁ గలఁ డెవ్వఁడు? తద్ధన మింత దిన్న నా
కీతఱి నిట్టిబుద్ధి జనియించె వచించెద సూత్రిరీతిఁ బ్రి
ఖ్యాతికి వీనిఁ బోలు నృపకాంతులు లేరు నిజమ్ముగా భువిన్. 145

సీ. ఎవ్వానిభార్య లోకైకపావనశీల
లలితసద్గుణ మహాలక్ష్మమాంబ
యెవనితమ్ములు కవీంద్రేడ్యులు భీమిరె
డ్డియును రంగారెడ్డి నయవినమితు
లెవనిస్యాలకులు సర్వవిధాల నిజముగాఁ
గృతకృత్యులగు రామిరెడ్డిముఖ్యు
లెవనిబందుగు లట్టి రిట్టివా రని తెల్ప
నలవికాని ప్రశస్తి నందుఘనులు

తే. గీ. ఎవనిస్వీకృతపుత్రుఁ డీ యెల్లజగము
నేలఁగల సద్గుణమ్ముల కెల్ల యట్టి
రామభూపాలు వర్ణింపరాదె? యతఁడు
మృతి గనుట కల్ల నిక్కమ్ము బ్రతికియుంట. 146

ఉ. కీరితిలేని భూపతు లకించనులై జనియించినప్పుడే
ధారుణి లేనివారని యథార్థము చెప్పఁగవచ్చు; కీర్తిఁ జె
న్నారెడి రాజచంద్రులకు నాశము గల్గుట యెట్టులక్కటా!
యేరికి శాశ్వతంబె తను వెప్పుడు నిల్చు యశమ్ము చాడ్పునన్? 147

క. కీరితి గల్గుటయును నా
నారీతులనైన నందు నానా కవిరా
డ్వారణ సమ్మానమ్మున
సారయశము గల్గునదియు శాశ్వతమునగున్. 148

తే. గీ. కవులు కవులన్న నెల్లరు కవులుగారు
నృపులు నృపులన్న నెల్లరు నృపులుగారు
చిన్నతనముననే నీకుఁ జెప్పినాఁడఁ
దపనధామ ! సీతారామనృపలలామ ! 149

ఉ. కానఁ గవీంద్రులన్ మిగుల గౌరవబుద్ధినిఁ జూతు మెల్లరున్
మానన కర్హులే ద్విజులు, మంచి కవీంద్రులు రిక్తులంచు నీ
మానసమందుఁ జూచుటది మానుము; చూచితివేని రారు, లే
వీనియమమ్ము లియ్యెడఁ బరీక్ష యొనర్చెడివేళ భూవరా ! 150

శా. రాముం డెవ్వఁడొ కృష్ణుఁ డెవ్వఁడొ ధరన్ రక్షించిరో లేదొ యే
భూముల్ మెట్టిరొ యెవ్వరిం దునిమిరో పొల్పొంద వాల్మీకి యు
ద్దాముఁడౌ నలవ్యాససత్కవియు సీతారామభూపాల ! సు
శ్రీ మీఱన్ గృతి గూర్చకున్నఁ బరమే చెప్పంగ నెవ్వారికిన్ ? 151

శా. ఈరాజ్యమ్మరుదెంచి పండితుల మేమెంతే దిగం ద్రొక్కి సు
శ్రీరంజిల్లుట దక్క నింటికెపుడున్ జే మున్గువర్తివ్యమ్ముతోఁ
జేరన్ లే; దది యేమనన్ వినుము, వాసిన్ బొల్చువాఁ డొక్కఁడే
నీ రా డియ్యెడ, కేగుదెంచినను వానిన్ లేపనీ ర్పండితుల్. 152

క. ఒకవేళఁ బైకి వచ్చిన
సకలోన్నత వార్షికం బొసంగరు మఱి వా
ర్షిక మది పొట్టకు సరిపడు
నకటా! తిరిపమ్ము రైలు కావల వలయున్. 153

మ. కనుఁగొమ్మో నరపాల ! పూర్వమున రంగారెడ్డిగా ర్మాకు మీ
జనకుం డెప్పుడు నిచ్చుచుండు దినవెచ్చ మ్మట్టు చేయించె, దా
నన కాదే యిటవచ్చు టుద్గతిమి; నీనాటన్ సమస్తంబు బొం
దనగుంగా యని నేఁడు రాక విను సీతారామభూపాలకా ! 154

శా. గోచీ వెట్టినదాది నేఁటితుదఁ గన్గొందున్ నృపశ్రేణిఁ, నన్
గాచంబున్ మణి నొందుగాఁ గనుగతిం గన్గొరు, మీ తండ్రియున్

నా చంద మ్మొఱుఁగున్ గవీంద్రుఁడనినన్ నాగేంద్ర మన్నన్ దులం
దూఁచన్ వచ్చు నెఱుఁగు మిద్ది మనమందున్ గద్దవాలాధిపా ! 155

—• శ్రీరాణీగారి మీఁది పద్యము •—

మ. తన కిమ్మంచు వచించు కన్నను వచోదైన్యమ్ము వే ఱెందు లే
దని యే నెర్గుదునైన నాయెడల మీ రత్యంతమున్ బేర్మిగ
ల్గినవా రంచును నేను గోరినయెడన్ లేదంచు వాక్రుచ్చ రం
చును నీరీతి వచించితిన్ మదికి వచ్చుంగాక లక్ష్మ్యంబికా ! 156

—• శ్రీ చిన్న దొరవారి కోరికచే నప్పటి స్థితినిగూర్చి చెప్పినవి •—

సీ. నిఖిలేశ్వరుండైన నీ తండ్రి రామభూ
పాలుండు స్వర్లోక మేల నేగె
నీతల్లి లక్ష్మ్యంబ నెగులున నేమియుఁ
దోచక మిన్నక చూచుచుండె
జనకతండ్రియు మఱి పినతండ్రియును నేమి
యును జేయఁజాలని యోగ్యులైరి
మేనమామలు సాధుతానూను లేర్చికి
నించుక చెప్పలే కెదఁ దలంకి

తే. గీ. రట్టియెడఁ గేశవస్వామి యాత్మభక్తుఁ
డనుచు నిన్నాత్మనెంచి తా నఖిలమును సు
ఖమ్ము గావించె నీదుభాగ్యమ్ము కతన
తపనధామ ! సీతారామ నృపలలామ ! 157

సీ. జగము లేలి మహేంద్రసముఁడైన రామభూ
పాలుండు తపనునిపగిది న స్త
మయము చెందినమీఁద నతని పుత్రుండు సీ
తారామభూపతి తారకాధి
పతిమాడ్కి నభివృద్ధి వడసి ప్రకాశించు
నందాఁక మధ్యసమయమునందుఁ

దమము పోలికఁ గలహంములు రాకుండ ల
క్ష్మీ దేవి రామభూమిపతిపత్ని

తే. గీ. సంజవడువునఁ గాంతిభాస్వరముగాఁగ
రాజ్యమొనరించి యెల్లరఁ బ్రజలనేలఁ
జాలు సామర్థ్యమిచ్చి నిష్కంటకముగఁ
గేశవస్వామి యరసి రక్షింపవయ్య! 158

—• మూఁడవ సంవత్సరం ఆత్మకూరు సంస్థానం •—

చ. విని విననంతమాత్రమున వీనుల విందని సంతసించి చ
య్యన లిఖియింపఁ బోవలయు, నంతటితోఁ దను బోక వచ్చుద
న్కను బఠియింపఁగావలె, ననంతరమందు సమస్తవేళలన్
బనిఁగొని దానినే మదిని భావనసేయవలెన్; గ్రమక్రమ
మ్మున రసమెక్కుడై వలపుముద్దులు గొల్పెడి వన్నెలాఁడి పొం
దునుబలెఁ జెప్పనొప్పని వినోద మొసంగవలెన్, రతాంతసం
జనితసుఖమ్ము వోలె వివశత్వము చూపవలెన్, వసంతవే
ళను వనమధ్య నొప్పెడి విలాసపు మంటపమందునన్ బసం
దునఁ దగుకమ్మఁ దెమ్మెరలు దోఁపఁగ వారవధూమతల్లికా
భినయవినోదమున్ బలె నవీనముదం బొసఁగన్ వలెన్, దనం
తన తనసంగతిన్ మఱచి తా నెవరో బరు లెవ్వరో యెఱుం
గనియటు లుండఁగావలె; నొకానొకఁ డెవ్వఁడు గాని తన్నుఁ బి
ల్చిన నిఁక వాని కుత్తరము లేదు సరే కద, పల్కె నేని "యే
మనదగు నారసంబు నహహా! మహనీయగు జాడ్యుఁ డెవ్వఁడో
వినుతికి నెక్కుఁ గల్గినకవిత్వమహత్త్వ పటుత్వసంపదన్
గని రచియించె లేకునికిఁ గల్గునె యిట్టిరసప్రసారః" మం
చును నదియే వచించుచును జొక్కుచు సోలుచు వెఱ్ఱివాసి రీ
తిని, మదిరారసంబుచవిదేలిన పూరుషభాతి, మందుపో
ల్కను గనుపట్టి చొప్పడవలెన్; మఱియెద్దియునేనిఁ గారణం
బున నొకవేళ నద్ది మఱపుంగను దుర్దశ మూఁడెనేని మిం

చివతమిఁ దన్ను బూర్వము వశీకృతుఁగా నొనరించి యెన్నియో
దినము లభేదరీతుల మదిన్ గరఁగించి యకారణంబ త
న్నను విడనాడి పోయిన యనుంగుఁజెలిన్ దలపోయునట్టి జా
రునిగతిఁ దద్వశీకృతిపురోగముఁడై చరియింపఁగావలెన్.
వెనుకటిరీతి నద్ది స్మృతివీథిఁ దగుల్కొనినప్పు డెంతయున్
దనకుఁ బ్రియమ్ముగల్గు వనితామణి యల్లనవచ్చి గుచ్చి య
క్కునఁ బెనగొన్నసంగతులకున్ సరిగావలె సత్కవిత్వము
న్నను; గుకవిత్వమో, వినుజనమ్ము మనమ్మునఁ బెట్టునే? యెటో
వినఁదగు కర్మశేషమున విన్నను మోచ మొసంగునే? రసం
బు నెఱుఁగనట్టి కామినుల పొందులు విందులుగాఁగఁ జాలునే?
మనమున లేనిపోని యవమానపురీతులు దోఁచు గాని; యొ
క్కని ధనమా కవిత్వమనగా! నది యొక్కనియం దొకొక్క రీ
తినిఁ బ్రసరించు దానిఫణితిన్ వివరించ విరించియైన నో
పనియపు డస్మదాదులకుఁ బాటిలునే? రసికుల్ భవాదృశుల్
గనుఁగొనువారుగాక కవి కష్ట మదిట్టిదటంచుఁ బూర్వమే
వినిచితి నింతయున్ వినియు వీరలమాటలు నమ్మి పుస్తకం
బును బ్రికటింపకుండు టది పొల్పనితోఁచెనె? పార్థివేంద్ర! వీ
రనిన దొసంగులం దొకటియైనను నిల్చినదేమొ చూచితే!
చనవునఁజేయు నీవ్రితిన చక్కఁగ వింపురుగాక పండితుల్. 159

క. "చచ్చి రవధాను లిఁక మన
వచ్చును మన" మనుచుఁ దలఁచి వచ్చితివో? నీ
మచ్చ మడగింపుటకునై
వచ్చితి మిదె మరల దిగుము వాదమ్మునకున్ 160

చ. అభినవరామలింగ బిరుదాంకుఁడ నాకవనమ్మునందు నీ
యభణపుఁగాండ్లు తప్పు లిడ నర్హులె? "కా" దని తప్పు దిద మా
యుభయులలోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక యీర్ష్యచే
నభము శుభమ్మునుం దెలియ కార్చెడి దేబెలు మాకు లెక్కయే? 161

—• పాలఘాటువారి సంగీతమును గూర్చి •—

తే. గీ. నూఱుమంది గాయకులకు మీరొసంగు
టొక్కతల వీరలకొసంగు టొక్కతల య
టంచు లేవిస్వాతంత్ర్యమ్ము నాత్మ నూని
మనవిచేసెద నీతోడ మానవేంద్ర! 162

తే. గీ. మాయలోఁ బరబ్రహ్మము మఱుఁగుకరణి
నీశ్వరయ్యగాత్రమ్మున నెల్లగాత్ర
ములు నిముడుఁ దదనుజునిదౌ తెలివి చూడ
స్వరమువేసెడిపట్ల నసాధ్య మధిప! 163

శా. ఈవా దాతవు, వారు గాయకులు, నీకే వారికే చెల్లునౌ
నీ వేమియ్యఁగలేవు! వారు మఱి దా మెద్దానికిం జాల రో
దేవా! ముక్కరవంశరత్న! యిది కీర్తిం దెచ్చునన్మాట నీ
తో వేమాఱువచించు టొక్కటి సుమీ దోసంబు మాటోఁట్లకున్. 164

—• వనపర్తి సంస్థానం •—

సీ. గళమున బిరుదులు కైసేసె నమలపూ
ర్గద్వాల విజయనగరపురములు
దానికే యాత్మకూర్థవుఁ దేస్గునెక్కించు
నప్పుడొసఁగెఁ జంద్రిహారములను
కుడిచేతికొక బిరుదిడియె నంతకుమున్న
మొగలుత్రి నృసింహభూవరుండు
ఎడమచేతికి మొన్ననిడెఁ దాటికొండ రా
మారెడ్డి మేల్మిబంగారుమురుగు
తే. గీ. ఇతర సంస్థానములవంక కేగక ప్ర
తిష్ఠ నీక దక్కింప మదిని దలంచి
గండపెండారమొక్కటి గైకొనంగఁ
గా నెదురుచూచుచున్న దో కాశ్యపీంద్ర! 165

చ. ఎనిమిదియేడు లాయె నిట కేగ మొదగ్గొని మేము, నిన్నుఁ గ
గ్గొనుట యదేమొ నేఁటి కొనఁగూడెఁ దగంగ నొకప్పు డట్టి యి
చ్చనుగొని వచ్చి మేఁకమెడచన్నులపోలిక శీతలజ్వర
మ్మన మును పేరొకించుకయుఁ బొందక యేగతిమయ్యె భూవరా!

మ. కవు లెన్నంగ శతావధానమును వేడ్కన్ జూచెదో లేక య
ష్టవధాన మ్మది చాలునో నొడువు "మేట న్వచ్చువా" రంచు నీ
కవులన్ జూడకు "కొండుభొట్లకుఁ బరీక్ష?" యంచు లోనెంచెదే
నవధాన మ్మది యేల? మాకొసగు నూఱార్లిమ్ము రామేశ్వరా! 167

మ. "కృతి కైకోఁగఁ దలంచినాఁడ" నని మున్నే పల్కితేమయ్యె నా
యతనం, బిప్పుడు చెప్పుమయ్య యది నీవాసించుటే నిక్కమై
నతటిన్ విద్య మొసంగు మిచ్చిన యపర్ణాదేవి చెప్పించి నిన్
గృతకృత్యున్ బొనరించుఁ బాల్యవనపత్రిస్ఫూర్తి! రామేశ్వరా! 168

సీ. అల పిఠాపురభూవరామాత్యతనుజాతు
నకు మున్న యిచ్చినా మొకతనూజ
నల పోలవరపాలుఁడగు కృష్ణరావు బి
య్యే కొక్క కన్యక నిచ్చినాము
పలుగండములు దాఁటి బ్రతికినకన్య న
ర్పించినా మాత్మకూర్పృథివిపతికి
నఖిలలక్షణయుత యగు పెద్దదాని దే
శికునకే యిడి పెండ్లిచేసినాము

తే. గీ. కోరియుంటివి తగునట్టి ధీరమతివి
నీకు నొకకన్నె నీకున్న నేర మగు న
టంచు నీనెంచి యిట కేగుదెంచినార
మడుగు మిదితఱి రామేశ్వరావనీప! 169

శా. ఘోషా లేదఁట "రాజరాట్సభలకున్ గొంపోమ్ము న" న్నంచుఁ దన్
బోషించున్ జను గాసిపెట్టునఁట యేభూపాలునిం జూపినన్

"దోషంబే కల" దంచు నీల్గునఁట యీదుర్గర్వితిన్ గన్నియన్
బోషింపం దగురాజు మృగ్యుఁడు సుమీ ! భూమీశ రామేశ్వరా ! 170

ఉ. గ్రుడ్డిది గా దొకించుకయుఁ గుంటిదిగాదు కురూప గాదు మా
బిడ్డ సమస్తదేశపృథివీపతిసత్సభలందు మంచి పే
ర్వడ్డది దీనిఁ గైకొని నృపాలురలో యశమందుమయ్య ! మా
పడ్డ పరిశ్రమమ్ము ఫలవంతముగా వనపర్తిభూవరా ! 171

—• ఆత్మాశుధారలో నెదుట వ్రాసినవి •—

చ. అరుదుగ వత్తురఁచును మహాకవు లంచును దోడిరాజులం
దొఱు నవధానశక్తిగని నూఱులు వేలు నొసంగి రంచు నీ
వెఱిఁగియు మేటిదాతవయియే పదిరూపిక లిచ్చినావుగా !
తిరుపతివేంకటేశకవిధీరుల కో వనపర్తిభూవరా ! 172

ఉ. అన్నము లేక వచ్చితి మటంచు మనమ్మున నెంచినాఁడవో !
చిన్నగఁ జూచుటే యశము సేయుఁ నటంచుఁ దలంచినాఁడవో !
వన్నెయు వాసియుం గలుగుపార్థివుఁ డెవ్వఁడు మమ్ము నిట్లు చూ
చెన్నరనాథ ! నీక యిటు చెల్లె మతేమన నేర్తు మిమ్మెయిన్ ! 173

చ. కలరిల వేనవేలు నృపకాంతులు వందలు వేలు నిచ్చు ను
జ్జ్వలతరదానశాలు లటువంటి వదాన్యుల వీడి యియ్యెడన్
సలలితశక్తిఁ జూపఁగ నసాధ్యుల మే మరుదెంచి ముష్టికిం
దులయగు గౌరవమ్ముగొని తొల్తన పోవుట యుక్తమే ? నృపా ! 174

తే. గీ. "మాటలనుజూడ మాయమ్మమాద్రి గాని
చేతుల కదేమొకో కొంతచేటు వచ్చె"
ననెడి సామెత విస్పష్టమాయె నిచట
రమ్యగుణసాంద్ర ! రామేశ్వరక్షితీంద్ర ! 175

సీ. అనుభవించితిమి దివ్యద్భోగములను రా
జాధిరాజులకన్న నధికముగను

సంచరించితిమి రాజ్యస్థానములఁ బూర్వ
కవులకన్నను నిరాఘాటముగను
ఆర్జించితిమి యింత యతిధులకిడి మేము
ననుభవింపగఁ జాలునట్టివృత్తి
రచియించితిమి వచోరమణి తోడుగ రస
వంతమ్ములైన ప్రబంధములను

తే. గీ. రాజమిత్రుల మదిగాక రాజబంధు
వులము కవిరాజులము పదువురుగలట్టి
కొలమువారము మాకెందుఁగొదవలేదు
కీర్తికై రాకచుమి! వనపర్తిభూప! 176

తే. గీ. కవితయందలి రసము చక్కఁగఁ దెలియుట
కనుగుణమ్మగు నీవి దానమరెనేని
పూవునకుఁ దావిగల్గిన పోల్కెఁ జుమ్మ!
ఎఱుఁగు మిట్టిసంగతిని రామేశభూప! 177

తే. గీ. నూఱుమందికిఁ గవనం బపారధార
వఱలఁజెప్పెడి మాకిది బహుమతి యని
తమకుఁ దోఁచుట మేము స్వప్నముననైన
నెఱుఁగ కేతెంచితిమి క్షమియింపు భూప! 178

తే. గీ. పదుపుకూటికి నిటు పాలుపడిన యేని
కడుపు నిండనియప్పు డిక్కాన్క కేమ
కక్కఱతి చెందుటయుఁ గొంతకాని పని య
టంచు నూహించెదరు లోకు లవనినాథ! 179

క అక్షరలక్షలు దెచ్చిరి
దక్షులు సుకవు"లని మున్ను తజ్ఞులనుట యీ
పక్షమున మ్మషయనుచు మే
మీక్షింపఁగవలసె గవ్వయేనియు లేమిన్. 180

తే. గీ. నూటికొక్కఁడు చక్కని ధాటిగల్గి
సరసకవనమ్ము చెప్పెడి చతురుఁడుండు
నట్టివారలలో వేయి కమరు నొకఁడు
శతవధానాదికమ్మను సల్పుజాణ. 181

తే. గీ. వారిలోనెల్లఁ బేర్గాని దూరదేశ
మనక వచ్చిన వారి నిట్లరయుటయును
గౌరవమ్మని తమమది గాంచినప్పు
డేమియన నేరతు ము వచియింపు భూప! 182

తే. గీ. ఎందుకేతెంచితి మటంచు నెదద దుఃఖ
పడుటయే మేటిలాభమ్ము పార్థివేంద్ర!
ద్రవ్య మిది యేల కైకొమ్ము దయయె చాలు
దానికింత యనెడి వెల తనర దధిప! 183

క. కైకొని సంతోషింపని
మాకిదు ద్రివ్యమ్మ వమ్మ మహిపాల! వృథా
యీకరణి వెచ్చఁబుచ్చిన
లోకులు మెచ్చుదురె నిన్ను! లోఁగను మిదియున్. 184

తే. గీ. దాతయన్నప్పు డెవరి నేరీతిఁ గన్న
ననువగునో యట్లు చూచెడి యతఁడు గాక
కాచమణులను నొకరీతిఁ గాంచునతఁడు
కాఁడని ప్రమాణముఁగ జెప్పఁగలము మేము. 185

తే. గీ. మాకునూఱారు లిచ్చుట నీకు లెక్క
గాదు మాకదియును లెక్కగాదు గాని
యుభయులకును యశమ్మది యొసఁగు నిపుడ
కాక యీభువియున్నంతకాల మధిప! 186

తే. గీ. కవిత యాశుగఁ జెప్పిన కారణమునఁ
దప్పులుండెడి నయ్యవి తమదుపండి

తులును దమకెదుఃరాడిన దుడుకుతనము
తాము సు క్షమింపుటకు వేఁడెదము నరేంద్ర ! 187

తే. గీ. సివిలు మొదలగు నధికృతి చెలఁగుమీర
లేమియొనరించినను మంచిదే యటంచు
సంతసింతుము మాకట్లు సంభవించె
నేని యది హెచ్చుగౌరవ మింతకన్న. 188

క. గానమ్మకన్నఁ గవన
మ్మేనాఁడేనియును దక్కువే, నరవర ! నీ
వీ నియతి విడిచియిచ్చిన
నే నేమని సమ్మతింతు నెఱిఁగియెఱిఁగియున్. 189

క. రంగాచార్యులవా రీ
సంగతిని నెఱుంగునట్టి చతురులె యటులై
నం గాని చెప్ప సంశయ
ముం గాంతురు శ్రితుల కదియు ముఖ్యముకాదే ! 190

క. ప్రతివత్సరమును రామని
మతి నెఱిఁగియు మీర లిట్లు మాకిచ్చుట "దు
ర్గతికిన్ తావులు కవు" లని
ప్రతిజ్ఞ సేయుటయకాదె ? వనప _త్రినృపా ! 191

క. ప్రభువొకచో రసికుండగు
సభికులొకఁట రసికు లగుట సంభవముగు నీ
యుభయులును రసికులగుటది
నభస్సుమము రీతి చుమి ! వనపరితిరాజా ! 192

తే. గీ. వేలకొలఁదిగ నేఁటట విప్రవరుల
కిచ్చిపుచ్చెడి నిను దాతవే యటంచుఁ
బల్కెదనుగాని యెవరి కేవరుస నీయ
వలయునో యెఱుంగవని చెప్పవాఁడ భూప ! 193

తే. గీ. ఇచ్చెదవుగాక మానెద వేమికొదవ
మాకవిత్వపరీక్ష సమ్యగ్గతిని ర
చింపు మేకథనేనియుఁ జెప్పునపుడు
చేయి యాపిన నది తెగవేయు మధిప ! 194

క. పదిగాదు వేయిపదులకు
నిదియే చాలునని యెంచఁడే యెఱిఁగిన స
ద్విదితుఁడగు నరవరుఁడు నీ
మదిలో నివియెల్లఁ జూడుమా భూమీశా ! 195

తే. తే. ఎందులోఁ జేరకుండెడి హీసులెల్లఁ
గవులలోపల నియ్యెడఁ గలియుచుంద్రు
ఎల్లవర్ణమ్ములును గూడి యించుకంత
యంతరములేక తురకలయందుఁ గలియు. 196

తే. గీ. కానఁ గవులకు నీలాటి గతులు వచ్చెఁ
గాని నీలోప మేమియుఁ గానఁబడదు
ఎఱుఁగ కొక్కింత వ్రాసితి నింతపట్టు
నెఱిఁగి క్షమియింపుమయ్య ! రామేశ్వరయ్య ! 197

తే. గీ. కాగితమ్ములు లేనట్టి కారణమున
నింతతో విరమించితి నిపుడ యొక్క
కబ్బ మొనరింపఁ జాలిన కవిని చెళ్ళ
పిళ్ళ వేంకటశాస్త్రి నాపేరు నృపతి ! 198

— దారిలోఁ బ్రసంగవశమునఁ జెప్పికొన్నవి —

తే. గీ. పొందు గద్వాల కాత్మకూ ర్పురమునకును
ఏమొసంగిన సరసు లా భూమిపతులు
వినుఁడు మామాట పైనెందుఁ జనకుఁడయ్యు
పాకనాటినృపాలు రెప్పట్లశేరు. 199

సీ. కవులచేతను మేటి కవనమ్ము చెప్పించి
వినిమెుండిచేయి చూపించువారు
"పాటకు వినుటయే బహుమతి, తలయూఁపి
నందుకుఁ దంబురా" యనెడువారు
దగ్గరపండితుల్ దమ కేదియేనిఁ జె
ప్పిన నది పెడచెవిఁ బెట్టువారు
మాటలచేతనే మంచిప్రతిష్ఠ నా
ర్జించు మార్గమ్ము యోజించువారు
తే. గీ. లేరు నీయందు, నీదగుపేరు విన్న
యంతనే బోవు దారిద్ర్య మహాహా! పాక
నాటిరాజవంశంబ! యీనాఁట నృపతు
లందు నినుఁజెప్పి చెప్పరా దన్యు నొకని. 200

మ. మును సౌగంధికపుష్పమున్ గొనఁగ భీముం డేగ్రైఱ్ఱ బోవుత్రో
వను సాక్షాత్కృతిఁజేసి ఖడ్గమృగమున్ వారింపఁగా నంజనా
తనయుం డెక్కుడు పేర్మి నిచ్చిన పదార్థంబేసుమా! యీపయిన్
జనువాఁ డార్జనసేయు వేంకటకవీ! సారస్యమట్లుండుటన్. తి. శా. 201

మ. ఒక యేగానికిఁ జిన్నికుఱ్ఱనికి నాయుష్కర్మ చేయించి దా
నికినై కానియొసంగి, "తక్కుసగమున్దె" మ్మన్న, "నాచేత లే
దకటా!" నాఁగను క్షౌరపుంగ్రుతికిఁ దా నంగీకృతిం జొన్పు లౌ
భ్యకులాయమ్మగు ముద్దరాలి చరితం బాలించితే? తిర్పతీ! వెం, శా.

—• ఆత్మకూరు సంస్థానం •—

మ. కురుమత్యద్రిపతి న్నుతించితిమి తత్కుర్మూర్తి భూమీధరా
కరకారుణ్యసమాగతామితవసుక్ష్మాపాలకత్వస్ఫుర
త్తరభాగ్యోదయు నాశ్రయించితిమి సీతారామభూపాల! మీ
కురుమూర్తిన్ దయసేయుమయ్య! మఱి మాకున్ వృత్తిసత్త్రావతిఙ్ఞ.

తే. గీ. ధరణినాయక ! మా వాగుదారధార
పాఱి పండించు సరసకేదారములను
తాదృశం బగు మీవాఁగుదారధార
పాఱఁగావలె మాదు కేదారములకు. 204

—॰ ఒక సమయమునఁ బ్రసంగవశమునఁ జెప్పిన నిందాస్తుతి ॰—

సీ. నీమీదఁ గృతిచెప్పి నిను మతించిన కృష్ణ
మాచార్యవరుఁడు సన్యాసియయ్యె
నీదు సంస్థానపండితుఁడైన యల శ్రీని
వాసార్యవరుఁడు ప్రవాసియయ్యె
నీగాయకుఁడనఁచు జోగియై రాఘవా
చార్యుఁ డూరూర యాచనకుఁదిరిగె
నీ కిలవేల్పైన యా కుర్మతిస్వామి
యడవిగుట్టల నంగలార్పఁ దొడఁగె
తే. గీ. నెఱిఁగియును నీకుఁ గృతినిచ్చు గురుమనీషు
లరయఁ దిరుపతి వేంకటేశ్వరులె కాక
నీదులోప మొక్కింతయు లేదు నమ్మ
మాత్మకూరుపురీరాజ ! యతులతేజ ! 205

—॰ గద్వాలలో మధ్వస్వాములవారి దర్శనము ॰—

శ్లో. పశుపతిదయితా తృతీయపుత్రౌ
తిరుపతి వేంకటశాస్త్రిణౌ కవీంద్రౌ
ప్రణమత ఇహ సత్యధీరతీర్థం
సకలజగద్గురునాయకం భవంతం. 206

శ్లో. స్వామిన్ భక్తసమస్తశాస్త్రజలధీభూతప్రభావస్ఫుర
చ్చర్ల బ్రహ్మసుధీంద్రసాంద్రకరుణాసంప్రాప్తవిద్యాభరౌ
ధన్యౌ శ్రీపతివేంకటేశ్వరకవీ శ్రీసత్యధీరప్రభో !
విద్వన్నంద్యశతావధానచతురౌ త్వత్పాదసందర్శనాత్. 207

శ్లో. శ్రీరామోఽన్యోఽహ మన్యోస్తిహి మహ దుభయోరంతరంచేతి చేత
స్యాస్తాం యుష్మాక మేషత్వ మితి నతి మిమా మర్పయే యుష్మదంఘ్రౌ
ద్వైతాఽద్వైతాదిభేదై రల మధికతరం యత్ర తేజస్సనర్వై
ర్నమ్యోగమ్యో యతీంద్రప్రిణతపదరజ స్సత్యధీరార్యవర్య ॥ 208

శ్లో. భుక్తిం దదాత్యపిచముక్తిమథాపిశక్తిం,
భావత్కదర్శన మనేక శుభానిదత్తే
బ్రహ్మాదిభిః కిమహమాశ్రితకల్పవృక్షం
సేవే భవంత మనఘం గురుసత్యధీరం. 209

శ్లో. ఆబాల్యాద్రాజరాజా నతులశతవధానాదిభి స్తోషయిత్వా
య న్నా గారోపణై ర్నిస్తులతరవసుభి ర్భూషితా భూషణైశ్చ
త త్సర్వం నైవతుల్యం భవతి భవదనుగ్రాహ్యతాగౌరవేణ
స్వామిన్ శ్రీసత్యధీర ప్రభుతిలక గురో రాజరాజార్చితాంఘ్రే. 210

సీ. అతిబాల్యఏవదివ్యత్కాకపట్టణే
కింకవిగజసింహకీర్తి మాప్య
తద్వయస్యేవ సంపద్వత్యమలపురే
విద్వత్కవీంద్ర సద్బిరుద మాప్య
తదధికే వయసి బృందావనే పట్టణే
బాలకళానిధిపద మవాప్య
తద్వయస్యేవ విద్వద్వతి హరిపురే
బాలసరస్వతీపద మవాప్య.

తే. గీ. ఆంధ్రగీర్వాణభాషయో రపరిమిత సు
పద్యగద్యమయాని కావ్యాని నైక
విధరసాని విధాయ భోబుధవరేణ్య !
వందనాయ సమాగతౌ వందనీయ !
తిరుపతి ర్వేంకట స్సత్యధీరతీర్థ । 211

—• శ్రీ వారి సన్నిధికంపిన పత్రిక •—

శ్లో. శ్రీసత్యధీర తీర్థానాం, గురూణా మనఘాత్మనాం
సన్నిధౌ విద్యమానా భోః; పండితా దృశ్యతామిదం. 212

శ్లో. శ్రీరామోఽన్యోహ మన్యోఽస్తి హి మహదు
భయోరంతరం చేతిచేత, స్యాస్తాం యుష్మాకం, 213

శ్లో. హ్యాస్నా యాహనిపద్యేఽ స్మిన్, పదంయుష్మాక మిత్యదః
దుష్టమి త్యవదన్ త్సర్వే, భవంతః కృతబుద్ధయః. 214

శ్లో. ఇదం జన్మసహస్రేఽపి, శబ్దశాస్త్రాధికారిభిః
నానా కావ్యవిదీశానై, ర్దుష్టం కర్తుం వశక్యతే. 215

శ్లో. భవత్ప్రతిజ్ఞాం యది పాలయేర, న్నిదం యథాదుష్ట మథూత్తదర్థే
విచార్యపత్రీం లసదుక్తిపాత్ర, మాశాస్మహే ప్రేషయితుం మహాంతః.

శ్లో. నచే దభినివేశస్తు, తూష్ణీం తిష్ఠన్తు కా క్షతిః
భవదజ్ఞాన వైరస్యే, వయంతు శతధానుమః. 217

గ. ఇతిసజ్జనవిధేయౌ తిరుపతి వేంకటేశ్వరౌ శతావధానీత్యాది బిరుదాంకితౌ ఆవాంపరశ్వ ఏవజిగమిషూ, తతస్త్వరం ప్రత్యుత్తరం దీయతామితి ప్రార్థ్యంతే.

—• మొదటి సంవత్సరము నూజివీడు •—

శ్లో. శ్రీమంత స్తనయా, స్సతీగుణవతీ విద్యాఽనవద్యా మహ
ద్రాజ్యం తే సకలం చకాస్తి కి మతః కామ్యం నృణాం సంస్కృతౌ
అన్యైవాస్తు సుఖస్య సుస్థితిరహో శ్రీరామచంద్రాప్పరా
దన్యస్యాఽపిభవే దవాప్తి రథ యద్యత్తేహ్రుతే రోచతే. 218

సీ. నన్ను నేఁడతి ప్రయత్నమున రావించుటే
కవితాభిమానసంగతికి సాక్షి
వేమూరి శ్రీరామవిబుధుఁ బూజించుటే
నిర్వ్యాజదాతృతాన్వితికి సాక్షి

ఆడంబరం బించుకైన లేకుండుచే
సులభుఁడీతండన్న స్తుతికి సాక్షి
అతిమితభాషణ స్థితి నెప్పుడొప్పుచే
యని తప్పడను యశమ్మునకు సాక్షి

తే. గీ. విరవ వేంకటసూర్యరాడ్విభుఁడు మాటి
మాటికిఁ బ్రశంససేయుచే నేఁటిరాజు
లందు విద్వాంసుఁడనెడి నియతికి సాక్షి
యఖిల కవిగేయ ! రామచంద్రాప్పరాయ ! 219

సీ. ఆస్తికత్వమునఁ జెన్నారువాఁడనుటకుఁ
దావకంబైన వర్తనమె సాక్షి
అతికరుణారసాన్వితుఁ డీతఁడనుటకు
ధర్మార్థమైన వైద్యంబె సాక్షి
దీనపోషణము సంధించు వాఁడనుటకుఁ
బంగ్వంధకుబ్జాదిపటలి సాక్షి
రామనామోపాసనామాన్యుఁడనుటకు
ముమ్మాటికిని రామమూర్తి సాక్షి

తే. గీ. క్రూరకృత్యము లెఱుఁగని ధీరుఁడనుట
కెడతెగక దోసతోఁట నా నెసఁగి యెసఁగు
చును నెసఁగనున్న పీదగు సుతులు సాక్షి
యఖిల కవిగేయ ! రామచంద్రాప్పరాయ ! 220

శ్లో. ఇంద్రశ్చంద్రస్త్వ మసి నసమ స్సర్వథా తే జగత్యా
మిత్యేవం యే పునరసి పున స్సంస్తువంతః కవీంద్రాః
తేపై చోరా భ్రుణు పర మిదం యస్స్వభావోక్తిచుంచు
స్సోఽయం శ్లాఘ్యో భవతి విదుషాం రామచంద్రాప్పరాయ ! 221

ఉ. అవల నెవ్వఁడేని గవి యల్లిన పద్దెములన్ బఠించుచో
"నీవిధమెల్ల నిశ్చయమ యీస్తుతికిన్ దగు నీతఁ"డంచు సం

భావన గల్గఁగావలయు భావమటుల్ గనుపట్టకున్న నా
దేవిరిగొట్టు పద్దెముల దీవన లేమిటి ? కప్పరాడ్విభూ ! 222

ఉ. ఏ నవధాని నంచు మఱి యీవు నృపేంద్రుఁడ వంచుఁ జెప్పఁగా
నూనుట యొప్పునొక్కొ పునరుక్తికిఁ బెద్దలు సమ్మతింతురే !
దానినటుండనిచ్చి, కవితారసమున్ జవిఁ జూచుపొంటె న
న్యూనములైన మా కృతులనున్ వినఁగోరెద నప్పరాడ్విభూ ! 223

ఉ. దొమ్మరిసాని యెంతయును దుడ్కుమెయిం గడనెక్కి యాడు పో
ల్కిన్మతిబల్మి కల్మిఁగడు లేమిడిచే నవధానమున్ బొన
ర్చు మ్మనుజుండు, దానినొక చోద్యముగా గణియింపఁ బోక స
త్సమ్మతిగా నెసంగు కవితారసమున్ జవిఁజూడు భూవరా ! 224

శ్లో. శ్రీమదాప్రిమం మనసి నితరాం సేవసేఽత్యంత భక్త్యా
శ్రీమదాప్రిమ స్త్వ మసి స పున స్స్వాధికాపత్యశాలీ
త్వం చైతాదృ క్సతు పరిచితో ధర్మ కర్మణ్యతీవ
త్వంతాదృక్ష స్సన కథమవే దాప్రిమచంద్రాప్పరాయ ! 225

—• ఈయన రాణింగూర్చి చెప్పి యంపినది •—

సీ. నీభర్త సుశ్లోకుఁడై భూమినేలు వి
ద్యాశాలి రామచంద్రాప్పరావు !
నీయన్న విద్యావినీతి ప్రధానుండు
రావువేంకట సూర్యరావు విభుఁడు
నీదుసంతానం బనేతాదృశము చిరా
యుష్కమైశ్వర్యవృద్ధ్యున్ముఖంబు
నీదుశీలమ్ము వర్ణించెడి కవులకు
సీతాదిసాధ్వుల స్మృతికిఁ దెచ్చు

తే. గీ. నొక్కఁడననేల, సకలమ్ము చక్కనైన
పక్కినొప్పెడి నిన్నెన్న వశమె మాకు

రామచంద్రాప్పరాయసామ్రాజ్యలక్ష్మి!
వృద్ధినందుము శ్రీలక్ష్మి వెంకయాంబ! 226

—• ఖాసింకోటలో తోటలోనైన యుత్సవముంగూర్చి చెప్పినది •—

సీ. గాడిదపై సవార్గావించుచందమ్ము
సిగ్గుమాలినవాని చేష్ట తెలిపె
త్రాటితోడను బెన్గులాట యరసమైన
పల్లవి తెగఁబాడుపగిదిఁ దోఁచె
తొలఁగు నీర్కుండలతోఁ బరుగెత్తుట
యల్పవిద్యావంతు ననుకరించె
క్రొవ్వుఁబూసిన వెదుర్కెయ్యెక్కపడుట స్వ
శక్తి గాననివాని చందమయ్యె
తే. గీ. నొకఁడు ముందీఁద వెనుక నెన్నో విధములఁ
దప్పటీఁతలు గొట్టుట పిప్పికైత
మెల్లనల్లి యాశుకవుల మీఱ నెంచు
పొరు దోఁపించె వేంకటాచలనృపాల! 227

—• తోట్లవల్లూరు జమీందారు శ్రీ భాష్యకార్ల నాయఁడుగారు •—

సీ. శ్రీరస్తు సంతత శ్రేయోఽస్తు కలియుగా
బ్దములొక యైదువేల్ పైని నాల్గు
జరగఁచో శోభకృత్సంవత్సరమున మా
ధవమాసమందు శుద్ధమగు పక్ష
మునను నేకాదశి ననఘమౌ నుత్తరా
నక్షత్రమందుఁ బూర్ణ బలయుక్త
మగు వృషలగ్నమ్మునందు మహోత్సవం
బలరార వల్లూరఁ గలిమిమిగుల
తే. గీ. బమ్మదేవర సద్వంశవర్ధనుండు
ఘనగుణాఢ్యుండు శ్రీ భాష్యకారనృపతి

పుత్రిపతి సతి తనదరిఁ బొలుపుదెలుప
శ్రీధవునికృపఁ బట్టాభిషిక్తుఁడయ్యె. 228

సీ. బమ్మదేవర నెమ్మిఁగ్రిమ్మి యాయువొసంగు
బమ్మదేవరకులాభరణ ! నీకు
శ్రీభాష్యకారు లశేష విద్యలొసంగు
శ్రీభాష్యకారాఖ్యఁ జెలఁగు నీకు
ఇలవేల్పు గోపాలుఁ డిల యేలఁగాఁజాలు
శక్తి నీకిచ్చు సువ్యక్త తేజ !
ఆ దేవుభార్య లక్ష్మీదేవి నీ కిడు
నింత కెచ్చగుసిరుల్ నృపతివర్య !
తే. గీ. అనఘులగు బ్రాహ్మణులును మహానుభావు
లైన కవివర్యులును ముదమంది దీవ
నల నొసంగుదు రెల్లప్పు డెలమినీకు
ఘనతరాటోప ! శ్రీ భాష్యకారభూప ! 229

చ. చెలులును మంత్రిలున్ సుతులు శ్రీకరయౌ సతియున్ మహామహో
జ్జ్వలులగు చుట్టలున్ గవులు సన్నిధి మేల్మి నలంకరింప రై
తులు జయపెట్ట దూర్యములు తోరముగా మొరయన్ మృదుస్వనం
బులు వెలఁగంగ నెల్లెడల బోగపుటింతులు నాట్యమాడ భృ
త్యులు కడు మోదమొప్పఁగ నొహో! యని హెచ్చరికల్ పొనర్ప పం
దులు నుతియింప నెల్లర మనోరథముల్ ఫలియింపఁ బూర్వమం
దల రఘురామమూర్తి జనకాత్మజతోడ నయోధ్యఁ బట్టమున్
సలలితరీతిఁ గట్టికొను చాయ యెలర్పఁగ నేఁడు భాష్యకా
రులు నృపపుంగవుం డతినిరూఢిని బట్టపుభద్రపీఠమం
దెలమిచెలంగ నొప్పె, సకలేశ్వరుఁడౌ నలగోపబాలుఁడ
య్యలఘుని కింతకన్న సిరి, యంతకు మించిన మేటిసంపదల్,
బలమును బుత్రసంతతియు భాగ్యము భోగ్యములైన వస్తువుల్
గలుగఁగఁజేసి ప్రోచుఁ గలకాలము కంటికి ఱెప్పరీతిగన్. 230

రెండవ సంవత్సరము నూఁజివీడు

—• శ్రీరామచంద్రాప్పరావుగారు •—

చ. పదియును దొమ్మిదౌ దినము బందరు చేరక తప్పదిప్డు వి
ఘ్నదశ ఘటించె గేహిని యనన్ సకలమ్మును దేటతెల్లమౌఁ
గద! యిఁకనాఁటి ప్రొద్దుట నెకాయెకి నియ్యెడనుండి పోయి యి
ర్వదికయినం జనన్ వలయు బందరు, దేహము నమ్మికొన్న య
ప్డిది విహితంబుకాదె, తమకియ్యది యొండొరు లేల చెప్ప, ని
య్యది భవదీయసంశ్రితులమౌ మముబోంట్లకు నెంచి చూడ గో
ష్పద మనరాదె, సార్టు గుడివాడకు దేవరవా రొసంగ న
య్యది కడువేగరీతిమెయి హాయిగ దేహము నొచ్చకుండఁగా
నుదరములోని నీర్కదలకుండఁగ నయ్యెడ దింపెనేని య
య్యదనున యెడ్ల బండిపయి నా నిశి యెల్లను బోతిమేని మే
ముదయము కాకమున్న చనియుందుము బందరు, స్కూలువేళయో
పది పదొకొండుగంటలకుఁ బైనగుఁ "జెప్పఁగనేల దీని, మీ
రొమ్మద లిట వచ్చియేగునెడ మోదముమై నిటు లిచ్చి పంపమే,
యిది యొకరాచకార్యమె? కవీందుర్రిల కీయక యేరికిత్తు" మం
చుఁ దమ రనంగవచ్చు నిది సూనృతమేయగుఁ గాని యిప్పుడి
య్యది దయచేయు టెంతయును నొఁ బదివేలని లోననెంతు "నే
మిది" యని యంపరేని తురగేంద్రములం గొనితేర మొన్ననే
కద! తమదంపి యుండి రిది కన్నులనిండఁగఁ గాంచి కోరఁగా
నెద యొకకొంత సందియమునే కనె, నైననుఁ గార్యసక్తిచే
నిది విధియయ్యె, రాజు లెదనెంచిన దేనికినేని లోపమే!
పదిలముగాఁగఁబోయెడి యుపాయము చూచితిఁగాని, లేనిచోఁ
గుదుపునకోర్చినన్ దొరకు గోడిగబం డ్లిటనెన్నియేని; య
య్యదరది యింతదూరము నహం బదియెల్లను బొంది నైఁచు న
య్యద నది వోయె. దేహమిది యార్తదశాపరిభూతమౌటచేఁ
బదిఁబది విన్నవింపఁదగువారును మీరును గాదుగాన నిం

కిది విరమింతు దేవరకు నింతగ విన్నప మాచరించు చే
మొద లవివేక మింతకును మోటగుఁ బెంచి వచింపఁబూనినన్
సదయ ! కవీడ్విధేయ ! విలసద్గుణ ! శ్రీకర ! యప్పరాడ్విభూ ! 231

మూఁడవ సంవత్సరం మాజివీడు

—• వెంకటరంగయ్యప్పారావుగారి సభలోఁ జెప్పినది •—

ఉ. స్వామి వచించుసంగతులు సత్యములే యగుఁగాని యొక్కఁడన్
నామము వెట్టుకన్నను ననామునిఁగాఁ బరు నిర్ణయించుఁ దా
నేమత మద్ది హిందువులకే యనఁగాఁ బనిలేదు సర్వులున్
దా మది సమ్మతింత్రు పరతత్త్వవిదుండగు వ్యాసమౌని యే
మీ మఱి యన్యులేమి తమ రేకృతులన్ రచియించి రందు దా
రా మహితాత్మ నామ మది యచ్చట నచ్చట భిన్నరీతిగా
నే మెఱయింపఁజొచ్చి రది యెల్లను జూచియె శంకరుండు ని
ర్నామునిఁగాఁ బరాత్పరుని న్యాయముగాఁ దగ నిర్ణయించె నా
యీమతమే విదేశములనెల్లెడలందు వివేకయోగి స
ద్ధీమహితుండు లోకము నుతించుగతిన్ వెలయించె శైవు "లా
స్వామి విభూతిరాయఁ"డని, వైష్ణవు "లాతఁడు తిర్మణిన్ సదా
నామముగా ధరించు"నని "న్యాయమిదే" యని మాధ్వు లన్యథా
గా మదికెక్కునట్లుగను గారణముల్ వచియించి "మీది త
ప్పే మఱి మీది త" ప్పనుచు నెంతయు వాద మొనర్తు రొప్పమై
వేమరు క్రైస్తవుల్ తమవివేకము గన్పఱతుర్ మహమ్మదు
ద్దామ మతస్థు లింకొకవిధమ్మన బోధయొనర్తు రిన్నియున్
శ్రీమహితంబులే సకలజీవులకున్ ముదమిచ్చునట్టివే
యీ మతముల్ సమస్తమును నేకమెయన్న విశేష మేమతం
బీమహిఁ జెప్పు నయ్యది మహీశ్వర ! శంకరు లానతిచ్చి రే
రామత మాచరింతురొ సమస్తము వారికి మిత్రమౌ మఱిం
కేమతముఁ బహించినను నెక్కడి కేగిన నక్కడే విరో

ధామయ ముండితేఱఎలె నందఱికిన్ విశదంబ యీస్థితుల్
నామదిఁ దోఁచినట్టివిది నన్ను క్షమింతురుగాక పండితుల్. 232

—• తేలప్రోలు మేనేజరుగారు •—

మ. అధికారమ్ము వహించినారమని గర్వాంధ్యమ్మునం బొల్చువా
రు ధరన్ వేలకువేలు గల్గుదురు పేరుౙా మంచియోగ్యత్వమున్
బుధమాన్యత్వము దీనపాలకతయున్ బొల్పారువాఁ డెక్కడో
పదికో నూటికొ వేయికో యొకఁడు గన్పట్టున్ బ్రపంచమ్మునన్. 233

చ. మనుజుల కీక యెవ్వరికి మాన్యతమం బధికారమిత్తు రి
చ్చిన వెనువెంటనే మనుజచేష్టల వే దిగఁద్రావి కొంద ఱొ
య్యన తమపూర్వజాతిదయినట్టి కపిస్థితి గాంతు రక్కటా!
ధన మధికార మెవ్వరిని దాఁ బడఁద్రోయదు సర్వభంగులన్. 234

క. గొప్ప తనకబ్బుకొలఁదిని
ముప్పని మదినెఱుఁగు బుధుఁడు; మూర్ఖుం డదియే
యొప్పనుచుఁ బొంగి సంపూ
ర్ణాప్పతిసుతుభంగి వెనుక కరుగుఁగ్రమమునన్. 235

చ. వెనుకవిధమ్ముగా కిపుడు వేత్తృత హెచ్చుట పక్షపాత వ
ర్తనమడుగంటి లంచములు తగ్గుటయున్ వ్యవహర్తలందుఁ గ
ల్గెననుట సర్వసమ్మతమె కేవల మీ విభునందు నద్ది హె
చ్చని వచియింతురెల్లరు నహో! యిది యూరక కల్గనేర్చునే? 236

చ. ఇతఁడు మహామ్మదీయుఁడయి యెల్లర నొక్కగతిన్ దయోదయ
స్థితి గనుఁగొంచు దగ్గర వసించెడివారలఁ బేర్మి నోర్మి నొ
క్కతఱినినైన నాగ్రహము గాంచకయే కనుఁగొంచుఁ బూర్వ పం
డితు లధికార మన్నది గణింతురు దాము పిశాచమంచుఁ ద
ద్గతి మనయందుఁ గన్పడుట గాదనిపోలె నిగర్వియై క్రమో
న్నతిఁ బ్రతిపక్షశానిధి యనం దనరారుచుఁ దా భరించు భూ

పతి కభివృద్ధి సారెకును శాశ్వతమౌగతి సంతరించుచున్
మతిగలవారలెల్లఁ దను మాటికిని న్నుతియించునట్లు లొ
ప్పి తనరు "సైదుబంగ్గి" యను పేరునఁ జెన్నగుసత్తమున్ గృపా
న్వితుఁడు పరాత్పరుండు కరుణించుత సర్వవిధమ్ములన్ దగన్. 237

క. మొగము నెదుట స్తుతియించుట
తగునెల్లర, కిమ్మహాత్ముదశ యెట్టిదియో
సుగుణాఢ్యుఁడంచు దూరగు
లగు సుజనులు గూడనెంతు రది మృషయగునే? 238

—• శ్రీపోలవరపు జమీందారుగారు •—

చ. వెనుకటి రాజు లిట్టులు నవీనకృతుల్ గొని పండితేంద్రులం
దనిపినసంగతుల్ తమకుఁదామె యెఱింగిన మీకుఁ జెప్పవా
రునుగలరే? పరిశ్రమమెఱుంగు మిమున్ గృతినాథుఁ జేసి మే
మనవరతంబు వేతొకరి యాశ్రయణమ్మునఁ బొట్టనింతుమే! 239

ఉ. భూములు గోరలేదు పరిపూర్ణధనమ్మును గోరలేదు మేల్
గ్రామము గోరలేదు తమ కారుణికత్వ మొకండె, కోరి మే
మీ మహనీయమైనకృతి నిచ్చితి మిందలిలాభమున్ మముఁ
బ్రామికొనంగఁ జేయఁదగుఁ బార్థివసత్తమ! దానవిత్తమా! 240

మ. కృతినాథుల్ కృతులంది యిక్కతమునన్ గీర్తిన్ వహింపంగఁ ద
త్కృతికర్తల్ కృతినాథు లిచ్చుధనమున్ గీర్తిన్ మతిన్ దానసం
గతమౌలాభ మశేషముం గొనుటయేకాదా? తగున్ ధర్మ మో
మతిమచ్ఛేకర! మీరెఱుంగనివి ధర్మముల్ మహింగల్గునే! 241

క. పుస్తకము లమ్ముకొనుట ప్ర
శస్తముగా దనెడి వెఱ్ఱిసందేహపుఁ జా
దస్తమున మున్ను మే మీ
పుస్తక విక్రియపుఁ బనికిఁ బూనము నృపతీ! 242

క. ఎటకేగిన నూటావలు
తటుకునఁదెచ్చుకొను మాకు ధనమియ్యది ము

న్పటిరోజులలో లెక్కిం
పుటకుఁ దటస్థింపదయ్యె భూమీశమణీ! 243

క. ఒకచోట నుండుకారణ
మకటా! మాయిరువురకును నాయీవృత్తుల్
సకలము చేయించెడి నేఁ
టికి సంసారంపు భరము దెప్పరమగుటన్. 244

క. వచ్చెడిజీతము పొట్టకు
వచ్చెడి మాయిరువురకును బైముసను ఋణముల్
దెచ్చినవి కలవు మేమిఁక
నెచ్చటఁ దెచ్చెదము? వాని నీయఁగ ధనముల్. 245

క. కావున మీరీవిషయం
బై వెఱపిడ్డాని నొకటి నగుపఱచి దయా
శ్రీవిభవ మెసఁగ జూడం
గావలెనని వేఁడితిమి తగల్ మిము నృపతీ! 246

ఉ. ఇప్పటి సత్కవీశ్వరుల కియ్యదియే యొకవ్యక్తి యయ్యె మే
మిప్పటికిందుఁ జొచ్చితి మిదేగతినైనను సాగఁజేయ మీ
గొప్పదనంబుఁ దోడుపడఁ గోరితి మియ్యది మీకుఁ జెల్లదే?
అప్పతి కేమిలెక్క? యొక యంబుదమిచ్చెడి వర్షబిందువుల్. 247

సీ. ఆత్మకూరునృపాలుఁ డవని యిచ్చెనుగాని
యది దూరమగుట మే మరుగలేము
రైతు దుర్మార్గుఁడై రానీఁడు వాడ్రేవు
వా రిచ్చు భూమిపైఁ బైసయేవి
తోఁట సర్వారాయఁ డేటికో "భూమి యి
చ్చెద" నని చెప్పి వంచించెమమ్మ
నిది యిట్టులుండఁగా నింకెంమకని తాటి
కొండ రామారెడ్డిఁ గోరలేదు

తే. గీ. తమరు భూమి నొసంగుచే తలఁపరైరి
మముఁ గవులఁ జేసినట్టి యమ్మాలధాత
ననవలయుఁగాని యెవరి నేమందుమయ్య
రామచంద్రి వేంకటకృష్ణరాయచంద్రి! 248

ఉ. కర్మముచాలకెయ్యదియొ కానుకగాఁ గృతివేళ నిచ్చి యా
మర్మ మెఱుంగనేరని యమాయికు లీ కవులం చెఱింగి మా
శర్మముఁ జూడ కక్కృతులు సర్వము మీరలె విక్రయించుచే
ధర్మమె? యిట్టులేని గృతిదాతల కేమిఫలమ్ము? చెప్పుఁడీ? 249

శా. అచ్చొత్తించితి మందురేమొ, యటులే యౌఁగాక యాసొమ్ముముఁ
వచ్చెంగాదె! యిఁకేని మా కొసఁగఁగావచ్చున్ జమీందారు లీ
వెచ్చమ్మున్ గణియింపఁగావలయునే! వేవేలకున్ మీరు భా
గ్యోచ్చైః శ్రీగనఁగావలెన్ మఱియు మేమో చూచి మెచ్చన్వలెన్. 250

చ. ఒకకృతి నెవ్వఁడో నృపతి కొక్కనికిచ్చి మహాగ్రహారముల్
సుకరిరథాశ్వముల్ మొదలు చూఱలు గొన్న కవీంద్రజాతి కె
న్ని కృతుల నెందఱెందఱికినేని యొసంగిన నేఁటి కాలమం
దకట! యొకింత పొట్టకును నన్నము చాల దదేమి పాపమో! 251

ఉ. ఇచ్చినదేమొ పుచ్చుకొని "యింతియ చా"లని సంతసించి పై
వచ్చుఁగదా, పరీక్షకిది పాఠము పెట్టినయప్పు డంచు మే
మిచ్చఁదలంపుచుంటి మది యిప్పటికబ్బె ననుగ్రహించి మా
కిచ్చుట న్యాయమా? యిడక యీగతి మిన్నకయుంట న్యాయమా?252

ఉ. "అమ్మిన పైకమంతయును నాపయి మీకె యొసంగువార మే
మిమ్మెయిఁ గోరనేల? యని యీ రనవత్తురొ, యేమి లాభ? మీ
యెమ్మెలు సర్వముంగనియె యీక్రియ వ్రాయఁగ బుద్ధిపుట్టె లో
కమ్మిది వేఱు; నేఁడు కవిగాఁదగ దింతకు వేయు నేటికిన్. 253

చ. తిరుపతి శాస్త్రి కిచ్చెడిట్కృతిన్ బునరార్జన సేయుటో? కృతీ
శ్వరతకునిచ్చు ద్రవ్యమది సంగ్రహణం బొనరించుకొంటొ దే

వర యిటులాచరించు టది భావ్య మటంచును నాకుఁ దోఁప దె
వ్వరును జమీనుదారు లిటువంటికృతుల్ గొనరెందు నెన్నఁడుఁ. 254

—• నాల్గవ సంవత్సరం నూజివీడు శ్రీ వానమామలస్వామి •—

శ్లో. స్వామిం శ్ర్చీకరదర్శనం ప్రభవతాం యుష్మాదృశాం మాదృశాం
సంతాపం హరతే దదాతి విజయం విద్యా మవద్యేతరాం
సంపత్తించ తనోతి కీర్తి మతులాం కల్యాణ పారంపరీం
సర్వం సిధ్యతి యద్భవాన్ భగవత శ్రీశస్య రూపాంతరమ్. 255

శ్లో. తాదృశో భగవతోఽవతోగురో
ర్దుర్లభం భవతి యత్నత స్స్వయం
దర్శనం తదిహ రామచంద్రితః
కేవలం సులభ మద్య సంభృతమ్. 256

శ్లో. దేవోభవాన్నరపతి ర్భవదీయభక్తోఽ
ప్యారాయభూపతి రథాఽపి వయం కవీంద్రాః
అన్యోఽన్య గౌరవవశా ద్భవదంతికాప్తి
ర్భక్త్యాశ్రియోదిశతి భావుకదేవతాప్తిమ్. 257

శ్లో. క్వతోతాద్రిః ! క్వ వా యూయం ! క్వవయం ! భృతకోద్యతాః
పూర్వజన్మార్జితం పుణ్యం, కస్మైన్మనామ నకల్పతే. 258

శ్లో. శ్రీరామానుజదేశికేంద్ర భవతా మేషా నతిః కేవలా
ద్వైతేనాఽపి మయా నిరంకహృదయే నానందతో దీయతే
యుష్మద్భక్తగణేషు యాదృశదయా తాదృగ్దయా మయ్యపి
స్వామిం ష్తుల్య చరాచరేణ భవతా కార్యా యతి శ్రీపతే. 259

శ్లో. యతీనాం రాజాహి ప్రభవతి యతీ రా డితి మహాన్
కవీనాం సందేహో భవదుఽయ సందర్శనమితః
యతో వైరాగ్యే సంపది భగవతా చాఽత్రభవతా
సమం పారమ్యం సంభృత మనఘ రామానుజగురో. 260

ఉ. ఇప్పటి కెంత లే వనిన నేఁబదిగ్రంథము లాంధ్రమందు నొం
పొప్పెడు సంస్కృతంబునను నున్నవి మా రచియించినట్టి వో
యప్ప! భవత్సమీపమున నన్నియును న్వినిపింపఁగా మదిం
గొప్ప కుతూహలంబు పురికొల్పెడు మీరలు విజ్ఞులౌటచేన్. 261

మ. అవధానమ్ము లవెన్నియో సలిపి ధీ యాయాస మట్లుండ భూ
ధవులన్ జూడఁగ దేశము ల్దిరుగుటన్ దార్ఢ్యంబు దేహంబున
న్మ్రవులం దగ్గెను, దానఁజేసి యొకట న్మేమెట్టులో యుండి యీ
వ్యవసాయంబె పరిత్యజించితిమి జియ్యా! అయ్య! రామానుజా! 262

సీ. దర్శనంబునన యెంతటి మూర్ఖునేని వి
ద్యావంతుఁగాఁజేయు ధన్యు లనియు
తప్పైన నొప్పుగాఁ దగ లగింపఁగఁజాలు
నోర్పుగల్గిన మహాయోగ్యులనియు
ఇపుడెట్టులైనను నిద్దానిఁ బట్టి పూ
ర్వపుశక్తి గుర్తించువార లనియు
రాజు లెందఱిఁజూచి రాణించినను భవద్
గౌరవంబున కీడు గా దటనియు
తే. గీ. రామచంద్రాప్పరాయ లూరకయ రండ
టంచు వ్రాసెడువారుగా రనియు వచ్చి
నార మిరువురమును మిమ్ము నారయుటకు
వానమామలజియ్య! రామానుజయ్య! 263

— శ్రీరామచంద్రాప్పారావుగారు —

మ. విపరీతంబులు చేయనీయని శుభావిర్భూతిచే శాంతిచేఁ
గృపచే సర్వమహీపతి ప్రణుతపక్షిన్ బుత్రులం బౌత్రులు
న్విపులైశ్వర్యముతో ముదం బొసఁగ నుర్వీనాథరత్నంబ! యె
ల్లపుడున్విన్నల శోభనాచలనృసింహస్వామి పాలించుతన్. 264

మ. సరసాంతఃకరణుండు చారుకవితాస్వారస్యసంవేది యం
చురుకీర్తిం గనుచున్న మీసముఖ మేదో దైవలోపంబుచే
దొరయంజాలకపోతి నేఁటి కది మత్పుణ్యాతిరేకంబునం
జిరకాలంబున కీప్రకారము లభించెన్ రామచంద్రాధిపా! 265

ఆ. వె. మేటిరాజవయ్య మిత్రుండవైతివి
మాగృహంబు సిరులఁ దూఁగ కున్నె?
రాముఁ డంచు నిన్నురహిఁగొల్వఁ బండదే
కోర్కె? రామచంద్ర కువలయేశ! 266

క. మణిపూసలు సుతులు, సతీ
మణి పూసలలోన దారమనఁ దగు, రాజా
గ్రణివి భవత్కథ సంప
చ్ఛ్రణ మప్పారాయ! రామచంద్రకుప్పా! 267

మ. అవనీపాలురు కొందఱేని గవిరాజాలంబకు ల్లేనిచో
వ్యవసాయం బొనరింపఁగా వలయునో? వాణిజ్యవృత్తంబునం
దవులంగా వలెనో? సదా పరిణత ద్రాక్షాగుళుచ్ఛంపు వా
చవులం దేలుచు సత్కవీశ్వరులు రాజా! రామచంద్రాధిపా! 268

ఉ. పాటిలునేమొకో గుడిసెపాటుతనం బని కొంకునాళ్ళలోఁ
జీటికిమాటికిం బిలువఁజేయుచు నూటపదాఱు లిచ్చు మీ
బోఁటి నరేంద్రులేర్పడిరిపో, యిఁక సత్కవితాపురంధ్రి కే
లోటులు లేవు మాతరములోపల నో పృథివీంద్రచంద్రమా! 269

సీ. చదివినారము శబ్దశాస్త్రంబు తుదముట్టఁ
జిరకాల మొక్క దేశికునియొద్దఁ
దిరిగినారము తెన్గుదేశమెల్ల శతావ
ధానపరిచారపరిధానముగను
రచియించినా మనగ్రంథమ్ము లొక్కక
వీశ్వరుండే రచియించినట్లు

పొరపొచ్చె మింతేని బొరయకుండఁగ నిల్పి
కొన్నార మేము గైకొనినమైత్రి
తే. గీ. యొక్కరే చేసి రవధాన మొక్కనూఁజి
వీట ననుమాటయును దీఱె నేఁటితోడ
సరసతిరుపతివేంకటేశ్వరకవీశ్వ
రాశ్రియణగేయ ! రామచంద్రాప్పరాయ ! 270

చ. జగతిఁ బ్రసిద్ధుఁడై కడు యశంబువహించు కవీంద్రుఁగాని నీ
వగపడువానికెల్ల బహుళార్థములిచ్చుచు సత్కరింప, విం
పుగఁ గవితారసం బెఱిఁగి మోదముతో నిడు రాజుఁ గాని మే
మగపడువానికెల్ల నిటు లర్థులు గా మెపు డప్పరాడ్విభూ ! 271

మ. కవు లెల్లం దలయూచి మెచ్చఁగల వాక్చాతుర్య మింపొందు మా
నవరత్నంబులు మీరు మెచ్చఁగల విన్నాణంబు లేకున్న మా
కవులే చేసిరటన్న యాశ్రితకటాక్షం బొప్పఁగా నైన మా
నవరత్నంబులు స్వీకరింపఁగదవన్నా ! రామచంద్రాధిపా ! 272

—• రెండవసంవత్సరం ఖాశింకోట •—

క. రామా ! నీరేజదళ
శ్యామా ! సీతాభిరామ ! జగదభిరామా !
కామాభిరామ ! నతసు
త్రామా ! రాక్షసవిరామ ! రవికులధామా ! 273

సీ. శ్రీవర్ధమాన మాఱెళ్ళాన్వయక్షీర
వారాశిపూర్ణ జైవాతృకుండు
భోజభూపతి వంటి పొలుపుగాంచిన వేంక
టాచలభూపాలు నాత్మభవుఁడు
నఖిలసస్యసమృద్ధమైన ఖాసింకోట
రాజధానిగ నేలు బ్రాహ్మణుండు
మితభాషి సత్యసమ్మితభాషి విద్యావి
నోది యాశ్రితపాలనుండు ఘనుఁడు

తే. గీ. వేంకటాచలనామకోర్వీధవుండు
చైత్రమాసాది నీకు వసంతపూజ
తొమ్మిదిదినంబు లధికసంతోష విజయ
విభవములు పెంపుచెందఁ గావింపఁజేసె. 274

తే. గీ. పదియవదినంబునందు సంపదచెలంగ
వేదవేదాంగనిధులైన విప్రవరుల
సమ్మతంబున నధికముదమ్ము గాఁగ
వఱలెఁ బట్టాభిషేకోత్సవంబు నీకు. 275

క. వనభోజనోత్సవంబుం
దనమిత్రులతోడఁ గలసి నాఁటినిశిం జే
సెను బహుళతరానందం
బున విభుఁ "డానందబాగు" పూవుందోఁటన్. 276

తే. గీ. అధికముదమున నూటపదార్లు మొదలు
బహుమతు లొసంగి గాయకవరుల సుకవి
వరుల నంపించెఁ దరువాత వారువారుఁ
జెలఁగి సంపత్కరముగ నాశీర్వదింప. 277

చ. పదిఁబది నాఁటిరాత్రి జనపాలుని కొల్వున మంచి యమృతా
స్పదములఁ బెక్కుచిత్రములఁ బల్విరిదెందములం గరంబునున్
మృదుమధురోక్తులం దనిపె మేటియనందగు బుద్ధిశక్తికిం
గుదురని మెచ్చుకోఁదగిన కొండలరావు బుధుల్ మతింపఁగన్. 278

గీ. ఇంద్రజాలము మఱియు మహేంద్రజాల
కంబనుచుఁ జూచితిమి పుస్తకంబులందు
వానిఁ బ్రత్యక్ష మొనరించె వరుస నతఁడు
"ఫార్సు" చూపించెఁ బిదప నెబాసనంగ. 279

తే. గీ. తొమ్మిది దినంబు లిట్లు సంతోష మెసఁగఁ
జెలువుమీఱఁగ నిన్నుఁ బూజించినట్టి

సరసు మారెళ్ళ వేంకటాచలనృపాలు
తనయు రక్షింపుమయ్యా, సీతాకళత్ర! 280

తే. గీ. పుత్రపౌత్రాభివృద్ధి సంపూర్ణబుద్ధి
ఆయురారోగ్యములు సంపదాదికములు
నిచ్చి శ్రీరామచంద్ర! నీవెపుడుఁ బ్రోవ
వలయు మారెళ్ళ వెంకటాచలనృపాలు. 281

—• సంస్కృతపు ఇనస్పెక్టరు, ఆర్. కృష్ణమాచార్యులుగారు •—

ఉ. వేదమువృద్ధిచెందుత, వివేకము హెచ్చుత, శాస్త్రమందు నా
మోదమువొల్చుతన్, సమసిపోవుత మూర్ఖత, నాఁడునాఁటికిన్
బాదజులాదిగాఁ గలుగు వర్ణములందును విద్య లొప్పుతన్
భేదములన్నిఁటన్ గలిగి పెంపలరుచుండుత దేశమాతయున్. 282

మ. వినుఁడీ! వైదికులార! మీ మనములన్ భీతుల్ దిగన్ ద్రావుఁడీ!
మనుఁడీ! మీ మతమర్మకర్మములతో మర్యాద లీపైని గై
కొనుఁడీ! కృష్ణుఁడు దక్షిణాశ నడుగో, గోగోపలోలాత్ముఁడై
జనియించెన్ మనకేమిలోప మిఁక ధర్మంబుల్ విడంబోకుఁడీ. 283

ఆ. వె. శాస్త్రకర్మమునకు సాహాయ్య మొనరించె
నాంజనేయమూర్తి యపుడు రామ
మూర్తి, కిపుడు కృష్ణమూర్తికి, నాకృతి
యందుఁ దోడుపడియె నతఁడు బళిరె! 284

ఉ. కాలపుబల్మిచే నిగమగాథలు పూజ్యములయ్యుఁ బూజ్యమై
మూలనడంగె నాకలలు పూవి పఠించిన వారిఁ బట్టినా
సాలఁ గలట్టి నాగరికసంఘము గేలియొనర్పఁజొచ్చె నీ
గాలియు వానయున్ బొలియఁగాక భవత్కృపఁగృష్ణసత్కవీ! 285

క. కవివో! శాస్త్రివొ! రావువొ!
యవధానివొ! పంతులవొకొ! యాచార్యుఁడవో!

సవిశేషమ్ముగ నిన్నెటు
కవులు పిలువవలయుఁ? జెప్పఁగాదగుఁ గృష్ణా! 286

శా. స్వామీ, యేమనువాఁడ నీమహిమ! దేశంబెల్ల నింగ్లీషుభా
షామూలం బగునట్టిపట్టున పరీక్షావ్యాజమున్ బూని నీ
వీమాడ్కిన్ జగమెల్ల సంస్కృతకలాహేలాలవాలమ్ముగా
క్షేమస్మాన్యముగా నొనర్చితివికాదే! కృష్ణమార్యాగ్రణీ! 287

సీ. వేదశాస్త్రాదుల కాదిమూలంబైన
మంచివంశమున జన్మించినావు
జన్మానుసరణంబు జవదాఁటకుండ న
శేషశాస్త్రము లభ్యసించినావు
వేదశాస్త్రాదుల వెలతగ్గె నిపుడని
యింగ్లీషులోఁ బ్రవేశించినావు
ఉద్యోగ మది పూరుషోచితమని పరీ
క్షాధికారమున 'జాయ' నయినావు

తే. గీ. కవిత పూర్వపుణ్యమునను కలిగె వేంక
టప్పలాచార్యశాస్త్రి తోడయ్యె నుపరి,
స్వామి! నీభాగ్య మేమని సన్నుతింతు
నార్యనుతచర్య! శ్రీకృష్ణమార్యవర్య! 288

చ. మునుపు గుచేలుఁ డున్నతిని బొందఁదలంచి యనంతరంబు కృ
ష్ణుని గననెంచి యటుకులను సూడిద గైకొనురీతి నేను మి
మ్మనుగని యున్నతిం గనెడిబుద్ధిని గానుక గాఁగఁ బద్యముల్
పనిగొని కొన్ని చెప్పితిని బండిత కృష్ణ కవీంద్ర! నీపయిన్. 289

—• పైవారి సంస్కృతోపన్యాసమునకు నాళువులో తెలిఁగించినది •—

తే. గీ. భాషలెన్నేని గల వహో! భాషలందు
సంస్కృతం బుత్తమంబు తత్సరణిఁబోల
నితర భాషల కించుకయేని గాదు
దాని కెన్నియొ హేతువుల్ తనరుఁజుండి. 290

క. అందు మొదటిహేతువు మీ
కందఱికిని సుగమమే మహామహులారా!
యిందుమె సంస్కృతమను పే
రందనరెడి భాషనొకటిఁ బ్రబలినదానిన్. 291

గీ. "క్రొత్తక్రొత్త రూపమ్ములు క్రొత్తక్రొత్త
రచనలును దేవభాషలోఁ గ్రాలుపగిది
నన్యభాషలలో లే"వటంచు కృష్ణ
మార్యుఁ డెదిసెప్పె నదియ సత్యంబుసుండీ. 292

గీ. మనకు నన్నివిషయముల జననియైన
వేద మీభాషలోననే వెలయుచుండ
నెవ్వరెఱుఁగని? దిటువంటి దెందు లేదు
భాష, ప్రాశస్త్యమునను బావనతయందు. 293

క. పావనత నట్టు లుంచుఁడు
జీవముగల భాషయైన శ్రీసంస్కృతమే
యీవిధి శ్రవణప్రీతి మ
తేవియు భాషలు పొనర్ప విది నిక్కువమౌ. 294

గీ. ఇందుల కనేకములు స్వామి యిచ్చినారు
తగిన దృష్టాంతముల, నిది తగ వినుండు
పొట్ట కన్నములేని యీపట్టునందు
దీనిఁ బఠియింత్రు జను, లది దీని మహిమ. 295

గీ. విత్తకరిగాని విద్యను వెఱ్ఱియైన
సంగ్రహింపఁడుగద! నేఁడు సంస్కృతమును
జదువనేఁటికిఁ? జదివెఁబో చదువ నేమి
లాభమున్నది? యెందు కీలోభ మిచట? 296

గీ. దీని మాధుర్యమునకు సమానమైన
గానము మఱియెందునేనియుఁ గనమియె సుఁడీ

కానిచో హూణమయమైన కాలమందు
నెందు కిచ్చట( గృషిసేతు రెల్లవారు ! 297

క. అన్నమ్ము వెట్టుననియో
మన్నన కలిగించుననియొ ! మఱియుఁ దనున్ సం
పన్నునిఁజేయుననియొ ! యే
మున్నది యిద్దాన సుగుణ మొక రసము వినా ? 298

గీ. "మాక్సుమూలరు" మొదలగు మాన్యచరితు
లితరదేశపువారయ్యు నిందుఁ గల్గు
సు క్తిమాధుర్యమునకుఁ దా మోడికాదె !
బట్టులై రెన్నఁదగినట్టి భట్టులయ్యు. 299

సీ. ఎందుకై పుట్టుటో, యెందుకేగుటయొనా
శంకనడఁచు నొక్క సంస్కృతంబె
సుకృతదుష్కృతముల ప్రతికృతులెట్టివొకొనా
శంకనడఁచునొక్క సంస్కృతంబె
జీవుఁడెవ్వండొకో, దేవుఁడెవ్వఁడొకొనా
శఁకనడఁచునొక్క సంస్కృతంబె
న్యాయమెయ్యదియొయన్యాయ మెయ్యదియొనా
శంకనడఁచు నొక్క సంస్కృతంబె

గీ. ఇంతయెందుకు, సామాన్య మెల్లరకును
గలుగు మొగమును నెగడింపఁగలిగినట్టి
దొక్క సంస్కృతభాషయే యెందుభాష
లిన్నియోగ్యతలున్నవి సున్న సున్న. 300

గీ. ఇట్టి సంస్కృతభాషచే నిహముఁ బరము
గన్నవార లనేకులు గలరు, దాని
నట్టులుంచుఁడు దీనికి నగ్రపుత్రి
యైన తెలుఁగుబాసయు నెంత యర్హ్యమహహ ! 301

ఉ. నన్నయతిక్కనాదులు సనాతనులున్ దదనంతరంబు పె
ద్దన్నయు ముక్కుతిమ్మనయు నాపయిఁ గొందఱుఁ గన్న మాన్యతల్
విన్నవికావె ! మీరలు, స్వవేషము భాషయు నేరికేనియున్
మన్నన దెచ్చునంచెఱిఁగి మానకుఁ డాంధ్రమునందు భక్తియున్. 302

గీ. ఆంధ్రదేశీయులార ! మీరంద ఱొక్క
ప్రార్థనను గైకొనుఁడు దేవభాషయందు
కొంచెమేని పరిశ్రమ కొనవలెఁ జూఁడి
దాన సులభంబుగా మీకుఁ దనరుఁ దెల్వి. 303

ఆ వె. ఆదిభాషయందు నంతో యింతో ప్రవేశ
మబ్బకున్నవారి కందఱికిని
వందనములొనర్తు, నెందుకందురయేని
తెలుఁగునందు మీరు దిగకుఁడనుచు. 304

గీ. తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్ము హెచ్చు;
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ జాలు
దాని; కిద్దానికో, రెంటఁ బగులపలయు. 305

క. ఓ సంస్కృతమా ! నీకిఁక
శ్రీ సన్నిధి కేగుదెంచెఁ జింతింపకుమీ
నీసఖుఁడు కృష్ణమార్యుఁడు
వ్యాసుండై యవతరించె వర్ధిల్లుమిఁకన్. 306

—• బందరు — జంధ్యాల గౌరీనాథశాస్త్రిలుగారు •—

శ్లో. భవదాదరకారణా దహం, నహికించి త్ప్రథయామి దీనతాః
నహిపృచ్ఛతి పుత్రికే ప్రసూ రపి నో యచ్ఛతికిం బతాఽపరే. 307

శ్లో. సదృశేషు భవద్భిరాదృతా, కరుణా సాఽపి మయి ప్రవర్తతామ్
సమయోఽయ మితి బ్రవీమి భో, స్వకలం వోవిదితం కలావతామ్.

శ్లో. భృతకంతుమమాఽప్యతోధికం, వితరంతీతి బృహత్పురాత్పురా
అసి పీఠపురా త్సమాగతం. ననుపత్రం త దుపేక్షితంమయా. 309

శ్లో. క్రియ తేయదివా శ్వవృత్తి రేషా,ననునాఽన్యత్రిపరం త్విహైవనూనం
ఇతినిశ్చితవర్తనస్య బాధం, గతి రన్యత్ర కదాఽపిమే న భూయాత్.

శ్లో. నాఽహ మర్హో నవాయూాయం, మయ్యనుగ్రిహశాలినః
నమచ్ఛిష్యాః కృతార్థావా, నమేకిం భృతకోచ్ఛ్రయః 311

శ్లో. నహి ద్రివిణమస్తికిం క్రియత ఇత్యపి ప్రోచ్యతే
తథాస్తు నహి తత్రిమే కిమపివక్తు మిచ్ఛాపరం
కుత స్స్వసదృశేషు త న్నహి పరం మమైవైత ది
త్యతీవ హృదయే భవత్యనఘ సంశయ స్సన్మణే ! 312

శ్లో. పురాకాలే యావద్భృతక మిహకాలేఽపిచ తథా,
యదిస్యాత్తా మేఽస్మిన్‌కథ ముదరపూర్తి గృహిమణే
కలావిక్రేతృత్వేఽ ప్యనధిగతసంసారభరణః
కవిత్వగ్రంథానామపి వినిమయస్యాఽస్పదమహం, 313

శ్లో. క్లుప్తోమే సంసారో, గృహస్య నైవాఽస్తి దేయతా కించిత్
తదపిన పర్యాప్తమిదం, భృతకమితి తదేత దీశ్వరో వేత్తి. 314

శ్లో. గైర్వాణ్యా అపిచాంధ్ర పాఠనవిధౌ విద్యార్థి బాహుళ్యతః
కష్టంస్పష్ట మతస్తతోఽధికతరం మే జాయతాం జీవితం
దృష్టాంతోఽత్రపురి స్థితాముకురవత్కా లేజిరేవాఽస్తి భో
గౌరీనాథకలానిధే కిమపరం వాచ్యంభవాదృగ్విదాం. 315

శ్లో. ఇదమేవ భవే ద్భవద్వశా, త్సకలానామపి తత్సభాసదాం
ఇతినిశ్చయత స్సమర్పితం, తదిదం మాఽస్తు వృథాకథాస్పదం. 316

శ్లో. అన్యేషా మభివృద్ధితో నసహతే, సోఽయం, దురూహాః పుమా
నిత్యేవంకతిచి ద్వదంతు మమ తేనైవాఽఽశయజ్ఞానినః
తద్వృద్ధి ర్మమ వృద్ధిరేవహి తత స్తన్మే పరంసమ్మతం
పూర్వాంగం త్వనవాప్యవృద్ధి మయతే నైవోత్తరాంగం క్వచిత్. 317

—• బందరు కృత్తివెన్ను జమీందారుగారు •—

ఉ. గాయకుఁడౌనుగాక మఱి గాయనియే యగుఁగాక పేర్మిమై
నీయెడకేగుదేర నొగినెవ్వఁడు దా సభఁజేసి తృప్తులం
జేయునొ యట్టియీతని నశేషసుఖంబిడి ప్రోచు గాయనీ
గాయనగేయుఁ డా హరి దగన్ బుచివెంకటరెడ్డి నాయనిన్. 318

—• బందరు శ్రీ దొడ్డంపేట వాడరేవు రంగనాయకమ్మగారి
దత్తపుత్రుని వివాహము •—

మ. అనుఁగుంబ్రేయసి మున్నుగా లలితనా నావిర్భవంబందఁదా
నను దద్రూపముమీఱు రూపమును బూనున్ బుద్ధి బాముల్ మొదల్
తనసర్వంబు పదిత్యజించి సతిచిత్తం బెక్కు కామేశ్వరుం
డనుదేవుం డిడుఁగాక భద్రములు రమ్యంబైన యీ జంటకున్. 319

సీ. ఎవ్వానితండ్రి తా నవ్వారిగాఁ గలా
సారస్య మెఱిఁగిన ధీరవరుఁడు
ఎవ్వానితల్లి లోకైక ప్రసిద్ధంబు
లగు సద్గుణంబుల కాకరంబు
ఎవ్వానిమాతామహియగు పెంపుడుఁదల్లి
రంగాంబ త్రిభువనారాధ్యచరిత
ఎవనిభావుకుఁడుభూపవరుఁడయ్యునుగవి
త్వముగూడరచియించు ధన్యతముఁడు

తే. గీ. ఎవనిభార్య నియోగులందెల్లఁ బెద్ద
పేరుగల వడ్లమన్నాటివారి పడుచు
అతఁడు శ్రీవిశ్వసుందరుఁ డనుగతార్ధ
నామకుఁడు వర్ధిలుత, జమీందారుఁడగుచు. 320

చ ం ప క మా ల

జనకుఁ డనన్ గవీశ్వరుఁడు శాశ్వతకీర్తిమతల్లి తల్లి పెం
చినయబిరంగనాయకమఁ జెప్పినసోట మ తొక్కరిన్ వచిం

ప నగుదు రెల్లవారుఁ, "గవిపండితసంఘ" మటంచుఁ బెట్టి నూ
తనమగుత్రోవఁ జూపినయుదారుఁడు బావ భుజంగరావు, గా
యనజనగాయనీజనసమాదృతిచే నభిధానుకూల్యముం
గనుటయకాక భూభరణకార్యమునందును నట్టివాఁడె వీ
రిని నిటులుంచి, యీవయిపురీతి గణింతము నీదు భార్య పు
యలచోటు వైదికపుఁతీవి నియోగపుఁడెక్కుఁగూడఁగ
ల్గినయది సర్వమున్ సుపథలీల ఘటిల్లుటచేతనే జయం
బునకు నివాసమయ్యె నిది భూసురరాజ ! యిఁకొక్కమాట యెం
దునకునుగాని కట్టుఁబడిత్రోవలు లేనికతానఁ గాదె ! గా
యనజనగాయనీజనులు హాయిగఁబాడుట దీనఁగల్గె; నే
మనఁదగు శంభుఁడే యిటకు నాగతుఁడైనను నాతిరీతి హా
యిని గలిగింప నేర్చునె ? యటేనియుఁ "బూరుషగాన మంగనా
జనముల సంస్కృతం" బనెడి సామెతకున్ గతియేమి ? పెండ్లిసే
యొనరుచుకోఁగ నిచ్చగలయోగ్యుల కియ్యది మార్గదర్శిగాఁ
గనుపడుచున్న, దిట్లు తగుగాయకులున్ గవులున్ బ్రసిద్ధగా
యనులును గల్గు మేటిసభ లారసి యారసి నేఁడు కూపకూ
ర్మనియతినున్న నా కిపుడు మానస మించుక సంతసించె నే
మన ? గదవాలరా జిటు సమాదరణం బొనరించి గాయనీ
జనకవిగాయకాదులకు సంతతముం బ్రతివత్సరంబు మ
న్నవల నొనర్చు నియ్యెడఁ గనంబడ విట్టిపసుల్, భవచ్ఛుభం
బున నిది మొల్కయెత్తె నిఁకముందును నీ విది భార్యతోడిదే
యని మదినెంచి కాఁదగినయట్టి ప్రభుండవుగాన సాహితీ
వనితను గీతితోఁ గలిపి భవ్యగతిన్ గనఁజేయుచున్ జమీన్
దనరెడితక్కుగేస్తులకు దారిని జూపఁగదయ్య ! "బావ నీ
కును మతి నీవు తక్కొరులకున్ గురువై" రని ముందువారు దీ
నిని గడుమెచ్చికొందురు జనించిన కస్తురివంశ మిక్కుతం

బునను బరీమళించి కడుఁ బొంపిరివోవుచుఁ "నోడరేవు" త్రో
వను జగమెల్ల మొల్లపుసువాసన నిండఁగఁజేయు నిక్కతం
బున నభివృద్ధి నందెదవు పూర్వపురాజులఁబోలి నీవు, శో
భనముగ విశ్వసుందరనృపా ! ధర యేలెద వార్య లౌననన్. 321

క. మొదలన్ గస్తూరీసం
పద గల్గినయింటఁ బుట్టువడసిన నిన్న
య్యది వీడునె ? నీవద్దా
ని దిగన్ ద్రావిసను సహజనిత్వము కలిమిన్. 322

— • శ్రీ రాజా రామచంద్రాప్పారావుగారి నిర్యాణము •—

నూ జి వీ డు

చ. కలి నొకయైదువేలపది గాఁడగుశాలిశకంబు చంద్రదృ
క్కలభధరల్ పొసంగఁగ జగద్ధితుఁ డప్పయరావు రామచం
ద్రలలితనాముఁడేగె సురనాథునిఁ జూడఁగ సౌమ్యవత్స రం
బలవడఁ బూర్ణిమన్ నలుఫదాఱవయేటను మాధవమ్మునన్. 223

శా. ఓసౌమ్యాబ్దమ ! యెంత జేసితివి నీ వోహో ! దయాశాలి వి
ద్యాసంపన్నుఁడు రామచంద్రవిభుఁ డత్యానంది యాధీరు స్వ
ర్వాసింజేసిన నీదుసౌమ్యతకు నేవా రొప్పువారింక, నీ
కేసంతోషము గల్గె ! నిక్కతన నోసీ ! గోముఖవ్యాఘ్రమా ! 324

ఉ. రాజులు లేరె లోకమున, రాజులుగాఁగల రేమి లాభ ? మీ
తేజము రంజకత్వమును దేఁకువ లోఁకువగానిశక్తియున్
భోజునివంటి పాండితియుఁ బొల్చెడివాఁ డెవఁడో వచింపు మిం
కీజనపాలురందు ధరణీశ శిఖామణి ! యప్పరాడ్విభూ ! 325

సీ. తల్పుగొట్టినయంత దానమిచ్చెడి ఱేండ్లు
గలరె ! యీనాఁటిలోకముననెందు
తా జ్వరమ్మున మున్గుతఱి వార్షికమ్మిచ్చు
మేటివదాన్యు లీనాఁటఁగలరె !

పస్సుగావార్షికం బెన్ని యర్పించు భూ
నాథుండుఁగూడ నున్నాఁడెయిపుడు!
"వారంటు" గైకొని వచ్చువానికిఁ బోలెఁ
గవి కిచ్చుదాత లిక్కడిలఁగలారె!
తే. గీ. వహ్వారే! నీకుఁ జెల్లె నీ వార్షిక ప్ర
దానచాతురి యిందుల కేనె సాక్షి
యెంతకవియైన నగునుగా కెవరుచూతు
రయ్య! యీనాఁడు రామచంద్రాప్పరాయ! 326

శా. దాతల్ లేరనికాదు వారిదరికిన్ ధైర్యమ్మునన్ బోదుమో,
యేతేరన్ మఱివారు బందుగులుగానీ మమ్ముఁ బ్రేమింతురో?
యీతీ రెక్కడనుండఁబోవ దకటా! యే మెందఱన్ జూడ మో
దాతృత్వంబ! యనాథవై తిగదె! తథ్యం బప్పరా వేగుటన్. 327

మ. ఘనవంశమ్మునఁబుట్టినాఁడ ననుచున్ గర్వంబు గైకోవు వి
ద్యను సంపూర్తిగ నేర్చియుణ్ణ వినయమున్ దైవారఁ గైకొంటివో
యనఘా! యెల్లర కీవు నచ్చెదవు, నీకా, యెల్లయం దెవ్వఁడో
మన మెక్కున్ విను మప్పరాయ! యిదెసుమ్మా నీకు దోసంబనన్.

మ. అవివేకుల్ గడు దుర్మదాంధులును మర్యాదావిహీనుల్ నృపుల్
కవినింద్యుల్ ధ్రువ మంచు నీ వెఱుఁగు టక్కాదంబరీ కావ్యమం
దు విశేషమ్ముగ రాజనీతికడఁ బంక్తుల్ నీవు గుర్తించిన
ట్టివి వేనోళ్ళ వచించు నారనృపుపట్టీ! రామచంద్రాధిపా! 329

ఉ. నీవును మంత్రియున్ మఱియు నేనును "సారటుపై షికారుగాఁ"
బోవునెడన్ శిరోగ్రగతముల్ వసనమ్ములు కొమ్మరాపిడిన్
ద్రోవఁబడంగ నీవ చని తోకొనివచ్చి యొసంగినట్టి నీ
యా వినయంబు రాజకులమం దెటఁ గన్పడె నప్పరాడ్విభూ! 330

సీ. వినయంపుఁగనివి, వివేకివి, రాజకా
ర్యధురంధరుఁడవు, గర్వఁపుఁ దెఱవు

నెఱుఁగనివాఁడవు, పరుసదనంబు నీ
పేర్విన్నమాత్రనఁ బెటిలిపోవు,
విద్వాంసుఁడవు, లోకవిదిత చరిత్రుఁడ,
వనుకంప కీవ ముఖ్యమగు తావు
సత్కళత్రుండవు, సంతానశాలివి,
భోగివి, మిగుల విరాగివి, రఘు

తే. గీ. రామభక్తుండ వతుల పరాక్రమైక
శోభితుఁడ వుత్తముఁడవు యశోమయుఁడవు
వట్టినుతికాదు మీ గురువరుఁడు వాన
మామలస్వామి యిట సాక్షి మానవేంద్ర! 331

ఉ. ఇప్పుడు చెప్పితిన్ భవదహీనగుణమ్ములు కొన్నికొన్ని, మా
యప్పనరేంద్ర! నీ సముఖమందు వచింపఁగనేరనైతి నీ
వొప్పవటంచెఱుంగుదువు సున్నది యున్నటులేని జెప్పినన్
గొప్పకు నంద్రుగాక నృపకోటులు నీ కెనవత్తురే విభూ. 332

చ. ఎనిమిది యేడులాయె నిను నేఁ గని నాఁటనుగోలె నీధనం
బును దినుచుంటి నంచు నుతి పూనికఁ జేసితినంచు లోకులా
డను మఱి సాహసింతురను "డా" టొకకొంతయు నాకు లేదు నీ
గొనము లెఱుంగనట్టి మొఱకుల్ పరకుంగొనకున్న తెక్కయే. 333

—• అంతఃపుర పరామర్శ •—

చ. పతి గతియించెఁగాయని యపారపుదుఃఖము నందుచున్న మీ
మతి కెవ రేమిచెప్పిన సమాశ్వసనం బది గల్గఁబోదు దు
స్థితు లిటువంటి వెంతయు సతీతిలకమ్ముల మిమ్మబోంట్ల నా
ర్తతఁ గనఁజేయు టబ్బురమె! ధారుణి నెందఱొ భర్తలుండియున్
గతిచెడి మా కవిత్వసతి గాటపుదుఃఖము రామచంద్రిస
త్క్షితిపతి లేమిఁ గాంచి కడుదీనతఁ గుందుచునున్న, దెందఱో
పతులు గలట్టి యీపురి భవత్పతి స్వర్గతిఁజెంద మేటిదు

గ్గతి తన కబ్బెఁగా యనుచు గద్గదికన్ బ్రజయం దనా
రతస్థితి వెలిఁబుచ్చుచున్న, దెటువేకుఱు నింతటి తెల్వితేటలున్
ధృతియుఁ బ్రజానురాగమును దేజముఁ గొంకొకయింతలేని పాం
డితియును మంచియోరుపును నేరుపుగల్గిన రాజు దీనికిన్
వితగనుతిఁతుర్రి కొందఱు వివేకుః, నే నెపు డట్టి వట్టిప
ద్ధతిగననంచు నీపతి యథార్థముగా నెఱుఁగున్, భవన్మనం
బు తగ నెఱుంగు నన్ను, మిముబోంట్లకు దుఃఖముకూర్చుధాత దు
ర్మతి కిఁక నేమిసేతుఁ, బలుమాటలు నేమిటి కొక్కమాట, మీ
పతి కొక మీరెకాదుసుఁడీ! పండితులున్ గవులున్ గుణానుర
క్తతగల యెల్లవారు సతతమ్మును గుందినఁ దృప్తి గల్గునే?
సుతియనుకోకు మమ్మరో! యనుంగుఁగవిత్వముపాలి భాగ్యముల్
మృతిఁగనెఁగాని నీపతి యమేయయశోమయకాయుఁ డెన్నఁడున్
మృతిఁగనఁబోఁడు నిక్కమిది మిక్కిలి నమ్మఁగదమ్మ! దాతృతా
సతియుఁ గృపాలతాంగియును సంస్కృతభారతభారతీమహో
న్నతియును నీవునుంబలె ననాథతఁ గుందుచునున్నవారు నీ
పతియెడ నీవునుంబలెనె వారుఁ బతివ్రత, లట్టివారి బ
ల్వెత లుడుపంగదమ్మ! సువివేకిని నీవె మనంబులో నిటుల్
ధృతిచెడి కుందుచున్న నిఁక ధీరతకున్ గతియేమి? యింతకున్
సతమె శరీరముల్? వినుము సజ్జనమాన్యుఁడు నీదుభర్త, సం
తతిఁ గడుఁజక్కనైనది ముదంబునఁ గాంచినవాఁడు, కల్గు సం
తతి యదియెల్ల నున్నతవిధమ్మున నుండఁగ మేటిమోదపున్
గతియదితప్ప, దుఃఖమనఁగా నెటువంటిదొ లేశమేనిఁ దా
మతి నెఱుఁగండు ముద్దులకొమార్తయుఁ గోడలుఁగూడ మన్మలన్
గుతుకముమైఁ గనంగలుగు కోరికయుణ్ణా మదిలో నెఱింగినాఁ
డతులితుఁ డాతఁ డన్నిటను నాయన కెందును లోటులేదు, జీ
విత మిటు లెందు నెవ్వరికి నీసము వ్యర్థముగాకయుండ సం
గతముగఁ బోయె? నాయువునఁ గల్గెను గొండొకలోప, మయ్యెడన్

శతధృతికిన్ వివేక మది చాలకపోయెను, నేఁబదేడులేన్
బ్రతుకఁగఁజేయఁడయ్యె, నటు పాల్పడినన్ మఱికొన్ని ముచ్చటల్
ధృతిఘటియించుగాని, విను దేవి! సమస్తమునందుఁ బూర్తి దే
వతలకె లేనియప్డు నరపాలురకున్ గతి యెక్కడమ్మ? సు
స్థితి నిఁకఁ గాంచి పెద్దలును జిన్నలుగాని కుమారులన్ గొమా
రితలను దేర్చి, వీరలకు రేపట నెల్లుటఁ గల్గు శ్రేయముల్
గుతుక మెలర్పఁ గాంచఁదగు కోర్కెవహింపఁగదమ్మ! నీయెడం
బతి "కడు ధీరురాలనియుఁ బ్రాజ్ఞతలోఁ దనుమించు" నంచునున్
సతమును నమ్మటిప్పుడు ప్రసక్తికిఁ దేఁగదపమ్మ! సమ్మతిన్. 334

—• మన్మల జన్మదినోత్సవ సందర్భమునఁ జెప్పినది •—

గీ. రామచంద్రాప్పరాయల కేమిగాని
యెల్లవిధముల గడుఁ గృతకృత్యుఁ డతఁడు
ఈమహోత్సవ మాయన లేమిఁజేసి
మనకు సంతాపకర మనుకొనఁగ నయ్యె. 335

—• శ్రీ మైలవరపు జమీందారుగారు •—

మ. పటుకీర్తిప్రథితప్రబంధరచనాపారీణవిద్వత్కవి
ట్చటులోక్తిస్ఫురణావధానకలనాసందర్శనోత్సాహ! వేం
కటనారాయణరాయ! నీదుసభ వేడ్కన్ జూడ రాలేకపో
వుటకున్ గారణమున్ వచింతు వినుమీ భూపాలచూడామణీ! 336

క. శ్రీవేంకటనారాయణ
రావునకున్ శుభపరంపరావృద్ధికినై
దీవించి వేంకటేశుఁడు
శ్రీవిభవము వెలయ మనవిచేసికొను నిటుల్. 337

ఉ. శ్రీలలనామనోహరవిశేషకృపన్ సుజనాలవాలమై
భూలలితాంగికొప్పలరుభూషణమై యలరారునట్టిశ్రీ
మైలవరంబు నేలు గుణమాన్యుని ధన్యుని సూరనేని భూ
పాలకులీను నిన్ను భగవంతుఁడు పేర్మి నఖండుఁ జేసి స

చ్ఛీలతకున్ బర్రికాళగతిఁ జెందఁగఁజేసెడిఁగాక, యేరికిన్
బోలదు శత్రువైన విను భూప ! పరేచ్ఛకు లోఁగియుండుటల్
స్కూలునఁ దెల్పు 'టీచ' రని క్షుద్రులు కొందఱు నన్ను సారెకుఞ్
హేళనచేయుచుండినను నిప్పరి యోగ్యులు సేయుసత్కృతిన్
జాలినయంతసంతసము స్వాంతమునం గనుచుందు, "హిందుహై
స్కూలునొసైటి" నాపయినిగూర్చి విశేషము చూపు, దీనిలోఁ
జాలదినమ్ము లుంటి నొకచక్కని నేనొక యేడువత్సరాల్
తాలిమి నుండుటన్న నిది తద్గతయోగ్యత గాని చాపలా
వాలుఁడనైన నాదు గుణవత్త యనంజనదో నృపాల ! మీ
పాలికి "నేగుదెంతు" నని పత్రిక నంపియు వచ్చుపూనికన్
జాలనొనర్చియున్ దుద కసత్యవచస్కుఁడనైతి నోధరా
పాల ! పరీక్షకాలమిది, బాలురు వ్రాయుచునుండువేళఁ ద
త్స్థాలకు లుండఁగావలయుఁ బండితు లందుల కంతముఖ్యులై
గ్రాలికయుండినన్ సెలవుగైకొనివచ్చుట చిక్కదయ్యె. మా
స్కూలునఁ గొన్ని "రూల్సు" లవి క్రొత్తవి పుట్టుకతానఁజుండి మీ
పాలికివచ్చునాకు నొకపాటిది యున్ సెలవబ్బదయ్యె' వి
ద్యాలలనాతనూజులు నిరంకుశులయ్యును నేఁటికాలపుం
జాలునఁ బ్రింగి పొట్టకయి చాలఁ, గృశించుటఁజేసి శృంఖలా
కీలితులట్లు వేతొకరికిన్ వశులై చరియింపనయ్యె, నే
నోలి దినంబులైదు సెల వొందఁగఁజాలకపోతిఁ, బాతపుం
గోలయులేదు చేయఁదగు కొండొకకార్యముఁగూడ లేద, యీ
కాలమునందు వచ్చుటకుఁగా "సెలవీయరె" యంచు నెంచితిన్,
బాలకు లొప్పరైరి తలవంపు ఘటిల్లె, "స్వతంత్రతాస్పదున్
బోలఁడ యేమహాత్ముఁ" డని పూర్వులు సెప్పుట నేఁ దెఱింగితిన్
జాలఁగృపావిశేషమున సత్కృతిఁ జేసెడు నిచ్చ వైదుషీ
లోలురుమీరు "రం" డనుచు లోఁగడనే వ్యవధానముంచి యెం
తే లిఖియించిపంపితిరి తేఁకువకల్మిని జాబు, నేనునుఞ్

"మైలవరంబుఁ జూతు" నని మానసమందునఁ బొంగితిన్, దగుం
గాఁ జము చేకుఱెన్, గవుల గౌరవమన్న నెఱుంగునట్టివా
ర్పాలకుఁడై శి సర్వమును బాగుగనున్నను గ్రొత్త 'రూల్సు' మీ
పాలికివచ్చు నాపయిఁ గృపన్ గలదయ్యెఁ గ్రియానుకూల్యపున్
జాలునఁబోమి మానుటిది సంభవమయ్యె, నృపాల! యెప్పుడో
మైలవరంబు వచ్చెదను మానను మిమ్ముఁ జూచెదన్, సదా
స్కూలునఁ దెల్పు "టీచరుగ" నోలుచునుండునె? యీగ్రహంబె నా
పాలికి నెల్లకాలమును బట్టిపలార్చుచు జాతకమ్ములోఁ
గ్రాలెడినే? యిఁకన్ గొలఁదికాలములో గురుఁ దేగుదెంచు స
చ్ఛీలుఁ డతండు రాహుఁగతి జేయఁగజేయఁడు "నౌకరీ" గురు
శ్రీలొలయన్ స్వతంత్రునిగఁ జేయును, జాతక మేనెఱుంగుదున్
జాలదు నిట్టులుండియు వెసన్ దమపాలికి వచ్చుపూన్కికిన్
జాలియు రాకపోవుట విచారము సేయుటచే ఘటించె, నే
స్కూలుననుండి పాలకులసొమ్మును దించుఁ దదాజ్ఞలేక భూ
పాలుని జూడఁబోవుటది భావ్యముగాదని సంశయించితిన్;
"స్కూలున నుండనేల?" యని కొండొకసందియ ముండవచ్చు స
చ్ఛీలుర మీకు నిందులకుఁ జెప్పఁగజాల సదుత్తరంబు "నా
పాలిది" యంట యొప్పు, గరువమ్మున దేశములన్ జరించి వి
ద్యాలలితుల్ నృపాలకులయాదృతి గల్గి యొకింత ప్రజ్ఞయున్
గ్రాలి యెవండు నావలె నొకానొకటన్ దగులున్ నృపాల! యీ
స్కూల్ను విడన్ "గుటుంబమునకున్ భృతియె" ట్లను సందియమ్ముతో
డోలల నూఁగఁబోవ, "నిఁక డొంకెది?" యన్నను "శుద్ధవైదికున్
స్కూలునఁ బెట్టికొంటి" మని 'స్కూల్‌కమిటీ' కడుఁజింతిలున్‌గదా!
పాలకు నాజ్ఞలేక తమపాలికి వచ్చిన నంచుఁగొంకితిన్;
జాల శిరంబుఁ దూర్చుపయి రోకటిపో టెటుదప్పనోపగున్?
శీలలితుండు మీకడకుఁ దిర్పతిసత్కవి యేగుదెంచు, భూ
పాలకునొద్ద నుండుటది పండితలక్షణ మాతఁడల్లె వి

ద్యాలయుఁ దైన పోల్వర, ధరాధిపుసన్నిధి నుండె; నేనో యీ
కాలికి నాయితంబయితిఁ గొంచొకలోపము లేదుగాని భూ
గోళమునందు నెల్లెడల గొప్పమహామహు లుండ్రు వారి స
చ్ఛీలముఁజూచి యక్కతనఁ జెందెడిలాభము దూరమయ్యె, సు
శ్రీలకు నేమి, సత్సభలు సేయుచుఁ గాలముపుచ్చుకంటె నే
కాలమునందు సత్కవికి గౌరవముండదు, ప్రజ్ఞలేనిచోఁ
బోలునుగాక యెచ్చటనో పొట్టకునై కనిపెట్టుకుంట; నా
కేల ? నృపాల ! రాజమణు లెందఱొ యుండియుఁ బ్రజ్ఞ యుండియున్
స్కూలున "నమ్మమాట" యనుచున్ బొడిమాటలు చెప్పికొంచు గో
పాలకురీతి నుండఁగఁ; గృపాసలు లేరె, నృపాలు రక్కటా !
యీలలి కేరుఁ బండితులు నింతకుఁబూర్వము సమ్మతింప, రే
చాలనివారొ యిందులకుఁ జాలఁ బ్రయత్న మొనర్చువార, లీ
కాలమునందుఁగూడ సిరికాంతుఁడు కొందఱ మిమ్ముబోంటి స
చ్ఛీలుర సత్కవిత్వపరిశీలకులన్ సృజియించె లోటులే
దేల గతాంబుబంధనము ? లీపయి నేనియు జీవితంబు వి
ద్యాలలనామనోహరు లహర్పతితేజులు పూర్వులట్లు నే
నోలి నృపాలగణ్యముగ నుంచికొనం బ్రయతింతు, శిష్యులో
బాలురకున్ జయంబగుతఁ బాలకసంతతికిన్ సుఖంబు, మా
"స్కూలుకు" వందనంబు, లనుఁగుంజెలికాండ్రకు నేమ, మింక మా
ప్రోలికి నేగి మాగృహముపొంత వసించెదఁగాక, పిల్చు భూ
పాలురఁ జూచుచున్ గవనమై ఖరులన్ బ్రచురించుకొంచు, స
చ్ఛీలవదగ్రిగణ్యులకు సేవలుసల్ప యతింతుఁగాక, నా
పాలిటితల్లి కాళి తనపాదయుగంబు స్మరించు నాపయిన్
బాళి యొకింత చూపి యిటుపై ననుఁ బూర్వులఁద్రోవఁ ద్రొన్ని స
చ్ఛీలుఁడు బ్రహ్మపండితుఁడు చెప్పినముక్కలకున్ ఫలమ్మెటో
తేలుచుఁగాక, యిన్నిటికి ధీవరమాన్యులు మీరు, "హిందు హై
స్కూ"లధికారు లేర్పఱచు క్రొత్తవిశేషములు న్నిమిత్తమై

చాల రహించుఁగాక, కవిజాతికి స్వేచ్ఛ యొసంగుఁగాక, నా
పాలిటివేల్పుటావును ప్రబంధఫలావళికల్పవల్లి స
చ్ఛీలత కాటపట్టు, సుఖసేవధి బంద రెసంగుఁగాక యీ
ప్రోలికి రాకయున్నయెడఁ బొత్తములెన్ని రచించి యుంచినన్
గ్రాలఁగఁజేయుటబ్బు, దిట వ్రాయవలెన్ మఱికొంత యుల్లస
చ్ఛీలుఁడు భైరవాహ్వయుఁడు స్నేహితుఁ డిల్లొగినిచ్చి శిష్యుఁడై
యేలలి నన్నుఁజూచె నదియెల్లను దేవుఁ డెఱుంగు, నాతఁడే
శ్రీలకుఁదానకంబయిన స్వీయకళాలయమందు ముద్రిణం
బోలి మదీయగ్రంథముల కోపికమైఁ బచరించె నట్టి శీ
లాలయుఁడై కృతజ్ఞతకు నాకరమై తగువానికిన్ గృపా
వాలుఁ డొసంగుఁగాక భగవంతుఁడు మేటిసిరుల్; భవద్యశ
శ్శీలలరారుఁగాక కవిశేఖరవర్ణ్యములై, బుధాగ్రణీ
లోలత మీకుఁ జేకుఱుత, లోకములోఁ మఱియేరికన్న మీ
పాలి కితండు వచ్చుత నపారముదంబునఁ గొన్నినాళ్ళలో. 338

—• రెడ్డిపోలవరము పాఠశాల •—

సీ. నిలిపినాఁడఁట విద్యనేర్చి పెంపెక్కిన
శ్రీపోలవరధరిత్రీవిభుండు
తెలిచినాఁడఁట యశస్కరుఁడు గోదావరీ
కలితమంచలకరగ్రాహిమౌళి
పోషింతురఁట ప్రజాభ్యుదయ మారయు కళా
చతురులు పాలకసమితివారు
చదువువారఁటమహోచ్ఛ్రయముసాధింపఁగాఁ
జాలువిద్యను గోరుబాలురెల్లఁ
తే. గీ. బోలవర మున్కిపట్టఁట పుణ్యపురుషు
లెల్ల దీవించువారఁట యిన్ని వృద్ధి
పద్ధతులుకల్గి యలరు నీపాఠశాల
కొలఁదికాలములోన హైస్కూలుగాదె ! 339

చ. తనతమభావ మెన్నుచు సుధామధురోక్తులకేని కైతలో
మెఱుఁగిడఁజాలు నెవ్వనిసమేధితబుద్ధిమహత్త్వచాతురీ
పరిణతి యట్టి పోలవరపాలుని వేంకటకృష్ణరాయభూ
పరుని రసజ్ఞఁగాక యల భారతి వేఱొకయింట నుండునే ? 340

శా. సీతీరమ్మున నున్న పోలవరము స్నీతిప్రధానంబుగాఁ
జేతశ్శుద్ధికరంబుగా ఘనతగా శ్రీజార్జిరాజేంద్రవి
ఖ్యాతప్రాభవ మూఁతకోలగఁ గడంకం బ్రోచుమీ కృష్ణభూ
నేతం గోర్కులొసంగి బ్రోచుకొనుమా నిత్యంబు గోదావరీ ! 341

సీ. గోదావరీనదీకుల్యలచే నదీ
మాతృకంబై పొల్చు మండలంబు
ఆశ్రితకల్పకంబైన దాక్షారామ
భీమేశ్వరస్వామి పెరిమచోటు
హూణరాజన్యపాల్యులు హూణవిద్యాప్ర
వీణులౌ భూపతుల్ వెలయునాఁడు
భుక్తిముక్తులు రాజభక్తులుగల ప్రజా
కాండంబు నిండుబంగారుకొండ
తే. గీ. గౌతమీమండలము వొల్చుఁగాత, సాధు
వర్తనుండును దుర్మార్గకర్తనుండు
నగు కరగ్రాహి యేకాల మరయుచుండ
జార్జిభూపాలు సత్కీర్తి చదలునిండ. 342

క. ఆయుర్భాగ్యము లధికము
లై యెల్లసుగుణములును నితోధికములుగా
మా యేలికయగు కృష్ణా
రాయనికిన్ శుభములెల్లఁ బ్రబలుంగాతన్. 343

— గుంటూరుజిల్లా చేబ్రోలు —

సీ. కావించుచున్నాఁడు గాథోత్సవమ్ముల
నాగేశ్వరస్వామి కద్భుతముగ

సేవించుచున్నాఁడు శివపదాంభోజమ్ము
లశ్రాంతభక్తిచే నహరహమ్ము
రావించుచున్నాఁడు రాజమాన్యులఁ గవీ
శ్వరుల గాయకులను బండితుల హితుల
భావించుచున్నాఁడు పరమార్థమునకు సం
పదలెల్లఁ గత్తృణప్రాయముగను

తే. గీ. దేవభక్తునికులము సార్థీకరించు
చున్నవాఁడు సదాశీస్సు లున్నవాఁడు
పిన్నవాఁడయ్యు యశమునఁ బెద్దవాఁడు
శోభితుండు సీతారామయాభిధుండు. 344

సీ. నతవరప్రముఁడైన నాగేశ్వరస్వామి
పరమాద్భుతంబైన కరుణ వలన
నమృతవాక్సారస్య మమర వర్తించు స
త్కవుల యాశీర్వాదకలన వలనఁ
దనవర్ణమున మేటిఘనతఁగాంచిన పెద్ద
లైనవారి యనుగ్రహంబు వలన
నన్నదానాదుల నాహ్లాదమునుగాంచు
బ్రాహ్మణోత్తముల దీవనల వలన

తే. గీ. నాయురారోగ్యసంపద లనుకరంబు
వృద్ధిచెందఁగఁ జేఁబ్రోల వెలయుఁగాత!
దేవభక్తుని సద్వంశదీపకుండు
శోభితుండు సీతారామయాభిధుండు. 345

చ. తనయనుజుం డొనర్చు సుకృతమ్ముల కెల్లను గారకత్వముం
గొని ఫలభాక్త్వమందునను గొండొకభాగముఁ బంచికొంచు స
జ్జననుతి పాత్రుఁడై కడుయశమ్మున మించెడునట్టి దేవభ
క్తుని కులభూషణుణ్ శివుఁడు కూరిమి నేలు ననంతరామునిన్. 346

—• శ్రీ మంగళగిరిలో శేషగిరిరావు పెండ్లి •—

ఉ. చేసెను నిన్ను గేస్తుగ నృసింహుఁడు మంగళశైలనేత, త
ద్దాసుఁడవై బుధప్రవరదాస్యము మానక, పుత్రపౌత్ర బా
భాసురమైన గేహమున భద్రము లెప్పుడు నుప్పతిల్ల మేల్
వాసియు, వన్నెయుం గలిగి వర్ధిలు శేషగిరీ! గిరీట్కృపన్. 347

సీ. గద్వాలభూపాలుఁ గననేగునప్పుడు
నాత్మకూర్నృపుఁ జూడనరుగు నపుడు
వనపర్తి నరపాలుఁ గననేగునప్పుడు
గుంటూరుపోరి కేగుతరియందు
వెంకటగిరిరాజు వీక్షించు నదనున
వేంకటేశుని జూడ వెడలునెడల
నరసరాట్పురి కేగుతరుణమందున విను
కొండపురికి నరుగు సమయాన

తే. గీ. నిన్నుఁ గనకుండ నేగిననింద వోయి
శేషగిరిరావుకతన నీసేవ కలిగె
వానిఁ బ్రోవుము నూతన వధువుతోడ
గిళితబహుళాంహ! మంగళగిరినృసింహ. 348

మ. తనభక్తిన్ సుజనాళి పానకము నెంతన్ బోసినన్ దానిలో
సగమేగైకొని వారికిన్ వరములన్ సంపూర్తిగావించు భ
వ్యగుణోపేతుఁడు మంగళాచలనృసింహస్వామి రక్షించు శే
షగిరీ! తిర్పతివేంకటేశ్వరదయాసంపూర్ణు నిన్నెప్పుడున్. 349

—• శ్రీ మత్పంచమ జార్జి చక్రవర్తి పట్టాభిషేక పద్యములు •—

సరస్వతి పత్రిక వ్రాసినట్లు మేము వ్రాసినవి.

సీ. అఖిల సామంతరాజాధిష్ఠిత గజేంద్ర
లోల శ్రీవణజాల చాలితంబు

ఢిల్లీ పురాంగనావల్లీ శిరోజాత
మల్లీ సుమసుగంధ మానితంబు
సేవాసమాయాత సేనానమస్సమ
యాంతరాక్రాంత మార్గాంతరంబు
మణిమయాభరణసామంత సైనికనవో
ష్ణీషఘర్షణకవోష్ణీకృతంబు

తే. గీ. లలితవీచీపరంపరాస్ఖలితచలిత
మైన మరుదర్భకముచేత నంపుఁగాత
స్వాగతము ముందు "మేరియా జార్జివిభుల"
కమర ఢిల్లీపుర ప్రవేశమున యమున. 350

సీ. అది ధర్మరాజు సంపదమీఱ మును రాజ
సూయంబు చేసిన చోటు దేవ!
అది శూరమాణిక్యమైన పృథ్వీరాజు
కోటగట్టించినచోటు భూప!
ఇది కుతుబుద్దీను విదితప్రతాపంబుఁ
జాటింపఁగల జయస్తంభ మధిప!
యిది సార్వభౌములై యీ నేల నేలిన
యేలిక లుండు గోరీలు రాజ!

తే. గీ. అనుచు గనిపింప ఢిల్లీ పురాతిశయముఁ
గనుచు నానందముగ వాని కారికలును
వినుచుఁ బండువు మాకుఁ గావించుమయ్య
మనుచుమయ్య మమున్ జార్జిమానవేంద్ర! 351

శా. హిందూరాజ్యభరంబు బాహుయుగళిన్ హేలాగతిం దాల్చి య
స్పందశ్రీ విలసిల్ల ఢిల్లినగర ప్రాచీన సింహాసనం
బందాహాశీ వసించు నీ కఖిల సౌఖ్యశ్రీచిరాయుఃప్రధల్
సందీపించుత నీ ప్రజల్ మనుత నిచ్చల్ జార్జి భూమీశ్వరా! 352

సీ. కుశలమా ? చిత్తమంకురరసముత్పాదనా
ధారశక్తిత్యక్తవైరిరాజ !
ఆరోగ్యమా ? చిత్త మారోపితానంత
వైదుషీనిరవద్యవైద్యరాజ !
క్షేమమా ? చిత్త మక్షీణ దాక్షిణ్యసం
రక్షదధ్యక్షతాదక్షతేజ !
ఆనందమా ? చిత్త మాలంబితాన్వయా
చారకర్మప్రజాచరితపూజ !
తే. గీ. యంచు సేవాసమాకారితావనీశ్వ
రాభిముఖసార్వభౌమవాక్య ప్రకటన
భాగ్యము లభించె నిండియాపత్రికలకు
మాకు నేఁటికి జార్జిభూమీశశత్ర ! 353

సీ. సార్వభౌమపదంబు సంతరించిన నీస
మంచిత శ్రీ సంతసించినాను
సకలసౌఖ్యంబు లొసంగి కాపాడిన
నీ యవ్వమృతికిఁ జింతించినాను
ప్రకటించినాను నాటకమొండు నీ తండ్రి
పట్టాభిషేకవైభవమునెల్ల
వర్ణించినాను నీ పట్టాభిషేకంబు
లండన్ మహాపురీమండనంబు
తే. గీ. సకలసామంతనరపాలమకుటమణివి
లాసరంజిత ఢిల్లిసింహాసనంబుఁ
గైకొనెడు నిన్నుతించిన కవులకవిత
నేఁడు ప్రకటించితిని జార్జినిర్జరేంద్ర ! 354

—• మాపేరఁ బ్రకటింపఁబడిన పద్యములు •—

శ్లో. పారమ్యం లభతాం పున స్సమధికం ప్రాలేయ శైలేశ్వర
శ్రీరామేశ్వరసేతుమధ్యనగరీసీమంతసీమామణిః

శ్రీజార్జిక్షితిపాలపాలనకలావిర్భూపునర్భూషిత
శ్రీసింహాసనవాసనాతతశుభశ్రీ రద్యఢిల్లీపురీ. 355

సీ. కలుగదే! సర్వలక్షణలక్షితాకృతి
శ్రీపురంబగు కాళికాపురంబు
ఉండదే? జనవశానుపమానవిత్తధీ
మత్తంబు బొంబాయిపత్తనంబు
రంజిల్లదె! కృతామరావతీనగర సం
ఘట్టనంబగు చెన్నపట్టణంబు
నెగడదే! యలత్రివేణీతీరబోధిత
ప్రాగార్య జనభోగ యగుప్రయాగ

తే. గీ. కీర్తిధారేయులైన యాంగ్లేయ దొరలు
పట్టభద్రిత సీయంద కట్టుకొనిరి
బ్రతికిచెడ్డను ప్రాగ్గౌరవప్రపత్తు
లూరకేపోవు ఢిల్లి! యెవ్వారికైన. 356

శా. ఢిల్లీపల్లవపాణి! నిన్సదయదృష్టిన్ జూడనున్నాఁడు యా
వల్లోకప్రథమాననేతు నగరీప్రాలేయశైలాంతరా
పల్లీపక్కణపట్టణస్థితకుటీప్రాసాదసౌధావళీ
ఫుల్లాకారపటుండు జార్జినృపుఁ డీపుణ్యంబు సామాన్యమే! 357

సీ. సకలరాజన్యమస్తకమణీదీపనీ
రాజితుండగు ధర్మరాజునాఁడు
అంతఃపురంబపై చెంతఁబాయని నీకుఁ
దేజుతెచ్చిన పృథ్వీరాజు నాఁడు
ఆసేతుశీతాచలాచలా చాలితా
స్థానుఁడైన శహాబదీను నాఁడు
నిఖిలకామ్యంబైన నీసింహపీఠిపైఁ
గ్రాలినపెఱఫాదుషాలనాఁడు

తే. గీ. నీవు చెందినయానంద మిపుడు గలిగె
మధ్య కొన్నాళ్ల లేకున్నమానెఁగాని
జార్జిభూపాలసేవాసమార్జితప్రి
తాపకీర్తిభరంబ! ఢిల్లీపురంబ! 358

మ. కరులశ్వంబులు రత్నముల్ మణులు బంగారంబు హారంబు లం
బరము ల్కానుకలొసంగి ధర్మజుని మున్భద్రాసనా సీనుఁ జే
సిరి. నిన్ జేసిరినేఁడు జార్జినృపతీ! శీతాద్రిరామేశ్వరాం
తరరత్నాకరమేఖలాధిపతులంద ర్నాల్గువేలేండ్లకున్. 359

మ. బహుకాలాగతపాండితీయుతము, సప్తద్వీపవిక్రాంతమున్,
గుహనాదూరము, వాంఛితార్థఘటనాకూలంకషంబైన దీ
మహి, నీపాలన మెల్లపావనములన్ బాగైన, దీ రెంటి కీ
శహిఁ జేకూరిన యానుకూల్యమును సంరక్షింపు జార్జీశ్వరా! 360

మ. అరులన్ ముంచుచుఁ దేల్చుచు న్నృపుల కార్యావర్తదేశంబు ము
న్నెరపెన్ దుఃఖము దాను కర్తవడెఁ గానీ నేఁటి కాంగ్లేయధీ
వరనై పుణ్యముచేత దానిసుడియుం బైఁబడ్డదో నాఁగ న
చ్చెరువై యున్నది జార్జిభూప! సరసశ్రీఁదేఁగదే దానికిన్. 361

సీ. స్థాపించి రుత్తరదక్షిణధ్రువదుర్గ
మార్గంబులందు జయధ్వజంబు
ప్రకటించిరి పతాక ప్రకృతిలోపలి మూఁడు
గుణములమూఁడురంగులనుజొనిపి
చేయించుకొన్నారు చేతనౌపని నీళ్ళ
చే నిప్పుచే గాలిచేతఁ గూడ
నార్జించినారు ప్రజ్ఞాతిశయంబున
నైదుఖండముల రాజ్యం బొకింత
తే. గీ. ప్రజల విశ్వాసమును దృఢ పఱచినారు
రిపులనిశ్వాసములు సంహరించినారు

పెంచినా రిండియా యప్పగించినారు
ఏలుకోవయ్య జార్జిభూపాల! దాని. 362

సీ. "గ్రహియింపుమా, నన్నుఁగాపాడుమా!" యంచుఁ
గరముచేతికొసంగు కామదాత్రి
ఏరాజ్యమునొసంగఁగారాని సార్వభౌ
మాభిధానమొసంగి నట్టి సాధ్వి
ఏరాజుల కొసంగ కేటిదాఁచిన మేటి
హీరంబొసంగిన వీరలక్ష్మి
ఏరీతినడిపింప నారీతినడచెడు
సారస్యమెఱిఁగిన చారుగాత్రి
తే. గీ. ప్రతినిధులచేతనే పుత్తె పంపకుండ
పెండ్లి నాఁడైన మొగముచూపించుచుంటి
విదియె నీ నాఁటి గౌరవం బిండియాకుఁ
జాలు మాకిది పదివేలు జార్జిభూప! 363

సీ. బెదురుగుండెయుఁ బిక్కుచెదురు లేకుండంగ
నీగౌరవంబు నీ కొఁగినారు
నిఖిలవస్తువులు కానికలుఁగాఁ బంపించి
నీకు సింగారంబు నింపినారు
మాటిమాటికి భంగపాటు లేకుండంగ
నీసతీభావంబు నిలిపినారు
సతతసూర్యప్రేక్ష్యసామ్రాజ్యలయ్యు నీ
సిరి యసూర్యంపశ్యఁ జేసినారు
తే. గీ. ఆంగ్లరాజులు ప్రోషితులైన నేమి
పాపె నారీతి జార్జిభూపాలకుండు
ప్రేమగల భర్తపొం దొక్కరేయియైనఁ
జాలదా సాధ్వి కోయిండియాలతాంగి! 364

సీ. కడిపెడుబిడ్డలఁ గన్నపూతచరిత్రి
జనులు తల్లిగ పెంచుకొనిన సాధ్వి
అతిదయావతి భాగ్యవతి సర్వసమురాలు
సంతురాలు నదృష్టవంతురాలు
నైన శ్రీవిక్టోరియాకు మన్మండవు
పరమశాంతుఁడగు నెడ్వర్డుకొడుక
వాస్ట్రేలియాప్రజ కధిపతిస్వాతంత్ర్య
మిచ్చిన వాఁడ, వీ విండియాను

తే. గీ. వలచినాఁడవు నీశైశవముననుండి
చక్రవర్తివి కాఁబోవు సమయమేఁగు
దెంచె, ననురక్తబలము చూపింపుమయ్య
జార్జిరాజేంద్రి ! వైభవనిర్జితేంద్రి ! 365

సీ. ప్రభుభక్తి మాతృవిశ్వాసంబు పితృభక్తి
దైవభక్తియు పూర్వధనముగాఁగఁ
బితృవైరి మాతృవిద్వేషియు రాజదూ
షకులును ఘోరపాతకులుగాఁగఁ
బ్రభువు దేవాంశసంభవుఁడు తల్లియుఁదండ్రి
ప్రజ కను కథలు శాస్త్రములుగాఁగ
ధర్మవిశ్వాసకృతజ్ఞతావిధులు ని
త్యం బొనరించు కృత్యములుగాఁగ

తే. గీ. భరతఖండనివాసులు బ్రతుకువారు
గాన వారిస్వభావంబు గరిమ మెఱఁగి
పాలనము సేయుమయ్య భూపాలమౌళి !
జార్జిరాజేంద్రి ! వైభవనిర్జితేంద్ర ! 366

సీ. రాత్రిపై రాక్షసారాతిభావంబు భా
వించి చిత్తంబు లర్పించువారు

గుణశూన్యు లోచనాగోచరు గుణజాల
మెంచి మన్నించి వర్ణించువారు
అనృతగాథలను సత్యములంచు మదులకె
క్కించి నమ్మకము పుట్టించువారు
భక్తితత్పరమైన పారవశ్యముచేత
నితరకృత్యముల సహించువారు

తే. గీ. ప్రతినిధుల రాజబుద్ధి, కన్పడెడు ప్రభువు
గుణములెన్నుట, సత్యవాక్కులను విశ్వ
సించుటయు, రాజభక్తిఁజూపించు టేమి
భరము హిందువులకు జార్జిధరణినాథ! 367

సీ. భక్తితోఁ బూజింపఁబడెడి మాదేవాల
యంబులెల్ల మసీదులైననాఁడు
"ఖాంచోద్ధలంకోరు బాపనయ్యా" యంచు
నాల్కచేఁ దిలకము ల్నాకునాఁడు
పడుచుకుఱ్ఱది వీధిఁబడిపోవ జంకి మే
డల మూలమూలల డాఁగునాఁడు
సన్న్యాసులగు మతాచార్యవర్యుల బోడి
నెత్తులపై మూటలెత్తునాడు

తే. గీ. రాజభక్తిని విడువని మాజనంబు
సకల సౌఖ్యంబు లిడి మతాచారవిధుల
నోము మీయెడ నది చూపుటొకభరంబె!
జార్జి రాజేంద్ర! వైభవనిర్జితేంద్ర! 368

సీ. "మా మేలెఱింగిన భూమీంద్రులందు వ
చ్చినవారలెవరో మెచ్చెదరుగాక
మాకు మాఱుగఁబంపు మాననీయులను మె
చ్చినవారలెవరో మెచ్చెదరుగాక

సదుపాయ మనఁజాలు సదుపాయనంబు దె
చ్చినవారలెవరొ దెచ్చెదరుగాక
కోరఁకోఁదగినకోర్కులు దెల్పు 'నఁద్ర' సి
చ్చిన వారలెవరొ యిచ్చెదరుగాక

తే. గీ. పోకయుండినఁ బట్టాభిషేక మిపుడు
కాకఁపో''దని రాక నిరాకరింప
కీకరణి తావకీన కృపాకరంబు
మాకుఁ జూపించితివి జార్జిభూకళత్ర! 369

సీ. పోనేర్చిరి విమానములమీఁదనె 'బిలోన్సు'
మాటలేకయె యుడుమార్గములకుఁ
దెలియనేర్చిరి దివ్యదృష్టిచేతనె తంత్రి
లరయకుండఁగనె వార్తాళినెల్ల
నరుగనేర్చిరి తపోగరిమచేతనె ధూమ
శకటిలేకుండ దేశంబులెల్లఁ
జూడనేర్చిరి భూమి జాడలెల్లెడల 'మ్యా
పులు' లేకయే యోగబలముచేతఁ

తే. గీ. గాలవశమున మాతోంటి ఘనత తఱుగు
కాలమున కేగుదెంచె మీపాలనంబు
కలిగె నవియెల్ల మీ బుద్ధిబలముచేత
జార్జి రాజేంద్ర! వైభవనిర్జితేంద్ర! 370

సీ. తప్తారిరాజయంత్రవిదగ్ధపురధూమ
మరిగి క్రిమ్మఱవచ్చె నదియె మాకుఁ
గనుమూయ నడచు మార్గమ్ములు గతియించి
మరల మాకవియె సంభవములయ్యె
నాపగల్ సేయు కీలాలకుల్యలు వోయి
మరల మాకవియె సంప్రాప్తమయ్యె

మహివరులేస్వయు సంభ్రమములు పొలువోయి
యవెక్రిమ్మఱఁదటస్థమయ్యెమాకుఁ

ఆ. వె. బరమరాజ కార్యపద్ధతుల్ నశియించి
మరల వఱలె నవియె మాకుఁ గాని
మాపదముల కర్థమాన్యత్వ మొనరించె
నాంగ్లరాజ పాలనాతిశయము. 371

సీ. మాదేశమున లేని మహనీయకార్యముల్
మీతో సమముగఁ గల్పించినారు
మే మెన్నఁడెఱుఁగని సీమవస్తువులెల్ల
మీచేతిమీఁదఁ బంపించినారు
మా మే లభిలషించి మాబుద్ధిమీఁదనే
మీరాజకార్యముల్ మెలపినారు
మాభాషలోలేని మహనీయశాస్త్రముల్
మీభాషలోన నింపించినారు

తే. గీ. దొరతనంబన్న మీదికా దొరతనంబు
మీపురముతోడ మాహస్తినాపురంబు
సాటిపొందింపలేని యాలోటుకూడఁ
దీర్చితివి నేఁడు జార్జిధాత్రికళత్ర !

సీ. పాలింపుమా ! మేటిభరతఖండము, పరి
శీలింపుమా ! మంచి చెడ్డలెల్లఁ
దోలింపుమా ! దుర్మతుల నావలకు, నను
కూలింపుమా ! ప్రజకోరికలకు
నేలింపుమా ! నేల యెల్ల రాజులచే, ని
వాళింపుమా ! కీర్తివశల దిశల
గాలింపుమా ! దేశకష్టంబులెఱిఁగి, సు
రాళింపుమా ! వైరిరాజబలము

తే. గీ. బిడ్డలంబోలెఁ బ్రజల భావింపుమయ్య!
విశ్వమెల్లను వశము గావింపుమయ్య!
విమతులను మాటలేక జీవింపుమయ్య!
జార్జి రాజేంద్ర! వైభవనిర్జితేంద్ర! 373

చ. అఱువదియేండ్లు దాఁటుపయి నబ్బెను తండ్రికి రాజ్య; మీతఁడో
ధరనుభరించె నేఁబదియు దాఁటకపూర్వమె; నూటికింకనో
క్కరు తరువాయి, దేవుఁడు శతాయువు నిచ్చెడుఁగాక యుంచు ను
ర్వరజనులెల్లఁ బల్కుఁడు ధ్రువంబుగ నట్లె యొనర్చి తీఱెడున్. 374

సీ. ఆరోగ్యమిడుఁగాక యర్కుఁ డర్కప్రతా
పునకు శ్రీజార్జిభూపునకు నెపుడు
ఐశ్వర్యమిడుఁగాక యగ్ని యగ్నింబోలె
శుచియైన శ్రీజార్జి శూరమణికి
భోగంబులిడుఁగాక భోగిరాట్టిలఁ దన్నుఁ
బోలె నోమెడు జార్జిభూవిభునకు
వాక్శుద్ధినిడుగాక వాక్పతి వాక్పతి
వలెఁబల్కు శ్రీజార్జివల్లభునకు
తే. గీ. ప్రజలు జయవెట్టుదురుగాక, ప్రబలుఁగాక
యింతకంటెను రాజ్యలక్ష్మీశుఁ డగుచు
నెల్లదీవుల నీతఁడె యేలుఁగాక
మనకు సంతోషమొనరించి మనుచుఁగాక! 375

—• ధవళేశ్వరము శ్రీరాజా రావుగంగాధరరామారావు బహద్దరుగారు •—

శ్లో. శ్రీమానాశ్రితరక్షణక్షణగుణ స్సర్వత్ర సర్వప్రద
స్సత్సంతానవిభాసురస్సురగవీజేగీయమానస్స్వయమ్
శ్రీగంగాధర రామరాయనృపతేః పౌత్రం తమాత్మోపమం
శ్రీగంగాధరరామరాయనృపతిం పాయాత్సదా శ్రీపతిః. 376

చ. జనకపితామహుండు గుణసాగరుఁ, డాశ్రితవత్సలుండు భూ
జననుతకీర్తి దత్తుఁగొని సాఁకినయట్టి పితామహుంతు, నీ

వనఘుఁడ విట్టినిన్నుఁ గనఁనట్టి యభాగ్యత నేఁటితోఁడఁ డీ
తెను ముదమబ్బె నెమ్మదికి శ్రీకర ! రావునృపాలశేఖరా ! 377

మ. పినముత్తాత నృసింహసత్కవినిమీపెత్తాత నీలాద్రిభూ
జనపాలుండు బహూకరించె, నను నీజన్మించువంశంబు భూ
జనపాలు ర్గడు గారవించిరి; భవత్సౌహార్దము న్నేను గై
కొనయత్నింతు భవాదృశుల్ సుకులజుల్ గోరంగ వర్షుల్ గదా ! 378

మ. ధనధాన్యాదు లశాశ్వతంబులు యశోధన్యుండె సన్మాన్యుఁ డె
వ్వనికో ద్రవ్యము సేవ్యమైనను బుజుపర్జ్ఞాభనుల్ సత్కవుల్
గొనముందక్క ధనంబుఁగోరరు, భవద్గోష్ఠీసమావేశమే
నను సంతుష్టునొనర్చెఁ గైకొను మఖండమ్మైన యైశ్వర్యమున్. 379

సీ. విదియచందురునకు వెసఁ గ్రిమక్రిమముగాఁ
గాంతివిస్తారమ్ము గలుగునేని
వాఁడినమాలతి వర్షాగమముకల్మి
ననుపమానస్ఫూర్తి నందునేని
శారదాంబుదము విచ్చలుఁ దొల్కరిని గడు
మాంసలత్వముకల్మి మసలునేని
ఆకరోద్భుమైనయట్టి వజ్రంబు శా
ణోల్లీఢమై దీప్తి నొందునేని

తే. గీ. నిన్నువంటి సత్కవులవంతు, నిన్నువంటి
మానధను, నిన్నువంటి సన్మాన్యచరితు,
ననుగుణైశ్వర్యయుతుఁ జేసి యజుఁడు కీర్తి
నోమకున్నె ? గంగాధరరామరాయ ! 380

ఉ. పుట్టినదాదిగా నృపులు భోగులునై తనరారువారికిన్
గట్టియశమ్ము గల్గ, దధికారమువీడి పరిశ్రమమ్మునన్
జట్టపురాజులైన క్షితిపాలురనామము శాశ్వతంబగున్
ధట్టుఁడురాముఁ డర్జునసుదర్శనులాదిగ నింధుదాహృతుల్. 381

—• శ్రీ పోలవరపు జమీందారుగారు, కాకినాడ •—

ఉ. పోలవరక్షితీంద్ర ! విను బుద్ధచరిత్ర రచించి నీకు భూ
పాలకమౌళికిం గృతిగఁ బంపినవేడ్క నొసంగినాము నీ
పాలయినాము నేఁడు తమపావన జన్మదినమ్ముగాన ను
ద్వేలభవద్వదాన్యతకు వేళ యిదేసుమి కృష్ణభూవరా ! 382

—• వేశ్యాకప్రసక్తిలో శ్రీవారినిగూర్చిన పద్యములు •—

తే. గీ. ఎన్నినాళ్ళాయె. శివ శివ ! యెన్నిసార్లు
చనువుమాటలు మీరు నన్నునటలేదు !
ఆగ్రహం బది వచ్చెనే ? యకట ! నాఁటి
ప్రాతరుత్థానసమయంపుఁ జేఁతగాక. 383

చ. వ్యసనమునందు మున్గి ప్రతివాసరమున్ ధన మంతొ యింతొ కై
వసమొనరించుచుంటిఁ బయివారల, కయ్యది మీప్రతిజ్ఞచే
నసదయిపోయెనంచు మనసార ముదంపడుచుంటిఁగాని యా
రసి తమచోఁట్లకుఁజా గినుకరానియఁగూడదటంచుఁ గుందెదన్. 384

క. నెల కింకొక పదిరూపా
యల జీతము హెచ్చించినట్టు లానందింపం
గల యీ విషయము నాకున్
గల కాలమ్మును మహోపకారముసుండీ. 385

చ. 'హృదయము మంచి'దంచును 'సుహృత్త్వముఁ గోరెడువార'లంచు 'నే
యదనునఁ జూచినన్ మది మహాముదమొందెద' రంచు "మైత్రికిన్
గుదురగువార" లంచుఁ దమకుంగల యోగ్యత దారిచూప నే
నిది లిఖించినాఁడ క్షమియింపుఁడు నాయెడఁ దప్పు గల్గినన్. 386

తే. గీ. మనము తొల్లింటివరుసనే మసలవలయు
నంచు నేఁ గోరి యిది లిఖియించినాఁడ
నంతమాత్రముచే మీకు యశము పోదు
లేకయుండిన నపకీర్తి నాకు రాదు. 387

—• అన్నవరముకొండ, శ్రీయినుగంటి ప్రకాశరాయనింగారు •—

మ. మనకున్ మున్నిట నున్నవారలె యసామాన్యప్రతిష్ఠాదికం
బును గావించి స్థిరీకరించి, రేఁక నీప్రోపంది కానౌచు ని
ల్చిన దీదేవున కప్రతిష్ఠ యొకఁటే, చేయింపు మీయప్రతి
ష్ఠను నీకిచ్చు నిదే ప్రతిష్ఠను బ్రకాశక్షోణీభృద్గ్రామణీ! 388

—• శ్రీ గంపలగూడెము జమీందారుగారి కుమార్తె బారసాల •—

శా. ఆయుర్దాయము బ్రహ్మ, కాంతి శశి, నిత్యైశ్వర్యమున్ లచ్చి, వి
ద్యాయోగం బజురాణి భర్తృహిత సౌందర్యంబుమాదేవి, యా
మ్నాయంబుల్ శుచిమత్త, తక్కఁగలసంపత్తుల్ సురల్ గూర్చి నా
నాయోగాఢ్య నొనర్చి ప్రోచెదరు కృష్ణారాయసత్పుత్రికన్. 389

శా. కాంతాకారమనంగగేహిని, కడుం గళ్యాణవిద్యామన
స్సంతోషమ్ములు సంతతంబును సరస్వజ్ఞాసరస్వత్యుమా
కాంతల్, దీర్ఘతరాయురాదికము తత్కాంతుల్ ప్రసాదించి శ్రీ
సాఁతత్యం బెసఁగింత్రుగాక మనకృష్ణారాయసత్పుత్రికిన్. 390

తే. గీ. ఏమహాసాధ్వీచరిత వహ్నికిని శీత
లత్వమును నేర్పె నమ్మాత లలితసుగుణ
పూత సీతామహాదేవి ప్రోచుఁగాఁత
బుచ్చమాంబిక కఖిలసద్బుద్ధు లొసఁగి. 391

తే. గీ వీరపత్నీత్వమునుగాంచి వీరమాత
వగుచు మీ వెల్మ కులమున కమలకీర్తి
దెచ్చి వర్ధిల్లుమమ్మ! నీతికి నిధాన
మగుచు నోబుచ్చమాంబ! గుణావలంబ! 392

చ. కొమిరెలఁ గన్నతండ్రు లిలఁ గోటులు నర్బుదముల్ గలారు బు
చ్చమ! వినుమమ్మ! నీమ పిత సత్కవియై నృపుఁ డౌటఁజేసి నీ
కమలినమైన బావిసుఖ మబ్బఁగఁజేయఁగనెంచి యిందఱన్
సుమతులఁ బిల్చి దీవనలసొంపు వహింపఁగఁజేసెఁ గంటివే! 393

చ. ధరణిపు లెందఱో భువి నుదారయశోనిధు లుండ వారికూఁ
తురవయి పుట్ట వీవు, విబుధుల్ వినుతించెడి కృష్ణరావుకూఁ
తురవయి పుట్టి తియ్యదియుఁ దొల్లిటిపుట్టుఫలమ్ము, నీకు ను
ర్వర సమకూరనట్టి దొకభాగ్యము గల్గునె? బుచ్చమాంబికా! 394

—• శ్రీశనివారప్పేట జమీందారు నారయ్యప్పారావుగారు •—

చ. సిరియును మంచిసంతతియు జేవయు నీవియు రాజ్యమున్ యశ
స్కరమగు నాభిజాత్యమును సర్వముఁ బొంపిరివోవు నీకు నె
వ్వరొసఁగ నేమి యున్నయది; భవ్యగుణోదయ! నారయప్పరా
డ్వర! భగవంతుఁ డీసిరిని బాలనసేయుత శాశ్వతమ్ముగన్. 395

తే. గీ. దారుసంపత్తిగల జమీందారుఁడవు న
దారుఁడవు నంచు నిన్ను నేఁ గోరుచుంటి
నూత్నగృహనిర్మితికి దారురత్నములను
నర్జునయశస్క! శ్రీ నారయప్పరాయ! 396

తే. గీ. అర్జునాహ్వాయదారువు లర్జునప్ర
భూతవిఖ్యాతి గల మహోదాత లలరు
వంశమునఁ బుట్టి నట్టి నీ వానిఁబట్టి
యడుగుచుంటిని శ్రీ నారయప్పరాయ! 397

ఉ. ముప్పది మంచిదూలములుఁ బొంపిరివోయెడి వంశషట్పతం
బప్పనృపాల! నా కొసఁగు టన్నది నీ కొక గొప్పగాదు, నా
కిప్పని నేయుచే మిగుల హెచ్చిది శాశ్వతమైనకీర్తి నీ
కిప్పు డొసంగు, ముందటికి నీయఁగఁజాలు మహోన్నతస్థితిన్. 398

క. యమళార్జునభంజనకృతి
నమలినముద మిచ్చు కృష్ణుఁ డర్పించుత నీ
కు మహోత్సాహము విజయము
నమితముగ రాజ్యంబు నారయప్పారాయా! 399

—• ఈ సందర్భముననే మైలవరపు కృష్ణమూర్తిగారికి వ్రాసినది •—

శా. అప్పారాయ లసత్య మాడరని నే నామూలము న్వ్రాఁజివీ
డప్పారాయలచే నెఱుంగుదును నేఁడమ్మాట వమ్మయ్యె న
ప్పప్పా! కృష్ణసుధీ! యిటౌట శనిసాహాయ్యమ్ముచేఁ గాదుగా!
చెప్పన్నేర్చినఁ జెప్పు నారనృపతిశ్రేష్ఠుం డిటుల్ సల్పునే? 400

శా. నా పద్యమ్ము వృథాగఁబోదనుచు విన్నాణంపు గర్వమ్ముతో
నేపారన్ గడుసోలు వేంకటకవిన్ హీహీలకున్ దింపఁగా
నీపాటన్ ఘటియించెనో యొకఁడు? కాదేనిన్ వదాన్యోత్తమున్
భూపున్ వేఱుగఁజెప్పనున్నదియె? లుబ్ధుండే యతం? డక్కటా! 401

తే. గీ. "గందపుంజెట్టుఁ దీపమ్ముఁజందురుండు
ఫణుల మషి నంకమునుదాల్చు, బార్థివేంద్రు
లట్టులే చేరఁదీతురు చెట్టలను" న
టంచుఁ బండితరాజు మున్నానతీఁడె. 402

మ. వెనుకన్ గోరినకోర్కె యట్లు వృథయై వెండిన్ వృథాయై మదిన్
దనుకంజేసెడిలజ్జ కొక్కఁడు సమాధానంబు గన్పట్టె "భూ
జనమాన్యున్ ఘనుఁ గోరి వ్యర్థుఁడయినన్ శ్లాఘ్యుండెయయ్యర్థి" యం
చనినాఁడేకద కాళిదాసు! మనకేలా లాఘవం బియ్యెడన్? 403

తే. గీ. సంపదలు పూర్వపుణ్య పరంపరావ్య
యమ్మునంజేసి కలుగుట నాపదలగుఁ
బాత్రులకు నిచ్చుటే శాంతి, ప్రాజ్ఞులైన
యప్పరాయల కిది వేఱె చెప్పనలెనె! 404

—• కృతకృత్యతనందినమీఁదఁ జెప్పి పంపిన పద్యము •—

ఉ. నారనృపాల! నాయెడ మనమ్మున నీ కుదయించియున్న య
క్కూరిమి కీడుగాఁగ నినుఁ గోరినకోర్కి ఫలించునట్టులీ
వారసి పంపినట్టి ధన మందె శతద్వయరూప్యముల్ కడుం
గౌరవపూర్వకమ్ముగను గన్గొని మీగిరిరా వొసంగొటన్. 405

—• తంగెళ్ళమూడి శ్రీ చెలికాని జగన్నాధరావుగారు •—

చ. ఇరువదియైదు వత్సరము లిప్పటికిన్ గతియించె గోపభూ
వరతనుజాత! ధీవరు భవజ్జనకున్ గని; నేఁటికిన్ మహా
త్తరు నినుఁ జూడఁదన్నృపునిదర్శనమైనటు లాత్మఁ బొంగె నో
నరవర! తండ్రియే కొడుకునా జనియించుట నెప్పు వేదముల్. 406

ఉ. ఈ నరలో జమీన్లు గల వెంకటకేనియు, విద్య వారిలో
నేధరణీశుఁడో యెఱుఁగు, నెల్ల రెఱుంగరు వింటివే జగ
న్నాధనృపాల! తద్జ్ఞజననాథశిరోమణి నీదుతండ్రి ప్ర
జ్ఞాధికుఁ డార్యసమ్మతసదాచరణ ప్రవణుండు వారిలో. 407

ఉ. ఆయన పుణ్యశాలి యగునన్నవిశేషము నిన్నువంటిను
శ్రీయుతుఁ డాత్మజుండగుటచే ధ్రువమైనది, తండ్రి యోగ్యతా
శ్రీ యెసఁగింపలేని సుతుచేఁ బితరుల్ తరియింపఁబోరు, స్వ
శ్రేయస మిచ్చుఁగావుతఁ బితృప్రియ! నీకుఁ బితృప్రసాదముల్. 408

మ. కొమరుఁడా గొంటివి వంగదమ్మనకు నీకున్ బ్రీతి సంధింపఁగాఁ
గొమరున్ గంటివి దాన, నక్కొమరుఁడున్ గోర్కుల్ పిసాళింపఁగాఁ
గొమరున్ గాంచెడిఁగాక మాతకును నీకున్ వేడ్కదై వారుతఁడా
గొమరుం బ్రాయము వైళమేయతనికిఁడా గోముల్ప్రసాదించుతన్. 409

ఉ. రాజులయొద్ద మాకుఁగల రమ్యతర ప్రతిభావధానవి
భ్రాజితసత్కవిత్వపరిపాటి విశేషము చూపి వారిచే
నోజ బహూకృతుల్ గొనఁగ నోజనపాలవరేణ్య! నాందిగా
నీజనకుండు మమ్మును గణించి బహూకృతు లిచ్చె నచ్చుగఁడా. 410

మ. తనయీవిన్ దనియించి యంతటను స్వాంతంబందు సంతృప్తి చెం
దనివాఁడై మనగోపభూవరుఁడు విద్యాదక్షుఁ డప్పట్ల న
వ్విన వైరస్యము నాఁగి స్యాలకమణిన్ బ్రేరేపి యవ్వారిచే
తను మమ్మం దనియింపఁజేసె ధనవస్త్ర శ్రీవిశేషమ్ములన్. 411

చ. స్తుతికయి చెప్పుమాటలని చూడఁగఁబోకుము గోపభూవరుం
డతులితు డద్భుతమ్ముఁ గనినట్టివిధమ్మును బ్రేమయున్ జను
శ్శ్రుతమునకై ననున్ మఱవఁజాలము పేరిమిపట్ల నీకునుం
బ్రతియన నాఁటికిం జిఱుతపాత్రియమువారల సత్కరించుతిలన్. 412

సీ. వినుతిసల్పినమాత్రి విని వేగ రక్షింపఁ
జాలిన యభయహస్తమ్మువాఁడు
ప్రణతిఁ గొల్చినమాత్రఁబరమాదరముచూప
నోపిన కనుదమ్ములొలయువాఁడు
కరము మోడ్చినమాత్రి వరములీయ సమర్థ
మైన మెత్తనిచిత్త మూనువాఁడు
అపరాధ మొనరించి నంత బుద్ధినిచెప్పి
తనభక్తులను బ్రోవఁ దలఁచువాఁడు

తే. గీ. వేంకటగిరీశ్వరుండు నిరంకుశుండు
కరుణమైఁ బ్రోచు శ్రీ చెలికానివంశ్యుఁ
డగు జగన్నాథరాయని నతఁడుగొన్న
పట్టి శ్రీమంతు రాజగోపాలరావు. 413

శా. శ్రీమీఱన్ ఖుసిమీఱ వేంకటమహీభృన్మందిరావాసకే
శీమంతుండగు వేంకటేశ్వరుఁడు హాళిన్ భక్తమూర్ధన్య మే
ధామాన్యున్ జెలికానివంశజు జగన్నాథక్షమాజాని శ్రీ
రామక్కమ్మను వీరిదత్తసుతు సంరక్షించు నెక్కాలమున్. 414

మ. అతియోగ్యుండగు భర్తతో సుతునితో నాయుర్యశోవైభవో
న్నతితో సన్మతితో హృదంతరకనన్నారాయణాంఘ్రిద్వయా
శ్రితదివ్యస్థిరభక్తితో నిరతమున్ శ్రీరాజగోపాలరా
ట్సుత, రామక్కసతీమతల్లిక కడున్ శోభిల్లి వర్ధిల్లుతన్. 415

సీ. విద్వద్వతంసమై వెలయు శ్రీగోపాల
భూపాలకు యశఃప్రపూర్తి నెఱిఁగి

శ్రీరాజగోపాలకృష్ణయాచమహేంద్రు
స్తవనీయగురుతరౌదార్య మెంచి
శ్రీరామచంద్రాంఘ్రిసేవారతుఁడు జగ
న్నాథరాజేంద్రు నౌన్నత్యమరసి
పరమపాతివ్రత్యభరిత రామకాంబ
యనుపమసత్ప్రవర్తనము దెలిసి

తే. గీ. తాతకును దాతకును తల్లిదండ్రులకును
ముదము గూర్పఁగఁజాలిన చదువుసాము
లభ్యసించి సదాచార మలరఁ గీర్తి
పరత నెగడుము రాజగోపాలరాయ! 416

—• శ్రీరాజా భుజంగరావు బహద్దరువారి రెండవకుమార్తె వివాహము. ఏలూరు •—

శా. ఆకారమ్మున విద్యయందు గుణధన్యత్వమ్మునందున్ జను
శ్శ్రీకళ్యాణపరంపరాపరిణతిన్ జెన్నొందుచున్నట్టి యా
శ్రీకృష్ణుండు చెలంగుతన్ సతతమున్ శ్రీమన్మహాలక్ష్మితో
నేకాకారముగా నెసంగెడి భవానీశుండు రక్షింపఁగన్. 417

—• ఇంకొకసందర్భమునఁ జెప్పినది •—

ఉ. ఏలుతియందు రాకొమిరె కియ్యెడఁ బెండిలియౌనటన్నఁ దా
నేలొకొ చూపుమంచు వచియింపుచు మాకవితాకుమారి గ
గ్గోలొనరింపఁగా నిచటకుం గొనివచ్చితి మోభుజంగభూ
పాలక! దీనిపల్కు చెలువం బొకయించుక యాలకింపుమా! 418

—• మఱియొక సందర్భమునఁ జెప్పినవి •—

మ. ఎలమిన్ సత్కవివై ధరాధిపతివై యీరీతి నీకూఁతు పెం
డిలికిన్ సత్కవులందఱిన్ బిలిచి పాండిత్యంబు మన్నించుచోఁ
బులులన్ మేఁకల నొక్క చెర్వున జలమ్మున్ ద్రావఁగాఁ జేయు చ
ర్యలఁ జూపించితివయ్య కౌశలమునన్ రాజా! భుజంగాధిపా! 419

శా. "ఏకగ్రీవముగాఁ గవీశ్వరులు మాయింటన్ బ్రవర్తింపుఁ డ
ష్టాఁకల్ మాని" యటంచు మున్నె మము సంప్రార్థించి రప్పించి "రా
జీ" కల్పింప దయోదయమ్ముఁ గనె మాచిత్తంబు, లేకున్న. "గో
రీ" కట్టింపమె ? కాకవిప్రతతి కర్థి న్నేఁడు హేలాపురిన్. 420

ఉ. దగ్గఱనున్నయప్పుడు యథార్థపుదాసులపోల్కి నుండి కే
లొగ్గుచు, నొద్దలేనపు డయోగ్యపుమ్రోఁతలు మ్రోగుచున్న యీ
ముగ్గురుమూర్తులన్ ధృతతమోనిభకీర్తుల పైఁ బజుమ్మి యా
ముగ్గురుమూర్తు లొక్కటయి మూఁగిరయేని భుజంగరాడ్విభూ ! 421

—• వేఱొక సందర్భమునఁ దిరుపతిశాస్త్రి చెప్పినది •—

క. వెలనాటివాఁడఁ గవితకు
వెలనాటినవాఁడ, వట్టివెలనాటిని గా
నెలమిన్ ద్రవిడులకన్నను
వెలనాటులె తెలుఁగుఁగయితవిందులు తలఁపన్. 422

—• శ్రీ భుజంగరావు బహద్దరువారి తృతీయ పుత్రికా వివాహము •—

క. కవి వవధానివి రాజవు
కవితాకన్యకలఁ గన్యకలఁ బెక్కురఁ గం
టివి జగతిని నీతో సము
లెవరయ్యా ! యోభుజంగపృథ్వీనాథా ! 423

సీ. ఎవరింటికిని బోవు టెఱుఁగనిబాంధవుల్
చనుదెంచినారు మీసదనమునకు
నేరాజుపిల్చిన నేతేరని కవీంద్ర
వరులు మీయింటికి వచ్చినారు
ఎవరియింటను బెండ్లినేని జూడనివేడు
కలు మీగృహంబునఁ గాంచినారు
ఏజన్మమందేని నెఱుఁగని భక్ష్యముల్
మీయింటఁ దృప్తిమై మెసవినారు

తే. గీ. ఒకటికంటెను నొకటి యింకొకటి హెచ్చు
తోఁపఁజేయఁగ బళిర ! కూతుండ్రిపెండ్లి
చేసితివి చేయుచుంటివి చేయఁగలవు
సకలకవిగేయ ! రాజాభుజంగరాయ ! 424

శ్లో. హరిహరహిరణ్యగర్భా దదతు సభార్యా వరస్యవధ్వాశ్చ
ఆయుర్విద్యాం లక్ష్మీం ప్రాభవ మైశ్వర్య మపిచ సౌభాగ్యమ్. 425

ఆ. వె. మంత్రిబిడ్డ వీవు, మంత్రిప్రెగడబిడ్డ
నీ యనుంగు రంగనాయికమ్మ
యొకటికొకటియనక సకలధర్మంబులఁ
జూచి యేలికొనుము జోగరాయ ! 426

సీ. పతిని దైవమ్ముగా భావింపవలెనమ్మ !
తరుణిమాటలు జవదాఁటకయ్య !
అత్తమామలమీఁద బత్తి చూపఁగదమ్మ !
వెడయల్లుఁదనము చూపింపకయ్య !
మగనిచుట్టాలపై మమతఁ జూపఁగదమ్మ !
సతివైపులను గొప్ప జరుపుమయ్య !
మగఁడు చేసినతప్పు మాటుచేయఁగదమ్మ !!
తెలివకు సవతాండ్రఁ దేకుమయ్య

తే. గీ. పతికిఁ దలలోనినాల్కవై ప్రబలుమమ్మ
రంగనాయిక ! ప్రియమనోరంగళయని
యువిద ముంగొంగుపసిఁడివై యుండుమయ్య
జోగరాయ ! వధూసమాయోగగేయ ! 427

సీ. నీతాత సుకవివర్ణితుఁడు చల్మయమంత్రి,
నీతాత నరసింహనీతివిదుఁడు
నీమామ్మ కామేశ్వరీమాన్యచరిత, నీ
యమ్మమ్మ యల లక్ష్మి యతులకీర్తి

నీతండ్రి సత్యవిఖ్యాతి వేంకటరావు.
నీతండ్రి భుజగావనీధవుండు
నీతల్లి చెల్లాంబ నీతికోవిదురాలు,
నీతల్లి సుబ్బాంబ పూతచరిత

తే. గీ. కృతుల నందినవాఁడును గృతులు చెప్పి
దన్నదానమ్మునందు విఖ్యాతయశులు
వారిపోలిక జగతిలోఁ బేరుగనుఁడు
రంగనాయిక ! యోజోగరాయ ! మీరు.

ఆ. వె. మును భుజంగరాజుతనయ సురాధిప
తనయునిన్ వరించెఁ దప్పటంచు
మన భుజంగరాజతనయ భూమీసుర
ప్రవరసుతునిఁ జెట్టవట్టె నేఁడు. 429

—• శ్రీ భుజంగరావుగారి చతుర్థపుత్రికా వివాహము •—

శ్లో. యశ్శివో నామరూపాభ్యాం, యాదేవీ సర్వమంగళా
తావిమౌ దంపతీ పాయా స్తా మేతౌ జంపతీ పునః. 430

శా. రాజాంకుండు భుజంగరావు సవిమర్శప్రక్రియన్ జేయు వి
భ్రాజన్నైకవిధాన్నదానజనితాపారంపుసత్పుణ్యమే
యీ జంటన్ సిరులిచ్చి ప్రోచు మఱిఁ దోడింకేటి కల్లైన, నీ
తేజశ్శాలుల నీ వధూవరులనే దీవింతు శ్రీవర్ధిలన్. 431

—• శ్రీ పోతువల్లూరు నృపాలకుమారనామకరణ మహోత్సవము •—

ఉ. శ్రీరుచిరుండు భక్తజనసేవ్యుఁ డపారకృపాకరుండు భూ
దారుఁ డుదారుఁ డవ్యయుఁ డతంద్రుఁ డుపేంద్రుఁడు వేణునాదపున్
ధోరణిఁ బ్రేఁతలన్ వలపుదూఁగఁగఁ జేసినవేల్పు పోతువ
ల్లూరునృపాలమౌళికి మహోన్నతసంపద లిచ్చుఁగావుతన్. 432

తే. గీ. సత్యనారాయణవరప్రసాదనృపతి
కొమరునకు నామకరణోత్సవము నొనర్చ

నెంచి కవిగాయకుల వెలమించుఁబోండ్ల
నోలి రావించెఁ దోట్లవల్లూరిపురికి. 433

మ. సుకుమారుండయియున్ బరిశ్రమపుసంకోచంబు లెక్కింప కూ
రికివిం బల్లెకుఁ బట్టణంబునకుఁ బేర్మిన్ దానుగా నేగి బం
ధుకులంబున్ దన మిత్రవర్గమును నెంతో ప్రీతిమైఁ బిల్చి వా
రక రప్పించెఁ గుమారనామకరణప్రారంభసంరంభియై. 434

సీ. ఇరువుర జతఁజేసి యేకరీతిగ నాట్య
మాడించు నొక్కొక్క యవసరమున
మూగుర గుమిగూర్చి ముచ్చటన్నృత్యంబు
లాడించు నొక్కొక్క యవసరమున
నలువుర నొనఁగూర్చి నలువొప్ప లాస్యంబు
లాడించు నొక్కొక్క యవసరమున
నాగ్గుర నేమించి యనువొప్ప నృత్తంబు
లాడించు నొక్కొక్క యవసరమున

తే. గీ. పెక్కుపూఁబోండ్ల రంగంబు నెక్కఁజేసి
చక్క నాడించు మక్కువ నొక్కమాఱు
అచ్చరలమధ్య నలరు వియచ్చరేశు
మాదిరిని దెల్ప సత్యప్రసాదనృపతి ! 435

శా. కోలల్ కేలను గీలుకొల్పి వెలకుల్కుంబోండ్లు పూవిల్తు మేల్
డోలల్ నాఁగ స్వరప్రచారపుగతుల్ సూపించుచుఁ జేణికా
జాలం బల్లెడుహాళి గగ్గొనిన విస్తారప్రమోదాబ్ధిలో
నేలా తేలకయుండు ! దుఃఖియగువాఁ డేనిన్ గళచ్ఛోకుఁడై. 436

మ. తనకున్ హాస్యమొనర్పఁగాఁ దగిన యాప్తశ్రేణి కష్టపు రో
వనితల్ నాట్యమొనర్చువేళ సభ నవ్వన్ వాంఛచే మార్దవం
బునకున్ దప్పని కొంటెచెయ్యుల రసంబున్ బుట్టఁగాఁజేయు న
జ్జనపాలాగ్రణి సత్యభూపతి మహోత్సాహంబు దీపింపఁగన్. 437

క. కలఁగించిన రోవెలఁదికిఁ
గలఁగింపఁగ నొప్పికొనినకామికి నాపై
వెలగలుగు చీరలును ము
ర్వ్వల జోడులు కాను కిచ్చుఁ బొలుపెసఁగఁగన్. 438

క. ఆగతి నమస్కరించిన
భూగోపాలకుని భక్తిపూర్ణతకు మదిన్
లోఁగినపేరిమి పెంపున
నీగతి నాశీర్వదించి రెలమిఁ గవీంద్రుల్. 439

సీ. అనుకూలదాంపత్య మలరించి నినుఁబ్రోచు
సామేన సతిగల్గు శంకరుండు
అనుపమానశ్రీల నర్పించి నినుఁ బ్రోచు
నురమున సిరిగల్గు దరధరుండు
బహుళసంతానంబు ప్రబలించి నినుఁ బ్రోచు
జగ మెల్లఁగనిన యబ్జప్రసూతి
ఒగి నితోఽధికరాజ్య మొసఁగినిన్నుఁబ్రోచుఁ
త్రిభువనంబులనేలు దేవవిభుఁడు

తే. గీ. సత్యనారాయణుండు ప్రసన్నహృదయుఁ
డెప్పుడును నిన్నుఁ గంటికి ఱెప్పపగిది
సమతు సకళత్రు సిరులిచ్చి సాఁకుఁగాక
సత్యనారాయణవరప్రసాదభూప ! 440

సీ. పుల్లలమ్మెడివాని కెల్లలోకము మెచ్చ
శ్రీమత్త యొసఁగి రక్షించినాఁడు
పొగరుఁబోతయి తనపూజమానిన బచ్చు
వాని యజ్ఞానంబుఁ బాపినాఁడు
ప్రతులైన ప్రేకుమారకుల ప్రసాదంబుఁ
దినని తేనికి బుద్ధి తెల్పినాఁడు

తొలుదొల్త భువిలోనఁ దుంగధ్వజనృపాల
వరుని భక్తికతాన వెలసినాఁడు

తే. గీ. రత్నగిరినుండు సత్యనారాయణుండు
తన వ్రతముసేయు నృపతికి ధన్యమతికి
సత్యనారాయణవరప్రసాదకృతికి
నెలమిని నితోఽధికైశ్వర్య మిచ్చుఁగాక! 441

శా. శ్రీ యిప్పించుత భార్యచేఁ గొమరుచేఁ జేయించు నాయుర్మహా
శ్రేయం, బింకొకకుఱ్ఱచే నవవయశ్శ్రీసొంపు వాటింపఁగా
జేయున్, శ్రీపతి వేణునాదగతి నీచిన్నారి మేల్పట్టి కో
రాయగ్రామణి! భాష్యకారనృపపుత్రా! సత్యనారాయణా! 442

సీ. గిరిరాజసుతపొదిగిటిలోపలి కుమారు
హాళిమైఁగను రాజమౌళిపగిది
నంభోధిసుతచేతులందాడు తనుజాతు
నందంబుగను దానవారికరణిఁ
బౌలోమియొడిలోనఁ బరఁగు జయంతు ని
రీక్షించుచుండు దేవేంద్రునట్టు
లనసూయకరములనలరారు బాలచం
ద్రుని చెన్నుగను నత్రిమునివిధమున

తే. గీ. చెలువయొడిలో నెసఁగు చిరంజీవి చెలువు
లీల గనుఁగొనుచున్ బారసాల సేయు
సత్యనారాయణవరప్రసాదరావు
వైభవముఁ బ్రోచు వేణుగోపాలమూర్తి. 443

సీ. ఆయుష్య మొసఁగి నీయర్భకునిం బ్రోచు
నది యీయఁదగు చతురాననుండు
ఆరోగ్యమొసఁగినీయనుఁగుఁగూనంబ్రోచు
నదియిచ్చుసూర్యనారాయణుండు

ఐశ్వర్య మొసఁగి నీయాత్మజాతునిగాచు
నది యీయఁదగు నగజాధినేత
సామ్రాజ్య మలరించి సాకు నీతనయుని
నది హెచ్చుగల్గు సురాధిపతియు

తే. గీ. నీతి దైతేయగురుఁ డిచ్చు నీతనయున
కితర సద్గుణముల నిత్తు రెల్లసురలు
చారుతరలీల ! సౌతువల్లూరుపాల !
సత్యనారాయణ వరప్రసాదభూప ! 444

తే. గీ. అన్నదానంబు విప్రుల కాచరించి
భూరిసంభావన యొసంగి పూజసేసి
మఱియు నెన్నేని విధముల మహిపుఁ డల్ల
నాఁడు పేదలఁదనిపె నానందగరిమ. 445

చ. అతని యుదారభావమున కంతకుఁదోడుగ రాకుమారునా
యతి కొకపెద్దసాక్షిగఁ జిరార్థితసస్యసమృద్ధజీవన
స్థితికి నిదానమై కురిసె జీవనదంబులు, రైతులుం దదా
శ్రితులును నెల్లవారలును జీవనదంబులభంగిఁ బొంగఁగన్. 446

క. నలువురుదనయులు దానుం
గొలువున నాస్థానగాయకుఁడు కోటయ యిం
పులు గులుకఁగ గానంబుం
జలిపెన్ మేలలర నాఁటి సాయాహ్నమునన్. 447

చ. ప్రమదము మీఱ బందరుపురమ్మున యందలిమేటి "యిండియన్
డ్రమెటికు కంపెనీ" యనెడు నాటకసంఘము వచ్చి చూపె రా
కొమరుని భావిభావుకతకున్ గుదురై తగు "కృష్ణలీల"లం
దమున సదస్యు లెల్లరు ముదంబున సారెకు నోలలాడగన్. 448

తే. గీ. నాఁటిమధ్యాహ్నమునఁ గొల్వుకూటమందు
సరస తిరుపతి వేంకటేశ్వరు లిరువురు

గవిత జెప్పిరి పిమ్మట గాయకమణి
నాగభూషణముం బాడె నాణె మెసఁగ. 449

తే. గీ. నాగభూషణుగానంబునకు సహాయ
ముగను వాయించె మద్దెల ముదము దనర
ధాటి చెన్నూర నల యశ్వధాటి రామ
మూర్తి తనయింటిపేరి యబ్బురము దోఁప. 450

తే. గీ. అట జలక్రీడ లాదిగా నవనినేత
తనదునాప్తులతో ధనాంగనలతోడ
వాద్యఘోషంబుతోఁ గృష్ణవారి నాడెఁ
గనెడివారల కానంద మినుమడింప. 451

చ. పదపడి యాకసంబున గుభాలు గుభాలు గుభాల్ గుభాలు మం
చుదయమునందె బిట్టుఱుము లుర్విపయిన్ బడు నభ్రి మన్నటుల్
కదలెను వాయువుల్ సికత గప్పెను దిక్కుల నెల్ల వానయున్
మొదలిడె, సుంతయైనఁ దనమోదము భంగముగాద జేనికిన్. 452

తే. గీ. సత్యనారాయణ వరప్రసాదనృపతి
సత్యసంకల్పుఁడను నుడి చాటుకొఱకె
కాని యావాన క్షణవిఘ్నకారియయ్యెఁ
బిదప క్షణవిఘ్నకారిగాఁ బొదలదయ్యె. 453

తే. గీ. శ్రితులతో వారసతులతో హితులతోడఁ
బరిజనులతోడఁ బెక్కువార్వములతోడఁ
వేసఁగులతోడఁ బురమున కేగుదెంచె
రాజు సాయాహ్నమున గజరాజు నెక్కి. 454

క. మొగ్గలనెఱి గల్గిన వెల
దిగ్గజమనలకు నరపతిప్రవరుఁడు మై
నిగ్గులు వెలార్పఁ జేసెడి
మొగ్గలచేఁ గొంతద్రవ్యమున్ దీయించెన్. 455

క. చిన్నలకుఁ జిన్నయై కడు
మిన్నలకున్ మిన్నయగుచు మేదురమోదా
భ్యున్నతికిం గుదురై యా
మన్నీఁ డెన్నెనిగతుల మది దనియించెన్. 456

ఉ. ఆమఱునాఁడు నూటపదియాఱులు మేలిమివస్త్రముల్ మొదల్
గా మరియాదకుందగిన కానుకలిచ్చి సగౌరవంబుగా
నామహినాథుఁ డంపెఁ గవు లాదిగఁ గల్గినవారినెల్ల వా
రామెయి నేగుచోఁ దన యుదారకథానక ముగ్గడింపఁగన్. 457

—॰ సాయంకాలము కృష్ణానదిపై నౌకాయాన మొనర్చునపుడు చెప్పినవి ॰—

మ. అదె, సంధ్యాసతి ! కృష్ణలోన జలకం బాడంగ నేతెంచెఁ, ద
న్మదిరాక్షీమణి యంగరాగపుఁబసన్ నద్యంబువుల్ తళ్కు_ బై
క్కొ_దవన్ పైశమ యాపెగోప్యతకునై యూహించి వ్రేలాడ ది
క్సుదతుల్ నించిన వెల్లచీరలనఁ బొల్చెన్ నీటిలో మేఘముల్. 458

చ. దయగలవాఁ డుదారగుణధాముఁడు దాత మనోజ్ఞమూర్తి స
త్యయశుఁడు సత్యకాముఁ డనృతప్రతిపక్షుఁడు దేవభూసురా
న్వయభజనానురక్తుఁడు విహారమహారసికుండు సర్వదా
జయమును సంపదల్గొనుచు సత్యనృపాలుఁ డెసంగుఁగావుతన్ ! 459

మ. ఒక సంతానము వేణుగోపకృప నా కొప్పారె నబ్బాలు నా
మకృతిస్ఫారమహోత్సవమ్మునకె మీ ర్మా వీటి కేతెంచినా
రిఁక నాకున్ గృతిరూపసంతతిని మీ రిప్పింపఁగా మీకు నే
నకలంకంబగు భక్తి మ్రొక్కి_తిఁ గృతార్థాత్మున్ బొసర్పందగున్. 460

శా. సాయంరాగము నీటిపైఁబరఁగు తచ్ఛాయన్ విలోకింప నౌ
కాయానంబున వచ్చు నీకుఁ గడువేడ్కన్ బూజఁ గావింపఁ గృ
ష్ణాయాదఃపతిపత్ని తాఁ బఱచె విన్నాణంబుగాఁగన్ "దివా
సీ" యంచున్ మఱినూహపుట్టె గుణరాశీ ! సాతువల్లూన్నృపా ! 461

—• కడియము — డాక్టరు కారిక్కు •—

మ. బలవద్రోగనివారణౌషధకలాపారీణు శ్వేతాస్యస
త్కులజున్ నిస్తులశాంతి కాంతిసుగుణస్తుత్యున్ స్మితాంచన్ముఖున్
లలితాంతఃకరణున్ సతీసుతయుతున్ నానత్యసత్కీర్తితో
సలరంజేయుతఁ గ్రీస్తుదైవ మెలమిన్ యఫ్ ఆరు కారిగ్గారన్. 462

శా. చిన్నారాయఁడు మాకు స్నేహితుఁడు సుశ్రీకుండు ఘోరార్తితో
నున్నం జూడఁగలేక చేయునదిలే కోదార్పఁగాఁ ద్రోవ లే
కెన్నెన్నోగతులన్ శ్రమింపఁగ నీ వేమిచ్చినన్ రాని సం
పన్నగ్రామణి వేగు దెంచితి తదాపద్వార్ధిపోతంబవై. 463

ఉ. వచ్చినవెంట నిన్నుఁ గని వ్యాధి భయంపడినట్లుతై వెసన్
హెచ్చది పూర్తిగా సురిఁగి యీడిగిలంబడి రాయమౌళికిన్
బెచ్చుపెరింగె సౌఖ్యమది నిద్దుర చక్కఁగఁ బట్టఁ జొచ్చె నే
మిచ్చినఁగాని తీఱదుసుమీ భవదీయఋణంబు "డాక్టరూ!" 464

ఉ. వైద్యము నేయవచ్చు ఘనవైభవ ముండఁగవచ్చు ఘోరరో
గాద్యపమృత్యువారకత నందఁగవచ్చు సదా నిగర్వియై
హృద్యవచోభిరాముఁడయి యెల్లరఁ జల్లనిమాడ్కిఁ జూచు నా
విద్య సుదుర్ఘటం, బది వివేకికిఁ జేకుఱె నీకు "డాక్టరూ!" 465

శా. రామారాయుఁడు చిన్నరాయనికి నా రాయండు మాకున్జనున్
శ్రీమంతమ్మగు నీదువైద్య మెలమిన్ జేకూర్చి, రింకెట్లు నీ
ప్రేమంబబ్బిన మమ్ము వ్యాధిభయముల్ పీడించు? మాకీపయిన్
నేమంబే యగు నేమమేయగు నగున్ నేమమ్మె "కారిగ్గారా!" 466

—• శ్రీ వేంకటాద్ర్యప్పారావుగారు: నూజివీడు •—

మ. కవివై భూపతివై సదా సుమతివై కళ్యాణివై నిత్యహూ
ర్జవ మొప్పారఁగ నూజివీట సుఖివై రాజ్యంబు పాలించు ని
న్నవలోకించునదృష్ట మిప్పటికి సంప్రాప్తించె నయ్యార్యరా
జవరా! తిర్పతిశాస్త్రికిన్ సుకవితాసాఫల్య మింపారఁగన్. 467

ఉ. చిన్నతనమ్మునన్ రసవశీకృతమైన కవిత్వశక్తిఁ గై
కొన్న భవాదృశావనిపకోరకముల్ వికసించుచున్నచో
మన్నన కేమిలోటు రసమంజులమౌ కవితావధూటి క
భ్యున్నతి వచ్చురోజు లిపు డున్నవి నిక్కము భూమిపాలకా! 468

తే. గీ. శ్రీసమృద్ధియు సుగుణసమృద్ధి గల్గు
రాజ్యలక్ష్మికి సఖియౌచుఁ బూజ్యయైన
సుకవితాకన్య నిన్ను మన్చున్ సుకవివ
రాభినుతిగేయ! వేంకటాద్ర్యప్పరాయ! 469

—• కోటలో నాఁడుజరిగిన నాటకమునుగూర్చి •—

సీ. భక్తి చిప్పిలెడి గోపన్నవేషము గన్నఁ
గనుల కానందంబుఁ గలవుదీతెఁ
బ్రాభవంబును శూరభావంబు దెల్పు సు
ల్తానుమేల్ సౌరు దలంపవలదె?
రామలక్ష్మణవేషరామణీయకవచో
గౌరవంబుల నెంచ నేరితరము?
తక్కు నక్కన్న మాదన్న ప్రముఖులయు
వేషముల్ మిగుల సంతోషదములు

తే. గీ. నాటకం బెల్లను బ్రయోగపాటవమున
కాటపట్టయి యానంద మబ్బఁజేసె
నటులలోపము రానీనినాటకము సె
బాసు నాఁదగు శ్రీరామదాసచరిత! 470

సీ. శయ్యారసౌచిత్యసంప్రదాయములకు
సంతోషపడు కవీశ్వరులతోడ
ధారాచమత్కారధాటికై సంతసం
పడుచుండు పండితవరులతోడ
సుకవి యయ్యేనటంచు సొగియు చానందించు
తండ్రిలోనైన బాంధవులతోడ

సీతి విజ్ఞానౌచితీతంత్రములకు లో
మెచ్చు నుద్యోగిసమితులతోడఁ

తే. గీ. దన యొనర్చిననాటకం బనుపమంబు
చూచుభాగ్యం బదృష్టంబు శుభయశంబు
నీకుఁగాకెవ్వరికిఁ గల్గు నృపతులందు?
వేంకటాద్ర్యప్పరాయ పృథ్వీతలేంద్ర! 471

—• శ్రీ నారయ్యప్పారావుగారు—నూజివీడు •—

మ. చిరకాలంబుననుండి మేము ధనమార్జింపన్ బ్రియత్నింపకె
వ్వరికిన్ శక్యులుగాని త్వాదృశుల భూపశ్రేష్ఠులన్ సత్కవి
త్వరసోదారతరాంతరంగులను సంపాదించుకొన్నాము నె
య్యురుగాఁ గార్యములున్ గథల్ జరుగఁగా నో నారయక్ష్మావరా! 472

మ. ధనమావంతయుఁ జేతఁబూనక మహోత్సాహంబు ప్రేరేపఁ బు
త్రున కుద్వాహము నిశ్చయించితిని, ఖర్చుల్ సేయఁగా రెండువే
ల్దనుకంగావలె, నందుకై జడియ; విద్వద్భార మాత్మీయ మం
చనుకోఁజాలినవారు త్వాదృశులు లేరా! నారయక్ష్మావరా! 473

మ. కవితాకన్యక నెన్నియేనియు నలంకారమ్ములన్ గూర్చి మ
క్కువతోఁ బెంచి భవాదృశోత్తములకై కోఁజేసి కోదండ్రకుం
కువగాఁగన్ నగ లిచ్చిరే యనుచు లోకుల్ దెప్ప మావంటి స
త్కవులన్ జెందు నకీర్తి రాజులది కాదా, నారయక్ష్మావరా! 474

మ. కవిమాన్యం డగురామచంద్రధరణీకాంతుండు మాచేత ము
న్నవధానం బొనరింపఁజేసి తమి నూటార్లిచ్చె నాఁడాది మా
కవలో నొక్కరు యుష్మదీయ మగుసత్కారమ్ముకై కొంచు ను
న్నవిధం బిప్పుడు విన్నవించితిఁగదన్నా! నారయక్ష్మాపతీ! 475

మ. ప్రతిసంవత్సర మేగుదెంచుచు భవద్వర్షాశనం బేను స
మ్మతితోడం గయికోని హేతువు తలంపన్ లేకపోలేదు నా

కతిభారం బగుకార్య మొండొదవుచో నానాఁటికిన్ దాని "దాఁ
చితి" నంచున్ దలపోయుచుంటి గుణరాశీ, నారయక్ష్మాపతీ ! 476

తే. గీ. పొట్టపోషించుకొనుటకై పోలనగర
పాలకుండగు కృష్ణనృపాలుఁ డుండెఁ
బరిణయాదిక శుభములు జరుపుపొంటె
భారమును బూనవలె మీరు మీరు మీరు. 477

తే. గీ. "ఒక్కరే చేసి రవధాన మొక్క నూజి
పీట" నను వాడు మీతండ్రినాఁటఁబోయె;
"నొక్కరే సత్కృతియుఁ బొందు చుండి" రనుటఁ
బాపవలె నీవు నారయప్పృథ్వీంద్ర ! 478

తే. గీ. "నీవు గా వంశఅకొనంగు నృపతివరుఁడ
వెల్లరను వేఁడువారల మేము గాము"
అనుచు మీతండ్రియొద్దనే మునుపు విన్న
వించియుంటిమి నారపృథ్వీతలేంద్ర ! 479

చ. అడుగకయుండుకార్యముల నన్నిటినిన్ దమబోఁటివారికె
క్కుడుశ్రీమగొల్పకే జరుపుకొంటిని నేఁటికి మీరు మీరునున్
గడపక చేయలేని గురుకార్యము పుత్రునిపెండ్లిగాన నే
నడుగక తప్పదయ్యె సరసాగ్రణి నారయభూతలేశ్వరా ! 480

—• శ్రీకృష్ణనిర్యాణము—కాకినాడ •—

క. మాకాప్తుఁడు మాకొడయఁడు
మాకాలంబంబు రాజమౌక్తిక మపుడే
నాకాలయమున కరిగెన్
మాకృష్ణారాయ భూమినాథుం డకటా ! 481

సీ. నాగరాజాదిజన్మస్థాన మైనపె
ద్దాడవంశాబ్ధి నుద్భవముఁ జెంది

శ్రీకామమాంబికా శ్రీకరపాణిపో
షణశాణకషణసంస్కార మంది
కొచ్చెర్లకోటాన్వయోచ్చమౌక్తికహార
మునకుఁ బేరిడు మణిపూస యగుచుఁ
బరమహూణాంధ్ర గీర్వాణభాషాంగనా
కంఠసీమల కలంకారమైన

గీ. రామచంద్రివేఁకటకృష్ణరాయనామ
కమగు మగరా జయం బధికముగఁ గాంచు
టకును మాఱుగ మసియయ్యె నకట! కాల
యుక్తివత్సరమునఁ గాలయుక్తిఁజేసి. 482

సీ. పదిమందియైనను బంక్తిని లేకుండ
భుజియింప నేరని పుణ్యమూర్తి
అపకారమొనరించునతఁ డేగుదేనైనఁ
గోపమ్ముఁ జూపని ప్రాపకుండు
అలవిగాని ప్రిచార మడుగువారలనేని
లేదు పొమ్మనలేని సోదరుండు
ఆశ్రియించినవాని యపరాధ మెంతైన
స్మరియింపనొల్లని సజ్జనుండు

తే. గీ. చదువుల టీకాణ, కరుణ లొచ్చని దుకాణ
మాప్తజనముల ప్రాపు సత్యములకాపు
నాకమున కేగె నఖిలలోకైకనుతుఁడు
తృష్ణలకు వేల్పుటావు మా కృష్ణరావు. 483

తే. గీ. శనిమహాదశ మంచియుచ్చదశ యంచుఁ
బల్కు కార్తాంతికుల పల్కుబడు లనృతము
లనఁగ శనిదశలోని శన్యంతరమునఁ
గుజుఁడు పాపాత్ముఁడగుచు మా కొంపదీసె. 484

సీ. కలకలనవ్వుమీసల మోసల నటింప
రా జనందగు ముఖపఙ్క్తిఖలతోడ
సమయానుసారిగా నమృతంబుఁ జిలికించు
వనదగంభీరనిస్వనముతోడ
నాప్తులేతేర రండంచుఁ గుర్చి కేలఁ
జూపించు వినయవిశ్రుతులతోడఁ
గరుణచిందించు క్రేఁగంటిచూపులు మీఱ
నలువంకఁ గను లోచనములతోడ

గీ. సౌధచత్వరమునఁ గొల్వుసాలయందుఁ
బడుకవేత్రాసనంబునఁ బ్రౌఢిమీఱ
నుండు నీరూపు సీనగ వూర్జితోక్తు
లెట్లు మఱపింతువయ్య! యోకృష్ణరాయ! 485

చ. ననుపగునాణెము త్తెము లనందగు నక్షరపంక్తి మీఱ పం
చిననడు మెత్తకుండఁగ మషీజలపూరితమైనమేటిలే
ఖినిఁ గొని వేయిచేతుల లిఖించినయట్లుగ వ్రాయు కృష్ణరా
డ్జనపతిఁబోలు లేకరి నిజంబుగ నింక ధరన్ జనించునే? 486

సీ. శ్రీమత్త గలిగియుఁ జెన్నపట్టణ కళా
శాల బి. యే. దాఁకఁ జదివినావు
చదువుచేగాదు భాషాసాగరంబెల్లఁ
గుంభసంభవురీతిఁ గ్రోలినావు
క్రోలుటేకాదు పెక్కులుగ్రంధములు గొని
గ్రంథాలయంబు నేర్పరిచినావు
శాసనసభలోన సభ్యతాపదవి కొం
చెముత్రక్కు వాటేండ్లు చేసినావు

తే. గీ. పాదుకొనినావు సుగుణసంపద సమస్త
హృదయసీమలయందు సహృదయుఁ డట్లు

నీకు లోఁటేమి ? మేమెల్ల నిన్నుఁబాయు
పాపమొనరింపఁగాఁ గృష్ణపార్థివేంద్ర ! 487

చ. విలవిల యేడ్చుచుం బ్రజ "వివేకహీనుఁడు మంచిచెడ్డ నేఁ
తల నెఱుఁగండు మూర్ఖుఁ డతిదారుణచిత్తుఁ" డటంచు రోయఁగా
నలుబదియెన్మిదేండ్లకె వినాశము నీకు ఘటింపఁజేసి యా
నఱవ పడెన్ వృథా జనులనల్వురనోటను గృష్ణరాడ్విభూ ! 488

ఉ. చూచితి వెల్లదేశములఁ జొచ్చితి వెల్లసభల్ నరేంద్రులం
జూచితి వెల్లవారలను సూరుల సత్కవులన్ దయామతిం
జూచితి విందిరాలోక మిఁకఁ జూడనిదొక్కటియంచు నేగఁగాఁ
జూచితివేమొ లేక విధిచోదితమో యిది ! కృష్ణరాడ్విభూ ! 489

సీ. పతిభక్తి నిత్యదైవతపూజ యతిథిస
త్కారంబు వ్రతసంవిధానదీక్ష
మొదలైన సుగుణముల్ పుంజీభవించిన
యద్వితీయ కటా ! భవద్ద్వితీయ
యిరువదియాఱేండ్లయింతి కెక్కడ వ్రాసె
వైధవ్యయోగ మావనజభవుఁడు
అనుమాయితి తప్పదా యేమి ? కానుండేఁ
గాఁబోలు రెండవకామయాంబ !

గీ. నీకు నీతండ్రిపోలిక, నీపురంధ్రి
కరయ నీతల్లిపోలిక యన్నిగతుల
నబ్బె; దివినుండి దీవింపుమయ్య ! కృష్ణ
రాయ ! కలుగంగఁ గొదవ సర్వంబు మాకు. 490

గీ. నీవు చదివినగ్రంథముల్ నీవు ప్రోవు
చేసినవికూడ పదుగురుఁ జేరి చదువఁ
దగినవని యెంచికాఁబోలు ధర్మపుస్త
కాలయము చేసినావు కృష్ణావనీంద్ర ! 491

గీ. రావుబహాదూరు లున్నారు, రాజమాన్య
రాజపూజితులున్నారు పూజనీయు
లైన మా కాకినాడ చంద్రాస్తమయము
నాఁటిరాతిరి యయ్యెఁ గృష్ణక్షితీంద్ర! 492

ఉ. లోపములం దెదో యొకటి లోకములోపల లేనివాఁడు లేఁ;
డేపని చేసినన్ బరుల కెన్నఁడు హాని దలంపవీవు, వి
ద్యాపటుసంపదగ్గల మహాత్ముఁడు సర్వజనోపకార చిం
తాపరుఁ డన్నఖ్యాతి విడిన న్నిను వీడదు కృష్ణభూపతీ. 493

సీ. బహుకుటుంబములను భరియించితివి తత్త
దనుగుణగౌరవోపాధు లొసఁగి
పెక్కుమందిని జదివించితి వన్నవ
స్త్రంబులు స్కూలు జీతంబులిచ్చి
చాలమందికి మేటిసౌహార్ద మొసఁగితి
వడిగిన సర్వకార్యములు దీర్చి
కాపట్యమెఱుఁగని కరుణఁ జూపించితి
వాశ్రితకోటిపై నాప్తులందు

గీ. నరిగితివి "చెన్నరాష్ట్రంబునందు ఘనుల
యందుఁ దలమానికంబు ధరాధినేత
పండితుం" డన్నఖ్యాతి తోడ్పడఁగ రామ
చంద్రవేంకటకృష్ణరాయేంద్ర! దివికి. 494

ఉ. మంచముమీఁదఁ గాలిడె నమాసనిశీథిని నాఁటినుండి బా
ధించె జ్వరంబు భూతమయి తీక్ష్ణతరంబుగఁ గొన్నినాళ్ళు వే
ధించెను నూపిరిన్విడుచుతిత్తులబంధనమాత్రవస్తు ల
భ్యంచితమైన కృష్ణనృపుప్రాణము దీసె వివెల్ల నేకమై. 495

సీ. హృదయంబు శోధించి కుదురునంచు వచించు
నావల నాసలేదనుచు నుడువు

ఇట్టిచ్చె మందంచు నట్టైసంతోషించు
జ్వరము హెచ్చె నటంచుఁబరితపించు
వాయుకోశము భగ్నమాయె నంచుఁ గృశించు
వగరుపుఁ గన్గొని భయముఁజెందు
జీర్ణకోశము కొంత చెడెనంచు దుఃఖించు
జ్వరము లేదనియెంచి సంతసించు

తే. గీ. నిట్టులై దాఋదినము లనేకగతులఁ
జూపురోగంబు మరలింప నోపఁడయ్యెఁ
బురభిషఙ్మణి; యిట్టి దుస్తరగదంబు
విడిచెఁ ద్రుటిలోనఁ గృష్ణపృథ్వీకళత్ర! 496

సీ. శతవధాన మొనర్ప సరసులు కబురంపఁ
బంపకుండఁగ మానిపింపలేదు
సర్వదేశంబుల సభలకుఁ బోవుచో
వెంట రమ్మనకుండ విడువలేదు
పీటపైఁ గూర్చుండి పిలువనంపక యుండ
నేదినమ్మున భుజియింపలేదు
మొదటినుండియుఁ దుట్టతుదదాఁక నొకరీతి
గురుభావమునలోటు జరుపలేదు

గీ. నిట్టిరీతిగఁ బదునెన్మిదేండ్లు జరిపి
కృష్ణభూపాలకుఁడు దివి కేగె నేఁటి
కాయనకు నాకుఁ గల్గు ఋణానుబంధ
మక్కటా! దైవదౌర్బల్యమణఁచివైచె. 497

సీ. ఆత్మకూరునృపాలుఁ డాస్థానకవులు కం
డంచుఁ బెన్భక్తిఁ బ్రార్థించినపుడు
గద్వాలరామభూకాంతుండు మున్నగ్రి
హార మిచ్చెద నుండు మన్న యపుడు

నీతరభూపతు లెందఱెందఱో తమయొద్ద
నుంచుకోఁదలఁచి పిల్పించినపుడు
పాఠశాలలయందుఁ బండితపదవిఁ గై
కొనుఁ డంచుఁ బౌరులు కోరినపుడు

గీ. కృష్ణభూపాలగుణశంకుకీలితుండ
నగుచుఁ గదలఁగలేనైతి నకట! యట్టి
పండితుండైన బ్రాహ్మణప్రభు వుపాస్య
సుగుణుఁ డింకెవ్వఁడున్నాఁడు జగతియందు? 498

గీ. సకలసద్గుణరాశిని సకలలోక
నుతుని బండితు విప్రభూపతిని గృష్ణుఁ
గంటివను సద్యశము గంగఁ గలిసిపోవఁ
గాటి కంపితివే పాడుకాకినాడ! 499

సీ. రచియించినాఁడ బుద్ధచరిత్ర కృతిగాఁగ
మేలినాటకములు మృచ్ఛకటిక
బాలరామాయణ పాండవవిజయము
ద్రాదారాక్ష సేద్వర్ధురాజమౌళి
పట్టాభిషేకముల్ పావనయుష్మదా
ఖ్యాభూషితంబులుగా నొనర్చి
నీకీర్తికాంత కీ లోకమ్మునందు వ
సించుసౌధమ్ము నిర్మించినాఁడఁ

గీ. బండితుఁడు కవిమిత్రుండు బాంధవుండ
నంగ మెలఁగితి, దానికి నాకు నీవు
చేయుప్రత్యుపకార మిస్సీ, మహాత్మ!
వదలి దివి కేగుటా? కృష్ణవసుమతీంద్ర. 500

శా. ఆనందాత్ముఁడవై సుఖింపుము మహాత్మా! సత్యలోకంబునం
దో, నాకంబుననో, వికుంఠనగరీదుర్గంబునందో, శివ

స్థానంబందుననో, సమస్తసురసంస్థానాధిపత్యమ్ముతో
నానావైభవయుక్తితో నెపుడుఁ గృష్ణారాయభూపాలకా ! 501

గీ. గౌతమీపుణ్యపుష్కరకాలమందొ
నర్చినట్టివి రెండుదానములు గలవు
వానిఁ జేయించుకొనుము నీభార్యచేత
శాంతివడుఁ గృష్ణరాయ ! నీయంతరాత్మ. 502

—• శ్రీ పోలవరం జమీందారుగారి శనిమహాదిశ •—

మ. శనిగా ! నీవరుదెంచి పోలవరసంస్థానంబుఁ బాలించు కృ
ష్ణనృపాలోత్తమకల్పపాదపముఁ బెల్బంగూల్చి యాచెట్టు మీ
ద నివాసంబొనరించు సద్ద్విజతతిం దైన్యంబుఁబొందంగఁ జే
సిన నీచిత్రిపుఁ జర్య లెల్లరును 'ఛీఛీ'యంచు దూషింపరే ! 503

మ. 'శని యేతెంచు ఋణంబు తీర్చు నిఁక రాజ్యంబెల్ల వర్ధిల్లుఁ గృ
ష్ణనృపాలాగ్రణి' కంచు నందఱును బల్ సంతోషముంజెంద సూ
ర్యనకుం దోడయి తత్ప్రియత్నముల కయ్యో ! భగ్నభావంబు నే
ర్పున సాధించి ఘటించితే మొదలికే మోసంబు చండాలుఁడా ! 504

శా. నీసంబంధములేక కృష్ణనృపుఁ డెన్నేనాళ్ళు దా రాజ్యముం
జేసెన్ మిన్నగఁ బెంచె నాశ్రితులఁ బోషించెంగవీశానులన్,
శాసించెన్ సభయందుఁ, దుష్టతుదకుం దాపైతి వోరీ శనీ !
నీసంబంధముచేత మాసెఁగదరా నిర్భాగ్యదామోదరా ! 505

శా. చేయించెం జపముల్ సహస్రములు కాశీయాత్రఁ గావించె వా
సాయంకాలము నాపత్రిబాతము మనస్స్వాస్థ్యంబు లేకుండఁగా
నీయేర్పాట్లగుటించి జాతకము నెన్నేసార్లు యోజించె లే
దాయెన్ లాభమొకింత నీవలన నిందా ! శ్రాద్ధదేవానుజా ! 506

మ. కలలోఁ గన్పడెనంచు నానతిడెఁ "బిక్కల్ దీర్ఘముల్ దేహ మిం
గల మాస్యం బదయారసంబు వికటాగ్రభ్రూసమాలోక మం

భ్రుములమీదంబడు నల్లకోటుగల యొక్కం"డంచు నాల్ గైదు రో
జులకుం బోవుచు కృష్ణరావు, యమరాట్సోదర్య! నీవేమొకో! 507

మ. రజనీనాథుఁడు మున్ను గాఁగలుగువారల్ దాఁటు నామీఁద నీ
కుజనుస్సంగము వచ్చి మాపెఁగదరా! కూలంకషప్రజ్ఞచే
త జగానిద్దవుఁగాంతిచేతఁ గవివిద్వత్పోషణాసక్తిచే
త జగంబెన్నఁగఁ బొల్చు కృష్ణజననాథఖ్యాతదీర్ఘాయువున్. 508

శా. ఆచంద్రార్కము పేరు నిల్పుటకు మున్నార్జించెఁ దా నీతివి
ద్యాచాణక్యుఁడు కృష్ణభూపతి కవిత్వఖ్యాతులన్ మమ్ము; నీ
వేచందంబున దాని మాపఁగల వోరీ మంద! పాపాత్ముఁడా!
నీచేయంగలదొండు చేసితివికానీ, లోపమేమీ? శనీ! 509

శా. ఎన్నోధర్మము లాచరింపఁ దనలో నేవేళఁ జింతించు మా
మన్నీఁ డింతకు మున్ను; నీ వెటులొగిన్ మాయించితో వాని! మీఁ
ద న్నీకంటెను లేఁడు పాపమతి, యేధర్మంబు లేకుండ యా
పన్నుండై నరపాలుఁడున్నయెడ వీల్ వ్రాయించి తోరీశనీ! 510

శా. బాముల్ పెట్టకయుండఁ జంపె శని విద్వాంసుఁడా ధరాపాలునిన్
భూమీదేవుని గృష్ణరావుననుచున్ మూర్ఖుల్ ప్రశంసింతురిగా
కో మందాత్మ నినుం బలే, యతని కాయుర్దాయమే యున్నచో
బాముల్ పెట్టఁగఁజాలునే యొకఁడు దీవ్యత్కీర్తి కామూర్తికిన్. 511

మ. తనయావాప్తి భవద్దశాంతరమునం దాపైన దంచున్ బుధుల్
వినిపింపన్ వినుచుం దదాశపడి సంప్రీతాత్ముఁడై కృష్ణుఁ డూఁ
కొనుచుం దద్దయు మిన్నకుండె నకటా! గ్రుక్కెండు ప్రాణంబు పో
యినదాఁక న్నృపు నీ వపుత్రికునిగానే యుంచి తోరీ శనీ! 512

ఉ. వదలె న్నీదశ కృష్ణరాయనృపరాట్ప్రాణంబుతో నింక నా
సదుదారాత్మిక రాణి యెల్లపుడు నీసంబంధముల్ లేక ని
న్నెదవంజేయుట కోసమేనియును నోరీమంద! కావించుతన్
దుదకుం దత్తుగ నింటనున్న నుపనీతుం దమ్ము మోదంబునన్. 513

ఉ. తమ్ముని గాకయున్నఁ దన దాయల లోపలి కుఱ్ఱవానిఁ జి
త్తమ్మునకెక్కు యోగ్యతము దత్తకుమారునిఁజేసి భర్తకున్
ముమ్మరమైనదుఃఖమిడు పున్నరకంబుఁ దరింపఁజేయు ని
క్కమ్ముగ "వీలు"లోఁ గపటకారయితృత్వము లేకయుండినన్. 514

శా. ఆరోగ్యంబు నొసంగఁజాలు వరదుం డౌరౌర! నీతండ్రి లో
కారాధ్యుం డటువంటివాని కెటు మందా! నీవు నీతమ్ముఁడుం
గూర్రాత్మ్మల్ జనియించిరో ప్రజలు గగ్గోల్వెట్టఁగా నంతకా
కారుల్ చెల్లె లొకర్తు చాలు నదియుం గాళింది కాలానుజా! 515

చ. కవిబుధమైత్రి నీకుఁ గడకం గ్రహచారము చేతఁగాని నీ
కవిబుధమైత్రి కాలఁ! గలకాలము వారలఁ బ్రోవఁజాలు పో
లవరనృపాలుఁ జంపితి విలాతలమెల్ల నిసీ! యనన్ శనీ!
కవిబుధవైరి వైతివిర! కాలము కర్మము దాపరింపఁగన్. 516

ఉ. నాదశ చూడుమంచొకఁ డనంతరమావిభవం బొసంగె, నా
యీదశ చూడుమంచుఁ జదువిచ్చె నొకం, డొకఁడిచ్చె సౌఖ్యముల్
నాదశయంచుఁ బాపుఁడు ఋణంబులు పెంచె నొకండు కాని యీ
నీదశవచ్చెఁ దుట్టతుద నీచుఁడ! కృష్ణనృపాలుఁజంపఁగన్. 517

శా. మీకర్మం బదిగాక నావలని పేర్మిం బెక్కు రాజన్యు ల
స్తోకప్రాభవశాలు లేరుపడిరంచు న్నీ వనం బోకుమీ
నాకున్ గోపమువచ్చుఁ; జంపుటకుఁ గృష్ణక్షోణిపాలుండు ధ
ర్మైకాలంబుఁడు నీకుఁగన్పడెనె యోరీ వక్రచారీ! శనీ! 518

శా. సామంతంబునఁదెచ్చి పోలవరసంస్థానాలవాలంబునం
గామాయ మ్మొక మొక్కపాఁతె, నదియుం గల్పద్రుమంబై ద్విజ
స్తోమాధారమునై మహాఫలమునై ద్యోవీధికింబ్రాఁకుచో
నామూలంబుఁ బెకల్చివైచితివి మందా! మొక్కలేకుండఁగన్. 519

శా. బుచ్చాయమ్మయుఁ దెచ్చివైవఁగల దాపోద్రిది న్నవాంకూరమే
యెచ్చోఁబుంగనకుండఁగాఁ బెరిఁగి కల్పోర్వీజ మౌనట్లుగా

నిచ్చల్ వేల్పులకెల్ల మ్రొక్కెదను రాజ్ఞీ తల్లజంగూర్చి నీ
గచ్చల్ చూపకుమోరి నీకును నమస్కారంబు సూర్యాత్మజా! 520

ఉ. ఆచదు వామనోద్రిధిమ యామతి యాస్మిత పూర్వభాషణం
బాచతురోక్తు లాగుణము లన్నియు నేమయిపోయెనో! నయ
శ్రీచన మందుతిన్న క్రియఁ జేటు వడంకు దిగుల్ భయంబు రా
నీచనుదెంచునాఁటి కవనీపతి మాఱె శనీ! క్రమంబుగన్. 521

శా. వ్రాయించెఁ గురుఁడొక్క 'విల్లు' మును, ధర్మాలెన్నియో చేయఁగా
వ్రాయంగాఁబడె నందు; నీవు మరలన్ వ్రాయించి తా విల్లిసీ!
యే యేర్పాటులు లేకయుండ నెటు నీకింపయ్యెనో కాని వి
ద్యాయాదోనిధి కృష్ణరా ఐతనివ్రాఁతల్ కూడ నిట్లుండు నే! 522

చ. అమలమనీషతోఁ జదివినట్టివి చిన్నవి పెద్ద వాంగ్లగ్రం
థములొక యాఱువేలు జననాథుఁడు దా సమకూర్చియుంచె భ
ద్రముగ నెటో పురంబునకు దానముజేయఁగ వ్రాయఁ జేసి తా
సమయమునందు నున్న సహచారిగ్రహంబు కతంబునన్ శనీ! 523

మ. అనయం బన్నలుఁదమ్ము లాత్మజులు విద్యాదేశికుల్ బాంధవుల్
తనకెల్లప్పుడు మిత్రులాశ్రితులుగాఁ దథ్యంబుగాఁ గూడఁబె
ట్టిన మాకృష్ణుని కప్పు డాశ్రితుల మాటే జ్ఞప్తి లేకుండఁజే
సిన నీదుశ్చరితంబు వ్రాయ శనిగా శేషాహియుం జాలు నే. 524

మ. అమరన్ జాతకరాశిచక్రమున నీకబ్బెం ద్వితీయాధిప
త్యము ప్రాప్తించె వ్యయంబునందునికి మందా! యందులో నీదశా
సమయంబైనపు డేల మానుదువురా చంపింప? కాచావు లో
కముతోపాటుగ నేలయుండును నపఖ్యాతంబుగాకుండఁగన్! 525

మ. అగుఁ గష్టంబని యెంచ కెట్టిపనికే నాశించువా రెందులో
దిగుమన్నం దిగువారు, రేయును బవల్ నిద్రించునందాఁకఁ బా
ర్శ్వగులై యుండెడు వార, లాశ్రితులు మిత్రశ్రేణి యుద్యోగులుం
డఁ గటా! చేసితి వొక్కఁడే నెఱుగకుండం జేయుచేఁతల్ శనీ! 526

శా. "ఆయుర్వేద విధిప్రకారముగ వైద్యంబేల చేయింప రాం
గ్లేయప్రక్రియ చాలు దానివలనన్ లేదాయెలాభం" బటం
చాయీవైద్యులు పల్క దేశభవ వైద్యశ్రేణి చండాల ! యే
సాయంబుం బొనరింప నీ వయితిగా జాతి స్వభావంబునన్. 527

శా. తల్లింజంపెను రాజయోగ మటుపై తద్భ్రాత్రి పోషించె నా
యిల్లాలే కొనె దత్తుగాఁ, గుజునిచే నేర్పాట్లుగావించె సం
పల్లీలాకళ లభ్యసించుటకు స్వర్భానుండు పెంచెన్ బుణం
బుల్లాసంబు గురుండు, కృష్ణునకు నాయుశ్ఛేదివై తోశనీ ! 528

చ. "శనిదశ వచ్చునంట యది చాల మహత్తర రాజయోగకా
రిణియఁట యందు నేను బొనరించెడు ధర్మములెల్ల గొప్పగా
నొనవుతు"నంచు లోఁదలఁచుచుండెడు కృష్ణనృపాలు కోరుకుల్
గొనకొని సున్నఁజుట్టితివి క్రూరుఁడ ! యొక్కటి చేయకుండఁగన్. 529

చ. శనిదశవచ్చెఁ జంపెనని శాస్త్రమెఱింగిన పెద్దలెల్లఁ బ
ల్కిన విని కృష్ణభూవరునిఁ గేవల మీవు జ్వరాదినైక సా
ధనములఁ జావఁజేసితని తథ్యముఁ బల్కితిఁగాని నీపయిం
గినుక యొకింతలేదుసుమి నీరజబాంధవపుత్రరత్నమా ! 530

మ. శనిచాలం డని చెప్పికొందురు విపత్సమ్మగ్నులౌవారలె
ల్లను సామాన్యముగాఁగ జాతకముఁ బోలంజూడకే, మున్ను నీ
జననంబొందిన వేళ యట్టిదిర నీచా ! నిన్ను దుమ్మెత్తిపో
యనివా రెవ్వరు ? మిన్న కే కలుగ వాహా మంచియుం జెడ్డయున్.

— కాకినాడ, బాలగంగాధరతిలక మహారాజ నిర్యాణము —

క. కలకాలము బ్రదుకుట మ
ర్త్యులకున్ సాధ్యంబుగా దనుత్తముఁ డకటా !
తలఁచినపని కాకుండనె
తిలకమహారాజు మర్త్యతిలకం బరిగెన్. 532

క. చేసినకృషి ఫలితంబై
పీసంబేనియును ననుభవింపక మునుపే

కేసరి చనియెఁ ధీరా
గ్రేసరుఁడగు మన మరాటకేసరి చనియెన్. 533

శా. త్యాగుల్ సర్వకళావిశారదులు దాదాభాయినౌరోజి, గో
ఖ్లే, గాంధి ప్రముఖుల్ మహాత్ములు ప్రజాక్షేమంకరప్రక్రియో
ద్యోగుల్ గాంచిరి పేరు గొంద ఱీవు దండుం గాంచుచున్నారు గా
నీ గీతార్థసమన్వయంబు తిలకా! నీరీతిఁ గావించిరే? 534

సీ. ప్రజలకోసము రెండుపర్యాయములు బందిఁ
గొంకక కడగండ్లు గుడిచినావు
జనులకోసరము రాజద్రోహమను పెద్ద
కింవదంతిక నుపేక్షించినావు
లోకులనేమ మాలోచించి యాంగ్లేయ
ధీరులతోడ వాదించినావు
ప్రజలేలవలయు రాజ్యంబు రాజచ్ఛాయ
నంచుఁ బల్ సభలు కల్పించినావు

తే. గీ. పడఁదగిన కష్టముల నెల్లఁ బడియు ఫలము
ఖంబునకు రాఁదగిన సమయంబునందు
హైందవావనిఁ దిలకశూన్యంబుఁ జేసి
యేగితే? నీవు తిలక! లోకైక తిలక! 535

మ. అరయంజాలియుఁ "దప్పుజేసి"తని కారాగారసంవాసముం
బొరి హూణుల్ విధియించి నిన్ననుపఁగా ముంబాపురంబెల్ల న
త్తఱి "నోహో, తిలకార్య!" యంచడలి ప్రత్యగ్వార్ధిమధ్యంబునం
దొరఁగంబోయెనఁటౌర! నీఘనత యెంతోతెల్ప నా శక్యమే? 536

తే. గీ. జన్మదివసోత్సవము నీకు సలుపనెంచి
నంతనే లక్షరూపిక లరుగుదెంచె
నొక్కనాఁడఁట తిలక! నీ యుత్తమాభి
ధేయగౌరవ మెంతయో దెలుపవశమె! 537

తే. గీ. లోకు లొసఁగినదేకదా ! "లోకమాన్య"
బిరుద మొకటి "మహారాజ" బిరుదమొకటి
ఇవియ సాక్ష్యం బొసంగవే ? భవదుదార
సుగుణసంపత్తి కోమహాశూర, తిలక ! 538

శా. సూరత్పట్టణమందు సర్వపురవాసుల్ చేరి కర్తవ్య చ
ర్యారంభం బొనరించునప్పుడు సభాధ్యక్షుండు యుష్మద్వచ
స్సారస్యమ్మునకున్ రవంత యవకాశం బీయమిన్ దత్సభా
స్తారుల్ తత్సభ నాఁగిరోతిలక ! నీ సామర్థ్య మింతింతయే ! 539

మ. బలముం దేజముఁ బెంపుఁ బ్రాభవయశఃపాండిత్యముల్ గల్గి వై
రులకున్ గుండెల గాలమౌచుఁ బలుసారుల్ వైరులం దోలి భా
సిలె నేవీరకిశోర మాతఁడు శివాజీ, పూజ్యమౌ తజ్జను
స్థలమం దీవును బుట్టి తోతిలక ! వింతల్గావె నీచర్యలున్. 540

చ. ప్రమదం బొప్పఁగ దేవదేవుఁ డనుకంపన్ "ధర్మసంస్థాపనా
ర్థము జన్మించెద" నంచు మున్ను పలికెన్ దా రామకృష్ణాదిరూ
పములంబుట్టియుఁ జేయఁదగ్గపని నిర్వర్తించె నేఁ డేమిపా
పమొ ! సంపూర్ణమునేయకే తిలకరూపం బుజ్జగించెన్ గటా ! 541

క. పట్టంచుల మేల్ దోవతిఁ
గట్టి తొడిగి బొందులొప్పు కంచుకముఁ జరీ
పట్టీగల "పగిడీ" తలఁ
జుట్టిన నీరూపు మరలఁ జూతుమె ? తిలకా ! 542

సీ. దేవేంద్రుఁ డేదేని దేవకార్యమ్ము యో
జించుటకై పిలిపించినాఁడొ
భరతభూమికినేఁడు ప్రాప్తించిన సమస్య
గురునితో యోజింప నరిగినావొ
"ఇండియాకు స్వరాజ్య మిప్పించు" మంచు వి
క్టోరియాఁగన బయల్దేరినావొ

స్వర్గ మేగిన పూర్వ చక్రవర్తుల సాక్ష్య
మిప్పింపఁగా నట కేగినావొ!

తే. గీ. ఏదియో గొప్పయుపకృతి యిండియాకుఁ
జేయుటకె కాదె మృతి తటస్థించె నీకు
మరల నేదేశమందొ యేమానవతికొ
కొడుకవై పుట్టి తీర్చుకో కడమ తిలక! 543

తే. గీ. నియతసుకృతాత్మకుఁడవైన నీకు మరల
జన్మమబ్బుట కా దార్యసమ్మతంబు
కాని నీవంటిలోకోపకారి మరల
దొరకఁ డని కోరవలసెఁ గ్రమ్మఱ భవంబు. 544

సీ. ప్రతిగేస్తు నింటిచావడియందుఁ దనరారు
శ్రీకరం బెవ్వాని చిత్రపటము
ప్రతిమనుజుండు జిహ్వాసీమ జపియించు
భావుకంబైన యెవ్వాని పేరు
ప్రతిభారతీయు ప్రబంధపేటికయందుఁ
బొలుపారు నెవ్వానిపుస్తకములు
ప్రతిపండితుని మనోభావపీఠికయందుఁ
దనరు నెవ్వానిసిద్ధాంతపఙ్క్తి

తే. గీ. మనలవిడనాడిచనె లోకమాన్యుఁ డతఁడు
దివ్య మాకార మొకటిసంధిల్ల నేఁడు
తన స్వరాజ్యాభిలాషమంతయును వదలి
బాలగంగాధరతిలకభవ్యయశుఁడు. 545

సీ. అనఘుఁడౌ తిలకమహారాజునకు నేఁడు
కన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు
ధీరాత్ముఁడైన మహారాష్ట్రమౌళికిఁ
గన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు

లోకమాన్యునకు మహాకీర్తిశాలికిఁ
గన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు
పరమచిట్పావన బ్రాహ్మణాన్వయునకుఁ
గన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు

తే. గీ. తిలకమూర్తికి మానవాతీతమైన
దేహ మే తెంచు పదియపదినముగానఁ
గరయుగము లౌదలందాల్చి కరుణ మొలుక
మ్రొక్కుఁ డొకమ్రొక్కు భారతీపుత్రులార! 546

— కాకినాడ శ్రీమోతేవారింట పెండ్లి —

శ్లో. శ్రీకృష్ణం వరమూర్ధన్యం దమయంతీం వధూమణిం
దత్వా సమాన మైశ్వర్యం పాతా మాదిమదంపతీ. 547

శ్లో. శ్రీమోతేవంశసంభూతం తాటికొండకులోద్భవాం
శ్రీకృష్ణం దమయంతీంచ పాయస్తాం దంపతీ శివౌ. 548

శ్లో. కృష్ణయార్యతనూజాతం రామచంద్రతనూభువం
దమయంతీంకృష్ణరాయౌ పాయాస్తాంకమలావరౌ. 549

శా. శ్రీకృష్ణా! వినుమోయి, భార్యను గృహశ్రీయంచు భావించి సు
శ్రీకంబై తగు సంతతిన్ గనుము వారిన్ వీరిఁ బోలెన్ వృధా
యాకంజాస్త్రుని బారికిందగిలి ద్రవ్యం బాఱడింబుచ్చ క
ర్థాకాంక్షన్ జరియించి కైకొనుము సారాచారసంపత్తులన్. 550

మ. దమయంతీ! వినుమమ్మ! దైవముగ భర్తన్ లోన భావించి ని
త్యము తద్వృద్ధికిఁగారణంబయిన సత్యశ్రీకి దూరంబుగా
క, మహత్త్వంబు గణింపుచున్ మదుల కైక్యంబున్ బ్రసాదింప దై
వములన్ గొల్చుచు మంచికీర్తులను సంపాదింపుమా ప్రోడవై. 551

శా. మంజుస్వాంతుఁ డుమామహేశ్వరుఁడు ప్రేమస్నిగ్ధుఁడశ్రాంతసా
మంజస్య మ్మనురాగసంపదయు క్షేమప్రాభవంబున్ గళా
రంజత్సంతతి లోనుఁగా గలుగుసామ్రాజ్యంబు గల్పించి నీ
తిం జెన్నారఁగఁజేసి ప్రోచు దమయంతీకృష్ణులన్ జిష్ణులన్. 552

శా. మోతేవంశపయఃపయోనిధికి సోముల్ వైశ్యచూడామణుల్
ఖ్యాతుల్ పెద్దజమీనుదారులు యశఃకాంతాదికీర్తుల్ గతా
రాతుల్ స్వీయకులీను లందఱును వారల్ మెచ్చఁగాఁజాలు స
త్ప్రీతిన్ దంపతు లుండుగాక సతతశ్రీమీఱి దైవారఁగన్. 553

—• శ్రీ చెలికాని లచ్చారావుగారు—చిత్రాడ •—

(హితవాది విమర్శనము)

మ. జనమాన్యుండును ధర్మశీలుఁడును భాషాపోషకుండున్ దయా
ఖనియు న్నీతిపథానువర్తియు యశఃకళ్యాణ కాముండు స
జ్జనుఁడున్ శ్రీచెలికానివంశజుఁడు లచ్చారాయనిం దూఱనే
ర్చనసీకున్ "హితవాది" నామ మెటు వర్తించున్ జగద్వంచకా! 554

క. ఎఱిఁగియును నీవువ్రాసిన
మొఱుఁగులచే నతనికీర్తి వోవునె? లోకం
బెరియదె? లచ్చారాయని
యుర వెఱుఁగనివార లెవ్వరో హితవాదీ? 555

క. హితవాది దేశసేవా
వ్రతునిన్ నిందించువ్రాఁతఁ బ్రకటించితివో
హితకారిణి! నీవు ఋతా
నృతములు యోజింపకునికి సిఁతికిఁ దెఱవే? 556

సీ. ద్రవ్యవ్యయ మొనర్చి తగువారి నియమించి
దేశదేశమ్ములు తిరుగఁబంచి
మూలమూలలఁ జిన్గిపోయెడు నాంధ్రమ
హాకవిరచితంబులైన యుత్త
మగ్రంథములను సమగ్రంబుగాఁగ వ్రా
యించికొన్నియును సొమ్మిచ్చి కొన్ని
యును బ్రోవుచేయించి యొకనిలయమ్మున
"బీరువా" లందు వేర్వేఱ నునిచి

తే. గీ. పదుగురును వచ్చి చదివికోఁ బదిలపఱచె
నాంధ్రపరిశోధకాభిదం బైనయొక్క
మండలిని బీఠ పురియం దొకండ కాఁడె!
లలితగుణములపోవు శ్రీలచ్చరావు. 557

తే. గీ. "దేశవర్ధని" యను పేర దేశమునకు
సౌఖ్య మొనఁగూర్చు నొక సమాజంబు నిలిపె
గానవిద్యావిశారదుఁడైన లచ్చ
రావె సంగీతసభలకుఁ దోవఁదీసె. 558

తే. గీ. గోరసమ్మున కాసించు గోరసాఖ్య
జనపదమ్మున నిలిపిన సంస్కృతాంధ్ర
పాఠశాలకుఁ బ్రతిభువై ప్రతిభమీఱ
రక్షణముచేసె మా లచ్చరాయఘనుఁడె. 559

శా. సల్లాపమ్మున కాకరమ్మయిన లచ్చారావు గోదావరీ
జిల్లాసంఘమునందు సభ్యుఁడయి వాసింగాంచె గోదావరీ
"జిల్లాబోర్డుకు మెంబరై" ప్రజలకున్ సేమంబు చేకూర్చె ని
య్యెల్లాండ్రిందఱకున్ ఘటించెఁ గడుహాయి న్నీతిపద్యావళిన్. 560

ఆ. వె. కాకినాఁడ "తాలుకాబోర్డునకు మెంబ"
రగుచుఁ గొన్నినాళ్ళు యశముఁగాంచె
నాపదంబునకె పిఠాపురమ్మునను నేఁ
డర్థియగుచుఁ దాఁ గృతార్థుఁడయ్యె. 561

సీ. ఆంధ్రరాష్ట్రము వేఱ యమరఁగావలెనంచుఁ
గోరువారలలోనొకొండనంగఁ
బరఁగి యందులకేరుపఱచిన యుపసంఘ
మందొక్కసభ్యుఁడై యశము గాంచె
"నాంధ్రసారస్వతం" బనుమహాసభయందు
సభ్యుఁడై మిగులఁబ్రశస్తికెక్కె

నఖిలభారతదేశ మండలి గ్రంథాల
యసభయందును సభ్యుఁడై రహించె

తే. గీ. నఖిలకవిమండలికి విజయనగరంబు
నందు జామీనుదారుఁడై యందెఁ గీర్తి
పీఠపురిపాఠశాలలోఁ బేరుగోరఁ
బడియెఁ బ్రాచీన విద్యార్థి పటలమందు. 562

సీ. నవనవంబులుగాఁగ నవలలు ప్రకటింపఁ
గడఁగు "రామవిలాస గ్రంథమాల"
ప్రాక్కవీశ్వరకృతగ్రంథముల్ ప్రకటించు
రసవ "ప్రబంధ సర్వస్వమాల"
నవలలు వచనముల్ నాటకంబులు ప్రబం
ధములు చర్చలు వివాదములు తీర్పు
లాదిగాఁ గల విషయంబులు ప్రకటించు
"భాషావిలాసినీ" పత్రికకును

తే. గీ. దానసంపాదకుండయి తగినమూల్య
మునకుఁ గాక యతిస్వల్పమూల్యమునకుఁ
జదువరుల కందఁజేయు పత్రిశస్తకీర్తి
దెచ్చికొనుచుండెఁ జెలికాని లచ్చరావు. 563

సీ. శ్రీరామచరితంబు స్త్రీనీతిపద్యర
త్నావళి యంతఃపురాంగనలకు
గోపనీయతఁ దెల్పు ఘోషాప్రబంధంబు
భీష్మచరిత్రంబు ప్రేమలతయు
మల్లెమొగ్గ, కురంగి, మహనీయులగు వర్త
మానాంధ్రకవుల సమ్యక్చరిత్ర
మొదలుగాఁ గలగ్రంథములు రచించినమేటి
రామవిలాస ముద్రానిలయము

తే. గీ. చిత్తరాడపురిన్ బ్రతిష్ఠించి యందుఁ
గవుల లోకోపకారకగ్రంథములను
నచ్చువేయించి యిచ్చు నిర్వ్యాజకృపుఁడు
హెచ్చుగా మెచ్చుఁదగఁడె శ్రీలచ్చరావు. 564

సీ. శ్రీరాజమానరాజారామయాంబికా
కల్పితపుస్తకాగారమునకు
గౌతమీమండల గ్రంథాలయసమాజ
గౌరవాధ్యక్షుఁడై కాకినాడ
మండల గ్రంథసమాజమ్మునకుఁ బీఠ
నగర గోసంరక్షణసమితికిని
బెజవాడలోన నిల్పిన యాంధ్రదేశ కేం
ద్రగ్రంథతతి కుపాధ్యక్షుఁ డగుచు

గీ. "కావ్యనిధి" యన్న బిరుదంబు గనినవాఁడు
తెలుఁగుదేశములోపలఁ గలుగు పెక్కు
పౌరజనములచే జానపదులచేత
మెచ్చు లొందఁడె : చెలికాని లచ్చరావు . 565

సీ. భావనారాయణస్వామిసన్నిధి భావ
నారాయణాఖ్యజనకునిపేరఁ
బుర మొండు గట్టించెఁ దిరిగి సంపాదించెఁ
దిరువతివేంకటేశ్వరులసేవ
కాశి శ్రీరంగంబు కాంచి మున్నైనపు
ణ్యక్షేత్రముల కేగి యందుఁ దత్త
దధినాధులకుఁ గాన్క లర్పించె భక్తితో
హితులతో నాశ్రితపరితతితోడ

గీ. కృతులు సేయించి బహుబహూకృతులొసర్చి
కృతులుగైకొని కావించెఁగృతులు కొన్ని

సుకృతి కార్యంబుల నతండు సుకృతిగాఁడె?
సచ్చరిత్రుఁడు చెలికానిలచ్చరావు. 566

తే. గీ. కడకువచ్చిన "మాంటేగు" గారితోడ
"నాంధ్రరాష్ట్రంబుకావలె" నంచు విన్న
పఁబు గావింపఁ బోయినప్రముఖు లందు
నొక్కరుఁడకాఁడె లచ్చరావక్కటకట! 567

తే. గీ. ఇంతయోగ్యత యింతధర్మైకబుద్ధి
యింతదేశాభ్యుదయచింత యింతసుగుణ
సంపదయు నింతకవిజనాసక్తి గల్గు
హెచ్చుమానిసి చెలికానిలచ్చరావు. 568

## —• దివాకరాస్తమయము •—

(రాజమండ్రిసభలోఁ జదివినవి)

సీ. గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గ
ర్ణాటసీతారామసాటిఁ జేసి
తోడికలార్థు లేధూర్వహుంతెల్వి కీ
ర్ష్యవహించి కలహంబు సలుపుచుండ్రు
ఎవఁ డెన్నఁడును బాఠ మెలమి విప్పకయె వ్యా
కరణపాండిత్య ప్రకర్షమూనె
నొరుఁడునచ్చని నాదుగరువమ్ము సడలింపఁ
జాలె నెవ్వనిమనీషాబలంబు

గీ. ఎవఁడు నాకెక్కుడయ్యునాయెకలఁగార
ణాంతరమ్మున గురుభావ మంతరంగ
మునసెకాక వెలికిఁగూడఁ గనఁగఁజేసె
నట్టి తిర్పతికవి దివి కరిగె నకట! 569

క. నాకన్న ధీబలమ్మున
నేకాదు తనూబలమున నెంతయు హెచ్చౌ

లోకస్తుత్యుఁడు తిర్పతి
నాకన్నన్ మున్నె యెట్లు నాకము ముట్టెన్. 570

మ. కలలోనైన "నతండు ముం" దనుచు "వెన్కన్నే" నబంచున్ మదిన్
దలఁపంబో మతఁ దేనుఁగూడ నెటు లీతార్మారు చేకూరెనో!
బలవంతుండె మహోన్నతంపుఁ బదవిన్ బ్రాఁకంగ నర్హుండు దు
ర్బలుఁడో కాఁ డటువంటివాఁడనుట సర్వత్రానుభూతంబకా. 571

ఉ. ఏఁబదిదాఁటె నా, కతని కేఁబదికింక్ నెలల్ గొఱంత నా
గ్లాబుధమాన్యుఁ డిందనుక నాఁగకసల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకటనుండియు నాతనిచేతియూఁతఁ బ్ర
జ్ఞాబహుళావధానపుఁ బ్రసంగము లీడ్చుచునుంటి నెట్టులో. 572

శా. త్వంకారోక్తులతోఁ బ్రసంగము సహాధ్యాయిత్వముం దెల్పు ని
శ్శంకన్ వ్రాసెడి లేఖలందలి నమస్కారాదిసంభావనా
లంకారంబులు నాయెడంగల యనల్పత్వత్కృతజ్ఞత్వపుం
బొంకమ్మున్ వెలిపుచ్చు వర్తిలిన నీబుద్ధిన్ నుతింతున్ సఖా! 573

ఉ. "ఏ నల నూజివీటి సభకేగితి నిన్ దిగఁద్రావి" యన్న కో
పాననకాదె? యొంటరిగఁ బాకరిపున్ గనఁబోయి తిప్పడో
ధీనిధి! తిర్పతీ! యచటిధీరులతోఁ గలహమ్ముగల్గిన
న్దేనియు నేను నీస్మృతికి నెక్కక పోనుజుమీ; సుమిత్రమా! 574

క. నను "దర్శనమిప్పింపుం"
దని వ్రాసినలేఖ నాకు నందకమును పే
చనినాఁడవు స్వర్గం, బే
మిని నాతోఁ జెప్పఁదలఁపమింగాదె? సఖా! 575

మ. కృతకృత్యుండవు నీవు, వేఱొకనితో నేమేనిఁజెప్పం బనే
మి? తుది న్ననొ్నొకసారి చూచుటకుఁ జెల్మిన్ జూమ్మి రమ్మంచు వ్రా
సితి, వోప్టుండని పల్లెయూట నదినేఁ జెల్లింపలేనైతిఁ ది
ర్పతివిద్వత్సుకవీ! క్షమింప నిదియర్హం బెమ్మెయిం బేర్మిమై. 576

ఉ. నీకొమరుండు సత్కవిత నేర్వఁగఁజాలినబుద్ధిశాలి, త
ద్ధీకుశలత్వమున్ సరిగదిద్ది త్వదాత్మకు మెచ్చొనర్తు నం
చాఁకను నాదురాశకయి నాకమునందుఁ బ్రతీక్షసల్పు మ
య్యా ! కవితిర్పతీ ! వ్యవధియౌటకు సైఁపఁగదయ్య యియ్యెడన్. 577

క. నీపెద్దకొమరుకతమున
నీ పిన్నకొమరులు మగుడ నేర్తురు విద్దెల్
నాపై భారంబియ్యది
నీ పెట్టక పెట్టినదియ నేర్పుకతమునన్. 578

మ. మృతులంగూరిచి యేడ్పుపద్యములు నే నేనాఁడుఁజెప్పన్ మహా
మతి ! యోతిర్పతి సత్కవీ ! త్రిజగతీమాన్యాత్మ ! విక్టోరియా
సతిలోనౌ మృతులెల్ల నీకతననే స్వర్గంబధిష్టించి రే
నతి పాపాత్ముఁడ, నాకు నీకతన లే వాలాటీసౌభాగ్యముల్. 579

తే. గీ. అల దివాకరునకుఁబోలె నస్తమయము
నుదయమునుగూడ నిజమున కుండఁబోవు
నీ యశఃకాయమున కని నే నెఱిఁగియుఁ
బామరతఁజేసి విలపింపవలసె సఖుఁడ ! 580

—• చిత్రాడ. శ్రీ చెలికాని లచ్చారావుగారు •—

ఉ. దిక్కులనెల్ల నాత్మగురుతేజము నించి దివాకరుండు తి
ర్యక్కుల కందరాని గగనాంతర సౌధపుఁజంద్రశాలపై
కెక్కెను లచ్చరాయ ! యిఁక నీతనిసంతతి కేమి దిక్కహో !
తెక్కలురాని పిల్లల భరింపఁగ నీవును నేను దిక్కగా
కక్కట ! యాతఁడిప్పటికి నాదరువై తగు నీపురమ్మునం
దొక్కటఁ గాఁపురంబిడిన నూరకయుండవు నీవు; వెల్మవా
రెక్కడఁ గూడ నింతటి యహీనతరంబు దృఢాభిమానమున్
బెక్కురపట్లఁజూపుటలు వింటినిఁ గంటినిగాని యాతఁడీ
చిక్కుదయించుసంచుఁ దనచేతమునందు నెఱుంగలేక నీ

చక్కికి రాక నీ ధనము సాపడుచుండియుఁ గాకినాడనే
మక్కువనుండెఁ గానియెడ మాదృశు లిక్కడి కిట్లు వచ్చి మీ
కిక్కరిణిన్ విధించుపని యెందుకు ? మీరె భరింతు, రొక్కచో
నక్కవిరాజు పోయెనని యాతనిభార్యయు బిడ్డలింకెదే
దిక్కన కేగ నెంచినను దీనికి సమ్మతిజూపఁబోరు, స
మ్యక్కృతికర్తయై సుకవిమాన్యుఁడునై యతఁడేగెఁ బుత్రుఁడో,
మిక్కిలిబుద్ధిశాలి, యిఁకమీఁదట వీనికిఁ దండ్రివంటి స
మ్యక్కవితావిశేష మది యబ్బెడు శంక యొకింతలేదు, స
మ్యక్కవియై నినున్ నను ముదంబుధి నోలలనార్చు నంతకున్
దిక్కగ నుండఁగా మనకుఁ దిర్పతి చెప్పకచెప్పె నింతయున్
నిక్కవ, మీకుటుంబమును నెక్కొని ప్రోవఁగఁజాలు మేనమా
మొక్కఁడు పెద్దజీతమునునున్న యఖండుఁడు గల్గెఁగాని యా
దిక్కరి యిట్లువ్రాసెఁ గను దీనిని, దీనఁగలట్టిభావమున్
జక్కఁగఁ గన్న నీకు నిఁక స్వాంతమురాదని నేఁడలంప, నే
ఫక్కినొ కొంతకాలము కృపన్ మన మీకవిసత్కుటుంబమున్
స్రుక్కఁగనీక ప్రోఁచునెడ సూరిజనస్తవనీయమైన పెం
పెక్కు, యశమ్మగల్గు, నదియేకద ! యేరికిశాశ్వతంబగున్
దక్కిన వారలంబలె నుదారత దాఁచితిమేనిఁ జేతికిన్
జిక్కిన సద్యశోరమ యిసీయని యెక్కడికో చనుంజుమీ !
టక్కరి యిట్టిపట్టునఁ గడంగక దాఁచెడినన్నమాట మీ
కెక్కుట కేను వేఱొకటి యియ్యెడఁ జూపఁగ నేల ? సర్వమా
ఫక్కి హృదంతరమ్మునకు వచ్చియయుండును, గీర్తివచ్చి "యే
దిక్కునులేదు నా" కనుచు దీనత నిన్ను వరించుచున్న దీ
చక్కనియెమ్మెలాఁడిని వెసంగొని పేర్మిసుఖింపుమయ్య ! నీ
కిక్కతనన్ జయం బెసఁగు, నింతయు నీవు నెఱుఁగు దైననే
నక్కవిరాజునందుఁగల యాదృతిచే నిటు చెప్పుచుంటి; నే
ముక్కలొ నేర్చిసందులకు మూర్ఖుల పేఁడుటకన్న విజ్ఞుఁడౌ

చక్కనినిన్నువంటి సరసప్రవరుం గవితామతల్లికిన్
బ్రక్కకుఁ జేర్చుటొప్పగుటఁ బద్యమునల్లితి నిన్నుఁగూర్చి; నీ
విక్కృతి కింతకున్ మునుపె యేర్పడియుండిన నుందుగాక, నే
నిక్కవితన్ రచించి ఫలమించుక పంచికొనంగఁ బోలదే?
నిక్కము మీకుమాకు మఱినేఁటిదిగాదు ఋణానుబంధ; మే
నెక్కడికేగ కూరకయ యింటవసించుట యీవెఱుంగు, దీ
చిక్కుదయించి నిన్నిపుడు చేయిడి కోరుచునున్నవాఁడ, నీ
యక్కఱఁదీర్చి మేల్ సిరియు నాయువుఁ గీర్తియుఁ గైకొనంగదే!
దిక్కుఁక నీవె వీరి కని దేవుఁడు వ్రాసెను మూఁడుపంక్తులన్
దక్కువకాద యిక్కతనఁ ద్వద్ఘనసంపద లచ్చరాణ్మణీ! 581

—• శ్రీ కాటూరివులపల్లి జమీందారుగారు •—

శా. శ్రీమంతు న్నినుఁ జూడవచ్చుటకు నర్థిత్వమ్మె మున్నెప్పుడో
నే మూలం బడవైచియుండియును దాని న్నేఁడు గైకొంటకున్
సామాన్యంపుఁ బ్రసక్తిగా దదియు నీసత్కీర్తికిన్ మూల ము
ద్దామపార్థివ! దామెరాన్వయజ! సీతారామనామాంకితా! 582

శా. నన్నుంగోరెడిశిష్యవర్గమునకున్ నాకున్నయల్లంతలో
నన్నమ్మున్ మఱి విద్యయున్ జరుగ మున్నార్జించికొన్నట్టి సం
పన్నత్వంబునఁ దృప్తిఁజెంది యొరులం బ్రార్థింపకే కాలకం
ధి న్నే నీఁదుచునుంటి హాయిమెయి లేనేలేదు లోటెయ్యేడన్. 583

చ. కలిగినదానఁ దృప్తిపడఁగల్గిన లోటగుపట్టి, దట్టు తా
నెలమి వహింపకుండునెడ నెందును లోటులె తోఁచుచుండు ని
చ్చలు, నిది నీయెఱింగిన ప్రసక్తియె, కావున విస్తరింప క
వ్వలి విషయంబు తెల్పెద నృపాలక! పేరిమి నాలకింపుమా. 584

ఉ. మాకడియంపు గ్రామమున మాన్యులు గొందఱు చిన్నిబాలురన్
గైకొని సంస్కృతాంధ్రములఁ గావ్యములం బఠియించుయోగ్యతా
శ్రీ కెసకొల్పనెంచి యొకచిన్నబడిన్ గతవత్సరంబునన్
దేఁకువ నిల్పి యొజ్జ నొకనిన్ బిలిపించిరి యుంచి రాదృతిన్. 585

చ. నెలకుఁ బదేనురూపికలనేకొని యంతన తృప్తిఁజెంది శి
ష్యుల కుపదేశమున్ సలుపుచుఁ బడి వృద్ధికిఁదెచ్చె నొజ్జ య
య్యలఘుని స్వల్పపున్ భృతికి నాకడియం బసమర్థమయ్యె ని
చ్చలు నదియున్ 'నమా' జను ప్రసక్తికి లోనయి నామెడం బడెన్.

శా. ఈకార్యంబున నాకు లేశమును లేనేలేదు జోక్యంబు, వి
ద్యాకార్యంబను కారణమ్మునఁ దదాస్థానాగ్రపీఠమ్మునన్
నాకుం జోటది తప్పదయ్యె, బడి నానాఁడే క్షయంబందు దు
ష్పాకంబుం గని మిన్నకుండుటది శోచ్యంబంచు నేఁబూనితిన్. 587

ఉ. పూని మనమ్మునం "దెవరి పోడిమి దీని భరింపఁజాలు" నం
చేను విచారణన్ సలుప నెందఱు దాతలొ తోఁచి రందు దూ
రానఁ గలట్టివారల భరం బిది పూన్పుటకన్న నీదు సం
స్థానము దగ్గ ఱౌటను బ్రసక్తముగాఁ గనుపట్టె భూవరా! 588

ఉ. దగ్గఱనున్న కారణ మెదం గని యాపయి నీకు విద్దెలోఁ
బగ్గెయుఁ బ్రీతియున్ గలుగు భాగ్యము తోడయివచ్చి నేఁడు స
మ్యగ్గతి నీదుదర్శన మమర్చెఁ బయింగల కార్యమన్ననో,
నెగ్గుత నెగ్గకుండుత మనీషికి దాన విచార మేటికిన్. 589

ఉ. పండితుఁడైన మానిసికిఁ బండితుఁడౌనృపుఁ జూడకుండుచే
యొండొకలోప మాదొసఁగు నూడ్చితి నీమది కిద్ది నచ్చుచోఁ
గొండొకప్రీతిఁ గొల్పుటయుఁ గోరిక నచ్చనిపట్ల మాయెడన్
నిండు మనంబు నుంచుటయు నే మిముఁ గోరెదఁ గోర నన్యమున్.

—• మురమండ — చెలికాని సూర్యారావుగారు •—

క. శ్రీ కలిగియు గుణవత్తా
ప్రాకట్యమ్మునను వంశపారంపర్య
స్వీకృతి నెగడంగల సు
శ్లోకా! చెలికానివంశ్య! సూర్యారాయా! 591

క. మీ తండ్రి తరమునుండియుఁ
బ్రీతిమెయిన్ మమ్ముఁ జూచి పెద్దగ గురుతా
స్ఫీతిని బహూకరించుట
చేత మిమున్ జూచుహక్కు చెలఁగున్నాకున్. 592

చ. ఇపు డొకచోటి కెక్కడికి నేగుటమాని గృహమ్మునందె యుం
టపొసఁగె దీని నెట్లొ విని నాయెడ మీచెలికాని లచ్చరా
ణ్ణృపమణి పూర్వపున్ గరిమ హెచ్చఁగ సోదరి రామయాంబచే
నిపుణుఁడు పెద్దవార్షిక మనిందితుఁ డేర్పడఁజేసె నాకొగిన్. 593

క. ఈకారణమున మఱి నా
నాకారణములను నాకు నా సంస్కృతికిన్
శ్రీ కొదవలేదు తృప్తిం
గై కొనవలె నున్నదానఁ గవివరు లెలమిన్. 594

మ. అటుగాకున్నఁ జతుస్సముద్రములమధ్యంబెల్లఁ బాలించినన్
ఘటియింపంబడదయ్యె తృప్తి యిటు వక్కాణింతు పెద్దల్ సుదు
ర్ఘట మీమార్గము పోతనాదికవిరాట్కంఠీరవుల్ పట్టి రి
ప్పటి కవ్వారికృపన్ దదీయమగుత్రోవ న్నిల్చితిన్ భూవరా! 595

మ. అగుచో నెవ్వరిఁగాని చూచుపని లేదన్నన్, యథార్థంబయా
మగుడన్ యాచకతాప్రసక్తిఁగొను సంబంధమ్ము వాకుత్తు శ్రీ
ద్ధగ నాలింపుము మాదుగ్రామమున విద్యావృద్ధికై కొందఱొ
ప్పుగ నొజ్జన్ బిలిపించి యుంచి లెలమిన్ బోషించు నేర్పాటుతో. 596

చ. తెలుఁగును సంస్కృతమ్మును సుధీవరుఁ డాయన బోధసేయఁ గు
ఱ్ఱలు పఠియింపుచుండిరి, సరాసరి జీతముమాత్ర మొజ్జకే
నెలకును ముట్టదయ్యె నది నేఁ గనిపెట్టితి మిమ్మువంటి దా
తలకతనన్ ఋణంపడినద్రవ్యముఁ దెచ్చితి నిచ్చితి న్నృపా! 597

సీ. వావిళ్ళతఁడు ప్రతివత్సరమ్మును నఱు
వదిరూపికల నిడ వ్రాసియిచ్చె

నన్నవరంపుఁ గళ్యాణమ్ములోన నేఁ
బది యినుగంటి నృపాలుఁ డిడియెఁ
గాటరావులపల్లెఁ గల జమీందారుఁ డి
ర్వదియైదు రూపికల్ వార్షికమిడె
మిముఁ జూడ నామది మిక్కిలిఁ బ్రేమించెఁ
దక్కినదానికై, దాన మెపుడు
తే. గీ. దాతృవశమగుఁగావునఁ దమకుఁ దోఁచి
నంత వార్షిక మొసఁగుదురని దృఢముగ
నాకుఁ దోఁచెను దీని కెన్నాళ్ళనుండి
యో ప్రయత్నించి వచ్చితి నోనృపాల! 598

క. ఏటి కొకనూటయేనుబది
పాటియె రూపికల నాయుపాధ్యాయునకున్
బాటించి యొసఁగవలెఁ గల
లోటెంతయొ మీమనమ్ములోఁ గనుఁ డింకన్. 599

—• మురుమండ. శ్రీ శ్రీ వేంకటగిరి యువరాజుగారు •—

క. శ్రీర్వసుధాఽపి చ విద్యా
ధూర్వహతాసంతతిశ్చ దోశ్శక్తి స్స
త్పూర్వాచారపరత్వం
సర్వజ్ఞకుమార! తేఽస్తు శత మాయుష్యమ్. 600

సీ. మీతాతగారిసమీపమ్మునం దవ
ధానమ్ము సల్పి సమ్మానమంది
నట్టికవీంద్రుఁడ నయ్య! శ్రీతిర్పతి
వేంకటేశ్వరకవిద్వితయ మందు
వేంకటేశ్వరుఁడను విప్రుఁడ, మీ మేన
మామ సూర్యారాయమనుజపతికి
మిత్రుఁడ, మీమామ మేటి శ్రీ నూజివీ
డ్డారయప్పారాయనరవరేణ్యు

తే. గీ. నకుఁ బిత్రుసఖుండ, గురుఁడ, వృద్ధకవి నగుట
నీదురాజధానికి వచ్చి నిన్ను గాంచు
భాగ్యమును నోఁచకుండియు, భాగ్యవశత
నిచటఁ గన్నాఁడ, శ్రీయాచనృపవరేణ్య! 601

మ. ఇనుగంట్యన్వయుఁడౌ ప్రకాశనృపుతో నేతెంచి చామర్లకో
టను రైల్‌స్టేషనునొద్ద జేసితి గరిష్ఠంబైన నీదర్శనం
బును, సంతుష్టుఁడ నైతి, నేఁటికి నిటన్ భూయోభవద్దర్శనం
బున నానందము చెందితిన్, నరపతీ! పుణ్యాకృతీ! సత్కృతీ! 602

మ. కవు లెప్డున్ నరనాథులున్నకడకున్ గాంచంగ నేతెంచుటల్
భువి విందున్, నరపాలకుల్ కవికులమ్ముల్ వొల్చుదేశమ్ము తా
మవలోకింపఁగ వచ్చుటల్ తఱచుగా నాలింప, నీభాగ్యమో
యవనీశా! యనుభూతమయ్యె నిపు డం చానందమున్ జెందెదన్. 603

క. చెలికాని సూర్యరాయని
చెలిమికతన నాకు నిన్ విశేషగుణశ్రీ
కలితుని గనుఁగొను టబ్బెను
గలిగించున్ సూర్యుచెల్మి ఘనమణికలనన్. 604

శా. సత్రాజిత్తను ఱేఁడు మున్ను తప మాశ్చర్యమ్ముగాఁ జేసి తా
మిత్రుంగాఁ గొనె సూర్యు, నాచెలిమిచే మేలైనసద్రత్నముం
బాత్రుండై గ్రహియించె నే నటులె భూపాలైకరత్నమ్ము ను
ద్గోత్రిమ్ముం గనుభాగ్య మందితిని, గోర్కుల్ నిండె యాచప్రభూ!

క. నీరాకకతన మాసూ
ర్యారాయని తపము పండె, నతఁడిన్నాళ్ళున్
ధీరులు మెచ్చఁగఁ దపముం
బ్రారంభముచేసె దాని ఫల మీవె నృపా! 606

క. తనతోపాటుగ నితరుల
ననయము తరియింపఁజేయు టది సత్కులజా

తునిగుణమగుఁగా మనసూ
ర్యునియం దీగుణము నేఁడు రూఢంబయ్యెన్. 607

మ. ధనముం గోరను, గోర ధాన్యమును, విద్వద్వంశసంజాత ! నీ
మనముం గోరెద నెన్నఁడేని యిటులే మాకిమ్ము నీదర్శనం
బని యాచించెద నోయి యాచనృపతీ ! యామీద నీచిత్తమే
మనెదో, వృద్ధకవీంద్రువాక్యములపై నత్యాదృతిన్ జూపవే ! 608

ఉ. ప్రాజ్ఞులు పూర్వభూపతులు పల్వురు వొల్చిరిగాని వాప స
ర్వజ్ఞులు విద్వదంకనవిరాజితినాముబు నొట లేదు, స
ర్వజ్ఞకుమార ! కృష్ణనరపాలక ! యీద్వయ మం దొకండు స
ర్వజ్ఞుఁడు తాల్చె రెండవది వానికి నుండియు నప్రసిద్ధమే. 609

మ. కలముం బట్టితిఁ గొన్నినాళ్ళు కవితాకన్యానుకూలుండనై
హలముం బట్టితి నేఁడు జీవికకునై, యాపన్నధర్మమ్ముగా
విలిఖించెన్ మను విప్రునిఁ ద్విజుల కోపృథ్వీశ ! యట్లౌటచే
ఖలమున్ మెట్టితి దాన నిల్లు గదలంగా వీలు లే దెమ్మెయిన్. 610

క. మును ముక్కుతిమ్మనకు స
జ్జనసుతుఁ డౌ కృష్ణరాయజనపతికిఁ గ
ల్గిన పేర్మి వంటిపేర్మియె.
మనకుం గలదని యెఱుంగుమా ! యాచనృపా ! 611

క. నాముక్కున్ మొగముం గన
నీముక్కున్ మొగముఁ గనిన నిపుణమతులకున్
నామాటలు నిక్కమ్ములు
గా మానసవీధి కెక్కుఁగనుము నృపాలా ! 612

మ. తలిదంద్రుల్ సుఖవంతు లన్వయము విన్వద్భూమి యర్ధాంగి ని
స్తులసద్వంశజయౌటెకాక మిగులన్ శోభాయమానప్రభా
విలసత్సద్గుణజాల, రాజ్యము మహావిస్తీర్ణ, మింకేదియున్
గలదే ! కామ్యము, పుత్రునిం గనుము లోకఖ్యాతచారిత్రునిన్. 613

శా. సంతానమ్ములరారుతన్, దఱచు సత్సంగమ్ము చేకూరుతన్
శాంతిస్ఫూర్తియు దాంతియున్గల మహాస్సంపత్తి వర్ధిల్లుతన్
జింతాశూన్యత యొప్పుతన్, సతతమున్ శ్రేయమ్ము దైవారుతన్
సంతోషమ్ములు నీకు లభ్యమగుతన్, సామ్రాజ్యలక్ష్మీపతీ! 614

మ. ఇనుగంట్యన్వయుఁడౌ ప్రకాశనృపుచే నేర్పాటుగా నీగుణ
ప్రణుతి న్నే విననాఁడ, నిక్కము భవద్భవ్యావతారమ్ము స
జ్జనసంరక్షణ కంచు నావినికిచే స్పష్టీకృతంబయ్యె నీ
కనిశమ్మీ భగవంతుఁడే యొసఁగుఁగా కాయుర్యశస్సంపదల్. 615

శా. "యాచింపన్ పలెఁ దప్ప"దంచు భవదీయాభిఖ్య బోధించు, "నీ!
నీచత్వ మ్మది" యంచు నిందులకునై వే సమ్మతిన్ జూప, నో
యాచేంద్రావనిపాల! నీ చనవునే యాచించెదన్, దానినే
ప్రాచుర్యమ్ముగ నాకొసంగు మదియే బంగారపుంగొండయౌ. 616

—• చల్లపల్లి, శ్రీమంతు రాజా అంకినీడు ప్రసాద బహదరు బి. యే.
దొరవారి పట్టాభిషేకము •—

సీ. శ్రితరక్షకత్వంబు శ్రీనాథునేకాక
సీతంద్రిఁగని నీవు నేర్వవచ్చు
నర్థివాత్సల్య మయ్యబ్జాతనేకాక
నీతల్లిఁగని నీవు నేర్వవచ్చుఁ
బురపాలకత్వమ్ము పురుహూతునేకాక
నీతాతఁగని నీవు నేర్వవచ్చు
భక్తిప్రపత్తి నాప్రహ్లాదునేకాక
నీవారిఁగని నీవు నేర్వవచ్చు

తే. గీ. సహజముగ నీకు రాజ్యశాసకులకుండు
లక్షణసమృద్ధికలదు ప్రత్యక్షమయ్యెఁ
రాజ్యలక్ష్మియు నేఁ డనురక్తయగుచుఁ
గైకొని సుఖింపు మంకినీడ్జ్యాకళత్ర! 617

శా. ఆయుష్కాముఁడవై యశస్కరుఁడవై యైశ్వర్యపుంజంబవై
శ్రేయస్థానమవై యపత్యఖనివై శ్రీ పెన్నిధానంబవై
న్యాయాన్యాయవిచక్షణుండవయి రాజ్యం బేలుకోవయ్య ! స
ద్గేయంబౌగతి నంకినీడ్నరపతీ ! దేదీప్యమానాకృతీ ! 618

ఉ. చల్లదనంపుటెల్లయని చాలఁ బ్రసిద్ధివహించినట్టి దీ
యెల్లకు నీదుచల్లపలి యీపురి నీ పరిపాలనంబుచేఁ
జల్లఁదనంబునన్ ద్విగుణసంపదనొంది రహించుఁగాక నీ
యుల్లముదానఁ బల్లవిత యుక్తిఁదలిర్చి యొనర్చుఁగావుతన్ ! 619

మ. "సిరియున్ వాణియు నొక్కచోఁ గలియుటల్ చేకూర" దన్మాట ని
న్నరయన్ దప్పనితోఁచు, హూణకలయందా, పెద్దవిద్వత్తకున్
గుఱుతై, తాంధ్రమునందు సంస్కృతమునన్ గూలంకషప్రజ్ఞకున్
గురియై, తిట్టియదృష్టమున్ సులభమొకో ! అంకినీఁడ్భూపతీ ! 620

మ. ఎలమిన్ గొండిక నాఁడె నీవయితి బీ. యే. పట్టభద్రుండ, వ
వ్వల గీర్వాణవచఃప్రపంచకలనాపట్టాభిషేకమ్మ నీ
కొలసెన్, దెల్గున కాంధ్రనాయకుఁడె నీకున్నాఁడు, రాజ్యమ్మ తా
తలనాఁడే తలనుండు దేనికి ముహూర్తం బిప్పుడో భూపతీ ! 621

క. శ్రీమత్తయు ధీమత్తయు
గోమత్తయు గలుగు రాజకుంజరుఁడవు నీ
ప్రేమానుబంధ మబ్బిన
గ్రామంబుల ప్రజలసుఖ మగణ్యము భూపా ! 622

శా. లోకారాధనమే ప్రభుత్వమని సుశ్లోకుల్ మునీంద్రుల్ మహా
ధీకుల్ వల్కుట నీవెఱుంగుదువు రాష్ట్రేజంబు వర్ధిల్లుటల్
లోకారాధనచేతనే మహితశీలుండైన శ్రీరాముఁడే
యీకార్యమ్మన సాక్షియై యలరుఁజుమ్మీ యంకినీఁడ్భూపతీ ! 623

శా. నీకున్ విద్దియ నీకు సద్యశము మన్నీఁడా ! మఱినీకు సు
శ్రీకళ్యాణసమృద్ధి నీకు విలసచ్ఛీలమ్మ నీ కాత్మజ

పాఱికట్యమ్మను నీకు రాజ్యకలనాప్రస్ఫీతియున్ సర్వమున్
జేకూరెన్ మునుపే యిఁకేమి కవియాశీస్సుల్ ప్రసాదించెడిన్ ! 624

తే. గీ. శ్రీమదుద్దండభారతీస్వామి నడుప
దేశమున నీదు పెదతాత దేవిఁగొలిచి
దేవతాద్విజభక్తిపరిర్ధిష్ణుఁడయ్యె
నెనఘు నాతేని మఱవంగఁజనదు భూప ! 625

శా. ఏ కుక్షింభరులో యధేష్టముగ నేకృత్యమ్మనో పట్టి ధ
ర్మైకాలంబనమైన యాచరణమం దన్యార్థమూహించి త
ద్వైకల్యమ్మనకున్ గడంగినను నీ తాత్పర్య మావంకకున్
బోకుండన్ సుఖియించుఁగాక మతశంభూ ! అంకినీఁడ్భూవరా ! 626

తే. గీ. కలవు నీ పాలిటికి రెండు కల్పతరువు
లందుఁ ద్రిపురసుందరియొక టవనినాథ !
రెండు శ్రీసోమనాథుండు పండితుండు
మేలు, నీభాగ్యమున కింక మేరగలదె ! 627

మ. పలుచోట్లన్ వినుచుంటినయ్య, నృపతీ ! పట్టాభిషేకం బటం
చెలమిన్ లక్ష్యముగాఁగఁజూచినదిలే దే నెందు నేఁడబ్బెని
స్తులమై శాస్త్రవిధిప్రచోదితమునై నొంపారు నీయుత్సవం
బలరన్ గాంచుట, లోటుతీఱె, విజయంబౌఁగాక నీ కెల్లెడన్. 628

—• చిత్రాడ, శ్రీ చెలికాని లచ్చారావుగారి నిర్యాణము •—

ఉ. కాకముగాఁ జిరాయువునఁ గాఱిలుటకన్నను బూఁటయేనిఁ దాఁ
గోకిలమై మనంగనుట కోవిదమాన్య మటన్న ఫక్కి నీ
కే కద దక్కె, నీకునయి యేడ్వఁగనేటికిఁ ? గీర్తికాయ మీ
లోకమునందు డించితివి లోకహితమ్ముగ లచ్చరాణ్మణీ ! 629

చ. తిరుపతిశాస్త్రి కెంతయు విధేయుఁడ వీ వతఁ డేగె నప్పురం
దరుసపురమ్ము; నాతనిఁ గనన్ మనమందలి కోర్కి నీకు దు

ర్భరమయి యేగియుందు, వదిభావ్యమ యయ్యెడుఁగాని, నీదు సో
దరనిఁ దలంపవైతి. గుణధన్యను, మాన్యను, రామయాంబికన్. 630

మ. అరరే! యెంతటి మందగ తిమ్మది విధాతా! బ్రహ్మవిద్వేషవి
స్ఫురణం బించుక లేనివాఁడనియొ! విస్ఫూర్జ న్మహాసత్కవీ
శ్వరనిర్వ్యాజమహోపకారి యనియో! స్వల్పాయుషున్ జేసి భా
స్వరు శ్రీమచ్చెలికానివంశజుని లచ్చారాయనిన్ మ్రింగితే! 631

మ. తన యావత్స్వము వేత్తయై సతము విద్వద్రక్షణార్థమ్ముగా
వినియోగించినమేటి, కావ్యనిధి, నిర్విణ్ణాంధ్రభాషాంగనా
పునరుద్ధారణబద్ధకంకణుఁడు, సత్పూజ్యుండు, శ్రీలచ్చరా
ట్జనపాలుండని నీవెఱింగియును గట్టా! యిట్లు గావింతువే? 632

ఉ. ముప్పదియెన్మి దేడులకె ముప్పిటుమూఁడునె, కాకయేమి! యీ
తప్పుడు కాలమందు గుణధన్యులు మాన్యులు నిన్ను వంటి వా
రెప్పగిదిన్ మనంగలరు? హేయపుఁగృత్యము లాచరించుచోఁ
దప్పక నీకునుం గలుగదా? చిరమాయువు లచ్చరాణ్మణీ! 633

సీ. నీ సేకరించిన నిఖిలనిర్ముద్రణాం
                ధ్రగ్రంథముల కింక దారియేది?
నీవు రచింపఁ బూనిన యాధునిక కవీ
                శ్వరచరిత్రకు నింకఁ బారమేది?
విన్నాశ్రయించి మనియెడి విద్వత్కవీ
                శ్వరకోటి కింక నాస్థానమేది?
నీపూన్కికతన వన్నెకునెక్కి నెగడు స
                త్పత్రిక కింక నాధారమేది?

తే. గీ. పొరఁబడితి, నెల్లభరమ్ము పూనఁగలఁడు
సోదరుఁడు ధర్మరావు సత్సూరిహితుఁడు
నిన్నుఁగాంచుభాగ్యమె, మాకు సున్నయయ్యె
తీఱ దాలోటు లచ్చరా ట్ద్వివరేణ్య! 634

క. మాతను సోదరముఖ్యుల
నీతీరున డించి యేగితే? మిత్రిమ! నీ
చేఁ "తెవరికివారే యము
నాతీరే" యన్నమాట నాకున్ దెలిపెన్. 635

ఉ. పోయిన నింక నీకుఁ దలఁపోసిన లాభములేదు, నీదుస్వ
ల్పాయువు పెద్దపెద్దలకు నన్నివిధమ్ముల నొజ్జయయ్యె, నీ
శ్రీయును ధన్యయయ్యె, నినుఁజెప్పి మఱొక్కనిఁ జెప్పరాదు, శ్వ
శ్శ్రేయసమబ్బుఁగాక యిఁకఁ జిన్మయమూర్తికి నీమకీర్తికిన్. 636

—• లక్ష్మీనర్సాపురము, శ్రీరావు రామాయమ్మగారు •—

శా. లచ్చారాయఁడు కీర్తికాముఁ డదియే లక్ష్యమ్ముగా నెంచి వి
ద్వచ్చంద్రుల్ దను మెచ్చఁ దన్మయలసత్కార్యంబు నార్జించి భా
స్వచ్ఛారిత్రుఁడు దాని యండఁగొని తత్సంపాదనవ్యాప్తికి
న్నిచ్చల్ కారణమైన నిన్నయిన మన్నింపండు రామాంబరో! 637

శా. తల్లీ! రామమదేవి! కీర్తివనితాతాత్పర్యపర్యాప్తవై
తల్లీలాకలనమ్మునం దగులు సోదర్యుల్ పరిసూభక్తి వి
ద్వల్లోకమ్మునయందు రక్తి, యెదియుం బాటింపమిన్ లోకమం
దెల్లన్ జూచుచునున్నదే,యిచటఁ గ్రొత్తేమున్న దోయమ్మరో! 638

శా. అమ్మా! యాతఁడు నిన్ను మమ్ములను దేహంబున్ మఱిన్ గేహ మ
ర్థమ్మర్ధాంగినిగూడఁ గీర్తివనితాతాత్పర్యపర్యాప్తమో
హమ్మున్ జేసి తృణీకరించె, మనకేలా? వానికిన్ లేని ప్రే
మ మ్మవ్వానియెడన్ విరక్తి గొనుమమ్మా యింక రామాంబికా! 639

శా. లచ్చారాయనివంటి సోదరుఁడు వేలచ్చల్ మఱిం గోటులున్
వెచ్చంబెట్టిన నీకుఁ జేకుఱఁడు తద్విఖ్యాతికాయంబుపై
హెచ్చౌపేర్మిని జూపి నీ వతని పేరీలోకమం దెల్లెడన్
నిచ్చల్ నిల్పితె నీమనమ్మునకు శాంతింగూర్చు నోయమ్మరో! 640

సీ. అతఁడు నిల్పినయట్టి యాంధ్రసద్గ్రంథాల
యమ్ముపైఁ బ్రేమమ్ముసానుమమ్మ
అతఁడు నడుపుచున్న యాంధ్రభాషావిలా
సినిఁ బత్రికఁ బరామృశింపుమమ్మ
అతని కాయాయి కార్యములఁ దోడ్పడెడి స
న్నిధివర్తులను గమనింపుమమ్మ
అతనిగౌరవమున కాటపట్టులగు వి
ద్వత్కవీంద్రుల పేర్మిఁ దలఁపుమమ్మ
తే. గీ. ఇదియె నీ కన్నయెడఁ గల హెచ్చు పేర్మి
కరసి నీ చేయఁదగిన కార్యక్రమమ్ము
ఇది యతనిమాత్రమేకాక యిహపరముల
నిన్ను నెగడించుతోవ మన్నింపుమమ్మ. 641

మ. ఇతరస్త్రీలనుబోలె విద్యయనఁగా నేలాటిదో సుంతయున్
మతిఁ జర్చింపనిదాన వైనయెడలన్ మాటోట్లు చెప్పన్వలెన్,
సతమున్ విద్యయె నీవు నీ వదియునై సద్గోష్ఠితోఁ గాలమున్
గృతకృత్యం బొనరించు నీకు నొకరుం డేమంచుఁ జెప్పన్వలెన్. 642

శా. నచ్చంజెప్పెద నొక్కమాట వినుమీ నాతల్లి రామాంబరో!
లచ్చారాయఁడు తేఁడు గాఁడుగద, వేలచ్చల్ ధనాదాయముల్
నిచ్చల్ గల్గిన రాజచంద్రులకునేనిన్ రాని సత్కీర్తితో
నెచ్చో వెల్గెడి గారణం బరయ నీకే తెల్లమౌ సర్వమున్. 643

ఉ. తాన సుకీర్తికిన్ గొఱయఁగాని ధనంబులుగాని రాజ్యముల్
గాని కవిత్వసంపదలుకాని మతేవియుఁగాని సార్థకం
బై నెగడంగనేర విడి యజ్ఞు లెఱుంగరు తల్లి! పాజ్ఞులౌ
ప్రాణులెఱింగి వర్తిలి యిహంబుఁ బరంబును జూఱగొండ్రొగిన్. 644

శా. నాకై జెప్పెడిమాట గాదిది యెటో నాకబ్బె సంతృప్తి యె
ట్లో కాలమ్మును నిల్లు వీడకయె "ధన్యుం" డంచు నిచ్చల్ ప్రజల్

వాకో నెట్టుచునుంటి; లచ్చవిభుదీవ్యత్కీర్తితో నీదు సు
శ్లోకంబు న్నెగడింపఁ జెప్పు నుడు లాలోకింపు మోయమ్మరో! 645

శా. భాషారాజ్యమునన్ బ్రభుత్వమును సంపాదించి నీయన్న స
ద్భోషారత్నమవైన నీదయిన చేయూఁతన్ దిశాచక్రము
ద్ఘోషింపన్ దగినంతకీర్తిఁగొని వీకున్ గల్గు ప్రేమమ్ము మా
ర్వేషంబూని కనన్ దలంచెడిని గీర్తి న్నిల్పికొ మ్మమ్మరో! 646

—• లక్ష్మీనర్సాపురం, శ్రీరావు రామాయమ్మ జమీందారిణిగారు •—

శా. మీపై సత్కృతి నిచ్చి మీవలనఁ బేర్మిన్ బోలెఁడాసించి మీ
ప్రాపు న్మాత్రమ కోరియున్నకవి నారాధింతువో! లేక 'పో
పో పో' మ్మందువొ! తెల్పుమమ్మ యెపుడుం బూజ్యావమానక్రియల్
మీపూర్వుల్ పొనరింపఁబో రరయు మోర్మిన్బూని రామాంబరో! 647

శా. సోదర్యుఁడగు సూర్యరాయని నుడుల్ శోధింపు మత్యంత మ
ర్యాదాపాదియు నన్నయున్ మఱియు ధర్మారావు తద్వాక్కు లా
మోదింపన్ బ్రయతింపు మిట్టియెడలన్ మోమోటముల్ దుర్యశః
ప్రాదుర్భూతికి హేతువుల్, యశము సంపాదింపు రామాంబరో! 648

శా. "లచ్చారాయనితోడనే చనె నమూల్యంబైన రామాంబికా
త్యుచ్చైస్సద్యశ" మంచు సత్కవులచే నూరూర నోరార వా
క్రుచ్చంజేయకుమమ్మ! నా నొడువువాక్కుల్ త్వద్యశః కన్యకన్
విచ్చల్ వర్ధిలఁజేయునట్టి వగు నేనిన్ విన్మ రామాంబరో! 649

చ. గురువఁట లచ్చరాయనికిఁ గోవిదుఁడౌనఁట శాంతుఁడంట, పు
ష్కరము సుమారు కాదగినకాలమునుండి భవిష్యదాశచేఁ
గరమనురక్తిమై నిలిచి కష్టసుఖమ్ముల కోర్చి కొల్చి యి
ప్పురక మతొక్కచోఁ జనుట కొప్పుదురమ్మ! భవాదృశప్రభుల్. 650

చ. వ్యయములు మీరొనర్చునవి పారములేనివి యందు నిట్టి స
ద్వ్యయములు నూట నాఁట నొకటైనను నుండుట దుర్ఘటంబు ని

శ్చయమిది యియ్యేడన్ మనవిసల్పనిదోసము మాదికాని సుం
తయు నిట నుండఁబోదుసుమి దాతలదోషము రామయాంబికా! 651

శా. మీ చేయూఁతనె లచ్చరాయఁడు మహామేరుప్రకాశాఢ్యులన్
వాచాధుర్యుల నిల్పి కీర్తిఁగొనెఁ దత్ప్రఖ్యాతి సర్వమ్ము మీ
కే చెందెఁగా ధ్రువ మీమహాయశము మీరిప్పట్లఁ గాపాడుకో
నాచంద్రార్కము నిల్చు, లేనియెడ నన్యాయత్తమౌ నమ్మరో! 652

ఉ. మిక్కిలి మీయెడన్ నిలుచు మీధనమున్ దినుచుంటఁజేసి నా
మక్కువ, యక్కతమ్మునన మాటికి "నా కిదియేల" నాక నే
నొక్కవచించుచుంటిఁ బదినూఱులు సాలుకు ఖర్చువెట్టుటల్
లెక్కయె? మీకు, లక్షలను లెక్కడ రొక్కకపట్ల నంబరో! 653

ఉ. కావున మీ యుదారతకు ఖర్చిది లక్ష్యముగాదుగాని స
ద్భావులు సన్నిధానమున వర్తిల, రొక్కటనుండియున్ వృథా
గా విభు మానసాంబుజము కందఁగఁ జేసెడివాక్కు లెంతయున్
సేవకధర్మదూర మని చెప్ప రెఱుంగుము సత్య మంబరో! 654

క. భూవిభు లగాధహృదయులు
గావున 'నూతు' లన నొప్పు ఘటకగుణ శ్రీ
జీవన మిడవలె విను తద
భావంబున జీవనంబు బహుదుర్ఘటమౌ. 655

క. కావున నింత వచించితి
భావమ్మున దీని నెఱిఁగి పండితకవిసం
భావితమౌ సద్యశమున్
జీవింపగఁజేసి వృద్ధిచెందుము తల్లీ! 656

మ. కవి నారాయణశాస్త్రి నీ దయకునై గన్పెట్టుకున్నాఁడు ల
క్షవరా లిచ్చియు నిట్టివానిఁ గొనుటల్ శక్యంబె? పుట్టింటి స
త్కవి యోగ్యుండు కృతజ్ఞుఁ డమ్మరో! భవత్సామ్రాజ్యపున్ లబ్ధి నె
న్నవ వంతో తిన నీతఁ డర్హుఁడుసుమా! యాలింపు రామాంబరో! 657

శా. "మా రామాంబిక రాజ్ఞి గావలయు, మా మా రిక్తతల్ సర్వమున్
దూరంబై కడు భాగ్యపుం గరిమతోఁ దూఁగన్వలెన్ మే" యటం
చారూఢిం గనువారిలో నితఁ డొకం, డాత్మన్ విచారించి యీ
క్షీరాగ్రేసరు కోర్కెఁ దీర్పుటకు నుద్దేశింపు రామాంబరో! 658

మ. చిరకాలాశ్రితుఁ డుత్తమాన్వయుఁడు మీ సేమంబునే కోరు ధీ
వరుఁ డిట్టిం డొకరుండు దిన్నయెడ మీభాగ్యానకు న్మేల్మి బం
గరుకుం దావియపోలె సార్థకతయుం గల్గున్ బరంబందు న
క్షరమౌఁ బుణ్యము నక్షరాస్యజనరక్షన్ జేసి రామాంబరో! 659

—• ఏలూరు, శ్రీ మోతే నారాయణరావుగారు •—

శా. శ్రీనిండారెడి వైశ్యవంశమున వర్ధిష్ణుండుగాఁ బుట్టి సం
తానైశ్వర్యము లోనుగాఁ గలుగు నైశ్వర్యమ్ములం బేర్చి వి
ద్యానందమ్మునఁ దక్కఁ వేఱొకయెడన్ వ్యాలోలతల్లేని మో
తే నారాయణరాయనిన్ సుఖితుఁగా దేవుండు దీవించుతన్. 660

—• హైదరాబాదు, శ్రీ ఆత్మకూరు రాజాగారి కుమారుఁడు •—

ఉ. వినయవివేకసంపదల వెన్కటి రాజులకన్న మిన్నవై
తనరెడి నీయెడ నా మనము తద్దయుఁ దృప్తివహించె నాత్మకూ
ర్జనవరనందనా! వినుము సత్యముగా వచియింతు నీదు కో
ర్కెను నెఱవేర్తు నీపురి కొగిం జనుదెంతు ధ్రువమ్ము నమ్ముమీ! 661

—• మురుమండ, శ్రీ చెలికాని సూర్యారావుగారు •—

ఉ. శ్రీయుతమై మహావిబుధసేవితమై సరిదంతికస్థమై
పాయని భోగభాగ్యములపట్టయి చుట్టునెసంగు తోటలన్
గోయని కూయు కోయెలలగుంపులు లోనగు పక్షిబృందమున్
హాయినొసంగఁ బొల్చెడి ననాదిగ శ్రీమురుమండ భూస్థలిన్. 662

తే. గీ. గౌతమికి దానిశాఖయై గ్రాలు తుల్య
భాగకును మధ్య నున్న యప్పురము పావ

నంబగు ప్రదేశమున మునినాథులెల్ల
మండలిగఁ గూడి యచట ధర్మములు తఱచు. 663

చ. వెనుకటికాలమందున వివేచనసేయుటఁజేసి యాస్థలం
బును "మునిమండలం" బనుచు మున్నని రంతటఁ గొన్ని నాళ్ళకుం
బనుపడె దానికెల్లా "మునిమంద" యనం బనుపేరు, నేఁడు దా
నినె "మురమండ" యంచు నవనీప్రజలెల్ల వచింతు రెమ్మెయిన్.

ఉ. దామెరవంశవర్ధను లుదారులు శూరులు వెల్మవారు సు
శ్రీమహితుల్ సదా యలపురిన్ వసియింతురి తదీశులై ధన
స్తోమమునందుఁ దా మమితశోభ వహించియు సత్కృతిప్రతి
ష్ఠామహనీయతల్ గడు నెసంగి రిలన్ మితిలేనివైఖరిన్. 665

సీ. దామెరవారికి దౌహిత్రుఁడై చెలి
కాని భాస్కరరావుగారి కొమరుఁ
డైన సూర్యారావు మానమర్యాదల
కునికిపట్టియోగ్యుఁ డొడయఁ డగుచు
మురమండగ్రామమ్ము సిరిఁదులదూఁగఁగా
నేలుచున్నాఁడిప్పుడెసక మెసఁగ
సీతనిదేవేరి యెంతయు సుగుణాల
వాల మా దామెరవంశజాత

తే. గీ. యనఘ, వరహాలురాయని యనుఁగుఁగూఁతు
రుత్తమోత్తమశీల పత్యుచితవృత్తి
రహి నెసంగెడి వేంకటరమణయాంబ
మేనమామకొమార్తయు మేల్మినలరు. 666

ఉ. దంపతు లిర్వురున్ మిగుల దైవతభక్తియు విప్రసక్తియున్
బెంపెసలారువారగుటఁ బేరుఁ బ్రతిష్ఠయు వృద్ధిఁజెంద బల్
సంపద సొంపుమీఱ సరసమ్ముగఁ గాలము వెళ్ళఁబుచ్చుచున్
బొంపిరివోవుచుండిరి కవుల్ గణియించు సుశీల మొప్పఁగన్. 667

క. సూర్యారాయఁడు పూర్వపు
టార్యుల యాచారములను నవ్వారలమేల్
మర్యాదల నవ్వారల
చర్యల నెల్లప్పు నిల్పు స్వాంతము పేర్మిన్. 668

శా. ఆయూరం గల దాలయం బొకఁడు పాశ్చాత్యంబందు సోమేశ్వరుం
డేయేకాలమునుండియో కలఁడు గానీ, నర్మదాబాణమం
దాయీశుండు ప్రతిష్ఠ సేయఁబడలే దాలోటు తీర్పంగ నీ
రాయం డెంచుచునుండె నెమ్మదిని విప్రప్రేరణల్ మీఱఁగన్. 669

ఉ. బాదముపూడి బుచ్చయ స్వభావవినమ్రుఁడు 'స్కూలుమాష్టరు' రా
ర్యాదయితాంఘ్రిపూజకకులాభరణుండు కలాకరుండు తేఁ
డాదృతిఁ జూపుకార్యమున "కౌబళి, మే" లని ప్రోత్సహించెఁ దా
మేచర మయ్యె నాదరము మేదినిభర్తకు నక్కృతమ్మునన్. 670

తే. గీ. నర్మదాబాణమును దెచ్చి కర్మనిష్ఠు
లైన శైవద్విజులను వేదాదివిద్య
లందు నాఱితేఱినవైదికాగ్రణులను
నెలమి రప్పించె సూర్యరాణ్నృపతివరుఁడు. 671

సీ. ఆగమశాస్త్రమం దగ్రగణ్యుండు వి
ద్యావయోవృద్ధుపాధ్యాయవరుఁడు
నైనశ్రీకంఠవంశాంబుధిచంద్రుండు
కేదారలింగవిద్యాదయితుఁడు
శాస్త్రోక్తవిధి బోధసలుపఁగా శాలయు
నందలివేదిక లందు నందు
వలసిన కుండముల్ గలయ వినిర్మింపఁ
గాఁజేసి సూర్యరాడ్ఘనుఁడు భక్తి

తే. గీ. తనర దీక్షితుఁడయ్యె ఫాల్గునమున సిత
పక్షమున నవమిని భానువాసరమున

మేషలగ్నమ్మునను మఱి మృగశిరోభ
మునను దుందుభివత్సరమునను బేర్మి. 672

మ. సుకుమారుం డతఁడయ్యె ఋత్విజులతో శుష్కోపవాసవ్రతా
ధికదీక్షాపరతంత్రుఁడై యచట నార్త్విజ్యమ్ముఁ గైకొన్నవా
రికి నాశ్చర్యకరమ్ముగా "నితఁ డయారే! పూర్వజన్మమ్మునన్
బ్రకటబ్రాహ్మణవంశ్యుఁడౌ" ననుగతిన్ వర్తించె నత్యంతమున్. 673

చ. అచటి హవిర్ద్విజాగ్రిణుల యం దొకఁడేనియు నాగమమ్మునన్
బ్రచలితదీక్షుఁడున్ మఱి యపాత్రుఁడు తైలహవుండు లేఁడ సూ
రిచయము మెచ్చుకోఁదగినరీతి స్వకృత్యమునన్ గృతార్థులై
ప్రచురగతిన్ జరించు నల వారలయోగ్యత లెన్న మిన్నయౌ. 674

మ. శివవిప్రౌఘమునందు మున్నుగల దుశ్శీలత్వశంకాదికం
బవకాశ మ్మిడఁబోక రూపఱియె నాఁ డమ్మంటపమ్మందు శా
స్త్రవిధిన్ హోమములోనుగాఁగలుగు కృత్యమ్ముల్ నివర్తించు బ్ర
హ్మవిదగ్రేసరులం గనుంగొనిన యార్యశ్రేణికిం బూర్తిగన్. 675

క. ప్రత్యక్షరుద్రులో! యా
దిత్యప్రతిబింబములొ! ప్రథితశక్తులొ! "త
త్రత్యార్త్విగ్వరు" లని త
త్రత్యులు సభ్యులు నుతింపఁ దనరిరి వారల్. 676

శా. దాసీదాస్యము కూటసాక్ష్యము వృథాదంభప్రచారమ్ము బల్
మోస మ్మాత్మశివాలయాపకృతి సంపూజ్యాపచారమ్ము స
ర్వాసహ్యమ్మగు దుష్ప్రవర్తనము లోనౌ దోసముల్ గల్గు నే
బ్రాసుల్ మందునకేని లే రచటిశైవబ్రాహ్మణౌఘమ్మునన్. 677

మ. తనవృత్తిన్ దిగఁద్రావి దేవునకు సంధ్యాదీపమున్ మాని "యే"
మని యేరే వడుగన్ సదుత్తరము నీ కాలోక మున్నట్టులే
ననుకో కే దురితంపుఁబాడుపనులో యాసాయమున్ జేయు దు
ర్జనుఁడొక్కండును దచ్ఛివద్విజులతో రాకుండె నిర్భీకుఁడై. 678

ఉ. కొందఱు యోగ్యులున్ మఱియుఁగొంద ఱయోగ్యులుఁ జేరు టెందునన్
విందురుకాని యిట్టులు వివేకులె కూడుట దుర్ఘటంబు. యీ
పొందికకు న్నిమిత్తము "ప్రభూతపురాకృతపుణ్యమే" యటం
చందఱు సూర్యరాట్ప్రభు ననారతము న్నుతియించి రమ్మెయిన్. 679

ఉ. ఏనృపు నాదరమ్మ వహియించుటఁజేసి జయప్రదమ్ముగా
శ్రీ నెగడంగ నీసభ సుశీలురు మెచ్చ నెసంగె నట్టి స
న్మానితకీర్తి యా సుగుణమండితుఁ డా ఘనదాత, నిశ్చల
జ్ఞానయుతుండు వొల్చు జెలికానికులీనుఁడు సూర్యరా విలస్. 680

ఆ. వె. ఈమహానుభావుఁ డిట్టి సత్కార్యంబు
లెపుడుఁ జేయుఁగాక ! హితులు మెచ్చఁ
గరుణ నితనిఁ బ్రోచుఁగాక సోమేశుండు
సర్వకామదయును సద్ధితముగ. 681

—• శ్రీముక్త్యాలసంస్థానము •—

శా. శ్రీలన్ జాలఁ జెలంగుచుండియు సదా చెయ్వుల్ తపోవేదశా
స్త్రాలీధమ్ములుగాఁగ జీవితము శ్లాఘ్యంబౌగతిన్ బుచ్చు ము
క్తీలేశున్ మనచంద్రమౌళివిభు ముక్తీశుండు రక్షించుఁగా
కేలోపమ్మునులేక కాల మఖిలం బీలాగె కాలాఁగఁగన్. 682

తే. గీ. శిష్యులకుఁగూడఁ దలనరసినది కొంత
నాకుఁ దలయొక్కటియకాదు నరసె మీస
లిట్టిచో నేఁ గయిత నెప్పనేల ? యైనఁ
జెప్పకే తప్ప కొక్కింత చెప్పుచుంటి. 683

—• హరి నాగభూషణముగారి గానము •—

తే. గీ. తఱచుగా రామశబ్దమ్ము తాఱుమాఱుఁ
జేసి నాగభూషణుఁడు వచించుమాట
కర్థ మోచంద్రమౌళిధరాధినాథ !
"ఏను సంగీతపున్ మర నెఱుఁగు" మనుట
"దీర్ఘమే" లన, నదియు గీతిగుణ మధిప. 684

సీ. నీభారతామ్నాయనేతృత్వ మది యనే
తాదృశైశ్వర్యప్రదమ్ముగాఁగ
నీతనూజాతుండు నీతిచే భూతిచే
ఖ్యాతిచే విస్ఫీతికరుఁడుగాఁగ
నీమజీవిత మొక్కనేఁడెగా కాకల్ప
మాదిరాజయశోవినోదిగాఁగ
నీదు సంస్థాన మానీతసత్కృతనిరం
తరకవిగాయకోత్కరముగాఁగ

తే. గీ. నాయురారోగ్యభాగ్యమహామహఃప్ర
భూతవిఖ్యాతిముఖ్యవిభూతి కిప్ప
టట్లె యెప్పుడు నిలయమై యలరుమయ్య!
అర్థిజనకల్పభూజ! ముక్త్యాలరాజ! 685

శా. గోదాతీరమునందు భారతము దిక్కూలంకషోద్యద్యశః
ప్రాదుర్భావుఁడు రాజరాజు తెనిఁగింపంజేసెఁ గృష్ణానదీ
భూవారుండవు నీవు నట్టివనికే భూయఃపరియత్నమ్ము నా
పాదింపంగలవాఁడవై యశము సంపాదించితో భూపతీ! 686

ఉ. ఎంచఁ బరాజు లెన్నికృతు లెందఱచేఁ గృతినందిరేని నీ
చందమునన్ యశమ్ముఁ గనఁజాలరు భారతమన్న వేదపుం
గండము తాదృశంబయినగ్రంథము కృష్ణుఁడె విప్పిచెప్ప నీ
యందము గల్గుటెట్టు? లిఁక నన్యుఁ డెవండు తెలుంగుచేసినన్. 687

తే. గీ. ముఱుఁగుపాపయారాధ్యులు మున్ను దేవి
భాగవతమును మీవంశపార్థివుల స
మక్షమందె తెలింగించె నంతకన్న
వేయిరెట్లు భారతకృతివిభుత మిన్న. 688

శా. ఎన్నోపున్నెము లీవు మీకులజు లాయీరాజ్యముం బూని మున్
మున్నార్జించియె యుండు రయ్యవియు విస్ఫూర్జద్యశస్ఫీతికిన్

వన్నెం బెట్టఁగఁజాలియున్ బ్రకృతమై భాసిల్లు నీభారతం
బన్నన్ దత్కృతులన్నిటిన్ మిగిలి నీకర్పించె నత్యున్నతిన్. 689

ఉ. మ్ముం దెటువంటిసద్యశము పొందెదొ? యిప్పుడె రాజరాణ్ణరేం
ద్రుం డవి యన్ని తీవధిప! రూఢిగ నిన్ జనమేజయాచలేం
ద్రుం దులఁదూగఁజేయుటకుఁ దొల్లి యొకింత యతించినాఁడ నేఁ
డందులకే యతించెదఁ గృతార్థుఁడ నయ్యెద నన్న నమ్మికన్. 690

శా. అంతేవాసిని నేను గృష్ణకవి, కత్యంతమ్ము నాయందు నా
యంతర్వాణికిఁ బ్రేమ పుగ్గలము, నీయాంతర్యమో నన్ను స
శ్రాంతమ్మున్ గమనించు నిట్టియెడఁ గార్యంబేల కాకుండు నం
చెంతున్ స్వాంతమునందు; నిక్కము జయంబే నాకుఁ జేకూరెడిన్. 691

శా. శ్రీనాథుండట, తొల్లి వేమవిభుతో సింగక్షమాభర్త కెం
తేనిన్ వైరము మీఱియున్నతఱిఁ దానే యేగి సింగక్షమా
జానిన్ సత్కవితావినోదమున మెచ్చన్ జేసి తద్వైరమున్
మానించెన్ గవిరాజు వైరమును నే మాన్పింతు నారీతిగన్. 692

శా. నా తోఁబుట్టువు భారతంపుఁగృతికి న్నాథుండ వీ వౌటచే
నీతోఁ జుట్టరికంబు నాకొదవుట న్నే నిన్ను విన్పింపఁగా
నేతున్, కృష్ణకవీంద్రుఁడో? వినెడి మున్నే నాకు, నింకేటికో
కాతర్యంబు నరేంద్ర! భావుకయశఃకాంక్షన్ బ్రవర్తించెదన్. 693

ఉ. చెప్పెడివాఁడు కృష్ణకవి, చెప్పఁగఁజేసెడివాఁడ వీవు, మీ
రెప్పటికిన్ మహాయశము నెంతయుఁ గాంతురుగాక, లోకపున్
మెప్పును గొంద్రుగా కది సమీహిత; మేదియు లేని నాకెటో
గొప్పదనంబుఁ దెచ్చుటకొకో? యని యెంచెద మీవివాదముల్. 694

చ. మృదుహృదయుం డమాయికుఁ డమేయుఁడు కృష్ణుఁడు, నీవొ సత్కవీ
డ్వ్యదనముఁగన్నమాత్రిన ప్రపంచము సర్వము విస్మరించు సా
హృదము గలట్టి దాత్మమణి విట్టిద్వయమ్మున కించుకంత యీ
కదనము వేంకటేశునెడఁ గల్గిన కూరిమిపెంపు భూవరా. 695

సీ. సచ్చిదానంద శ్రీస్వామి చాతుర్మాస్య
కారణమ్మున వచ్చుఁగాక యిటకు
రారె ? నిస్పృహులయ్యు రాజులకడకు య
తీంద్రు లవ్యాజంపుఁగృపకులోఁగి
యంతమాత్రిన "యింతవ్యయమేటి"కనక యిం
దఱఁబండితులఁబిల్చుధన్యులుంద్రె
ఉంద్రుగా కే నేడ కొంగి రాఁగ వీలు లే
కుండియు వచ్చు పెల్లొనరె ? సీస

తే. గీ. మస్తమును నా కెడియొ గొప్పయశము దొరకు
కారణంబని నామదిఁగానఁబడెడి
నితరనృపులఁ గాంచిన దొకయెత్తు నిన్నుఁ
గాంచు టొకయెత్తు సుమ్ము ముక్త్యాలభూప ! 696

—• లక్ష్మీనర్సాపురము, శ్రీ రాజారావు చెల్లయ్యమ్మారావుగారు •—

శా. స్త్రీరాజ్యంబని పేరుగాని మఱి యెందేనేని నీ కేజమీం
దారుల్ తుల్యులు ? చెల్లయాంబరో ! భవద్ధైర్యంబు నీ స్థైర్యమున్
సారోదారత రాజనీతి కవితాసారస్యనిర్ణేతృతా
ధారంబున్ గన విజ్ఞులైన నృపు లబ్రంబంది లజ్జింపరే ? 697

శా. నీయారోగ్యము వృద్ధిచెందుత భవన్నిర్వ్యాజధర్మంబు ల
త్యాయుర్భాగ్యము నందుతన్ గడు నమేయంబౌ భవద్వంశ మా
యాయిాధర్మము లూఁతయై నెగడుఁగా; కాయాయిపానంపిమున్
నీయుద్యోగముచూచి సౌఖ్యపడుతన్ నిక్కంబు చెల్లాంబరో ! 698

ఉ. పెంచితి వెందఱెందఱనొ బిడ్డలఁ స్నను మిన్నగాఁగఁ బ్రే
మించితి, పెండిళుల్ సలిపి మేటిగృహస్థులఁ జేసి చూచి హ
ర్షించితి, దెబ్బదేండ్లు గడచెన్, మఱి యెందును నీకు స్వార్థ మొ
క్కించుక లేదు వీరుజని యెంతకృతార్థమొ చెల్లయాంబరో ! 699

మ. ఎంతో యోజనచేయకుండ మఱి నీ వేవస్తువున్గాని నీ
చెంతన్ జేర్పవు, జేర్చుచో విడువవో చెల్లాంబ ! యీమాట నీ
స్వాంతమ్మందు ముఖస్తవమ్ముగఁ దలంపన్ వీలు లే దిందు నొ
క్కింతేనిన్ మృషయున్నఁ దెల్పుటకునై యేనిప్డుఁ బ్రేరేపెదన్. 700

మ. నిను నిష్కల్మషవృత్తిఁ గొల్చి యెవఁ డేనీగాని లక్ష్మీకృపా
ఖని కాకుండఁడు నీకృపాగరిమ నేఁ గైకొంటి నిన్నాశ్రితున్
జన సౌఖ్యంబు వినా మఱెయ్యదియు నాస్వాంతంబు వాంఛింప దెం
దునకే నెప్పటికేని యయ్యది కడుం దోడ్పై బల మ్మిచ్చెడిన్. 701

మ. చిరకాలాశ్రితులై నినుం గొలుచుచున్ జీవించు నుద్యోగు లం
దఱిభాగ్యమ్మునఁ జేసి నీయెడఁ గడున్ దైవమ్ము దీర్ఘాయువున్
గరుణించెన్ ధ్రువ, మే నెఱుంగుదును, నిక్కం బింత నీజాతకం
"బరుజాశీలితగూడఁ దోడగునుగా" కం చేను దీవించెదన్. 702

—• నూజివీడు, శ్రీ వేంకటాద్ర్యప్పారావుగారు •—

మ. కవివై, సత్కవిగాయకాదులను సత్కారమ్ములం దన్పుచున్
లవమున్ లోపము లేనిసంస్కృతిని హేలన్ గాలముం బుచ్చు ని
న్ను విలోకించిన, నీదుసంతతిని గన్గొన్నంత నోవేంకటా
ద్రివిభూ ! కన్నులపండు వయ్యెడి నినున్ దేవుండు దీవించుతన్. 703

మ. స్మితపూర్వమ్ముగ మాటలాడునఁట ! యా శ్రీకృష్ణుఁడో రాముఁడో
స్మిత మాపై నొనరించువాఁడఁట భవచ్ఛ్రీకృష్ణునిన్ బోలునీ
స్మితపూర్వత్వము తండ్రివంకధనమై చేకూరె నోవెంకట
క్షితిపాలాగ్రణి ! నీకుఁ గృష్ణుఁడిడుతన్ శ్రేయమ్ముభూయమ్ముగన్.

ఉ. శాంతియు దాంతియున్ గలుగుస్వాంతము మౌనుల కుండు, నొండుచో
వింతగదా ! భవద్ధృదయవీధి రజోగుణయోగ్యమయ్యుఁ దా
నెంతయు శాంతిదాంతుల వహించు ముఖస్తుతిగాదు, నిక్కమే
సంతసమందితిన్ శుభ మెసంగుత వేంకటభూప ! నీకొగిన్. 705

ఉ. ఎందఱు లేరు భూపతు లహీనరమావిభవానుభూతిసం
క్రందను లల్లయెల్లరకుఁ గావుత సేమము దానికేమి, నీ
యందలిసద్గుణంబు లవి యానరపాలకకోటిలోన నే
కొండఱకో ఘటించు ననుకొందును వేంకటభూప ! నామదిన్. 706

శా. చెప్పంగాఁ బనిలేదు నిన్నువరియించెన్ లక్ష్మి, నీయం దెటన్
దప్పుల్లోపవు నీబుఱుండయినదాతన్ జూడ నా కెంతయే
నొప్పం గోరిక నీకుఁ దాదృశమహాయోగంబు శ్రీ వేంకటా
ద్ర్యప్పారాయవిభూ ! ఘటించుత మపర్ణాంబాకృపాంకూరముల్. 707

చ ఇరువదిరెండువత్సరము లిప్పటికే నిట కేగుదేరఁగా
దొరకొని, రామచంద్రనృపధూర్జటి యేమి, యనంతరంబు త
న్నరవరుజ్యేష్ఠపుత్రుఁడగు నారయభూపతి యేమి, నేఁడు త
ద్ధరణిపుతమ్ము లేమి, ననుఁ దద్దయుఁ బేర్మిని గాంచు ఫక్కి నీ
వెఱుఁగుదు, వీపురం బెఱుఁగు నేమికతంబొ ! వచింపఁజాల మ
త్పరిచితు లెందఱో నృపవతంసులు గల్గియు వారువారు నన్
దఱచుగఁ గోరుచుండినను దన్నృపమౌళులఁ గాంచునిచ్చ నా
కఱిముఱిఁ గల్గియుండినను నయ్యది సాఁగుటలేదు. నూజివీ
ట్పురమున కేగు టన్నను గడుంగడు వైశమ సాఁగుఁ గాలు శాం
కరియె యెఱుంగఁగావలయుఁ గారణ మెయ్యదియో, ధరాపురం
దరుఁ డలరామచంద్రనర నాథుఁడు స్వర్గతుఁడయ్యు నాయెడన్
మఱువని పేర్మి నిప్పగిది మాటికి మాటికి నిప్పురంబు చె
చ్చెర నరుదెంచునట్లు తనచిత్తమునం దలపోయు నేమొ ? యె
వ్వరి కరయఁగవచ్చుఁ బరభావము, లింతకు నాకు నూజివీ
డ్ధరణిపుద్రవ్య మెక్కుడుగఁ దానది యర్వణ మన్నమాట లో
నరయఁగ నయ్యెడిన్, నృపతులందఱకున్ సమ మయ్యు మత్కవి
త్వరసమధుస్రవంతి తుదిదన్కను దక్కుట నూజవీణ్ణృపా
లుర కని తేలె, నీవు కవిలోకము మెచ్చను గాంచు మేటివై

విరచనసేయుచుంటివి వివేక మెలర్పఁగ నవ్యకావ్యముల్.
స్వరసతపట్టునన్ మిగులఁ జాతురి నీయెక లేకపోయె నన్
మఱవకుమయ్య ! సద్గుణసమగ్రులు మీపితరు ల్గణించిన
ట్టి రుచిరకీర్తి కద్దమయి తీవి నెలర్చెడి గ్రంథమున్ బరి
స్ఫురణకుఁ దెచ్చినట్టికవిపుంగవుఁడౌ రచియించె వేంకటా
ధ్వరి మును పాణివిశ్వకులపావనుఁ డిచ్చిరి యప్పరాయ లీ
శ్వరులయి యగ్రహారముఁ బైనది మీప్రపితామహాదు లె
వ్వరికిని జ్ఞప్తియందున ధ్రువంబుగ నుండకపోయె, నేనెటో
యెఱిఁగితి దానిఁ దెచ్చి వెస నిచ్చితి నారయభూపమౌళి క
చ్చిఱుతనృపాలుఁ డందులకుఁ జెందినమోదముఁ జెప్పఁజాలఁ జె
చ్చెర నది ముద్రితంబుగను జేయఁగఁ జేసెను దానిని ప్ఠలం
కరణరసాగమజ్ఞులు దగన్ దమశిష్యుల కోలిఁ బాఠముల్
దఱచు వచింపుచుండిరి, యుదారుఁడు నారయభూపుఁ డంతఁబో
కరసి తదన్వవాయజుల నాదృతిమైఁ బిలిపించె వారి క
చ్చెరువగు సత్కృతుల్ సలిపి చెందెఁ గృతార్థత; సర్వథా కవీ
శ్వరుల సహాయ మెప్పటికిఁ బ్రాజ్ఞ నృపాలురు కోరుకొంట కీ
ర్తిరమకు పన్నెవెట్టఁగల తెల్వి మఱొక్కటికుండదంచు లో
నెఱిఁగియెసూ ! ప్రసిద్ధులగు నెందఱురాజులతోడ నీవు చు
ట్టఱికములందినన్ గవికటాక్షపరంపరతోడ నందు చు
ట్టఱికము బోలఁ జాలిమి ధృఢమ్ముగ నీమన మొప్పితీరు, నీ
సరసత నేనెఱింగియె ప్రసంగ మొనర్చితి నింతవట్టు నీ
కురువగునాయువున్, యశము, యోగ్యత, సంతతి సంపదాఢ్యతా
స్ఫురణము రాజ్యముఁ మిగులఁ బొంపిరివోఁ గరుణించుఁగాక యా
గిరిపలిశోభనాద్రి నిజగేహము గాఁ గల మూర్తి వేంకటే
శ్వరుఁ డవి వేంకటేశ్వరుఁతు సల్పిన దీవన వేంకటాద్రిభూ
వర! గ్రహియింపుమయ్య జయవైభవమున్ గొనుమయ్య యెయ్యెడన్.

—• శ్రీ బొబ్బిలి సంస్థానము •—

చ. ఒకశుభ మిచ్చటం గని మహోదయ మందితి నో నృపాల ! యిం
టికిఁ జనఁగావలెన్ ద్వరగ నేఁటికి నాఱవనాఁడు మత్కుమా
రకు నుపనీతియుత్సవము రానయియున్నది బంధువర్గ మిం
తకు మును పిల్వఁగాఁబడెఁ, బదంపడి కాఁదగు నందురేని యం
దుకు నవకాశమేది ? కడుఁ దొందరగాఁ జనకున్న మాట ద
క్కక రసభంగమయ్యెడిని, గావున నిప్పుడె యుష్మదాజ్ఞ వీ
నికి దయసేయు మంచును వినీతిగ వేడుచునుంటి, మీకుఁ దీ
ఱికగలరోజులేని మఱిరెండొకొ మూఁ డొకొ గంటలేని విం
టకు నవకాశ మిమ్మని యొడంబడు నట్లొనరింపనే ర్తు, ని
ద్రకు మఱి భోజనమ్మునకుఁ దద్దయుఁ దీఱనియుత్సవంపు వే
డుకను మెలంగు మి మ్మెటు కడున్ మొగమోటము పెట్టువాడఁ ? దీ
ఱిక యగుదాఁకఁ దాళుట కరిందమ ! నిశ్చితమౌ ముహూర్త మో
పిక యెటులిచ్చు ! "భూవిభునివేశ్మము నందును మంత్రిగేహ మం
దొకతఱిఁ బెండ్లి" యన్న యటు లున్నది నేఁటిసమస్య, యిట్టులే
సకల మనేహమున్ శుభవశమ్మున నేగెడుఁగాక నీకు, వీ
ని కయిత కేమి వేఱొకట నెమ్మదిగా వినవచ్చు, మీకుఁగో
రిక గలదేని సత్కవివరేణ్యు లనేకులు రాఁగలారు, వీఁ
డొక గణనీయుఁడే ? యొకరి కొక్కటఁ జిత్తము పల్లవించు, న
న్నకుటిలమైనపేర్మి నిటు లాగతుఁగా నొనరించినట్టి ప్రీ
తికి నభివందనమ్ము లిడి దీవనలిచ్చితి నేగుచుంటి, వే
ఱొకట వసింతుఁగాక యిట నుండుదుఁగాః ! త్వదీయుఁడన్ నృపా
లక ! యిఁక నన్ను నీమతిని లాఁతిగఁజూడక స్వీయుఁగాఁగ నీ
దుకృపకుఁ బాత్రుఁగాఁగఁ గని తొందరమై రచియించినట్టి మా
మక కవితన్ వెసం బడుప్రమాదములన్ దిగద్రావి యీపయిన్
సుకవులపాలి వేల్పవయి శోభిలఁగోరెద రంగరాట్ప్రభూ ! 709

—• శ్రీ బొబ్బిలిరాజావారి పట్టాభిషేకము •—

శ్లో. శుభమ స్త్వవిఘ్నమస్తు చిరాయురస్తు విజయోఽస్తు
అస్తు ధనధాన్యరాజ్యశ్రేయో విద్యాయశః ప్రజాసిద్ధిః. 710

మ. అలమేల్మంగమదేవి వక్షమునఁ జెన్నారంగ రంగత్కటా
క్షలవస్ఫూర్తి ననేకరాజ్యములు నిచ్చల్ సృష్టిగావింపఁగాఁ
గల శ్రీవేంకటశైలనేత కృపతోఁ గల్యాణముల్ గూర్చి బొ
బ్బిలిరాజేంద్రునకున్ జిరాయు విడుతన్ శ్వేతాద్రిరాణ్మౌళికిన్! 711

క. ఈతఁడు శ్వేతాచలపతి
యాతఁడు నీలాచలపతి యంతియ భేదం
బీతనికి నాతనికిని న
నేతాదృశు లిరువు రిరుపురే యెన్నంగన్. 712

ఉ. తాతలనాఁటి చుట్టమని తద్దయు నెమ్మదిఁ బ్రేముడించి నీ
వీతటి వేంకటేశకవి నియ్యెడకుం గడుఁ బిన్నవయ్యుఁ బ్రి
ఖ్యాతిని గోరి వచ్చునటు లాదట సల్పితి వో నృపాల! నీ
ప్రీతికి సంతసంపడితిఁ బెంపుగ నీకెడువాఁడ దీవనల్. 713

శా. నీకుం గిరితి హెచ్చుఁగాక, మఱియు న్నీ కాయురారోగ్యసు
శ్రీ కళ్యాణపరంపరల్ పరఁగుతన్, శృంగారభంగుల్ సదా
నీకున్ భోగ్యములై చెలంగుత; మఱిన్ నీనామమే నీప్రజా
నీకమ్మం దొకమంత్రమై వెలయుతన్ శ్రీరామకృష్ణప్రభూ! 714

మ. వెలమల్ రాజులకన్న మిన్నలను నవ్విఖ్యాతికిన్ దాపుగా
వెలసెన్ బొబ్బిలి, తాదృశంబగు మహావిఖ్యాతి మీవారు ప
ర్థిలఁ గాఁజేసిరి, నీవు సిద్ధమగు తద్విఖ్యాతికిన్ వన్నె చి
న్నెలు గల్పించుచు రాజ్య మేలు మనుచున్ దీవింతు భూవల్లభా! 715

మ. ఎలమిన్ దిర్పతివేంకటేశ్వరులచే నెందున్ దెలుఁగున్ ధరా
స్థలి రాజుల్ ప్రతివారు చూడఁబడుటన్ దత్తద్యశంబుల్ సభ
స్థలి రిక్కల్ బలె వెల్గు; బొబ్బిలికిఁ దద్భాగ్యంబు లేదన్న య
న్నలుపున్ నీపరిపాలనంబు దొలఁచెన్ న న్నిచ్చ రప్పించుటన్. 716

సీ. వేంకటగిరినేత వెనుకటి యభిమాన
మూంచి నిన్నెపుడు రక్షించుఁగాక
తిరుపతివేంకటేశ్వరుఁడు నీ బంధుత్వ
మెంచి నిన్నెపుడు రక్షించుఁగాక
ఏడుకొండలరాయఁ డెంతదవ్వున నుండి
యేని నీ సేమంబు నెంచుఁగాక
వడ్డికాసులవేల్పు వరదుఁడై నీపట్లఁ
గంటికి ఱెప్పయై కాచుఁగాక

గీ. నీదు పట్టాభిషేకనిర్ణిద్రదివ్య
తరమహోత్సవచరిత ముదగ్రకీర్తి
కాకరంబయి యెల్లెడ నలరుఁగాక
బెబ్బులిగ నేల నేలు, బొబ్బిలినృపాల ! 717

మ. కలవానిఁ బురడించుసంపదల నెక్కాలమ్ము శోభిల్లి చు
క్కలవానిన్ హసియించుకీర్తిగరిమన్ గైకోలు గావించి, చి
త్కలవానిన్ గనినంత నాదర మెదన్ గ్రిమ్మన్ బ్రజల్ మెచ్చ బొ
బ్బిలిరాజ్యం బలలేక యేలుకొనుమీ ! శ్వేతాచలశ్రీపతీ ! 718

మ. వ్యయ మయ్యెన్ గలగల్పనల్ నృపులకై, వార్ధక్యపుంగన్నె దా
పయి కన్నన్నలు సేయఁగాఁదొడఁగె వేదాంతార్థముల్ దక్క నే
వియుఁ జిత్తమ్మున కింపు నింప విపు డోపృథ్వీమహేశాన ! లే
వయసున్ రాచకొమారు నెల్లు కఱఁగింప న్నేర్తునిఁ గైతచే. 719

ఉ. కాఁగలవాఁడు శాస్త్రమునఁ గావ్యకలాకలనమ్మునన్ మహా
భాగులు మెచ్చికోఁదగిన పాండితి వొల్చెడివాఁడు యోగ్యతా
ధీగరిమమ్ముగల్గిన సుధీరుఁడు నాపినతమ్మునల్లుఁడి
చ్ఛాగతి నీకు నీడని వెసం గొని తోడ్కొనివచ్చితిఁ నృపా ! 720

శా. శ్రీలోలుండు కృపాకరుండు సకల శ్రేయోనిధానంబు ది
వ్యాలంకారుఁడు భక్తరక్షణకలావ్యాపారపారీణుఁ డు

ద్వేలపార్శ్వవుఁ డర్జునాశ్రితుఁడు సద్వేదాంతవేద్యుండు గో
పాలస్వామి త్వదిష్టదైవము కృపన్ బాలించు నిన్ భూవరా ! 721

—• 'పోలో' ఆటసందర్భమునఁ జెప్పినవి •—

చ. అరదము నెక్కి మున్ను విటలాక్షుఁడు గెల్చెఁ బురత్రయంబు దే
వర తురగమ్ము నెక్కియు సవా రొనరించుచు నాడు కందుక
స్ఫురదురుఖేలనమ్మునఁ గవుల్ వినుతింపఁ బురత్రయంబు గె
ల్చిరహి యశమ్ము గొంటిరని చెప్పఁగ వింటిని రంగరాట్ప్రభూ ! 722

మ. హయరాజంబుల నెక్కి బొబ్బిలిపురాధ్యక్షుండు సోదర్యు లెం
తయు శ్రీ వేంకటరామరావు మొదలౌ ధన్యాత్ము లన్యోన్యమున్
జయకాంక్షన్ వెస బంతికై పెనఁగు నాచందంబు పార్థుండు త
ద్దయు శంభుండును ఘోణికై పెనఁగు చందం బూహకున్ దెచ్చెడిన్.

—• శ్రీ చెలికాని జగన్నాథరావుగా రిడిన కాన్కనుగూర్చి •—

మ. ఇల మున్నార్యవరుచక్రవర్తులును దా మీలాటి సత్కీర్తి యి
మ్మల నార్జించిరి నీకు నిట్టియశమే మున్మున్ను రాఁగోరి శ్రీ
చెలికాఁడైన జగన్నియంత యిటు నాచేఁ గాన్కపెట్టించె ని
క్కలధౌతంపు 'మతాబు' లాజిఁటిని రంగారాయ ! గైకోఁగదే. 724

—• నూజివీడు, శ్రీ సింహాద్ర్యప్పారావుగారు •—

శా. ఏనున్ మీజనకుండుఁగూడు సుదినం బేలాటిదో ! యేన్నృపా
స్థానం బేఁ గని యిన్నియేం డ్లిటకుఁ 'దూ, చా' తప్పకే వచ్చి స
న్మానింపంబడుచుంటి, నిందులకు విఘ్నం బెందుఁ గన్పట్టఁబో
దానందం బిది నీకుఁ దోడగుత సింహాద్ర్యప్ప రాడ్భూవిభూ ! 725

చ. జనకుని మంచివాఁడని ప్రశంసకుఁ దెచ్చుట పాడిగాదు నం
దనునకు, నిక్కమే, మిగుల దక్షుని దాతృశిరోమణిన్ గలా
ఖని నను(గుం బితన్ గడవఁగా వశ మెవ్వరి కౌను ? నీకుఁ గ
ల్గిన దిటువంటిభాగ్య మనళీకము సుమ్మిది యప్పరాడ్విభూ ! 726

— నరసాపురము. పొన్నపల్లె రాఘవసోమయాజిగారు. —

సీ. నరసాపురము పుట్టిన సమయ మ్మెట్టిదో
యెఱిఁగినవార లిందెందు లేరు
కాని యీపురి పుట్టుకంబొందినట్టి యి
న్నాళ్ళలో నిట్టి ధన్యమగుకాల
మింతకుమున్ను లే, దేమందురేని యిం
తకుమున్ను కృతిఁగొన్న ధన్యమూర్తి
యెఱ్ఱమిల్లికులేంద్రుఁ డిచ్చోటనేకదా!
జనియించినాఁడు సజ్జనహితుండు
తే. గీ. మరల శాకుంతలము నేఁడు మనసమక్ష
మందుఁ గృతికై కొనుచునున్న మహితబుద్ధి
సుగుణి శ్రీ వీరరాఘవసోమయాజి
కూడ మనయూహకు బలమ్ముఁ గూడఁజేయు. 727

చ. కడుఁగడుఁ జిన్నవాఁ డితఁ డఖండతరమ్మగు జవ్వనమ్మునం
దడుగిడునాళ్ళలోఁ జపలమైన కుతూహలముల్ గురించి పే
ర్వడఁదగునట్టి సత్కృతికిఁ బాల్వడుటన్నఁ బురాకృతంపు దం
దడి సుకృతంబుగాక మఱిఁ దక్కినరీతి లభింపనేర్చునే? 728

చ. ధనము గడింపవచ్చు గడు దాతయునై పొగ డందవచ్చుఁ గీ
ర్తిని లభియింపవచ్చును గృతింగొనుటన్న వశంబుగాదు ప్రా
గ్జనికృతభాగధేయమునఁ గాక మఱొక్కట, నెంతధన్యుఁడీ
యనఘుఁడు? సోమయాజి మనకందఱకు న్నుతిపాత్రుఁ డెమ్మెయిన్.

ఉ. వైదికులైన సత్కవులు వారక లౌకికులైనవారికిన్
గాదిలికై తకూఁతులఁ దగం గయిసేసి యొసంగినారు నేఁ
డాదృతి వైదిక ప్రభున కర్పణఁజేనె నియోగిసత్కవి
శ్రీదయితుండు కూఁతు నిది చెప్పఁగ నొప్పదె క్రొత్తవింతగన్! 730

ఉ. కాసలనాటివారు కృతికర్తలు భర్తలుగూడ నైరినేఁ
డీ సుకృతిఁ గ్రహించి యితఁ డెంతయు నొప్పుటఁజేసి వీరి క

గ్రేసరుఁడైన శిష్టకులకేసరి సత్కవి కృష్ణమూర్తి తా
నీసమయమ్మునం దిచటనే చెలువారిన నెంతమెచ్చునో ! 731

—• వీరవరము, మల్లెపూడి పళ్ళంరాజుగారు •—

సీ. మల్లెపూడికులుండు పళ్ళమరాజు తా
నింతకన్నను వృద్ధి నెసఁగుఁగాక
ఈతనికనుయాయి యేతాదృశగుణుండు
నరసన్నయును వృద్ధిఁ బరఁగుఁగాక
యొకఁడుజిల్లానేత, యొకఁడుతాలూకాకు
నేత యిర్వురుఁగూడ నిపుణమతులు
ఇట్టియోగ్యులు మన కేలికలగుటకు
మనమొనర్చిన పుణ్యమహిమఫలము

తే. గీ. గాన వీరికి వీరవరానఁ బొల్చు
శివుఁడు గేశవుఁడును సదాశివము లొసఁగి
యేలుచుందురుగా కని యేకమతిని
గోరికొను టొప్పు సభ్యులు ధీరమతులు. 732

తే. గీ. భగవదంశంబు లేకున్న జగమునందు
నెవ్వనికి నధికారంబు నివ్వటిలదు
గాన నధికారియన దైవమే యటంచు
హిందువు లనాదిగాఁ బ్రేమనొందుచుంద్రు. 733

తే. గీ. ఎందు నధికారి చక్కగా నెసఁగెనేని
యాతఁడధికారియే యగు నట్లుగాక
యన్యథాగా మెలంగిన నపుడుఁగూడ
నాతఁ డధికారియే యగునండ్రు బుధులు. 734

తే గీ. ఎన్నిపొత్తమ్ములను మన మెలమిఁ జదివి
చూచినఁ బరోపకృతికన్న సుకృత మొండు
లే దిఁకఁ బరాపకృతికన్న లేదు పాప
మది యెఱుఁగువారి కుభయత్రి నబ్బు సుఖము. 735

మ. వినుమీ, పళ్ళమరాజ! పూర్వసుకృతావేశమ్మున న్నీకు వ
చ్చెనుజు మ్మిట్టిమహాధికార, మిది యుర్వీరాజ్యమున్ ఏంచు దీ
నిని నీ వొప్పగురీతి వాడికొని యెంతేఁ గీ ర్తి నార్జించి నీ
కును నీపూర్వులకున్ యశం బమితమున్ గూర్పంబ్రియత్నింపుమా!

—• లక్ష్మీనర్సాపురము, శ్రీరావు రామాయమ్మ జమీందారిణీగారు •—

ఉ. తల్లిరో! యాలకింపు విశదమ్ముగ వెంకనపల్కు, శారదా
'బి'ల్లొకఁ దేగుదెంచినది విప్రులనెల్లను మేలుకొల్ప నే
పిల్లకు నేని 'యేప్రియలు' పేర్వినఁపూర్వమె పెండ్లిసేఁత సం
ధిల్లెను; మద్ద్వితీయసుతు ధీకలితున్ బదియేండ్లవానిఁ దా
మల్లునిఁగాఁగఁ బూర్వ మొక రర్థి వరించిరి కన్నె కేఁడు లే
దుల్లసిలున్, వివాహ మిపు డొయ్య నొనర్పక మీఁదఁ జేయుచో
నల్లరి రాజకీయముగ నబ్బెడినన్నభయాన నేఁడె వా
రెల్లవిధాలఁ బెండ్లియని యెక్కుడుతొందర నిచ్చుచున్నవా,
రల్లదె, మార్గశీర్ష మిఁక నాఁగినచో సుముహూ ర్త మబ్బుటల్
కల్ల, కడుంగడుం ద్వరగ గాళ్ళనుద్రొక్కుగ పెండ్లిచేయుచే
చెల్లెడినంచు నెంచి యటుసేఁతకుఁ దావకదర్శనంబు నా
యుల్లముసన్ స్ఫురింప నిట కొయ్యన వచ్చితినమ్మ! నేనెటన్
గల్ల వచింపఁ, జిక్కొదవఁగా నది కాళిక తీర్చుచుండె సం
పల్లత లల్లికొన్నపుడు భారము నీవు వహించుచుంటి వి
ట్లల్లినపద్దె మొండు గల దయ్యది యచ్చగుచున్న పొ త్త మం
దుల్లసిలున్, గనుంగొనెద వొక్కపదేనుదినాలలోనఁ నే
డిల్లలితంపుశోభనము నేర్పడ విన్నపమాచరింపఁగా
మల్లడిసేయుకోరికలు మాటికి మాటికి సందడింప నే
"వల్లె" యటంచు వచ్చితిని భావిశుభంబు సమ స్తమున్ భవ
త్సల్లలితాదృతిస్థమని సారెకు విన్నప మాచరింతు, నా
వల్ల గవిత్వమల్లు నలపై ఖరి చొప్పడు దీనికల్మి నేఁ

జిల్లరదాతలన్ గనఁగఁ జెల్లదుదారుల మిమ్మువంటి శ్రీ
చెల్లెలివావివారలనె చెల్లు గనుంగొను టంచు నెంచితిన్. 737

చ. అనఘుఁడు లచ్చిరాపు భవదాదృతి నాకు నయాచితమ్ముగా
బనుపడఁ జేసె దానిని శుభంబు లొనర్చెడిపట్ల వాడుకో
మనమున నెంచి దాఁచికొని మన్నుచునుంటిని, బెద్దకుఱ్ఱకున్
మొనమొన నైన పెండిలికి మూలము నీవిడు ద్రవ్యమే, పెసం
బని గలిగించె నియ్యెడలఁ బండితవంచకమైన 'బిల్లు' త
ర్జన మొనరించు హేతువునఁ జయ్యన రెండవ కుఱ్ఱపెండ్లి; యి
ష్టానరకయున్న నిట్టిభయ మొప్పునె ? యింతటి వేగిరమ్ము భూ
జనులకు; మూర్తమబ్బినను జక్కని దబ్బకయున్న మౌఢ్యముల్
బనుపడినన్ గణింపరు వివాహములన్ జరిగించుచున్నవా
రనయము రాజశాసన మహాంకృతిఁ బైఁబడు నన్నభీతి; నీ
యనుచితమైన 'బి'ల్లొకటి యజ్ఞులపాండితికల్మి మూఁడి శా
స్త్రనియతికిన్ నిరాదృతి నెసంగఁగఁ జేసెడి నింకమీఁద శో
భనములు లోకమందుఁ బదివత్సరముల్ తఱచుండ, వీడు వ
చ్చిన ద్విజకన్య లందఱకుఁ జేయుదు రిప్పుడు పెండ్లి; 'బిల్లు' పం
బినపిదపన్ వివాహ మది పిల్లల కెట్లును జేయరానిద
య్యె. నెచటఁ దారసించెదరు హెచ్చువయ స్సలరారుకన్నె లో
జనని : యి దిప్పుడైన యెడ సప్తశరత్తులపైనిగాని నా
యొనరుచు పెండ్లిగన్పడద, యింకొకకుఱ్ఱఁడు రెండుమాసముల్
చనినవయస్సువాఁ డెసఁగు, శాస్త్రవిధిన్ మఱివానివడ్డు తా
నెనిమిదియేండ్లలోనఁగద యేర్పడు నట్టి ప్రసక్తి : కూఁతుల
న్నను నొక యిర్వు రం దొకతె నాల్గిట, వేఱొకకన్నె యాఱిటం
దనరెడి, వీరి పెండిలులదండడి సందడిగాని నేఁటిచి
న్నినిసువు వడ్డుగాని యిఁక నేనొనరించుట యెన్మి దేండ్లకే
యని తమచిత్తమందు స్ఫుటమయ్యెడి నిందు లిఖింపనేల ? యం
దనుక ధనార్థినై మిముఁ బదంపడి కోరఁగఁబోను 'బ్యాంకి' లో

నిలిచినపోల్కి మీకడనె నిల్వయొనర్పఁగలాఁడ, మొన్నఁగు
జ్జనికి వివాహమైనతఱి దర్శ్వ్యము తామిడినప్పు డింకఁద
క్కినయది 'దాఁచికొంటి' నని కేవలమున్ జనవుంటఁజేసి నే
మనవి లిఖించియుంటి నది మానసమందున మీకు జ్ఞప్తియుం
డును నెల వీఁగదమ్మరొ ! కడుఁ ద్వరలో నలనూజివీటి పే
నివి దరిసించి రావలయు, నేఁటికిఁ బెండిలి మాసమాత్రపున్
దినములలోన నున్నయది తేఁకువమై జతనంబుచేసికోఁ
గను దఱియయ్యె నాజ్ఞ యొసఁగన్ మిము వేఁడెద, నాయొనర్చు ని
మ్మనవిని నెమ్మది న్నిలిపి మన్నన పిమ్మటఁ జేయవచ్చు న
ప్పని "యిపుడేయొనర్పుఁ" డని ప్రార్థనసేయను, ముందు మీదు ద
ర్శనమొనరించినాఁడ నిఁక సర్వము భద్రమె మాకు, రావుస
ద్ఘనకులదీపవల్లిక ! యుదారయశఃఖని ! రామయాంబికా ! 738

శా. ఎంతోమంది నృపాలకుల్ గలరు తల్లీ ! నన్నుఁ బ్రేమించు శ్రీ
మంతుల్ వారలు దూరవర్తులగుటన్, మద్దేహమో వృద్ధతా
క్రాంతంబౌటను జూడనేగుట కశక్తంబై, సమస్తంబు నీ
వంతై యొప్పెఁ "గుమారుపెండ్లి" యనుచున్, వాక్రుత్తు రామాంబికా !

శా. మీమీ యాశ్రియకారణమ్మున మమున్ మిన్నంటు 'శ్రీమంతు' లం
చామోదింతురు తక్కుపండితులు; కార్యం బప్పు డాచేవ యీ
మేమున్ జూపక తప్ప దట్లగుటచే మి మ్మిట్టులర్థించుటల్
సామాన్యంబుగఁ జేసికోఁదగిన యైశ్వర్యంబు మాకుండియున్. 740

చ. చనుటకు శక్తిచాలమి వెసన్ గరపత్రిము లంపినంతనే
ధనమిడు తేఁడులుం గల రుదారులు కొందఱు నాకు; వారిలో
ఘనుఁ డలవాసిరెడ్డి కులకాంతుఁడు శ్రీశశిమౌళియొక్కఁ, డై
నను నటువ్రాసిపుచ్చుటకు నామదిసిగ్గిలు రామయాంబికా ! 741

ఉ. దగ్గఱనున్న నీవిడెడి దర్శ్వ్యమె నన్ గృతకృత్యుఁజేయ నే
సిగ్గును వీడి దూరగులచెంతకుఁ బత్రిము లంపి దైన్యపున్

"ముగ్గులుపెట్టనేల" యని మూకతఁ గైకొనినాఁడ వ్యర్థపుం
బగ్గెలుగావటం చెఱుఁగుప్రాజ్ఞవు నీ వగుటన్ లిఖించితిన్. 742

విశాఖపట్టణము.

—. శ్రీ బాకురుపండా వేంకటరమణమూర్తిగారి యింట వివాహము .—

మ. ధనధాన్యంబుల నాయురున్నతుల విద్వద్భక్తి సంపత్తులన్
ఘనవిద్యావిభవమ్ములన్ సుగుణసంస్కారమ్ములన్ బెద్దలం
గనినంతన్ వినయంబు, వీనినిడి తోకమ్ముఁ గటాక్షించి యీ
మనలక్ష్మిన్ మనశంకరున్ మనుతు రంబాదేవియున్ భర్తయున్. 743

మ. విను మో పెండ్లికుమార ! పెండ్లికొడుకు కుర్వీజంబగున్ బెండ్లికూఁ
తునకున్ జెల్లు లతాసదృక్షత, తదుద్యోగమ్ము మీయిశ్వరుం
గని బంధువ్రజ మెల్ల మెచ్చికొన నంగం బంగియుంగా మెలం
గునటుల్ శంకరుఁ డర్ధనారికుఁ దొసంగుంగావుతన్ శ్రేయముల్. 744

మ. పురుషార్థమ్ములు నాలు గంథొకటివోఁ బుంసేవ్యముల్ మూఁడె యీ
ధరఁ గన్పట్టెడిఁ గామ మర్థమును సద్ధర్మముఁ నీ పీ తలో
దరి నీమూఁట నొకింత యేమఱక సంతానప్రభాశోభివై
వఱలన్ వేంకట సత్కవీశ్వరవచోవై దర్థి తోడయ్యెడున్. 745

మ. మఱవంబోకుము తండ్రి ! యాశ్రమములన్ మాన్యంబు దాంపత్యస
ర్వరసోదంచితమై నుతింపఁబడుఁగా ర్హస్థ్యంబ, యిఁదున్ దలో
దరియే నౌక తరించు నేర్పరికి; విద్వత్సత్కవుల్ మెచ్చుకోఁ
గర మిబ్బాలికతో మెలంగి యశమున్ గైకొమ్ము సంతానమున్. 746

మ. ధనధన్యాదిసమస్తభాగ్యములు తద్దన్ నీకు మున్ మున్న యి
చ్చెను శ్రీశంకరుఁ, దేదినూతనముగాఁ జేర్పన్ బ్రయత్నంబు నే
నొనరింతున్ ? మును నీయెడంగల మహాయోగంబె నీవంశమం
దనయమ్ముం బెనుపొందుఁగాక యని నే నాశీస్సు నీకిచ్చెదన్. 747

—. నరసింహదేవర నరసింహముగారు .—

మ. నరసింహుం డితఁ డాత్మనామముననే నల్వొందుగేహాఖ్య పొం
పిరివో నొప్పెడివాఁడు బందుగుఁడు పేర్వెంచుంటయే కాని నే

నరయన్లే దితనిన్ గపీంద్రనుతిఁ జెల్వారన్ బ్రవర్తించు "బా
కురుపండా" యొకమూలమై యితని నాకుం జూపె నిన్నాళ్ళకున్. 748

—• నూజివీడు, శ్రీరాజా రామచంద్రాప్పారావుగారు •—

శా. నీ కాశీర్వచనంబు నారనృపుకంబెఱ మేటిపాండిత్యమున్
జేకొన్నాఁడవు తండ్రికంటెఁ గొమరుల్ చేవన్ బ్రకాశించు పే
లోకుల్ గోరెడి భాగ్య మట్టిసిరి నాలోకింపలే దాతఁ డా
హా! కాలమ్మటుచేసె నారనృపపుత్రా! రామచంద్రాధిపా! 749

శా. నీపేరన్ బ్రథ గన్నతాత ఘనపాండిత్యమ్ము, నీతండ్రి వి
ద్యాపారమ్యము రెండుఁగాక కవితాతన్వంగి నీతోడ స
ల్లాపింపం దొడఁగెన్ రహస్యముగ నేలా నీకు నాశీస్సు, లిం
కాపూర్ణాయువుఁ గొమ్ము నారనృపపుత్రా! రామచంద్రాధిపా! 750

శా. నీ దాక్షిణ్యము నీ వినీతి గతియు న్నీదౌ ననౌద్ధత్యమున్
నీదౌ శీలము మీపితామహియె వర్ణింపంగ నేవింటి, ధీ
రోదాత్తుండవు నీకు నెక్కుడుగ నాయుర్దాయ మర్పించుఁగా
కాదైవం బయనించి నారనృపపుత్రా! రామచంద్రాధిపా! 751

శా. తాతన్ దండ్రియుఁ బిన్నతండ్రులును విద్వాంసుల్, కులం బిట్టి వి
స్ఫీతోదాత్తమనీష నొప్పుటఁగదా! ప్రేమించె నిన్ గైత, నీ
వీ తన్వీమణి నెట్లు చూడవలె నట్లే చూచి పాలించుకొ
మ్మీ! తాత్పర్యమెలర్ప నారనృపపట్టీ! రామచంద్రాధిపా! 752

మ. మతిమంతున్ గులవంతు రూపగుణకర్మ బ్రహ్మచర్యాశ్రియ
వ్రతసంపన్ను నినున్ వరించెఁ గవితావామాక్షి, నీ వీమెతో
శతసంవత్సరమున్ యథేచ్ఛముగ సంసారమ్ము గావించి సం
తతియున్ గాంచి సుఖింపు నారనృపపుత్రా! రామచంద్రాధిపా! 753

ఉ. బాలుఁడ వీవు నీకవిత బాలికగాదు తదద్భుతంపువా
చాలత, ప్రౌఢతాగరిమఁ జూపెడి, నంతియుకాదు పాఠ్రిజ్ఞలన్

జాలవిధాల నాత్మసరసత్వపు టుయ్యెలనుంచి యూఁపఁగాఁ
జాలెడి, నర్థగౌరవపుసంపద నింపులు వింపి ప్రౌఢలన్
మాలిమిఁజేసి వశ్యులుగ మాటికి లోఁగొనెడిన్, మఱిం దదు
ద్వేలపుఁజాతురీగరిమ వీనులవిందుగ గ్రంథకర్తస
చ్ఛీలమునెల్ల వ్యంగ్యగతిచే విశదీకరణం బొనర్చెడిన్
శ్రీలలనాకటాక్షమునఁ జిన్నతనంబుననుండి యెల్లరున్
లాలనసేయ భోగము లనంతముగాఁ గొనుచున్ బ్రపంచపున్
గోల నొకించుకే నెఱుఁగుగోష్ఠికిఁ బోవని భూసతీమణీ
పాలకబాలు రెక్కడ! ప్రపంచము నందలి యెల్లసంగతుల్
చాలుగఁ జూచి చేయఁదగు సత్కవితారచనల్ మఱెక్క! డె
ల్లోలిని నీకు నీకవిత యుప్పతిలెన్! గడునక్కజం బహో!
పూలకు సౌరభంబువలెఁ బుట్టెఁ గవిత్వపుధార నీకు, రా
డ్బాలక! రామచంద్రనరపాలక! నారనరేంద్రపుత్ర! స
చ్ఛీలుఁడు నీదుతండ్రి కడుఁజిన్నతనమ్మున స్వర్గ మేగియున్
గ్రాలె సమస్తవిద్యల నఖండతరంబగుప్రజ్ఞగాంచి ధీ
శాలి యతండు నీకవితచందముఁ జూచిన నెంతమోదపుం
బాలగునొకదయ్యా! భగవంతుఁ డటుల్ ఘటియింపఁడయ్యె; ని
క్కాలమునన్ గవిత్వమనఁగాఁ బెడత్రోవలు త్రొక్కుచున్న గ
య్యాళికిఁ దుల్యమై చెడుట యారయుచుంటిమి, వారిత్రోవలన్
గాలిడఁబోకుమయ్య! యదిగాలికి దూళికిఁ బోవుఁ, జక్కనౌ
జాలునఁ బూర్వపద్ధతికి జంకనిఫక్కిని వ్రాయుమయ్య ప
ద్యాలను, వానిఁగాంచి విబుధవ్రజ మాదర మూను, సద్యశ
శ్శాలివి దాన నీవగుదు, సత్కవిసమ్మతికన్న జన్మముం
దాలుచువారి కొండు సుఖదంబగువస్తువు లేదు, సద్యశం
బాలయమున్ సుఖం బొసఁగు నావలఁగూడ సుఖమ్మనిచ్చు భూ
పాలకభావమున్ సుకవిభావము రెండును దూఁచిచూచినన్
దూలముపోలెఁ గైత కొగిఁ దూలుఁజుమీ నరపాలభావ, మే

కాలము నందుఁగూడఁ గవికన్నఁ గృతార్థులు గల్గబోరు, భూ
పాలురు వారియాదృతికిఁ బాత్రులు గాఁగలరేనిఁ గీర్తి కా
వాలములౌచు. రందులకుఁ బాసిన నూరునుబేరు లేనివా
రై లయ మంది పోయెద, రహర్నిశ మీవిట బుద్ధినిల్పి యా
శూలిసతీకటాక్షమున శుద్ధయశమ్ము గణింపు మిద్దియే
చాలును రాజ్యమేమిటికి ? జన్మము దీనఁ గృతార్థ మయ్యెడిన్. 151

—• నూజివీడు, శ్రీశోభనాద్ర్యప్పారావుగారు •—

చ. పరిచిత తేలప్రోలినరపాలక ! శోభనశైలవిస్ఫుర
ద్ధరివరనామధేయ ! సుగుణాకర ! శ్రీకర ! యప్పరాయ ! ని
న్నెఱుఁగుదు నన్ను నీ వెఱుఁగు దెన్నిశరత్తులనుండియో, మహ
త్తరమగు నీ యుదారతయుఁ దద్దయు నే వినుచుంటి నెప్పుడో
పొరిఁబొరి నీదుదర్శనము పొందుటయుంగల దీవు రామమం
దిరమును గూర్చి చేసిన వితీర్ణిని గూరిచికాని చాలను
స్థిరమగు "నాసుపత్రి" కయి చేసిన మేటివితీర్ణిగూర్చికా
ని రచనకున్ గడంగిన ననేకకృతుల్ ప్రభవిల్లు, నిట్టి ని
న్నిఱువదియేండ్ల యీవయసునందొక కోరికఁ గోరుచుంటిఁ, జు
ట్టఱికము నీకు నాకుఁ బ్రికటమ్ముగ నేర్పడు కారణమ్మునన్
"సరి ! సరి ! నీవు విప్రకులజాతుఁడ వే నరపాలవంశ్యుఁడన్
గరమును నీకు నాకు నెటుగాఁదగుఁ జుట్టఱికం" బటన్న వా
విరి వినుమయ్య ! నీకు నల బొబ్బిలిరేఁ డగుఁగా దెయల్లుఁ డా
నరపతి నాకు నల్లుఁడని నమ్ము "మసత్య" మటంచువేని డ
గ్గఱఁ గలదయ్య ! చూపెద "రికార్డు" గనుంగొను, మాన్నృసింహుఁ డా
దరమున రాజ్యభారమును దాల్చెడి యుత్సవ మప్డు నన్ను మే
దురమగు ప్రీతిఁ బిల్చి కడుఁ దోరపు గౌరవ మాచరించి త
చ్చరితము గ్రంథరూపముగ సల్పుట కాజ్ఞయొసంగె, దానినే
విరచన సేయుచుంటిఁ గడువేగమె తత్కృతి యన్నరేంద్రు శ్రీ
కరకరపంకజమ్మునెడఁ గ్రాలుట చూడఁగలాఁడ, నిట్టి యా

వెరవున నీవు చుట్టమవు విస్మృతిన్ గ్రహియించియున్ సుతా
కరము గ్రహించియుఞ్ జగతిఁ గాఁదగు నల్లుఁ డటంచు పెద్దలీ
వరుస సమర్థనీయమగు బాంధవ మీ మన కౌనుగాక యి
ట్లెఱువదిదాఁక మాని యిపు డావటఁ గోరఁగనేల యన్న నో
నరవర! 'బిల్లి' కారణమునన్ బదియేను దినాలలోన నా
పిఱుతకుఁ బెండ్లిసేయుటపని చేకుఱె, నీశుభకార్యమున్ మహా
త్తరమగఁ జేసికోఁదలఁచి తావకదర్శన మాచరించి నే
నటిమఱిఁ గోరఁగావలసె, నంతియకాని వృథాగ నేదియో
'పరిచితు' లన్న హేతువునఁ బ్రార్థన సేసెడిపాటిగాదు, నా
నరణిని రామచంద్రనృపసత్తముఁ డాయనకన్న మిన్న శ్రీ
కరుఁ డల నారభూపతియుఁ, గామితదాత తదీయసోదరుం
డురుగుణశాలి సింహగిరి నుండెడి దేవునిపేర నేలు భూ
వరుఁడును రాజగోపనరపాలుఁడుఁ గూడ నెఱుంగుటన్ సవి
స్తరముగ మీకడన్ మనవి సల్పక యింతటితో ముగింతు, నీ
సురుచిర సేవలన్ దనియు శోభనశైలనివాసి నీకు మేల్
సిరియును మేటిసంపదయు శ్రేయము నాయువుఁ గూర్చి సద్యశో
భరము నొసంగి పోచుత మపారకృపారసభావ మేర్పడఞ్. 755

—• మాజీపీడు, శ్రీ అశ్వారావుపేటదొరగారు •—

చ. తలచుగ నీదుసద్గుణవితానము నే వినుచుంటిఁ గాని ని
న్నరయఁగలే దొకప్పుడును, నాదరమొప్పఁగ మీపురంబువా
రటిమఱి "వార్షికోత్సవ" మటంచును "దానికి వచ్చి మేము సా
దరముగఁజేయు గౌరవము తత్పరతన్ గొనుఁ" డంచు సారెకుఞ్
గర మనురాగ ముప్పతిలఁగా లిఖియించిరిగాని మున్నెపుం
బరిసరమౌటచేఁ జౌరవపాటమి మీపురి కేగలేదు, వాక్
సరసతగల్గువారి నెసకమ్మునఁ జూడకయుంట సత్కవీ
శ్వరులకుఁ గాదు ధర్మమని స్వాంతమునందుఁ దలంచు నంతఁ గొం
దఱు "భవదీయదర్శనము తప్పకచేయుట యుక్త" మంచుఁ జె

ప్పిరి, యిపు డాత్మజాతునకుఁ బెండిలిసేయు ప్రసక్తికల్మి ని
ప్పురమున కేగుదెంచితి నపూర్వము నీదగుదర్శనంబు న
క్కఱమెయిఁ జేయుచుంటిఁ ద్వరగాఁ జనఁగావలె వేఁటాకష్టు నీ
దరిసెన మాచరించి మ దుదారకవిత్వము కొంత విన్చి నీ
కురుముదమున్ ఘటించుతలఁ పున్నది, చూచుట క్రొత్తగాని మున్
పరిచితుఁడైన శ్రీవరదపార్థివు నల్లుఁడ వీవు నాయెడన్
గర మనురాగి యానృపతికాంతుఁడు శ్రీకర ! కందిమళ్ళ స
ద్వరకులదీప ! నీకు భగవంతుఁడు సర్వవిధాలఁ దోడుగా
వఱలి భవద్గుణమ్ములకు వన్నియ వెట్టెడుఁగాక నిచ్చలున్. 751

—• నూజివీడు, శ్రీ వరదరాజాప్పరావుగారి జనానా
శ్రీ చెల్లాయమ్మారావుగారు •—

ఉ. ఈ విషయమ్ము సుంత మనయేలిక శ్రీయుత చెల్లమాంబికా
దేవికి విన్నవింపఁ దల దేవియు నన్ను నెఱింగియుంట సం
భావిత; మెట్లనన్, సుగుణ భవ్యుఁడు శ్రీ వరదాప్పరావు తా
నావలనన్ బ్రియమ్ము మదినాటిన తేఁడులలో నొకండు, నే
నావగ రామచంద్రినృపు నగ్రిమునం దవధాననై పుణిన్
జేవవలిర్పఁ జూపునెడఁ జేతమునం గడుమెచ్చు ప్రోడ, య
ట్లీవగ భర్త నెమ్మదికి నెక్కిన నన్నలయమ్మ కొంచెమే
నీ వినకుండ, దింకొకటి, కృష్ణుని రాధను గూర్చి కబ్బమున్
భూవినుతమ్ముగా సలిపి మొన్న కృతిన్ దమ కిచ్చినట్టి భూ
దేవసుతుండు నాకడనె దివ్యులబాస పఠించె, నెట్టులే
నీ వినియుండవచ్చు నను నిర్మలమానస దేవిగారు, త
ద్భావము "ధర్మ కార్యములఁ దద్దయు సక్త" మటంచుఁ బూర్తిగా
నీవల నెల్లరుం బలుక నే విని సంతసమందుచుంటి, యా
త్రావిధి నెల్లదేవతల దర్శనముం బొనరించి జన్మమున్
బావన మాచరించె నల పార్థివలక్ష్మి నుతింపఁజెల్లు, నా

భావము మత్కుమారుని వివాహనిమిత్తము నాదుగాకయున్
భావుకభావ యాపె చెపి వైవుడు పిమ్మటి కార్య మెట్టుగాఁ
గావలె నట్టులే యగును, గార్యముపట్టునఁ జింతలేమ; గీ
తావిదుఁడైన కృష్ణుఁ డెటు తా నుడివెన్ వినలేదె ? "కృత్యమున్
నీవొనరింపు మాపయిని నీ కధికారము లే" దనండె ! స
ద్భావిభురాణి యాపె, కవిపుంగవుఁ డీతఁడు కోరవచ్చు నా
దేవియు నీయవచ్చు; గణుతింప నొకప్పుడు యాచ్న వ్యర్థమై
పోవుటయున్ ఘటించు నటుపోయినయప్పుడుఁగూడ నిట్టిచో
నేవిధమైన లాఘవము నించుకయున్ గనుపట్ట దంచు స
ద్ధీవరులండ్రు, గాన నిటు దేవికి విన్నప మాచరించితిన్
బోవలయున్ గడుంద్వరగ మూర్తము దాపగుచున్నదయ్య ! యో
ధీవర ! కందిమళ్ళకులదివ్యమణీ ! రమణీయధోరణీ ! 757

—• లక్ష్మీనర్సాపురము. శ్రీ రావురామాయమ్మ జమీందారిణిగారు •—

చ. "ఎనిమిదియేండ్లదాఁక మిము నిమ్మని వేఁడ ధనంబు, 'బ్యాంకి' లో
నునిచినపోల్కి మీకడనె నిల్వ యొనర్పఁ గలాఁడఁ బుత్రికా
జనులకుఁ బెండ్లిగాని తనుజన్మని యయ్యుపనీతిగాని నే
నెనిమిదియేండ్లలోపున నెటేనియుఁ జేయమి నిక్కువం" బటం
చును లిఖియించి యుంటి నది సూనృతబుద్ధి లిఖించినట్టి ద
య్యును భగవంతుపై దమునన్ మఱియేమియు ! పుత్రికాద్వయం
బున కిపుడే వివాహములు ముఖ్యముగా నొనరింపఁ దప్పవ
య్యెను, శుభకాలముల్ దఱియుచే యిట ముఖ్య నిమిత్త మౌటఁ ధ
క్కన యల బాహ్యహేతువు లకించనతాగతికల్మి వాకొనన్
మనమున నెంచ నో జనని ! మానవుఁ డెవ్వఁడు గడ్డిపోఁచ ! యే
పనికిని దైవయత్నమె స్వభావసమర్థము "నేనొనర్చువాఁ
డను మఱి నే సమర్థుఁడ నిటం గడు, నాదగు తెల్వికల్మి ని
ప్పని నెఱవేతె" నంచు నిటు వాకొనువారలు వెఱ్ఱివాండ్రు, తా

ననఁగ నిమిత్తమాత్రి మెదియైనను దైవముచైది బల్మిక
ల్మిని నెఱవేఱు. నీనుడికి మించినమాట మఱొండులేదు. శా
స్త్రనియమముల్ కడుం జదివి సాహితియందు గడించినట్టిఫే
ఖనులగు పండితుల్ సకలకార్యము లమ్మహితాత్ముఁడైన దే
వునివశమం దమర్చికొని పూర్వపుఁగాలమునుండియున్ జరిం
చినవిషయమ్ము ప్రాజ్ఞమయి చెన్నెసలారెడి మీమనోంబుజ
మ్మునకు నగోచరంబె! విను, మొట్టమొదల్ పెదకూఁతుపెండిలిం
టొనరుప రంగమం దడుగు పూర్తిగఁ బెట్టితి నెవ్వఁడా సుక
న్యను “దనకొడ్కుకి” మ్మనుచు నన్ను బలాత్కృతిఁ జేసి దాన చిం
పెనో! యొకహేతువై యతఁడె వెన్బడి యట్టె సురింగె; నంత నం
దనునకుఁ బెండ్లిగా నది తనంత యనంతరమందు మాఱె, నే
వెనుక లిఖించుపద్దెమున విస్తృతిమై నది మీకు వ్రాయుటన్
మనవిగ దాని నియ్యెడల మాటికిఁ బెంచి లిఖింప, నట్లు పు
త్రునకు వివాహమున్ సలిపి తోరపుగారవు సంతసమ్మునన్
మనుగుడు పాహరించుచును మచ్చెషురిన్ వసియించుచుండఁగా
విను “పెదకన్నె చెల్లెలికిఁ బెండిలిసేయక తప్ప” దంచు నా
చినసుకుమారి ‘‘నిత్తు’’ నని చెప్పిన కుఱ్ఱనితాత వచ్చి న
న్నను గడుదీనదీనముగ నూఱువిధాలఁ బునఃపునఃపునః
పునరనుమోదమున్ గొలుపఁబూనె, నతం డతివృద్ధుఁడై యటుల్
నను బ్రతిమాలఁగాఁ దుదకు నామది యందుల కొప్పెఁగాని యా
చినసుకుమారి యప్ప కెటఁ జెల్వఁడు సిద్ధముగామి నందుకై
మొనఁ గడియమ్మునుండి యిట మోదమెలర్పఁగ నల్లుకుఱ్ఱకై
పనిఁగొని గేహముల్ వెదకవచ్చితి, నొక్కని బాల్యపున్ వయ
స్సునఁ జెలువారువానిఁ దగుసొత్తును వృత్తియు నున్నవాని న
ల్లునిగ షడబ్దపున్ వయసులో నలరారెడి కన్నెకోసమై
మనఁగొని నే వరించితిని బూర్వులయాచరణంబు పట్టి; యి
ష్పని యిఁకఁ దల్లిదండ్రులకుఁ బట్టదు, కన్నెలమీదనే ప్రవ

ర్తన మొనరించు "నేస్త్రీయులు" రా, నదె "ప్రౌఢలకే వివాహ" మం
చును మన శారదాఘనుఁడు శుద్ధమహాకలికాలపుం బ్రవ
ర్తన కనుకూలుఁ డేర్పఱచి దానిఁ బ్రభుత్వమహాధికారిశా
సనముగఁ జేయఁజేసిన యసత్కృతికారణమై, యెటో పురా
తనకృతశాస్త్రముల్ చదివి తద్దయు వృద్ధత గాంచి తత్పురా
తనమతభిన్నమౌ చెడుమతమ్మన నేగుటకన్నఁ దత్పురా
తనమతరీతి నేగుటయె తజ్ఞహితమ్మని యెంచినాఁడ, "ఫా
ల్గునబహుళమ్మునన్ శుభమగున్ భగవత్కృప, త్వత్కృపారసం
బును దగుసాయమున్ సలుపఁ బూనినచో" నని విన్నవింతు, వె
న్కను బెదకుఱ్ఱపెండ్లికి ధనంబిడునాఁటికి నిల్వ లెక్కగ
న్గొనఁ బదొకొండువందలకుఁ గొండొకమించెడి' మొన్నఁ జిన్నికు
ఱ్ఱని శుభపున్ మహమ్మునకు ద్రవ్యము తా మిడునాఁటి కంతయే
ధనము భవత్సమీపమునఁ దాఁ బెరిఁగెన్ గణియించిచూడ, నా
ధనము భవత్సమక్షమునఁ దద్దయు వడ్డులఁ బెండ్లిపేరఁటాల్
గొనకొని కోరుచుండు ననుకొందును, నన్నిటు మన్నుచున్న నీ
ఘనతకుఁ బుత్రపౌత్రుల కఖండపుశోభనముల్ ఘటించు మేల్
దినములు వచ్చుఁగాత మని దీవనలన్ బొనరించి యింతతో
మనవి ముగింతు. రావుకులమండన! శ్రీయుతిరామమాంబ! నీ
వనిశము గోద్విజార్థమున నాచరణం బొనరించుపున్నెముల్
మనుచుత నీమనన్వయపుమార్గినికిఁ బూలును గాయలున్ బొసం
గునటు ఘటించి యక్కతన గొప్పముదం బది నీకుఁ గల్గుతన్. 758

—• లక్ష్మీనర్సాపురము, శ్రీరావు చెల్లయ్యమ్మారావు జమీందారిణీగారు •—

చ. మును పొకసారి చేసితివి మోద మెలర్పఁగ నీదు దర్శనం
బును మరలన్ ఘటించినది పున్నెము మంచిది యౌట, బుద్ధికిన్
ఘనతకు యోగ్యతాగతి కఖండవదాన్యత కెందు మంత్రిపున్
బనికి భవత్సమానులు నృపాలురలో మగవారియంచె రే

దన నీక నాఁడువారి విషయమ్మిట నెత్తగనేల నీకు న
చ్చిన చిరజీవితం బది వివేచననేయఁగ నీమరాజ్యమం
దున వసియించు లోకుల యనూనపురాకృతపుణ్య మంచు నే
మనమున నెంతు, రాజ్యము లమర్చిన దేవుఁడు తెల్వితేటలన్
దనరఁగనీఁడు, తెల్వి నిడి దైవము దానిని మంచిమంచి వ
ర్తన కనుకూలమౌ గతికిఁ దార్పఁగనీయఁడు, ద్రవ్యమెంతయై
నను దృణ మట్లు తాము గణనం బొనరింపక వెచ్చపెట్టు ధీ
ఘనులకుఁ గూడఁ గార్యము నకార్య మెఱుంగనిచో వృథాపకీ
ర్తిని నది గూర్చు, శాస్త్రముల ధీవరు లేగతి వ్రాసియుంచిరో
యని కనుఁబెద్దలౌ బుధుల నావృతిమైఁ గనుఁగొంచుఁ జేయు న
మ్మనుజుని దానముల్ జగతి మాన్యత కెక్కెడిఁగాని యన్యముల్
ఘనజనగర్హితమ్ములయి కాలునిఁబ్రోలికి దారిచూపు; వా
ని నిట నుదాహరింతు, నొకనిన్ మఱియెప్పుడొ కాటువేసెఁ దా
శునక మొకండు, దానికయి సొమ్ము సమస్తము స్వీయ మాతఁడా
శునకపుజాతిఁ జంపు నల క్షుద్రుల కీ నియమించిపోయె నం
ట! నెమకి కుక్క లన్నిటిఁ గటా! యతఁ డిచ్చినసొమ్ము పెంచి యీ
దినములఁ జంపుచుందురు పదింబది కృత్యవివేక శూన్యతం
బనిగొని యిట్టి ధర్మములపా లొనరించు ధనాఢ్యు లయ్యయో!
ధనమిడి చేసినో గొనెడి తజ్ఞులబిడ్డలొ లేక తంత్రులో
యనఁదగు; భారతంబు భవదాత్మ యెఱింగినదే కదా! యటన్
ముని యొకరుండు సర్పగణమున్ దనతండ్రి మృతిం దలంచి చం
పను బనిఁబూని జన్నము నభంగురమౌ గతిఁ జేయు రాజచం
ద్రుని జనమేజయున్ దనమృదుపత్రికటోక్తుల మాన్పెఁ గాదె! యే
పని యిహలోకసాధనమొ పైజననంబున కేది ముఖ్యసా
ధనమొ? యెఱింగి సల్పు నల ధర్మము ధర్మము, తక్కుధర్మముల్
పొనరుచుకంటె నొక్కయెడ భూద్రముపోల్కి వసించు టొప్పు, నీ
మన మిటుఁ గల్గు భావము సమస్త మెఱుంగుట విస్తరింప నో

జననీ ! భవద్ధనం బెపుడు సజ్జనసమ్మతిగా వ్యయించి తీ
విను బినన్నాఁటనుండియు గణించి భజించిన రామయాంబ నీ
యనుఁగు స్నుషన్ భవద్గుణము లంటె సమస్తము, నిన్నుఁగొల్చి పే
ర్మనమెయి నీదుశిక్షల ననారతమున్ గొనికూడఁ గొంద ఱే
మనఁదగు నన్యథాపథమునందుఁ జరించెద, రేమి సేయవ
చ్చును ? గురుఁ డెల్లశిష్యులకు సూనృతమార్గమునన్ గళాగతుల్
వినుచు, గ్రహింత్రు కొందఱు వివేకులు, కొందఱు తప్పుత్రోవలన్
జన దొరకొంద్రు, దేశికుని శక్యము గాదల వారిఁ దిద్ద; ద్రో
ణునికడ విద్యనేర్చిన యనుంగులు శిష్యులు పేనవేల్, సుయో
ధనుఁ డెటు లయ్యె, నర్జునుఁడు దా నెటులయ్యె నెఱుంగవే గురున్
జనకుని దల్లినిం దలఁచి శాస్త్రవిరుద్ధముగాక యుండు పో
ల్కిన బొనరించుధర్మములు కేవలమున్ సుయశస్కరంబులై
మనుచు నిటన్ మఱొక్కటఁ బ్రమాద మొకింతయులేని ఫక్కి, స
ర్వనియతిఁ జేయునట్టి వుభయత్రి విరుద్ధములై వృథావ్యయ
మ్మనకగుఁ గారకమ్ము లిది ముగ్ధ లెఱుంగరు, నిన్ను వంటి బల్
సునిశితధర్మమూర్తులకు లోకసమాదృత కార్యముల్ స్ఫురిం
చును, స్ఫురియింప వన్యుల, కసూయయుఁగూడ సుధర్మవర్తులం
దున జనియించు నిక్కలిని; దొల్లిటిపెద్దలె చాలదూఱి ర
ప్పని మనకేల ? యిప్పుడును "భవ్యగుణుల్ సెడ" రంచువారె తా
మనువుగ వ్రాసియుంచి, రుభయత్రి యశఃప్రదమైన నీదు వ
ర్తనకు జయమ్ము గల్గుత ముదారయశోనిధి ! చెల్లయాంబ ! నం
దనువి వివాహమున్ సలిపినాఁడను మీదయకల్మి నేఁడు నం
దనలకుఁ బెండ్లిసేయుపని నాకు నయత్నము సిద్ధమయ్యె 'బి
ల్లను' వినియుందురే గద ! కులోకుల దుర్మతి కారణంబుగాఁ
బనుపడె నిద్ది, యిక్కటనఁ బాలనుపీడని బాలకేవిఁ బెం
డ్లిని జరిగించుచుండి రవ్వలీలగ మూర్తములుంచి పీధుద

ర్శనమున కట్టికార్యము వెసన్ దలపెట్టియె యేను వచ్చితిన్
ననుఁ గడుఁబెద్దచూపునఁ గనం గడుఁ గోరెద మిమ్ము నెమ్మెయిన్. 759

శా. ఏమో చెప్పఁగఁ జాలఁగాని మును పెన్నో నాళ్ళకుం బూర్వ మీ
గ్రామమ్మందు వసించియున్ భవదుదారత్వంబు సుంతేవియున్
నామీఁదంబ్రసరించున ట్లొనరుపన్ నాతల్లి ! నే నేర, నా
పైమాటన్ వచియించెదన్ విను మదంబా ! రావు చెల్లాంబికా ! 760

శా. ఆపై నాకుఁ దనూభవుం డుదయమౌ నక్కాల మేతెంచె, నీ
కాపట్లన్ వెస షష్టిపూర్తిసమయంబై నాకు నాహ్వానమున్
బ్రాపించెన్, జ్వరపీడితుండనయియున్ బ్రస్థానమున్ జేసితిన్
మీ పూర్ణంబగు సత్కృతిన్ గొనుచు నెమ్మిం బోతి నేనూరికిన్. 761

చ. అదిమొద లప్పుడప్పు డెటులైనను మీధన మేను బూర్తిగా
నవనగువేళఁ గైకొనుచు నన్ని శుభంబులు సల్పుచుంటి నీ
ముద మిపు డెత్తికోలునకు ముఖ్యనిమిత్తము విమ్మ, మీధనం
బదియు మదీయసంతతికి నర్వణ మిక్కవికన్న నమ్మరో ! 762

ఉ. హేతువు సెప్పుమమ్మ ! యిటు లేల ఘటించునొ దేవి ! మత్తనూ
జాతులపట్ల నీదయ పొసంగుట నన్నునుబట్టి కాదె ! యే
మీ తొలి గర్భముల్ మొలుచు నేర్పడు నాపయిఁ గొమ్ము లమ్మరో !
భూతలమందు వాఁడి పయిఁబుట్టిన కొమ్ములయందె చొప్పడున్. 763

—॰ చల్లపల్లి శ్రీ చల్లపల్లి కుమారరాజావారి వివాహము ॰—

మ. తననామంబు కులక్రమాగతముగాఁ దాల్పన్ వ్రతం బూని త
న్ననయమ్మున్ భజియించువాఁడునయి తన్నారాధ్య ధ్యానించు భ
క్తుని శ్రీయుక్తు వివాహదీక్షితు ఘనున్ దుర్గాంబికాసంగతున్
మనుచుంగావుత శంకరుండు శివరామ శ్రీ ప్రసాదప్రభున్. 764

మ. కలుఁగన్ వచ్చును దుర్గలున్ శివులుం లోకమ్మం దనేకుల్ కడున్
లలిత శ్రీకులుగాఁగఁ జొప్పడుటయున్ గాపచ్చు నందందుఁ, బెం

డిలి యా యిర్వురకే ఘటించు టది యెంతే దుర్ఘటంబౌర! బ్ర
హ్మ లలిన్ మిమ్ముల నేర్చికూర్చెఁ జుమీ రాజా! చల్లపల్లీశ్వరా!!

శా. మీ కాయుష్యము మీ కనామయము పేర్మిన్ మీకు ధర్మ ప్రజా
పాలికత్వమ్మును క్షీరనీరములరేపన్ మీకు మేల్పొత్తునుం
జేకూరం గరుణించి మీ కెపుడుఁ దాఁ జేయూఁతగానుండి మా
శ్రీకుల్ గా వొనరింతురుగాక యల గౌరీభర్తయున్ గౌరియున్. ౭౬౬

చ. నిముఁ గనుఁగొంచు బందరున నే నివసించెడినాళ్ళలోన, మీ
జనకునిఁగూడ నచ్చటనె సారెకుసారెకుఁ గాంచువాఁడ నా
దినములయందె యెక్కుడుగఁ దేవకు దేవకు నీదుతాత ద
ర్శనము నొనర్చువాఁడ నటు చాల ననేహస మేగె, నెన్నఁడుం
బనివడ దించుకేవి యొక పైసయు "నాకిదు" మంచు నాఁడు యా
చన యొనరింపలేద, పయి స్వస్థల మేగితి బందరున్ త్యజిం
చి, నిజనివాసమం దునికిఁ జేయుచునుండెడినాళ్ళలోన మీ
జనకుఁడు రాజ్యభారము బుజంబునఁ బూనెడికాల మేగుదెం
చె, నపుడు నాయెడం గలుగు స్నేహముకల్మిని బిల్వనంపె న
ఘనతరకీర్తియై మిగుల శోభిలు మీజనకుండు, శిష్యులం
గొని చనుదెంచినాఁడ నను గొప్పగ నాయనఘుండు చూచిమ
న్నన యొనరించె, సంతసమునన్ స్వపురమ్మున కేగి పిమ్మటం
బనిగొని యెప్పు నాతఁ డిడువార్షికమున్ గ్రహియింప రాఁగ లే,
దనయము వార్ధకమ్ము శిరమందు నివాసమొనర్చు కారణం
బునఁ బొరుగూరికిం జనెడిపూనిక చాలక; యంతలోన ని
న్నును వరియించె రాజ్యరమ, నొక్కొ లిఖింపఁగఁజేసి తీపు శో
భనఘనలేఖ, నాయనుఁగుఁ బట్టికిఁ బెండిలినేఁత సైత మీ
దినములయంద తారసిలె, దీనికి దానికి నుంత యంతరం
బొనరెడిఁ గాని యిట్టి పనులున్నతటిన్ గృహమంద యుండి య
ప్పని కనువైన కృత్యముల పట్టున భూజను లుండ్రుగాని యే

జనవరు పెండ్లికేని౯ జన౯జాలమి నిక్కము లోకరీతి యి
ట్లుసకి యెఱింగియున్ వెనుక నొక్కఁడు నింటఁ గలట్టి కృత్యముల్
పొనరుచు పెద్దలుండమియుఁ బూర్తిగ నేను నెఱింగియున్ భవ
ద్ఘనతకు నీదు మాతులుఁ డఖండవదాన్యుఁడు చంద్రమౌళిరా
డ్ఘనతకుఁ బైని "నాయఁడమ" గారను వేంకటకృష్ణశౌరి స
ద్ఘనతకు లోఁగి యింటఁగలకార్యభరమ్ము గణింప కావటఁ
నిను సకళత్రు దీవనల నేఁడు కృతార్థు నొనర్ప వచ్చినాఁ
డను, నవకాశమిచ్చి ప్రకటమ్ముగ నాదువచఃప్రచారమున్
విని నను "వేగఁ బంపు" మని వేఁడెదఁ; బెండ్లికుమారుఁడైన నా
యనుఁగు సుతుండుఁగూడ భవదద్భుతభవ్యవివాహశోభనం
బును గన నేగుదెంచె; నొగిఁ బోవలయున్ స్వపురమ్ము, పేర్మి వే
గ నొసఁగుమయ్య యాజ్ఞ, క్షితికంజముఖీహృదయేశ ! యంకిసె
డ్జనపతిచేయువార్షికము సర్వము నేఁటికి లెక్కఁజూచి యి
చ్చినయెడఁ జాల సంతసము చెందెదఁ "బుత్రుని పెండ్లిపర్వమో
చెను శివరామభూమిపతి శేషుని మేటి యుదారతాగుణం"
బని లిఖియింతు ముద్రణమునం దిపు డుండిన "సర్వరాజద
ర్శన" మనుపొత్తమందుఁ, గవివర్యుల కిచ్చిన యీవి యొక్కటే
జనవరు శాశ్వతున్ సలుపఁజాలెడిఁ దక్కిన యీవికన్న నో
జనవర ! "కోరఁగూడ" దని స్వాంతమునందు నెఱింగికూడ నిన్
"ధనమిటు లింతయి" మ్మనుచు ధార్ష్ట్యము చూపుట హక్కుకల్మి యే
యని మదినెంచు; మింతకు యథార్థము తెల్పితి నీమనమ్ము వ
చ్చినగతి నాకు సత్కృతిని జేయుము దానికె సంతసింతు, నో
యనఘ ! భవత్సమీపమునయందుఁ బురార్జితమైన నా ధనం
బు నకట, పూడ్చిపెట్టితినె ! "పూడ్చిన ది" మ్మని యంట, కంకిసె
ణ్మనుజవరేణ్యపుత్ర ! జనమాన్యచరిత్ర ! "ద్విజుండు సంతసం
బునఁ జను టొప్పు రాజిడక పొమ్మ నెనేనియు" నన్నసూక్తి నె
మ్మనమున లేకకా, దటులు మమ్మును గూర్చి లిఖించినట్టి యా

ఘనుఁడె లిఖించె "రాజునకుఁ గాఁ దగ దెందును దృష్టి" యంచుఁ గా
వునఁ గలరీతిఁ దెల్పితిని. బొంపిరిపోవు యశమ్ముఁ గోరుచో
మనమున మద్వచఃకలన మానక నిల్పుము; నీకు సర్వశో
భనములు గల్గ దీవన లపారముగా నిడి యింతతోడ ని
మ్మనవి ముగింతు. నమ్మహిషమర్దని మీయిలువేల్పు నిన్ను స
జ్జనగణనీయుఁగా సలిపి సాఁకుత సర్వవిధాల భూవరా ! 767

మ. ధనమున్ విద్యయు నీకొసంగె నృపతీ ! దైవమ్ము; మాకిచ్చె వి
ద్యను ద్రవ్యంబును దారతమ్యముగఁ దాత్పర్యం బిటం గాంచి యె
వ్వని నెట్టుల్ గనఁ గీర్తిగల్గెడినొ తద్భావంబునం బొమ్ము నీ
కనఘా ! తాదృశకీర్తి యెల్లెడల సర్వాభీష్టసంధాత్రియౌ. 768

మ. ప్రతివారున్ శుభకార్యసంగతుల నేభవ్యాత్ములన్ ముందు సం
స్తుతిఁ గావించి కృతిన్ బ్రివర్తిలుదు రాశుంభచ్ఛుభాధాయిదం
పతినామమ్ములవారు మీ రిరువురున్, భద్రమ్ము మీ కబ్బుతన్
సతి, దుర్గాంబ ! వరుండ యోశిపుఁడు! నిచ్చల్ వర్ధిలుం డిమ్ములన్. 769

మ. శివనామమ్ము శివాంగనామణియు నీచేఁ జిక్కె, నీకున్న పై
భవ మేరాజులకున్న ! దిట్టి నిను సంభావించితిన్ గైతచే
శివమస్త్వస్తు శివం, శివం భవతు తే చేతశ్చ భూయాచ్ఛివం
శివసంకల్పక మస్త్వపత్యమపి తే శ్రీమచ్ఛివక్ష్మాపతే ! 770

శ్లో. ఇతోఽప్యధికసంతోష ఇతోఽప్యధికసద్యశః
ఇతోఽప్యధికరాజ్యం తే సంపద్యేత శివప్రభో ! 771

—• సెలవుసమయమునఁ జెప్పినది •—

శా. ఎం తిమ్మంచు నృపాల ! కోరితినొ నీ న్నే, నంతకున్ మించి న
న్నంతేవాసులతోఁ దనూభవులతో నత్యంతమోదమ్ముతో
సంతోషింపఁగఁజేసి పుచ్చితివి, మత్స్వాంతమ్ము రంజిల్లె, నిం
కెంతే నీయభిషేకమున్ గనుటకై యేతేర యత్నించెదన్. 772

—• చల్లపల్లి సంస్థానము. శ్రీముక్త్యాలరాజుగారు •—

మ. నృపతుల్ లేరనికాదుగాని మఱి ముక్తీశ! నీవంటిదా
నపరుల్ మృగ్యులు, నాఁడు నీపురమునన్ సన్న్యాసికిన్ భక్తిమై
నుపచారమ్ము లొనర్చు నుత్సవమునం దోహో! భవత్పాణిప
ద్మపుసౌభాగ్యము నేమిచెప్పఁగలఁ దత్తద్దానముల్ సేయుచో. 773

మ. ఎవరో మస్కరి వచ్చె నే యనుము మీ కృష్ణాసరిద్వంతీతటం
బవలోకింప, నమస్కరించియు సపర్యల్ సల్పినం జాలుఁగా!
కవులన్ గాయకులన్ దదన్యులను వేడ్కన్ బిల్వఁగానేల? త
ద్వ్యవసాయమ్మున కంత యీవి యిడనేలా? చంద్రమౌళీశ్వరా! 774

మ. అదినీవెప్డు పఠించితో తెలుపుమయ్యా! నాకు; నాముక్తమా
ల్యదలో వ్రాసెను గృష్ణరాయలు మహౌదార్యస్వరూపమ్ము నీ
కదియుం గాదను కార్య, మాతఁడు భవిష్యద్వేత్తయై వ్రాసెనం
చెద నూహింతు భవద్వదాన్యతకు నీ డెచ్చోట నేఁ గానమిన్. 775

మ. కొమరున్ బెండ్లికుమారుఁ జేసినపుడో కూఁతున్ వివాహాఖ్య భ
ద్రమహాపీఠి నలంకరించినపుడో తత్తాదృగుద్దామదా
తృమహత్త్వంబు సమర్థనీయమగు నంతేకాని సన్న్యాసిభై
క్ష్యమునాఁ డింత వ్యయమ్మొనర్చెడి వదాన్యశ్రేష్ఠులుం గల్గిరే! 776

చ. ఒకనూఱా రిడఁజాలదొక్కఁ! మఱి మూఁడో నాలుగో యిచ్చియున్
ప్రకటింపన్ దొరకోవు తృప్తి, పయి వస్త్రాలన్ననో పట్టువీ
యక సామాన్యపుజాతి వీయ, వుభయ మ్మర్పించియే తీఱి, తె
న్నక యెట్లుండఁగవచ్చు నీ వితరణానందంబు మౌళీశ్వరా! 777

—• చల్లపల్లి. శ్రీచల్లపల్లిరాజావారి పట్టాభిషేకము •—

మ. సిరియుఞ్ సంపదయున్ బురార్జితములై చెల్వారు నెవ్వాని కీ
శ్వరభావమ్మను దాదృశంబగుచు నెవ్వానిన్ వరించెన్ గళా
పర మేశుం డగునట్టి నీకిపు డహో! పట్టాభిషేకంబు, క్ర
మ్మఱ శ్రేయస్సెది యీఁదలంతు? శివరామ శ్రీప్రసాదప్రభూ! 778

ఉ. "అయినన్ శ్రేయముపట్లఁ దృప్తిఁగనరా" దం డ్రాప్త్య, లట్లౌట నీ
పయి నాకుంగల పేర్మికల్మి నిటు లేఁ బల్కాఁలు దీవింతు నీ
కయ మెల్లప్పు డెసంగుఁగాక, సదపత్యశ్రీయు వర్ధిల్లుఁ గా
క ! యథార్థం బగుఁగాక వేంకటకవీట్కావ్యోక్తి రాజోత్తమా ! 779

ఉ. మొనఁ జనుదెంచి పెండ్లిమహముం గని సంతసమంది నీ యొస
ర్చిన బహుమానముం గొని విశేష ముదంబునుగాంచి యాధనం
బును మరికొంత ద్రవ్యమును బుత్రుని పెండ్లికిఁగా వ్యయించి యా
పని యొకకొంత సల్పి యటుపైఁగల శేషము పూర్తిసేఁత యిం
టను గలవారిపైనిడి తటాలున నీ సిరిఁ జూడవచ్చితిన్,
నను మును నీవు చూచిన యసర్షపుఁ జూపది కారణమ్ముగాఁ
గనుపడి, పుత్రుపెండిలికిఁ బైతరమై యిటఁదెచ్చె నన్నహో
జనవర ! మూఁడునాళ్ళనుమి ! సర్వులకున్ ముదమిచ్చునట్టి వే
వనఁ, దన పెండ్లియున్ దనదు నాత్మజు పెండ్లియుఁ దాను భార్యతో
నెనయుట కాద్యమౌ దినము; నియ్యవియే పరమోత్తమమ్ములై
జనుల కపారమోదము నొసంగెడి నంచు రసజ్ఞు లందు; రీ
దినముల నేరుగాని పరదేశము లేగరు, నేనొ, యాత్మనం
దనుని వివాహపున్ మహమునం దగులూనియుఁ దన్మయుండనై
మనమున నీదు నుత్సవపుమాట నొకింతయు విస్మరింపమిన్
గొనకొని యిందువచ్చు టొనఁగూడె, ధనార్జనకాదు హేతు, వా
ర్జన మది పూర్వమే జరగె సల్పిన నీయపురూపపుఙ్ మహా
ఘనబహుమానమందుఁ గల గౌరవ మిప్డు కృతజ్ఞతాగతిన్
గనుపడఁజేయ నన్నిటకుఁ గ్రమ్మఱఁ దెచ్చెనటంచు నీమన
మ్మునఁ దలఁపంగదయ్య ! యటు మున్ను వచించితి నీదు భృత్యులఙ్
గనుగొను మప్డు నాకు నతిగౌరవ మొప్పఁగఁజేయు సత్కృతిం
గొను సమయమ్మునం దిటులుగూడ వచించితి; నెట్లటన్న: "మీ
జనపతి నా కొసంగిన యశస్కరమౌ బహుమాన మెంతయున్

నను నధమర్ణుఁగా సలిపె నాయమ యాఋణమీఁగు పొంటె నం
దనుని వివాహమేని గణనం బొనరింపక యేగుదెంచు" టం
చును, నటునెప్పి నీమహముఁ జూడఁగ వచ్చితి, "నీఁగితిన్ ఋణం"
బని మది గర్వమందెద, వయస్సునఁ జిన్నవె యయ్యు మేటి వ
ర్తనమునఁ జాలఁ బెద్దవయి తజ్ఞుల మెప్పును గాంచఁగల్గు ని
న్నును నభిషేకపూతుని ననుంగుఁ గుమారునివంటివానిఁగాఁ
గని సతముం భవాని శితికంఠుఁడు సర్వవిధాలఁ బేర్మిమై
మనుతురుగాక! నామనవి మానసమందిడి యంకినీణ్నృపా
లుని సుకుమార! యక్కతన లోకుల యాదృతిఁ గాంత్రుగావుతన్. 780

క. అప్పువడియుంటి తేనికి
నెప్పుడిదిన్ దీని నీఁగ నేనేర్తు నటం
చప్పుడు మది యోజించితి
నిప్పటికిఁ గృతార్థభావ మెనసితి నృపతీ! 781

మ. కొడుకుం గోడలుఁ గూర్చుచుట్టములు తక్కుంగల్గు శిష్యాల్ ముదం
బడరన్ నేఁడు గృహప్రవేశమునకై యాత్మీయమౌ గ్రామమున్
గడియమ్మన్ జనియుండవచ్చుఁ గృతవాగ్దానానకున్ నేను లోఁ
బడి యేతెంచితి నోన్నృపాల! యిదె నీపట్టాభిషేకానకున్. 782

సీ. ఇంతమంది కవీంద్రు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది బుధేంద్రు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది నృపేంద్రు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది మనుష్యు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు

తే. గీ. ఇందు నొక్కరుఁ డకృతార్థుఁ డెందులేడు
నీదు పట్టాభిషేకవినోద మెన్న

శక్యమే ? శివరామపర్రిసాదభూప !
అంకినీడుభ్భూమిపతిపుత్ర ! యతిపవిత్ర ! 783

—• వేతొాకప్రసక్తికి సంబంధించిన పద్యములు •—

ఉ. వచ్చిన భావ మిట్టిది నృపాలక ! కొందఱు ప్రాజ్ఞులన్ననో
యిచ్చినసొమ్ము చాలక మఱెయ్యదియో గ్రహియింపవచ్చిన
ట్లిచ్చఁ దలంచుచుండి రని యేను 'గుమానుగ' వింటి. నందుచే
హెచ్చుగ నాకు సిగ్గు జనియించెడి నేమనవచ్చు నక్కటా ! 784

ఉ. ఎప్పటికేవిఁ జాలెడి యహీనపు గౌరవ మాచరించి న
న్నిప్పుడు పంచియుంటి వది యాదటఁ గైకొని లేశమేని నీ
యప్పమరల్పఁగాఁ గలిగినట్టి పనిం బొనరింపకే వెసన్
"జెప్పులలోని కా"ళ్ళను ప్రసిద్ధికి లోనయి యేను బోయితిన్. 785

చ. ఇపు డవకాశమౌనెడల నించుక నీసభ ముచ్చటించి నీ
కపరిమితంపు మోదమిడి యాపయి నేఁ జనుదేరనెంచి కా
ర్యపు భరమున్ గణింపక చరాలున నియ్యెడ కేగుదెంచితిన్
నృప ! సమయం బొసంగఁదగునేని యొసంగఁగదయ్య ! యొయ్యనన్.

ఉ. బందుగులెందఱో గృహముపట్టున నాదగురాక చూచుచుం
దొందరగొల్పుచుందురు మనోగతి వేగమ యేగఁగావలెన్
దొందరవేళలో నిటులు "తొందర నిచ్చితి" నంచు నెంచ కా
నంద మెలర్ప నాసభఁ గనందగు మీ కవకాశమున్నచో. 787

—• సభానంతరము చెప్పిన పద్యములు •—

శా. సంతోషించితి సంతసించితిఁ గడున్ సంతోషమున్ గాంచినా
డెంతో తొందరనుండియున్ దరిసెనం బిప్పించి తీవిప్పు డీ
ప్రాంతంబందలి వాఁడగాఁను గడు దూరస్థుండ వృద్ధుండ నీ
ప్రాంతమ్మందలి వానివింబలె ననున్ భావింపఁగాఁ గోరెదన్. 788

శా. ఎంతో కార్యముకల్గిగాని వృథగా నేతేరఁ గాఁబోను నీ
సంతానానకు బారసాలతటి నుత్సాహమ్ముమై వత్తు నే

నంతేవాసులతోఁ దనూభవులతో, నందాఁక నన్నీవు నీ
స్వాంతమ్మందున విస్మరింపవని నిచ్చల్ నమ్మెదన్ భూవరా ! 789

ఉ. బొబ్బిలిఫేఁడు, నీవొకఁడుఁ బూర్తిగ గౌరవమాచరించి నన్
గొబ్బున నంపినట్టి నృపకుంజరు లింకొక రింతలోన ౘ
ల్లిబ్బరమైన సత్కృతి నృపా ! యొనరించినవారులేరు, నే
నిబ్బడిగా ముదంపడుట కియ్యది యొండొక హేతు విత్తఖిన్. 790

—• పిఠాపురము; శ్రీరావు వేంకటనరసింహారాయవింగారు •—

క. చిరకాలమిత్రు నీ సో
దరు గ్రంథస్థుం బొనర్చి తనిసితి, నిఁక నీ
దు ఋణంబు విరవ వేంకట
నరసింహారాయ ! తీర్ప నామది నెంతున్. 791

చ. సరసుఁడు సాహితీకవనసారమహోదధిమంథనాద్రిబా
సురతరకీర్తి నీయనుఁగు సోదరుఁడౌ నల సూర్యరావు నన్
గురునిగ నెంచు, మేటి కవికోటిపరిసంగము వచ్చినప్పుడొం
డొరు వినఁ, జెప్ప నొప్పఁ, దతఁ డోలి స్వయంబుగ నాకొసంగె న
బ్బురముగ మున్ను గొంతధనమున్, మదిఁ దృప్తివహింపఁ డట్లు మా
సరముగ నిచ్చియుం బిదప సత్కవిగేయుని భావుకున్ యశ
స్కరు నల రామచంద్రనృపకాంతుని నా కనురక్తుఁజేసి యె
వ్వరు నిల నేరికిన్ సలుపఁ జాల్పరఁ జాలనియంత మేలొన
ర్చి రహిని దృప్తిఁజెందె, గుణసింధుఁ డతండు గతించియున్ యశః
పరిణతికల్మి నేఁటికి నభంగురుఁడై వెలుఁగొందుఁ నా ధురం
ధరుఁగన నేను మీ 'విరవ' తప్పక వచ్చెడునప్డు నిన్నొగిం
బరిపరి చూచువాఁడ, గుణభావుకుఁగా మదిఁ గాంచువాఁడ. న
ట్లరిగెను జాలకాల మొకయప్పుడు నిన్ గని దేనిఁగూర్చి నే
నతిముఖి మాటలాడు పని యప్పటిలో ఘటియింపలేద, పై
పరసెను మీసలున్ శిరము నాకును నీకును నంతలోన నీ

శక్యమే ? శివరామప్రసాదభూప !
అంకిసీడ్స్వామిపతిపుత్ర ! యతిపవిత్ర ! 783

—• వేత్రౌకప్రసక్తికి సంబంధించిన పద్యములు •—

ఉ. వచ్చిన భావ మిట్టిది నృపాలక ! కొందఱు ప్రాజ్ఞులన్ననో
యిచ్చినసొమ్ము చాలక మఱెయ్యదియో గ్రహియింపవచ్చిన
ట్లిచ్చఁ దలంచుచుండి రని యేను 'గుమానుగ' వింటి, నందుచే
హెచ్చుగ నాకు సిగ్గు జనియించెడి నేమనవచ్చు నక్కటా ! 784

ఉ. ఎప్పటికేవిఁ జాలెడి యహీనపు గౌరవ మాచరించి న
న్నెప్పుడు పంచియుంటి వది యాదటఁ గైకొని లేశమేని నీ
యప్పుమరల్పఁగాఁ గలిగినట్టి పనిం బొనరింపకే వెసన్
"జెప్పులలోని కా"ళ్ళను ప్రసిద్ధికి లోనయి యేను బోయితిన్. 785

చ. ఇపు డవకాశమౌనెడల నించుక నీసభ ముచ్చటించి నీ
కపరిమితంపు మోదమిడి యాపయి నేఁ జనుదేరనెంచి కా
ర్యపు భరమున్ గణింపక చరాలున నియ్యెడ కేగుదెంచితిన్
నృప ! పమయం బొసంగఁదగునేని యొసంగఁగదయ్య ! యొయ్యనన్.

ఉ. బందుగులెందఱో గృహముపట్టున నాదగురాక చూచుచుం
దొందరగొల్పుచుందురు మనోగతి వేగమ యేగఁగావలెన్
దొందరవేళలో విటులు "తొందర నిచ్చితి" నంచు నెంచ కా
నంద మెలర్ప నాసభఁ గనందగు మీ కవకాశమున్నచో. 787

—• సభానంతరము చెప్పిన పద్యములు •—

శా. సంతోషించితి సంతసించితిఁ గడున్ సంతోషమున్ గాంచినా
నెంతో తొందరనుండియున్ దరిసెనం బిప్పించి తీవిప్పు డీ
ప్రాంతంబందలి వాఁడగాఁను గడు దూరస్థుండ వృద్ధుండ నీ
ప్రాంతమ్మందలి వానివింబలె ననున్ భావింపఁగాఁ గోరెదన్. 788

శా. ఎంతో కార్యముకల్గిగాని వృథగా నేతేరఁ గాఁబోను నీ
పంతానానకు బారసాలతటి నుత్సాహమ్ముమై వత్తు నే

సంతేవాసులతోఁ దనూభవులతో, నందాఁక నన్నీవు నీ
స్వాంతమ్మందున విస్మరింపవని నిచ్చల్ నమ్మెదన్ భూవరా! 789

ఉ. బొబ్బిలిఱేఁడు, నీవొకఁడుఁ బూర్తిగ గౌరవమాచరించి నన్
గొబ్బున నంపినట్టి నృపకుంజరు లింకొక రింతలోన ౚ
ట్లిబ్బురమైన సత్కృతి నృపా! యొనరించినవారులేరు, నే
నిబ్బడిగా ముదంపడుట కియ్యది యొండొక హేతు విత్తఱిన్. 790

—• పిఠాపురము: శ్రీరావు వేంకటనరసింహారాయవింగారు •—

క. చిరకాలమిత్రు నీ సో
దరు గ్రంథస్థుం బొవర్చి తనిసితి, నిఁక నీ
దు ఋణంబు విరవ వేంకట
నరసింహారాయ! తీర్ప నామది నెంతున్. 791

చ. సరసుఁడు సాహితీకవనసారమహోదధిమంధనాద్రిబా
సురతరకీర్తి నీయనుఁగు సోదరుఁడౌ నల సూర్యరావు నన్
గురునిగ నెంచు, మేటి కవికోటిపరిసంగము వచ్చినప్పుడొం
డొరు వినఁ, జెప్ప నొప్పఁ, దతఁ డోలి స్వయంబుగ నాకొసంగె న
బ్బురముగ మున్ను గొంతధనమున్, మదిఁ దృప్తివహింపఁ దట్లు మా
సరముగ నిచ్చియుం బిదవ సత్కవిగేయుని భావుకున్ యశ
స్కరు నల రామచంద్రనృపకాంతుని నా కనురక్తుఁజేసి యొ
వ్వరు నిల నేరికిన్ సలుపఁ జాల్పఁడఁ జాలనియంత మేలొన
ర్చి రహిని దృప్తిఁజెందె, గుణసింధుఁ డతండు గతించియున్ యశః
పరిణతికల్మి నేఁటికి నభంగురుఁడై వెలుఁగొందుఁ నా ధురం
ధరుఁగన నేను మీ 'విరవ' తప్పక వచ్చెడునప్డు నిన్నొగిం
బరిపరి చూచువాఁడ, గుణభావుకుఁగా మదిఁ గాంచువాఁడ- న
ట్లరిగెను జాలకాల మొకయప్పుడు నిన్ గని డేనిఁగూర్చి నే
నతిముఖి మాటలాడు పని యప్పటిలో ఘటియింపలేద, పై
నరనెను మీనలున్ శిరము నాకును నీకును నంతలోన నీ

పరసత నాకుఁ బూర్తిగ వెసం గననయ్యెను, శిష్యుఁడై మహో
దరమున నన్నుఁ జూచిన యుదారుఁడు, తావక సోదరుండు మ
ద్గురుతకు లోఁగి చేసిన సుదుర్ఘటమౌ నల మేలు పూర్తిగా
మఱచెడియంత సంతసము మానక యొక్క క్షణంబులోన వా
విరి నొనరించి నాకుఁ గడువేడుక నీవు ఘటించితీటే, తీ
వురువుగ నాకుఁ జేసిన మహోపకృతిన్ గణియింతు విన్మ, నా
చిఱుతల వద్దులున్ మఱియుఁ జేసిన పెండిలులున్ సమస్తమున్
సురుచిరభంగినై మిగుల శోభఘటించుట కీవు చూపు. నా
దరమె నిమిత్త, మెప్పుడా యుదారగుణాఢ్యుఁడు లచ్చరావు నన్
గుఱిమెయిఁ బిల్వనంపియు నకుంఠితమై ఖరి నాదరించి "యీ
శ్వరియగు రామయాంబ యటు సల్పుట కాజ్ఞయొసంగె" నంచు నా
కరమునఁ గొంత ద్రవ్య మిడి "కైకొనుఁ డీగతి మాసమాసమున్
బొరిఁబొరి" వంచుఁ జెప్పె, నటువోయెను గొండొకకాల, మంతలో
నరిగె నతండు స్వర్గమున, కాపయి శ్రీయుత రామమాంబ నా
గరిమ నెఱింగి వార్షికముగా నొకకొంత యొసంగఁ జొచ్చె వ
త్సరములు మూఁడు నాలు గటు సాగెను, బిమ్మట వార్షికంబు రూ
పఱ ననుకొంచునుండ భగవత్కృపఁ బుత్రిల వద్దు పెండిలుల్
కరముఁ దటస్థమై తఱమఁగా వినుఁగొంచి "భవిష్యదర్థపున్
దెరువెటు" లంచు నే నడుగఁ దేఁకువగల్గిన నీదు సాయపున్
గరిమను జేసి వార్షికము క్రమ్మఱ నెప్డు శుభంబు లబ్బ న
త్తఱి నొనరించు సాయముగఁ దద్దయు మాఱినభంగి దయ్యె, నీ
చరితము సర్వమున్ దెలియు జాణకు శ్రీయుత రామమాంబికా
వరయువతీమతల్లి నరపాలకపత్ని గుణాఢ్య వేంకటే
శ్వరకవి కిచ్చు ద్రవ్య మదిసర్వము నిక్కముగా గణించినన్
విరవనివాసి రావుకులవీరుఁడు వేంకటనారసింహభూ
వరుఁ డిడివట్టిదే యనుచు స్పష్టముగా కెఱుమాను ? నిట్టి నీ
పరిచితి కావ్యరూపమునఁ బాడి ఋణమ్మును దీర్చి కొంట కె

వ్వరు మది మోదమంద! రల భవ్యగుణాఢ్యుఁడు లచ్చరావు సో
దరికి వచించి చేయుట యదార్థము గా, దతఁ డెంతయేనియున్
జొరవఁగలాఁడు, రాజ్ఞి యల సోదరుఁ డెట్లొనరించెనేనిఁ దా
నురక యుపేక్షసేయు టదియున్ మనకున్ విశదంబ, యాతఁడీ
ధర నెడఁబాసినప్పుడె యతం డొనరించినయట్టి జీతమున్
గఱవగుకాలముం దఱిసెఁగాని భవద్గుణవత్త యెంతయో
గుఱి యల రాజ్ఞి కీసుకవికుంజరుపైఁ గలిగించెఁ గాన మూ
గురకు యశస్కరంబయిన గోష్ఠికిఁ దావలమయ్యె నయ్య! నీ
చరితము, రావువంశజలజాతదివాకర! రాజబంధుబం
ధుర! నరసింహరాయ! నినుఁ దొల్లిటికన్నను గొప్పవానిఁగాఁ
బరమకృపాళు వాజనని పాయక చేయుత మెన్నిభంగులన్. 792

—• లక్ష్మీనర్సాపురము, శ్రీచెలికాని సూర్యారావుగారు •—

చ. సుకవిసమాదృతిప్రవణ సూర్యనృపా! చెలికానివంశ్య! నీ
వకుటిలమైన భక్తిమెయి నంపిన శ్రీమతికూఁతు పెండ్లిలే
ఖకుఁ గడు సంతసించితి, సఖుఁడుఁడు శ్రీనవనీతకృష్ణభూ
పకులవతంసు డల్లుఁడగు భాగ్యమహో! మనలక్ష్మిచెల్లయాం
బిక సుకృతాతిరేకత లభించెను నీ, కల గౌరిగన్న య
ది్రికి ఘటియింపలేదె యలదేవుని నల్లునొనర్చుభాగ్య; మిం
తకు మన రామయాంబ జతనంబును మీపినబావ రావు నా
మకకులజుండు మంత్రిమహిమన్ గడునేర్పరి నారసింహరా
ట్ప్రకటతరప్రియత్నమును భావుకమైతగు లక్ష్మి చెల్లయాం
బిక తొలిజన్మపున్ ఫల మమేయము, రంగమ మేటిసాధ్వి తా
వకసతినోఁచు నోములు భవత్సుకృతమ్మును నిన్ని యేకమై
సుకరముగాని రాజకులసోముని వేంకటగిర్యధీశపు
త్రికు నొగి నల్లువానిఁగఁ గరంబు లగింపఁగఁజేసె, నింతయేం
దుకు? నతఁ డెంత తేఁడయినఁ దొల్లిటిచుట్టమ కాఁడె! మేనమా

మకామిరె గాదె నీకామిరె. మానుదమన్నను మానుపెల్లు ? "ము
ద్రికు బుజమొగ్గఁదేనియుఁ బదంపడి పీఁపది యాక్రమించు" పో
లిక యిటఁ గానఁగాఁబడె బలే ! కడు మెచ్చఁగవచ్చు: నిట్టిపెం
డ్లికిఁ జనుదెంచుకన్నను కడింది మహోత్సవ మింకనేది ? నా
కౌకశుభకార్య మింటఁ గల దోకవిమిత్రమ ! మత్తనూజుపెం
డ్లికి మఱి నీ కుమారి రమణీమణిపెండ్లికి మూర్తమొక్కటై
ప్రకటితమైన హేతువున రాఘటియింపకపోయె, నందుచే
నికటమునం దొనర్చెడి పనిన్ దవుదవ్వులనుండి. చేతు. నీ
చుకామిరె భాగ్యపుం గతులతోఁ దులదూఁగుటకేల స్వస్తివా
చకవచనంబు. అల్లుఁడు ప్రసన్న గుణాఢ్యుఁడు రాజమౌళి యా
మెకు విభుఁ డెప్పుడయ్యెనా యమేయముభాగ్యము ప్రబ్బె నప్పుడే;
యిఁక సుకవీంద్ర వాక్యముల కెయ్యది సాధ్యమొ దానికోస మొం
డొక జతనంబు గావలయు. నుత్తమురాలగు నీమకూఁతు రె
న్నికగల పుత్రులం బడసి నిచ్చలు నైదువరాలునై సుకీ
ర్తికి నెలవై మనోహరుని తియ్యము నెయ్యము చాలఁగాంచి నూ
టికిఁ బయిగా సుఖమ్ముగఁ గడిందిగఁ గాఁపుర మాచరించి మా
మకవచనంబు సార్థగతమై జగ మెక్కఁగఁ జేయుఁగావుతన్. 793

—॰ గూటాల-యానాము. శ్రీమన్యం మహాలక్ష్మమ్మ జమీందారిణిగారు ॰—

సీ. పొనరించితివి మహాపుణ్యకార్యమ్ముల
స్వర్గలోకంపు సోపానములుగ
నిచ్చిపుచ్చితి వెందఱెందఱకో భూమి
ఖండమ్ములను మహోద్దండగరిమఁ
గట్టించితివి దేవగణము సంతోషింప
దేవళమ్ముల నెందు దీప్తి యెసఁగఁ
జేయించితివి తృప్తిచెన్నారఁగా మేటి
సంతర్పణముల ననంతములుగ

గీ. గరువమను మాటెఱుంగవు కలిమి గలిగి
సర్వసామాన్యమౌ మనుష్యగతి నుందు
ఎఖిలధర్మమ్ము లెఱుఁగుదు వాత్మయందు
లలితసుగుణకదంబ, శ్రీలక్ష్మమాంబ ! 794

శా. అన్యాయమ్ము రవంత యే నెఱుఁగ వత్యైశ్వర్యపర్యాప్తవ
య్యు న్యత్కించిదపి ప్రదృప్తమతి నీవొక్కప్పుడుం గావు, వే
ల న్యోషిత్తతి నీసమానలు మహాలక్ష్మ్యంబరో ! నాస్తి మేల్
మన్యంవంశము నీకతంబునన సుమ్మా! ధన్యమున్ మాన్యమున్. 795

మ. ఉపవాసమ్ములు తీర్థ సేవనము లెన్నో దేవతాపూజ లె
ల్ల పురాణమ్ముల విన్కి దానము మహాలక్ష్మ్యంబరో ! నీవు మ
న్యపువంశమ్మునఁ గాలుపెట్టిన దినం బారంభమై నేఁటికిన్
సుపథప్రక్రియ సాగుచున్న వొకహెచ్చుం దగ్గు లేకుండఁగన్. 796

ఉ. ఎన్నికుటుంబముల్ మనిచి తెందఱు చుట్టల పెండ్లిపేరఁటా
లన్నిటిఁ జేసి ద్రవ్యమును లక్షల కెచ్చు వ్యయించి, తెందు నీ
వన్నము నెన్ని లక్షల ధరామరకోటికి షడ్రసాప్తసం
పన్నముగాఁగ బెట్టితివి మన్యమువంశము మాన్యమౌటకున్. 797

చ. ఎనుబది యేండ్ల దాపు వయ సిప్పుడు నీకుఁ, బదేడులెట్టులో
జని మొదలేగె నంతట రసాపతి రాణిపదంబుఁ దాల్చి యీ
దినమున కీవొనర్చిన వితీర్ణిని లెక్కయొనర్ప "దుర్వ్యయం
బనునది పైసయేనిఁ గలదా?" యన "నాస్తి" యటంచుఁ జెప్పెదన్.

శా. గోచీవెట్టిన దాది నిన్నెఱుఁగుదున్; గోమట్లనే కాదు, నీ
యాచారమ్మును దాతృతాగరిమ సత్యాసక్తి నిర్గర్వతా
ప్రాచుర్యమ్మును దీనపోషణము నెప్పట్లం గనుంబోల; దే
లా చెప్పన్ వలె నిన్నుఁ జెప్పియు మహాలక్ష్మ్యంబ ! వేఱొక్కరిన్.

ఉ. ఎంతవ్యయించి తంతయును నెన్నిక చేసిన స్వార్థమందు నొ
క్కింతయులేదు నీధన మదెంతటి పున్నెము చేసిపుట్టెనో !

యంతును బొంతునుం గలదె ? యమ్మరో ! నీసుకృతాన; కిట్టి నీ
పంతము జీవితావధిగ భాసిలుఁగావుత మొక్కరీతిగన్. 800

మ. నను బాల్యంబది యాదిగా నెఱిఁగి యేనాఁడేని నే వచ్చినం
తనె వెన్వెంటనె దర్శనం బొసఁగి సంతానంబు కన్నుం గడున్
ఘనసంప్రీతిని జూచు నీయెడల నిక్కమ్మైన నాపేర్మి చ
క్కని నీకీర్తికి శాశ్వతంపు గరిమన్ గల్పించె నీరీతిగన్. 801

చ. జరిగెను జీవితం బిటులు స్వఃపురి కెల్లెడ మెట్లుగా, ననం
తరభవదీయజీవితము తప్పక యీగతినే మహాయశ
స్కరమగు ఫక్కిమై జరుగుఁగాక యటంచును నీకు వేంకటే
శ్వరకవి దీవనల్ సలిపి పద్దెము లంపె, గ్రహింపు మమ్మరో ! 802

—• నూజివీడు, శ్రీ తేలప్రోలు జమీందారుగారు •—

చ. కొమరుని పెండ్లి కప్డు మిముఁ గోరితిఁ "దోఁచినపట్టు నాకు సా
యము నొనరింపుఁ"డం, చటు సహాయమొనర్పఁగఁ దాము నెమ్మితో
సమయమొనర్చి చేయుతఱి సందియమొందు దటస్థమై రయం
బమర భవద్వితీర్ణమగు నర్థము ముట్టకయే స్వకీయగ్రా
మము కడియమ్ము వే చనినమాట భవన్మనమే యెఱుంగు; నె
ట్లు మొదట విన్నవించితి నటుల్ లవలేశముఁ దప్పకుండఁగాఁ
గొమరు వివాహ మయ్యదియుఁ గొండొకలోపము లేక యయ్యె; లో
పము గనుపట్టమిన్ దమకు వ్రాసి ధనంబును గోరనైతిఁ, గా
ర్య మయినమీఁదఁ గోరి ధన మార్జనచేసెడివాఁడఁగా నటం
చమలినమైన మీహృదయ మస్మదుదంత మెఱింగియుంటచే
శ్రమపడి దానికై యిచట సాక్ష్యము గీక్ష్యముచూపనెంచ, నా
క్రమము సమస్తమున్ దెలియఁగాఁ గల రీ రని యెంచి; ప్రస్తుత
ప్రమదము విన్నవింతు నరపాలశిరోమణి ! తేలప్రోలి భూ
రమణ ! కొమార్త లిర్వురకు రాణమెయిన్ దగఁ బెండ్లిసేయు మూ
ర్తము దరికేగుదెంచె, నిది దైవకృతమ్మని యెంతు నేను స్వ

ష్నమునెడఁగూడ "నీశుభము భావ్యమునేఁ" డని యెంచలేము, "దై
వము సమకూర్చు సర్వ" మని ప్రాజ్ఞులు వల్కుట యెంచిచూడ స
త్యముగద ! శోభనాద్రివసుధాసుముఖీధవ ! నేఁడు తన్నిమి
త్తము దరిసింపవచ్చితిని దమ్ములుపిమ్మటిమాట మీదు చి
త్తమును మదీయభాగ్యమును, దైవమె దానికిఁగూడఁ బోఁట; ద్ర
వ్యమపుడు గొన్నచో సుతువివాహము పట్టున దానిఁ గూడ వె
చ్చము నొనరించియుందు, నటు సల్పక నిల్పుటఁజేసి నేఁడు మీ
సముఖము కల్పవృక్షమయి చాలఁగ నా కుపకారియయ్యె నం
చు ముదముఁ జెందుచుంటి; ననుఁ జూఁడఁగ వేఁడెదఁ బెద్దమాపునన్.

—• నూజివీడు, శ్రీ వేంకటాద్ర్యప్పారావుగారు •—

శా. సద్యఃకాలమునందు మీయెడల యాచ్నాసస్యముల్ పండుటల్
విద్వల్లోకమునందు వింటి నదియే విశ్వాస మీనాకు, మీ
యుద్యోగస్థుల లోపమో మఱియునేమో గాని నావట్ల మీ
సద్యఃకాల మనేకవత్సరములై శాఖోపశాఖల్ గనెన్. 804

ఉ. ఏమని యందురేని వినుఁ, డేఁడు లొకై దిటికన్న మున్ను మీ
రేమొకొ నూఱులాఱు లిడనెంచిన యట్లొక కింవదంతి మీ
గ్రామమునన్ బయల్వెడలెఁ గాని యదంతట నాఁగెఁ, బిమ్మటన్
నే మిము జ్యేష్ఠపుత్రు పరిణీతికి సాయము సేయుఁ డంచు లే
ఖాముఖమందు వ్రాసి సముఖమ్మున కంపితిఁ గాని దానినిన్
దాము గణింపలేద, యిది తద్దయుఁ జిత్రము, నూజివీటి భూ
స్వాములయందు సర్వజనసమ్మతమౌ భవదీయదాతృతా
పేర్మియు ప్రస్తుతం బిచట వేఱువిధమ్మగు టేనిమిత్తమో !
నామది కక్కజంబుగఁ గనంబడు; దీని నటుండనిత్తమో
భూమిపతీ ! యనంతరము పొల్పుగ రెండవకుఱ్ఱ పెండ్లికై
యేమియుఁ గోరకే యెలమి నే శుభలేఖ నొకండు పంచితిన్
దా మదిఁ జూచి జాబొకటి తక్షణమే లిఖియింపఁజేసి నా

పై మదిఁగల్గు కూరిమి నభంగురమౌగతి వెల్లడించినా
రా మరియాదయున్ దుదకు నట్టులె కాయగ మండిపోయె, నే
నేమిటి కర్థినై మిము సమీహితసిద్ధికిఁ గోరియుంటినో
యామహమై దినమ్ము లొక యర్వది దాఁటఁగనయ్యె. నిప్పుడే
నేమని మీకు వ్రాయఁగల, నేమని మీర లనుగ్రహింతు ? రే
నీమెయి మీకు వ్రాయుటయు నెంతయుఁ దప్పగుఁగాని యాచ్నయే
"కాములపుంజపున్ ఫలముఁబట్టి ఘటించెడి'' నంచు సత్కవి
గ్రామణు లందు, రక్కవుల కబ్బములన్ బఠియించి చక్కనౌ
నేమమునన్ గవిత్వము మనీషులుమెచ్చ రచింపఁగల్గు భూ
స్వామియె నన్నిటుల్ సలుపఁజాలుట కక్కజమంది సారెకున్
నామదిఁదోఁచు నక్కజము నాకడ డాఁపఁగలేక వ్రాసితిన్
భూమిసురుండ వైదికుఁడఁ; బోయిన దేమియు లేదుగాని మీ
గ్రామమువచ్చి మిమ్ముఁ గనఁగా మది సందియమందుచుండి, యా
చ్నామహిమమ్ముఁ దా మరయఁజాలరు మావలెః నన్నుఁ గాంచి మీ
రేమియు నాక మున్వలెనె యెక్కుడు పేరిమి నాదరింత్రుగా
నీ మది నాకు సందియ మదేటికిఁ గల్గకపోవు ? "నీయవ
ష్టీమని కోరు నాధనము నిచ్చుట డాఁచినయట్లు వచ్చె''నం
చోమహిపాల ! మీయెడఁద నూహ జనించెడి నన్ను శంక; భూ
స్వాములఁ జాలమందిఁ గని సత్కృతిఁగాంచితి, వారిలోన నీ
క్షేమహిమమ్ము హెచ్చు గణుతింపఁ, గవిత్వము చెప్పఁజాలు భూ
స్వామివి నీవు, దైన్యము లవంబును సోఁకనిరీతి సద్యశో
ధాముల మిమ్ముఁబోలెడి వదాన్యులఁగాంచి గడించువాఁ డితం
డీమెయిఁ గోర దైన్య మది యేర్పడ కేగతి మానుఁ, గృష్ణరా
డ్భూమిపుఁ డిట్లు వ్రాసెఁ దనపొత్తమునం దది చూచియుంద్రు; త
ద్ధీమహిమమ్ము కొంత నరదేవమణి న్నినుఁ దా వరించె, నీ
వామహిపాలుత్రోవఁ జనుమంచును బిల్వని పేరఁటమ్ముగా

నేమిటికో లిఖించితి, "నిదే"మని నాయెడ నీసు నించఁబో
కోమతిమద్వరిష్ఠ ! సిరియున్ గిరవాప్తియుఁగూడ గల్గు నీ
వేమముబోఁట్ల నిట్లరయ నేనరపాలురు గౌరవింతు ? రే
నీమెయి నింతవ్రాయుటకు హేతువు లాభముఁ గోరికాదు, త
త్కాముల కింత ధైర్యమది గల్గమి నీవ యెఱుంగు; దింక నిం
దేమి నిమిత్తమన్న, నిను నెక్కుడు కీర్తికి నెక్కఁజేయుటే
నామదిఁ గోర్కి, ద్రవ్య మది నాకు మఱెందఱొ యిచ్చినారు, లే
దేమియు లోటు, మీరలును నిచ్చెద రించుక వెన్కముందు; మీ
ప్రేమము వ్యర్థమైనఁ బృథివిన్ మఱియెవ్వరి ప్రేమ సార్థకం
బౌ మహిపాల ! మీసిరికి నంతును బొంతును లేక సద్యశః
కామము తోడుగల్గుత సుఖంబులుఁ గల్గుత నీకు భూవరా ! 805

—• సమ్మానానంతరము చెప్పినది •—

ఉ. పేరిమిమీఱఁ గాన్క యను పేరున మీరలు పంపు రెండునూ
ఱాఱులు వచ్చిచేరె "మనియార్డరు" మూలమునన్, గుమార్తలన్
శ్రీరహిఁ బెండ్లికూఁతులను జేసెడివేళకు, వేంకటాద్రిపృ
థ్వీరమణాప్పరాయ ! కవిదీవనఁ గైకొనుమయ్య యొయ్యనన్. 806

—• దొడ్డంపేట, శ్రీ వాడరేవు విశ్వసుందరరావు జమీందారుగారు •—

చ. పరిచిత వాడరేవుకులవర్ధన ! దొడ్డమపేట విశ్వసుం
దరధరణీసురప్రభువతంస ! యశస్కర ! రంగనాయికా
చిరకృతభాగధేయ ! నరసింహతనూభవ ! నీవు పుట్టు క
స్తురికిఁ బతివ్రతామణి ప్రసూజని హేతువు వాడరేవు స
ద్వరకులపద్మపాళికి సువాసనఁ గూర్పఁగఁ జాలునట్టి నీ
చరితము నాలకించి కడు సంతసమున్ గనుచుంటిఁ, జాలద
గ్గఱఁ గడియమ్మ కాఁపురముగాఁ గలవాఁడనె యయ్యు నెన్నఁడున్
దరిసెన మాచరించుపని దైవవశమ్మునఁజేసి నాకుఁ జే
కుఱ; దొకసారి వచ్చితిని గొండొక కార్యముమీఁద రెండు వ

త్సరములనాఁడు మార్గపువశమ్మున నే డ్తెఱ నోన్నృపాల ! యిం
జరమున కేగుచున్, దుదకు జాతకపున్ బల మప్డు చాలమిన్
దొరకొనదయ్యె దర్శనము, తొందరగాఁ బనియుంటఁజేసి నే
మరలితి వెంటనే, పిదప మాటికి మాటికి రాఁదలంచి నేఁ
దఱి చనుకొందుఁ గాని యది దైవవశమ్మున నెగ్గకుండు, విం
జరమున కేగు చింత నొకసారి యతించితిఁగాని పూర్వవ
త్సరమునఁ బూర్వరీతిగనె దర్శనభాగ్యము నందనైతి, ము
న్నఱిమఱి దేశముల్ తిరిగి యందుపయిన్ విసు వబ్బుటన్ గృహో
దరమున నుండి కొండొకపదమ్మునకుం జను టిప్పు డంతగా
సరిపడ, దెవ్వరో మిగుల సక్తులు మత్పద మేగుదెంచి సా
దరమున వెంటఁబెట్టికొని తప్పనికార్యము లున్నయప్డు మ
ద్గురుత గణించి సత్ఫలకున్ గొనిపోవుట తప్ప నేనుగాఁ
బరిసరవర్తియున్ సకలపట్టణరాజము లాణ్మ హేంద్రమే
నరయఁ బ్రియాణమున్ సలుపునట్టి ప్రసక్తియుఁగూడ లేదు, బం
దరుపురిఁ దక్క వేఱొకటఁ దావకదర్శనభాగ్య మెన్నఁడున్
దొరకొనదయ్యె, నేఁడు తమితో దరిసించెడి కోర్కి వచ్చితిన్
బొరి మును పెట్టులయ్యె నదెపో ! యిపుడున్ ఘటియించె, వేఱొక
ప్డరయఁ దలంచి మున్వలెనె యాత్మపురమ్మున కేగుచుంటి, బల్
గరువముఁ జెందుచుందుఁ గవికల్పధరాజము పండితుండు పో
ల్వరపతి కృష్ణరావు మన బ్రాహ్మణభూపతులందు మేటియై
వఱలుటఁ జేసి, యాతఁ డల స్వర్గపురం బొనరించు భాగ్యపున్
గరిమ ధరన్ ద్యజించి చనె, గర్వము నన్నుఁ ద్యజించె, నయ్యనం
తరమున నీగుణాధికత తద్ద వినంబడి "యిట్టివాఁడు భూ
సురకులపున్ జమీన్విభుఁడు శుద్ధచరిత్రుఁ డొకండు గౌతమీ
పరిసరమంద చేకుఱుట భాగ్యమునందును మేటిభాగ్యమం
చరయుచునుంటి, నీ కిఁక నిరామయదీర్ఘతరాయురున్నతి

స్థిరతరభాగ్యముల్ గలుగఁజేయుత శ్రీపతి యంచు దీవనల్
నెఱపి ముగింతు నిప్పటికి నిన్ను గుఱించిన పద్యమాలికన్. 807

—• ఇటీవలఁ జెప్పిన పద్యములు •—

శా. నూటాఱుల్ బహుమాన మిచ్చి కడుసంతోసమ్ము దైవార స
త్కారానంతర మాత్మజాతువడుగున్ దర్వాత నౌ పెండ్లియున్
శ్రీరంజిల్లఁగ నుగ్గడించి తగ "విచ్చేయుం" డటం చే నటుల్
కోరంగాఁబడి రాని హేతువును నీకున్ వ్రాయుచుంటిన్నృపా! 808

క. కొమిరెల కిర్వురకును నొ
క్కముహూర్తమునఁ బెండ్లి సేయఁగాఁ దలఁచియు నీ
సముఖమున కపుడు వచ్చితి
సుముహూర్తము వేఱు వేఱ చొప్పడెఁ బిదపన్. 809

ఉ. ఒండొకకూఁతు పెండిలిముహూర్తము మీతనుజాతుపెండ్లి యొ
క్కండగు కాలమం దగుట కారణమై చనుదేర నైతి, మీ
రొండు విధమ్ముగాఁ దలఁపకుందురుగాక! వధూవరుల్ చిరా
ఖండతరాయురున్నతులు గై కొనుచుందురుగాక యేకమై. 810

—• ఏలూరు శ్రీమంత్రిపగ్గడరాజాగారు •—

శా. శ్రీమంతుండవునై, కళాకరుఁడవై, సిద్ధాఖిలార్థుండవై
భూమీదైవతకోటిలోఁ బ్రభుఁడవై పొల్పారు నీ యాయు "వా
యామారోగ్యవిశిష్ట మౌత" మని నే నాశీర్వదింతున్ ద్విజ
స్వామీ! రాజ! భుజంగరాడధిపతీ! సంతానవాణీపతీ! 811

మ. మొన మీదర్శన మాచరించితిని సమ్మోదమ్ముమైఁ బత్రికా
జనకళ్యాణములన్ గుఱించియు భవత్సాహాయ్యసంపత్తికై
మనవిన్ జేసితి జ్ఞాపకార్థమిట నమ్మాటన్ బొసంగించితిన్
బునరుక్తం బన కాదరించుటకు మిమ్మున్ సారెకుం గోరెదన్. 812

చ. వినుము భుజంగరాడ్విభుకవిప్రవరా! "శుభమస్తు" శుక్లఫా
ల్గునబహుళద్వితీయ నల గోపతివారమునాఁడు హస్తయం

దున వృషలగ్నమందున, ననుంగుఁ గొమార్తల పెండ్లిమూర్తమం
చును వచియించియుంటిని, శిశుత్వవయస్సున నున్న నాదు నం
దనలకు శారదాఘనుఁడు ధర్మవిరుద్ధముగా విధించు శా
సనమునుబట్టి పెండిలి ప్రసక్తికి వచ్చినదయ్యె; రాజశా
సనమునుబట్టి యీపయి రజస్వలయౌ తనుజాతకే మహా
జనులు వివాహమున్ సలుపుసంగతి దాపరమౌనుగాక, యం
దున నొక "దోస మబ్బు" నని తోఁపదు నామది; కెందు దైవశా
సనమును రాజశాసనము సర్వజనుల్ శిరసావహించుటల్
చను; భగవంతుశాసనము చాల జనుల్ నిరసింతుర్ి, వారికిన్
గనుపడదించు శాస్తి, క్షితికాంతుని శాసన మట్లు గామి దీ
నిని నిరసింప రెవ్వరు; మనీషుల శాస్త్రము లెల్ల దీని వం
చనఁ బడి వాఁడిఁ గోల్పడియె; శాసనకర్తమతమ్ము వేఱు, శా
సనము ధరించువారి మతసంతతి వే; ఱిది "గోకులాష్టమిన్
ఘనుఁడని సాహెబయ్యా నడుగంజను" పోల్కికి వచ్చెఁ, "బేసుపె
త్తన" మను నట్టు లీఘనుని ధార్ష్ట్య మ దింతటఁ బోక యెన్నియో
"పను లిటువంటివే సలుపఁ బాల్పడ నున్న" దటంచు విందు, మ
య్యనఘునిఁ గన్నయమ్మ కడు పల్లనఁ జల్లఁగ నుండునట్లు దీ
వన లొనరింపఁగావలయుఁ బండితవర్గము లెల్లఁ గూడి, వీ
రిని గనువార లెవ్వరు? పరీక్ష యొనర్చెడివార లెవ్వ? రో
యనఘ! సమస్తమున్ దెలిసినట్టి భవత్సముఖమ్మునందు నే
మని ప్రకృత ప్రపంచగతి నక్కట యెక్కుడుగా లిఖింతు! శా
సనమును బట్టి వర్తిలుట సౌఖ్యదమంచుఁ దలంతు నెమ్మెయిన్. 813

—• చామర్లకోట సభలోఁ జెప్పినది •—

చ. నలువదియేండ్లకున్ మునుపు నాదగు చిన్నతనాన విద్దెలో
పలఁ గడుఁ బెద్దలైన ప్రతివాది భయంకరవంశ్య రాఘవా

ర్యలకడ విద్య గైకొనుచు నుంటిని నేనిట మూఁడు మాసముల్,
పులకిత మయ్యె మేను గతమున్ స్మరియించిన నోసభాసదుల్ ! 814

—• ఏలూరు, శ్రీ మోతే గంగరాజుగారు •—

శా. మోతేవంశ్యుఁడు గంగరాజు ధనవన్ముఖ్యుండు సద్దాత వి
ఖ్యాతిస్ఫీతుఁడు ధర్మకర్మనిరతుం డర్పించె గ్రంథాలయం
బేతత్పట్టణపాఠకావళియెడన్ హెచ్చైన ప్రేమమ్ముతో
జాతిశ్రేష్ఠుఁ డితండు గాంచుత మహైశ్వర్యాయురారోగ్యముల్. 815

ఉ. ఏఁబదివేల సొమ్ము తృణమేనియుఁ గా దనుభంగి నిచ్చి యీ
డాబును దర్పమున్ గడు బెడంగగు నందముఁ గల్గునట్లు వి
ద్యాబిసబాహువల్లరికి నాలయమున్ వెలయించె గంగరా
జీ బహుమానమున్ గనిన యింతి సరస్వతి తన్ను మెచ్చఁగన్. 816

ఉ. పొత్తములిచ్చె, మంచి గృహముల్ గయిచేసి యొసంగె, విస్తరా
లెత్తువిగా నమర్చె, నిఁక నేమిట లోపము ? పౌరులార ! మీ
చిత్తమువచ్చినట్లు దయచేసి కలాకలనం బొనర్చుఁ, దే
చెత్తపరిసక్తికో హృదయసీమ వృథాగ వ్యయింప నేటికిన్. 817

తే. గీ. అన్నదానసమాజంబునందుఁ బోలె
నీ సమాజమ్మునకుఁ బ్రజ లేలరారు ?
అదియు నిదియు బీదలకె సుం దరసికొనుఁడు
గంగరాట్కృతి సార్థకగరిమనొంద. 818

సీ. గోరక్షణకెకాక గోరక్షణకుఁగూడ
విత్తమిచ్చిన యుత్తమోత్తముండు
సాధుకోటికెకాక, సాధుకోటికిఁగూడ
బాంధవ్యమునుజూపు పరమహితుఁడు
సుమనస్తతికె కాక సుమనస్తతికిఁగూడ
జేయెత్తిమ్రొక్కెడి శ్రీయుతుండు
న్యాయవాదికెకాక న్యాయవాదికిఁగూడఁ
జోటిచ్చి మాఐంచు సుగుణగణ్యుఁ

తే. గీ. డాగజాంత మైశ్వర్యంబు ననుభవించు
చున్నవాఁడు పురీజనుల్ తన్ను మెచ్చ
గఁగరా జింతకన్నను ఘనసుకృతము
లాచరించుత దీర్ఘాయు వందుఁగాత! 819

— ఏలూరు. శ్రీ చల్లపల్లిరాజాగారు —

చ. సుగుణములన్ యశోగరిమ సూరిజనస్తవనీయసత్కళా
భిగమత, నెల్లభంగులను బేరువహించిన నీదు రాక మ
మ్మగణితమైన గౌరవము నందఁగఁ జేసె నృపాల! స్వాగతం
బగుత శివప్రసాదనృప! యార్తులపాలిఁటి కల్పవృక్షమా! 820

చ. నిగమములన్ బురాణముల నిర్మలవస్తువులందు నిర్మలం
బగు నని గోవు చెప్పఁబడు నట్టి పదార్థము విప్రజాతిపై
నెగడుటఁ బూర్తిగాఁ నెఱిఁగి, నీతివిదూరులు దానిఁ జంపు న
య్యగడు నడంచు నీ కగుత స్వాగత మో చలపల్లిభూవరా! 821

చ. "మముఁ గరుణింపఁగాఁ దగినమానిసి యొక్కఁడు లేఁడె" యంచు దుః
ఖము మెయి నార్చుచున్ వధకుఁగాఁగఁ గసాయికి లోఁగిపోవు గో
వు మొగము చూడలేము గద; భూపతిమౌళి! శివప్రసాద! ప్రే
మము నటఁజూవు, నిన్నవియె మన్నుత స్వాగతమిచ్చి సర్వదా. 822

ఉ. స్వాగత మోనృపాలమణి! స్వాగతమోయి శివప్రసాద! మేల్
స్వాగత మోకృపావిలయ! స్వాగతమయ్య నరేంద్రపుత్ర! నీ
యాగమనంబు మాపురజనాళి యొనర్చెడి ధేనురక్షకున్
స్వాగత మబ్బఁజేసె నిది సత్యము సత్యము సత్యమోనృపా! 823

శా. గోరక్షాకృతిబద్ధకంకణుఁడవై గోరాణ్మహావైభవ
శ్రీరంజిల్లెడివాఁడవై సుకవితాసీమంతినీభాగ్యరే
ఖారారాజదపారకీర్తినిధివై కళ్యాణపుంగొండవై
పేరందంగల నీకు స్వాగత మగున్ బృథ్వీశచూడామణీ! 824

—• బందరు. ప్రొఫెసరు శేఖరు వివాహము •—

క. శ్రీయువతి యనుగ్రహమున
నీయన్నంబలెనె సిరికి నెలవై సతతం
బాయుర్భాగ్యాదికముల
కాయతనం బగుము శేఖరా! సతితోడన్. 825

క. నీయన్నకు మంగళగిరి
రాయండగు పానకాలరాయఁడు పెండ్లిన్
జేయించె స్వసన్నిధి, నీ
కాయన స్వగృహమ్మునంద యది కావించెన్. 826

శా. నీయన్నన్ మనమందుఁ బెట్టుకొనుచున్ నీవెందు వర్తించుచో
శ్రేయస్సుల్ తమయంత నీకు వశమై చేమోడ్పుగావించు, నా
యీయౌన్నత్యము నీదు నన్న కెటుగానేర్పడ్డ దన్నన్ శిశు
ప్రాయంబాదిగఁ బెద్దలందు మిగులన్ భక్తుండుగా నుంటచే. 827

మ. ధనమార్జించినవారు పెక్కురిలలోఁ, దత్తన్మహాభోగులన్
ఘను లేమాత్రముఁ జీరికింగొనరు నిక్కమ్మంత; నీయన్న యే
గొనముం గల్గి కవిప్రియుండగుచు శ్లాఘ్యుండయ్యెనో, దానియం
దుననే నీమతి సంచరించుత సదుద్యోగుల్ ప్రశంసింపఁగన్. 828

మ. ధనమున్ విద్దెయు నీకు సర్వమును సిద్ధంబై యొసంగెంగదా!
వనితారత్నము చెట్టవట్టితివి తద్వాల్లభ్యమున్ గాంచి య
న్నను శ్రీ శేషగిరిన్ గణించి యల సంతానమ్మునుంబోలెఁ జ
క్కని సంతానము సోమశేఖరవరా! కాంచంగ దీవించెదన్. 829

—• శ్రీబొబ్బిలి పట్టాభిషేక కృతి సమర్పణ పద్యములు •—

శా. చేసెన్ దీనిని వేంకటేశుఁ డనుచుం జెప్పంగ నీలోకమం
దేసత్యమ్మును లేద లేశమును, నే నేతాదృశంపుం గవి
త్వాసక్తిం దిగఁదార్చియున్నయపు డెట్లబ్బున్ గృతార్థత్వముల్!
నీ సంకల్పబలమ్మ నమ్మ నృపతీ! నిక్కమ్మ నేఁ జెప్పితిన్. 830

చ. నరకృతి యాత్మకూరునరనాయకమౌళికి నిచ్చి చిక్కులం
బొరసిన దాది యందులకు బుద్ధిజనించుటలేద, యట్టిచో
విరచన మెట్లు సేయుదుఁ గవిత్వము, నీదృఢనిశ్చయంబ న
న్నరిమురిమైఁ గృతార్థునిగ నాదటఁ జేసె నృపాలశేఖరా! 831

ఉ. నేను నిమిత్తమాత్రి మిది నీవు రచించినదౌట నిక్క మి
ద్దానికిఁ జేయుసత్కృతియుఁ దావకయోగ్యతఁబట్టిగాని యి
మ్మానిసిఁ బట్టి యుండుట సమంజస మంచనుకోక తోడి సం
స్థానపతుల్ సెబాసను పథమ్మున నెమ్మదిఁ జొన్పు భూవరా! 832

చ. స్థిరమగు కార్య మియ్యది నదీవనభూధరరవీందుతారకో
త్కరమునకేని నాశనము దా ఘటియింపఁగవచ్చుఁ గాని, భూ
వర! వరరామకృష్ణనరపాలక! సత్కవికావ్య మెన్నఁడుం
బొరయదు నాశ, మీనుడిని బూర్తిగ నెమ్మది నుంచఁగోరెదన్. 833

ఉ. లక్షల కెచ్చుగాఁగ ధనలక్ష్మి వ్యయంబొనరించి "గెస్టుహౌ"
సక్షరదీప్తిరా సిలువు లందఱుఁ దోడ్పడఁ గట్టుచుంటి, వే
నక్షరదీప్తి "గెస్టుహవు" సందఱతోఁ జవిలే దొకండ రం
గక్షితిపాల! కట్టి యిదె కానుక వెట్టితి, స్వీకరింపవే! 834

మ. ఇల తా నెందనుకన్ సరిద్గిరులతో నేపారు నందాఁక బొ
బ్బిలిసంస్థాన మెసంగఁగావలయు, బొబ్బిల్యాఖ్యసంస్థాన మీ
యిల నెందాఁక రహించు నందనుక మాయీవంశజుల్ వచ్చి బొ
బ్బిలి సంస్థానము చూడఁగా వలయు నోపృథ్వీశ చూడామణీ! 835

చ. పదియును రెండు నూళులకు బార్లుగ లింగన గట్టెఁ దోరణా
లెద్ద ముద మందినట్టి తన యేలికయైన నిజాము నాజ్ఞ, నీ
కెద ముదమందెనేని యటులేగద! వెంకనగూడఁ గట్టికో
వద వొకవల్లెకే, నిది దురాశయటందువొ? రంగరాట్ప్రభూ! 836

శా. నీసంతోసముఁబట్టి నన్నిపుడు మన్నింపం బ్రయత్నింపు మా
యాసమ్మానమె నేను గైకొనుచు బ్రహ్మానందముం జెందెదన్

శ్రీసంపన్నులు జేంఛ్లు, మీయెడల సంతృప్తిప్రకారంబు బల్
దోసంబౌ, నదియే గొనమ్ముగద యెందున్ మాకు, బృథ్వీశ్వరా! 837

శా. వ్యాసుం డా జనమేజయుంగుఱిచి సర్వమ్మున్ వచించెంగదా!
శ్రీసంపన్నము భారత, మ్మల పరిక్షిత్పుత్రు డేమిచ్చె, నా
వ్యాసుం డేమి గ్రహించె? గీర్తి యొకఁడే వ్యాపించె నద్దిక్కులన్
నీ సామ్రాజ్యము కీర్తిమంతమగుతే నే నెప్పుడుం గోరెదన్. 838

ఉ. రైలొకఁ డుండఁబట్టి వెస రానవకాశము గల్గవచ్చు నీ
నేల కటంచు నిన్నిపుడు నేలను గోరుటగాని పూర్వపుం
గాలమె యైనచో నడుగఁగా మనమే వెనుదీయుఁ, గబ్బపుం
బాలికనిచ్చి రాక యెటు మానుదుమయ్య? నృపాల! చెప్పుమా. 839

ఉ. రాజులకిచ్చు కన్యకలు రా రొరులంబలెఁ బుట్టినిండ్ల, కె
ప్డేఁ జనుదెంచు టబ్బిన నహీనుఁడు భర్తయుఁ దాము వత్తు, ర
య్యోజ భరింపఁగాఁ గల మహోన్నతులే కవు? లట్లుగాన నో
రాజవరేణ్య! కూఁతు లలరారెడి చోటికి రాకతీఱునే? 840

ఉ. పెద్దతనమ్మునం గనినబిడ్డ, సుధామధురానులాప, యే
విద్దెయుఁగాని నేర్చిన వివేకిని, పుట్టిన మెట్టినిండ్లకున్
దద్దయుఁ గీర్తిఁ దేఁదగిన ధన్య, కవిత్వపుఁ గన్య నిచ్చితిన్
దిద్దును, దిద్దఁగాఁబడదు, దీని స్వభావ మెఱుంగఁ జెప్పితిన్. 841

ఉ. దేశముగాని దేశమున దీని నొసంగుటకుం గతంబు మా
దేశపు తేనికూఁతు రిట దేవిగ నుండుటయే యెఱుంగు, పృ
థ్వీశిత! నూజివీటి నగరీంద్రుల చెల్మి చిరం బొనర్చి య
భ్యాశపు వియ్యముల్ సలుప వారలు మెత్తురె? రంగరాట్ప్రభూ! 842

చ. ఇరువురఁ గంటిఁ గూఁతుల నహీనుల కిచ్చితిఁ బెండ్లి చేసితిన్
నరవర! దీని నాపయిఁ గనత్కవకాశరగాత్రిఁ గంటి, శ్రీ
కరు నభిషేకపూతు నినుఁ గంతుజయంతవసంతతుల్యు శ్రీ
వరుఁ గయికొంటి నల్లునిగ బాపురె! నా తప మెంత ధన్యమో! 843

ఉ. దిగ్గజమనున్న భర్తనిది తా వరియింపదు, యందచందపున్
నిగ్గులు చూచి కావలయు నిన్ను వరించిన దోన్నృపాల! కే
లొగ్గుము, తాతలప్పటిదియుం గడు మాన్యము రావువారి స
మ్యగ్గుణముల్ గణించి మరియాదకు వారలపొత్తు నత్తుటల్. 844

క. రావుల కెడ చవి యియ్యది
తావరియించినది సుంత దవ్వున నప్పా
రావుల, నిప్పటి కచ్చపు
రావున్ నినుఁ జెట్టవట్టె రంగారాయా! 845

మ. ఘనమ త్తేభగతుల్ చమత్కృతములౌ కందమ్ములున్ గీతని
స్స్వనముల్ శోభనవర్ణధూర్వహత, చంచచ్చంపకామోదము
సునవీనోత్పలమాలికానికరముల్ శోభిల్లు మాకన్నె నీ
యనుఁగుం బేర్మికిఁ బాత్రమై కొనుత రత్నాలంకృతుల్ భూవరా! 846

మ. జనపాలా! యిది యిట్టిదయ్యు నొకచో శార్దూల విక్రీడిత
మ్మునకుం గూడఁ గడంగు, నట్లగుట మీ బోఁట్లెంతయున్ వేఁటలో
ఘను లౌటన్ మఱియున్ విశేషమున సత్కారమ్ము చూపించి య
ప్పనిపట్లన్ సహధర్మచారిణిగ సంభావింపఁగా నర్హమౌ. 847

ఉ. కన్నెగొనమ్ములం దెలుపఁగా గమకింతునయేని, భూప! యె
న్నెన్నియొ పద్యముల్ పెరుఁగు, నింతియచాలును సంగ్రహమ్ముగా
విన్నప మాచరించితి, వివేకి శిరోమణి వీవు దీనిచే
తన్నిఖిలమ్మెఱుంగఁగల ధన్యుఁడ వన్యులవంటివాఁడవే! 848

మ. కృతికన్యాపరిణేత కీవలయు వీకేమేని కట్నంబు, భూ
పతికిన్ బీదలు కట్నమిచ్చుట యసంభావ్యంబు; కానీ సదా
కృతిసౌభాగ్యము పారిబర్హముపయిం బ్రీతిన్ నివారించు, నో
క్షితినాథా! కయికొమ్ము కావలసినన్ గీర్తిస్థిరైశ్వర్యముల్ 849

ఉ. నాపని నే నొనర్చితిని నాబరువంతయుఁ దీఱె, నింకనో
భూప! మహాభిషేకపరిపూతము తావకమౌళి నుండెఁబో!

యీపయిభార; మేను గృతికెంత వివేచనచేసి యుంటి, దా
దాపుగ నీవు నంతయును దప్పక యోజనసేయఁగాఁ దగున్. 850

ఉ. ఏనుఁగు నెక్కుటాదియగు నెల్ల ముదమ్ములుఁ దీఱె నింతకే
యోనరపాల ! తీఱనిది యొక్కటియుం గనుపట్ట దిట్టి నా
చే నిటువంటి సత్కృతిని జేకొని యే యపురూపమైన స
న్మాన మొనర్చి కీర్తి జనమాన్యత కెక్కునటుల్ ఘటింతువో ! 851

ఉ. పిల్లలు పిల్లలైరి, కడు వృద్ధుఁడ నే, నిటువంటి మాకు నీ
వల్ల నెటుల్ ఘటింపఁదగు వార్షిక మెంతటిదైనఁగాని భూ
వల్లభ, రంగరాయనృప ! వచ్చిన రాకయ యున్నఁగాని మా
కెల్లపుడున్ లభింపఁగల దేర్పఱుపందగుఁ గ్రొత్తపద్ధతిన్. 852

ఉ. రాజులకడ్డునం దఱచు రాజులు పుట్టుట చూతు మోమహా
రాజ, సిరంగరాయ ! కవిరాజులకున్ గవిరాజు లన్వయో
త్తేజకులై జనించుటది దృశ్య మదృశ్యముఁ గూడ నౌట, నీ
రాజితప్రేమ నాదు సుతరాజిపయిన్ బ్రసరించుఁగావుతన్. 853

క. సంకల్పసిద్ధుఁడవు నీ
కింకొకఁ డాశీర్వదింప నేటికి ? నీ స
త్సంకల్పమ్ములు సిద్ధి న
లంకృతములుగా నెసఁగి చెలంగుత మెపుడున్. 854

చ. ఇల మును రంగారాయలును నిద్ధచరిత్రుఁడు కృష్ణరాయలున్
వెలసిరి రామరాయలును వేఱుగ వేఱుగ, మూగు రేకమై
కలిసి త్రిమూర్తి లొక్కటగుకైవడిఁ జెన్నెసలారు నీదు పే
ల్పలరుత, రామకృష్ణ, సుగుణాకర ! శ్రీకర ! రంగరాడ్విభూ ! 855

— సన్మానానంతరము సెలవుసమయమునఁ జెప్పినవి —

శా. వేయార్లిచ్చినయట్టి నీ వితరణావేశమ్ము నేనెంతయున్
వాయర్పించి నుతింతు, వార్షికముగాఁ బైనూఱునార్లంటకో, ·
నాయాంతర్యము మిక్కిలిం దనిసె, భూనాథా ! యదింగూడ నే
నైయేతేరకయే లభించుననుటో, యత్యంతము న్మాత్నమౌ. 856

ఉ. నూటపదార్లు వార్షికము నూతనపక్కిఁ నొనర్చి తిండు కే
టేటను వచ్చు నేమ మదియేమియు లేమియె నూత్నపక్కిఁ, యీ
లాటి సువార్షికం బిడి యిలాధవ! మానసమంచు మోదమున్
నాటితి భూమి యిచ్చినను నామది కింతటి తృప్తిగల్గునే? 857

ఉ. పండుట పండకుం, టొకటఁ బండియురై తెగఁగొట్టుచుంట, యా
దండుగగాక కోర్టుకుఁ బదంబడిపోవుట, దాని కర్చుకై
కొండొకసొమ్ము పోయి టొనఁగూడని పద్ధతి భూమియిచ్చి బల్
పండువుసేయు నీకు భగవంతుఁడు తోడగుఁగాక భూవరా! 858

మ. ఇపుడాజ్ఞంగొని యేగుచుంటి, నెపుడో యీలాటిసత్కాలమో
నృప! యేతెంచిన దర్శనార్థమిటులే యేతెంతుఁ గొన్నాళ్ళిటఁ
సపరీవారుఁడనై వసింతు,. నను నీస్వాంతమ్మునం దుంచు మె
ల్లపుడు న్నీయభివృద్ధి మానసమునం దత్యంతముం గోరెదన్. 859

తే. గీ. విజయమగుఁగాక నీకు బొబ్బిలినృపాల!
ఆయు వగుఁగాక రావువంశాబ్ధిచంద్ర!
యశము నీ కగుఁగాక శ్వేతాచలపతి!
వృద్ధి యగుఁగాక శ్రీరామకృష్ణనృపతి! 860

—• బెంగుళూరు నాగరత్నము గానము •—

శా. ఎన్నోనాళ్ళయిపోయె నిండుసభలో నీ నేను నీగానపున్
విన్నాణమ్మును నాలకించి, మరలన్ వినదయ్యె నీవేళ; సం
పన్నశ్రీకము నీదుగానము జగత్ప్రఖ్యాతిమత్పాకమో
యన్నా! ధన్యవు నాగరత్నమ! రమేశాలంబిసద్యత్నమా! 861

—• శ్రీ రాజారావు ప్రద్యుమ్న కృష్ణమహీపతి సూర్యారావు బహద్దరు
గారి దత్తత (లక్ష్మీనర్సాపురం) •—

శా. శ్రీరత్నాంబిక నిమ్నుఁ గన్నతరుణీసీమంతపుంబూవు, మా
శ్రీరామాంబిక నిమ్నుఁ గొన్నయలఘు శ్రీమన్మహాసాధ్వి, యీ



నారీరత్నము లన్నదమ్ములకు సంతానంబయౌటన్ గడుం
దూరాలోచన దత్తతన్గలదు ప్రద్యుమ్నక్షితీశాగ్రణీ ! 862

శా. శ్రీరామాంబిక, భారతీసతియు, గౌరీదేవి యీముచ్వురున్
దారెన్నండు ప్రసూత్వమంద రెపు డంతర్వత్నులై యుండ ర
ట్లేరామాంబిక యయ్యె నేఁడు ప్రసువయ్యెన్నికు; దేవత్వసం
భారంబానెడివారి చర్య లివి సూ, ప్రద్యుమ్నభూపాలకా. 863

శా. యాచింపం జనుఁబెట్టిదో యెఱుఁగ వావంతేని నీయందు మా
యాచత్వమ్మె లగింప దట్టియెడలన్ యాచేంద్రభావంబెటుల్
దోఁచున్ సార్థకమై మహీపతి యనం దోసమ్ము లేకుండు, నీ
వాచారూఢిగ్రహించి వర్ధిలు మిఁకన్ బ్రద్యుమ్నభూమీధవా ! 864

శా. ప్రద్యుమ్నుండు రమాకుమారుఁడగుటన్ రామాకుమారుంతునై
ప్రద్యోతిత్వము గాంచుఁగాక యిచటన్ వ్యాకర్తలౌవారికిన్
సద్యఃబర్థము దోఁచుఁ బ్రాజ్ఞులగుటన్ సత్కావ్యధీశోక్తస
త్పద్యార్థమ్మె లెఱింగి వర్ధిలుము శ్రీప్రద్యుమ్నభూమీధవా ! 865

శా. బొబ్బిలి నేలనీ మఱియుఁ బొల్పుగ వేఱొక పోలి నేలనీ
దబ్బఱగాదు మీకులవతంసులె పూర్వమునుండి; మీకెటో
యబ్బెసమాయె రాజ్యము లనాదిగనేలుట యిందు నెంచఁ ద
బ్బిబ్బుఘటింప దిట్లగుటఁ బృథ్వియెఱింగి వరించె నిన్విభూ ! 866

శా. మీవంశమ్మునఁ బుట్టువుంగనిన భూమీనాథపుత్రుం గొనం
గా వాంఛించెడిఁ జెల్లయాంబిక హృదాకాశంబు తజ్జీవితం
బా ? వార్ధక్యము గూడదాఁటినది; భావత్కాయురారోగ్య సు
శ్రీవిస్ఫూర్తిని గొంతచూచుటకు నర్థిన్ నిల్చె సూర్యాధిపా ! 867

మ. అకలంకమ్మగు వంశమందు జననంబా, దానికిందగ్గ రూ
పకళావైభవమా, క్షమాదిగుణసంపన్నత్వమా, సత్కవి
ప్రకరప్రాపకమైన మంచి యశమా, ప్రద్యుమ్నభూపాల ! యెం
దుకుఁ జెల్లాంబిక త్వత్పితామహియు సంతోషమ్మునం దోఁగదో ! 868

క. ఒక త్వత్పితామహియెకొ,
దకలంకుఁడు కీర్తికాయుఁ డలఘుం డల సూ
ర్యకుమారమహీపతి యిం
తకు నెంతటి ముదముఁజెంది తనినెడినొ ! నృపా ! 869

ఉ. అంకములేని రావుకులమందు జనించితి, వంతెకాదు ని
శ్శంకగ రాజవంశజుల చర్యల నన్నిటనాఱితేఱి, తే
వంకరగాని లేని కులవర్ధను నిన్ సుతుఁగా గ్రహించి మా
కొంకుదొలంచె రాజ్ఞి తనకుం దన యత్తకుఁగూడ మెప్పుగన్. 870

శా. ఎన్నో యేఁడులనుండి "వా"రనియు "వీరే తప్ప" దంచున్ మహీ
భృన్నామంబులు చెప్పువారి నుడులన్ బ్రేమించి యాలించి "యి
ట్లెన్నండే నగునేని మంచి" దని మే మెల్లప్పు డూహింతు మో
యన్నా ! నేఁటికి మామనోరథము నిన్నార్జించి తృప్తింగనెన్. 871

మ. ధన మేమాత్రమొ మేము దాఁచినది యీస్థానంబునందున్న దిం
దనృతమ్ముండదు; కాదయేని యెటులీ యాస్థానిఁబాలింప ని
న్నును శ్రీవేంకటగిర్యధీశ్వరువి యన్గుం బుత్రి మారాజ్ఞి ద
త్తునిఁగాఁ గై కొను నంతరాయశతమున్ దూరమ్ముగాఁ దోలుచున్.872

ఉ. ఇప్పటివాఁడుగాఁడనుచు నీవునెఱుంగుదువయ్య ! వీని మీ
యప్పయుఁ, దాతయున్, మఱియు నాయనతమ్ముని మన్మఁడైన ధై
ర్యాప్తతి బొబ్బిలి ప్రభువు, నాయనచుట్టము లాదరించు నా
గొప్పఁదనంబు నే నిచటఁ గొంతయినన్ వచియింప నేటికిన్ ? 873

శా. నీకారోగ్యము, నీకునాయువు, మఱి న్నీకున్ ద్విషజ్జేతృతా
శ్రీకళ్యాణపరంపరల్, సుతుఁగ నిన్ జేకొన్న రామాంబకున్
బాకార్యంబకుఁ గల్గు నంతటి సుఖప్రాగ్భారముం గూర్చి ల
క్ష్మీకాంతుండు భవత్పితామహిని శ్రీచెల్లాంబ మెప్పించుతన్. 874

సీ. వీరు ముత్తాత వర్ణితచిత్రచరితుండు
గ్రంథకర్తృత్వ విఖ్యాతిగనియె

నీతాత పండితప్రీతిలో నామేలి
గౌనములకిక్కయై వినుతికెక్కె
నీతండ్రి తాతముత్తాతల విఖ్యాతి
కేలోటు రాకుండ నేలుచుండె
మీ మేనమామ భూనేత సాక్షాచ్ఛివ
భక్తి నెంతేని ప్రపత్తి గలఁడు

తే. గీ. తల్లికోవను మఱియును దండ్రికోవ
నెల్లరును జ్ఞానపూర్వపూ లిట్టినీకు
జ్ఞానమలవడు టది గొప్పగాదు గాని
యందుకొను మట్టులయ్యు మా యాశిషములు. 875

శా. ఈవేతెంచుటఁ జేసి రాజవర! మా యీ రాజ్ఞి రామాంబికా
రావుఃశ్రీకుల మల్లి బొబ్బిలి మహారాజన్యు వంశమ్మటుల్
దావృద్ధింగనుఁగాక, దత్తుఁగొనఁగాఁ దావింక లేకుండుఁగా
కావిర్భూతయశస్కలౌ సుకవు లత్యానందమున్ బొందఁగన్. 876

ఉ. ఇప్పటి మేనమామ లొక యిర్వురటుండఁగ లచ్చరావునా
నొప్పెడి విద్వదీడ్యచరితోత్తరుఁ డింకొక మేనమామ బల్
గొప్పగణించెఁ దెల్లునుడి కోమలికిం బ్రియుఁడై తదుద్యమం
బెప్పటి కొప్పునట్టు లొకయించుక పేరిమిఁ జూపు భూవరా! 877

ఉ. చెన్నపురంబు వచ్చి నిను శ్రీకరుఁ బెండ్లి కుమారుఁ గాంచి "సం
పన్నలినాక్షికిం బ్రియకుమారుని పేర్గలవాఁడ వౌట సం
పన్నముగాఁగ బేర్వడసి భద్రములందు" మటంచు దీవనల్
చెన్నలరంగ సల్పుటకుఁ జేవ ఘటిల్లమి నేఁడు వచ్చితిన్. 878

శా. ప్రద్యుమ్నుం డనిరుద్ధుఁబోలెఁ గొమరుం బ్రజ్ఞాన్వితున్ గాంచి సం
పద్యోగం బలరన్ బ్రికృష్టమగు ద్యుమ్నుం బెందు వర్షించుచున్
సద్యోదాత యటన్న పేరుగని విశ్వస్తోత్రపాత్రుండవై
ప్రద్యుమ్నక్షితినాథ! వర్ధిలు మపారంబైన తేజంబుతోన్. 879

సీ. భావనారాయణ ప్రభు మన్మరాలు ధ
ర్మారావు నన్ను గారావుఁ గొమిరె
అనఘ వేంకటరమణాంబికాగర్భస
చ్ఛుక్తిముక్తామహాస్తోక ఫలము
శ్రీరామయాంబిక పేరిమి మేనగో
డలును లక్ష్మి వేంకటరమణాంబ
మేనమామకుమార్త శ్రీనిలయంబు ని
న్వరియించు నప్పటి వైభవంబు

తే. గీ. నందుఁ బాల్గొనువారిలో నగ్రగణ్యు
లం దితండొక్కఁడయ్యు నయ్యదన రాక
యున్న లోపంబుదీఱె నేఁడో నృపాల !
యెలమిఁ "జిల్లాను" జెల్లు వాృయింపుమయ్య. 880

సీ. పెదరాయఁడనెడి మీ పెదతాత కొమరుండు
లింగన్నచేత నేలించెఁ దూర్పు
నదియె బొబ్బిలి రాజ్యమయ్యె; మీ ముత్తాత
కొడుకొక్కరుండేలెఁబడమటి దెస
నదియె కొల్లాపురమయ్యె; నాతని పిన
యన్ననేతత్ప్రాంతమందు నొక్క
సింహాసనం "బిందు శ్రీమీఱ వసియింపు"
మని స్వయంవరముగా నడిగెఁగాని

తే. గీ. అతఁడు రాజ్యార్హుఁడయ్యు నెక్కతన నయిన
నేమి యాపీఠమేలకయే గతించి
ముందువారల కొజ్జయై బుద్ధిగఱపె
నిందలి రహస్యమెఱుఁగు మోయీ నృపాల ! 881

చ. ఎఱిఁగినవాఁడనౌట మదినెప్పుడు నీ యభివృద్ధిగోరు ధీ
వరకవినౌట నీజననివల్ల విశేషధనంబుఁ దిన్న తెం

పజీనగువాఁడనొటఁ బసివానికి షేనికి నీకు నీతి నే
గజపుట యుక్తమౌట నిటుగా వచయించితినయ్య, భూవరా! 882

సీ. తురగమ్ము వలెనె బల్గరువంపుమదిగూడ
లోఁగఁదీసెడి తేఁడెబాగుపడెడి
నేనుఁగులంబోలె నింద్రియంబులఁగూడ
లోఁగఁదీసెడితేఁడె బాగుపడెడి
నవలిరిపులఁబోలె నంతారిపులఁగూడ
లోఁగఁదీసెడి తేఁడె బాగుపడెడి
దయితాహృదయ మట్ల రయితుల మదిఁగూడ
లోఁగఁదీసెడి తేఁడె బాగుపడెడి
తే. గీ. నెందులకు జెప్పితినొ దీని చందమెఱిఁగి
ముందువర్తించి శుభములనందుమయ్య!
యెవ్వరోగాని చెప్పబోరిట్టినుడులు
భూరిగుణజాల! ప్రద్యుమ్నభూమిపాల! 883

ఆ. వె. భావిసూచకము ప్రభావతీ ప్రద్యుమ్న
మంకితముగఁగొన్నయట్టి రామ
యాంబికామతల్లి కాత్మజుండయ్యెఁ బ్రి
ద్యుమ్నుఁడరరె! కవిత యురకపోదు. 884

—• శ్రీరాజా కోలంక జమీందారువారి పట్టాభిషేకము •—

శా. శ్రీకిం దానకమైన వేంకటగిరి క్షేత్రమ్మునం బుట్టె నే
దో కంజాక్షము తేజ మొక్కఁడది యెంతో దూరమం దుండె నం
దాఁకన్ సారెకు నేగఁజాల మను నేతన్మాదృశప్రీతి కా
పాకారి ప్రథమానరత్న మిచటన్ పట్టాభిషిక్తంబహో. 885

శా. శ్రీకిన్ షేనికి భార్యకున్మగనికిన్ జెన్నారు సంబంధమే
వాకొన్నారు కవీంద్రు; లిందు నొక లోపం బున్న దిట్లౌట నే
నీకున్ శ్రీకిని మాతృపుత్ర నియతిన్ గీలింతుఁ బ్రద్యుమ్నభూ
పా! కల్పించుత నీకు నెల్లయపుడున్ భాగ్యంబు శ్రీరత్నమే. 886

శా. గోవిందుండును శ్రీయునుం గనిరి ముఁ గొండొక్క ప్రద్యుమ్నుశ్రీ
దేవీ పుత్రుఁ డతం డఖండగరిమన్ దీపించె నవ్వోల్కి నీ
కే వర్తించిన దెల్ల రీతులను లక్ష్మీపుత్ర ! ప్రద్యుమ్న ! నీ
కే విప్రుల్ పొనరించు నాశిషము లింకేముండు భూమండలిన్ ? 887

శా. "మా యాశీర్బల"మంచు మే; 'మది యెటుల్ మాయాశిషంబే' యటం
చా యీ మీరును వా దొనర్చు టది భావ్యంబౌనె ? యీ తీర్పునేఁ
జేయింతుఁ భయదీయభ్రాతృసుతుచే శ్రీయుక్తుచే నన్నుచే
మాయాశీర్బల మెట్టిదో యెఱుఁగు న మ్మాన్యుండుఁ దత్పుత్రుఁడున్.

మ. గనిలో రత్న మొకం డొకండుగ నెటో కన్పట్టు శ్రీరత్నమా
ఖనిలో నన్నియు మంచి మంచి మణులే కన్పట్టె; నీ రీతినే
గనె మీ ముత్తవగారుఁ గూడను సనర్ఘంబైన వంశమ్ము వ
ర్ణన కెక్కన్ గను మట్టి పుత్రికులనే ప్రద్యుమ్నభూపాలకా !. 889

మ. ప్రభువై నీ వరు దెంతువంచు మదిలో భావించి శృంగారవ
ల్లభుఁడై భూవర ! వేంకటేశ్వరుఁడు లీలన్ దిర్పతి గ్రామమున్
బభ దైవారఁగ పీదు మండలమునన్ భాసిల్లెడిన్ జూడు మే
ప్రభుసంబంధులు లేని కగ్రిగతులై వర్తింతు రెందేగినన్. 890

—• పై సభయందే నాగరత్నమును గూర్చి •—

ఆ. వె. ఆటవెలఁది లెందుఁ దేటగీతులు పాడఁ
గలరుగాని కవిత కల్పనంబు
సేయు టరిది నీకు శ్రీపతి కరుణచే
నదియుఁ గల్గెఁ జుమ్మ నాగమణిరో ! 891

—• శ్రీ శ్రీ వేంకటగిరి యువరాజుగారి కుమారునిగూర్చి •—

శా. శ్రీ నీ కబ్బుత ! నీదు తండ్రికి బలెన్ జెల్వారుతఁ బాండితీ
స్థానంబున్ మఱి నీ ప్రపూజనకు నోజన్ గల్గుతన్ రాజవి
ద్యానై పుణ్యము పెద్ద తాతకు బలెన్ దైవారుతన్ బమ్మకున్
జానౌ నాయువుగూడ శ్రీ వరదరాజా ! యాచభూమీశ్వరా ! 892

— • జయపురము మహారాజావారి పట్టాభిషేకము • —
అభినందనము

శా. శ్రీమద్విక్రమదేవవర్మనృపతి క్షేమార్థి, మిత్రుండు, వి
ద్యామాన్యుండగు వేంకటేశకవి దీర్ఘాయుర్యశోవైభవ
శ్రీమత్తన్ బ్రకృత ప్రభూత్తమున కాశీర్వాదమున్ జేయుచున్
బేర్మిమం బంచిన పద్దెముల్ జగతిలోఁ బేరంది వర్ధిల్లుతన్. 893

గీ. సప్తమైద్వర్దునకుఁ బోలె షష్టివత్స
రమఁలపిమ్మట నీయెడ రాజ్యలక్ష్మి
కబ్బి యనురాగ, మంత స్వయంవరమ్ము
చేసె, నిది విని మిగుల సంతోసమయ్యె. 894

శా. ధర్మాత్ముండవు, సత్కవీంద్రుఁడవు, విద్వత్సత్కవీశాగ్రణీ
శర్మాధాయి, వుదారతాఖనివి, నిష్ఠావద్గరిష్ఠుండవున్
గర్మిష్ఠుండవు, పావనాన్వయుఁడ, వేకస్థానమం దిన్నిటిం
బేర్మిన్గూర్చి విరించి వాపికొనెఁ జుమ్మీ! స్వార్జితాపప్రథన్. 895

ఉ. "విక్రమదేవవర్మ పృథివీపతిరత్న" మటంచు మున్ వధా
నక్రమధోరణిన్ పలికినాఁడను ముప్పదియొక్క యేండ్లనాఁ;
డాక్రమ మర్థవంత మయి హాయి ఘటించె జగాన కిప్పు, డో
విక్రమదేవవర్మ పృథివీపతి! నీకుఁ జిరాయు వబ్బుతన్. 896

ఉ. విక్రమశబ్ద మొక్కపరి విశ్వములెల్ల మహోన్నతమ్ముగా
నాక్రమణంబొనర్చిన మహాత్మపదమ్మున యోగరూఢ మో
విక్రమదేవవర్మపృథివీపతి! నీదగు రాజ్యలబ్ధి, త
త్పృక్రమబోధకం బగుచుఁ బండితులన్ దనియించెడిఁ జుమీ. 897

శా. జీవన్ముక్తుఁడె యయ్యె రాజ్యమును శాసించెన్ గదా! మైథిలుం
డీవున్ దాదృశలక్షణాన్వితుఁడవై, యేలంగదయ్యా! మహీ
దేవుల్ మెచ్చఁగ సత్కవుల్ కృతుల నీ తేజమ్ము వర్ణింప నో
దేవా! విక్రమ దేవవర్మ నృపతీ! దీవ్యత్కళావాక్పతీ! 898

చ. అఱువదియేండ్లమీఁద నిను నాశ్రయుగాఁగొనె రాజ్యలక్ష్మి, "యిం
కఱువదియేండ్లు వీని" కని యాయమకున్ గుఱు; తోంధ్రరాజ్యపుం
బరిచితికల్మి జాతకపుభావము లాఁపె యెఱుంగు; వేంకటే
శ్వరకవి యూహ నిక్కమయి వర్ధిలుమయ్య ! చిరాయురున్నతిన్. 899

చ. తఱుఁగనిరాజ్య మబ్బెఁ గడు ధన్యుఁడ వైతి, చిరంబునుండి నీ
పరిచితి నున్న తెల్గునుడి పాండితిలేమకు లక్షవార్షి కం
బరుదుగఁ జేసి తోడినృపు లందఱ మెప్పును గంటి, కైత, సు
స్థిరముగ నిన్నుఁ గొల్చి తనదీనతఁ బాపికొనెన్ నృపాగ్రణీ ! 900

ఆ. వె. "దేశభాషలందుఁ దెల్గు లెస్స" యటంచుఁ
గృష్ణరాయ లనియెఁ గేవలముగ
నెంతటిదియుఁ గాక యింత భవిష్యద్వి
శేషమెఱుకపడునె, చెప్పుమయ్య ! 901

ఉ. "కాఁగలవాఁ డితం డితని గట్టిగఁ బట్టితినేని మీఁద నా
యోగును నాఁగు నీతఁ" డని యోరిమి బాల్యమునాఁటనుండి వే
లాగుల నిన్నుఁ గొల్చి తుది లక్షకుఁ దగ్గని వార్షికమ్ము నీ
చేఁగొనె నాంధ్రవాణి; యిఁకఁ జెన్నువహించి రహింపదే నృపా ! 902

క. బెజవాడ రాజమండ్రీ
నిజాగతిని గోరఁగా 'యునివరిసిటీ' తా
విజయం చేయద నీవ
ల్లఁ జొప్పడున్ దనకు నిట్టిలాభ మ్మనియే. 903

మ. అల భోజుండును, గృష్ణరాయవిభుఁ, డయ్యానందదంతీంద్రుఁడున్
గలిమిన్ మించిన పాండితుల్ గలిగి లోకఖ్యాతికిన్ మూలమై
రిల నమ్మాగుర యోగ్యతల్ గలిగి నీ వేపారుచున్నాఁడ వీ
తెలుగుందేశ మదృష్టవంత మిట సందేహమ్ము లేదో నృపా ! 904

గీ. మండలాధిపత్యము వచ్చి మాసమైనఁ
గాదు నీకీర్తి దశదిశల్ గలయఁ బ్రాఁకె

నింకమీఁద నీకీర్తికి నేది చోటు ?
తెల్పఁగదవయ్య విక్రమ దేవనృపతి ! 905

చ. జయపురపాలనం బొసఁగి సాకినధాత 'కనీసపక్ష' మా
జయ వఱకేని యాయువును సాగునటుల్ పొనరించుఁగాక, యి
ట్లియ మొనఁగూర్చి, దానికి నిరామయభాగ్యము తోడొనర్చి మం
చి యశముగాంచి సత్కవులచే నుతిగాంచి రహించుతన్ నృపా ! 906

గీ. విక్రమార్కునకుంబోలె విపులయశము
నీకుఁ గల్గెడుఁగాక ! మనీషిహితులు
తల్లిదండ్రు లుంచినపేరు తగినఫలము
దేక వృథపోదు విక్రమదేవనృపతి ! 907

—• శ్రీ బొబ్బిలి మహారాజుగారినిగూర్చి (లక్ష్మీనర్సాపురము) •—

చ. సిరి నలరారు బొబ్బిలి నశేషమహావిభవంబెలర్ప వ
త్సరములు రెంటికిన్ వెనుక ఛాత్రసమేతముగాఁగవచ్చి రా
జ్యరమనుగొన్న యుత్సవపు సంగతి వర్ణనఁ జేసినట్టి య
బ్బురమగు పొత్తమున్ వినిచి పొంపిరివోయెడి నీదు సత్కృతిన్
గరము బహూకరింపఁబడి కైకొనినాఁడ నఖండమోద మా
పరిషదమందుఁదక్క మఱి పార్థివ ! నీదగు దర్శనంబు చే
కుఱఁగలభాగ్య మింతవఱకున్ ఘటియింపద యొక్కసారి త
చ్చరితము నచ్చువేయుటకు సన్నిధి కొండొక యుత్తరంబు న
క్కఱగనుపట్టఁ బంపితిని గాని జవాబును బొందనైతి, దే
వర యదియే మొదల్ తఱచు పశ్చిమ ఖండనివాసమున్ బొరిం
బొరిఁబొనరించు టాదియగు ముఖ్యతరంబగు రాజ కార్యదు
ర్భరభరణ ప్రవాహపుఁబరంపర నీఁదుచునున్న యట్లు వా
విరిమెయిఁ బత్రికల్ దెలుప పీనులవిందుగ నాలకించి సం
బరపడి యిట్టి పట్టున జవా బదివ్రాయమి తప్పుగాదటం
చెఱిఁగి, మనమ్మునందు మఱియెన్నఁటికేనియు దైవమెట్టులో

నరపతి నెమ్మొగమ్మును గనంబడఁజేయకయున్నె యంచు నా
తురతమెయిన్ జపింపఁ, సిరిఁజోఁగెడి నీదగు దర్శనమ్ము మా
నరసపురీ మనోహరుఁడు నాకు విధేయుఁడు నీకు ముద్దు సో
దరుఁడు కుమారభూపతి ప్రయత్న పురస్కృతిమైఁ ద్వదీయమౌ
దరిసెన మబ్బఁజేసెఁ; గడు ధన్యత గల్గెఁ; గృతార్థభావముం
బొరసితి; నీదు దర్శనము బొబ్బిలి వచ్చియె చేతునన్న ము
మ్మరమగు వార్ధకమ్మునను మగ్నుఁడనైనకతాన దానికిన్
జొరవఘటింప, దక్కతనఁ జొప్పెదియేనియు మత్పురానకున్
దరి భవదీయదర్శనవిధానము కోసము చూచుకోవలెన్;
గరుణగలట్టి దేవుఁ డది కల్పనజేసె, భవత్సహోదరున్
దిరముగ మత్పురమ్ము దరినే గల రాజ్యము నేలువానిఁగాఁ
నెరపె నిఁకేమికావలయు! నెడ్డొయొకప్పుడు సోదరావర
స్ఫురణకు లోఁగు నిన్నిచటఁజూచెదనంచు మదిజ్ఞా దలంతు; వ
హ్వారె! ఘటియించె నిట్టి సదుపాయము మాయిలువేల్పు; నీవు మం
తిరివఁట! చెన్నరాజ్యపు వినేతకుఁ; బూర్వము రాజవయ్యు మం
తిరిపదమూననేల? యని నే ననుకొంటినిగాని, నేటి సం
స్కరణవిశేషముల్ చెవులుగాఁగ విన్నకతాన నిట్టి తెం
పరియగు తేఁడొకండిపుడు పార్థివతంత్రశతాంగచక్రమున్
గురిమెయిఁ ద్రిప్ప సత్ఫలకున్ దలమానికమై యెసంగు తే
ధరణికిఁ జాల మే లని పవంపడి నెమ్మది సమ్మతించి, నే
నతిమతి మున్నొసంగు నలయాశిషముల్ ఫలియించి బొబ్బిలీ
శ్వరుఁ డిపు డయ్యె సాటి నృపచంద్రులకెల్లను మేటియై తదు
ద్ధరణముసల్ప నెక్కుడు ప్రధానుఁ డటంచు ముదంబుచెంది యీ
శ్వరకృప వర్ణనీయ మని సారెకు; నియ్యది నీదు పూర్వసం
స్కరణవిశేషలబ్ధమగుఁగాక విజానకు దానినెల్ల మ
ద్వరకవితామహత్వపుఁ బ్రభావముగా జమకట్టుకొంచు సం

బరపడుచుంటిఁ; గైతయును భార్యయు నీద్వయి పూరుషన్మహా
ద్ధురుఁగఁ దదన్యుఁగా సలుపఁ దోఁపదు నంచని పెద్దలందు రో
వరవర ! లోకమందు "యదనంతర" మన్నటువంటి న్యాయమున్
గరిమనుబట్టిచూడఁ గృతికన్యను నే నిడినట్టి పిమ్మటన్
వరునిఁగ నిన్ బ్రిటిష్ప్రభుసభాసదుదారపదంబు దా స్వయం
వరపు మహోత్సవమ్మున వివాహమొనర్చి కొనెంగదా ! యిదె
వ్వరి మహిమమ్ము చెప్పు నృపవల్లభ ? శ్రీ చెళపిళ్ళ వేంకటే
శ్వరకవిరాడమోఘతరవాక్ఫలితంబని కూడఁ గోవిదుల్
వరకవితామహత్త్వపరిపాటివిదుల్ వచియింపరొక్కొ ! యి
క్కరణి నఖండరాజ్యరమ కాంచిణమౌ నభిషేక సత్కథా
చరితము సత్కవీశ్వరుల స్వాంతములం దనుపంగ ముద్రణం
బొరయకయున్న లోప మదియుం ద్వరలోనన తీఱుఁగాక; నీ
గరిమ కితోఽధికంబగు ప్రకాశము గల్గెడుఁగాక ! నీకు సు
స్థిరమగు నాయువున్ సిరియుఁ జేకుఱుఁగావుత, రంగరాడ్విభూ !　　908

—• శ్రీ రాజారావు గంగాధర రామారావు బహద్దరు జమీందారువారు ధవళేశ్వరము •—

ఉ. శ్రీకర రామరాయనృపశేఖర ! చేతికి నెమ్మిలేని బ
ల్వీఁక యెలర్ప నిన్న నవలీలగ నన్ను బహూకరించు నా
ఢాకకు నే ఋణంపడి కడంగితి, నేమని లోన నెంచెదో !
నీకుఁ గృతిన్ ఘటింప మది నేఁ దలపెట్టితిఁ జిత్తశుద్ధిగన్!　　909

చ. ముసలితనమ్మునందు ముదముం గొలుపం గల సత్కవిత్వమున్
వెస రచియించి నా కొసఁగ వీల్పడునే యని కొంకెదేమొ ! మున్
కసిగల ప్రాయమందు నొక కబ్బము చెప్పియె డాఁచినాఁడ; బల్
రసయుత మంచు దానిని గరంబును మెత్తురు సత్కవీశ్వరుల్.　　910

ఉ. జ్యోతిషమందు నా కెపుడు శ్రద్ధయు భక్తియు మెండు, దానిలో
జాతకభాగమందున నెసంగెడి నెక్కుడు నమ్మకమ్ము; నా

జాతకచక్రముఁగుఱిచి చర్చ యొనర్చి లిఖించియుంచితిన్
"జాతక చర్య" నా నలరు చక్కని కబ్బ మొకండు భూవరా ! 911

క. అది వ్రాయునపుడు గానీ
పదపడి వేతొకటఁ గాని పార్థివ ! కృతివే
ట్టుదమని నే ననుకోలే;
దిది నిక్కమొ కాదో, పీదు హృదయమె యెఱుఁగున్. 912

ఉ. నిన్నను పీదు పత్కృతివి నేఁ గొనియేఁగుచుఁ ద్రోవలోన "వి
ట్లున్నతిఁ గన్న దాత సుకులోద్భవుఁ డూరక యుండరాదు, పే
రెన్నికగన్న సత్కవిత కేడ్గడయై చిరకీర్తిగాంచి బల్
వన్నెకు నెక్కుటన్న నది పండితసమ్మత మెన్ని భంగులన్" 913

క. అని యా పౌత్త్రము నీకున్
వినిచి భవత్సమ్మతి కది వీసం బేనిన్
గొనము గలదిగాఁ దోఁచిన
ననుకొన్నయటుల్ పౌనర్త మని యెంచి యిటుల్. 914

క. చనుదెంచితి నృపవర ! పిలు
వవి పేరంటమ్ముగాఁగ; వనిత తనంతన్
జనుదెంచి నట్టు లెంచెదొ !
యనృతము లే దింం దటంచు ననుమతి నిడెదో ! 915

క. ఇందెన్నియేని విషయము
లందందు నిమిడ్చినార మాబాల్యము మే
మెందెందుఁ దిరిగితిమొ త
త్సందర్భము లెల్ల దీనఁ ఒనరు నృపాలా ! 916

—• తూర్పుగోదావరి డి॥ ప్రసిడెంటు శ్రీకాకర్లపూడి గోపాలనరసరాజాగారు
రామచంద్రపురము •—

సీ. వంశంబువెంతుమా, పరమపావనుఁడైన
బమ్మబాహంవులందుఁ బ్రభవమొందె

సంప్రదాయము చూడ సద్యశఃపదమైన
కాకర్లపూడి విఖ్యాతకులము
సెరి విమర్శించుచోఁ దరతరమ్ములనుండి
పొమ్మన్నఁ బోని విస్ఫురణ కిరవు
సుగుణమ్ము లరయ నిస్తులులైన కవులచేఁ
గవనమ్ము చెప్పింపఁగలవి; యౌర!

తే. గీ. గౌతమీమండలీకన్యకాసుకృతము
మరల ఫలియించె నీ విప్డు కరమువట్టి
తెంతయేని ప్రజల కబ్బె సంతసంబు
నవ్యతేజ! శ్రీగోపాల నరసరాజ! 917

ఉ. తాతలుఁ దాతతాతలును దాతలతాతలుఁ గూడ మేటి ప్ర
ఖ్యాతికి నాలవాలముఖగాఁ బరిపాలనఁజేసి, రీవు న
న్నేతల సత్కులమ్మున జనించితి; విట్లని యెంచికాదె? భూ
మీతరుణీవతంస మెలమి న్నిను భర్తగ నేఁడు కైకొనెన్. 918

ఉ. అల్లుఁడు మాకు బొబ్బిలినరాధిపుఁ, డాయనకూర్మి నీయెడన్
బెల్లని వింటి, నట్లగుటఁ బేరిమి చుట్టలమైతి; మిట్టి ని
న్నుల్లము పల్లవింప సుగుణోదధిగా గణియించి గౌతమీ
పల్లవపాణి చెట్టగొనుపట్టది సత్యముగాదె! భూవరా! 919

చ. ధరణిప్రజల్ స్వసమ్మతికిఁ దావుగ నెవ్వని నాదరింతు రా
సరసగుణుండు తేఁడయి రసాస్థలి నేలుట మున్నుగూడ ను
ర్వరఁ గల; దిందు కల్లరఘురాము నృపత్వమె సాక్షి; నేఁ డిటన్
సరసవిభుండు గూడ సుజనప్రియుఁ డేలిక యయ్యె నట్టులే. 920

మ. ఇతరుం డేలికయైన "మస్కరి వివాహేచ్ఛన్ బ్రివర్తించుచో
నతుకంగావలెఁ జుట్టుగూడ" ననునట్లౌ; నీవౌ, మేల్ మేటి వు
న్నతరాజన్యకులోద్భవుండ వగుటన్ స్వాభావికంబై నృపా
లత వర్తించు లతామతల్లికి సుమాలంబంబు నాఁబొల్చుచున్. 921

చ. ఇది యొక పెద్ద చిక్కు, మును పెవ్వఁడొ లోకు లెఱుంగకున్న నేఁ
డదనయి నాయకుండయిన యాతని పేరెటొ పైకి వచ్చు; న
య్యదియు ముదావహంబె యగు, నంతటఁ దీరదు; మంచివాహనన్
బొదలెడి పేరుగల్గు టది పూర్వజమఃపరిపాక మో నృపా! 922

తే. గీ. మన నరసరాజుగా రసామాన్యరాజ
వంశమునఁ బుట్టువందినవారు గాన
ప్రభుత నెట్టి లోపమ్ములు వఱలవనియె
యెల్లరును విశ్వసించెద రుల్లములమ. 923

శ్లో. ఇతోఽప్యధిక మైశ్వర్య మితోఽప్యధికసద్యశః
ఇతోఽప్యధికసంతాన మస్తు తే నరసప్రభో. 924

—• శ్రీశ్రీ వుయ్యూరి రాజావారి కొమార్తె పెండ్లి •—

ఉ. శ్రీవిమలాంగి యాత్మకులశీలములన్ జెలువారు వీపె, తా
వీవరుఁ డాత్మప్రాణవిభునెన్నిక పేరొకఁ దూనినట్టివాఁ;
డే విజయం బొసంగుటకు నిర్వురు ముఖ్యులె యంచు శ్రీరమా
దేవిని బ్రోచుఁగాక మవిధేయునిఁ గొండలరాయనిన్ వరున్. 925

—• ఆస్థానకవి ప్రత్యభినందనము •—

గీ. నేను తగుదునో, తగనో ఈస్థానమునకు
నాకుఁ దెలియదు, పదిమంది నన్ను నిచట
గూరుచుండఁ బెట్టిన నిటఁ గూరుచుంటి
నర్హతా నర్హతలు మీర లరయవలయు. 926

ఆ. వె. కవియుఁ బాచకుండు, గాయకుండును ముగ్గు
రొక్క రూప, వీర లొకరిమీఁద
భరము బెట్టుకొనుచు బ్రదుకఁగావలయు, స్వ
తంత్రభావ మెందు దడవ నాస్తి. 927

ఆ. వె. నన్నువృద్ధుఁ డంచుఁ బున్నెమ్మునకు మీరు
గౌరవింతు, రే నుదారమైన
మీ సపర్య లెలమి మెచ్చి కైకొనియెదఁ
గవిని నేను కాను, కాను, కాను. 928

మ. 'యతియున్ బ్రాసయుఁ గూర్పుమాత్రకవియే' యంచేను వా కొంటి గే
రత మన్ గావ్యమునందు, నా రచన లారాధ్యమ్ములే యైన నే
కతమో తెల్పఁడు, సంతసింతు, గణ సంఘాతంబు కావ్యంబె? యే
మతిమంతుం డిటు లాడు నాతనికి సన్మానంబు గావింతురే. 929

క. ఇరువురొ మూగురొ కవులుం
దురు, కబ్బమ్ములును నంతె, దోషజ్ఞులు ధీ
వరమాన్యులు తిత ఉవులై (జల్లెడలు)
పరిశీలించు నెడఁ బైకివచ్చెడి సుకృతుల్. 930

క. నెరసులు దొరలిన మాత్రన
పరమార్థమ్మునకు హాని వాటిల్లదు. దు
ర్భర మగు దోషోత్కరమును
బరిహృతి గావించు రసము ప్రభవించునెడన్. 931

క. బుధులకు 'సాధ్యోహిరసో
యథాతథ' మ్మనెడి వాక్య మర్థమ్మగు వా
రధమ మని పరిహరింతురు
వృథాగఁ గష్టించినట్టి వేత్తల రచనల్. 932

గీ. కవితవలనఁ బున్నెముగూడఁ గలిగెనేని
గలుగ నిందాపశక్యమ్ము గాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చ వీ రహస్యమ్ము విన్నాణి యెఱుఁగు. 933

గీ. కవులు పత్రికల్ నడపెడి ఘనులుకొంద
రెందఱో వారు మున్నారు కృష్ణరావు
లగుదురే, యాతనికిఁ జిర మబ్బుఁగాక
నాకలోక సుఖంబు విజ్ఞానిగాన. 934

క. బిరుదుల పరమార్థం బతఁ
డెఱుఁగును, కవితారహస్య మెఱుఁగును, సాక్షి

త్పరమేశ్వర భక్తుఁడు, కృ
ష్ణరాయుఁడు యశశ్శరీరి సదసద్విదుఁడున్. 935

మ. కవులన్ గౌరవ బుద్ధితో నెలమిమైఁ గష్టంపు దారిద్ర్య బా
ధవశానం బడి బ్రుంగకుండ మన భూదారుల్ కడున్ భక్తితో
శివమున్ గోరి భజించి రా భర మిఁకన్ శీర్షమ్మునన్ దాల్చి యే
లవలెఁ భూపప్రజలే మఠేలవలె వాలాయమ్ము శీలించుచున్. 936

ఉ. ఎంతయొ కష్టమున్ సయిచి యింతికిఁ గాంతుఁడు గాక కాంత క
య్యింతియుఁగాక సౌఖ్య మన నెట్టిదియో కలనే నెఱుంగ కే
వంతకు జంక కే కొనిన భారత మాతకుఁ బేరుదెచ్చు స
త్స్వాంతుల కబ్బుఁగావుత యశ మ్మనిశమ్ము భృశమ్ము శమ్మిఁకన్.

శా. న న్నాస్థానకవీంద్రుఁజేసితి, విఁక న్నా కాయురారోగ్యసం
పన్నత్వంబు నొసంగు టన్నది క్రమప్రాప్తంబ, నా యీడువా
రున్నారెందఱొ విజ్ఞు లల్ల ఘను లందొండొక్క రాస్థానమం
దున్నన్ దేహబలంబు గోరుదురె? నిన్నోతల్లి! కామేశ్వరీ. 938

మ. పదొకండేఁడులపైని రెండిపుడు నాప్రాయంబు, నాబోటికిన్
గదిలో మంచమె యెల్లలోక మగుచున్ గాలమ్ము వెళ్ళించు వృ
ద్ధు దయార్ద్రం బగు దృష్టిఁజూచి యిడి తేదో గొప్పదా గద్దె నా
కదిభుక్తంబగుదాక నాయు విడుమం చర్థింతుఁ గామేశ్వరీ. 939

మ. అనుకంపామృతదృష్టి నించి నను నీ వాస్థానవిద్వత్కవీం
ద్రుని గావించితి నేను దత్పదవి యందున్ గూరుచుండంగ నే
ర్తునె మందిచ్చితి, తేనెఁగూడ విడుమందు న్నిన్నె యీదృగ్విప
ఘ్నులుఁ బూదృశరుగ్ణులున్ గలరుసూ! కళ్యాణి కామేశ్వరీ. 940

శా. సన్యాసిన్ వరుఁజేయుచో నెరవెకా? సర్వంబు నా కిష్ట వి
ద్వన్నేతల్ కవు లేలగాఁదగిన "ఆస్థానంబు" నీఁజేసి తీ
యౌన్నత్యంబున కిమ్ము దీర్ఘతరమౌ నాయుష్య మ ట్లిచ్చుచో
నిన్నున్ మెచ్చు జగ మ్మిఁకెట్టివరము న్నేఁగోరఁ గామేశ్వరీ. 941

మ. ప్రతిసంవత్సర మింక నా కిఁకఁ బ్రిజా రాజ్యంబు వేయారు లు
న్నత ముద్యోగముచేసి వాసిమెయిఁ "బెన్షన్" గొన్న బల్మేటికిన్
భృతకం బిచ్చువిధాన, దీనికి భవ త్ప్రీమమ్మ తోడౌచు దీ
ర్ఘతరం బాయు వొసంగఁగావలెఁ, గృపార్ద్రా! తల్లి! కామేశ్వరీ. 942

మ. జతనంబుం బొనరించి నే నెటులొ యాస్థానే కవీశత్వ మూ
ర్జిత మౌ పాండితి గల్గువారు గొని సు శ్రీగూర్పఁ గాఁదగ్గ ద
ర్హ్యత లేదంచు నెఱింగికూడఁ గొనలేదా గౌరవం బంబ? యి
చ్చితి పీ వెందుల కిచ్చితో యెఱుగ నీ చిత్తంబ కామేశ్వరీ. 943

శా. స్థానం బున్నత మే జఘన్యుఁడ, మహో చ్చైఃస్థానవిభ్రాజితున్
దీనున్ జ్ఞానులుగాంచి నవ్వినను నా ధీరత్వమున్వీడ నే
దీనిం గోర, స్వయంవరంపుగతి నే తెంచెన్ గరం బిచ్చిటిన్
నానేరం బిట నింతయే, యెఱుఁగవే నాతల్లి! కామేశ్వరీ. 944

మ. స్వయ మేతెంచి వరించినట్టిదియె నా సర్వస్వ మేపూరి పు
ల్లియుఁ గష్టార్జిత మున్నయట్లెఱుఁగ, బాల్యం బేగెఁ దారుణ్యమున్
వ్యయమయ్యెన్ ముదుకండ నైతిఁ దుదిపాప్రియం బిప్పుడీ ప్రాయమున్
జయమే కా దయ మౌట నీ కృపకు సాక్ష్యం బిచ్చుఁ గామేశ్వరీ. 945

శా. ఆయుర్దాయము మూడు భాగములు సేయన్ దాన "వన్ థర్డు" బో
సేయంగా మిగిలెన్ శరీరము కడున్ జీర్ణించి శుష్కించె శే
షాయుర్దాయము భోజ్యమౌట కడుగడ్డై తోచుఁ ద్వత్సన్నిధి
స్థాయింగా నొనరింపు మేమిటి కిఁకన్ జాలంబు కామేశ్వరీ. 946

మ. "తన పెండ్లిన్ గన దానుగూడఁ జన యత్నం బాచరింపండితం"
డన "నే నెందుకు నాదుపెండ్లి" కను వా రందందు మున్నున్న వా
రని వాకుప్రిత్తురు పెద్ద లిప్డు "చెళపి" శ్శారీతి నున్నాఁడు నీ
యనుకంపన్ సకలంబు భద్రిమగునం చర్థింతుఁ గామేశ్వరీ. 947

మ. జననీ! యుత్సవమంచు నాకు నెదియో సందర్భమున్ గూర్ప నే
ర్చిన నీ వా సభఁజూడవచ్చుటకునై చే విమ్ము కానంత నీ

వనుకంపించినఁ గానిదంచుఁ గలదే? ఆర్యామహాదేవి! స
ర్వనియంతృత్వము నీది నే నెఱిఁగి యారాధింతుఁ గా మేశ్వరీ. 948

శా. చెన్న శ్రీపురమందు యుండి ధరకున్ శ్రేయంబు గల్గించు సం
పన్నుల్ గేస్తులుఁ బండితుల్ కవులు సామ్రాజ్యమ్ము సర్వమ్ము నాఁ
డన్నన్ శ్రీబెజవాడనుండు భవధీ యాదీశ్వరోపత్యకన్
నన్నున్ జూడఁగ వత్తు రెం దటొ జనుల్ నాతల్లి! కామేశ్వరీ. 949

శా. కౌపీనంబు ధరించి యా సభకు నేగ న్నన్ను వీక్షించి ఓ
హో పాఱుం డిటు మారెనే! వయసుచే నొండొక్కరుం డయ్యె వా
గ్వ్యాపారమ్మను మాటతీరు ననుచున్ గారుణ్య మొప్పార నా
పై పేచూతురు పంపు మమ్మ సభకుణ్ వందింతుఁ గామేశ్వరీ. 950

మ. కవులెల్లన్ జయపెట్టువైభవ మొసంగన్ లేదొ సచ్ఛిష్య వ
ర్గవిభూతిన్ గరుణింపవో తనుజను ర్భాగ్యంబు గై సేయవో
వివిధైశ్వర్యము లిచ్చి తింక నొకచే విశ్వేశి నీసన్నిధిన్
గవిగా నుండ ననుగ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరీ. 951

శ్లో. సభాయై మంగళం భూయాత్ సభ్యానాం చ యశస్వినామ్
సర్వం శివమయం భూత్వా చిరవృద్ధిం ప్రపద్యతామ్.
శ్లో. స్వరాజ్యాయ శివం భూయాత్ విజయో విభవో జయః
సర్వం శివమయం భూత్వా చిరవృద్ధిం ప్రపద్యతామ్. 952

— గ ద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతివేంకటేశ్వరులచే రచింపఁ
బడిన నానారాజసందర్శనమ్మనందు సర్వము
సం పూ ర్ణ ము

శ్రీమత్పరదేవతాయై నమః



# శతావధానసారము





శ్రీ

## తిరుపతి వేంకటకవి

ప్రణీతము....

ప్రకాశకులు.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P.O. తూ॥గో॥జిల్లా.

1956.

ఇది

# చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

పర్యవేక్షణలో ముద్రింపబడినది.

★

మూడవ కూర్పు

వెయ్యి ప్రతులు

1956.

★

ముద్రిత:

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్,

ఆలమూరు, తూర్పుగోదావరి జిల్లా.

# ఉపోద్ఘాతము.



చదువరులారా !

ఈపుస్తకమును బ్రకటించుటకు ముఖ్యకారణము, అవధానమన నెట్టిదో అందలి కవిత్వ మెంతరసము తక్కువకలిగియుండునో, అందుఁ గోరెడి కోర్కె లెంతవిషమములుగానుండునో, యను విషయ మెల్లరికిఁ దేటతెల్లంబగుటకే కాని దీనివలన మీమనస్సులను రంజింపఁజేయుటకుఁ గాదు. ఇందులో మాయొనర్చిన యవధానపద్యములన్నియును బ్రకటింపక గ్రంథవిస్తరభీతిచే దశాంశమునకన్నను దక్కువగా మాత్రమే ముద్రింపించితిమి. కొన్ని యవధానములలోని పద్యములు రికార్డు దొరకనందున బొత్తిగా వదలివేయఁబడినవి. ఆయీ యవధానములలో రచించిన పద్యములు గొన్ని యవసరమును బట్టి యిటీవల మేము రచించిన యితర గ్రంథములందుఁ జేర్చియుంటిమి. అవి పునరుక్తిగా భావించి యిందుఁ దిరిగియు నుదాహరింపఁ బడవయ్యె. కొన్నిపద్యములుమాత్రమే మందును నిందును గూడఁ గన్పట్టును. ఏమైనను నట్టిచోట్ల నవధానపద్యములు గ్రంథములలోఁ గలిపినట్టుగనే కాని గ్రంథపద్యము లవధానములలోఁ గలిపినట్లు భ్రాంతి చెందకుండుటకై చదువరులకు నంజలి ఘటించుచున్నారము. ఈవిషయమున మామాట ప్రమాణముగాఁ జేసికొనరేని యాయవధానరచనాకాలమునకును గ్రంథరచనాకాలమునకును గల పూర్వోత్తరసందర్భముం దిలకింతురుగాక ! ఈయవధానము లెట్లెట్లు జరిగినవో దేనియందలి కష్టమెంతయో తెలియఁజేయుటయె కాక మాయెడల నాయాయీకవులకును రాజులకును నితర భాషాపాండిత్యముగల యుద్యోగులకును బత్రికాధిపతులకును గల యనురాగమును వెల్లడింపఁదగు ప్రశంసాపత్రములు — గొన్నిభాగములు గ్రంథవిస్తరభీతిచే మా యవధానపద్యముల వలెనే వదలినను — గొంచెముగా నిందు ననుబంధమున ముద్రింపిం

చితిమి. అందులో గుండు అచ్చమాంబగారిచే రచింపఁబడిన కందపద్యములుకలవు. అప్రస్తుతమేయైనను ఈమెకొక వ్రేలువిడిచిన మేనమామయగు బ్ర॥ శ్రీ॥ వావిలాల వాసుదేవశాస్త్రులవారిచే నొసఁగఁబడి యీమెచేఁ బూర్తిచేయఁబడుటయేకాక పదపడి ఈవిదుషిచే నొసఁగంబడి మాయిరువురిచేఁగూడఁ బూర్తిచేయఁబడిన సమస్య నిందుదాహరించుచున్నారము.

(సమస్య) అచ్చాయమ్మ కవిత్వధోరణి మహాహ్లాదంబు గల్పింపదే.

శా. సచ్చారిత్రులు పండితప్రవరులున్ సన్మాన్యులౌ వారలున్
మెచ్చంజాలనిదైనఁగాని మదిలో మేలెంతుర్నైజమ్ముగా
నిచ్చో సందియమేల ! శాస్త్రికవి కెంతెంతో వినోదమ్ముగా
నచ్చాయమ్మ కవిత్వధోరణి మహాహ్లాదంబు గల్పింపదే ?

శా. అచ్చా ! తిక్కన సోమయాజికృతదివ్యశ్రీక కావ్యాళికిన్
మచ్చా ! తిమ్మన ముద్దుపల్కులకు నమ్మన్ జెప్ప దృష్టాంతమా
యుచ్చస్త్రైణకవిత్వసంతతికి నా నొప్పారుచున్నట్టి యీ
యచ్చాయమ్మ కవిత్వధోరణి మహాహ్లాదంబు గల్పింపదే ?

శా. సచ్చారిత్రపరాంబికాచరణకంజాతార్చనాసక్తిరా
జచ్చేతోంబుజ విద్వదీడ్యకవితాంచద్వంశసంజాత వి
ద్వచ్ఛందాశ్రయితవాసుదేవకవిరాడ్దాయాద యైనట్టి యీ
యచ్చాయమ్మ కవిత్వధోరణి మహాహ్లాదంబు గల్పింపదే ?

కొందఱు కవులు మమ్ముఁగూర్చి తమ యభిప్రాయమును పద్యరూపముగా వ్రాసి సభాముఖమ్మున వినిపించియు, దానిని మాకడ కంపకుంటచే నయ్యవిమాత్ర మిందు బొత్తిగాఁ జేరలేదు........

ప్రశంసాపత్రములలో వ్యాకరణాదిస్ఖాలిత్యములు మాయాశుకవిత్వముతోపాటు కలిగియేయున్నవి కాని చేతివ్రాతపాటులుతప్పఁ దక్కతరములు దిద్దుటకు మా కధికారము లేనందున దిద్దఁబడవయ్యె. ఏవో కొన్ని తప్ప దురుద్ధరము లంతగా లేవని విజ్ఞులకుఁ దెలియును గాని ప్రారంభవశ

యందుండువారికి మాత్రి మన్నియును దురుద్ధరములే యగు నను నూహ కలుగక మానదు. వారు పెద్దలగు వారినడిగి తెలిసికొందురు గాని వృథాగాఁ దమకుఁగల పాండితితోడనే తృప్తినంది యాయాయీ కవుల నేమి మమ్మునేమి నిందింపకుందురుగాక ! యని యంజలి ఘటించు చున్నారము. ఇఁకఁ బ్రకృత మనుసరింపుదము. మేమిందు ముద్రింపించిన యవధానపద్యములు తఱచుగా భిన్నవిషయములుగా నుండునట్లు మాత్రమె విచారించి కైకొంటిమిగాని సరసములగు పద్యములను మాత్రము గైకొని నీరసములను వదలినవారము కాము. కావుననే నీరస పద్యములు గూడ నిందు విశేషించి కన్పట్టును. మాయవధానములలోఁ గొన్నిఁటఁ జెరి సగముగను గొన్నిఁట నాలవ వంతుగను వానమామలావధానములో మాత్రము పాదన్యాసముగను సంస్కృతకవిత్వముగూడఁ గల్గియున్నను నయ్యది సర్వసులభము కాదనియును బ్రకృతకాలముంబట్టి యీయాంధ్రదేశమున దానియం దంతగా నాదరము కనుపట్టదనియును యోజించి తెలుఁగు పద్యములనే విశేషించి కైకొంటిమి గాని గీర్వాణమును బూర్తిగాఁ గాకపోయినను జాలభాగము పరిత్యజించి యెవరేని పండితులు మాయాశుధార సంస్కృతమ్మన నెట్లుండునో యను తలంపు కలవారుండకపోదురా యను తలంపుతో శ్రీవానమామల శతావధాన శ్లోకములుమాత్రము చాలభాగము నిందుఁ జేర్చితిమి. ఇందుఁ గొన్ని యష్టావధానములు సమస్యామయములుగా రచింపఁ బడినవియుఁగలవు. ఏమైనను నిందు మాబుద్ధి బలమునే చూతురుగాని కవితారసముం జూడకుందురుగాక. ఇందు మాకవిత్వమునఁగల కష్టసాధ్యప్రయోగము లాశుధారా కవిత్వము నవలంబించువారి కక్కఱితిని వెల్లడించుఁగాత ! "శుధాతురాణాం నరుచిర్నపక్వ" మనునట్లు నాశుధారాకవయితలకు సుప్రయోగ విచారణమే కాక రసారసవిచారణమును నంతగానుండదని కవితామర్మజ్ఞులకు స్పష్టమే. కావుననే

"తే. గీ. ఆశుధారా కవిత్వమ్ములందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేకయుండుఁ గాన

నెంత చర్చించినను బద్యమంతసార
వంతమగుఁ గాన నిలుకడవలయుఁ గృతికి''

అని యప్పకవి చెప్పియున్నాఁడు. మేముగూడ నానారాజసందర్శ
నములో గద్వాలసంస్థానములో

''ఆశుధారాకవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండ మిచ్చితిఙు''

అని వ్రాసియున్నారము. మేము మహాసభలలో రచించిన పద్య
ములను యథాస్థితముగనే యుంచుట మాయాచారముగనే యున్నను నిం
దచ్చటచ్చటఁ గొన్నిపద్యములు స్వల్పపాఠభేదములు గలిగియుండునేమో
యని సంశయముగా నున్నది. ఏమన మాకు మొదలనుండియు నిన్ని
యవధానములు చేయుదు మనియుఁ బిదప నిట్లన్నియుఁ గొంచెముగొప్ప
సంగ్రహించి పెద్దపొత్తముగఁగూర్చియచ్చొత్తింతుమని యునభిప్రాయము
లేకుంటచే నంత శ్రద్ధచేసి యాయా యవధాన పద్యము లన్నియు సంగ్ర
హించి భద్రపఱచుట తటస్థింపదయ్యె. ఈయూహ యిటీవల నాలుగు వత్స
రములకిందటఁ గల్గినది. అప్పటినుండి చాలభాగము భద్రముగాఁ
గాపాడుచు వచ్చితిమి. అంతకుమున్ను జరిగినవియుఁ జాలభాగము
మాయొద్దనున్నను లేనివానింగూర్చి మాకు సహజమైన ధారణనుపయో
గించి మేనమామపోలికగా సమకూర్చితిమనుటకు సందియములేదు గాని
యేమయినను నట్టియెడ నించుక భేదమున్నను నుండవచ్చును. కేవలధా
రణచేఁ జిరకాలముకిందట రచించినపద్యములు - తూచా - తప్పకుండ
సంగ్రహించుట యసంభవమ గుటచే నించుక మార్పుగలిగి యుండవ
చ్చును. ఇదిగాక యప్పటికప్పుడే మాబుద్ధికి

''బ్రాయపుఁ బ్రౌఢంత కొంతపడమటఁదిరిగె—''

అను నవస్థగూడఁ దటస్థించినది. అయినను ''బెల్లము వండిన
పొయి'' గనుక విశేషభేద మెందును గనుపట్టకుండుట ధ్రువము.
ఈయవధానశక్తిం గుఱించి యనేకు లనేకవిధములుగా భావించుచున్నారు.

అందులోఁ గొందఱి యభిప్రాయములను దెలుపుటకే యిందుఁ గట్టకడపటి యుత్తరములు పనికివచ్చును. అయ్యవి యతిప్రసాదులలోఁగూడఁ దఱచుగాఁ గొన్ని చెడియున్నను నీవిషయమున కుపచరించుననియే కైకొనవలసివచ్చినది. ఇది యిట్లుండ మేము తఱచు దేశాటన మొనర్చు కాలమున నొకప్పుడు మండపేట వెళ్ళినప్పు డక్కడ నున్నట్టియు మహాపండితులగుటయేకాక యాపాదుకాంతదీక్షాపరులగు మహామంత్రవేత్తలొకరు మాయొద్దఁ దాము స్వయముగా నుపదేశము నొందగోరుటయేకాక తమ శిష్యులలో నొకబుద్ధిశాలినిగూడఁ బ్రేరేపించిరి. వారిరువురితో మాకీశక్తి లేశమునులేదనియెంతచెప్పినను 'నపగోప్యాని కారయేత్' గనుకఁ దామిట్లుచెప్పుచున్నారనియే నొడువ మొదలిడిరిగాని నుంతేని విశ్వసింపరైరి. పిదప నెట్టకేలకు వారిని వదలించుకొనుట దుర్ఘటమైనది. ఇంత విచిత్రముగాఁ గాకున్నను ననేకస్థలముల నిట్టిరీతియే జరుగుచు వచ్చినది. మేమును గొంతమందితో నుపాసనాబలమనియే యొప్పుకొని వారిని సంతోషపెట్టుచుండుటయుఁ గలఁదు. ఏమన? యథార్థము చెప్పినచో బొత్తిగా విశ్వసింపరుగదా! మండపేటలోని సంగతిని 67 వ పేజీలో సీసపద్యము నుడువునుగాన వలసినవారది చూడఁగలరు. మున్నెవరికేని యియ్యది యేయుపాసనము వలననైన లభించియుండునేమో మాకుఁ దెలియదుగాని మాకుమాత్ర మట్లు రాలేదని యథార్థముగా వక్కాణించు చున్నారము. ఇందులకు బుద్ధిబలమును సహజమైన యాశుధారయును దానితోపాటు ధైర్యస్థైర్యములును పైనిశాస్త్రజన్యజ్ఞానాదికమును ముఖ్యకారణములు. అన్నిఁటికన్న నాశుధారయు ధైర్యస్థైర్యములును బుద్ధిబలమును మఱియును బ్రధానములు. ఇది మాయనుభవము. దైవకృపయనునది అన్నిఁటికిని గావలయును. అన్నిఁటితోపాటు దీనికి నుండనిండు, కేవలదైవకృపమాత్రము పనిచేయదు. ఇఁక ధారణశక్తింగూర్చి యభ్యాసము కారణమని యనేకు లభిప్రాయపడుచున్నారు. వారింగూర్చి కొంత వ్రాయఁదలఁచియు వారును మంత్రశాస్త్రవేత్తలవలెనే విశ్వసింపరని మిన్నకుందుము. దాక్షిణాత్యుల యవధానమునకును మన తెలుగు

దేశపువారి యవధానమునకును జాలవఱకు భేదముగలదు. అదిగూడ నవసరమనియెంచి యించుక వ్రాసియు చున్నారము. మనయవధానము నూఱుగురికిఁ గవిత్వముచెప్పుట. వారు నూఱుపనులేవో చేయుట. అందులోఁ గవిత్వము కడు స్వల్పమే యుండును. బాగుగఁ బరిశీలించిన మన యష్టావధానము వారి శతావధాన పదమున కర్హమైనదని మాయభి ప్రాయము. ఈ సంగతి నానారాజసందర్శనములో గద్వాలలో తాతాచా ర్యులవారి యవధానమునుగూర్చి మేము చెప్పిన యుపన్యాసపద్యములు వెల్లడించును. ఇంతకును మనకు శతావధానమనఁగా శతలేఖిన్యవధాన మని తేలినది. ఈ యవధానమే భట్టుమూర్తి ప్రభృతులొనర్చినది. కావు ననే ఆయా కవులకు "శతలేఖినీపద్యసంధాన ధౌరేయుఁ" డనియు "శత లేఖిన్యవధానపద్యరచనాసంధాసురత్రాణుఁ'' డనియు, బిరుదులు విద్వత్స మ్మతములైయున్నవి. పైచొప్పుననే శ్రీమదభినవపండితరాయ విద్వన్మా డభూషి వెంకటాచార్యులవారు రచించియున్నారు. ఏతదనుసారముననే మేము ప్రప్రథమమున—

శ్లో. తత్తన్నామనవమానసాదృతతమం వృత్తం తథావస్తుచ
స్వీకృత్యప్రథమంశతాయసరయం తత్పాద మేకంవదేత్
భూయఃకైర్ణచబోధితః క్రమవశాత్పాదత్రయం కీర్తయే
దేతన్నామ శతావధాన మథచేత్పద్యాని సంకీర్తయేత్

అని శతలేఖిన్యవధానమునకును,

శ్లో. కావ్యోక్తిః కవితోక్తిరంచితకళా విద్భిస్సహాభాషణం
పౌరాణోక్తిరమందలౌకిక గిరోవ్యస్తాక్షరోక్తిస్సమం
ధీమద్భిశ్చతురంగఖేలనమథో సంఖ్యేయపుష్పాళయో
యస్మింత్స్యాద్యుగపత్తదేవకృతినామష్టావధానాభిదం

అని యష్టావధానమునకును లక్షణము లేర్పఱచు కొన్నాము. ఈ శ్లోకార్థము అనుబంధమున ఉపాధ్యాయోపయోగినియందుఁ బూర్తిగా

వివరింపఁబడియే యున్నది గాన నిటవ్రాయఁబడదయ్యె. అష్టావధానము నకు మాత్రము తెలుఁగులోఁగూడ లక్షణము మాచేతనే రచింపఁబడి యున్నది అది యిందుదాహరించెదము.

శా. పౌరాణోక్తికవిత్వ పుష్పగణనావ్యస్తాక్షరుల్ లౌక్యగం
భీరోక్త్యంచితకావ్యపాఠనకలావిద్యాషణంబుల్ ముదం
బారంగాఁ జతురంగ ఖేలనము నీ యష్టప్రకారంబు లౌ
ప్పారున్ శంకర ! యేకకాలముననే యష్టావధానమ్మనన్.

మేమేర్పాటుచేసికొన్న దింతమాత్రమే యైనను నిందులకు నెన్నియోరెట్లు కష్టమునంగీకరించి చేసిన యవధానములు మాత్ర మనేక ములుగలవు. ఈవిషయమున నెల్లూరు వెంకటగిరులు ముఖ్యముగా నచ్చటివారివ్రాఁతల మూలమున మీకు సాక్ష్యము నీయఁగలవు. శతావ ధానవిషయిక వైలక్షణ్యమునకు విజయనగరము పూర్వరీతిగనే సాక్షికాఁ గలదు. ప్రకృతమీపుస్తకములోఁ మాకు 20 సంవత్సరములు వచ్చు టకుఁ బూర్వము రచించిన యవధానపద్యము లున్నభాగమును బూర్వార్థ మనియుఁ, బదపడి రచించిన యవధానపద్యభాగమును ఉత్తరార్ధ మనియు వాడితిమి....................ఇప్పటికి మావయస్సు రమారమి 37 సంవత్సరములు. ఇందు తిరుపతికన్న వేంకటేశ్వరుఁడు నాల్గుమాస ములు పెద్ద. మేమిరువురమును శ్రీ చర్లబ్రహ్మయ్యశాస్త్రులవారి ప్రియ శిష్యులము. ఆయా యీ సంగతులు ప్రకృతగ్రంథమున నచ్చటచ్చట వెల్లడియగును....................ఇందలి యవధానము లేవో పదిపద కొండుదప్పఁ దక్కినవన్నియు నుభయకృతములే, నానారాజసందర్శన మున "ఒకచరణంబతండు మఱియొక్కటినేను" అను పద్యముం జూడుఁడు. ఆమాత్రమేని యేకైకకృతములుండుటకు నిటీవల మేము వేఱువేఱుచోటుల నివసించుచుంటయు సమయమున కిరువురమును జేర కుండుటయుఁ గారణములు. "ఒక్కరు రచించిరేనియును గాదగుఁ దిర్పతి వేంకటీయమై" అనిమా "జాతకచర్య" యను గ్రంథమున వ్రాసికొని యున్నారముగాన నెవరేది వ్రాసినను దత్కర్తృత్వ ముభయులకును

నుండియే తీఱును. భేదముకూడ నంతగా నుండదనియే లోకుల యభి ప్రాయము. నిజముగా నట్లేయైయుండునని మేమును ననుకొందుము. రాజులపై మేము రచించిన పద్యముల నన్నింటిని వేఱుఁజేసి "నానారాజ సందర్శనమ" ను పేర నింకొక గ్రంథమును గూర్చితిమి. ఈ యుభయ గ్రంథములందును సాధ్యమైనంతవఱకు నాశుధారాకవిత్వమే యుండును. రాజ సందర్శనములో మాత్రము చెఱి సగమువఱకు నాశుధారాకవిత్వమే యైనను తక్కిన సగమును నట్టిదికాకపోవచ్చును. అనగాఁ గాకితము పుచ్చుకొని వ్రాసినదియని మీరూహించుకొందురు గాక! ఆశుకవు లేగ్రంథము రచించినను నెట్టికల్పన ఘటించినను జిరకాల మాలోచింప రని మా యనుభవము. కల్పనతోఁచుటయే తడవుగాని పద్యరచనకు నేవిధమైన యాలస్యమును నాశుకవుల కవసరముండదని దృఢముగా మేము చెప్పఁగలము. ఇది కొందఱి కతిశయోక్తిగాఁ దోఁచినను వారి యాక్షేపణకు మేము పాత్రులగుచున్నారమని విన్నవించుకొనుచు, నిప్పటికే విస్తరించి వ్రాసితిమను విసువుతో నింతట విరమించెదము.

తిరుపతి వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణ పీఠిక

గ్రంథములు యాచించుచు నితరులు వ్రాసిన పద్యములును, వానికి సంబంధించిన పీఠికయు నీముద్రణమున విడువబడినవి. 1910 సంవత్సరపు బందరుశతావధానము మొదలుకొని చేసిన యవధానములలోని పద్యము లీకూర్పున క్రొత్తగా చేర్చితిమి. వెనుకటికూర్పున నాయాయవధానముల క్రింద చేర్చిన ప్రశంసాపత్రాదికము లీకూర్పున గ్రంథాంతమం దనుబంధముగా చేర్చితిమి,

మా యపరిశీలకత్వమున వాటిల్లిన ప్రమాదాదుల మన్నింప పాఠక లోకమును వేడుచున్నాము.

కాటూరి వేంకటేశ్వరరావు,
ప్రచురణ కార్యదర్శి.



# విషయసూచిక

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# శ తా వ ధా న సా ర ము

( పూ ర్వా ర్ధ ము. )

1. ఖర సంవత్సర ఆశ్వయుజ బ॥ ౧ా శనివారము కాకినాడలో శతావధానమందు రచించిన 103 టికిఁ గొన్నిపద్యములు.

—• సంశయించు సభానాయకునింగూర్చి చెప్పినది •—

చ. నిలిచియె వేయి పద్యముల నేర్పలరంగను సంస్కృతాంధ్ర భా
షలఁ దగఁ జెప్పనేర్తుమని చాలఁ బ్రతిజ్ఞ వహించినట్టి మే
మెలమిని నూఱు పద్యముల నిప్పుడు చెప్పుట కెంత గొప్పయా!
నిల వరబాదమన్వయనదీశసుధాకర! వేంకటాభిధా!

—• శ్రీ రా మ మూ ర్తి •—

సీ. శ్రీమద్ధరణిజాతసీమంతినీమణీ
హాసద్విగుణితపరిభాజ్జకుండు
నమితనిర్జరసంఘకమనీయమకుటసం
ఘటితరత్న ప్రభాకలితపదుఁడు
మహితమసృణవనమాలాకలితగంధ
వాసితదిక్చక్రవాళకుఁడు
ఖండితామరశత్రుమండలమణిగదా
దండమండితభుజాదండకుండు

తే. గీ. భానువంశాబ్ధిసోముండు వరగుణుండు
నైన శ్రీరామచంద్రుం డనంతకృపను
సకల సంపత్సమృద్ధులఁ జక్క నిచ్చి
ధరణి రక్షించు నాచంద్రతారకముగ.

—• విక్టోరియా రాణీగారు (మత్తకోకిల) •—

నీరధారలులేని భూముల నీరధారల ముంచుచున్
సారవత్తరమైన ధాన్యము చక్కఁ బండఁగఁజేయుచున్
భూరిసౌఖ్యము మానవాళికిఁ బొల్పుమీఱఁగఁ జేయు వి
క్టోరియాభిధరాణి నెన్నఁ బటుల్ జగమ్మున లేరుగా.

—• స్త్రీ వర్ణనము •—

సీ. నీరజాతముఁబోలు నెమ్మొగమ్మున మేలు
కస్తురి నామమ్ము కళలు గులుక
రంగారఁ గట్టిన బంగారుసరిగంచు
చీర పాదములపైఁ జిందులాడ
వలలోఁ బడిన జక్కవలఁబోలి కుచపాళి
కంచెల ఖండించుకరణి నిగుడ
నిరువంకఁ గువలయసరములు దాపిన
ట్లతిసీల నేత్రాంతగతులు వెలఁగ
తే. గీ. చెలి యొకతె వచ్చుచున్నది చెలులఁ గూడి
యలరువిల్తుని మేల్బావుట మ్మనంగ
దానిఁ గూడంగఁగల్గిన మానవులకుఁ
వేఱె నాకాబలారతుల్ గోర నేల?

—• ఇంగ్లీషు విద్య •—

మ. తిరిపం బెత్తెడివారి వెయ్యది మహాదేవేంద్రులం జేయునో
పరసీచాన్వయజాతు నెయ్యది మహావంశోత్తముం జేయునో
ధరణిన్ వైదికునైన నెయ్యది తగన్ దా హూణుఁగాఁ జేయునో
వరశోభాకర మట్టి హూణకల నే వర్ణింపఁగానేర్తునే!

—• అతిబాల్య స్త్రీ వివాహము •—

చ. జనములు చిన్నికన్నెలకు సత్వర మొప్పఁగఁ బెండ్లి చేసినన్,
ఘనమగు తెల్వి లేకునికిఁ గన్నియ లప్పుడు పెండ్లి యాడి, యా

వనమున నాత్మకుం దగనివాఁడయినన్ దిగనాడి యాతనిన్
ఘనత దొలంగ జారరతికాంక్ష లొనర్చిన దోసమౌఁజుమీ !

—• దేశాటనమువలని లాభము •—

ఆ. వె. దేశచాలనంబు తెల్వి పుట్టఁగఁజేయుఁ
గరుణ మనమునందుఁ గలుగఁ జేయు
నతిథిపూజలందు నాసక్తి పుట్టించు
ధైర్య మిచ్చు రిక్తదశ నడంచు.

—• రామరావణ యుద్ధము •—

శా. రాముం డప్పుడు బాణసప్తకముచే రక్షోవరుం గొట్టినన్
భీముండై దశకంధరుండు విపులాభీలాతిహేతిచ్ఛటా
ధామస్ఫూర్జితవీతిహోత్రుఁ డగుచున్ ధైర్యంబు పెంపారఁగా
భూమాత్రమ్ముల రాము నేయ నపు డా పో రయ్యె ఘోరమ్ముగన్.

—• ప్రాతఃకాలము •—

మ. కమలమ్ముల్ వికసింపఁ, గోకవితతుల్ కాంతిన్ జెలంగన్ దగన్
విమలాకాశమహాంతరాళమున దీప్తిజ్వాల లింపారఁగాఁ
గమలాప్తుం డుదయింపఁ, దూర్పుమలపైఁ గాంతిచ్ఛటల్ తారకా
సముదాయమ్ముల జాఱెఁ, దెల్విగనియెన్ సర్వప్రపంచమ్ములున్.

—• భోగముదాని సిగపూవు •—

ఉ. సూనము చూడు మిత్రవర ! సూనశరార్త భుజంగసంఘస
న్మానితవారయోషిదసమాననవాంబుదకేశపాశస
న్మానము గాంచి మించెడు ఘుమంఘుమవాసితధర్మనిర్మితా
నూనవిభూషణం బయి మహోన్నతభాగ్యదశావరీతమై.

—• కాకినాడలోని యుదకసదుపాయము •—

తే. గీ. బచ్చువంశాబ్ధిసోముండు వరగుణుండు
గర్వదూరుండు దామేశఘనుఁడు పేర్మి

గచ్చుకుండ్లను గట్టించి కడపె జలము
కాకినాడపురమ్మునఁ గఱవు దీఱ.

—• సభానాయకుఁడు •—

తే. గీ. గుణగణాఢ్యుండు రసికుండుఁ గుశలమతియుఁ
పండితోత్తమహృత్పద్మభానుమూర్తి
దానకర్ణుండు దుర్జనదానవహారుఁడు
సభకు నాయకుఁడై యుంట సమ్మతంబు.

—• శ్రీరామమూర్తి •—

సీ. శ్రీమత్క్షణప్రభాస్తోమసంగతమేఘ
మన జానకినిఁ గూడి తనరువాఁడు
అబ్జమ్ముపై నొప్పు నళిచందమున మొగ
మ్మున మృగీమదనామమొనరువాఁడు
అంజనాచలముపై నలరారు వాగ్ధుని
యనఁ బీతపటము మైఁ దనరువాఁడు
నీలశిలన్ గ్రాలు నిర్ఝరాపగ యన
నురమున హారముల్ వఱలువాఁడు

తే. గీ. నైనశ్రీరామచంద్రుఁ డనంతకృపను
గాకినాడసభాసీమఁ గలసి యున్న
సర్వమానవులను బ్రోచు సకలసంప
దల నొసంగుచు నాచంద్రతారకముగ.

—• ఆదిశక్తి •—

చ. నిరతము మానసమ్మునను సేర్పునఁ గొల్చెద శక్తి భక్తితో
సరసిజసంభవాదిదివిజప్రకరార్చితపాదపంకజన్
సరసిజమిత్రచంద్రమఉషర్బుధరూపవిలోచనోజ్జ్వలన్
దిరుపతివేంకటేశ్వరసుధీమణిగీతసహస్రనామకన్.

## —• ఉద్యానవనము •—

ఉ. మేలగు పుష్పకాననము మిత్రుఁడ ! చూడుము వేడ్క మీఱఁగా
బాలరసాలశాలిపికపాళిమధువ్రతపాళిగానలీ
లాలలితంబు సంతతరథాంగమరాళయుగాభిశోభితో
న్మీలదనంతపద్మరమణీయసరోవరరాజమానమున్.

## —• బృందావనము •—

తే. గీ. డంబు మీఱెడి బృందావనంబు చూడు
మంబుజాక్షుండు కాంతాజనంబుతోడ
నిచట వసియించుటనుజేసి యిది సమస్త
లోకములలోన మిగుల సుశ్లోకమయ్యె.

## —• లక్ష్మి •—

మ. కలధౌతాంబరుదేవి నా మనమునన్ గాంక్షింతు నెక్కాలముం
గలధౌతోజ్జ్వలదంగవిభ్రమకళాకళ్యాణజాలాస్పదన్
గలధౌతోదరముఖ్యనిర్జరమనఃకంజాతసూరాయితన్
గలధౌతాదిధనాభిశోభితమహాగారావళీవాసినిన్.

## —• కఱవు •—

శా. ధారాపాతము లేక సస్యవితతుల్ తప్తమ్ము లయ్యెం గడుం;
జేరెన్ సర్వజనంబు నీపురమునే జీవింప, వారందఱిన్
శ్రీరామేశఘనుండు ప్రోచి మను దా శ్రీవృష్టి నాశమమున్
బాఱన్దోలెను; దానిఁ గోర మరలన్ బాగెట్లగుం దెల్పుమా !

## —• కావ్యము •—

స్రగ్విణి. సారరాజన్యులన్ జక్క మెప్పించుచున్
జారువాక్చిత్రవిస్తారపద్యమ్ములన్
సూరిచేతోలసత్స్వానసౌరభ్యమై
మీఱుకావ్యమ్ము నెమ్మిన్ బ్రశంసించెదన్.

—• వేశ్య (భుజంగ ప్రయాతము) •—

చలాపాంగదృష్టిప్రసారమ్ముచేతన్
విలాసమ్ములం జూపి విత్తమ్ములాగున్,
గలావిద్విరాగిప్రకాండమ్ము నైనన్
గలంచున్ భువిన్ విత్తకాంతాజనంబౌ.

—• చంద్రోదయము •—

ఉ. శ్రీరమగేహముల్ గనుకఁ జేయుచుఁ గోకములం గలంచుచున్
జారుచకోరసంతతులఁ జక్కఁగ వెన్నెల నాదరించుచున్
మారునకున్ సహాయుఁడయి మానినులం గలఁగంగఁ జేయుచున్
మీఱెడుఁ జంద్రుఁ డుజ్జ్వలతమిస్రమహీధరవజ్రవజ్రమై.

—• మన్మథోపాలంభన •—

ఉ. నీరజవాసయై తనరు నీరధిపుత్రికిఁ బుత్రకుండవై
నీరజశత్రుఁ గూడి నవనీరజగంధుల నేయ న్యాయమా ?
నీరజసూనముఖ్యశర ! నీరజవిష్టరసోదరా ! నినున్
నీరజముఖ్యసూనముల నేర్పునఁ బూజ లొనర్తుఁ బ్రోవరా !

—• కేవలవేదపాఠకుఁడు •—

సుగంధి. వేద మెల్ల నభ్యసించి వేత్తృతావిహీనుఁడై
మీఁదఁ గర్మజాల మెల్ల మేలుగా నొనర్చినన్
లేదు లేదు లేదు పుణ్యలేశమైన నంచు నా
వేదమే వచించుఁ గాన వేది వేత్త గావలెన్.

—• ఆసుపత్రి •—

శా. నీరోగార్తజనాళికిన్ శరణమై నీరోగులం జేయుచున్
శారీరాదిసమస్తపుస్తకలసత్సారమ్ము నింగ్లీషుభా
షారీతిన్ గృతిచేయు డాక్టరులచేఁ జారుప్రభాభాసురం
బై రాజిల్లెడి యాసుపత్రిఁ గన నాహా ! సౌఖ్య మొప్పారెడున్.

—• నా ట కు లు •—

చ. సలలితనాట్యచిత్రముల సభ్యులచిత్తము లుల్లసిల్లఁగా
బలువడిఁ జేయుచున్ మిగులఁ బావనమై తనరారు విష్ణుచ
ర్యల శివచర్యలన్ గమలజాసనుచర్యల నెప్డుఁ బాడుచుణా
వెలయుదు రిట్లు నాటకులు విశ్వజనీనకళాధురీణులై.

—• శా ర్దూ ల ము •—

శా. ఘోరాకారము సర్వహింసకమునుం గుంజాంతరావాసమున్
రారాజద్ధరణీధరాకరకవక్త్రమ్మున్ మహాభీలగం
భీరారావపలాయమానమహిషీభీత్యుద్గతాభీలసం
చారానేకమృగాళిదిఙ్నిచయమున్ శార్దూలమున్ జూడుమా!

—• ఉపరతి, రూపకాతిశయోక్తి •—

క. ఘనవితతి చంద్రుఁ గప్పెను,
గనకలతన్ బూలు పూసెఁ, గనకకనత్కుం
దనవసుమం బదరె, నళియుఁ
గనకము దఱి జేరెఁ; గాంత కాంతుని గవయన్.

—• సీతాకళ్యాణమ్, (ఉపజాతిః) •—

ఏనా మనూనాకృతిభాసమానాం
మత్పుత్రికాం తే ప్రదదే హి జాయాం
తథాచ కించిత్తు లపామి సంజ్ఞా
శాస్త్రం త్వయైషా విధినేవ మాన్యా.

—• త్రిమూర్తయః, (పృథ్వీ) •—

పురాంతకమురాంతకద్రుహిణరూప మీదే మహః
కృపామృతఝరీలసన్నయనసీరజాతం తతం
సమస్తమునిరాణ్మనఃకమలభాస్కరం సత్కరం
సురేంద్రముఖదేవతామకుటరత్నశుంభత్పదం.

—• ఆంజనేయః, (రథోద్ధతగతిః) •—

మరుత్సుత మముం సదా హృది భజే
హరిప్రభువరం విశాలకరుణం
కుజారమణపజ్జలేజమధుపం
సదానరజనీచరాళిహరణం.

—• మరణసమయః, (క్షమా) •—

యమభటనికరే సన్నిధిం సంగతే
మతి రతిచపలా జాయతే దుఃఖితా
భయమపి పృథులం బాధతే మానసం
నచ గమనమతి ర్దారపుత్రాశయా.

—• (సమస్య) బకమున్ వడి మ్రింగుచున్న బల్లిం గనుమా •—

క. ప్రకటతరకప్పగంతుల
సుకులోదధిపూర్ణచంద్ర ! సూరిజనేంద్రా !
సుకరముగ మక్షికాశా
బకమున్ వడి మ్రింగుచున్న బల్లిం గనుమా !

—• (సమస్య) అంధుం డర్ధనిశీథమందుఁ గనె నయ్యర్కేందుబింబమ్ములన్ •—

శా. పుంధర్మేత సరస్వతీకవులతో భూపాలకుం "డాదితే
యాంధ ప్రేక్షగభస్తిబింబముల దీవ్యద్వృత్తి వర్ణించి స
ద్గ్రంథమ్ముల్ రచియింపుఁడీ" యనినఁ దద్గ్రంథానుసంధానని
ర్బాంధుం డర్ధనిశీథమందుఁ గనె నయ్యర్కేందుబింబమ్ములన్.

—• అసూయచే సభకు రాని కుకవులు •—

చ. తెలుఁగుల నించుకంతఁ గని తేలికకబ్బము లల్లునట్టి వా
రలు వరసంస్కృతాంధ్రకవిరాజవిరాజితమై కరంబు పెం
పలరు సభాంగణంబున కహో ! పిలువన్ దగ రాఁదలంతురే !
యిల వరబాదమన్వయనదీశసుధాకర ! వేంకటాభిధా !

క. నీరసపు బకము దగఁ దా
సారస మగునా ? కవీంద్రసమతం గనునా
సైరిభము ? కుకవిజనుఁ డిల
సారతరకవీంద్రుఁ డగునె ? చర్చింపంగన్.

క. నాకబలివశ్యైరమ్ముల
నాఁకట జీవించు కుకవు లరుగుదురె ? లస
న్నాకనిలయకవిసమకవి
నాకాధిపు లున్నసభ కనాతుర లగుచున్.

తే. గీ. "ఫలవిఘాతము గల్గెడి బ్రాహ్మణున" క
టంచుఁ బల్కెడు రఁట గృహమంద పొంచి;
తమకుఁ గల్గెడిభంగమ్ము తా మెఱుంగ
రహహ ! యేమందుఁ గుకవుల యాగడంబు.

సీ. పంకగంధావాప్తిఁ బరఁగెడి సూకరం
బరుగునే ? పన్నీటిసరసులకును
నింటఁ బ్రగల్భమ్ము లెలమిఁ బల్కెడి బంటు
చేరునే ? రణఘోరసీమలకును
గోటరమ్ముల మ్రగ్గు గుడ్లగూబలపిండు
లాసచేయునె ? ప్రాతరాతపముల
కనవరతాంగనాజనలోలుఁ డరుగునే ?
కాశ్యయోధ్యాప్రయాగగయలకును

తే. గీ. ద్విజగణోత్తమకవిరాజదీప్త మైన
సభకుఁ గుండలి చేరునే ? చనిన శిరము
నెత్తునే ? వంచుకొని మూల నిరుకుఁ గాని,
రమ్యతరకీర్తి ! వేంకటరత్నమూర్తి !

2 నందన సం॥ శ్రావణములో నమలాపురము శతావధానములో రచించిన నూటికిఁ గొన్నిపద్యములు.

—• కాళియమర్దనుఁడు •—

క. కాళియమర్దనుఁ గొల్చెద
నాళీకవిలాసనయను నతసురవరు గో
పాళీగోపాళీయుతు
మౌళిగతమయూరపింఛు మాధవు ననఘున్.

—• కృష్ణకృతార్జునోపదేశము. (పంచచామరము) •—

సమస్తమున్ మృషా సుమీ నిజమ్ము పాండునందనా!
భ్రమ న్నశింపఁజేసి చూడు బంధు వెవ్వఁడో? మదిన్.
నిమిత్తమాత్రి ముండి నీవు నీదు శస్త్రపంక్తులన్
గ్రమమ్ముగా నరిన్ హరించి రాజ్యమున్ గ్రహింపుమా!

—• భీష్ముఁడు •—

సీ. ఎవ్వాఁడు ఖండించె నేపుమీఱెడి పాండు
నందను సేన నానంద మొప్ప
నెవ్వాఁడు విష్ణుచే నెలమిఁ జక్రిమ్ము దాఁ
బట్టించి ప్రతినను భంగపఱచె
నెవ్వాఁడు శరముల నెసఁగఁ దల్పముచేసి
బాగుమీఱఁగ నందుఁ బవ్వళించె
నెవ్వాఁడు మాఖశుద్ధైకాదశీతిథి
హరివాసమునకుఁదా నరిగెఁ బ్రీతి

తే. గీ. నట్టిభీష్ముని సర్వవేదాంతతత్త్వ
నీరరాశిఘటోద్భవు నిర్జరేశ
ముఖ్యసంస్తూయమానసంపూర్ణబలుని
వర్ణన మొనర్చు కొలఁది యెవ్వారి కాదవు!

—• శతావధాన విఘటకాః. (ప్రహర్షిణీ) •—

యే కేచి చ్ఛతకవయో యథా పతేయుః
కుర్వంతు ప్రతిచరణం తథా ప్రయత్నం

లోకే దుర్జనయశసే స ఏవ తేషాం
నో బాధా భవతరుణీవశా త్కవీనామ్.

—• సీ తా రా మః (మణిబంధవృత్తమ్) •—

భావయ సీతారామ మముం, కామద మారా దాజిసుతం
నిర్జరమాన్యం స్తుత్యగుణం, నిర్జితశత్రుం దుర్జనదం.
(సమస్య) అభిలషతి హి వేశ్యాలింగనం సిద్ధయోగీ.

శ్లో. విపినమధివసంతం మౌనిరాడృశ్యశృంగం
స్వనగర ముపనేతుం తద్గతా వారయోషాః
పర మతియతిబుద్ధ్యా సస్త్రియా అజ్ఞాతాయా
అభిలషతి హి వేశ్యాలింగనం సిద్ధయోగీ.

—• (సమస్య) వర్షోదయం వాంఛతి రాజహంసీ •—

శ్లో. కీర్త్యా స్థిరాయాం భవత స్థ్సిరాయాం
మందాక్షభారేణ విలోకితుం తాం
అసూయయం త్యాపది మర్తుకామా
వర్షోదయం వాంఛతి రాజహంసీ.

—• (సమస్య) వ్యాఘ్రో మృగం వీక్ష్య హి కాందిశీకః •—

శ్లో. శృతేఽపి మన్నామని కాందిశీకో
రామో భవే దిత్యభయం వదంతం
సీతే త్యవోచ ద్దశకంధరం చే
ద్వ్యాఘ్రో మృగం వీక్ష్య హి కాందిశీకః.

—• (సమస్య) కువిందరాజం మనసా స్మరామి •—

శ్లో. దుశ్శాసనే నాపహృతాంశుకాయాం
హఠాత్సభాయాం ద్రుపదాత్మజాయాం
తదీయమానావనవస్త్రదాన
కువిందరాజం మనసా స్మరామి.

—• (సమస్య) చంద్రోదయం వాంఛతి చక్రవాకీ •—

శ్లో. బందీకృతేఽర్కే దశకంధరేణ
సదా స్థితే చంద్రమసి స్థిరాయాం
వధం విధాతుం కిల తస్య రామ
చంద్రోదయం వాంఛతి చక్రవాకీ.

—• (సమస్య) మృగీ మునిం పుత్ర మసూత సద్యః •—

శ్లో. తపోవనే సత్త్వవివాదశూన్యే
మునేః కళత్రంచ మృగీ చ కాచిత్
గర్భం దధౌ తత్రమునేశ్చ పత్నీ
మృగీ మునిం పుత్ర మసూత సద్యః.

—• (సమస్య) భార్యాం నమతి సోదరః •—

శ్లో. సుశీలేన సమాయుక్తా, ముత్తమశ్లాఘ్యవర్తనాం
పతివ్రతాగ్రణీం భ్రాతు, ర్భార్యాం నమతి సోదరః.

—• (సమస్య) అవందత సుతం తదా •—

శ్లో. ఇవటూరికులాబ్ధీందో, శాస్త్రిన్ మల్లయనామక
వసుదేవో విష్ణురూప, మవందత సుతం తదా.

—• (సమస్య) మానవతీలలామ కభిమానమె చాలును జీర యేటికిన్ •—

ఉ. ఓనవనీతచోర ! కృపయుంచి పటమ్ముల నిచ్చి వేగ మా
మానము గావుమన్న వ్రజమానిని పల్కుల కెంతొ వింతన
వ్వాననసీమఁ దోఁపఁ గమలాక్షుఁడు దా నిటు పల్కె, మానినీ !
మానవతీలలామ కభిమానమె చాలును జీరయేటికిన్.

3. విజయ సం॥ ఆషాఢములో ఏలూరిలోని రెండవధానములలోని యేఁబదికిఁ గొన్ని పద్యములు.

—• ముసలిమగఁడు, పడుచుభార్య •—

సీ. "ద్రవ్యసంజాతంబు దగ లేదటంటిమా
మూల్గుచున్నది మూలమూల లంటి

శయనగృహాదులు సఖి ! లేవటంటివా
యవి యపారముగ నున్నవియెసుమ్ము
వెనుక దక్షత యెవ్వరును లేరటంటివా
తలవెండ్రుకలకన్నఁ గలరు హెచ్చు
ఉన్నయూరునఁ జెట్టు లున్న వారంటివా
సజ్జనవ్రాత మేచక్కఁజూడ
తే. గీ. నయిన నామది కేమొ స్వాస్థ్యమ్ము లేదు
అతివరో ! చెప్ప నాకు సిగ్గయ్యెడుఁజుమి''
యంచు నీలాటిరేవున మించిమించి
పల్కుచుండును వృద్ధుని బాలభార్య.

— పకోడీ —

చ. కరకరలాడు కొంచెమగుకారము గల్గుఁ బలాండువాసనా
హరమగుఁ గొత్తిమీరియును నల్లముఁ గన్పడు నచ్చటచ్చటన్
ధరను బకోడిఁబోలెడు పదార్థము లేదని తద్రసజ్ఞులా
దరమునఁ బల్కుచుందు రది తాదృశమే యగునంచుఁ దోఁచెడిన్.

— జారులు —

సీ. లేనిసింగారంబు మేనఁ బూనెడుబుద్ధిఁ
క్రొత్తబట్టలు కొన్ని కొంచుఁగొంచు
తమశిరోజమ్ముల ననుదినంబునను సం
పెఁగనూనెచే దువ్వి పెంచుకొంచు
తండ్రి సంపాదించు ధనము దొంగిలి దాని
భోగాలకును ధారఁబోసికొంచు
చెలికాండ్రమాటలు చెవిఁబెట్టి తల్లిదం
డ్రులమాట విసముచాడ్పునను గంచు
తే. గీ. ధనము దొరకకపోయిన ధనిగృహమ్ము
లందుఁ జోరత్వమున ధన మందుకొనుచు

నిందు నందునఁ జెడిపోయి నిందలకును
బుట్టలై యొప్పుదురు జారపురుష లకట !

—• కలియుగరీతి •—

సీ. వేదవేదాంగాది విద్యల విడనాడి
బ్రాహ్మణు లింగ్లీషుభాషు లైరి
క్షత్రియధర్మంబునఁ జరియించు రాజకు
లంబెల్లఁ జేత హాలమ్ముఁ బూనె
వాణిజ్యవృత్తిచే వణిలు కోమటులెల్ల
యజ్ఞయాగాదికృత్యపరు లైరి
ద్విజసేవకత్వవృత్తిని జీవనము సేయు
పాదజుల్ ద్విజసేవ్యపదము గనిరి
తే. గీ. హూణులెల్లను రాజ్యపరివీణులైరి
గౌరవము లేనివా రధికారు లైరి
పేరులేనట్టివారు కుబేరు లైరి
కలియుగపుఁ జర్య లేమనఁగలము మనము.

—• వేశ్యారీతి •—

సీ. రంగుమీఱెడు గాగరాలచేఁ బూలచే
లేని సింగారమ్ము మేన నూను
మీసాలపై తేనెతో సమానంబైన
మాటలచే జారుమనము ద్రొబ్బు
సంసారమున జ్ఞాని సంచరించెడురీతి
జారులతోడఁ దా సంచరించు
జనులందఱును గూడ జారపూరుషులైన
లోకోపకృతి యంచు లోననెంచు
తే. గీ. జారు ధనమెల్ల ద్రొబ్బి పకీరుఁజేసి
మరల వాఁ డరుదేర నమ్మ నుసుకొల్పి

తాను గనుపట్టకయె వానిఁ బోనడంచుఁ,
జెప్ప దలనొప్పి వేశ్యల చెడుగుణములు.

—• గంజాయి •—

క. మందత కలుగం జేయు న
మందానందం బొనర్చు మానసమునకున్
గొందఱి తత్త్వమ్ములకును
గందరగోళం బొనర్చు గఁజాయి తగన్.

—• మాత్సవధూః, (పుష్పితాగ్రా) •—

ముహురపి పముహు స్స్వకాళిజాలై । రతిమృదువాక్యరసేన బోధితాపి
స్వయమపిచ తథావిధానురాగా।శయనగృహం నచయాతి వైన వోఢా.

—• అధరసుధా, (వియోగినీ) •—

న సితా నచ గోస్తనీఫలం । ప్రతిమా మేతి రసస్య యస్యవా
పరివిందతి తం రదచ్ఛదం । పురుషో య స్సతు గర్హతే సుధాం.

—• భాగవతుల హరిశాస్త్రిణః, శ్లేషః •—

శ్లో. శ్రీమద్భాగవతాన్వయాంబుధివిధూరాజత్కలాపాలకః
పాణిన్యుక్తసుదర్శనశ్చ విబుధారాధ్యాంఘ్రియుగ్మాంబుజః
సత్యాసక్తహృదంతరో నిరుపమ శ్చానంతగోవర్ధనః
పాయా దేష హరిర్యథా స చ హరి స్సర్వాఘవిధ్వంసకః.

—• విభూతిఫలం, (పుష్పితాగ్రా) •—

హృదయ మివ సతా మతీవ శుద్ధం
విలసతి కందుకవచ్చ వృత్త మేతత్
భసితఫల మహో యదీయలేశం
ధృతవతి పుంసి సమస్త దోషనాశః.

4. విజయ సం॥ శ్రావణ భాద్రపదమాసములలో బందరులోని యనేక శతావధానాష్టావధానములలోని యనేక పద్యములలోఁ గొన్ని పద్యములు.

—• రాబ్రిసన్పేటబజారు (మాలిని) •—

లలితరుచి వెలుంగున్ రాబ్రిసన్పేట మధ్యన్
జలము గలిగి వాపీసామ్యరారాజితంబై
చెలఁగు సరము, క్రయ్యశ్రీకవస్తుప్రపంచం
బలవడి కనుదోయింబండువుల్ పండఁజేయున్.

—• పచ్చిమిరపకాయ •—

సీ. ఎద్దానిసంబంధ మెలమిఁగల్గినమాత్రఁ
గూరలెల్లను మంచి గుణము గనునొ
కొత్తిమిరిని నూఱుకొని తిన్న నెయ్యది
కంచెడన్నము తినఁగలుగఁజేయు
నెద్దాని శిశుజాల మెఱుఁగక చేఁబట్టి
కనులునల్వఁగ మంట గలుగఁజేయు
నెద్ది తాఁగ్రిమముగా నెదిగి పండినమీఁద
బోటికెమ్మోవితో సాటియగునొ

తే. గీ. నూఱిదేనిని పుల్లనై మీఱు మెంతి
పెరుగులోఁ గూర్ప స్వర్గము నెఱుఁగఁజేయు
నరులకెల్లను, నాపచ్చిమిరపకాయ
మహితభక్తిని నేను నమస్కరింతు.

—• కిరసనాయిల్ (స్రగ్ధరా) •—

నోక్రిణంతుస్మ కేవా తదిహ కిరసనాల్నామకం తైల మేత
ద్యద్గంధః పైత్యరోగం జనయతి సకృదాస్వాదనా త్పూతిగంధీ
యద్ధూమో నేత్రరోగం జనయతి నితరాం బాలమానుష్యలోకే
ప్యగ్నౌ క్షిప్తం యదిస్యా ద్యదపి జగదిదం భస్మసా చ్చర్కరీతి.

—• బ్రాహ్మణులకును వైశ్యులకుఁ గలిగిన కలహము •—

సీ. గ్రామపౌరోహిత్యకర్మచే జీవించు
వారలెల్లను భాగ్యదూరులైరి

వ్యవహారధర్మముల్ వదలి కోమటులెల్లఁ
బైతృకాన్నంబుల బలుపుఁ గనిరి
తగ స్వప్నమందైనఁ దలఁపరానటువంటి
బ్రాహ్మణద్వేషంబు ప్రబలుచుండె
బ్రాహ్మణయాచకవ్రాతంబులెల్లను
బ్రాహ్మణయాచకప్రతిభ గనిరి

తే. గీ. కాన భూసురవైశ్యు లనూనభక్తి
రాగములనొప్పి వెలయఁగారాదె, యెంత
కనుపయుక్తవివాదంబు ? లక్కటమున
సేగియేకాని లబ్ధి కించిత్తు లేదు.

—• సంధ్యారాగము •—

సీ. వారుణీకామినీఫాలభాగంబునఁ
బొల్పొందు కుంకుమపూఁత యనఁగ
చక్రవాకీమనస్సరసిజంబునఁ జొరఁ
బారు సంతాపాగ్నివార మనఁగ
నస్తాద్రిపై కేగు నరుణు నడ్డము వెట్టి
నేగు పద్మిని యనురాగ మనఁగ
కాలమాయావిచేఁ గాల్చిపెట్టిన గుండు
స్ఫురదయోమయముల కణకు లనఁగ

తే. గీ. సంజ కెంజాయ చెన్నారె సర్వభూసు
రాధికులు సంధ్య వార్చఁగా నాపగాస
మీపముల కేగి రుత్సాహ మింపుగుల్క
మెల్లమెల్లనఁ జీఁకటు లెక్కండుకొనఁగ.

—• శ్రీవిద్య పూర్వాచారమైనట్లు (ప్రహర్షిణీ) •—

మొల్లాఖ్యా రఘుచరితం పురాకరోద్వై
వెంగాంబా హరిచరితం తథా చకార

తస్మాద్వై సకలకలావిలాసజాలం
సర్వాభిః కిల నితరా మపేక్షణీయం.

—• ప్లీడర్లు •—

సీ. గెలియనట్టిదియైన గెల్చు నటంచును
లాఁ జూచి కల్పనలను ఘటించి
తప్పుఁ జెప్పు మటన్నఁ దప్పుఁ జెప్పనివారి
నోటికబద్ధాలు నూటిపోసి
జెడ్జిగారికి నేను జెప్పుమాటలు పథ్య
ములనుమీ యని వాని మోసపుచ్చి
రేపు ఫీ జిచ్చెద మాపిచ్చెద నటన్నఁ
గాదు తెమ్మని ముందుగానె కొనియు
తే. గీ. వ్యాజ్య మొకవేళఁ బోయిన వాని సాక్షి
మీఁద నెప మిడి, గెల్చిన మీఁదఁ బెట్టు
కొని నటింతురు ప్లీడరుల్ గొంద ఱిలను
న్యాయవాదుల మంచు నన్యాయలీల.

—• ఆటవెలఁది •—

ఆ. వె. డబ్బు ద్రొబ్బు మఁచి టక్కుమాటలు సెప్పి
పాడుసేయు నెంతవాని నైన
డబ్బె మగఁడు గాని తాను గాఁడు మగండు
గాన నాటవెలఁదిఁ గావరాదు.

—• చీపురుపుడక •—

క. తిరునామం బిడువేళను
వరవైష్ణవమణులకెల్లఁ బరసాధనమౌ
నరయంగ నహహా! యీ చీ
పురుపుల్ల బుధాళికర్ణపుటరంధ్రగమౌ.

—• వ్రాకృతకవుల గురువు •—

సీ. ఏమహాపండితుం డీమహి ధవళేశ్వ
రంబను నూర సత్రంబు వెట్టె
నేమహాపండితుం డెంతయు వైయాక
రణశిరోమణి యన గణన కెక్కె
నేమహాపండితుం డీమమ్మ న ఇ ఉ ఋ
మొదలు భాష్యముహాఁకఁజమవఁజేసె
నేమహాపండితుం డెందఱినో వృష్టు
బ్రహ్మచారుల గృహపతులఁ జేసె
తే. గీ. నట్టి చర్లాభిధానాన్వయాబ్ధిచంద్రు
సకలగుణధుర్యు బ్రహ్మయ్యశాస్త్రివర్యుఁ
ద్రివిధమతవేది సకలసద్రీతివాది
నమితశాంతుని మద్గురు నభినుతింతు.

—• ఱ బ్బు ఱ •—

సీ. పొరుగింటఁ జూపు నీపుఱ్ఱుచేయి యటంచుఁ
దన బావమఱఁదులు తన్ను నవ్వ
డ బ్బిమ్మటన్న "లే దబ్బ పెత్తనమన"
ముందంజ యని మఱికొంద ఱనఁగ
ధనమునకును బ్రాణమునకు లంకె యెటు లీ
తఁడుచచ్చునంచుఁగొందఱుపచింప
చచ్చిన నేమైన వచ్చునా? యొకి ప్రాఁత
గుడ్డైన రా దని కొంద ఱనఁగ
తే. గీ. ఇన్నిమాటల నొక మాటకేని మాఱు
మాట పలుకరు లజ్జను మానసమున
నైన నొందపు ఱబ్బాత్ములైన జనులు
వారి జన్మంబు గాల్పనా? సారసాక్ష.

—• కోఁతి చేష్టలు •—

సీ. చెట్లమీఁదకు నెక్కి చిటిపొటి గంతులు
వైచుచు ఫలములఁ బాడుసేయు
వెక్కిరించుచు నున్న తిక్కకుఱ్ఱలఁ జూచి
పండ్లిగిలించి కోపమ్ముఁ జూపు
వెవ్వఁడయినఁ దన్ను నొవ్వఁగాఁ గొట్టినఁ
జివ్వన గోరులచేత బరుకు
నిండ్లమీఁదకు నెక్కి యెగిరి గంతులువైచి
పెంకులెల్లను బోగుపెట్టు నొకట

తే. గీ. కోఁతిచేష్టలు మఱియును గొన్ని యిఁకను
గలవు వానిని జెప్పంగ గ్రంథమొకటి
గావలయుఁ గాన విరమింతుఁ గాంక్షతోడ
వీనిని గ్రహించి సంతోషవిధిని మనుము.

—• పొడుముకన్న చుట్టకొంచెము మంచిది •—

సీ. ఎద్దానిసేవచే నింపు గుల్కెడు తెల్ల
బట్టలకెల్లను గట్టుగలుగు
నెద్దానిసేవచే నింపగు తనముక్కు
దొక్కబుఱ్ఱను బోలి యుక్కుమిగులు
నెద్దానిసేవచే నింపుగుల్కెడు తన
యింతి ముద్దులనాడవీయకుండు
నెద్దానిసేవచే నద్దమ్ముతో నెదు
ర్కొనఁజాలు మెదడెల్లఁ గుళ్ళిపోవు

తే. గీ. నట్టి పొడుమును బీల్చుట యనభిమతము
చుట్ట గాల్చుట యనఁ గొంత సొగసె కాని
పాడువాసన గల్గెడు వక్త్రమందుఁ
గాన నివి రెండు గూడ యుక్తములు గావు.

— రాణీగారు —

చ. తనయునితోడ నొక్కతఱి తామరసాలయ పల్కె "నేమిరా,
వనజభవా ! జగమ్మునకు వారిజనాభుని బెక్కుసార్లు నా
ధుని నొనరించి తెప్పుడు నుదూథధరన్ననుఁ జేయవైతివే"
మని నగు తల్లిఁ జూచి కమలాసనుఁ డప్పుడు చేసె రాణిగన్.

5. విజయ సం॥ మార్గశీర్షములో చెన్నపట్టణములో నడియారులో నానేబిసంటు దొరసానియొద్ద జరిగిన యష్టావధానములోని యొక పద్యము.

సీ. శేషునిఁబోలి 'లెక్చెరు' చెప్పఁగాఁ జాలు
'నానేబిసం' టొక్కయండఁదనర
నాపె 'లెక్చెరు' విని యలరు నానాదేశ
సజ్జనావళి యొక్కచక్కిఁ దనర
'తెలియ దేమందురా దేవుఁడా యింగ్లిష
టను మాదృశులు నొక్కటను జెలంగ
"యింగ్లీషు చదివెద నిది మొదలే" నని
పల్కువారలు నొక్కపక్కఁదనర
తే. గీ. నొప్పు నీసభలోఁ గడుమెప్పు దనరఁ
జలుపఁబూనితి నవధానసరణి నేను
నీదుదయ కొంత నామీఁద నెగడవలయు
లేక యుండిన నెగ్గుట లేదు నేఁడు.

ఆపట్టణముననే రెంటాల సుబ్బారావుగారి మేడలోని యవధానములోని కొన్నిపద్యములు.

సీ. ఏపట్టణము వింధ్య కీభాగమున నుండు
రాణీ రాజ్యమునకు రాజధాని
యేపట్టణపుమేడ చెలమిఁ జూచినవారి
తలగుడ్డబర్వు తక్షణమ తీఱు
నేపట్టణమ్ము వాణీశోపమానవి
ద్వద్వ్రాతమునకు నావాసభూమి

యేపట్టణమ్ము తా నింగ్లీషుభాషకుఁ
బెంపుడుతల్లియై యింపుగుల్కు
తే. గీ. నట్టి యీచెన్నపట్టణాఖ్యపురమందుఁ
జేవ మీఱంగ నిప్పు డష్టావధాన
కష్టకృతిఁ జేయఁబూనితిఁ గాన దేవి !
నీసహాయం బొకించుక నెగడవలయు.

సీ. ఎవని కుశాగ్రబుద్ధివిశేషములు చూడ
శతఘంటకవికి నాశ్చర్యమొదవు
నెవని యుక్తిప్రయుక్తి విచిత్రములు గన్నఁ
దార్కికుఁడైనఁ దత్తఱముచెందు
నెవని నిర్మలవాక్యనివహంబు విన్నచో
వైయాకరణులు వహ్వా యటందు
రెవని యౌదార్యరీతి విని బంగరుకొండ
'యెప్పుడేమొ' యని భీతిల్లుచుండు
తే. గీ. నట్టి రెంటాల సుబ్బరాయాభిధాను
సౌధమునఁ బండితావృతసభను జేయఁ
బూనితిని దేవి ! యష్టావధానకృతిని
నీదు సాహాయ్యమున భవానీ, మదంబ !

6. విజయసంవత్సర పుష్యమాసములో నెల్లూరులో జరిగిన యష్టావధానములలోని కొన్నిపద్యములు.

—• ప్ర కృ త స భ •—

సీ. చెప్పినతోడనే తప్పులేక లిఖించు
పండితు లొకవంకఁ బరిఢవిల్ల
విధివిరామము లేక వేవేగ గంటలఁ
గొట్టువా రొక్కెడఁ గుల్కుచుండఁ
బాణినీయమునందు బహురమ్యముగ మాట
లాడువా రొక్కెడ నలరుచుండ

సరసపహారీతినిఁ జదరంగ మాడెడి
బుద్ధిమంతులు నొక్క పొంతఁ దనర
తే. గీ. సంబరపురాణకథయు వ్యస్తాక్షరియును
లౌకికోక్తులు నొక్కతఱమునఁ జెలఁగఁ,
దిరుపతియు వేంకటేశుండు సరసరీతిఁ
జేసి రష్టావధానంబు, 'జెడ్జి' చూడ.

ఈపట్టణమందే జిల్లా రిజిష్టార్ గుండు వాసుదేవశాస్త్రులుగారు చేయించిన సభలోని కొన్నిపద్యములు.

—• అర్జునుఁడు సుభద్రికరమ్ము పట్టుకొనుట •—

సీ. కాషాయవస్త్రమ్ముగని పాఱిపోకుము
నీకైనవేష మో నీరజాక్షి!
పెద్దగడ్డము చూచి బెదరిపోయెదవేల?
నీకైనవేష మో నీరజాక్షి!
రుద్రాక్షపూసలు త్రొమ్మొత్తునని పోకు
నీకైనవేష మో నీరజాక్షి!
వెలిబూదె యంటునం చులికిపడెదవేల?
నీకైనవేష మో నీరజాక్షి!
తే. గీ. అనుచుఁ దనకర మర్జునుఁ డదిమి పట్టఁ
బెద్ద లేమందురో యనుభీతిఁజేసి
వదలి పోలేక పోలేక వదలిపోవ
చున్నయటు లీ సుభద్రి తా నున్న దహహ!

—• వెంకటగిరినుండి రిజిష్టారుకు వ్రాసినది •—

ఉ. నల్లనిత్రేవల నుండఁ దగునా యనియో, వెలిబూదెరవ్వకుం
దల్లడమందియో, మఱి యెదన్ భయ మేమిఁక దాపరించెనో,
వెళ్లెడినాఁటి ప్రొద్దుటను వీధినిఁ గాలువ కేగువేళఁ దా
మెల్లఁగ జాఱె నుంగరము; మీ కిది చెప్పఁగలేక వ్రాసితిన్.

— • జెడ్డీగారి విందునుగూర్చి • —

సీ. ఏనాఁడు జెడ్డీలతో నేకపంక్తిగా
భోజనమ్ములుసేయ బుధుల కబ్బె
నేనాఁడు జెడ్డీలతో నున్నతస్థలిఁ
గూర్చుండఁ బండిత కోటి కబ్బె
నేనాఁడు జెడ్డీలతో నేకతంబున
మాటలాడఁగఁ గవిమణుల కబ్బె
నేనాఁడు జెడ్డీలచే నీయఁబడు పుష్ప
మాలికల్ కవిశిఖామణుల కబ్బె
తే. గీ. సింహపురమున సివిలుజెడ్డీ పదమ్మ
సను జెలంగెడి రామచంద్రయ్య నాఁడు
గాక, తిరుపతి వేంకటకవుల నాఁడు
గాక, కలిగెనె ? యితరుల కాలమందు.

—• (సమస్య) సంధ్యావందన మాచరింపవలదా ? చౌశీతిబంధమ్ములన్ •—

శా. వింధ్యాద్రి ప్రభనొప్పు బల్కుచములన్ వే పట్టి పెంపొందు కా
మాంధ్యంబార్పఁగ లేక వెఱ్ఱివలె నేలా మంచి యీరాతిరిన్
వంధ్యంజేసెదు ? కాము కేళియనఁగాఁ బాండిత్యమా ? లేక నీ
సంధ్యావందనమా ? చరింపవలదా ? చౌశీతిబంధమ్ములన్.

7. విజయ సం॥ మాఘమాసములో చెలికాని గోపాలరావుగారు వేంకటగిరిలోఁ జేయించిన ద్విగుణితాష్టావధానములో రచించిన 23 పద్యములలోఁ గొన్నిపద్యములు.

శ్లో. సుబ్రహ్మణ్యసుధీశ్వరప్రభృతిభి ర్విద్వన్మణీభి ర్యుతే
గీర్వాణాంధ్రకవిత్వతత్త్వనిపుణై రన్యైః కవీంద్రై ర్యుతే
శ్రీగోపాలనృపాలకస్య నికటే దివ్యే సభామంటపే
కర్తుం కాశి యతే భవద్బలవశా దష్టావధానం మహత్ ।

సీ. బాల్యవయస్సులోపలఁ గాకినాడలోఁ
గింకవిగజసింహకీర్తి నొసఁగి

యటుమీఁదికాలమం దమలాపురమునందు
విద్వత్కవీంద్రసద్బిరుదు నొసఁగి
తదనంతరంబు బందరుపట్టణమునందు
బాలకలానిధిప్రతిభ నొసఁగి
విన్నఁగాకను మొన్న నెల్లూరిపురమున
బాలసరస్వతీభావ మొసఁగి

తే. గీ. కంటికిని తెప్పవలె మమ్ముఁ గాచినట్టి
కాళి, మాయమ్మ! ప్రత్యుపకార మేమి
చేయఁగల మమ్మ నీకు, మాచేత నైన
దొక్కటె మ్రొక్కిచ్చెదము, దీన నుబ్బు గనుము.

క. కొందఱు విద్వాంసులు మఱి
కొందఱు వేత్తౄకరుఁ గలిగి కొన్నిసభలు చె
ల్వొందెడి నీనృపుసభలో
నందఱు విద్వాంసులే మహాభాగ్య మహో!

—• కాళికాచరణము •—

చ. సరసిజసంభవాదిదివిజప్రికరార్చితమున్ భవౌషధం
బరుణసహస్రకాంతియుత మార్యజనావనస క్తదీక్షమున్
దిరుపతివేంకటేశ్వరసుధీమణిసేవ్యము నైన కాళికా
చరణము సర్వలోకులకు సౌఖ్యము లిచ్చుచుఁ బ్రోచుఁ గావుతన్.

—• శ్రీరామపట్టాభిషేకము. (నిషిద్ధాక్షరి) •—

శ్లో. శ్రీజ్యా జాంకభువి ప్రభావరుచిరాః కైకేయికాగర్భజ
ప్రష్ఠాః పార్శ్వభువి ప్రకష్టజవకాః కీశాగ్రిగణ్యాః పురః
అన్యే చాపి విభీషణప్రభృతయ స్తత్రాపి తత్రస్థితాః
శ్రీరామస్య తదా ముదా విజయతే పట్టాభిషేకోత్సవః.

(దీనిలో మొదటి సగము మాత్రమే నిషేధించినారు)

—• అవధానాంతమందుఁ జెప్పిన శ్లోకములు •—

శ్లో. రాజా స్తే యది భోజరాజసదృశః కుత్రాపివా భూతలే
కాళీదాససమః కవి ర్విజయతే యత్ర క్వవా కోఽపివా
ఇత్థం యద్యపి వృద్ధవాక్య మమలం తథ్యం త్వయా రచ్యతే
యః కోవాపిచ విద్యతే యది కవిస్తాదృ క్స్వహై దుర్లభః.

శ్లో. జ్యేష్ఠే స్వాగత మాగతం, కిమహహా లోపో గృహం నైవ మే,
విద్వాంసః క్వ మృతా, వసంతి నికటే గోపాలభూమీపతేః,
భ్రిష్టా నైవ శివాలయాఅపి, విధేతేనైవ తేఽప్యుద్ధృతా,
భ్రష్టా కూపతతి స్తథైవ, కిమహం కుర్యా మదృష్టస్య తే.

శ్రీ ముద్దుకృష్ణ యాచేంద్రులవారు చేయించిన చతుర్గుణి తాష్టావధానములో 43 కిఁ గొన్ని.

చ. వెనుకను నెన్నిసారులొ వివేక మెలర్పఁగ నాశుధారచే
తను నవధానముల్ బుధులతండము మెచ్చఁగఁ జేసి యుంటి మం
చును మదిలోన గర్వమున సోలుట మంచిది గా; ద దేమనన్,
గనఁగొనఁడీ ప్రతిపస్రవకష్టము గాదె! మృగాక్షి కెన్నఁగన్.

—• పరమాత్మ (మంగళమహాశ్రీవృత్తము.) •—

ఎవ్వనిమహత్త్వము మునీంద్రులు సురేంద్రులు బుధేంద్రులుఁగనుం
గొనఁగ లేరిం
కెవ్వనిపదంబు గనెనేని సుఖదుఃఖముల నెప్పుడును జెందఁడుమనుష్యుం
డెవ్వనిచరిత్ర మొకయింత యని చెప్పుటకు నెల్లరు నశక్తులుమహాత్ముం
డవ్వలనెసంగుపురుషాఢ్యుఁడిడు సత్కృపను నందఱకుమంగళమహాశ్రీ.

(సమస్య) నిద్రానైతి నిశా నయాతి తరుణీ నాయాతి కా యాతనా

శ్లో. ఆయాతీతి దురాశయా బత నమే నేత్రే నిమేషాకులే
మందోఽయం కిల చంద్రమా విరహిణా మత్యంతశత్రుస్స్వయం
దూతీ కిం నగతా గతాపిచ పతి ర్వేతాళభూతో విధే
నిద్రా నైతి నిశా నయాతి తరుణీ నాయాతి కా యాతనా.

బందరు మొదలగు పట్టణములలోని యవధానములలో నాకాశపురాణములు చెప్పఁబడినవి. కాని గ్రంథవిస్తర భీతిచే నవియన్నియును వదలి యీ యవధానమునఁ జెప్పిన యాకాశపురాణగాథ యించుక రమ్యమని యిందుదాహరించుచున్నాము. ఇయ్యది శ్రీ వేంకటగిరిరాజావారి రామేశ్వరప్రయాణమును దెల్పెడి. ఇందలి పుణ్యస్థలముల పేళ్ళకు మే ముత్తరవాదులము గాము.

—• ఆకాశపురాణము, రామేశ్వరయాత్ర •—

శ్లో. కించి దాశాస్మ హే తేజ స్సర్వలోక శుభప్రదం
 యత్కృపావశతో లోకే సర్వకార్యజయో భవేత్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా రచింపఁ బూను రామేశ్వర యాత్ర కుఁ గథాక్రమం బెట్టిదనిన:—

క. సురపురము మించి ధనమని
 పురమున్ వెలిఁబెట్టి సర్వపురరాజంబై
 ధరణిఁ జెలువారు వేంకట
 గిరి యను నొకపురవరంబు కీర్తికిఁ దావై.

వ. అప్పురమ్మున కధీశ్వరుండగు శ్రీరాజా వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రభూపాలుండు.

క. నలవత్సర కార్తికిక బ
 హుళపంచమి సోమవార మొప్పుగ యాత్రి
 కలనాదర మతిముఖిగ బ
 యలువెడలెను భటపురోహితామాత్యులతోన్.

వ. ఇట్లు శుభోదర్కమ్ముగ బయలువెడలి యాదినమం దత్తివరమ్మును మరునాఁడు నాయఁడుపేటయును జని యం దొక్కనాఁడు వసించి పిమ్మటఁ బోలూరికరిగి రెండుదినమ్ము లచ్చట నుండి పసంపడి హరి వాసరంబునకు నారంబాక సత్రమ్మునకు వేంచేసి యం దుపవసించి మరునాఁ డుదయమ్మునకు గుమ్మడిపూడి సత్రమ్మున కరిగి యందు ద్వాదశీవ్రతాచరణం బాచరించి యనంతరంబు.

క. వెంగళనామకమగు నూ
రం గల నేరేళ్ళ రాజరత్నవిభునిచే
తం గడుఁ బూజింపంబడి
ముంగలఁ దిరువళ్ళూరికి మునుకొనిచని యెన్.

వ. అచ్చట.

సీ. తత్పురవాసుఁడై తనరారు వీరరా
ఘవదేవునకును దత్కాంతయైన
చుళుకృత్తనాంచారి కలఘుభక్తిని మ్రొక్కి
భోగాదికంబులఁ బొలుపుమీఱఁ
జేయించి యట సుఖశ్రీయుక్తి నారోజుఁ
గడపియు ధూమశకటము నెక్కి
మరునాఁడు పొద్దుట నరిగి కంపెనిపేట
యటనుండి నాగెడాఖ్యపుర మేగి

తే. గీ. పైనిఁ దిరుమాళ్ళపూరేగి పరమభక్తి
దేవదేవుని మణికంఠదేవు మ్రొక్కి
పేర్మి నాదేవు మెచ్చించి వితతపుణ్య
రాసులకుసంచి శివకంచిదాజు గాంచె.

వ. అయ్యెడ.

సీ. లోకలోకారాధ్యు నేకామ్రనాథుని
సేవించి కామాక్షిఁ జిత్తగించి
యష్టోత్తరశతాలయమ్ముల వీక్షించి
యట దేవతలకెల్ల నంజలి యిడి
సర్వతీర్థములందు స్నానమ్ముగావించి
కడువేగమున విష్ణుకంచి కరిగి
వరదరాజస్వామి చరణమ్ములకు మ్రొక్కి
యల్ల పేరిందేవి కంజలిగొని

గీ. బ్రహ్మతీర్థమునందునఁ బరమభక్తిఁ
దానమాడి నృసింహతీర్థమ్మునందు
నట్లన యొనర్చి త్రోవలో నధికభక్తి
క్షీరనది వేగవతి బాహుసింధువు నొగిఁ
గలయునెడఁ దానమాడె నా క్ష్మావరుండు.

క. తరువాత నాలజాబా
క్పురమున డిగి పక్షితీర్థమున కేగెను బా
లురిత్రోవను గడు రయమునఁ
బురోహితామాత్యబంధుముఖ్యులతోడన్.

వ. అయ్యెడ వేదగిరీశ్వరుని సేవించి నాగమాంబను గొనియాడి త్రిపురసుందరీభక్తవత్సలేశ్వరచరణారవిందములకుఁ బ్రణమిల్లి, బలివిధ్యనంతరమ్మున నర్చకుని కరమ్మునఁ జెలువారు ప్రసాదమ్మును నిర్భయమ్ముగ భక్షించి పోవు పక్షియుగ్మమ్ము నీక్షించి, యటనుండి చెంగల్పట్టుపురి కరిగి మధురాంతకముం గడిచి తిందివనం బతిక్రమించి విళుపురంబు దాఁటి పండ్రెండుగ్రామం బధిగమించి క్రొత్తపాళెముఁ జేరం జని.

క. గరుడనదిలోనఁ గ్రుంకిడి
తిరుపాపూరికినిఁ జనియు స్థిరతరభక్తిన్
గురుపాటలేశ్వరునిఁ గని
తిరువిందపురమ్ము భూమితిలకుఁడు చనియెన్.

సీ. దేవనాథస్వామి పావనాంఘ్రులు మ్రొక్కి-
యలశంగమలతాయి కంజలియిడి
సంజీవిపర్వతసందర్శనముచేసి
క్రొత్తసత్రములోనఁ గొలువుదీర్చి
తరువాతను మణిముక్తానదిలోఁ గ్రుంకి
పదఁపడి యల చిదంబరముఁ జేరి

యటఁ జిదంబరదేవు నాసక్తిఁ గొనియాడి
కామసుందరి కృపాకలన వడసి

గీ. చిత్కనకదేవసభలను జిత్తగించి
రాజనాట్యసదస్సుల రంగుఁ జూచి
తత్సభానాయకస్వామిఁ దనియఁజేసి
యాఱు గతి మీఱ రాజు చియ్యాళిఁ జేరె.

వ. అచ్చట మంగళాంబాచరణమ్ములకు మ్రొక్కి, విష్ణుపుత్రి విక్రమనాథ స్వామి పాదమ్ముల కెఱఁగి, కొండమీఁద నుండు చట్టనాథస్వామికిని నుమామహేశ్వరస్వామికినిఁ బార్వతికిని నమస్కరించి, దిగువనుండు బ్రహ్మపురీశ్వర త్రిపురసుందరీ పదారవిందమ్ములు డెందమ్మునఁ బొందుపఱచి యారాజపురందరుండు.

గీ. వైద్యనాథమ్మునకుఁ జని వైద్యనాథు
భక్తితో మ్రొక్కి బాలాంబపాదములకు
సారెకును మ్రొక్కి ముద్దుకుమారుఁ బొగడి
గౌధమాయూరమున కేగెఁ గౌతుకమున.

గీ. నతులచేతను మాయూరనాథుఁ దనిపి
భక్తినభయాంబఁ గొనియాడి పార్థివుండు
సమ్మదమ్మున మధ్యార్జనమ్ము చేరి
యట మహాలింగదేవున కంజలియిడి
చేసె బృహచుందరికు చాంబ సేవనంబు.

వ. తదనంతరమ్మునఁ ద్రిభువనక్షేత్రమునకుం జని యట శరభావతారం బెత్తినకంపహారేశ్వరధర్మసుందరులకు నమస్కరించి.

సీ. కుంభకోణముచేరి కుంభేశ్వరుని మ్రొక్కి
మంగళనాయికా మహిమఁ బొగడి
నాగేశ్వరుని బృహన్నాయకు నర్చించి
కాళహస్తీశ్వరజ్ఞానజనను

లకు ప్రమొక్కి విశ్వేశు లక్షించి యా విశా
లాక్షి పాదమ్ముల కంజలియిడి
సోమేశ్వరుని నెన్ని సోమనాయకుఁ గొల్చి
యభిముక్తదేవున కమృతవల్లి
గీ. కిచ్చి యంజలి బాణపురేశ్వరునకు
భక్తి ప్రమొక్కిడి యా చక్రిపాణివిజయ
వల్లులను జూచి కోమలవల్లిశార్ఙ్గ
పాణులకు భక్తిఁ బూజించెఁ బార్థివుఁడు.

వ. ఇదియునుం గాక.

సీ. జానకీరాముల చరణమ్ములకు ప్రమొక్కి
యా వరాహస్వామి నాశ్రయించి
మామకతీర్థమ్ము మఱి బ్రహ్మతీర్థమ్ము
పాపవిమోచనపరమతీర్థ
కన్యకాతీర్థముల్ కనకపుష్కరిణియుఁ
గాశ్యపతీర్థమ్ము కనకవిలయ
తీర్థ నృసింహాఖ్యతీర్థబిల్వాభిఖ్య
తీర్థ కదంబాఖ్యతీర్థ చక్రి
గీ. తీర్థములు మఱి యీశానతీర్థవరము
లనఁగఁజెలువారుతీర్థములందుఁగ్రుంకెఁ
బరమభక్తిని వేంకటగిరిపురాధి
నాయకుం డగు యాచమనాయఁ డెలమి.

వ. తదనంతరంబు తిరువేయారునకుఁ జని.

సీ. పంచనాథేశ్వరుఁ బ్రణమిల్లి ధర్మసం
వర్ధనీదేవికి భక్తి మ్రొక్కి
యా కుమారస్వామి నర్చించి యటుమీఁదఁ
గోయచేడను నూరు కోర్కి నేగి

యప్పాలరంగన్న కప్పనంబులు చేసి
కమలవల్లికి మంచి కాన్క లిచ్చి
వేణుగోపాలుని వేడ్కతోఁ బూజించి
తరువాత జంబుకేశ్వరము చేరి

గీ. జంబుకేశ్వరదేవుని చరణములకు
మ్రొక్కి యఖిలాండదేవికి మ్రొక్కి యగ్ని
రవికళానాథ ఘటజన్మరామతీర్థ
ములను గ్రుంకిడె భక్తితో భూవిభుండు.

వ. పదంపడి శ్రీరంగమ్మున కేగి.

సీ. సప్తసాలాంతరస్థాయియై తనరారు
రంగనాథునకు సాష్టాంగ మెఱఁగి
రంగనాయకి నాదరంబుతోఁ గొనియాడి
శ్రీదేవి భూదేవిఁ జిత్తగించి
జానకీరాముల సద్భక్తిఁ గొనియాడి
వాసుదేవస్వామి వాసి దలఁచి
పాలాశతీర్థమ్ము వకుళతీర్థమ్మును
నశ్వతీర్థం బగస్త్యాఖ్యబిల్వ

గీ. తీర్థముల హేమపున్నాగతీర్థములను
జంపకాభిఖ్యతీర్థమ్ము జంబుతీర్థ
మనఁగఁజెలువారుతీర్థమ్ములందు భక్తి
మీఱఁ గ్రుంకిడె యాచభూమీవరుండు.

వ. అనంతరమ్మునఁ దిరుచినాపల్లికిం జని మాతృభూతేశ్వరసుగంధికుంతలాంబలకు నమస్కరించి యచ్చోటు విడిచి మనిగండమ్మున కరిగి కోవెలపట్టు దాఁటి కొట్టాంగుట్టు నతిక్రమించి మేలూరు దరియంజని మధుక్షేత్రమ్మునకరిగి.

సీ. సుందరేశ్వరదేవు సొంపుమీఱఁగ మ్రొక్కి
మీనాక్షి కంజలిఁబూని పిదప
వైహాయసాపగాస్వర్ణతీర్థములందుఁ
దనివితీఱని భక్తిఁ దానమాడి
తరువాత ముత్తురెంచలసత్రమునుదాటి
పరమగుడినిమీఱి పరమునందుఁ
బోహలూర్సత్రమ్ము సీహతోఁ బొడఁగాంచి
యుత్తరకోశమ్ము బత్తిఁజొచ్చి

గీ. మంగశేశ్వరుఁ బొడఁగాంచి మంగళాంబ
కలఘుభక్తిని నతిచేసి యమితపుణ్య
దం బగుచు వన్నె కెక్కిన దర్భశయన
దర్శనముచేసె నాతం డదభ్రభక్తి.

వ. మఱియు, నచ్చట.

సీ. శ్రీజగన్నాథాంఘ్రిరాజీవములు మ్రొక్కి
కమలాసనికి మంచి కాన్కలిచ్చి
చివురుకృత్తాభిఖ్య శ్రీదేవి సేవించి
కోదండరాముని గోర్కి మ్రొక్కి
దబ్బపాన్పుననున్న దశరథాత్మజుఁజూచి
సంతానవృక్షేశు సన్నుతించి
రంగత్తరంగాళిరంగాయితం బగు
దక్షిణపాథోధిఁ దరియఁజేరి

గీ. పిదపఁ బుదుమంటపమునకు వేగ నేగి
తమలపాకులసత్రంబు దాఁటి నౌక
నెక్కి యాదాక్షిపాలచక్కని డిగి
చనియె రామేశ్వరంబు రాజన్యమౌళి.

వ. అచ్చట.

సీ. రామలింగేశ్వరస్వామినిఁగొనియాడి
పర్వతవర్ధని భక్తిఁ దలఁచి
విశ్వేశ్వరస్వామి వేడ్కతో భజియించి
యావిశాలాక్షియన్ దేవిఁ గొలిచి
కాలభైరవదేవుకాళ్లకు మ్రొక్కిడి
సేతుమాధవుపాదసేవ చేసి
శ్రీరామచంద్రుపాదారవిందమ్ములు
డెందమ్ములోఁ దగఁ బొందుపఱచి

గీ. యాంజనేయునిఁ గొనియాడి యమితభక్తి
నితరదేవతలకుఁ జాల నతు లొనర్చి
సాగరమ్మున కెంతయుఁ జాగి మ్రొక్కి
మహితుఁడై నట్టిరాజన్యమౌళి మఱియు.

—: ఆంజనేయ స్తవము :—

సీ. కావ్యనాటకముఖోద్గ్రంథముల్ చదువని
వాని కబ్బిన మంచి ప్రతిభ యేల?
చతురభామామణీసాంగత్య మబ్బని
వానిదౌ నవ్యయౌవనము దేల?
అష్టశతావధానాదిసత్క్రియ చేయఁ
దగని యా కవి కవిత్వం బదేల ?
త్యాగభోగాదిభాగ్యము నందఁగాలేని
ధనికునిదైన యాధన మదేల?

గీ. నీపదధ్యానసంసక్తి నెగడ నట్టి
వానిజన్మం బదేల? సౌభాగ్య మేల?
యహహ! సీతాతదీయపత్యంఘ్రియుగళ
కంజసంసక్తహృదయ, యో యాంజనేయ!

సీ. ఒకరోజుగడుప నెంతోకష్టమౌ, బ్రహ్మ
చర్య మిన్నా ళ్లెట్లు సల్పినావొ!
యొకకాల్వ దాఁటుటెంతోకష్టమౌ, సము
ద్రము నెట్టు లవలీల దాఁటినావొ!
యొకరాయి మోయు టెంతోకష్టమౌఁ, బర్వ
తమ్ముల నేరీతిఁ దాల్చినావొ!
యొకచెట్టుఁగూల్చు టెంతోకష్టమౌఁ, జెట్ల
గుంపు లేరీతిఁగాఁ గూల్చినావొ!

గీ. నీ మహత్త్వంబు నెన్నంగ నే మహాక
వీశ్వరులు చాల రనిన నే నెంతవాఁడ
నహహ ! సీతాతదీయపత్యంఘ్రియుగళ
కంజసంసక్తహృదయ, యో యాంజనేయ !

సీ. ఒకచోటనిలువని యుష్ణాంశుసన్నిధిఁ
జదువు నేరీతిగాఁ జదివినావొ!
జపతపమ్ములనేని సాధింపఁగా లేని
రామసత్కృప నెట్టులోమినావొ!
మాయకాండ్రకు నెల్ల మగఁడైన కాలనే
మినిఁ జంపి యేరీతి మించినావొ!
నవరత్నకలితసౌధవరప్రదీప్తలం
కాపట్టణం బెట్లు కాల్చినావొ!

గీ. అన్నియును జూడ మా కసాధ్యములు గాని
నీకు నివి యన్నియును మంచినీళ్ళు గావె
యహహ! సీతాతదీయపత్యంఘ్రియుగళ
కంజసంసక్తహృదయ, యో యాంజనేయ!

వ. దేవళమ్మునం జెలువారు సావిత్రీతీర్థమ్మును గాయత్రీతీర్థమ్మును సర
స్వతీతీర్థమ్మును శంఖతీర్థమ్మును శివతీర్థమ్మును సర్వతీర్థమును సాధ్యా

మృతతీర్థమ్మును మాధవపుష్కరిణియు బ్రహ్మహత్యావిమోచనతీర్థమ్మును సూర్యపుష్కరిణియు గంగాతీర్థమ్మును యమునాతీర్థమ్మును గయాతీర్థమ్మును గపిలతీర్థమ్మును నాఁజను తీర్థమ్ములఁ దానమాడి.

గీ. గంధమాదనపర్వతక్రమము గాంచి
యచటఁ జెలువారుజాంబవదంగదాఖ్య
పంచపాండవహనుమద్విరించితీర్థ
ములను స్నానమ్ము గావించి భూపుఁ డంత.

గీ. ఉభయసాగరసంగమం బభినుతించి
సేతుసందర్శనంబును జేసి పిదపఁ
గాంచె రాజు జటాయురగస్త్యతీర్థ
ఋణవిమోచనతీర్థముల్ ప్రీతిమీఱ.

వ. పిమ్మట నేకాంతరామేశ్వరుం జూచి తదీయాలయమ్మునఁ జెలంగు మంగళతీర్థమ్మును, నమృతవాపీతీర్థమ్మును సీతాకుండమ్మును సముద్రిమ్మున నుండుభైరవతీర్థమ్మును బొడఁగాంచి.

క. తరువాత యాచరా జొక
తరినెక్కి సమస్తవిభవతతితో రాజు
త్తరనవపాషాణంబుల
దరికేగెఁ బురోహితాదితతితోఁ గూడన్.

సీ. అయ్యెడ నుండుజనార్దనుఁ గొనియాడి
శ్రీదేవి భూదేవిఁ జిత్తగించి
నవశిలామధ్యమ్మునను దానమాడియు
దేవిపట్నమ్మునఁ దేజరిల్లు
మహిషాఖ్యరాక్షసమర్దని భజియించి
చక్రతీర్థమ్మున జలకమాడి
యుప్పూరిసత్రమ్ము నొప్పుగాఁ గన్గొని
సుందపాండ్యముదారిఁ జొచ్చిపిదప

గీ. కోటపట్టణమును బట్టుకోటదాఁటి
వందిమాగధులెల్లఁ గైవారమొసఁగ
భూమిసురులెల్ల దీవనల్ పొందుపఱప
రాజమన్నారుకోవెల రాజు గాంచె.

సీ. అట రాజమన్నారు నభినతుఁ గావించి
సత్యభామాదేవి సరవి మ్రొక్కి
రుక్మిణీదేవికి రుక్మమ్ము నొసఁగియు
హేమాబ్జనాయకి హెచ్చరించి
తనివి దీఱఁగ హరిద్రాతీర్థమునఁ దాన
మాడియుఁ గమలాలయంబు చేరి
వల్లవేశ్వరుపాదపల్లవమ్ములు మ్రొక్కి
నీలోత్పలాంబను జాలఁ గొలిచి

గీ. యభినుతించియుఁ గమలాలయంబు పిదపఁ
ద్యాగరాట్కమలాంబల వేగ మెరఁగి
భోగ మర్పించి యంతటఁ బొలుపుదనర
నరపతియుఁ జేరెఁ గుంభకోణంబు మరల.

వ. అట నుండి తిరువణందారు వేంచేసి యచ్చట.

సీ. అరుణజటేశ్వరు నారాధనము చేసి
యాబృహన్నాయకి కంజలి యిడి
చూచి యాజయగండచోళవరం బంత
నటుమీఁద శ్రీవృష్ణమమరఁ జేరి
భూవరాహస్వామి సేవయొనర్చియు
నంబుజవల్లికి నాస మ్రొక్కి
శ్రీరామనిత్యోత్సవారాధనము చేసి
చయ్యన నావృధాచలముచేరి

గీ. యచట వృద్ధగిరీశ్వరు నభినుతించి
వృద్ధబాలాంబలకు దోసి లిచ్చి పిదపఁ
జారుమణిముక్త యనునది జలకమాడి
రమ్యవిభవమ్ముతో శివరాత్రినాఁడు
చేరెఁ జెన్నిఁ దిరుకోవులూరు రాజు.

వ. అయ్యెడఁ ద్రివిక్రమస్వామికినిఁ బుంగోమలనాయికకును వందన మ్ములు పచరించి పిదప నరుణాచలముం జేరి యరుణాచలస్వామి సోమ స్కందమూర్తుల సేవించి తిరువళ్ళూరు గారవించి యారంబాకసత్రం బధిష్ఠించి ఫాల్గున శుద్ధదశమీదినమ్మునఁ దనరాజధాని యగు వేంకట గిరిం బ్రవేశించి.

క. సురనాయకుండు నిర్జర
పురముకరణి నక్కుమారభూమీపతి యు
ద్ధురమహిమ నలరి వేంకట
గిరిపురిఁ దా నేలుచుండెఁ గీర్తికిఁ దావై.

రామేశ్వరయాత్ర సంపూర్ణము.

పెద్దప్రభువగు శ్రీరాజగోపాలకృష్ణ యాచేంద్రులవారి యష్టావ ధానములోని కొన్నిపద్యములు.

శ్లో. వందే నందయశోదికాచిరతపఃకందం, సురేంద్రాదిభి
ర్వంద్యం సింధ్యసురారిదుర్మదహరం, వందారుబృందావనం
చందచ్చందనశీతలం, నిరుపమానందప్రదం దేహినా
మిందప్రస్తరసుందరం దరధరం సందారితాంహస్తతిం.

సీ. చదువఁజేసితికదా ! శబ్దశాస్త్ర రహస్య
సమితి నాలుగువత్సరములలోనఁ
ద్రోవచూపితికదా! దుర్గ్రహమ్మగు ధాతు
రత్నాకరాఖ్య సద్గ్రంథమునకుఁ

జెప్పఁ జేసితికదా! శ్రీకాళికాసహా
స్రాదికావ్యములు బాల్యమ్మలోనఁ
జేయఁజేసితికదా! చెలఁగి మూలస్థాన
పతిమీఁద గంటలోఁ బద్యశతము

గీ. మఱియు నెన్నేని సభలలో మనిచియుంటి
విపుడు శ్రీరాజగోపాలకృష్ణయాచ
భూపబహద ర్మహారాజు భూరిసభను
నెట్లు మెప్పించెదో! భవానీ! మదంబ!

—• హనుమంతుఁడు సీతఁగాంచి వచ్చుట •—

మ. వనధిం దాఁటి యనేక రాక్షసవధూవర్గమ్ములో నమిశ్రితా
ననయై 'రామ!' యటంచుఁ గన్నులఁ గదుష్ణంబైన కన్నీరు నిం
చిన నారాక్షసులెల్ల భీతిగొలుపన్ జింతిల్లుచుండంగ నేఁ
గనుఁగొంటిన్ రఘురామ! భూతనయ, నక్కంజాక్షిఁ దేనెంచుమీ.

—• ప్రకృతపర్యభువు, శ్లేష •—

తే. గీ. వేంకటగిరీశ్వరునిఁ జూచి వేడ్కఁ లక్ష్మి
వేంకటగిరీశ్వరుండను ప్రీతిఁజేసి
యెపుడు నారాజగృహమునందే వసించు;
నాతనికి నాతనికి భేద మరయఁగలదె?

8. జయ సం॥ ఆషాఢమాసములో విశాఖపట్టణములో జరగిన యష్టావధానములలోని పద్యములలోఁ గొన్ని.

—• రామాయణము •—

చ. ఇనకులమందుఁబుట్టి జనకేచ్ఛ వనమ్మన కేగి యచ్చటన్
దనసతి దొంగిలించిన కుదానవు సంహృతుఁ గా నొనర్చి సీ
తను గొని సర్వవానరులు తన్ గొలువంగ నయోధ్య కేగి పా
లన మొనరించు రాముని విలాసములన్ వినుతింతు నిచ్చలున్.

—• (సమస్య) జ్యేష్ఠలక్ష్మీం నమామి •—

శ్లో. యత్కారుణ్యా జ్జగదధిపతి ర్జాయతే గర్భరిక్తో
యస్యాః కోపాన్నిధనమనుజో జాయతే రాజతుల్యః
యస్యాః పుత్రై స్సకలజగతీ భ్రామ్యతే దేవతాం తాం
త్యక్త్వా త్రాతుం నిరతమపి మాం జ్యేష్ఠలక్ష్మీం నమామి.

—• దీనికే తెలుఁగు •—

చ. కరుణ దలిర్పఁ జూచిన నఖండనృపోత్తముఁడైన రిక్తుఁడౌ
నురుతరకోపదృష్టిఁ గన నొక్కక్షణమ్మున రిక్తుఁడైన భూ
వరుఁడగు నేమహాజననిపట్టి జగమ్ము పరిభ్రమించు నా
సరిదధిరాజుపెద్దసుత చయ్యన నన్విడనాడి ప్రోవుతన్.

—• మీసములవలని నష్టము •—

సీ. మెసవుచో నన్నంపుమెతుకు లోఁజిక్కినఁ
బైవారినెల్ల నవ్వంగఁజేయుఁ
దనముద్దియను ముద్దుగొనినచో నత్తులోఁ
దవిలి యత్యంతబాధను ఘటించు
పొడుముపీల్చిన రెల్లుకడ లంకవృద్ధిచే
సినయట్లు మాలిన్యమునుఘటించు
తేనెపానము సేయుచో నెఱుంగక కొంచె
ముగఁదగిల్చినఁ దెలుపునుఘటించు

తే. గీ. పొట్టిదౌచుట్టఁ గాల్చినప్పు డొకకొంత
కాఁకదగిలిన సురసుర కాలి పాడు
వాసన ఘటింపఁజేయు; వహ్వా! యనైన
వాసి మీసాలు లౌకికాగ్రేసరులకు.

—• (సమస్య) మీసము చుట్టుకొన్నదిసుమీ! యిటుమోమటు త్రిప్పఁబోకుమీ •—

ఉ. హాసము మోమునన్ జెలఁగ నంగజు ప్రేరణచేఁ బ్రియుండు దన్
మోసము చేసి మోవిగొన, ముద్దియ పెన్గఁగసాగె; నప్డు వాఁ

డా సఖితోడఁ బల్కి నిటు, "లక్కట! యల్లరిమాను, నత్తులో
మీసము చుట్టుకొన్నదిసుమీ! యిటుమో మటు త్రిప్పఁబోకుమీ!

—• (సమస్య) ఈ కలసారస్యము నీకకాని తెలియంగారాదు బింబాధరీ! •—

ఉ. "కలగంటిన్ వివరింపు మీ కలచమత్కారంబు నీ" వంచు న
వ్వాలయన్ బల్కిన వారకాంతఁ గని "యోహో! యాకలా! యాకలా
లలనా! వాకిది చెప్ప శక్యమగునా? లక్షించిచూడంగవే
కలసారస్యము నీకకావి తెలియంగారాదు బింబాధరీ!

—• (సమస్య) పంగు స్సుదూరం వ్రజతి క్షణేన.

శ్లో. శ్రీరామచంద్రస్య దయా మవాప్య
కష్టం కరిష్యా మ్యవధాన మద్య
లోకే యథాఽరుహ్యా హి ధూమయానం
పంగు స్సుదూరం వ్రజతి క్షణేన.

—• (సమస్య) యువతివసనమధ్యే దంతిన స్సంచరంతి •—

శ్లో. కరికరఇవ కించి ద్దృశ్యతే పశ్యతాం న
స్స భవతి కిము నో వేత్త్యాకులం చాపి చిత్తం
వద విగళితలజ్జం లజ్జయాఽలంహి కింతే
యువతివసనమధ్యే దంతిన స్సంచరంతి.

—• (సమస్య) తొడియందము చెప్పఁదరమె తోయజనేత్రా •—

క. వడివడి పనియున్నప్పుడు
పొడు మెక్కక మిగుల విసువుపుట్టించును నీ
గొడవొకటి లేకయుండినఁ,
దొడియందము చెప్పఁదరమె తోయజనేత్రా.

౯. జయ సం॥ కార్తికములో ధవశేశ్వరములో జరగిన యష్టావధాన పద్యములలోఁ గొన్ని.

—• అ గ స్త్యే శ్వ రుఁ డు •—

ఉ. శ్రీరుచిరప్రభావమునఁ జెన్నలరారెడి గౌతమీనదీ
తీరమునందు నివ్వటిలి దీనుల నందఱ వేడ్కఁ బ్రోచుచుఞ

గారణదేహు. డై తగి యగస్త్యమహామునిరాట్ప్రతిష్ఠితుం
డై రహిమీఱుదేవు ధవళాచలవాసు నుతింతు నిచ్చలున్.

—• (సమస్య) కలహాపుదుంప భూమిపయిఁ గామినిగాదె తలంచి చూచినన్. •—

చ. కలకలనవ్వునెమ్మొగము గన్పడఁజేయుచు గబ్బిగుబ్బలన్
గులుకఁగఁజేసినంతన దిగుల్పడి యెంతటి నీతిశాలియున్
వలచును దావి, నద్ది పెఱవానినిఁ గూడిన వానిఁ జంపు నోఁ
గలహాపుదుంప భూమిపయిఁ గామినిగాదె తలంచి చూచినన్.

10. జయ సం॥ మాఘమాసములో బెజవాడలో జరగిన యవధాన
ములోఁ జెప్పిన పద్యములు 50 కిఁ గొన్ని.

—• నవనాగరికులు •—

సీ. వైదికరీతిచే వఱలు వారలఁ జూచి
కోర్కెమైఁ జప్పట్లు కొట్టునొకఁడు
సంధ్యానమస్కారచర్య మానినవారిఁ
గాంచి యానందమ్ముగాంచు నొకఁడు
వచనకవిత్వమ్ము రచియించు వారలే
మేలుమేలనిచెప్పి సోలునొకఁడు
ముండనం బొనరించి ముండలవలె నుండు
వారలే మేలని పల్కు నొకఁడు

తే. గీ. మడినిఁగట్టకయే భుక్తి గడపువారు
యోగ్యతము లంచు మదిలోన నుబ్బు నొక్కఁ
డిట్టి నవనాగరికులతీ రెన్నఁదరమె
యహహ, యిది యెల్లఁ గలికాలమహిమగాదె!

—• జల్లెడ (అనుష్టుప్) •—

తుషాపనయనే దక్షా। సహస్రనయనోపమా
వేణుత్వఙ్నిర్మితా సేయం। చలనీ భాతి సుందరా.

—• రామాయణము •—

శా. నీరేజాప్తకులమ్మునం బొడమి యెంతే యోగ్యయౌ జానకిన్
దారంగాఁ గొని తండ్రియానతి నరణ్యానం బ్రవేశించి ఘో
ఘోరంబెల్లను మాన్ప రక్కసులదర్పం బాఁచ్చి సాకేతమం
దే రాముండు సుఖమ్ములం గొనియె నే నీక్షింతు నద్దేవునిన్.

—• కృష్ణ (మాలిని) •—

సకలకలుషహంత్రీ సర్వసౌఖ్యప్రదాత్రీ
విమలసలిలశోభా కృష్ణవేణీ నదీయం
నిఖిలమనుజనిత్యస్నానపానాదియోగ్యా
జయతి విజయవాటీప్రాంతదేశే నితాంతం.

బందరులో మరల నవధానము చేయఁబడియెను రికార్డు లేమి.

11. మన్మథనం॥ భాద్రపదాశ్వయుజ మాసములలో విజయనగరములో జరగిన యవధానములలోని కొన్నిపద్యములు.

—• ప్రకృతకవుల మనస్సు •—

సీ. ఒకఁడుగోరినవృత్త మొకఁడుగోరినవర్ణ్య
మన్యోన్యసాంకర్య మందకుండ
నొకనిస్థానమున వేఱొకఁడు గూర్చున్నచో
దానిచే మార్గమ్ము దప్పకుండఁ
దలక్రిందుగాఁ జెప్పవలె మాకనుచుఁగోర
నందులో స్ఖాలిత్య మందకుండ
మధ్యమధ్యనుజెప్ప మాకిష్టమనిచెప్ప
నందులో విభ్రాంతి చెందకుండ

తే. గీ. సంస్కృతాంధ్రమ్ములందున శబ్దశాస్త్ర
సరణిచెడకుండఁ దప్పులు దొరలకుండఁ
జెప్పుశతఘంటకవివరు చిత్త మొప్పు
వాతచాలితమగు నీరజాతమువలె.

—• ముద్రాయంత్రోపయోగము •—

చ. లలి నిల వచ్చుయంత్రములు లావగుటన్ మనపూర్వులౌ కవీ
శులు రచియించినట్టి గడుసుందనపుం బలుకబ్బముల్ వెసన్
సులభములయ్యె నెల్లరకు, సూరివరేణ్యులకెల్లఁ దాటియా
కులపవి దప్పె గంటములకుం గతిదప్పెఁ గ్రమక్రమమ్ముగన్.

—• లేట్ ప్రిన్సిపాల్ చంద్రశేఖరశాస్త్రిగారు •—

తే. గీ. శ్రీమదానందగజపతిక్షితితలేంద్రు
రచితమౌ పాఠశాలలో బ్రినిసిపల్గ
నుండి యాచంద్రతారార్క మండలంబు
చేవగల కీర్తిగనెఁ జంద్రశేఖరుండు.

—• ప్రకృతపు ప్రిన్సిపాల్ రామావతారంగారు •—

సీ. ఇంగ్లీషుభాషలో యెమ్ యే బి యల్ దాఁకఁ
బ్యాసుచేసిన మహాపండితుండు
సంస్కృతాంధ్రమ్ముల శతఘంటకవనమ్ము
పచరించినట్టి విద్వత్ప్రభుండు
విజయపురీహూణ విద్యామహాశాలఁ
బ్రినిసిపల్ పదవి గాంచిన ఘనుండు
ఆనందదంతీశ్వరాఖ్యరాజాఖండ
లున కెంతయును మైత్రిగనినమేటి

తే. గీ. ధరఁ గెళంబ్యన్వయాబ్ధిసుధామరీచి
యనఁగ నొప్పారునట్టి రామానుజార్యుఁ
డౌననఁగఁ జేసి రవధాన మద్భుతముగ
సరస తిరుపతి వేంకటేశ్వరు లిరువురు.

—• దివాన్ కోదండరావు పంతులుగారి కల్పన ననుసరించి యాశుగాఁ జెప్పినది. •—

శ్లో. త్వక్త్వాఽసౌ మదనో బుధం నపరనేష్యాత్ర పరిచారంధను
స్సంజగాహ నవేశమేకరస మత్రాఽస్తే పరంకారణం

సాంగత్వం విబుధే ప్రసిద్ధమిహతు స్యూతాసదాఽనంగతా
చిత్రం నైవనసాంగసంగతి మహోజానాత్యసంగో ధ్రువం.

—• పైకల్పననే తెలుఁగునఁ జెప్పుట •—

చ. రసజనియించి యేకరసరాజితమయ్యెను నిక్షుఖండ, మీ
రసఁ జరియించి సర్వరసరాజితులైరి బుధేంద్రు, లట్టి సాం
గసుకవులన్ద్యజించి విలుగాఁగొనె నిక్షువు నయ్యనంగుఁడౌ,
నసదగు సాంగసంగతు లనంగుని కెట్టు లెఱుంగ నయ్యెడున్.

—• (సమస్య) కింవక్ష్యామి కురంగశాబనయనే వ్యర్థా శరచ్చంద్రికా •—

శ్లో. ప్రాలేయప్రచురా నిశాః పరిమళత్కుందా లతామంటపా
శ్చూతాః కోకిలసంకులా జలగృహా మాద్యన్మయూరస్వనాః
వ్యర్థాస్యు ర్న తదర్థ మీషదపి మే చింతా పరంజాయతే
కింవక్ష్యామి కురంగశాబనయనే వ్యర్థా శరచ్చంద్రికా.

—• అవధానాంతమునఁ బ్రసంగవశమునఁ జెప్పినది •—

మ. ఒకనూతే యన నేమిలెక్క ? వినుఁ డోహో ! పండితశ్రేష్ఠులా
ర ! కడున్ వేగమె వేయిమందికయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
శుకవిత్వం బొనరింపనేరుతుము శ్రీ శూలిప్రియామానసీ
యకటాక్షమ్మునఁ, దగ్గకాలమును మాకర్పించి కూర్చున్న చోన్.

12. మన్మథ సం॥ పుష్యమాసములో క్రొత్తపల్లెలో శ్రీ రావుజగ్గా
రాయనింగారి సభలోఁజెప్పిన 105 కిఁ గొన్నిపద్యములు.

—• శ్రీరామపట్టాభిషేకము •—

తే. గీ. తమ్ము లొకవంక మౌనిజాతమ్ము లొక్క
వంక మర్కటకుల మొక్కవంక దనుజ
వర్గ మొకవంకఁ దగ రఘువరుఁడు సీత
తోడఁ బట్టాభిషిక్తుఁడై నాఁడు నాఁడు.

—• రుక్మాంగదునివేఁట. గ్రామ్యపదములతోఁ జెప్పుట •—

సీ. "బాబిటుసూడండి బాసిగాఁ డెటువంటి
యెనుమోతునైనను నిరగమొడుసు

నీపాదమాన బాబీపాపిగాఁ డెంత
లేసిపందులఁ బంచెమేసి సంపు
ఈఁడివంకను జూడుఁడీ యెంతపొగరుమో
తులనైన నెగ్గుల నెలికిమొడుసు
ఆఁడెమ్మ సీగొయ్య ఆఁడిబాబీఁడుసుం
డీఁడికిమించు మొగోఁడులేఁడు"

తే. గీ. అనుచు బోయలు ప్రోత్సాహమును నొనర్ప
వారిమాటలకును ముఖవారిజమున
హాస మిగురొత్త నపుడు రుక్మాంగదుండు
బలముతోఁగూడి వేఁటకు బయలువెడలె.

—• అవధానదర్శనకుతూహలమునఁ బ్రిజలు పల్కెడి పల్కులు •—

చ. కలుగరె రాజు లెల్లరును, గల్గినమాత్రిన యేమిలాభమోఁ ?
గలిగెను జగ్గభూవరువికస్వరసత్కరుణాకటాక్షస
ద్బలమున నేఁటికిన్ శతవధానముచూడఁగ నెల్లవారి, కీ
యిల నిటువంటిరాజు గలఁడే ! పరిశీలన చేసి చూచినన్.

—• ప్రకృతకవులగురువు (శార్దూలవిక్రీడితం) •—

యేన శ్రీధవళాచలే విరచితం సత్రిం పవిత్రం చిరా
ద్యస్యానంతవిదేశచారణచణా స్సన్త్యేఽపి విద్యార్థినః
యత్కీర్తి ర్వియదాపగావరఝరీబిందూపమా రాజతే
చర్ల బ్రిహ్మసుధీశ్వరో విజయతే సోఽయం మదీయో గురుః.

—• శిశిరర్తుః (మందాక్రాంతావృత్తమ్) •—

మల్లీ వల్లీ కుసుమసహితా మారుతా మందమందా
శ్శీతో నీతః పరిభవ మితీవోహ్యతే దంపతిభ్యాం
కించిత్కించి త్ప్రవహతి జలం తత్తదుచ్చైర్నదీనాం
మాఘే ప్రాప్తే గమయతి రథం చోత్తరాశా మనూరుః.

—• శ్రీరంగనాయకుఁడు •—

సీ. కోరిన భక్తులకోర్కెక లీయంగఁ
గట్టె నే దేవుండు కంకణంబు
సర్వరక్షఃపరిష్కారమ్మునకుఁ జేతఁ
బట్టె నే దేవుండు బాణవితతి
దాక్షిణాత్యులయందు దయఁజూపుకొఱకునై
చొచ్చె నే దేవుండు చోళభూమి
పరమామనోహరాదరము చూపుటకునై
సాచె నే దేవుండు చరణయుగము

తే. గీ. వినతసుత్రాము భువనప్రవితతకాముఁ
గోటిరవిధాము సుజనాళికుముదసోము
రమ్యగుణధాము సనఘు నారంగధాము
మహితతరమైన భక్తి నెమ్మదిఁ దలంతు.

—• శ్రీ రా ముఁ డు •—

తే. గీ. రవికులనృపేంద్రదకృతపుణ్యరాశి సర్వ
సురరిపువధూకులగళస్థసూత్రహర్త
సకలపాపౌఘపరిహర్త జనకభర్త
సుతకు భర్త జగములకు శుభము లొసఁగు.

—• అవధానము జరగినరోజు •—

చ. పరువడి మన్మథాబ్దమునఁ బౌషమునందున దర్శయందు నం
దఱికిని నొక్కపాదము ముదమ్మునఁ జెప్పి, యనంతరంబు నం
దఱికిఁ గ్రమమ్ముగా మిగులుదానినిఁ జెప్పి, శతావధానమున్
దిరుపతివేంకటేశులు విధించిరి జగ్గనృపాలుసన్నిధిన్.

—• ద శా వ తా ర ము లు •—

సీ. మత్స్యమై యెవ్వాఁడు మడియించె సోమకుఁ
గూర్మమై ధరియించెఁ గుధర మెవఁడు

పందియై యెవ్వాఁడు బరిమార్చెఁ గనకాక్షు
సింగమై కసిపునిఁ జీరె నెవఁడు
వడుగయి యెవ్వాఁడు బలిసంపద హరించె
ద్విజుఁడయి నృపుల మర్దించె నెవఁడు
రాముఁడై యెవ్వాఁడు రావణుఁ గడతేర్చె
బలభద్రుఁడయి పూనె హలము నెవఁడు
తే. గీ. బుద్ధుఁడయి బౌద్ధమత మెవ్వఁ డుద్ధరించెఁ
గల్కియై యెవ్వఁడు కలిశిక్షణ మొనర్చె
నట్టి విష్ణుని వితతదశావతారుఁ
జేరి రక్షింపు మనుచు జోహా రొనర్తు.

—• రా ణీ గా రు •—

సీ. కొట్టులుఁ జామలు కొసరికొసరి భక్ష
ణము సేయు నరుల కన్నంబు గల్గె
నుపోల్లదినముల నులుకుచునుండెడి
చౌటపట్టులఁ బంట చాలఁగల్గెఁ
దిరిపమెత్తఁగ మాళ్లు దిరిగెడి ద్విజులకు
హెచ్చైనపల్లకీ లెక్కఁగల్గె
నుప్పునీతులనీటఁ దప్పితీర్చుకొనెడి
వారి కెల్లను మంచినీరుగల్గె
తే. గీ. గడియ కామడలామడల్ గడువఁ గల్గె
దీవులన్నియు జనులకుఁ దేట లయ్యె
లీల నేరాణి జగతిఁ బాలించుచుండ
నట్టి విక్టోరియారాణి నభినుతింతు.

—• పొ డు ము •—

సీ. పడిసెమ్ము పట్టినప్పటివేళ నీటివి
హరియింప నెద్ది దివ్యౌషధంబు

హరికథల్ వినువేళ నరుదెంచు నిద్రియన్
వ్యాధికై యెద్ది తుపాకిదెబ్బ
మఱచిపోయినయట్టిమాట తెల్పుటకునై
యెయ్యది దేవీనిభృతవరంబు
రాజరాజులనైన రమణ యాచనసేయఁ
జేయఁగా నెద్ది జెజేలచెట్టు

తే. గీ. గట్టిలంకాకు కమ్మగాఁ గాచి నూఱి
సుభయు హైయంగవీనంబుఁ జొనిపి పొగపు
వెట్టి బొబ్బిలికాయలో వేసినట్టి
పొడుము తీల్చనివార లీపుడమిఁ గలరె?

—రైలుబండి స్టేషనునుండి వెడలుట—

తే. గీ. చూచువారలు మదిలోనఁ జోద్యమంద
మంచితాబేళ్ళ పంక్తినా మహిమ నెగడి
సరపమైనట్టి యవతారశాలనుండి
పరుగుపరుగున రైలు దా బయలువెడలు.

—వేంకటేశ్వరుఁడు—

సీ. శ్రీరమాభామినీశ్రితదివ్యవక్షస్స
లమ్ముతో మణికిరీటమ్ముతోడ
నమ్లానకుసుమమాల్యశ్రీవిరాజికం
ఠమ్ముతో నవకౌస్తుభమ్ముతోడ
పటుతరోత్తమవజ్రబాభాసమానవ
ర్మమ్ముతో మేటిచక్రమ్ముతోడ
మేలొకడానిహారంగు మించు దుప్పటి వల్లె
వాటితో సిరిమించు నీటుతోడ

తే. గీ. శేషభూమీధరమున నశేషసుకృతి
వందితోజ్జ్వలపాదారవిందుఁ డగుచు

నిందు వేడుకఁ గాఁపురమ్మందు వేంక
టేశ్వరుఁడు మాకు సౌఖ్యమ్ము లిచ్చుఁగాక.

— మల్లెపువ్వు —

క. అలరులకునెల్లఁ దొడవై
వెలఁదుల కొప్పులకుఁ దావి వెదఁజల్లు పరీ
మళము గలిగి చెలువారెడి
యల మల్లీసుమముఁ బోలు నలరులు గలవే?

— ప్రకృత ప్రభుకీర్తి —

క. శారదనారదపారద
నారదశారదలకాంతి నగఁజాలెడి జ
గ్గారాయని కీర్తిసతికి
నీరేడు జగమ్ములందు నీడుం గలదే?

— శరత్కాలము —

మ. సరసీజమ్ములపాలిపంట కడువిస్తారంపు శాల్యోఘముల్
పరిణామమ్మును గాంచు పండుగ చలిన్ బ్రాకించుచేయాఁత సు
స్థిరకాశప్రసవప్రకాశలహరీదేదీప్యమానంబునై
శరదుద్యత్సమయంబు భాసిలె విరాజచ్ఛ్వేతరుక్శోభియై.

13. మన్మథ సం॥ ఫాల్గునములో గద్వాలసంస్థానములో రచించిన 57 టికి రికార్డు దొరకనందున ఒకటిమాత్రము.

— రాజుగారి కుమారుని హస్తము —

సీ. ఇప్పించు వీఁకమీఁద నేచిన్నిహస్తంబు
కవులకెల్లను మంచి గ్రామములను
చేయించు మీఁద నేచిన్నిహస్తంబు బు
ధతతికెల్లను మహాదానములను
వహియించు మీఁద సంపదమీఱ నేహస్త
మగ్రభాగమున రాజ్యాతిశయము

ఖండించు మీఁద నుత్కటరీతి నేహస్త
మరిరాజభీకరకరశిరముల

తే. గీ. శిష్టులకు నభయమము చెలఁగునెద్ది
కంకణాలంకృతం బయి కాంతిచెందు
నెద్ది, శ్రీరామభూపాలుముద్దుతనయు
కరము నద్దాని వర్ణింపఁ గలమె మేము !

14. దుర్ముఖి సం॥ జ్యేష్ఠములో నర్సాపురములో జరగినశతావధానములోఁ జెప్పిన 60 పద్యములలోఁ గొన్ని.

—• శంకరాచార్యులు •—

సీ. అడఁగించె నెవ్వాఁడు కడలేనిమోహాంధ
కారమ్ము దివ్యవిజ్ఞానకలన
స్థాపించె నెవ్వాఁడు షణ్మతమ్ములను బౌ
ద్ధాదిదుర్మతముల హతముచేసి
రచియించె నెవ్వాఁడు బ్రహ్మామల కళక్య
మైన శ్రీసూత్రభాష్యాదికంబు
నిర్జించె నెవ్వాఁడు నిర్జరజ్యేష్ఠావ
తారుఁ డైనట్టి విద్వాంసు నొకని

తే. గీ. నట్టి యస్మన్మతోత్తారణార్యుఁ డనఁదు
నపరసాంబశివావతారాఢ్యు బ్రహ్మ
బోధపారీణు నానందపూర్ణు ననఘు
శంకరాచార్యవర్యుని సంస్మరింతు.

—• పరమేశ్వరుఁడు •—

ఉ. ఏమహనీయుప్రాభవము నెట్టిమహాత్ములునైనఁ జెప్పలే
రేమహనీయు తేజమున కెంతటివారును నిల్వనోప, రిం
కేమహనీయువర్ణనము నెంతటివారును జేయఁజాల, రే
నామహనీయు నెంతుఁ బరమాత్ముని విఘ్నవినాశశీలునిన్.

—• హూణులీదేశమునకు వచ్చినరీతి •—

సీ. భిక్షుపాదాంబుజప్రక్షేపణన్యాయ
మున మొద లీదేశమునకు వచ్చి
క్రమముగాఁ గొంతదేశము వర్తకమునకై
మైత్రికల్మిని నాక్రమణ మొనర్చి
యటుమీఁద మఱికొంత యార్జించి యద్దాన
స్వల్పమ్ముగా నేన సంగ్రహించి
పిమ్మటఁ గొందఱఁ బృథ్వీశుల నడంచి
యచ్చటచ్చటఁ గోఁట లాక్రమించి
తే. గీ. క్రమముగా నెల్లభూమి వశముగఁ జేసి
సర్వరాజన్యులను బన్నిసంగ నిప్పు
డేలుచున్నారు మనదేశమెల్లయెడల
హూణు లెంతటికార్యప్రవీణులో కద॥

—• వార్తాపత్రికలవలని యుపయోగము. (శిఖరిణీ) •—

స్వదేశేవా నోచే దపరవిషయేవా ప్రతిదినం
భవే ద్యద్యచ్చిత్రం కిమపి రమణీయం ప్రతిగృహం
తదేత త్సర్వేషా మపి సులభ మాసీత్కిల యతో
విరాజంతే వార్తాహరణచణపత్రాణి బహుశః.

—• కణ్వునకు శకుంతల దొరకుట. (మందాక్రాంతావృత్తమ్) •—

విశ్వామిత్రాభిధమునివరా న్మేనకాయా మరణ్యే
జాతాం త్యక్త్వా మపిచ జనకేనాఽపి మాత్రా తయాచ
దృష్ట్వా కణ్వ స్స్వతనయతయా మానసే తాం విభావ్య
ప్రోద్యత్ప్రీత్యా స్వగృహ మనయ త్తత్ర సా వృద్ధిమాప.

—• గాలివాన •—

మ. పడియెన్ వృక్షము, లెల్ల లోకములు కంపం బందె, నౌకల్ జలం
బులలో మున్గెను, నావికుల్ చదిసి, రేవుం బాసి తాటాకుఁ గొం

పలు చెల్లాచెదరై నశించె నహహా! ప్రారబ్ధకర్మమ్మునన్
గలిగెం బో యొక గాలివాన భువనోత్కంపమ్ము సంధిల్లఁగన్.

—• పరస్త్రీగమనమువలని నష్టము. మాలినీవృత్తమ్ •—

పరసరసిజనేత్రా సంగమార్థం యియాసో
ర్భవతి చరణరక్షాతాడనం తత్ర తత్ర
అపితు చికురహానిః ప్రాణహాని స్తథైవ
ప్రభవతి ఋత మేత న్మానహానిః కదాపి.

—• యౌవనావస్థ •—

చ. సుకృతపు బుద్ధి మూలఁబడు సుందరియే గురువంచుఁ దోఁచు దు
ష్టకృతులె యాగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై తగు జవ్వనంబునం;
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్.

—• జరావస్థ •—

ఉ. చూచినయంతమాత్రమున సుందరులెల్ల హసింత్రు. పిల్లలున్
గోఁచినిఁ బట్టి లాగుదురు, కొందఱు "తాత" యటంచుఁ గేరి దో
బూచులఁ నాడఁ బూనుదురు పో! జర మూఁడినమీఁద నక్కటా!
యేచవి గానుపింపదు మఱెయ్యదియున్ సుఖ మీయ దేరికిన్.

—• అకాలవర్షమ్మునందు రాత్రి వీధిపంచను పరున్న మార్గస్థుఁడు •—

సీ. తనయింట నున్న వెచ్చనిశయ్య పలుమాఱు
మానసమ్మునను సంస్మరణచేసి
తనయింట నున్నగుత్తపుగుబ్బలాఁడి మే
ల్గిలిగింతలను మాటికిని స్మరించి
తనయింట నున్న చక్కనిపచ్చడమ్ములఁ
బలుమాఱు మనమునఁ బలవరించి
తనయింట నున్న మెత్తనికోళ్లతండమ్ము
లేల తేలేదని యెంచి యెంచి

తే. గీ. కడుపులోఁ గాళ్ళ నిఱికించి గడగడగడ
వణఁకుచును నిద్రపోసాగెఁ బాంథుఁ డొకఁడు
వానతుంపురు లొకకొన్ని మేనఁ బడఁగ
గాలి దగిలెడి యొక పంచపాళిలోన.

—• జగన్మోహిన్యవతారము •—

సీ. అమృతంబుపేరు దైవ మెఱుంగుఁగాని యీ
యనుపమాకృతి చూత మనెడివారు
చూచుటకేమి యీ సుందరీరత్నమ్ము
నటు చననీకుఁడీ యనెడివారు
అల్లల పోవు నాయందుఁ దాత్పర్య మీ
యంగన సూచించె ననెడివారు
నీయందు సూచించెనే ? కామకాదు నా
యందున సూచించె ననెడివారు

తే. గీ. వైరి రక్కసులెల్ల మోహాబ్ధిమగ్ను
లగుచు శ్రీమజ్జగన్మోహనావతారుఁ
జూచి యంతియ కాని శ్రీఖంతు మోస
గాఁ డటంచును మది నెఱుంగ రకటకట !

—• ప్రబోధచంద్రోదయములోని “లబ్ధ్యం లబ్ధ” మను శ్లోకమునకు
తి॥ శా॥ చెప్పిన తెలుఁగు •—

చ. “ఇది లభియించె నింక లభియించు లభించినదాని వడ్డిచే
నదనము నేతు” నంచు మదియందు సదాధనమున్ జపించు నీ
కిది తెలియంగ లే దకట ! హెచ్చిన యాశ పిశాచిరీతి నీ
కుదురు నశింపఁజేయుఁజుమి కూఁకటిదుంపలతోడ మూర్ఖుఁడా !

ఉ. చేకుఱెఁ జేకుఱం గలదు చేకుఱినట్టిధనంబు పెంచినన్
జేకుఱు నింతకన్నను విశేషముగా ధనమంచు లోభమున్

జేకొని యున్న నిన్ను నతిశీఘ్రముగా నొక పెట్ట మ్రింగఁగా
నాఁకొనియున్న దయ్య మని యాళ నెఱుంగ వదేమి? మూర్ఖుఁడా!
వెం॥ శా॥ చెప్పినది.

15. దుర్ముఖి సం॥ ఆషాఢమాసములో మొగల్‌తుర్తికోఁటలో జరగిన శతావధానములోఁ జెప్పిన 50 పద్యములలోఁగొన్ని.

—• ప్రకృత ప్రభువు •—

క. శీలమ్మున వంశమ్మున
నాలాపమ్మునను మేల్ నయమ్మునను మతే
రీ? లోకమ్మున నృపతులు
శ్రీలక్ష్మీనారసింహనృపవరుఁ బోలన్.

—• ఆంజనేయులు •—

సీ. దాఁటె నెవ్వాఁడు ప్రోద్దామవేగాటోప
మున గోష్పదమ్ముగా మున్నువార్ధి
మీటె నెవ్వాఁడు గంభీరరాక్షసరాజ
కులమెల్లఁ దనకొనగోటిచేత
దూటె నెవ్వాఁడు బంధురతరాగ్నిజ్వాల
గల తోఁకతో లంకఁగల గృహముల
నాటె నెవ్వాఁడు విన్నాణంపుజయపుఁగం
బంబు లంకాపట్టణంబులోన

తే. గీ. నతఁడు గుణవంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ
డమలసుస్వాంతుఁ డనుపమానంతకాంతి
మంతుఁ డతిమంతు భక్తదుర్మంతుహరణ
వంతుఁ డలరారు శ్రీహనుమంతుఁ డెలమి.

—• "కోశద్వంద్వ మియం దధాతి" యను శ్లోకమునకుఁ దెలుఁగు •—

చ. "నళిని ధరించె నంచ ముకు నాటిన మొగ్గలు రెండు, చూడు చూ
తలత ధరించెఁ బుంస్పికవిదారితమౌ నవపల్లవంబు నె

చ్చెలి! గనుఁగొంటివే?" యని వచించు చెలిం గని దీర్ఘికాతటిన్
గలికి కుచాధరోష్ఠములు గప్పికొనెన్ బయఁటన్ గరమ్మునన్.

—• వీరేశలింగముగారు చేయు విధవా వివాహములను గుఱించి •—

సీ. "మాడబ్బుచెడద్రొబ్బెమాప్పబుద్ధుఁ" డటంచు
మంగలివాండ్లు తన్నుం గుఱింప
పెండ్లములకు వండిపెట్టఁగా సుఖియించు
వారలెల్లరు తన్ను దూఱుచుండ
విద్యార్థులును మెట్టవేదాంతులును గూడి
తన్ను నేవేళ నిందను నొనర్ప
"మును చచ్చినట్టి మగనితద్దినం బెట్టు?"
అని బుధవరులు వా దొనరఁజేయ

తే. గీ. నన్నిటికి నోర్చి విధవలౌ నంగనలకు
"భ్రూణహత్యలు జరగక పోవుఁగాక"
యంచుఁ బెండ్లిండ్లు నేయ యత్నించుచుండెఁ
గందుకూరి వీరేశలింగప్రధాని.

—• ప్రకృతప్రభువు. (మందాక్రాంతావృత్తమ్.) •—

స్మేరం వక్త్రం హృదయ మమలం శీతలా చ ప్రవృత్తీ
రూపం తాపాపహ మమృతవాగ్వారణీ ధోరణీ చ
తుష్టి స్తుష్టా బహు వితరణం పుష్టి రత్యంతపుష్టా
జాగ_ర్తి శ్రీకలితనిలయే నారసింహక్షితీంద్రే.

—• రాజుతమ్ముఁడు •—

శా. సారాసారవివేకయుక్తుఁడు యశస్సంపాదనాత్యంతశో
భారోచిష్ణుఁడు రూపవంతుఁడు కళాభ్రాజిష్ణుఁ డత్యున్నతా
గారారామవిశేషభాసురుఁడు శృంగారప్రధానుండు సు
శ్రీరమ్యుండు కరమ్ముఁ జెన్నలరు లక్ష్మీకాంతరా జెల్లెడన్.

—• మన్మథుఁడు •—

క. కలకులకన్గొన లను న
మ్ములఁగొని విటరాజహృదయముల్ వసలఁగ గా
సిలఁజేయుచు మాధుఁడు తొ
య్యలులకు దాసానుదాసుఁడై చరియించున్.

—• రామాయణము •—

తే. గీ. శివునివిల్ ద్రుంచి జనకునిచెల్మిగాంచి
సీతఁ బెండ్లాడి వనికి వేంచేసి పిదప
రావణునిఁ దున్మి శ్రీరఘురాముఁ డతివ
తోడఁ బట్టాభిషిక్తుఁడై నాఁడు నాఁడు.

—• నలచరిత్ర •—

చ. నలుఁ డల యంచకారణమునన్ దమయంతినిఁ బెండ్లియాడి, పె
న్గలుముల నంది, జూదమునఁ గాఁగలకార్యము లొంది, మీఁదఁ గా
నలఁ బలుకష్టముల్ వడి, యనంతర మా ఋతుపర్ణుఁ జేరి, వే
ఉక్కలు చెలువార నాపయి సుఖమ్మున నుండెను దానుఁ బత్నియున్.

—• సోమరితనము •—

ఆ. వె. చదువు మట్టుపడును సంస్కృతి చెడిపోవు
సంపదలు తొలఁగు సౌఖ్య ముడుగు
గౌరవంబుపోవుఁ, గావున సోమరి
తనముకన్న హీనదశయుఁ గలదె!

—• వైష్ణవులు స్మార్తులు •—

సీ. శివునియాఖ్యానమ్ము చెవిసోకినంతన
నిప్పుత్రొక్కిన కోఁతినియతిఁ గాంతుఁ
శివు నాలయంబు కన్గవఁదాకినంతన
గాలిసోకినరీతిగాఁ జరింతుఁ
శివదేవుఁ డూరేగునవసరమ్మునఁ దల్పు
మూసిపెట్టుక యొక్కమూల నుందుఁ

వెలిబూదె నొసఁటను బెట్టువారలఁ జూచి
పకపకనగుచుఁ జప్పట్లుచరతు

తే. గీ. రహహ, యేమందు వైష్ణవులైనవారి
చర్యలను? శివకేశవ స్వాములందు
స్మార్తులగువారు సమభక్తిసలుపుచుందు,
రదియ న్యాయ్యం బటంచు మా కభిమతంబు.

16. దుర్ముఖి సం॥ ఆశ్వయుజకార్తీకములలో రెండవపారి కాకినాడలో జరగిన యనేకావధానములలోఁ గొన్నిపద్యములు.

—• (సమస్య) మాకులదాస ? యెంత యభిమానము లేదుర చంద్రశేఖరా ? •—

ఉ. "నాకు విభూతిరాయఁ డొకనాయకుఁడా" యని నీదుభార్య ర
త్నాకరుచెట్టవట్టు టది యారసి యుండియు, సిగ్గు లేక ర
త్నాకరుఁ జంకఁ బెట్టికొని యక్కు-లటన్ డలఁ దాల్చితౌర ! భా
మాకులదాస ! యెంత యభిమానము లేదుర ! చంద్రశేఖరా !

—• యః కౌమారహరః" అనుశ్లోకమునకు తెలుఁగు •—

సీ. చిన్నారిపొన్నారిచిఱుతప్రాయముచూఱఁ
గొన్నవాఁడె ప్రియుండు కోమలాంగి
తఱపివెన్నెలలతో నొఱపు గల్గిననాఁటి
చైత్రరాత్రులె కదా ! సరసిజాక్షి
మాలతీపరిమళవ్యాలోలములు నాఁటి
నీపవాయువులెకా ! నీరజాస్య
తలఁపులొక్కటిగాఁగఁగలసికుల్కి-ననాఁటి
దానవేకద ! యేమఁ దలిరుఁబోఁడి

తే. గీ. నాఁటిసురతప్రసంగమే బోటిమిన్న
యైన నామన మదియేమొ కావి మేటి
నాఁటి రేవానదీతీరవాటి నొప్పు
వేతసీతరుమూలమ్ము వెదకఁబోవు.

ఈపద్యములో రెండుచరణములన్నురవఱకును సమస్యగా నీఁబడ్డవి.

సీ. (నిలువుటద్దమెదుట నిలిపిచూపితిఁగాని
పలుకెంపు లేమని పలికినాన !
పసమీఱుదుప్పటి పైనిఁ గప్పితిఁ గాని
పసపురం గేమని పలికినాన !
విరులసురటిదెచ్చి విసరుచుంటినిగాని)
చెమ టదేమని పృచ్ఛచేసినాన !
పవళింప విరిపాన్పుసవరించితిని గాని
యాయాస మేమని యడిగినాన !

తే. గీ. మొగము వెలవెలఁ బోయిన మూలమేమి ?
యెఱుపు గనులందుఁ గల్గినహేతువేమి ?
నాథ ! నాయందు లోపమున్నను క్షమింపఁ
బాడి యగుఁగాక తప్పులు పట్టఁ దగునె ?

—• (సమస్య) రండల దర్శింపఁగోరు రాజులమనముల్ •—

క. పండితవాక్యశ్రవణము
దండుగఁగానెంచి దానఁ దగులుకొనవువో
కుండలు గడిగెడు దాస్యపు
రండలదర్శింపఁగోరురాజులమనముల్.

—• (సమస్య) ఒడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్ •—

క. అడ్డమయినట్టివిటులకు
బిడ్డలఁగని బిరుసుదక్కి బింకముచెడి యా
బిడ్డలు పాలకు నీడ్వఁగ
నొడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్.

—• వాడకట్టు బుల్లిరాజు జాతకమునుగూర్చి •—

మ. శనిమూటన్ శశిరెంట భార్గవబుధుల్ షష్ఠంబునన్ సప్తమం
బున రాహూష్టకరుల్ పదింట గురుఁడున్ భూపుత్రుఁడున్ ద్వాదశ

మ్మున నొప్పారఁగ వృశ్చికంబునను దాఁ బుట్టెన్ దగన్ వాడకె
ట్టనువంశమ్మున బుల్లిరాజు తనయుండై కామమాంబాఖ్యకున్.

17. దుర్ముఖి సం॥ మార్గశీర్షములో పిఠాపురములో వాడ్రేవు వారింట జరగిన యవధానములోఁ జెప్పిన 70 కిఁ గొన్ని పద్యములు.

—• పార్థసారథి. (పృథ్వీవృత్తమ్) •—

కశాం కరతలే వహ న్నపిచ చోదయన్ సత్వరం
తురంగమచయం జయం సహకిరీటినా షస్తువన్
రణేఽతనుత సారథిత్వాకృతి మాదరా ద్యః పుమాన్
స మా మవతు దేవకీరచితపూర్వపుణ్యోదయః.

—• చర్లబ్రహ్మయశాస్త్రులుగారు •—

సీ. బాల్యమ్ములోనన పండితుల్ మెచ్చంగ
నఖిలవిద్యలు కాశి నభ్యసించెఁ
దరువాత దేశాన కరుదెంచి ధవళేశ్వ
రమ్మున నన్నసత్రమ్ము వెట్టె
నిదిగాక విద్యార్థు లెందఱినో పండి
తులఁ జేసి దాన సంస్తుతులు గనియె
నది యట్టులుండ దరిద్యములేని తనశిష్యు
లెందఱికేనిఁ బెండ్లిండ్లుచేసె

తే. గీ. "పొట్ట పోషించికొనియెడి బుధులు పెక్కు
కలరు, గావి జగమ్మునఁ గలరె యిట్టి
పండితు" లటంచు నుతియింపఁ బరఁగె నౌర!
చర్లవంశ్యుండు బ్రహ్మయశాస్త్రి ఘనుఁడు.

—• రామపట్టాభిషేకము. (ప్రహర్షిణీవృత్తమ్) •—

సోదర్యై ర్మునిభి రపి ప్రహృష్టచిత్తై
స్సుగ్రీవప్రభృతిభి రుత్తమైః కపీశైః
యుక్త శ్శ్రీరఘుకులనాయక స్సభార్యో
రాజ్యశ్రీవిలసితపీఠ మారురోహ.

—• తిరుపతివేంకటేశ్వరుఁడు •—

సీ. కాచినాఁడవుకదా కరిరాజుప్రాణమ్ము
కఠినసక్రమును జక్రమునఁద్రుంచి
పోచినాఁడవుకదా పూర్వదైతేయడిం
భకుని వేవేగఁగంబమునఁబొడమి
దాచినాఁడవుకదా ద్రౌపదీమానమ్ము
సభలోనఁ బెక్కువస్త్రమ్ము లొసఁగి
చూచినాఁడవుకదా సోదరున్ విడనాడి
శరణుచొచ్చిన విభీషణునిఁ బ్రీతి

తే. గీ. ననుచు నిన్నుఁ జేరినార మత్యాశచేత
మమ్ము రక్షించు టెంత యమ్మక్క ! నీకు
సరసతిరుపతివేంకటేశ్వరకవీంద్ర
శరణ తిరుపతివేంకటేశ్వర ! నమోస్తు.

—• కుంతీమాధవుఁడు •—

మ. స్థిరభక్తిన్నుతియింతు నెమ్మదినిఁ గుంతీమాధవున్ శ్రీధవున్
జరణద్వంద్వమునన్ శిరం బునిచి వేసారుల్ నతుల్ సల్పుచున్
గరుణాసాగర, కావవే ! నను జగత్కల్యాణ ! రక్షింపవే
పరమోదార యనుగ్రహింపు మనుచున్ బల్మారువాక్రుచ్చుచున్.

—• అమర, భ్రమర, సమర, కొమర అనుపదములతో మధుకైటభయుద్ధము •—

చ. కొమ రలరంగ నెంతయును గోర్కె దలిర్ప మనోజసంగర
భ్రమ రహిమీఱ రక్కసులు పద్మదళాక్షునితోడఁజేయు నా
సమరము మాని దేవిని వెసన్ గొన నెంచి పరాంబమోముపై
నమర నిగుడ్పసాగిరి కటాక్షములన్ జెలరేగి మాటికిన్.

—• యౌవనప్రాదుర్భావము (శార్దూలవిక్రీడితమ్) •—

వక్షోజౌ లికుచోపమౌ ప్రతిపదం వృద్ధ్యున్ముఖౌ దృష్టయ
స్సారంసార మఘీయతే ప్రతికలం చారుత్వవక్రిత్వయోః

మధ్యం కార్శ్య ముపైతి గచ్ఛతి గతి ర్మాంద్యం విలాసోదయా
నావిందంతి వచాంసి నీరజదృశ స్తారుణ్యబాల్యాంతరే.

—• విప్రలంభము (మందాక్రాంతావృత్తమ్) •—

తౌ వక్షోజౌ తదపి వదనం తాదృశా దృష్టిపాతా
స్తద్వై యానం నచ కచభర స్తాదృశ శ్రోణిభారః
ఇత్యంగానా మనుకల మపి స్ఫూర్తి మాలోకమానః
కాలం నిన్యే ప్రియసహచరీవిప్రయోగేణ కశ్చిత్.

— రంభారావణసంవాదము •—

చ. పలికితి వీవు 'కోడలను బట్టకు న'న్నని, వారకాంతకున్
గలుగునె యిట్టిభేదములు? గన్గొను, తండ్రియుఁ బుత్త్రుఁడున్ గ్రమ
మ్మలరఁగఁ గూడి యొక్కనదియందునఁ గ్రుంకుట లేదె! యేల యీ
చల, మధరామృతం బిపు డొసంగి ననున్ దయఁ జూడు కోమలీ!

—• కుమారలింగేశ్వరుఁడు (ప్రహర్షిణీవృత్తమ్) •—

భక్తానా మభిమతదాయినం మహాంతం
ధ్యాయామో మనసి సదా కుమారలింగం
నీరేజాసనముఖదేవతావతంసా
యన్నామ ప్రతికల మాదరా జ్జపంతి.

—• పరకీయావిషయికయోజన •—

మ. మితికాలం బరుదెంచునే! చెలియు నా మేలెంచి కీలెంచునే!
ధృతి పూనన్ సమకట్టునే! యితరసందేహంబు పోకార్చునే!
పతి గ్రామాంతర మేగునే! యితరనిర్బంధమ్ము లేకుండునే!
కుతుకమ్ముల్ నెఱవేఱునే! ప్రియసఖా! కోర్కుల్ తుదల్ముట్టునే!

—• ప్రసంగవశమునఁ జెప్పినది •—

చ. ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిననూటి కెన్ని పె
ద్దతనముగాంచి చిత్తమునుదన్నునొ, మే మవధానసంగత
స్థితిగని యాశుగా రచనచేసినపద్యములందుఁ జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కఁగనుండు నసంశయమ్ముగన్.

18. హేవిలంబి సం॥ చైత్రమాసములో గుంటూరులో జరగిన యవధానములోని 30 పద్యములలోఁ గొన్నిపద్యములు.

—॰ ఆంజనేయునిచర్య, వీరరసము ॰—

శా. అక్షం జంపి తదీయవక్షమునఁ బ్రోద్యత్క్రోధవిస్తారసం
రూక్షాక్షిప్రభ నొప్పి యెంతయును బోరుం గోరి పైవచ్చు నా
రక్షస్సైన్యము నెల్ల మాపి తను వీరవ్రాతముల్ మెచ్చ బల్
దక్షుండై దశకంధరాత్మజుని మోప్రిల న్నిల్చెఁ గీశేశుఁడున్.

—॰ శరత్కాలచంద్రికలో నౌకావిహారము (వసంతతిలకావృత్తం) ॰—

నౌకాం గతస్య మనుజస్య శరత్క్షపాయాం
గాఢాంధకారయుజి వేగవతీప్రవాహే
బింబీభవద్విమలసద్గణపంక్తిరాసీ
ద్దృష్టేస్తు వజ్రశకలస్య సమానకాంతిః

— గద్య —

ఇది శ్రీ.... కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర కృతంబగు
శతావధానసారమ్మనఁ బూర్వార్ధము.

---

ఓం



శ్రీమత్పరదేవతాయైనమః

# శతావధానసారము

## (ఉత్తరార్థము.)

19. విలంబి సం॥ ఆశ్వయుజములో కిర్లంపూడి జమీందారు శ్రీ యినుగంటి చిన్నారావుగారుచేయించిన యష్టావధానములోఁగొన్ని.

—◆ రత్యంతమునందు స్త్రీలమార్పు ◆—

ఆ. వె. కనులు వింతలైనకళలను వర్షించు
మేన మిగులఁ గ్రొత్త మేల్మి దోఁచు
నూర్పు లినుమడించు నుష్ణత గన్పట్టు
నంగనలకు నిధువనాంతమందు.

—◆ (సమస్య) గణచతుర్థినాఁడు ఫణిచతుర్థి ◆—

ఆ. వె. "ఎన్నిదినములాయె నిట నన్ను డించి నీ
వరిగి" యనినఁ బత్నికనియె భర్త
"నేఁటి కెన్నఁగఁ బదినెల లాయెఁగా! నేఁడు
గణచతుర్థి; నాఁడు ఫణిచతుర్థి."

—◆ పరికృత ప్రభువు ◆—

సీ. ఏవేళఁ జూచినఁ బ్రావీణ్య మలరారు
కవులతోఁ గాలమ్ము గడపువాఁడు
ఎపుడు చూచినను నింపెసలారుమందస్మి
తంబు వక్త్రంబునఁ దనరువాఁడు
దారిద్ర్యబాధ నెంతయును జిక్కెడివారి
పైఁ గరుణాదృష్టి వఱపువాఁడు
ఎన్నిసా ర్లడిగిన నిచ్చుటయేకాని
లేదు పొమ్మనుమాట లేనివాఁడు

తే. గీ. మేలుమేలనఁ బ్రజలను నేలువాఁడు
చిన్నభూపాలరాయండు శ్రీవిశాలుఁ
డనుచు జనులెల్ల నుతియింత రనుదినంబు
నమ్మహారాజు రక్షింపు మఖిలజనని !

—• ఉపరతి •—

మ. చెమటల్ చిమ్మఁగ, నూరుపుల్ నిగుడఁగన్, జిన్నారిపొన్నారిమేన్
గమరన్, జక్కనిగుబ్బదోయిపయి మేల్కాంతుల్ పిసాళింప, నా
రమణీరత్నము దాఁ బెనంగి సుఖవార్ధింగమ్మ గన్పట్ట సి
గ్గమెయి న్నాధునియక్కుఁజేరె, మదిఁగొంకున్ లొల్కమున్ గ్రమ్మఁగన్

—• మంచిగంధపుఁజెట్టు •—

చ. మలయనగమ్మునందుఁ దగు మన్కిని జన్మము నంది, చుట్టునుం
జెలఁగెడిచెట్లకున్ మిగులఁ జేవ ఘటించుచు నొప్పు నీక నే
వడువున సంభవించె ఫణివర్గముతోడను జెల్మి. మేటి వా
తల కతిలుబ్ధసంగతి విధమ్మునఁ జందనవృక్షరాజమా !

—• సభ జరగిన తారీఖు •—

సీ. లలితమై యొప్పు విలంబివత్సరమున
నాశ్వయుజమ్మున నల చతుర్ద
శీశుక్రివారాన శ్రీకరంబగునట్టి
యింద్రమహాలునందు నిందుఁ బోలు
నినుగంటివంశపావనుఁడు శ్రీచిన్నావ
నీశుండు మిత్రు గణేశరావుఁ
గలసి వెన్నెలలోనఁ గడుమోదమునఁగూరు
చుండి యాదరరీతి మెండుకొనఁగ

తే. గీ. సరసతిరుపతివేంకటేశ్వరులచేత
మిగుల శృంగారరసమున మేల్మి గాంచి
యనుపమానమ్మ లనఁదగునట్టి మంచి
పద్యములు చెప్పఁజేసె సంపత్కరముగ.

20 వికారి సం॥ చైత్రమాసములో పెద్దాపురముతాలూకా వీరవరగ్రామములోని యష్టావధానములోని కొన్నిపద్యములు.

—• రాయబారము (శార్దూలవిక్రీడితమ్) •—

త్వ య్యేవం విముఖే నితాంతమదనావేశేన సా సాంప్రతం
త్వా మే వాలపతి, త్వదీయసుగుణాన్ గాతే హి వీణాదినా,
దూతీః ప్రేషయతే పునఃపున రహో! అస్మాదృశ స్త్వం, తతో
ధీరోదాత్తగుణోత్తరో భవ, న తే కోపోఽస్తు తస్యాం వృథా.

—• చంద్రాస్తమయము (మాలినీవృత్త)ం •—

కువలయసముదాయే కాంతిభాగ్యేన శూన్యే
విరహిజనసమూహే శాంతకామాగ్నితాపే
ధనయువతికదంబే ముక్తనైపథ్యవేషే
చరమదిశి పయోధౌ చంద్రబింబం పపాత.

—• (సమస్య) సరసునివైపు వీపు నలచానమొగం బటుగోడవైపు •—

చ. సరసునివైపు వీపు నలచానమొగం బటుగోడవైపు, నా
సరసుఁడు కేలుచాపు నలచానయుఁ జన్నులఁజేయిమోపు, నా
సరసుఁడు కోర్కెఁజూపు నలచాన దొడందొడలోనఁదోపు, నీ
వరుసనె తెల్లవారె నొకవైఖరి నొక్కని కొక్కవేశ్యతోన్.

—• సభకు వేశ్యలను పిలువకూడదనుట. (వసంతతిలకా) •—

వర్ణేనవా నచగురు ర్నచ వృత్తిరీత్యా
నోవా గుణై ర్నచ ప్రవర్తనతోపి నూనం
ఆహూయతే తదపి గానవినోదనార్థం
వారాంగనాజనవిశేష ఇదంతు దుష్టం.

21 వికారి సం॥ఆషాఢమాసములో కోట రామచంద్రపురం రాజుగారి సభలో రచియించిన పద్యములలోఁ గొన్ని.

—• తెల్లవారుసమయమందలి నక్షత్రములు •—

మ. పరమంబైన తిరస్కృతిం గని సభన్ భావింపఁగారాని దుః
ఖరసావేశత నొప్పు పండితునివ క్త్రమ్మున్ విడంబించుచు౯

జరమపరిస్థితపాండురోగినఖరచ్ఛాయానుకారిస్థితిన్
ధరణిజ్ఞా దారక లొప్పు సప్తమితుఁడౌ తారేశుకాలమ్మునన్.

—• సమీపమందున్న యురిశిక కలవాఁడు •—

ఉ. లోకము కుర్రింగినట్లు వనిలోపల వ్యాఘ్రముఖమ్మునందుఁ దా
నూకొని పడ్డభంగిని ననూనరుజావృతుపోర్కె నెంతయున్
"హా ! కటుదుష్టమైన పని యేల యొనర్చితి" నంచుఁ జింతమై
నాకులుఁ డయ్యె నొక్కఁడు సమాగతమృత్యుముఖాంతరాళుఁడై.

—• ఇం ద్ర చా ప ము •—

మ. పరిణామోజ్జ్వల వంచవర్ణయుతమై భవ్యోదయంబై మహా
పరితోషాస్పదమై మయూరవిలసత్పర్వోపమానమ్మునై
సరవిన్ హాలికజాతి కెంతయును నుత్సాహంబు సంధించుచున్
వఱలెన్ మేఘగతంబునై మఘవుచాపం బెంతయున్ వింతగాన్.

22 వికారి సం॥ శ్రావణమాసములో ఆలమూరులో జరిగిన యవధాన
ములో రచించిన 55 పద్యములలోఁ గొన్ని.

—• శ్యామలాంబ (మత్తకోకిల) •—

కోమలాంఘ్రిసరోరుహజ్ఞ మదకోకిలాప్రతిభస్వనన్
శ్యామలాంబ నుతింతు నెంతయు సంతసం బిగురొత్తగన్
భూమి నే జగదంబఁ గొల్చిన పూరుషుండు సదా సుఖ
శ్రీమహత్త్వవిభుత్వకీర్తులఁ జెంది చెన్నలరారెడిన్.

—• ప్రకృతావధాన విషయమై సభ్యులయోజన •—

సీ. "శతఘంటకవనమ్మ సల్పు టిట్టిది యొక్కొ !
తెలిసె నేఁ" డని లోన నులుకువారు
"మొదటఁజెప్పిన పాదమున విస్మృతియులేక
చెప్పిరే" యని ప్రీతిఁ జెందువారు
"ఇది యభ్యసమొ లేక యే దేవు కరుణయో
గురుకృపయో" యంచు గొణుగువారు

"కా దిది యుచ్ఛిష్టగణపత్యుపాసనా
ఫల" మంచు లోలోనఁ దలఁచువారు

తే. గీ. "బ్రైనుశక్తియ యిది" యంచుఁ బల్కువారు
"పూర్వజన్మ సుకృత" మని పొగడువారు
నైరి సభనున్నవారు శతావధాన
మరసి తిరుపతివేంకటేశ్వరు లొనర్ప.

— మన్మథోపాలంభము (తోటకము) —

అనయమ్ము మ బాంధులయంగనలన్
ఘనబాణపరంపర గాటముగాఁ
జెనకందగునయ్యె ? యిసీ ! మదనా
పనిఁబూనకు మియ్యది పౌరుషమా ?

— నీరీయని డెల్లాహూపరెఁడెంటు —

మ. పొలముల్ కాంతికిఁ దక్కె, నాకుమడులున్ బొల్పేదెఁ, దార్వంగఁ జె
ఱ్ఱువల నీరైనను లేకపోయె, మఱి నీరొక్కమ్ముఁ జెల్లించినన్
జల మీవైతివి, నీకొకింతయును విశ్వాసమ్మలేదాయె; మా
టలచే నేమగు ? నందుఁ రైతు లొగి డెల్లాహూపరెండెంటులన్.

— అ ర్ధ నా రీ శ్వ రుఁ డు —

ఉ. ఏ శతపత్రనేత్రకును. నెట్టిమగండు నొసంగనట్టి బల్
పేశలమైన దేహమును బ్రేయసి కిచ్చిన దేవదేవు వా
గీశరమేశసన్నుతు నహీనవిభూషితకాయు నర్ధనా
రీశు నుతింతు మ్రొక్కుదు నతీంద్రియసౌఖ్యము గోరి నిచ్చలున్.

— తాపేశ్వరమ్మున నుండు నగస్త్యేశ్వరుఁడు —

శా. వాతాపిఘ్ను వెసమై పథించిన జగద్వంద్యుం డగస్త్యుండు తు
ల్యాతీరమ్మున నాగమోక్తమగు లీలన్ దాఁ బ్రతిష్ఠించె ఖ
ద్యోతుండున్ శశి యుండునంతకును నెందుం గీర్తి వాటిల్ల శో
భేతంబై తగు లింగ మొక్కఁడు నగస్త్యేశాఖ్య చెన్నారఁగన్.

23. వికారి సం॥ శ్రావణమాసములో నమలాపురం తాలూకా కొ్రొత్త పేటలో జరగిన యష్టావధానములోఁ గొన్నిపద్యములు.

—• తుపాను (స్రగ్ధరావృత్తమ్) •—

అత్యాభీలానిలేన ప్రచలదురుమహాభంగసంగే సముద్రే
గ్రామా స్తత్తీరసంస్థా విలయ ముపగతాః కించ వృక్షాశ్చ భగ్నాః
పశ్చా న్నౌకా స్సమస్తా అపి జలమధితా మగ్నతా మాపు రుచ్చై
స్సర్వేషాం కష్టమాసీ, త్సుఖమితితు పరం ద్యోసుమప్రాయ మాసీత్.

24. శార్వరి సం॥ వైశాఖమాసములో పాలతేరు గ్రామమున జరగిన యవధానములోఁ జెప్పిన 40 కిఁ గొన్నిపద్యములు.

—• పాలతేరు (ఉయిగార్హీ) •—

ఇమ్మగుకవిత్వము రసమ్మయినగాని మధి
కమ్మయినశాస్త్రమును సొమ్ముగ సదా యు
క్తమ్ముగఁజరించుసుకృతమ్మునఁజెలంగుపుడ
మి మ్మనెడి వేల్పులుఁగరమ్ముఁజెలుపమ్మున్
సొమ్మును భరమ్మగుయశమ్ము నెపుడుంగలిగి
తమ్మఖిలసత్కవులు సమ్మతి నుతింపం
గమ్మెఱయు వెల్మదొరలు మ్మహితరీతిఁ దగ
నిమ్మహిఁబయోరపపుమ్ము తనరారున్.

—• వసంత ర్తుః (వసంతతిలకా) •—

సన్యాసినోఽపి హృదయం భవస క్త మాసీ
ద్వర్ణీ వివాహవిషయే యతమాన ఆసీత్
వేశ్యా నిరంతరరతాభిరతా బభూవుః
ప్రాప్తే వసంతతిలకే సుమనోభిరామే.

—• బొబ్బిలి రా జు గా రు •—

సీ. పోషించుచున్నాఁడు బుధవర్గములఁ జాలి
నంతద్రవ్యమునిచ్చి యనుదినంబు

ఆర్జించినాఁడు ద్రవ్యంబు లక్షలకు ల
క్షలు స్వీయమైన రాజ్యమ్ము పెంచి
కట్టించినాఁడు చక్కనిరీతి గోపాల
దేవుని కొప్పగు దేవళంబు
కావించినాఁడు నౌకామార్గమున లండ
నునకేగి రాణిదర్శనసుకృతము

తే. గీ. ఏలుచున్నాఁడు బొబ్బిలి నేలఁగలఁడు
పోషించుచున్నాఁడు ప్రజలను బ్రోవఁగలఁడు
ఇచ్చుచున్నాఁడు కవులకు నీయఁగలఁడు
రమ్యగుణపాళి శ్రీరంగరాయమౌళి.

—• సఖ్యులలో నొకరిచ్చిన కల్పన •—

చ. మొగమను పద్మమందుఁ గరమ్ముం జెలువారెడి మోవితేనెఁ గ్రో
లఁగ భ్రమరద్వయంబు మిగులన్ దమి నయ్యెడ కేగుదెంచి "నా
స గనకపుష్ప" మంచు మది సందియ మంది గతాగతమ్ములన్
దగులక నిల్చెనో యను విధమ్మునఁ బొల్చెను గన్నులింతికిన్.

—• బాలవిధవలు •—

ఉ. శీల మదెంత గల్గినను జిన్నతనమ్మున భర్తపోవు న
బ్బాలిక లందఱున్ గడు నపారవిషాదముపాలుగా మదిన్
సోలుచు సొక్కుచున్ దమకు సూనశరుం డతివైరి యంచు న
మ్మాలవిధాతఁ దిట్టుదురు మాటికి మాటికిఁ దాప మాపమిన్.

—• పూలతోఁట •—

ఉ. సారసశోభితమ్ములగు చక్కనిమేటిసరస్సులున్ మహో
దారములైన తీవలు నుదాత్తములైన ధరాజముల్ ముదం
బూరఁగఁజేయ నెంతయును నొప్పెసలారెడిఁ బూలతోఁట కే
కారవకోకిలారవవికస్వరమై సుమనోభిరామమై.

—• వే శ్య లు •—

చ. కులమును వృత్తమున్ వయసుఁ గోవిదభావము రూపవర్తయున్
దలఁపక ద్రవ్యమే తమమనమ్ములఁ గోరెడి వేశ్య లెల్లరున్
దలఁపగరానివార లని తాను మదిం దెలియంగలేక చం
చలమతులైన దుర్విటులు సారెకు వారి రమింతు రెప్పుడున్.

—• సూ ర్యుఁ డు •—

క. జగమునకు లోచనంబై
ఖగరాజత్వమ్ము గాంచి కడు వెగ్గడు సూ
ర్యుఁ గడుఁ భక్తిం గొల్తు న
నగమితసకలామయున్ బ్రభాసంపూర్ణున్.

—• పరికృతావధానులను దీసికొనివచ్చిన శ్రీ చిన్నారావుగారు •—

క. "తిరుపతివేంకటకవులన్
సరసముగాఁ దోడి తెచ్చి సభ నవధానం
బు రహిం జూపించెను చి
న్న రాయనరపాలుఁ" డని జనము లని రిచటన్.

25. శార్వరి సం॥ వైశాఖమాసములోనే గజపతినగరములో చేసిన యష్టావధానములోని కొన్ని పద్యములు.

—• ఇష్టదేవతాప్రార్థన •—

చ. "తరతమభావ మెన్న కిటు తల్పమునందుఁ బరుండె నెవ్వఁడో"
"తరుణి ! కపర్ది, నాదయినతల్పమునందుఁ బరుండియుంటి" "నా
వరుఁడు తదేకభూతి గలవాఁడు దరిద్రుఁడు గాఁ" డటంచు శం
కరుని హసించుగౌరి యొసకంబిడు మీకును మాకు నిచ్చలున్.

—• విజయనగరం మహారాజావారిమరణమునుగూర్చి జనులు చింతించుట •—

సీ. వర్షాశనార్థంబు వచ్చు పండితకోటి
 వొలుపుమీఱఁగ రాకపోక లుడిగె

నెలజీతముల గృహమ్ముల నుండి జీవించు
గాయకుల్ పరదేశగతినిఁజెంది
రతులితైశ్వర్యమ్ము లలరారునుద్యోగి
తతుల కుద్యోగముల్ తప్పిపోయె
నతిదూరమున నుండి యరుదెంచు పాంథుల
కన్నదానంబు లేదనుట గల్గె
తే. గీ. కవులు వచ్చుటమానిరి గాయకులు వి
చారవారిధి మునిఁగి యిచ్చటికి దూర
దేశములనుండి రారని తెలివి గల్గు
వార లానందనృపు నెంచి వంతగాంతురి.

26. ఈ శార్వరివత్సర వైశాఖమాసములోనే మరల విశాఖపట్టణములో జరగిన యష్టావధానములోఁ గొన్ని.

— ఇష్టదేవత —

ఉ. విక్రిమదేవవర్మ పృథివీపతిరత్నము కోర్కెమీఁద స
మ్యక్కృతికర్తలౌ ననఁగ నష్టవధానము చేయువార మీ
పక్రిక్రియయందు లోపములు పాల్పడకుండఁగఁ జేసి ప్రోవుమీ
వక్రవచఃప్రసంగిమదవారిణి, యో జగదంబ! సత్కృపన్.

— రామాయణము (మత్తకోకిల) —

సారసాప్తకులమ్మునందు వెసన్ జనించి యరణ్యమున్
జేరి మీఱి విరాధముఖ్యులఁ జీరి వాలిని మారి వి
స్ఫారశక్తి యెలర్ప జాలను వార్ధిఁ గట్టి చలంబుమైఁ
గ్రూరు రావణుఁ జంపి సీతను గొన్న రాముఁ దలంచెదన్.

— (సమస్య) పాదమ్ములు లేని తరులు పరుగిడఁజొచ్చెన్ —

క. ఏదెస వానలు గురియఁగ
గోదావరి పొంగివచ్చె గుములుగ నంచుఁ
వే దారలి నీట దృఢతర
పాదమ్ములు లేని తరులు పరుగిడఁ జొచ్చెన్.

—• (సమస్య) సతి సతిఁ గవియంగఁ బుత్రసంతతి కలిగెన్ •—

క. అతికుతుకం బలరారఁగఁ
జతురత మెఱయంగ మదనశాస్త్రవిధమునన్
వితతంబగు తనసౌధవ
సతి సతిఁ గవియంగఁ బుత్రసంతతి కలిగెన్.

—• (సమస్య) బిగిచను లేతమాడఁగను బియ్యముదంచె లతాంగివేఁడుకన్ •—

చ. అగణితమైన వేగమున నట్టిటు వంగుచు లేచుచున్ ఘనం
బుగఁ దగురీతిఁ బాటలను బొల్పుగఁ బాడుచు "సువ్విసువ్వి" యం
చొగి ముసలమ్ము కేలఁగొని యూఁగుచు జోగుచు, ఘొమ్ముఁగొట్టుచున్
బిగిచను లేతమాడఁగను బియ్యము దంచె లతాంగి వేఁడుకన్.

ఈ శార్వరి సం॥ జ్యేష్ఠమాసములో ఈ విశాఖపట్టణములో రచియించిన మఱియొక యష్టావధానములోఁ గొన్నిపద్యములు.

—• (సమస్య) గుమ్మములో నున్నముద్దుగుమ్మన్ గాంచెన్ •—

క. కమ్మవిలుకాని చిల్కున
సమ్మద మొనరించుచున్ బ్రశస్తంబగు రీ
తిమ్మనమును గరఁపఁగఁ దా
గుమ్మములో నున్నముద్దుగుమ్మన్ గాంచెన్.

—• (సమస్య) పంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా! •—

శా. గుంద్రా కావలె నంచు నే నడుగ నాకుం బల్లెవా రందఱున్
బంద్రంగిం గల దంచుఁ జెప్పి రది నాభావమ్ములో నెంచి య
వ్వాంద్రన్ మెచ్చుచు దానిఁగొంటకయి యీప్రాంతస్థలిన్ జేరితిన్
బంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా!

—• (సమస్య) శృంగాగ్రాదపత న్మృగస్య రుదతో బాష్పాంబు భూమండలే •—

శ్లో. గత్వాకశ్చన భూపతి ర్మృదుగతి ర్వ్యాధాగ్రికులం కాననం
ధృత్వైకం ధనుషా శరం ప్రహతవాన్ మార్గం శిశుం కోపతః

పుత్రం బాణహతం విలోక్య సరతో భీత్యా తదా, భూమిభృ
చ్ఛృంగాగ్రా దపత న్మృగస్య రుదతో బాష్పాంబు భూమండలే.

—• రంగులు ఘోషించె మేఘరావము పోల్కెన్ •—

క. రంగుమెయి హూణు లందఱుఁ
బొంగుచు వందలకొలంది 'బోయస్సు' పయిన్
సంగతముగఁ గాల్పించు ఫి
రంగులు ఘోషించె మేఘరావము పోల్కెన్.

—• (సమస్య) సింగములన్ మట్టె గంధసింధుర మయయో •—

క. పొంగుచుఁ గొందఱు రాజులు
సింగారములొలుక వేఁటసేయఁ జని వే
డ్కం గెలనఁ దిరుగ నా రా
సింగములన్ మట్టె గంధసింధుర మయయో.

27. వినుకొండ.

శా. ద్రవ్యాశన్ గొని కానిలోకమున సంస్తవ్యత్వసంపాదక
త్వ వ్యామోహముచేతఁగాని యిటు లేతాదృక్మహాధారణా
ది వ్యాప్యం బవధానమున్ సలుప నేతేఁబోము పార్జ్ఞుల్ కవి
త్వ వ్యుత్పన్నులు పిల్వనంప సిరసింపన్ రామి నేతెంచుటల్.

మ. అవధానమ్ములు మానుకొందమన మా కాయేటి కాయేడు చి
న్నవా లేకుండినఁ బెద్దవో యొనరుపన్ మాన్యుల్ కవిత్వాభిలి
ప్సవు లీరీతిగ శ్రద్ధచేయునెడ నిష్టుల్ గామి మాకేల ? యీ
వ్యవసాయమ్మను మాన మామరణ మో వాగ్దేవి ! వీక్షింపుమా !

మ. సెలవమ్మా ! వినుకొండ ! నీకిదె శుభాశీర్వాదపున్ దండ ; ని
మ్మలబావీ ! భవదీయనిర్మలపయోమాధుర్యముల్ క్రమ్మఱన్
గలుగుంగావుత మాకు; తావకశుభాకారాంఘ్రియుగ్మంబు నా
దలఁదాల్తున్ దయయుఁచు గుంటుహనుమద్దైవంబ ! రామేశ్వరా !

28. శార్వరి సం॥ ఆశ్వయుజములో నర్సారావుపేటయవధానములో

—• కొండవీటిసీమనుగూర్చి •—

సీ. నదిలోన స్నాన మేనాఁ డెఱుంగవుగదా!
పాతాళగంగాజపమ్మె కాని
శాల్యన్నమునకున్న సౌ రెఱుంగవుగదా!
గోఁగాకులును జొన్నకూడె కాని
శాకపాకాదుల చవియెఱుంగవుకదా!
దోసకాయల యడియూనె కాని
సౌధమ్ముల వసించు జాడెఱుంగవుకదా!
మట్టిమిద్దెల యున్కిపట్టె కాని

తే. గీ. "ఒక్కకోటీశ్వరుండు నాయొద్ద నుండె"
ననుచుఁ గడు విఱ్ఱవీఁగెద వతఁడుఁ గూడ
నాదిభిక్షకుఁ డంచు నీ వరయవొక్కొ
విగతసుఖభూమ, యో కొండవీటిసీమ!

29. శార్వరి సం॥ మార్గశీర్షములో కేశనకుర్తి యష్టావధానములో.

—• రామాయణము •—

సీ. దశరథేశ్వరు నపత్యంబయి జనియించి
యవనిపుత్రికను బెండ్లాడి మించి
పరశురామునివిల్లు భగ్నమ్ము గావించి
యటుపిమ్మట నయోధ్య కరుగుదెంచి
తండ్రియానతిని గాంతారమ్మునకు నేగి
ఖరదూషణాదిరాక్షసులఁ జంపి
యయ్యెడ భార్యాపహర్తయౌ రావణుఁ
జెనక సుగ్రీవుతోఁ జెలిమి నేసి

తే. గీ. "కాని, వనధిఁ గట్టి యువ్వానిఁ దునిమి, పిదప
సీతతోఁ దనపురికి విచ్చేసి, పట్టి

భద్రుఁడై యొప్పు శ్రీరామభద్రు చరిత
మెవ్వనికిసేని శుభముల నీయకున్నె!

—• చంద్రోదయము •—

క. కుముదమ్ములు వికసించెన్
గమలమ్ములయందుఁ దగు వికాసము లడఁగెన్
దమి హెచ్చె బాంథసతులకుఁ
గ్రిమమునఁ జందురుఁడు వెలుఁగఁగా నంతంతన్.

—• ప్రతిభనుగూర్చి (ద్రుతవిలంబితము) •—

అనుపమానతయా ప్రతిభాతివై
సులలితా ప్రతిభా గతిభాసురా
ఇయ మతీవ లసేదితి నిశ్చయం
రచయితుం భువి కోను భవేత్ప్రమాన్.

30. ప్లవ సం॥ విజయాశ్రీవణములో రెడ్డిపోలవరములో నవధానము.

—• పట్టసపు వీరభద్రుఁడు •—

ఉ. కాశశరత్సుధాకరవికాసశరీరుని భూషణీకృతా
హీశు మహేశు సర్వజగదీశు సతీశు నతేశు ద్యోస్థలీ
కేశుఁ గృపానివేశు నలకేశహితున్ మనపట్టసంపు వీ
రేశు నుతింతు నాకు శుభమెప్పుడు గల్గుటకున్ మనమ్మునన్.

—• శ్రీ పోలవరపుజమీందారుగారు (లయగ్రాహి) •—

కమ్మవిలుకానిసొగసు మ్మెఱుఁగుపెట్టఁదగు
నిమ్మయినమేనిసొబగు మ్మతివివేకి
త్వమ్మదగుపోలవరపుమ్మహిపుఁ డెల్లప్రజ
లమ్మనుచు మాతృకవిధమ్మ గనుపట్టన్
ఎమ్మెయిని నవ్విభు మన మ్మధికశాంతగతి
పమ్మిచెలఁగున్ జగతి నమ్మహిపుఁబోలం

గమ్మహితుఁ డొక్కఁడు నిజమ్ముగను లేఁ డతిఘ
న మ్మతనిచిత్రచరిత మ్మెవని కబ్బుఁ.

—• సైరంధ్రీసింహబలులనుగూర్చి. (మందాక్రాంతావృత్తమ్) •—

సైరంధ్రీం తా మధికసుషమాం కీచకో వీక్ష్య రంతుం
దోష్ణా చేలాంచల మధికసంరంభత స్స్వీకరోతి
సా ప్యేతస్మా త్కథమపి పునర్గంతు మిచ్ఛం త్యతీవ
ప్రభ్రష్టాత్మా ప్రకలితభయా వేపతే తాపతప్తా.

31. ప్లవ సం॥ ఆశ్వయుజమాసమున అనకాపల్లెలోని యవధానములో.

—• స్కూలు •—

క. పలుమందికి నుపయోగం
బౌలయ ననకపల్లెలోన నొప్పారు మ్యుని
స్పలువారి స్కూలు దానం
గల గురువులుబాలకులును గడు సాధుమతుల్.

— జగత్తు మిథ్య యనుట. (వసంతతిలకము) •—

ఏత జ్జగ న్నహి మృషేతి సదాపి మూఢో
మత్వా పునశ్చ రమతే పరమార్థహీనః
జ్ఞానీ త్వసత్య మితి చేతసి నిశ్చినోతి
ప్రీతిం పరం త్యజతి తత్ర తతశ్చ హేతోః.

—• పోలీసుజవానులు •—

క. యమదూత లెట్టిరో యెఱుఁ
గ మనెడి లోపమ్ము దీర్పఁగా పోలీస్వా
రి మహిఁ బ్రభువు లేర్పఱచిరి
కుమతులకే వారు వీరుఁ గూర్తురు బాధల్.

—• "యాంచింతయామి" అను శ్లోకమునకుఁ దెలుఁగు •—

తే. గీ. ఏనుగోరెడియింతి దా నితరుఁ గోరు,
వాఁడు మరియొక్కరితఁ గోరు, వనితఁ వేఱొ

కర్తు ననుఁ గోరు, నేమనఁ గలదు మదను
వర్తనమునకు మా మనోవైఖరులకు.

32. ప్లవ సం॥ కార్తికమార్గశిరమాసములలో శ్రీకాకుళములో జరగిన శతావధానాష్టావధానములలోఁ గొన్నిపద్యములు.

చ. తిరుపతివేంకటేశకవిధీరులలో నొకరుండ, వేంకటే
శ్వరుఁ డనువాఁడ, నిన్నొకటి పార్థనఁజేయఁగఁ బూనినాఁడ నీ
కరుణ శతావధానకృతికారణ మౌటను నేఁడు నాకు మా
తిరుపతిశాస్త్రి రానివెలితిన్ సవరింపుము దేవి మ్రొక్కెదన్.

—• పరమాత్మునిం గూర్చి •—

చ. సిరు లిడు నేమహామహుని సేవన, మెవ్వరికేని సౌఖ్యముల్
పరఁగఁగఁజేయు నేమహితుపాదనమస్కృతి, జ్ఞానమిచ్చు నే
పరముని నామసంస్మరణ, భద్రద మెవ్వని వృత్తి, తాదృశున్
జిరతరు వాదిపూరుషు భజింతు యజింతు సృజింతు సత్కృతుల్.

—• భక్తినిగూర్చి. (వసంతతిలకావృత్తమ్) •—

దారా స్సుతాశ్చ ద్రవిణం గృహ మంబరాణి
కాయం చ నిత్య మితి మాభ్రమ మూఢచేతః
భక్తిం కురుష్వ పరమాత్మని నిర్గుణేవా
నోచే న్మహాగుణయుతే తరణాయ నిత్యం.

— సప్తసంతానములలోఁ గృతి యధికమనుట •—

తే. గీ. తనుజుఁడు తటాకమును గృతి ధరణిదివిజ
వరుని నిల్పుట నిధియును వనము శివుని
కాలయము గట్టుటయు నివి యగును సప్త
సంతతులు వీనిలోపల సతము కృతియ.

—• తలిదండ్రులలో తల్లి హెచ్చని సాధించుట •—

తే గీ. కనుట యెంతేని నుత్కృష్టకష్టమునను
నేవమున కియ్యకొని పెంచు టించుకంత

సేగి గల్గిన నెమ్మదిఁ జింత గొనుట
తల్లి కగుటను నాపె యిద్ధఅను హెచ్చు.

—• తలిదండ్రులలో తండ్రి హెచ్చని సాధించుట •—

క. తలిదండ్రు లిరువురందున్
సులలితమతిశాలి నాత్మజునిఁ జేసెడివాఁ
డిలఁ దండ్రిగాన నతనిన్
బలుకందగుఁ దల్లికన్నఁ బ్రబలుఁ డటంచున్.

—• అద్వైతసిద్ధిని గూర్చి •—

క. క్రిమమున నజ్ఞానము నా
శమగుడు నశ్యమగు నెల్లజగ మాపైఁ 'ద
త్వమసి' యనెడి వాక్యము ని
క్కమగుట నద్వైతసిద్ధిగలుగున్దానన్.

—• సభలో నొక రిచ్చిన కల్పన •—

ఉ. సారయశస్కులౌ ఘనుల సచ్చరితమ్ములు గాంచి యన్యులన్
ధీరతఁ గాంతురి, వారిఁగని తెల్విని గొందురు వారివంశ్యులుఙా,
భూరిరజోవలిప్త మయి పొల్చెడి త్రోవను బట్టి యేగు న
వ్వారిపదమ్ములన్ దెలియవచ్చెడిఁగా పథ మెట్టిదేనియున్.

—• అన్నదానప్రశంస •—

శా. దానమ్ముల్ వివిధమ్ములుండినను నద్దానమ్ములందెల్ల నా
త్మానందం బొనఁగూర్పఁ జాలు నది యన్నాఖ్యంబ, ద్రవ్యంబు నెం
తేనిన్ దెచ్చి యొసంగినన్ మనము తృప్తిం జెందఁగాఁబోవ, దే
రేనిన్ దృప్తిని గాంతు రన్నమున, నే రిద్దాని శ్లాఘింపరో!

—• అగ్గిపెట్టె •—

క. ప్రతిదినము నగ్గి కంచున్
సతి ప్రతిగేహంబుఁదిరుగఁ జను పని తప్పెన్

మతిమంతు లగ్గిపెట్టెను
గతిగాఁ గల్పించుటన్ సుఖం బలరారెన్.

—• బాలవిధవలకుఁ దల గొఱుగఁదగ దనుట •—

సీ. అతిబాల్యమున భర్త గతియించినట్టి య
క్కన్నెకు విజ్ఞాన మన్న సున్న
యట్టి చిన్నతనాన నప్పసిగోలకుఁ
దల గొఱిగింప యత్నంబొనర్చు
కన్నను నజ్ఞానమున్నె? యేమన్న న
న్యాయసికే యది గొను టతిభరమ్మ
గాఁదోఁచు, నెట్లనిఁ గానిమ్మ ప్రకృతమ్మ
వచియింతు సర్వానుభవమగుగతి

తే. గీ. వేరికేనియు వైరాగ్య మారయఁగ స్వ
బుద్ధిసమ్మతమైనచోఁ బొలుచు సుఖద
మై, బలాత్ప్రాప్తమైన నయ్యది యసహ్య
మగుటవారికిఁ గామంబు లడఁగు టెట్లు?

—• సభలో నొకరు చదివిన శ్లోకమునకుఁ దెలుఁగు •—

చ. నలుదెసలన్ భ్రమించు మదనాగ మనంజను నిమ్మనమ్మ వే
గ లలి రమేశుపాదమను కట్టను గట్టఁగ సారమైన జ్ఞా
నలవము తాను సంకెల యనన్ దనరారు మఱెట్టివారికిన్
సులభము గాని దయ్యదియెసూ ధరణీసురవంశరత్నమా!

—• పునర్జన్మము మాన్పుకొనుట కుపాయము •—

సీ. యోగ్యతగాఁ గాల మొక్కరీతినిఁ బుచ్చి
సంసార మొకభంగి సాగఁజేసి
యనివార్యగతిఁ గర్మ జనితమ్ములై వచ్చు
కష్టసుఖమ్ములకలిమి గనియుఁ

బద్మ పత్రము నీటఁ బరిఢవిల్లెడిరీతి
సకలకార్యమ్ములఁ జక్కఁజేసి
తనమన మెవ్వేళఁ "దత్త్వమసీ" తి వా
క్యార్థమ్మునందుఁ దా నతుకఁజేసి
తే. గీ. యెవఁడు చరియించు నాతఁ డహీనుఁ డతఁడె
యోగి యవ్వాని కిహమున నొక్కఁడేని
లేదు కష్టమ్ము సంతతామోదుఁ డతఁడె
వానికిఁ బునర్జనియు లేదు వాస్తవ మిది.

—• మహిషాసురమర్దని •—

చ. చిరముననుండి మత్తతను జెంది త్రిలోకవిభూతి దానయై
వరమున మేను గానక ప్రపంచము నష్ట మొనర్పఁబూను దు
ర్భరు నల కాసరాసురునిఁ బట్టి వధించి ముదమ్ముగాంచి శాం
కరి మధుపానమత్త యయి గ్రాలె సురల్ తనచుట్టు వాలఁగన్.

—• మి త్రుఁ డు •—

క. ప్రతిఫల మపేక్షసేయక
ప్రీతికార్యమ్మునకుఁ దోడుపడుఁ, గష్టసుఖా
న్వితుఁ గాంచి తాద్భుతుండగు
హితునకుఁ దుల్యుండు గలఁడె యెందు వెతకినన్.

—• స త్య ము •—

చ. తప మొకఁ డేల, పెక్కులగు దానము లేల, యనేకతీర్థముల్
నెపమునఁబోయి గ్రుంకిడఁగనేల, యనేకపురాణజాలముల్
చపలతఁ జూడ నేల, బహుశాస్త్రములన్ బఠియింపనేల, స
త్యపువెల గుర్తెఱిఁగిన మహాత్ముల కూరక యేల జన్మముల్ ?

—• స ర్వ స ము జ •—

చ. అరియును మిత్రుఁడొక్కటియె, యాత్మజుఁడుం బెఱవాఁడు నొక్కటే,
కరియును దోమ యొక్కటియె, కానుకయున్ మఱియొండు నొక్కటే,

పురి వని యొక్కచే, మఱియు భూషయు నెమ్మను నొక్కచే, సమ
స్తరతులు వీడి వర్తిలు బుధప్రవరేణ్యుల కన్ని యొక్కచే.

—• విఘ్నేశ్వరుఁడు •—

చ. కరములుమోడ్చి మ్రొక్కెదుదుఁ గంజభవాదినతున్ మహోన్నతున్
బరువగు బొజ్జవాని మలభమ్మగు చిత్రమువాని నారికే
శరసరసాదనాదరు నలంఘ్యపరాక్రము నాగరాజశే
ఖరు గణనాథు భక్తజనకంజదివాకరు సద్గుణాకరున్.

—• లక్ష్మి •—

క. సరసిజగేహవివాసిని
గురుదారిద్ర్యమ్ము పగులఁగొట్టెడిదానిన్
హరియురము శయ్యగాఁ గాఁ
పుర మొనరుచు సిరిని మ్రొక్కఁ బోలదె యేమన్.

—• రామాయణము •—

క. ఇనకులమునఁ బొడమియు సీ
తనుఁ గొని వన మేగి వార్ధి దాఁటి తనసతిన్
గొనిన దనుజుఁ గడతేర్చి సు
ఖనిధి యయి యయోధ్య కేగు ఘను మది నెంతున్.

33. ప్లవ సం॥ మార్గశీర్ష మాసమున నుర్లాము సంస్థానములో జర
గిన శతావధానాష్టావధానములలోని కొన్ని పద్యములు.

—• అరఁటిచెట్టునుగూర్చి •—

సీ. కాయలు కూరకేకాక పండ్లకు నుప
యోగించు, నాకులు నొక్కభోజ
నమునకె యౌ, దొప్పలు మఱియయ్యవి లేని
యప్పుడు విస్తరులయ్యు నుపచ
రించు, దూటయు నావనించి పచ్చడిచేసి
కొననౌను, దుంపయుఁ గొన్నియౌష

ధములకు ననుపానక్రమమున నుపయోగ
దశ చెందుఁ, గానఁ గదళి కెన యగు
తే. గీ. తరువు గేస్తున కిఁక లేమి; ధరణి నిదియుఁ
దియ్యనీటికూపమ్ము గేదెయును గాదె
గలుగు గేస్తులయింటి కెక్కాలమందు
బందుగులు వచ్చినను గౌరవమ్ము జరగు.

—• వేశ్యావమానితుఁడగు పేదబ్రాహ్మణుని విచారము •—

ఉ. ఏను జిరమ్మునుండియును నేటిసమీపములందు మేటిక
ష్టాన గడించు కాసు నకటా! వృథచేసితి, 'నేలవచ్చి' తం
చా నళినాయతాక్షి నను హాస్యము చేసె, నిఁకేటి జన్మ! మీ
మానస మెంతచేసె! నవమాన మి దెవ్వరితోడఁ జెప్పినన్.

—• జ ప్తు బం ట్రో తు •—

మ. "అరె సర్కార్ హుకుమండి జప్తి" యని యత్యాలాపముల్ సేయుచున్
ద్వరతో వంటయిలున్ జొరంబడి పొయిం దార్కొన్నపాత్రమ్ము ని
ష్కరుణుండై వెలికీడ్వ, గేస్తపు "డహో! సాహే బిటుల్ చూడుమా!
కరుణంజెందుము రూక కైకొనుము నన్ గాపాడు మీమా" రనున్.

—• దరిద్రురాలైన తల్లి పిల్లవాని నూరార్చుట •—

ఉ "కోరెద వెన్నియేనియును గోరిక, లేమియొనర్తుఁ దండ్రి! నీ
వారయఁజాల వింటఁ గలయట్టి దరిద్రత, పూర్వజన్మసం
స్కార మదీదృశం బయినఁ గల్గునె సంపద లేరికేని" యం
చూరడఁ బల్కు తల్లులకు నొయ్యన దేవుఁడు కల్మి లిచ్చుతన్.

—• (సమస్య) మహోదరీ మారవధూ ర్విభాతి •—

శ్లో. శిరీషపుష్పా దపి కోమలాంగీ
విశేషకాంత్యా పరిభాసమానా
ప్రపూర్ణగర్భేణ విరాజమానా
మహోదరీ మారవధూ ర్విభాతి.

—• ఈ ప్రయాణమునందలి విశేషములను తిరుపతిశాస్త్రితో చెప్పినట్లు •—

సీ. శ్రీకాకుళమునుండి చెచ్చెర లుకులాము
తోవ సుర్లాము సంతోషమెసఁగ
నేగితి, నయ్యెడ నెల్లయుద్యోగులు
గౌరవ మెంతేనిఁ గడలుకొలిపి
మొదల శతవధానము నొనర్పఁగాఁజేసి
యష్టావధానమ్ము వంతమీఁదఁ
జేయించి యధికపుశ్రీ నొప్పు పూర్వరా
జులు కవులకు నిడు సూటిగ బహు
తే. గీ. మతి యొసంగించుటయ కాక మానపూర్వ
కముగ "శ్రావణపూర్ణిమ కరుగుదెండు
వార్షికము మీ కిదియ" యంచు వారు ప్రతిన
చేసియున్నారు; వినుమోయి, శ్రీపతికవి !

34. ప్లవ సం॥ పుష్యములో మందసా సంస్థానములో నవధానము.

—• శ్రీరాజ కుమారుఁడు పట్టదేవుగారినిగూర్చి. (భుజంగప్రయాతము) •—

శ్రియో వాస ఏషప్రసిద్ధప్రతాపో
గుణై రుత్తమై స్సంతతం భాసమానః
ఉదారప్రచారో రతీవాపతారో
జయే త్పట్టదేవో మహారాజపుత్రః.

—• ప్రభాతకాలము •—

శా. నీరేజమ్ములు కాంతిఁ జెన్నలరె వన్నెన్ గోకముల్ గాంచె సు
శ్రీరంజిల్లె దెసల్ నభమ్ము వెలిఁగెఁ జెన్నారి తెల్లన్ జనుల్
సూరుల్ సూరున కర్ఘ్యముల్ విడువఁగా శుంభద్గతిన్ స్నానముల్
ప్రారంభించిరి తారకల్ జుణిఁగె నప్పట్లన్ బ్రభాతమ్మునన్.

—• (సమస్య) ప్రాతః పశ్చిమపర్వతే దినమణిః పూర్వాచలే చంద్రమాః •—

శ్లో. ధాత ర్మేరుమహీధ్రలంఘనధియా వింధ్యాద్రిణా సర్వతో
వ్యాప్తం వ్యోమతలం, దివేతిచ నిశేత్యస్తం ప్రతీతి ర్గతా

దూతే నైవ మయాషి సత్య ముత నోసత్యం "గతే వాసరే
ప్రాతః పశ్చిమపర్వతే దినమణిః పూర్వాచలే చంద్రమాః"

35. ప్లవ సం॥ మాఘమాసమున కిర్లంపూడివద్ద తిరుమాలిలో కరణంగారి కోరికపై నాకుగా రచించినవి.

—• ఆయూరి కరణము లోఁగిటిని గూర్చి •—

మ. కలుముల్ గల్గఁగఁజేయు నింతి కిరవై కళ్యాణభూయిష్ఠమై
పలుచిత్రమ్ముల కాకరంబయి సుసంపన్నమ్మునై దోసతోఁ
టలలిన్ బుత్రులుఁ బుత్రికల్ దగ నిరూఢంబైన యోలేటి కొం
డలరాయండు వసించుగేహము ప్రథన్ దా రాజిలున్ హృద్యమై.

—• పరకీయాసక్తుఁడు •—

సీ. రాత్రియెప్పుడు వచ్చురా దైవమా యంచుఁ
బలుమాఱు మదిని జప మ్మొనర్చు
నది వచ్చుపైఁ దనదైన సంకేతమ్ము
చేరు టెప్పు డటంచుఁ జింతగాంచుఁ
జింతించి యచ్చోటు చేరినపిమ్మటఁ
"గలికి రాదే" యని కళవళించుఁ
గళవళించుచు దేనిగాంచిన "నదియే" యఁ
టంచు విభ్రాంతిచే నాత్మ నెంచు

తే. గీ. నెంచి కాకున్నఁ దత్పతినెంచి తిట్టుఁ
దిట్టి యేమేమొ మదిఁ గోర్కె దీటుకొలుపుఁ
గఱచు పాము నెఱుంగఁడు పఱచుభూత
మెఱుఁగఁ దన్యాంగనాసక్తుఁడేని జనుఁడు.

—• ఉపరిసురతము •—

సీ. అతిరహస్యపుఁజోటు లరయఁగా నుంకించు
ధవునికన్గవ మూయఁదలఁచి మఱచు
నేమాటయోచెప్ప నెదలోనఁ దలపోసి
పలుకు వేఱొకమాట; పలికి కొంకు

సిగ్గేడఁ బోవునో, చే పేడకేగునో!
నిశ్శంక రతికృతి నేర్పు చూపు
నెదురొత్తుల నొసంగునెడ మోదమందు నా
యొసకమ్ము లేనిచో నేవగించు

తే. గీ. ఇట్లు పలుభంగుల నటించి యిక్షుధన్వు
శివ మొకించుక డిగెనేనిఁ జెలువ గాంచు
సిగ్గుఁ జేటును, వచియింపఁ జెల్ల దేరి;
కది తమఃకారి యగు కంతు నానఁగాదె.

36. శుభకృత్సం॥ మాఘమాసమున నూజివీడు సంస్థానములోని సంపూర్ణశతావధానములోని కొన్ని పద్యములు.

—• లక్ష్మి •—

చ. సిరి నరవిందవాసిని విశేషతనూరుచిభాసమాన సుం
దరి హరిరాణి రిక్తజనతాపరితాపనివారిణిన్ బురం
దరముఖదేవతాబ్జవదనానతపాదసరోరుహన్ గృపా
కర నరవిందలోచనఁ దగ న్నుతియించెద సంపదర్థినై.

—• నిర్గుణబ్రహ్మము •—

శా. నీరూపు న్నిగమాంతపండితగతి న్నిష్కామసేవ్యున్ మహో
ధీరు న్నిర్గుణు నిర్మలు న్నిరుపముం దేజోమయున్ భాస్వరున్
వైరాదిప్రతిబద్ధచిత్తులకు నెన్నండేనియుం బొందఁగాఁ
జేరంగా నతిదుర్లభుం బరు మదిం జింతింతు నశ్రాంతమున్.

—• ఐశ్వర్యచక్రవర్తి •—

మ. ఘనుఁ డత్యంతకలావిదుండు రుచిరాకారుండు శాంతాత్మకుం
డనఘుం డెంతయు దానశీలుఁడు సితాస్యస్వచ్ఛవంశ్యుండు స
జ్జనమాన్యుండు సమస్తరాజమకుటీసంలగ్నరత్న ప్రభా
కనదంఘ్రిప్రతిభాసమానుఁడయి వేడ్కంజెందు నెద్వర్థిలన్.

—• దా రి ద్ర్య ము •—

సీ. ఎద్దాని( గనినవా( డెంత యుత్కృష్టు(డై
నను గవ్వకైనను బనికిరా(డు
ఎద్దానిబాధచే నిల్లాండ్రకును భర్త
లకును వివాదంబు లనుఘటించు(
గామరోగాదిదుర్గ్రంధిచ్ఛిదంబయి
యెయ్యది విజ్ఞాన మెస(గ(జేయు
రైలు పుట్టకమున్నె రహి( బరదేశముల్
త్రిప్పె నెయ్యది తన దీమసమున
తే. గీ. అద్ది దారిద్ర్య మన(గ; నయ్యదియ మాశ
తావధానమ్మునకు ముఖ్యమైన హేతు,
విదియు ని(క మాకు దూరమై యెస(గు(గాక
రసికు(డగు రామచంద్రాప్పరావు కృపను.

—• యౌ వ న ము •—

ఉ. హీనతగాంచె నెన్నడుము, హెచ్చుగ( దో(చె( గటీతటంబు స
న్మానము నేర్చె నుంబలుకు, మన్నన చూపులయందు( దో(చె న
న్యూనరసాతిరేకముగ, నుగ్మలికిన్ వయసంకురించు నా
లోనన చిత్త మెంతయును లోలత కాస్పదమయ్యె భూవరా!

—• వార్ధక్యము (మత్తకోకిల) •—

చూపుతగ్గుట దేహదార్ఢ్యము సున్న యౌట మనమ్మునన్
గోపమబ్బుట చిన్నికుఱ్ఱలకున్ హితంబులు దెల్పుటల్
"శ్రీపతీ! కరుణాకరా! నను( జేరి బ్రోవర" యంచు న
య్యాపదుద్ధరువే(డుకొంటయు నబ్బు వృద్ధత గూరినన్.

—• మ ఱ్ఱి చె ట్టు •—

చ. సలలితమైన కొమ్మలను జల్లనినీడను గల్గ(జేయు( బే
శలతరమైన యాకుల ద్విజన్ములకున్ బొనరించు సత్కృతిన్

వలనగునట్టి పాల బలవద్రుజలన్ బెకఁబాపనోపు నీ
యిలఁగల చెట్లు మట్టి కెవయే? పరికించిన నప్పరాడ్విభూ!

—• మాజిపీడుపురం (స్రగ్ధరా) •—

విద్వద్రాజై ర్మహద్భి ర్ధరణిసురగణై స్తాదృశై ర్భూమిపాలై
రన్యైర్ధన్యైశ్చ వైశ్యై స్తదితరమనుజై శ్శీతలాకీర్ణజాలై
దివ్యై ర్దీవ్యత్సరోభి ర్విలసతి నితరాం నూజివీడాఖ్యరాజధానీ
యామాహు స్థానమాఢ్యం చిరతరయశసా మప్పరాయాన్వయానాం.

—• చీ పు రు ప ల్లి —

తే. గీ. తిరుమణియుఁ దిరుచూర్ణంబు తివిరి దాల్చు
వైష్ణవమతస్థులకు నెక్కువ యుపయోగ
మెద్దియగు దానియోగ్యత నెన్నఁదరమె
పుల్లమాత్రంబె! పూచికపుల్ల, భూప!

—• ఎడ్వర్డుచక్రవర్తి (శార్దూలవిక్రీడితమ్) •—

శ్వేతాస్యాన్వయదీపకం నృపవరై రారాధ్యమానం ముహు
ర్వ్యక్తోర్వ్యాకృతపూర్వపుణ్యనిచయం విజ్ఞానచింతామణిం
సచ్ఛీలాన్వయసద్గుణోజ్జ్వలవలగ్నాంగ్లాసనాధం జనా
వందంతే సమవాప్తశాసన మహో ఎడ్వర్డుభూపాలకం.

—• పె న్సి ల్ •—

ఆ. వె. కవితసెప్పికొనెడి ఘనులకు మఱియును
గవిలివ్రాయు వర్తకగణమునకుఁ
"బెనిసి" లుపకరించు బెఱలేఖినులకన్న
దీని నెన్నవలదె మానవేంద్ర!

—• శ్రీరామచంద్రాప్పరావు (శార్దూలవిక్రీడితం) •—

శ్రీరామంహృదయేన సంతత మహో య స్సేవతే భక్తితో
యస్యాఽభాతి మతి స్సదా సుకవిరాట్సమ్మాననే భూభృతః
యచ్చిత్తం సహజప్రచారవచత శ్శాంతం స జేజీయతాం
సీతాకాంతకృపావశా చ్చిరతరం శ్రీరామచంద్రాప్పరాట్.

—• దా ర ము •—

క, హారములు గుచ్చికొనుటకు
దారములగు వస్త్రములను దగఁ గుట్టుట కా
ధారమగు దారమును నే
వారేనియు మేటియనుచుఁ బలుకఁగవచ్చున్.

—• భారతయుద్ధం (జలధరమాలా) •—

భీష్మద్రోణౌ ప్రభురపి కౌశవ్యాణా
మశ్వత్థామా కదనకలాఢ్యః కర్ణః
పాండోఃపుత్రైరృజుతరచారిత్రైస్సై
ర్యుద్ధ్వాప్రాప్తాః పరిభవ మస్త్యైస్సాకం.

—• ప కో డి (ఉత్సాహ) •—

సెనగపిండి యుల్లిపాయ చిన్నిమిర్పకాయలుం
జొనిపి యందు నల్లమింత చొనిపి ముద్దచేసియున్
అనలతప్తమైన నేతియందువైచి వేచినం
జనుఁ బకోడి యనెడుపేరఁ జక్కనైన ఖాద్యమై.

—• వేంకటేశ్వరః (ప్రహర్షిణీ) •—

సేవేఽహం తిరుపతివేంకటేశ్వరం తం
శ్రీవాణీధవముఖనిర్జరాళివంద్యం
శ్రీనీలావిలసితపార్శ్వభాగ ముద్య
త్తేజస్కం కలియుగదైవతం జనానాం.

—• చంపకపుష్పము (సుగంధి) •—

చంపకమ్ము ఖాసిలుం బ్రశస్తమైన శోభచే
నింపు పుట్టఁజేయుచున్ మహీజపూలతోఁటలో
లంపటంబుగాదు భృంగరాజి దీనియందు, నీ
కంపు దాని కింపుగామిఁ గంపమానచిత్తమై.

—• కాముకః (వాతోర్మీ) •—

ద్రవ్యే నష్టే స్వసతీమానసేఽలం
రుష్టేఽకీర్త్యాం ప్రసరంత్యా మతీవ
శంకాం నాప్నో త్యథ యద్యద్భవేద్వా
కామీ స్వర్గం పరతం వీక్షమాణః.

—• పూది •—

ఉ. కాలను గుచ్చుకొన్న ములు గ్రక్కునఁదీసికొనంగ, బట్టలన్
మేలిమిఁ గుట్టుకోఁగ, నెలమింగరణంబయి యొప్పు పూదితోఁ
బోలఁగనేర్చువస్తువును భూమి నిఁకొక్కఁడు చూడనేర మి
క్కాలమునందు జీవనముగా నిది యెందఱిఁ బెంచుచున్నదో!

—• పస్త్రము •—

శా. శ్రీరంజిల్లెడి లంకయాకుఁగొని వాసింబొల్పు హైయంగవీ
నారూఢమ్మగు పన్నముం జొనిపి యం దత్తర్వ నొక్కింత యొం
తే రంజించియు బిల్వసత్ఫలమునం దెక్కించి యా చూర్ణమిం
పారం బీల్చుటకన్న వేఱుగలదే యానంద మూర్వీధవా!

—• హూణకాంత •—

సీ. మంచుడాలునుజూచి యించుమించుగనవ్వు
మేనిమేల్జిగి మిఱుమిట్లుగొలుప
నాపాదమస్తకంబై యొప్పుగాగరా
నడుమునం దొకవింత బెడఁగుదెల్ప
తిలకశూన్యంబయి దీపించు నెమ్మోము
నిష్కళంకాబ్జుని నేర మెంచ
అత్యంతమృదులమ్ములై యొప్పు పల్కులు
వినువారివీనుల విందుగాఁగ
ఆ. వె. భర్తృసంగృహీత బాహయై చల్లని
గాలికై షికారుగా సుమాళ

మైన రీతి రాఁగ నరసితి నొక హూణ
కాంత, దాని చెలువు కనుల విందు.

## —• నూ జి వీ డు •—

సీ. ఎచ్చోటఁజూచిన నింపుమీఱెడి రాజ
సౌధమ్ము లేన్గులు సంచునించు
నెయ్యెడఁగనుఁగొన్న నెలమిసించెడి మంచి
యశ్వముల్ కనులకు హాళినొసఁగు
నేచక్కి వీక్షింప రాచబిడ్డల షికా
ర్వారటుల్ గనువారి నూరఁజేయు
నేవంకఁగనినఁ బారావారపర్యాయ
ములు తటాకములు పెన్మోదము నించు
తే. గీ. నెచటఁ జూచినఁ బెంకుటిం డ్లెచటఁ గన్నఁ
బూలతోఁటలు మదికి మేల్ హాళిఁ బెంచు
నూజివీడుపురం,బది రాజధాని
యప్పరాయాన్వయజులైన యధిపతులకు.

## —• క వి త్వ ము •—

చ. సరసత చక్కఁగా నెఱుఁగు సజ్జనులన్ ముదమందఁ జేయుచున్
విరసులవంకఁ బోక పృథివీతల మెల్లెడ స్వానువర్తులన్
దిరుగఁగఁజేయుచున్ నృపుల తేజము శాశ్వతమైన ఫక్కిమై
వఱలఁగఁ జేయు సత్కవితవంటి కలల్ మఱి యెందుఁ గల్గునే!

## —• ప ట్టు ద ల (శార్దూలవిక్రీడితం) •—

శా. ఎంతే ద్రవ్యము వమ్మొనర్చుటకు లో నింతేని శంకింప రా
వంతన్ ధర్మ మధర్మ మంచు మదిలో నాలోచనంజేయ ర
త్యంతం బాత్మజుఁ డంచుఁ దమ్ముఁ డనుచుం దారంచు నొల్లంచునుం
బంతంబున్ గనువారు చూడ రిలఁ గోపం బొందు దక్షన్ నృపా.

—• జూ ద ము •—

క. వ్యసనము లన్నిఁటికన్నను
 బసగలయది జూదమగును బాండవు లిద్దా
 వ సపిచెడి యడవిపాలై
 వసమరి రని వినమె దీవి వలవదు తవులన్.

—• తే లు •—

క. తన సహజగుణము కతనన్
 బనిగొని యెద్దాని నేని పడఁగుట్టెడి తే
 లునకున్ ఖలునకు భేదము
 గనుఁగొనిన నొకింతయేనిఁ గనుపడదు నృపా!

—• బైసికిల్ (శార్దూలవిక్రీడితం) •—

శా. నీరుంగోరదు గడ్డినడ్గ దొకకొన్నే నుల్వలన్ వేఁడ దే
 వారే నెక్కినఁ గ్రిందఁ ద్రోయ దొకఁడున్ బజ్జన్ భటుండుంట చే
 కూరంగావలదెందు బైస్కిలునకుం గోపం బొకింతేని లే
 దౌరా! వాజికి పాటియైన యిది విశ్వామిత్రసృష్టంబొకో!

—• గుఱ్ఱపు సవారు (మౌక్తికమాలా) •—

వేగవశేన ప్రచలతి వాహే
చిత్రవిచిత్రై ర్మృదుగతిభేదైః
తద్గతపుంసో భవతిహి సామ్యం
వ్యస్తవిలాసానుగతతరుణ్యా.

—• త మ ల పా కు •—

క. కడు తెలుపు గలిగి యెంతయు
 నిడుపును వెడలుపుమగలిగి నిగనిగమైఁ జొ
 ప్పడు తమలపాకు భోజన
 మడరినపై లేకయున్న నది భోజనమే?

—• ఎడ్వర్డు పట్టాభిషేకం (శార్దూలవిక్రీడితం) •—

టాగ్రివన్మూరున్నృపాలకోఽపిచ మహీశూరాధిపో హైదరా
బాదాపట్టణసార్వభౌమ యవన శ్చాన్యేపి భూపాలకాః
యస్యాస న్కరదా స్సభాతి నితరా మెడ్వర్డుభూపాలకో
విక్టోర్యాకృత పూర్వపుణ్యవిభవః పట్టాభిషేకోత్సవే.

—• ఆం జ నే యు లు •—

ఉ. వారిధి దాఁటినావు బలవంతుల రక్కసులన్ జయించి శ్రీ
భూరమణీసుతన్ గని విభుండగు రాముని క్షేమవార్త నిం
పారఁగఁ దెల్పినావు జగదాదృతమౌఁగద నీచరిత్రి మో
ధీరనుతా ! కవీంద్రనత ! దివ్యమతా ! లసదంజనాసుతా !

—• ప్లీ డ రు లు •—

సీ. ఆబాల్యముననుండి యర్థవ్యయముచేసి
తల్లిదండ్రుల వీడి తనదు గ్రామ
మనక పౌన్నూరన కనయమ్ము విద్యకై
పలుపాట్లుపడి మీఁదఁ బ్యాసుచేసి
యాపయిఁ గోర్టునకరుదెంచి పట్టాను
గైకొని చక్కఁగాఁ గ్రాసుచేయు
నేర్పు సంపాదించి నీతిబాహ్యుఁడుగాక
న్యాయరీతి నెసంగు న్యాయవాది
తే. గీ. పేరు ఘృతకోశసామ్యమ్ము గూర దంక
నూరక జమీనుదారుల కుబ్బొనర్చి
'వ్యాజ్యములు వేయు' మనెడి కపటమతులకు
న్యాయవాదిత్వ మేరీతి సార్థకమగు ?

—• శ్రీ రం గా య ప్పా రా వు గా రు •—

శా. చంగత్కీర్తివిరాజమానుఁడు కలాసామ్రాజ్యధౌరంధరీ
భంగీసంగి మహానుభావుఁడు కృపాపారంగతుం డన్నదా

నాంగంబుల్ పలుసత్రిముల్ నిలిపె నే యాఢ్యుం డతం డొప్పు శ్రీ
రంగాప్రావభిధానుఁ డుత్తమకవిప్రిష్ఠాభిధేయాఖ్యుఁడై.

—• స్నా న ప్ర రే వు •—

సీ. పొడిబట్టలను విప్పి తడిబట్టలను గట్టి
పేరటాం డొ్రికవంక సొరు నింప
నీర్కావిదోవతుల్ నేర్పుమై నుదికెడి
వర్ణిసంఘమ్మొక్క వంకఁ జెలఁగ
"నా కిమ్ము రిక్తుఁడ నా కి" మ్మనుచు నీరు
కాసుబాపలును నొక్కఁటఁ జెలంగ
నాభరణాదుల నపహరింపఁగఁజూచు
పశ్యతోహరు లొక్కపక్కఁదనరఁ

తే. గీ. దీర్ఘములయందు రేవు లెంతే నెసంగుఁ
గనెడివారల కెంతయుఁ గనులపండు
వగుచు శ్రీయప్పరాయ వంశాబ్ధిచంద్రి
యఖిలకవిగేయ ! రామచంద్రాప్పరాయ !

—• ఆశీర్వచనం (శార్దూలవిక్రీడితం) •—

శ్రీరాజత్సుతరాజితో విజయతాం శ్రీరామచంద్రాప్పరా
ట్సద్దత్తై రపి వార్షికైః కవివరా గచ్ఛంతు మోదం భృశం
తద్దీవ్యత్సదసి ప్రవృత్త మిదమ ప్యాస్తాం వధానం చిరం
యే నాత్యంతముదం సుధీసముదయో యాతుంచబోభూయతే.

37 శోభకృత్సం॥ వైశాఖమాసము తోట్లవల్లూరు సంస్థానములో.

—• అ వ ధా న స్థ ల ము •—

క. బంగాళాతోఁటను ముద
ముంగొలుప శతావధానముం జేయించెన్
సంగతమగుగతిఁ గవు లు
ప్పొంగఁగ శ్రీభాష్యకారభూపతి బళిరే !

—• వల్లూరు గోపాలుఁడు •—

మ. వరముల్ భక్తులకెల్లవేళనిడు శ్రీవల్లూరి గోపాలకుం
డు రహిన్ బోర్పివుత బమ్మదేవరకులాధ్యున్ భాష్యకారాధిపున్
గరుణాసాగరు సర్వలోకహితుఁ జంగత్ప్రాభవోపేతు భా
స్వరవల్లూరిపురార్ధపాలకు యశస్సత్యప్రభాధామునన్.

—• పట్టాభిషేకమును గూర్చి •—

సీ. అన్నతోఁ బోరాడి యన్నికోరుటులును
దిరిగి తుదకు జయంపురహిఁ గాంచి
బహుసంపదలతోడ భద్రపీఠమ్మునఁ
దగుగతి శోభకృద్వత్సరమున
మాధవమాసాన మంత్రిపురోహితా
దులు గొల్వ మిగుల సంతోష మెసఁగ
బత్నియుఁ దానును బ్రజతోడఁ బట్టాభి
షిక్తుఁడై యెసఁగె సుశ్రీదలిర్ప
తే. గీ. ప్రజలకెల్లను గన్నులపండువయ్యెఁ
జూపరులకెల్ల మిక్కిలి చోద్యమయ్యెఁ
బండితులకెల్ల మనమునఁ బ్రమదమయ్యె
భాసురంబయ్యె వల్లూరిపట్టణంబు.

—• పట్టసవీరభద్రః (స్రగ్ధరా) •—

యోవా దక్షాధ్వరేఒభూ దతికుపితశివస్వేదధారాప్రభూతో
యోవై తూర్ణం చకార ప్రకుపితమనసా భాస్కరం భగ్నదంతం
యోవా దేవా నశేషా నకురుత వికలాన్ కాంచశీ కాంత్స పాయా
దక్షద్రో వీరభద్రో హుతవహతులితః పట్టసక్షేత్రపాలః.

38, శోభకృత్సం॥ జ్యేష్ఠమున నెలూరునం దష్టావధానములో.

—• హయగ్రీవః. (స్రగ్ధరా) •—

శ్రీమంతం సర్వవిద్యావిహరణవసతిం వాజివక్త్రం మహాంతం
విద్వద్భి ర్నమ్యమానం దురితవనహరం దుష్టరక్షోఒపహారం

త్వంగత్కారుణ్యపూర్ణం సకలభువనసంరక్షణే బద్ధదీక్షం
భక్త్యాబద్ధాంజలిస్సన్ శుభవిభవకృతే నౌమి లోకైకనాథం.

—• "ఆయాహి యాహి" యను శ్లోకమునకు తెలుఁగు •—

చ. జనకజ! రమ్మిటుల్ చనుము సాధ్వి నగస్త్యునిభామఁ జూచి, పై
వినుచుము రావణాదులను వేచినసంగతి నిర్భయమ్ముగా,
వననిధి గట్టు ముచ్చట రవంతయుఁ దెల్పకు, మాపె దాని ద్రిం
గిన మునినాథుభార్యసుమి, ముగ్ధరొ! నీకెఱుఁగంగఁ జెప్పితిన్.

—• నారికేళః, (రథోద్ధతగతిః) •—

కుజే ష్వతితరం ఫలాని దధతే
ఫలేతు జలమ ప్యలం ప్రసరతి
అనేకవిధయా కరో త్యుపకృతిం
తతో లసతు నారికేళపదపః.

—• ప ద్మి నీ ల క్ష ణ ము •—

క. తెలుపగు చీరలు గట్టున్
సలుపున్ బతిభక్తి మిగులసద్గుణగరిమన్
బొలుచున్ స్త్రీజనమునకున్
దిలకంబై యెందుఁ బద్మినీభామ భువిన్.

39. క్రోధి సం॥ పుష్యములో నూజివీడులో అష్టావధానములో.

—• జపాన్ రష్యాయుద్ధము, (రథోద్ధతావృత్తమ్) •—

వర్తతే ఖలు జపానుభూపతే
రష్యకావనిపతే రపి శ్రియై
సంయుగోఽయ మసమాన కక్షయా
వృద్ధి రద్యతు జపానుభూపతేః.

—• (సమస్య) ఆల్పాచమాన మరవిందముఖీ చకార •—

భర్త ర్యతీవ విటశేఖరతాం ప్రియాతే
తత్రైవ చిత్తమనఘం సతతంచకృత్వా

తస్మిన్కదాచి దళిగచ్ఛతి కోపభంగ్యాఽ
నల్పాచమాన మరవిందముఖీచకార.

—• లోలత్వ్రీ •—

చ. తన వయసెల్లఁ బోవుటయుఁ దద్దయు దస్సిన మేనిచాయకున్
గొనము ఘటింపనెంచి తనకుం గలసొమ్ములు లేనిసొమ్ములున్
బనిగొనితాల్చి ప్రాయమున భాసిలువారల మోహపెట్టఁగాఁ
గను, మదిఁ దృప్తిగాంచదు సుఖమ్మున లోలఁ ద్యజించు టొప్పగున్.

—• ప్రకృతసభ •—

శా. సారాచారులు పండితోత్తములు విశ్వస్తవ్యులౌ భూపులున్
ధీయుల్ పూరాణకలాప్రవీణులును వర్ధిష్ణుల్ సదుద్యోగులున్
శ్రీరంజిల్లఁగ నెల్లచోట్లఁ దగఁబొల్చెన్ నేఁటికచ్చేరి య
ప్పారావారగభీరుఁడైన మనయప్పారావు గారామునన్.

—• (సమస్య) వటబీజములంతలేసి వనిత కుచమ్ముల్ •—

క. చటులాక్షి వయసు ముమరవి
మటమట సీ కేల ? మధ్యమవయస్సుఁట, యో
విట ! కొబ్బరిబొండాల్గా
వఁట ! బీజములంతలేసె వనిత కుచమ్ముల్.

—• (సమస్య) సుధేఽసుధేఽవాఽరివధాత్సురాణాం •—

శ్లో. అయం హరిశ్చంద్రసుతః కలావాన్
మృతోఽభవ త్సర్పవిషాభిఘాతాత్
పున స్సజీవం విరచయ్య శ్రీఘ్రం
సుధేఽసుధేఽవాఽరివధాత్సురాణామ్.

40. పరాభవ సం॥ మాఘబహుళములో నూజివీడులోనే శ్రీవాన
మామల జియ్యంగారిసన్నిధిని జరగిన సంపూర్ణశతావధానమునఁగొన్ని.

—• ఆస్వామింగూర్చిన మంగళము •—

ఉ. "ఏమెయినొప్ప దేవుఁ,డెవ, రెచ్చటనుండు ?" నటంచు వేదవి
ద్గ్రామణు లెవ్వనిం దెలియఁగా గమకించుచు నెట్టిదేవుఁడే

యీమెయి నుద్భవిల్లెనని యెల్లరు నొప్పెడి వానమామలా
స్వామియె తోడు మాకు వెఱవన్ బనిలే దవధానపూర్తికిన్.

—• శ్రీ రామచంద్రప్పారావుగారు. (స్రగ్ధరా) •—

శ్రీమాన్ ధీమాన్ కలావాన్ గుణనికరనిధి స్సాధుసంతానశాలీ
దాతా నేతా వినీతో విబుధపదరజోభూషితాగారపూతః
రాజాఽనాదిప్రసిద్ధో వ్యపరిగతమహైశ్వర్యగర్వోఽనపాయో
దీర్ఘాయుః పుత్రపౌత్రై శ్చిర మవతు మహీం రామచంద్రాప్పరాయః.

—• స్వార్థపరత •—

చ. సుకృతము దుష్కృత మ్మనుచుఁ జూడఁగనీ దిసుమంతయేని, యె
ట్టికృతులు సేయుటందును గడింది మగంటిమిఁ జూపుచుండు, నిం
దకు జడియంగనీయదు సదా ధనతత్పరతాపిశాచి; దీ
నికిఁగల దుర్గుణంబులు గణింపఁగరావు బహూక్తులేటికిన్.

—• వరవరముని (వసంతతిలకమ్) •—

శ్రీవైష్ణవప్రవరసన్మతతత్త్వవేదీ
తోతాద్రినాథపదసారసచంచరీకః
జ్ఞానీ మహా న్మనిజనై రపి పూజ్యమాన
స్సోఽయం ముని ర్వరవర శ్శరణం మమాస్తు.

—• ఆలంకారికః (మత్తమయూరమ్) •—

తత్తద్వస్తూ న్యాత్మని బుధ్వా నిజబుధ్యా
చిత్రంమార్గం స్వాద్యరసానాం ప్రతిపన్నః
రమ్యం వ్యంగ్యం కల్పయమానః కవికృత్యే
కర్తుః ప్రజ్ఞాం ఘోషణిక స్సంవితనోతి.

—• విదేశవస్తుత్యాగము •—

చ. ఇతరులదేశమందలి మహీయములై తగు వస్తువుల్ త్యజిం
చి తనదు దేశమందుఁ దగు చిత్రపువస్తువులే కొనందగున్

గతి యగు దానిచేఁ గడుపుకాలెడి దేశపు బీదవారి కీ
గతి నొనరించినన్ మనకుఁ గైవసమౌఁగద లాఁతి ద్రివ్యముల్.

—• హంసపరమహంసశ్లేషః. (మౌక్తికమాలా) •—

శుద్ధతయా మానసపరిరోధా
ద్ధంససమానో భవతి హి హంసః
యద్వచనాని శ్రీవసి విహాయ
ప్రీతి మనంతాం సుద్య గపి భర్తే.

—• స్త్రీవిద్యా. (శార్దూలవిక్రీడితమ్) •—

విద్యాభ్యాసవశేన సీతి రుదయ త్యాచార ఉజ్జృంభతే
సాధ్వీనాం చరితై ర్మతిః ప్రియతతే తన్మార్గ మాలంబితుం
ఆపాయవ్యయయోః క్రమం విలిఖితుం శక్తాచ కాంతా భవే
త్తస్మాత్ స్త్రీషు కలా కదాపి నకరో త్యేవాపకారం బుధాః:

—• వ్యాసః. (వాతోర్మీ) •—

వ్యాసో మౌనీ నిగమానాం విభేత్తా
దాసీకాంతః కురువంశప్రతిష్ఠా
సూతౌఘానాం కవి రాసీ న్మహాత్మా
వృత్తంచిత్రం భజమానాహి సంతః.

—• వేదః. (శార్దూలవిక్రీడితమ్) •—

పూర్వార్థం పఠతాంతు కర్మనిచయే ష్వాసక్తి రుజ్జృంభతే
వాక్శుద్ధిం భజతే నివాసమయతే తేజోముఖే బ్రాహ్మణం
అర్థజ్ఞానవివేకశూన్యహృదయో ప్యాలంబతే యోగ్యతా
మన్యార్థం పఠతాంతు ముక్తివనితా వామాంక మారోహతి.

—• జ్యోతిషం. (ఆర్యా) •—

ఆకాశవర్తమానా
గ్రహాః ప్రమాణంహి యస్య శాస్త్రస్య

తచ్ఛాస్త్రరత్న మేత
న్నేత్రం లోకస్య కేవలాంధస్య.

—• తిరుపతివేంకటేశ్వరస్య ప్రకృతకవిభ్యాం శ్లేషః. (ప్రహర్షిణీ) •—

సేవేఽహం తిరుపతివేంకటేశ్వరం తం
బిభ్రాణో యద్గురు రభవ న్మహానుభావః
లక్ష్మీ ర్యత్ప్రియతరుణీ ప్రసిద్ధశీలా
నిత్యం య స్తిరుపతినాకృతానుషంగః.

—• సే వ క వృ త్తి •—

చ. మృతిగననెంచినన్ సమయమీయదు, సౌఖ్యముమా టటుండఁగాఁ
జతురిమ గల్గువాఁడయినఁ జాతురి లే దనిపింపఁజేయు స
మ్మతమగు వర్తనంబుగల మానిసికేనియు లోటు తెచ్చు మం
చితన మడంగఁజేయుఁగద! సేవకవృత్తి మరెట్టివారికిన్.

—• నూపురః, (స్రగ్ధరా) •—

రత్నైః ప్రత్నై ర్విచిత్రై రనుపమఘృణిభి ర్మండితైః ఖండితాన్యై
స్సంయుక్తః కాంతిశాలీ ఘలఘలితరవః కామినీపాదలంబీ
నాట్యాదౌ కింకిణీభి స్సమ మనుకరణం తద్ధ్వనే రాదధానో
వ్యాప్తానాం కామినీనాం ముద మపి వితర న్నూపురో భాతు లోకే.

—• స్వామికిరీటః, (శార్దూలవిక్రీడితమ్) •—

రత్నై ర్యాన్నతరై ర్విచిత్రగుణిభి ర్నానావిధై రంచితో
మౌళిస్థో జయతి స్వయం మణిమయ శ్శ్రీశేషశాయిప్రభోః
యత్కాంత్యా విజితో రవిః ఖపదవీ మాలంబతే లజ్జయా
యద్దీప్త్యాతు పలాయతేఽంధతమసం భక్తాంతరస్థాయినా.

—• మో టా ర్కా రు •—

మ. లలిఁ బాశ్చాత్త్యుల బుద్ధికల్మిఁ గడు హేలాగాములౌవారు మి
క్కిలిగాఁ దా ముపయోగముం బఱపఁగాఁ గీర్తింపఁగా నేది బై

స్కిలుకన్నన్ జన మెక్కు డెక్కఁదగుఫక్కిన్ రైలువేగంబు జా
డలతోఁ బోయెడి యంత్రిరాజ మది మోటార్కారు సామాన్యమే.

—• రంగనాథః (భుజంగప్రియాతమ్) •—

కవేరాత్మజా తీరవాసం మహాంతం
సదాపూజితం రావణ స్యానుజేన
నిరాధారభూతాణా జనాన్ పాలయంతం
ముదా రంగనాథం భజామోఽర్థసిద్ధ్యై.

—• రంగనాథః (మత్తకోకిలా) •—

రంగనాయక మాశ్రియే గుణరంగ మంగజసుందరం
మంగళాస్పద మంఘ్రిసంభవగంగ మద్భుతసంగరం
సంగహీనజనానుషంగధురంగతం చతురంగితం
సంగతం సతతం శ్రియా రుచిభృంగ మింగితవేదినం.

—• కీ చ క శ్లే ష •—

ఉ. పాచకుఁడైన భీముఁడు సెబాసని సజ్జనులెల్ల మెచ్చఁగాఁ
గీచకమట్లుగాఁ బ్రబలు కీచకుని న్వ్రిచెన్ దటాలునన్ ;
"నీచకృతుల్ పొనర్చు నవినీతుల కెల్లర కిట్టి శాస్తి సం
కోచము లేదు కల్గు నిదిగోఁ గనుఁగొం" డని తెల్పుకై వడిన్.

—• చెన్నపురి. (స్రగ్ధరా) ప్రతీపాలంకారః •—

చెన్నాఖ్యారాజధానీ విలసతి నితరాం సాగరస్యానుతీరం
రాకాచంద్రోపమాస్యై ర్గజగతిభి రలం కామినీనాం సమూహైః
ఆకాశాగ్రప్రచుంబిప్రవిమలవిలసత్సౌధరాజై ర్ధరాజైః
కాంతాదేహానుకారిప్రతతివితతిభి ర్భాసురోద్యానభాగైః.

—• గుఱ్ఱపుసవారు. (మత్తకోకిల) •—

కాలిదెక్కలతాఁకుచే పడిగాఁ బరాగము రేగఁగా
హేలగాఁ జను వారువమ్ములనెక్కి యింపుఘటింపఁగా

గాలితో సమమైన వైళము గాఁగ వేఁడుకతోడ వా
హ్యాళికేగెడివారిఁజూడఁగ హాళిపుట్టకమానునే.

—• నూజివీడుచెఱువు. (రథోద్ధతా) •—

శోణితస్యసదృశేన వారిణా
పర్వతోపమవిశాలసేతునా
నూజివీడునగరాంతికే సరో
రాజతే సకలజీవజీవనమ్.

—• కాంచీవరదరాజః (శార్దూలవిక్రీడితమ్) •—

కాంచీపట్టణవాసినం గుణఖనిం కందర్పరమ్యాకృతిమ్
నాభిష్ఠోరుమణిప్రభాకవచితస్వావాసదేవాలయమ్
వేధోయాగసమిద్ధసంస్కృతవపాగంధోజ్జ్వలోష్ఠం పెరుం
దేవీనాథ ముమాసతీపతినుతం దేవం శ్రియై సంశ్రయే.

—• హంససూర్యయోశ్శ్లేషః, (శిఖరిణీ) •—

సరోజైస్సంబంధం వ్రజతి భజతే సత్పథగతిం
సదాప్రీత్యాధత్తే కుసుమశరసూనుం తమనఘం
పదం రక్తం ధత్తే సుదృగుపకృతిం చాపి తనుతే
తతో హంసో నూనం భవతి ఖలు హంసో యతివిభో !

—• గ్రామోఫోను. (మందాక్రాంతా) •—

యేయే గానప్రకలితధియో యత్రకుత్రాపి గాతే
యాయా గాన ప్రకలితధియో యత్రకుత్రాపి గాతే
తేషాం తాసాం ధ్వనిముపగతో భేదలేశేన శూన్యం
గ్రామోఫోనూ రచయతి తమానందమే వాద్వితీయం.

—• రథః, (ఉపేంద్రవజ్రా, ఉల్లేఖాలంకారః) •—

పికా రసాలాగ ఇతి భ్రమంతి
మరా విమానభ్రమ మావహంతి

జనాస్సువర్ణాదిర్ రితిభర్రమంతి
రథోత్సవే దేవరథం విలోక్య.

—॰ రాజుల యవ్యవస్థ ,—

సీ. ఆయ మ్మదెంతయో వ్యయ మెంతయో ఋణ
మెంతయో సుంతేని యెఱుఁగలేరు
పాత్రు లెవ్వారొ యపాత్రు లెవ్వరొ వితీ
ర్ణికిఁగా నొకింత గుర్తింపలేరు
యోగ్యు లెవ్వారొ యయోగ్యు లెవ్వారొ ర
వంతేని యానవాల్పట్టలేరు
కష్ట మెట్టిదియో సుఖమ్మన నెట్టిదో
యాత్మ నొక్కింత తా మరయలేరు

తే. గీ. ఒరులఁ బోషించుకొఱకుఁ గా కుండవలెనె
భాగ్య మిది యంతయును స్వానుభవముకొఱకె
యనుచుఁ దెలియంగ నేర రయ్యయ్యొ! కొంత
మందిరాజులు వారి నేమనఁగవచ్చు?

—॰ సులోచనము. (ఉత్సాహ) ॰—

ముసలితనముచేత నేత్రములకుఁ దెరలుగప్పినన్
పసిగఁ గన్పడంగఁ గాచసంస్కృతమగు యంత్రమున్
బొసఁగఁదాల్చి దానికల్మిఁ బొత్తముల్ పఠింతు రిం
పెసఁగ నవసరంబు గల్గ వృద్ధపండితౌఘముల్.

—॰ విశిష్టాద్వైతసిద్ధాంతః. (మందాక్రాంతా) ॰—

భక్తిర్ముఖ్యా నిగమవిహితే కర్మజాలే నిరాస్థా
సర్వత్ర శ్రీహరిపదసరోజాతబద్ధా ప్రపత్తిః
స్వప్నస్సత్యః స్సగుణవిషయా బుద్ధి రర్చా సమగ్రా
లోకే రామానుజమత మిదం సర్వత స్సుప్రసిద్ధం.

—• అద్వైతం. (ఉపజాతిః) •—

మృషాప్రపంచ స్స్వయమేవ చాత్మా
సమస్తవస్తు ష్వపి చాత్మనైక్యం
వదంతి యచ్ఛంకరపాదగుప్తా
స్సమగ్ర మద్వైత మిదం యతీంద్రాః.

—• మంత్రిలయవ్యక్తత •—

సీ. యశ మెట్టిదో యపయశమన నెట్టిదో
యించుకేనియులోన నెఱుఁగలేరు
కార్య మెట్టిదియో యకార్యం బదెట్టిదో
యర్థప్రసక్తిచే నరయలేరు
ద్రోహ మెట్టిదియొ యద్రోహం బదెట్టిదో
కార్యప్రసక్తిచేఁ గాంచలేరు
ఉచిత మెట్టిదియో యనుచితం బదెట్టిదో
యైశ్వర్యమదముచే నరయలేరు
తే. గీ. కల్లకృత్యమ్ములను బన్ని కాసుకొఱకు
గుల్లసేతురు రాజుల కోఁటలెల్ల ;
వారి నననేల, యట్టి దివానులకును
జన వొసఁగుచున్న రాజుల ననఁగవలయు.

—• ఆర్బతునాటుక్షౌరము •—

సీ. ఉద్యోగములుచేసి యూళ్ళనెల్లనుదోచి
యార్జించినట్టి ద్రవ్యంబుకొంత
భూములన్నిఁటి నమ్మి పొలఁతుల నగలమ్మి
సమకూర్చినట్టి విత్తమదికొంత
వ్యవసాయములుచేసి వర్తకమ్ములొనర్చి
కైకొన్నయట్టి రొక్కమ్ముకొంత
పిల్లికైనను భిక్ష పెట్ట కార్జించిన
వసుమతీశ్వరుల ద్రవ్యంబుకొంత

తే. గీ. దేశదేశమ్ములకుఁబోయి తిరిపమెత్తి
యార్జనముచేసికొన్న ద్రవ్యమ్ముకొంత
'ఆరుబతునాటు' హరియించెనౌర ! వీరి
క్షౌరమున కీడువచ్చెడి క్షౌర మున్నె !

—• గర్వముగలవాఁడు గాడిద, (మత్తకోకిల) •—

మానవుం డెవఁడేనియుం దనమానసమ్మున గర్వమున్
బూనినం దన కెంతతెల్వియుఁ బొల్పు గెల్పును గల్గినం
గాని వానిని గాడ్దెయం చనఁగావలె న్మదిఁగొంక కే
వానికైనను గర్వమన్నది వంచనన్ ఘటియింపదే.

—• ద్రౌపదీకృష్ణానద్యోశ్శ్లేషః, (మణిమాలా) •—

సద్వర్తనశీలాం సాధ్వీ మమలాంగీం
నీరేరుహవక్త్రాం హంసేంద్రగతిం తాం
కోకస్తనభారాం కూర్మప్రపదాం శ్రీ
కృష్ణాం కమలాభాం మనుతే కిల కృష్ణా.

—• ద్వైతమతము. (మత్తకోకిల) •—

జీవుఁడున్ మఱి యాత్మయున్ వెసఁజేరుటన్న హుళిక్కి యా
దేవుఁ డుండెడిచోటికిన్ దమదేహమే చను దివ్యమె
యీ వసుంధర యెల్ల నిత్య మనేకు లుందురు జీవు లీ
త్రోవ ద్వైతమతమ్మనం గలతోవ పండితమాన్యమున్.

—• వి దూ ష కః (స్రగ్ధరా) •—

స్రగ్ధారీ దండధారీ వివిధవసనయుక్పోళధారీ వికారీ
సంచారీ హాస్యకారీ కుటిలతరవచో భాష్యకారానుకారీ
దూరీభూతోచితోక్తి ర్వినయపిరహితో నామధారి ద్విజాతీ
రాజ్ఞా మత్యంతమిత్రం రహసి విజయతే దూషకోయం విపూర్వః.

—• రా జ ద్రో హ ము •—

చ. క్రమముగ నాఁడునాఁటికిని గవ్వకునేనియుఁ జేయి సాచు, రా
జ్యమునకు హానిఁజేయుఁ, గడునద్భుతగోప్యకృతుల్ పొనర్చు, ను

త్తములకు భారమౌc, దుడకుc దాc జెడిపోవును, దిన్నయింటివా
సములను లెక్కపెట్టు నృపసత్తమవంచకుc డెందు మన్ననే:

—• రాజభక్తిః, (పంచచామరః) •—

నృపస్య సత్కృపావశా దభూ న్మమాస్య జీవనం
తతోఽస్య సేవనం సదా కరోమి జీవనావధి
ఇతిస్మ యస్తనోతి చింతనం సదా సదాత్మకం
స ఏవ రాజభక్తిమా న్పరం నతస్య నశ్యతి.

—• స్వదేశాభిమానము •—

శా. సొమ్మున్ వమ్మొనరింపcబోకుc డిటు గచ్చున్ విచ్చcగా నేయువ
స్త్రమ్ముల్ గట్టుc డిc కన్యవస్త్రములc గోరంబోకుc డో యార్యులీ
సమ్మానంబును జూపిరేని మనదేశస్థుల్ సుఖంబొందువా
రిమ్మార్గమ్ము పరిత్యజింప కెటులే నీదేశముం బ్రోవరే.

—• వర్షాకాలః, (మందాక్రాంతా) •—

మేఘా విద్యుత్కనకరుచిభి ర్భాసమానా అభూవన్
వర్షాకాలో విలసతి తరాం నీరగర్జన్నదీకః
సర్వే పూర్ణా గిరిఝరవశా దాతటాంతం తటాకా
జాయాపత్యో స్సమజని సుఖం నంతతాశ్లేషజన్మ.

—• దారిద్ర్యమే మంచిది యనుట •—

మ. పరమేదో యిహమేదొ మాన్యులెవరో ప్రఖ్యాతినా నెట్టిదో
యెఱుcగన్వచ్చును, భక్తి హెచ్చు హరిపై, నింతిం తనన్ రానిదై
కర మబ్బుం దయ, హింసయన్న వెఱవంగాcజేయు దారిద్ర్యమే
వర మౌరౌర: సమస్తసద్గుణములం బ్రాపింపcగాc జేయుటన్.

—• జడ వెనుకనుండుటకుc గారణము, (మాలిని) •—

పఱవురు గనరంచున్ భామకుజా వెన్కcగూడన్
గలుగును సిరి యంచున్ గంటక మ్ముండదంచున్

గలికిచెయిదుబందున్ నాట్యముం జేతునంచున్
దలcచి నిలిచె నౌరా ! తన్వికిన్ వేఱి పెన్పున్.

—• సభా. (ఇంద్రవజ్రా) •—

విద్వత్ప్రకాండై ర్విపులాధినాథై
ర్విజ్ఞైర్ యతీంద్రై శ్చిరకీర్తికామైః
సభా విభాతి శ్రియ మాదధానా
పరా చతుర్వర్ణవిరాజమానా.

—• కామినీగర్హణం. (మందాక్రాంతా) •—

సంసారస్య ప్రబలకలుషాపారకూపస్య హేతు
ర్మోహాంధస్య ప్రచలితధియః కామిలోకస్య మృత్యుః
జన్మాగారం ప్రతిపద మసత్యోక్తివాచాలతాయాః
కంఠేపాశః పురుషవితతేః కామినీ కేన సృష్టా.

—• చె ద పు రుc గు •—

శా. శ్రీమత్తం బగునట్టి గేహమునకున్ జేటొప్పటు వాటించు నెం
తే మేలై తగునట్టి పుస్తకముల న్నిర్భిన్నముల్ సేయు న
త్యామోదం బొడcగూర్చు వస్తువుల నత్యల్పంపుc గాలంబులో
నే మాపున్ గద ! వమ్రి యన్ పురు వజుం డేలాగు సృష్టించెనో !

—• వేణుగోపాలుcడు (అచ్చతెలుcగు) •—

ఆ. వె. ప్రేవెలందు లెపుడు వేవేలుగొలువంగc
బిల్లగ్రోవి నల్లనల్లనూcదు
కొనుచు వేడ్కమీఱcగను నాటలాడెడి
గొల్లపిల్లవానిc గొల్తు మేము.

—• సంస్కృతభాషోపయోగః. (పృథ్వీ) •—

చతుర్నిగమసంగతా న్యఖిలధర్మమర్మాణి చ
ప్రకర్తు మనఘాం ధియం దిశతి తత్తదర్థోపయాత్

సుపర్వజనభారతీ సకలధర్మసంబోధినీ
న కస్య ముద మాతనో త్యఖిలవేదవేదాంగభూః.

—• రాజనీతి. (వసంతతిలక) •—

దీనాంధపంగుషు దయాం కలయేత రాజ్యే
వృద్ధిర్నయేత కరమార్యనుతం నిరాశః
విద్వత్కవీంద్రకృత సత్కృతిరత్నజాల
మంగీకరోతు నృపతి ర్యది కీర్తి మిచ్ఛేత్.

—• సేతుబంధనం. (శాలినీ) •—

తం పౌలస్త్యం హంతుకామ స్స రామ
స్సేతుం చక్రే సాగర స్యాంతరాళే
తద్ద్వారాదారాపహర్తార మేనం
హత్వాఽయోధ్యాం ప్రాపభూయోపి కీర్త్యైః.

—• ద్రౌపదీ వస్త్రాపహరణమ్. (స్రగ్ధరా) •—

పాంచాలీ మేకవేణీం సదసి నరపశు ర్వస్త్ర ఆకృష్య మూర్ఖో
దౌష్ట్యం ః క్రే తత స్సా "హర మురహర మే వ్యాపదం దీనబంధో"
ఏవం చక్రే నుతిం శ్రీహరి రపి కరుణాసాగర స్తత్క్షణేన
క్షౌమా న్యన్యాని దత్వా పునరపి చ పునా రక్షితాం తా మకార్షీత్.

—• శ్రీవానమామలస్వామీ. (విద్యున్మాలా) •—

స్వామీ శ్రీమాన్ జియ్యర్నాథో
జీయా త్సాయా త్సౌఖ్యం దేయాత్
వానాద్రీట్పాదాబ్జాసక్తో
గేయ శ్శిష్యై రన్యై ర్మాన్యైః.

— శ్రీవానమామలాష్టావధానము •—

ఇంద్రేణసహ ప్రకృత యతీంద్రస్య సామ్యమ్ (శార్దూలవృత్తమ్)

సర్వై స్సేవ్యతమో బుధై స్సమధిక శ్రీదృక్సహస్రాంచితో
రాజా దివ్యనదీసరోభవశతై స్సంపూజిత శ్రీపతిః

దీవ్యద్దివ్యసుదృగ్గణై స్సతత మప్యామోదితాభ్యంతర
స్సోయం గోపురనాయకో విజయతాం రామానుజార్యో యతిః.

—• చంద్రుని మణితోఁ బోల్చుట. (మందాక్రాంతా) •—

మందాక్రాంత స్ఫురపతి దిశా పర్వతస్యాగ్రభాగం
దేశం దేశం సరసకిరణచ్ఛాయ శుభ్రం వితన్వన్
నీరేజాక్షీ ప్రియజనసమాయోగ సంధానచేట
శ్చంద్రో భాతి క్లమహరకరో వ్యోమపేటీమణిస్సన్.

—• హరిశ్చంద్రేణసహ శ్రీ రామచంద్రప్పరాయస్య సామ్యమ్. (స్రగ్ధరా) •—

విశ్వామిత్రాయ దత్వా సకలమపిధనం సత్యవాక్య ప్రతిజ్ఞాం
నానాకష్టానుభూతిం దధదపి భువి యః పాలయామాస రాజా
స్సోయంరాజా గుణాఢ్యో భవతు బత హరిశ్చంద్రభూపాలవర్యో
యత్కించి త్కృష్టతూన్యం పరిచరతిబుతం రామచంద్రప్పరాయః.

41. ప్లవంగ సం॥మార్గశిరములో బెజవాడలో శతావధానములలో.

—• ప్రకృతపండితుల స్థితి. (మాలిని) •—

నృపతిజనసమూహే రాజ్యహీనే కవీంద్రా
విమలతర యశస్కాః పండితా శ్శాస్త్రవిత్తాః
భృతకథనవశేన ప్రాప్తకుక్షిప్రచారాః
కథమపి నగరేషు ప్రాయశః పర్యటంతి.

—• వసంత ఋతువు •—

శా. కూయన్ జొచ్చెను గోకిలప్రతతి కూకూరావమొప్పన్ జగ
ద్గేయంబై తగు పల్లవప్రతతిచే దీప్తమ్ములయ్యెం దరుల్
మేయన్ జొచ్చెఁ జకోరదంపతులు మేల్మిన్ వెన్నెలల్, మారుఁడున్
డాయన్ జొచ్చెను ఖాంథభామినుల నాడంబంబుతో నామనిన్.

—• కోవెలమూడి రామయ్యగా రప్పు డున్నరీతి •—

సీ. చలువఁ జేసినయట్టి వలువ మూపుననుండి
పక్షమ్ములపై జీఁకవాఱుచుండ

నాజానులంబంబులైన కరమ్ములు
కోటుజేబులలోనఁ గొమరుమిగుల
నాకాశమునకునై యభిముఖంబగు నాన
నంబు దా నాలోచనంబు దెలుప
నంతగా నాభరణాడంబరము లేమి
నెగడు నిగర్వంబు నీటు దెలుపఁ
తే. గీ. గవులు నుతియింపఁదగిన లక్షణములొప్ప
నేఁటిసభ నెంతయేనియు నీటు మెఱసె
నలరు కోవెలమూడి వంశామ్రమునకుఁ
గోవెలయొనాఁగ రామయ కుతుకమలర.

—• ప్రకృతహిందూదేశస్థితి •—

ఉ. భూపతులందు రాజ్యమున బొత్తిగ భక్తి నశింపఁజొచ్చె లో
లోపల రాజులెల్లరకు లోచన యెక్కువ కాఁదొడంగె "లో
కాపకృతుల్ పొనర్పఁదగునట్టిరు హూణు" లటంచు నెల్లచో
వ్యాపకమయ్యె నీపయిని వచ్చెడి చిత్రము లెట్టివోగదా.

—• కనకదుర్గ •—

మ. ఘనమైయొప్పెడి యింద్రకీలమున వేడ్కల్ మీఱఁగాఁ గాఁపురం
బును జేయన్ దొరఁకొన్న దేవి చరణాంభోజాతమత్తద్విరే
ఫనికాయాయిత సర్వదేవనిచయప్రస్తుత్యచారిత్ర చ
క్కనిమాయమ్మ కృపాబ్ధి యో కనకదుర్గా! మమ్ము రక్షింపుమా.

—• సువర్ణముఖి, కాళహస్తీశ్వరుఁడు • —

సీ. ఏనదీజలము నొక్కింతేని గ్రోలినఁ
బతితులెల్లరును బావనతగాంత్రు
ఏదేవుపాదంబు లెంతేని సేవించి
తిన్నండు భక్తిసందీప్తుఁడయ్యె
నేనదీ స్నానంబు నెనసి భోగపుఁగన్నె
లిరువురు ముక్తికిఁ దెఱవలైరి

ఏదేవుమహిమంబు నెఱిఁగి తా వ్యాళంబు
మునులు గాంచఁగలేని మోదమందె
తే. గీ. అట్టి నది, యట్టి దేవుఁడు, నట్టి దేవి,
యట్టి పట్టణమును భువియందె కాదు
స్వర్గపాతాళములనేని దుర్గమంబు
కావుననె దాని "దక్షిణకాశి" యందుౕ.

—• సూ ర్యో ద య ము •—

సీ. వృక్షపంక్తులమీఁద విరివిగాఁవగు నవ
శ్యాయమెల్లను రూపుమాయుచుండఁ
జెట్లమీఁదను గూళ్ళజీబులోనుండు కా
కములు కాకారవక్రమము దెలుప
సచ్ఛాత్రులగుచు ద్విజపరికాండమ్ములు
స్నానార్థమై సరస్తటులుచేర
నభిశారికాంగన లటునిటు పంచబం
గాళమై తమ యిండ్లకడకుఁ జేరఁ
తే. గీ. గలఁగి తేరెడు నీరంబువలెనె కటికి
చీఁకటులు విచ్చిపోవఁగఁ జేరుచుండెఁ
బ్రాగ్దిశాభామినీఫాలభాగమందు
నలరు బొట్టన రవి యుదయాద్రికడకు.

—• న ల్లి •—

క. ఉల్లాస మెంత కల్గిన
నల్లీ! నీ వున్నయెడల నయనకు నిద్రా
భ్యుల్లసనం బది సున్నయె
తల్లిగలుగు వేళ్యఁదగులు తరుణు సుఖగతిన్.

—• గు లా బి •—

చ. పలుచనిరేకులున్ సొబగు పాల్పడు నాకృతియున్ బరీమళం
బొలసెడి రీతియున్ సకలమున్నది నీకొక లోపమున్నదే!

లలితగులాబిపుష్పమ! విలాసమునెల్లను డిందఁజేయు ముం
డులు భవదీయమౌలతఁ గడున్ వికృతిన్ గలిగింపకుండినన్.

—• (సమస్య) కవిగాంచునె పగఁటియందుఁ గవికులతిలకా •—

క. అవిశేషంబగుగతి జం
తువులు దివారాత్రములు గనుంగొననేర్చున్
రవియనిన నడలు నల ఘూ
కవిగాంచునె పగఁటియందుఁ గవికులతిలకా.

—• (సమస్య) అంగములేనివాఁడు తనయాలినిగూడి సుఖించె నెట్లనో •—

ఉ. "భంగమువచ్చె నో హర! కృపాకర! మత్పతి దోషికాఁడు పే
ర్మిం గరుణింపవే నుపశమింపదు నా పరితాప" మన్మనో
జాంగనకై హరుండు కరుణాకరుఁడై వరమిచ్చె మీఁద న
య్యంగములేనివాఁడు తనయాలిని గూడి సుఖించె నెట్లనో.

42. ప్లవంగ సం॥ పుష్యములో చెన్నపట్టణమున ప్రొఫెసరు రంగాచార్యులు, ఆర్. కృష్ణమాచార్యులవారింగురించి ఆశుగాఁ జెప్పినవి.

శ్లో. విద్వత్తైవ సుదుర్లభా యది భవేత్తే నిస్స్వతాదూషితా
స్తాదృశా అపి గర్వపర్వత శిరస్సంచారి పంచాననాః
కింతేషాం ధనసంచయేన భవతాం సర్వంచ సంపన్న మ
ప్యేకోవాపి నదోష ఇత్యహమహో రంగార్యరంఘేముదం.

శ్లో. గైర్వాణ్యా అపి గౌరవం కవివరై రేవంపురా సంచితం
భోహాణా అపితత్కలాకలనత స్సంప్రాప్తగర్వా బుధాః
హౌణ్యా ఏవ విశేషగౌరవమితి వ్యర్థామతి స్త్యజ్యతా
మిత్యేవం ప్రథయత్యయం ద్వితయవి చ్ఛ్రీకృష్ణమార్యాగ్రణీః.

శ్లో. అభ్యస్తా భవతా సితాననకలా గీర్వాణభాషా తత
శ్చాబ్దంశాస్త్ర మధాన్య దేత దితరై రాలంబితుం శక్యతే
శాంతి ర్జ్ఞానకలార్జనంకిల పరశ్రేయస్సహత్వం కథం
లబ్ధంకృష్ణసుధీమణే నఖలు తన్నామ్నః ఫలం శ్రీహరేః.

43. ప్లవంగ సం॥ పుష్య బ ౧౪ శుక్రవారం రాజమండ్రి కాలేజిలో జరగిన యష్టావధానములోఁ గొన్ని.

— సభ —

చ. పలువురు పండితోత్తములు పావనకీర్తులు సుప్రసిద్ధు లు
జ్జ్వల మతులైన టీచరులు సజ్జనులైన తదన్యులున్ దగన్
నలుగడలన్ జెలంగఁగ ఘనంబగు రాజమహేంద్రిపట్టణ
స్థలవిలసత్కలాలయము తద్దయునొప్పె సభావిభాసియై.

— వందేమాతరమునకు సంబంధించిన ప్రసిద్ధుల —

శా. శ్రీమంతుండగు పాలునున్ దిలకు వాసిన్దొల్పురాయంచు స
ద్దామంబౌ తమదేశ దుస్థితికిఁ జింతంబొంది దేశంబు తా
నేమాడ్కిన్ దెలివొంది కష్టముల కొక్కింతేని సందీక సు
క్షేమంబందునొ యట్టిసద్విభుల లోఁ జింతింతు రశ్రాంతమున్.

— (సమస్య) మందారముఁ జూడనెంతురె ఘనంబగునట్టి గులాబిముందరన్ —

ఉ. ధీరతగల్గి చక్కనగు తెల్వియుఁ దేటయుఁబొల్చి మేల్మి బం
గారము రీతిగాఁ గవిత కల్పనచేసెడివార లుండ శు
ష్కోరుతరోక్తులన్ గొనఁగ నొప్పుదురే సుకవీంద్రులెందు మం
దారముఁ జూడనెంతురె ఘనంబగునట్టి గులాబిముందరన్.

44. 1910 సం॥ బందరు హిందూస్కూలులో సంపూర్ణశతావధానం.

సభారంభమందుఁ జెప్పినవి.

ఉ. ధారణ నిల్చునా! నిలువదా! యనుసందియ మొందు దక్క గా
ధారచనావిశేషమున ధార కొకింతయు లోటు లేదు భూ
ధారిణిస్త్రీవిదూషకవిదారిణి యస్మదుపాస్య యమ్మహో
దారచరిత్రి యియ్యెడలఁ దా రచియింపకపోదు సాయమున్. వెం॥ శా॥

ఉ. ప్రాయంబెంతయొ కొంతయేగె నిఁకఁ జత్వారింశదబ్దంబు రా
నాయెన్ విస్మృతి మెండుగాఁ దొడఁగె విద్యాపక్షపాతంబునన్
బాయన్లేక శతావధాన మొనరింపం బూనినా మమ్మరో!
హేయంబైన సభాపరాభవము రానీకమ్మ, కాత్యాయనీ! తి॥ శా॥

—• శంభుసటనం—గంగాలహరీబాలాతపసంగమవర్ణనమ్ •—

హిమాగనికటా దతిరయా దనుగతః కిల సురాంబువిసరో భువి తదా
మహేంద్రదిశి భాస్కరరుచిర్నవనవా ప్యనుగతారుణతమా ఖలు ముదా
తతః ప్రతిఫలత్సరసిజాన్తరు గపారపరమాం రుచిమగా దపిపురః
కవీశ్వరచయేన నుతి మీడితతరా మగమదేవహి తదంబువిసరః.

—• స ము ద్ర ము •—

సీ. ప్రళయకాలానల జ్వాలచేఁగ్రాగిన
యంబుజాలంబు ఫేనంబుడంబు
తటమందుఁ దటతటాత్కారంబుగా రొద
గావించు పెనుతరంగములగములు
ఒకటిపైకొకటి కొంకక మీఁదఁబడి పైకి
గవయు నీరస్థజంతువులతతులు
కమనీయవిద్రుమకాంతిచే దెసలెల్ల
భ్రాజింపఁగాఁజాలు భవ్యరుచులు
గీ. గలిగి చెలువారు సంద్రంబు గాంచియొక్క
యాటవికరాజు "ఔఱువు మేలైన దైన
పీర మిందునఁ బెట్టిరి శౌరమెందు
కతననో" యంచు వగఁజెందఁ గాఁదొడంగె.

—• (సమస్య) సంయమివరుఁడూఁగుచుండె సంసారమునన్ •—

క. "కింయాతి చోర్ధ్వలోకమ
యం యోగీ మేన కాన్వితోఽఖూ" త్తని వా
చంయములు గుంద గాధిజ
సంయమివరుఁ డూఁగుచుండె సంసారమునన్.

—• దండకప్రభేదః—రామస్తోత్రమ్ •—

సులలితజలదంపునర్భాస్వరాభీ రుచిర్భిస్సదాగ్రహేపయ న్నిర్వికంకన్నృపః
కనకరుచివిభాసురాం మైథిలీంరంజయన్భూషయన్మౌనిలోకంసదారాఘవః

రజితగిరి మహార బాహో బలప్రాభవే నోత్పాటాఽగజానాయకంఠాశయ
న్నకృతసుతపఃఈద్వృశంతద్రిహో॥ పౌరుషంసంస్తువన్ యోపురోహాసనం
లంఘతే.

—• ముసలియెద్దును గటికివానికి అమ్ముట •—

సీ. అవసరంబగునప్పు వ్యవసాయ మొనరింప
నతితి కాయలు గాయునట్లు దున్ని
వీఁపుపై నింతింత పెద్దకాయలు గాయ
మోపైన గోనెలు మోసి మోసి
బాడి గెక్కువటంచుఁ బదిమంది నెక్కించి
పరువువెత్తింపఁగా బండి లాగి
తోఁటలోపలఁ జెట్లతోపులఁ బాదుల
ముంచు నట్లుగ నీళ్లమోట లాగి
గీ. కాలవశమునఁ బనిసేయఁజాలకున్న
ముసలియెద్దును గటగటా! మోటురైతు
కటికివానికి నొకని కక్కటిక లేక
విక్రయించెను దుష్టనీతిక్రముండు.

—• లక్ష్మీపార్వతుల యన్యోన్యపరిహాసవచనములు •—

సీ. గంగాధరుఁడు నీమగం డని నవ్వంగ
వేషధరుండు నీపెన్మి టనియె
నెద్దునెక్కును నీదు నెమ్మొకాఁ డనినవ్వ
గ్రద్ద నెక్కును నీమగం డటనియె
వల్లకా డిల్లు నీవల్లభున కనంగ
నడిసంద్రి మిల్లు నీనాథున కనె
నాట్యంబు నేయు నీ నాయకుండన నంగఁ
గావించు వెన్క నీ కాంతుఁ డనియె
గీ. ముష్టి కెక్కడికేగె నీ యిష్టుఁడనిన
బలిమఖంబున కేగె నో లలన! యనియె

నిట్టు లన్యోన్యమర్మంబు లెంచుకొనెడు
పర్వతాంభోధికన్యలఁ బ్రస్తుతింతు.

—• తిరుపతివేంకటేశ్వరుల సఖ్యంబు •—

శా. నీరక్షీరములట్టు లెల్లపుడు నీనేస్తంబు గైకొంటి మ
కూరంబైన మనంబుతో నిదియ మాకుం దెచ్చెఁగీర్త్యాదికం
బేరే నైత్రిని గూర్చి చెప్పుకొనుచో దృష్టాంతమౌఁగాక పెం
పారం దిర్పతివేంకటేశ్వరులసఖ్యం బెల్లకాలంబునన్.

—• శివకేశవస్తవము, (అచ్చతెలుఁగు) •—

సీ. తాల్చెనెవ్వాఁడు కెందమ్మిదండంబోలె
నెదుతొమ్మపై సిరు లిచ్చుచాన
మ్రింగెనెవ్వాఁడు నేరెడిపండుచందానఁ
గడలిలోఁ బుట్టిన కాఱువిసము
పూనె నెవ్వఁడు వెన్న ముద్ద కుద్దిగఁ గేలఁ
దెల్లసంచులనించు నల్లసంకు
ఆనె నెవ్వఁడు మల్లెయలరుగుత్తులపేరు
పోల్కిగా మెడనిండఁ బున్కదండ

గీ. వేవెలుంగుల దొరయును రేవెలుంగు
నెవనికన్నులు నిప్పుగ న్నెవనికెక్కు
డట్టిమున్నిటియల్లుఁడు, నట్టిమంచు
కొండయల్లుండు మీకుఁ గోర్కులనొసంగు.

—• సూర్యోదయకాలమున నెమలి నాట్యము •—

చ. గగనమునందుఁ గార్మొగులు కప్పిన చందముఁజూచి సమ్మదం
బగుగతిఁ బించియంబు విడున ట్లమరించి నటించు బర్హిపిం
ఛగతదివాకరప్రభల చందము కన్గవకింపుఁ జేనె సూ
రిగణములెన్న నభ్రికపురేకులలోపల దీపమట్లుగన్.

—• శార్దూలవృత్తమ్ – ప్రహ్లాదస్య ప్రవర్తనమ్ •—

ప్రహ్లాదః కమనీయవైష్ణవకథాకల్లోలలీలానదీ
నాథోత్తుంగతరంగరింగణనిమగ్నాత్మా మహోత్మాదరః
మానామస్మర దైత్యవైరిణ ఇతి ప్రోక్తోఽపి రక్షఃపతే
ర్బాధా మాప పితు ర్నతు ప్రతిపదం తత్యాజ నారాయణం.

—• స్రగ్ధరావృత్తం – భారవికవిత్వశైలీ •—

అర్థప్రాధాన్యరీతి స్సకలకవినుతా భావసందర్భశైలీ
ప్రోద్యచ్ఛ్రీ నారికేళప్రతిభటకలనాకల్పనాసక్తవృత్తిః
శ్లేషప్రాగల్భ్యలీలా యమకపరిచితి ర్బంధసంబంధభావ
స్సర్వాలంకారధారా విలసతి కవనే భారవే స్సర్వపూజ్యే.

—• శార్దూలవృత్తమ్ – బందరుకైలుతాభః •—

నౌకామత్కుణబాధయా హృది సదా జాజ్వల్య మానక్షుధా
నిద్రాం లబ్ధు మశక్నువ న్ననుదకాం కుల్యాం సదా నిందయన్
రాత్రి ద్వేఅపి పర్యుపోష్యచ యయౌ వృద్ధైస్సమంబాలకై
ర్యోషైః సోద్యఽసుఖేన ధూమశకటే నాయాతి బందర్పురం.

—• మత్తేభవృత్తమ్ – బ్రహ్మచర్యమ్ •—

వేదాదిభి స్సకలవిద్యాభి రాత్తగురుబోధో జితేంద్రియచయ
శ్శ్రద్ధాయుతో గురుషు బద్ధాదరోఽపిచ నిషిద్ధక్రియానభిగతిః
రాజాధిరాజనుతతేజా విభూతియుతఫాలోఽపి పుస్తకగణ
వ్యాలోల ఏష గురుశీలశ్చ వర్ణిజనమౌళి శ్శుభాయ భవతాత్.

—• సత్రాధికారిపాట్లు •—

శా. "ము న్నెవ్వారలొ సత్రముల్ నిలుపఁగా భూదేవతాకోటికిం
బున్నెం బబ్బు నటంచుఁ; జీటి నిడఁగాఁ బోవేమి సీయబ్బ సొ
మ్మెన్నండేని నొకింతయే నిడితివా ! యిం" దంచు సత్రాధికా
రి న్నిందింతురు సత్రభుక్కులు క్షుధార్తిన్ భూర్తమర్యాదులై.

—• (సమస్య) నాసాపుటేహసతి కోపిపిశాచవీరః •—

ఘోరేవనే నిరతదృష్టమృగాళికీర్ణే
పాంథం సరంత మతిభీతిసమాకులం తం
దృష్ట్వా పిశాచవనితా ప్రజఘానకాఽపి
నాసాపుటేహసతికోపిపిశాచవీరః.

—• (సమస్య) "సూర్యుఁడుదయ శిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెన్" •—

(కందములోఁ దప్ప నేపద్యములోనైనఁ బూర్తి చేయవలెను.)

తే. గీ. గ్రహణదినమైనకతమునఁ గబళనంబు
సలిపె రాహువొ కేతువో గిలితుఁ డయ్యుఁ
గార్యభరమున నట్టులే "సూర్యుఁడుదయ
శిఖరి నెక్కెఁ జుక్కలు వొడిచెన్" దళముగ.

—• (సమస్య) అమవస నిందుండు తోఁచె నద్దమరేయిన్ •—

క. కమలాక్షిఁ డొక్కగోపిక
"యమవస" యని జంక, నద్దమం దచ్చెలి ఫా
లముఁజూపి యనియెఁ "గను మెటు
లమవస నిందుండు తోఁచె నద్దమరేయిన్".

—• శరద్రాత్రౌ సరసి ప్రతిబింబితశ్చంద్రః (పృథ్వీ) •—

సరోవరజలేఽమలే ప్రతిఫలీభవచ్చంద్రమః
కలారుణతరేఽంతరే వరుణదేవతాను ప్తయే
జపాకుసుమ గుంఫితాం మృదులకుందమాలామయీం
చకార శయనస్థలీ మితి మతిస్తు సంజాయతే.

—• అన్యతరస్యకవేర్విచారః (మేఘవిస్ఫూర్జితమ్) •—

కవీ ద్వౌ విద్యేతే మృతి మనుగత స్తత్ర చైకస్తు దైవా
త్తతోఽన్య శ్శ్లోకార్తః ప్రకృతి వికృతీ రిద్ధముత్ప్రేక్షతే హి
లతా వృక్షా యూయం కథమివ హిమం ముంచ థాజస్ర మస్రం
కథం శ్వేతా మేఘా భవథ రజని త్వం కథం శీతలాఽసి.

—• ఇంగ్లీషులోని కల్పన. (శిఖరిణీ) •—

స్వకీయై ర్ముక్తాద్యై ర్విరచయతి వేలానవవధూ
శుభాలంకారం తత్కిము సమనుకూలం న కిముత
ఇతి ద్రష్టుం గత్వా పరిచరతి వీచీమయకరైః
పునర్యాతాయాతై శ్చలతి జలధిః కాముక ఇవ.

—• (సమస్యా) మధ్యాహ్నే శశిమండలం కబళితం క్రూరాత్మనా రాహుణా •—

పద్మవ్యూహ ముపాగతే గురువరే తస్మి న్ప్రవిష్టాంతరయా
చ్ఛూరం పార్థసుతం జఘాన గదయా దౌశ్శాసనిః క్రూరయా
దృష్ట్వా తద్వదనం గదావికలితం ప్రోచుర్మిథో నిర్జరా
మధ్యాహ్నే శశిమండలం కబళితం క్రూరాత్మనా రాహుణా.

## 45. 1911 సం॥ నరసారావుపేటలో నవధానములు.

—• సభారంభమందుఁ జెప్పినవి •—

చ. "భయపడినారు రా" రనుచుఁ బల్కినవాఁ డట యెవ్వఁడోమహా
శయుఁడు భవత్సమీపమున; జం కనునట్టిది మాకుఁ జెప్పు దు
ర్జయుని క్షమించు తావకఘనత్వము శ్లాఘ్యము సత్యవాది దు
ర్జయము, యథార్థవాది యపరాధము, నింతకుమున్ను పత్రికన్
స్వయముగ వెల్లడింపఁగని వారలవారణమెట్లటంచు నూ
హ యెదియుఁ దోఁపకే వగచు నస్మదఖండరుషాగ్నికీలకీ
వ్యయితదురూహ దుర్జయము లాజ్యము గావుట కించుకేని సం
దియమునుగల్గనే! యకట! తిర్పతి వేంకటశాస్త్రు లెందుకో
భయపడుటల్; రిపుల్మునుపె పాఱిరి దూఱిరి తోఁచినంతయున్
నయమొక యింతనేరని యనాథలు వాగుటతప్ప నన్యమె
ద్దియు భయకారణం బరుగుదేరదు, వారల నోరుమూయ మీ
కె యనఁగనేల! రుద్రునకునేని యశక్యమె; దేవుఁడెందు వి
శ్చయముగలేఁ డటం చనెడి సాహసులన్ భగవంతుఁ డేని యే
మియు నొనరింపనేర్చునె! యమేయునకేని యసత్యవాది దు

ర్జయుఁడె స్వయంకృతమ్ము లపరాధములే తుది రూపుమాపుచో
గయ కరుగన్వలెన్ దురితకారకులౌ మొఱకుల్; తదీయ ని
ర్దయతరవర్తనం బడఁపరా దది వృద్ధికివచ్చు చేసుఁడీ
యయ మొనఁగూర్చు సజ్జనుల కద్దిరె! పైకి నమస్కృతుల్ మృషా
ప్రియములుపల్కుచున్ సలుపుఁ బేరును మాఱిచి దూఱనేర్చు సం
ఘయశముకోసమై మిగులఁ గష్టమొనర్చెదనంచు వాగు, ని
ర్ణయము సమస్తముం దెలిసి నాస్తికుఁడై యనృతమ్ములాడు గో
మయజలసేచనార్హుఁడగు మానవుఁ; డా యవివేకితోడ నా
భయరహితాత్ముతోడ నల పాతకపుంజముతోడ నట్టి సం
శయలవశూన్యతోడ నల సాహసికాగ్రిణితోడ నట్టి మృ
ణ్మయయశుతోడ నట్టి పితృమాతృవిరుద్ధునితోడ నట్టి యా
మయముఖుతోడ నట్టి ఖలమాన్యునితో నటువంటి జెష్టతో
నియతదురాశుతో జితమనీషివరేణ్యునితో నపాత్రుతో
నియమితలజ్జుతో నెవఁడు నేర్చుఁబెనంగఁగ; మిమ్మువంటివా
రి యశమునందె యెట్టులొ పరిశ్రమచేసి కళంకునింప ని
ర్దయుఁడు యతించెఁగా! అవురదంభ! మహో యవివేక! ఘోర దు
ర్ణయ! మవురా కుతంత్రి! మవురా కలికాలము! పత్రికామహా
శయులనుబోలె మిమ్ముఁ దనసంచిని నించఁదలంచెఁగా దురా
మయుడు! మయుండు పన్ను నల మాయలు పన్నెడి వీని సాహసో
దయమిటులేప్రవృద్ధిఁ గని తద్దయు వానికిఁ జేటు దెచ్చుఁగా
క! యతనితోడనేమి? కఱకంఠుఁ డెదుర్పగ వచ్చెనేనియున్
భయమనుమాట మాగృహము పజ్జవసించెడి కుక్కకేని లే
దయ మొనగూర్చుకాళిక జయంబెపుడున్ సమకూర్చితీరు దు
ర్ణయులు హతాశులై చెడి యనాథవివాహపుమంగళధ్వని
పిత్రియముఖులై యడంగుదు, రుపేక్షయొనర్చుటె మేలు వీరి బై
సి యిఁక మఱెంతకాలము నశింపకనిల్చునొ చూత, మో మహో

దయ! నరసింగరాయ! మమతన్ మముఁ బిల్చినమిత్రు లిన్నినె
మ్మెయిఁ గికురింతు! మెవ్వఁడొ యమేధకుఁ డేమనసేమియో? దురా
శయులు నశింతురిగాక! విలసన్యశమబ్బెడుఁగాక నీకు! మా
కయి శ్రమజేసినందులకు నంబిక మీకు శుభమ్ముఁగూర్చి మా
జయమునకొక్క కంబముగఁ జక్కఁగ నిల్పెడుఁగాక యిప్పుడిన్.

సీ. స్నేహితుల్ పిలిపించి చేయించుసభకంటె
శాత్రవసభయె యశఃప్రదంబు
జయముగోరెడి సభాసదులకంటెను బరా
జయముగోరెడి సభాసదులె హితులు
నీరసప్రశ్నముల్ గోరువారలకన్నఁ
గఠినసంప్రశ్నకుల్ కరము హితులు
సమ్మానమొనరించు సజ్జనావళికంటెఁ
బడఁదిట్టువారె యాప్తవ్రజంబు

తే. గీ. మాకముచు నెంచు లోకసమ్మతులె కాని
శత్రుసభయంచు మదిలోన జంకి పాఱు
వంచకశతావధానుల పంచలోని
వారు తిరుపతివేంకటేశ్వరులు కారు.

అష్టావధానము

—• నిషిద్ధాక్షరి •—

శ్లో. యత్రశ్రీపో మతోనో సౌ కామ్యో రామో గురుస్సదా
తన్నశ్యంమండతాం నూత్నం కౌజంభాగం వగంత్రగం.

—• బందరు హైస్కూలులోని ప్రకృతవిద్యార్థుల విచారము •—

శ్లో. నాయాత్యేవగురుః కథంభవతినో విద్యోదయః కింనువా
కర్తవ్యంహిన కోఽపిచాత్రతులితో విద్వాన్ ప్రపద్యేతవై
తత్రస్థాన్ రసికాన్విహాయయదివాఽఽగచ్ఛేద్గురుర్విద్యయా
యుక్తాస్స్యామ నచే న్నచేతి నితరాం శోచంతి విద్యార్థినః.

—• సూర్యకాంతి, ప్రాతఃకాలము, సరస్సు •—

శ్లో. రవేః కాంత్యాం ప్రాత స్సరసి ప్రసరంత్యా మతితరా
మథూ త్తత్రాంతస్థం జల మఖిలమత్యంతమరుణం
కుసుంభా క్తం చేలం హస దసమతేజః పరిగతం
పునర్మందేహానామపి గురుతరాస్త్రం పరిహసత్.

శ తా వ ధా న ము

—• తిక్కన సోమయాజికవిత్వము •—

క. చక్కని పదములపొందిక
చుక్కలదొరనుండి జాఱు సుధయనఁగాఁ బెం
పెక్కిన రసప్రసారము
తిక్కనకేకాని లేదు దేవునకేనిన్.

—• తొలకరియైనపిదప పచ్చిక మొల్చుట •—

ఉ. పచ్చనిపచ్చికల్ మొలయ భద్రతరంబగుకాంతినొప్పు ని
ష్పచ్ఛరమైన నేలయును వానలచే జగమెల్లనిండుచోఁ
బచ్చనివింటిజోదున కుపాయనమున్ ఘటియింపనెంచి భూ
భృచ్ఛయరాజు కంబళము వేసినటుల్ గనుపట్టుచుండెడిన్.

—• (సమస్యా)ఆసీ దమాయాం గ్రహణం సుధాంశోః •—

శ్లో. వీరాయితాయాః కమలాయతాక్ష్యా
గతప్రభాయాం ముఖచంద్రికాయాం
కచైః పతద్భిః పరితస్పరద్భి
రాసీదమాయాం గ్రహణంసుధాంశోః.

—• సభారంభమందుఁజెప్పినవి •—

ఉ. మాకొలకొక్కబ్రహ్మను సమస్తకళాకరు సృష్టిచేసి యా
వ్యాకరణామృతాంబుధికి వారిదముల్ ఘొనరించి మమ్ము మా
స్వీకృతశిష్యులన్ నదులఁజేసి యశం బనిశంబునించి లీ
లాకలనంబునన్ సరసులన్ దనియించు పరాంబ నెంచెదన్.

ఉ. రెండవసారి యజ్ఞమునఁ దలిందమయాత్రికు నేగుపట్టునన్
ఖండనమందు గాండివము పార్థుని హస్తమునుండి జారిన
ట్లొండొకచో స్థలద్గతియునుండిన గేలియొనర్పకుండు మా
చండిక వచ్చి వెంబడినె సర్వము నిర్వహణంబొనర్చెదున్. వెం. శా.

ఉ. ఎందులకై జనించితిరొ యేపనికై మటి పూనియుంటిరో
యందులకై శ్రమంపడక యందునునిందుఁ జరించు వేళ యం
చుం దరిలేని నీదయను జూపఁగనెంచితి వోమనంబ! యీ
చందముగా వధానములు సాఁగఁగనిమ్మటులేని యీశ్వరీ! తి. శా.

—• సరస్వతి •—

ఉ. శ్రీరుచిరాంగి! సర్వకవిశేఖరవంద్యపదాంబుజాత! వం
దారుమనోరవిందములఁ దా వికసింపఁగఁజేయు సూర్యరు
గ్ధారమువూనుతల్లి! బుధవర్గముపాలిటి కల్పవల్లి! ర
మ్మా! రసనాగ్రసీమ నిలుమా! నలుమోములవాని మానినీ.

—• నానాశాఖలవలని నష్టము •—

శా. నానాశాఖలుగల్గుదేశమునకున్ నానావిధంబైన య
న్యూనాపారవిరోధముల్ పెరుఁగవాక్కో! యట్లుకానట్టి దయా
స్థానముల్ బ్రాహ్మణులేని నేకగతులై తారున్నచో నెంతయో
పూనున్ సౌఖ్యము హిందుదేశ, మదియే పొల్పార దిత్త్రావునన్.

—• దోమకాటు. (మహాస్రగ్ధర) •—

ఎలమిన్ నా రీతి గానం బెవరు సలుపలే రేనెగానాంబురాశిన్
జెలువున్ గావించుచుందున్ జెలువల లలితశ్రీల సొంపారునెజ్జన్
లలి నిట్లానందలీలాలసతరగతివై లాస్యమున్ జేసెదోసీ!
ఖల! నీకాలెంత! నీకుంగల గరువపు బింకంబుఁదానెంత! దోమా!

—• చిల్లపెంకు •—

సీ. ఎద్ది దా నీటిలో నెగురవై చినయంతఁ
గప్పగంతులు వైచి గుప్పుచుండు

నెద్ది దా వీధిలో నేగుచోఁ గాలిలో
పలుఁ గ్రుచ్చుకొని బాధపడఁగఁజేయు
నెద్దానిఁ ద్రొక్కుచో నెగిరి తిట్టుచు మున
లమ్మలు మడినీళ్ళు గ్రుమ్మరింతు
రెద్దాని బాలు రెంతేఁ ద్రొక్కుడుంబిళ్ళ
యాటలో నుపయోగమనుచుఁగొందు

తే. గీ. అట్టి చిల్లపెంకు దరినిబుట్టి బీఱ
పాడు చేదుబీఱను పేరఁ బరఁగుచుండు
దాని వర్ణించుచును గవితను రచించు
వారికవనంబు చేదుగా వఱలునేమొ.

—• రెల్లుపూఁత, (అచ్చతెలుఁగు, మందాక్రాంత) •—

చాలన్ దెల్పుల్ బొదలఁగఁదగున్ జక్కనౌ తేజుదోఁపన్
బోలన్ జొచ్చెఁ గలికినగవున్ బొల్పుగా రెల్లుపూఁతల్
పోలన్ దానిన్ బొలుపునఁగనన్ బువ్వులన్ మేల టం చం
దా లెంచంగాఁ దగువె యకటా! తావులా! వల్లకాడా!

—• వానలేనిపంటకారున రైతుల జాతీయోక్తులు •—

సీ. ఏదోయిరాయిఁడా! యీయేట సద్దలు
బొంతుతోనే సరిపోవునేమొ
"ఉత్తర వచ్చింది యెత్తరా గం"పందు
బంగపెట్టిందిరా వాన మన్ని
వుండయా! పాలేళ్ళ కొకనాఁటి కూలికి
నైన జొన్నలు సద్దలైనఁగాని
యింటి యాడోళ్ళంది యీ యగసాయమం
చగచాట్లునను:బెట్టుటాలకింతె

తే. గీ అనుచు రైతులు వానలేనట్టి వాన
కాలమందున నొండొరుల్ గలిసికొనిన

జాతిసముచితమైన భాషణము లలరఁ
జేసికొందురు వానిని జెప్పఁగలమె.

—• కంటిలోనిపాప. (విచకలిత) •—

మన కఖిలజగము గనుఁగొన మహితమగు కరణమునై
ననువుమెయి నలుసులు పడఁగ నలుప మిగుల శ్రమమునొ
కనుల కమితమయిన రుచిని గలుగఁ దనరు నలుపు పా
పను భ్రమరమునకు సమముగఁ బలుకుదురు కవులు ధరన్.

—• క్రొత్తగా ముండమోసిన జవ్వని యేడుపు •—

సీ. "సిగ్గుచే మ్రగ్గుచుఁ జేటుఁ జెందితిగాని
బిగువుకౌఁగిళ్ళలోఁ బెనఁగనైతి
'ప్రౌఢవైతివె యింత పాటవం బేమ' ను
నను భీతిచే మాటలాడనైతి
నెన్నియో సొబగుల నెంచుకొంటినిగాని
గంగపాలౌనంచుఁ గాంచనైతి
నల రజస్వలయప్పు డత్తవారిచ్చిన
చీరముచ్చటయైనఁ దీఱదయ్యె

తే. గీ. నిరువదేండ్లైన నిండవు మృత్యువెట్లు
దాపరించెనొ నాదు భర్తకు" నటంచుఁ
బొగులు కాంతల నొగులును దగవుమాలి
మాలదైవంబు వినఁ దేమి మాయయొక్కొ.

—• ఇప్పటి కొండవీటిసీమవైఖరి •—

శా. జొన్నన్నంబులు పోయె నెల్లరకు మెచ్చెల్ గొల్పు మేల్ రాజనా
లన్నంబు ల్లభియించె మిన్నయగు గోగాకన్నఁ గర్వయ్యె సం
పన్నంబై తగు హూణపాలనము సంప్రాప్తించు నీకాలమం
దన్నా! జార్జినృపాల! నీదుకృప నెంతైశ్వర్య మిం కబ్బునో.

—• అవధానంతమునఁ జెప్పినవి •—

మ. వితతాత్మీయ శతావధాన కవితావిద్యాపయోరాశి సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరసప్రీతాఖిలాంధ్రక్షమా
ధృతరజ్యద్రసికావతంసకృతవందిస్తోత్రమాలావిభూ
షితు మా వేంకటశాస్త్రినేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మనన్. తి.శా.

చ. కలదొ వధానపుంగరిమ గాకది చెట్టునెయెక్కెనో యటం
చలఁదురు నాకు మీకతన నష్టవధానములోని ధారణా
బలమది మున్నువోలెఁ దగుపాటిగ నున్నదటంచుఁదేలె నో
యలఘులు నర్సరాట్పురవరాంకులు మిమ్మనుతింపఁ జెల్లదే.

చ. అలరు శతావధానమున నత్యధికంబగు కష్టమంచుఁ బ్రా
జ్ఞులె వచియింతురిగాని యది సూనృత మంచనుకోను నేను సొం
పలరఁగ నెవ్వరేనియును నష్టవధానమొనర్ప మెత్తు నో
యలఘులు! సభ్యులయ్యదియు నాత్మకు మీకును వచ్చియుండెనే. వెం.శా

46. 1911 సం॥ బాపట్లలో నవధానము.

సభారంభమందుఁ జెప్పినది.

తే. గీ. అందఱునువచ్చుకతన నానందగరిమ
గలుగుట యటుండ శ్రీనోరికులుఁడు నాకు
గురులలోనొక్కరుండు వ్యాకరణవార్ధి
గూడవచ్చె సుబ్రహ్మణ్యకోవిదుండు. వెం.శా.

—• గోలకొండ, పూలదండ, మాలముండ, కొత్తకుండ •—

రామాయణార్థము,

గీ. ఏటికీగోల కొండపై నేలడాఁగ
నొక్కమొగిగాఁగ సత మాలముండఁ బోదు
దనుజనాయక ; నీపూలదండ వాడు
కొడుకుచేతికి వచ్చులె కొత్తకుండ.

—• గులాబీకిౕందస్ఫటికము, దోషవ్యాప్తి •—

చ. అలరెడు స్వచ్ఛకాంతిగలయట్టి భవత్ప్రకృతిన్ గులాబి పు
వ్వులుహరియించి యత్యరుణపుం బ్రకృతిన్ ఘటియించుచున్కి నీ
కలవడె రత్నరూప మవురా! స్ఫటికోపలరాజమా! మదిన్
దలఁపకు చింత నీదు నిజధామ మెఱుంగకపోరు ధీవరుల్.

—• భోజరాజు భోగముదానింటికేగుటను కాళిదాసు నివారించుట •—

చ. తగునొకొ మాంసభక్షణము? తద్దయునొప్పు సురాయుతంబుగాఁ,
దగునొకొ కల్లుదావ్రి? విదితంబుగ భోగమువాండ్రితోడఁ గూ
డఁగ. నదిచేయు పొందె నకటా! ధనమెక్కుడిదన్న, జూద మా
డఁగదొరకున్ ఘటిల్లు నది డంబుగ దొంగటికంబుఁ జేయఁగన్.

—• అలక, పలక, కలక, గిలక, ద్రౌపదీపరమందు. •—

చ. అలకలు తుమ్మెదల్ మఱియు నయ్యబలామణి చెక్కు వజ్రపుం
బలక పసందుగాఁదనరు, వాతెఱ మంకెనపూవు సొంపులుం
గల కరియాన ద్రౌపదికిఁ గల్గునె యచ్చట నల్వచెయ్దిచే
గిలకలనీరు తోడుపని కేవలమయ్యది రాజ్ఞికృత్యమే!

—• రాసక్రీడ •—

లయవిభాతి—

ఒకవనిత కృష్ణుఁడు, మఱొకవనిత కృష్ణుఁడు, మ
ఱొకవనిత కృష్ణుఁడును. బ్రకటగతి నొప్పన్
సకలసురలుం జదల రకములు నుతింపఁగను
మొకములను హాసముల చకచకలునొప్పన్
సుకరముగఁజూడఁగను నొకపరి ఘటిల్లె మును
పొకవిపులకేళియుఁ గుతుకము దయివారన్
సకలశుభసంతతులు సుకవులకొసంగునది
మొకద వినుతింపఁగను నిఁకఁబలుకులేలా.

—• గోదావరియందు కాముకీనైజారోపణము •—

శ్లో. నీరేజాతముఖీ సుమీననయనా కూర్మావతారాంఘ్రికా
కోకాకారకుచా మనోహరకచాకారోరుశైవాలికా
ఉద్వేగా కలపారసోరురశనా గోదావరీకాముకీ
లోలత్తుంగతరంగబాహులతికా రత్నాకరం గాహతే.

—• నె ల బా లుఁ డు •—

సీ. కొండవీటనునుండు కొమరాలుమోముపైఁ
బొలుపారు పావటబొట్టనంగఁ
బడమటిదెసబోటి పలుపుపైఁ బెనిమిటిఁ
దనుపఁదాల్చిన పూవుదండయనఁగఁ
దమ్మితీవనెలంత యమ్మోయినుండి జొ
త్తిలిన గందంపు బెత్తికయనంగఁ
బెరిమ నాకసమను పీర్లపంజాను ని
ల్పిన లాలసాహెబు పీరనంగ
గీ. సంజయెలనాఁగ తన చేతి సందు నందుఁ
జెలఁగు గాజులయొటిపిడిచేతఁ దెగిన
తోరమనఁగను లేత చందురుని రేక
వెలయుచుండెను నమవస విదియనాఁడు.

—• (సమస్య) కలువకంటికిఁ గుంకుమ గరళమయ్యె. •—

గీ. ఎలమి సాంబుని కర్ధమై యెసఁగుకతన
హరతృతీయాంబకాగ్నిధూమాతిరేక
మల్లనల్లనసోఁకిన వదిగ్రిచూలి
కలువకంటికిఁ గుంకుమ గరళమయ్యె.

—• చ ం ద్ర క ళ ం క ము •—

శా. నాకాశో యమపారవారిధి రిమానో తారకాబుద్బుదాః
చంద్రోనాయ మనంతశేషఫణిరాట్ దేహో స్తదంతర్గతః

య శ్చైతేకిల తత్రి నీలజలదాకార స్తదంకో హరిః
సాయంసాంద్రతరేందుకాంతివిసరః పాథోధివీచీవయః.

—• బాపట్లనుంచి వెళ్ళునప్పుడు చెప్పినవి •—

మ. సరసీజాలయ నీయెడ న్నిలువ నిచ్చల్ భావనారాయణ
స్థిరకారుణ్యరసాతిరేకమున వృద్ధిం జెందుచున్ మమ్ములన్
స్మరియింపంగదవమ్మ, చూపఁగదవమ్మా ! నీదయాపూరసం
భరితాంతఃకరణప్రచార మెపుడున్ మాపట్ల బాపట్లరో !

మ. చిరసౌభాగ్యము కల్గి ప్రాగుదధివీచీమాలికాడోలికా
చరవాతార్భకసేవ్యమాననిజవత్సంబైన బాపట్లపూ
రరుణాంభోజదళాక్షి ! మాకు సెలవిమ్మా, బ్రోవుమా! యెల్లవ
త్సరముల్ తిర్పతివేంకటేశ్వరనిఖాతంబున్ జయస్తంభమున్. తి. శా.

## 47. శ్రీవేమవరాగ్రహార శతావధానము.

అవధానారంభమందుఁ జెప్పినవి.

శ్లో. కళ్యాణం రసనే నమ స్సుకవితే భద్రింపదేభ్యో నమ
స్కారః కాల్పనికోత్తమాయ మనసే వృత్తానివో వందనం
అస్తు స్వస్తి శతావధానవిధయే విద్వజ్జనాయాంజలి
ర్వ్యక్తాయుక్తవివేకినే సుకవితాసారస్యసంగ్రాహిణే తి. శా.

శా. అంబా ! మ్రొక్కెద నీ పదద్వయికి దీవ్యద్దివ్యగంగాప్రవా
హంబో ! బంభరనాదమో ! పరభృతవ్యాహారమో ! సింహనా
దంబో ! స్ఫూర్జథుఘోషమో! యని నితాంతమ్మున్ భ్రమంగొల్పుధా
టిం బల్కించి యనుగ్రహింపుము సుగోష్ఠీనైష్ఠికుల్ మెచ్చఁగన్.

మ. వయసాహెచ్చెడి, బట్టకట్టి తలత్రిప్పన్ జొచ్చె నానాఁట, నీ
దయయున్ బ్రాజ్ఞులప్రేరకత్వమును విద్యాపక్షపాతంబు ని
న్నియు నేకీకరణంబుగా గృహమున న్నేఁ దీరికూర్చుండలే
క యెదో సేయఁగ వచ్చినాఁడను జుమీ కాత్యాయనీ కావుమీ.

చ. గిరగిరగిఱ్ఱగిఱ్ఱగిర గిర్గిర గిర్గిర గిఱ్ఱుగిఱ్ఱుగాఁ
దిరిగెడి శీర్షమేగతిని దేవి ! వధానమొనర్పనేర్తు నం

చరయక నీకటాక్షమది యాఁదరు వుండుటఁజేసి సాహస
స్ఫురణకుఁబూనినాఁడఁ గృపవొంపిరివో భరియింపుమింపుగన్. వెం.శా.

చ. సుజనులు మెచ్చఁగాఁదగు యశోధనముల్ గల చెన్నయాదిక
ద్విజవరు లగ్రహారమగు వేమవరంబున నన్నదాతలై
ద్విజుల ననేకులన్ దనిపి తెచ్చిన పుణ్యము నేఁటికొల్వులో
విజయపుటాటపట్టు లనిపించుతఁ దిర్పతివేంకటేశులన్. తి. శా.

అవధానప్రారంభము

—• చంద్రోదయః (శిఖరిణీ) •—

అభూ ద్రక్తా ప్రాచీ పరమపితు తారావిరళతాం
గతాః కాంతా జాతా గళితతనుభేదా స్స్వపతిభిః
అభూ చ్చదిః పాథోనిధితటగతో రత్నకలశో
బభూవు ర్దిగ్వ్యోషాః ప్రచితశశిసాంద్రామలరుచః.

—• బిడాలవర్ణనం, (మందాక్రాంతా) •—

మార్జాలోఽయం చకితచకితం పశ్యతి ప్రేక్షమాణాన్
క్షీరాగారే విచలతి సదా బంభ్రమీతి త్రియామాం
అగ్రే దృష్ట్వాయమపి విధవాం తుల్యతా మామనంతీ
ప్రాజ్ఞా బుద్ధి శ్శకునవిషయే నిందతిస్మ ప్రియాణే.

—• చీ కు ము ల్లు •—

సీ. నిన్నుఁగాల్చినఁగాని నీబుద్ధి మానవే
చీ! యేమనందునే, చీకుముల్ల!
దొంగరీతినిదూఱి దొరకకుందువుగదే
చీ! యేమనందునే, చీకుముల్ల!
పొరలోపలంజేరి పోటుగూర్చెదుగదే
చీ! యేమనందునే, చీకుముల్ల!
పదమాశ్రయించియు బాధపెట్టెదుగదే
చీ! యేమనందునే, చీకుముల్ల!

తే. గీ. నిన్ను మర్యాదగాఁ జూచునేని యెట్టి
దట్టుఁడేనియు నీదు కోఁతలకు లోఁగు
చెప్పుదెబ్బకుఁదప్ప నీ చెడ్డగుణము
చీకదుసుమీ, యిసీ, యిసీ! చీకుముల్లి!

—• మల్లెమొగ్గ •—

మ. పొలఁతుల్ దాల్చు బులాకితో మఱియు నప్పాఁబోండ్ల లేనవ్వుతోఁ
బొలయల్కల్విడి భర్తలంగలియు పూవుంబోండ్ల నెమ్మేనవ
ర్తిలు ఘర్మాంబుకణాళితో దొరయుచున్ దేవీశిరోజావళీ
కలితాలంకృతి వైన నిన్ గొలుతు వేడ్కన్ మల్లికాసూనమా.

—• దేవాలయమునకుఁబోవు స్త్రీలు •—

సీ. ఫలపుష్పములతోడ విలసిల్లు పళ్లెరం
బంజలియందు నృత్యంబు సలుప
చరణాబ్జములయం దెసంగు నూపురములు
లయతప్పకుండఁ దాళములువైవఁ
బైఁటకొంగులగాలి పలుమాఱు నెమ్మేని
చెమటబిందువుల మొత్తము లడంపఁ
గడకంటిచూపులు కల్వదండలఁబోలె
నలుపక్కలను దోరణములు గట్ట

తే. గీ. భక్తియాకారమును దాల్చి పరఁగురీతి
పావనతరూపుదాల్చిన పగిదిఁ దోఁప
దేవి యాలయమునకుఁ దోతెంచునట్టి
సాధ్వులఁ గృతార్థలను మ్రొక్కి సలుపుటొప్పు.

—• తాత్కాలికసంధ్యాకాలః (శిఖరిణీ) •—

ఇదానీం సంధ్యాయాం వజపతి ధరాదేవనికరో
రవిఃకుత్రత్యోవా కిముభవతి సాంధ్యారుణరుచిః
కదా ప్రాదుర్భూతా తిమిరమభవ త్కాస్విపిచకదా
న జానీతేవిద్వత్కలితమతితా కారణవశాత్.

—• అగ్రాసనాధిపః (నామపర్యాయు క్తశ్లేషః) •—

శ్లో. సత్యాసక్తం సదాపాణి మ్యాప్తచారుసుదర్శనం
యశోదయాలాల్యమానం కృష్ణం కృష్ణం నమామ్యహం.

—• (సమస్యా.) నోదినామంతురింగతి •—

శ్లో. స్వామిన్ శ్రీమన్ మహాభాగ నవయం తత్రసంగతాః
తత్ర వృత్తస్తు తానేన నోవినామంతురింగతి.

—• (సమస్యా) శ్యామఘోనాసమంస్థితః •—

శ్లో. పాణిన్యుపచితే సూత్రే సభాయాం కుకవి ర్యథా
సాకం సుకవిభి స్తద్వత్ శ్వా మఘోనాసమంస్థితః.

—• అవధాన సమాప్తియందుఁ జెప్పినవి •—

ఉ. చెన్నపురంబుచేసె నొక చెన్నఁడు వేమవరంబు నేఁడహో
చెన్నపురంబుగాఁ దొడఁగెఁ జెన్నయగారి యుదారతాప్తిచే
నెన్ని వధానముల్ సలిపి యేమిఫల మ్మిటువంటి యన్నదా
నోన్నతి యిట్టితృప్తియును నొందొకటన్ గనమో మహేశ్వరీ.

ఉ. ఎందఱు పెద్దల న్నిలిపి తెందఱ పాదరజంబుచేత ని
మ్మందిరమున్ బవిత్రగరిమమ్మున నించితి వెంతమంది నా
నందమునందు ముంచితివి సవ్యలు గొంద ఱదేమొకాని నిన్
జెందఁగనాడువారఁట ! యిసీ ! యిసి ! యోసి శతావధానమా !

ఉ. అన్నముకోస మామశలకామడ లేగెడి కాలమన్నసో
సున్నయు హళ్లియయ్యె, నినుఁ జూచుతలంపునఁజేసి గాక యీ
యున్నతు లిందఱిట్టి క్రియ నొక్కటఁ గ్రిక్కిఱియంగనేల ! మా
యన్న ! శతావధానమ ! కృతార్థమవైతివి వేయునేటికిన్.

తే. గీ. "భాగి" పదమిప్పటికిఁ బుణ్యభాగియయ్యెఁ
"జెన్న" పదమిప్పటికి నుతిం జెన్నమీఱె
వేమవర మగ్రహారంబు హేమవరపు
నగ్రహారంబుగా మాఱె నంబ ! యిపుడు.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి చూపిన యత్యాశుకవనానంతరము చెప్పినది.

శా. అన్నం బెక్కడనో భుజించితివి విద్యన్నాకడ న్నేర్చితెం
దు న్నీయందు లవంబు గాననుజుమీ దోషంబు; దుశ్శాత్రవుల్
నన్నున్ మూర్ఖునవారియాశువుల చందంబెల్ల నవ్వారి సు
బ్బన్నా! చూపి ఋణమ్ముఁ దీర్చితివిసుమ్మా, శిష్యచూడామణీ! వెం.శా.

—• సభముగించునప్పుడు చెప్పినది •—

చ. జననపులగ్నమం దలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
డును నలరాహువున్ నను ఘనుంబొనరించెడి నంతెకాని యే
నును నొకసత్కవీశ్వరుఁడనో "తిరపయ్య"యు నొక్కమేటియో
యనఘకవిగ్రహంబులు, గ్రహంబులు గవ్వనుజేయు వజ్రమున్.

—• ఊరేగింపున కించుక పూర్వము •—

సీ. మరల నెప్పుడు మీరు మాకు లభింతురో
వందనంబయ్య! విద్వాంసులార!
మంచిపద్యములక్రమ్మఱ విను టెన్నఁడో
జోహారులయ్య! యోసుకవులార!
కన్నులు చల్లఁగాఁ గాంచు టేనాఁటికో
మీకుఁబ్రణామముల్ మిత్రులార!
మరల నెన్నఁడు కనంబడునో మీ కన్నీరు
మీకు మంగళమో యమిత్రులార!

తే. గీ. మరల మాచేత శారద మాన్యచరిత
ఉరకయెన్నఁడు చేయించునో? శతావ
ధానమా! దివ్యకీర్తిప్రథావిధాప్ర
ధానమా! నీకుఁగూడ వందనములమ్మ!

సీ. విశ్వజనీనుండు వితతభాగ్యుండు భా
గ్యన్నవాయుండు చెన్నయ్యగారు
పరమసాధువు మేళ్ళచెఱువు వంశాంభోధి
చంద్రముఁడైన శేషయ్యగారు

యజ్ఞోపవీతాన్వయాంభోధికబ్జుండు
వేంకటాచలపతి వితతయశుఁడు
భాగి వంశ్యుండు వెంపటివారికిం దత్తుఁ
డైన వెంకటసుబ్బయార్యవరుఁడు

తే. గీ. అశ్వమేధంబొ ? రాజసూయంబొ ? సత్రి
యాగమోనాఁగ నవధాన మలవఱిచిరి
సాటి వెల్పాఁటివారును సాటిలేని
వారు వారికిఁ గూడ నా వందనములు. తి. శా.

—• శిష్యులుచేసిన ప్రసంగానంతరము వెం. శా. చెప్పినది •—

చ. తిరుపతి యేన్గుగాఁగ గడిదేఱిన శిష్యు లనేకు లొప్పమైఁ
బొరిఁబొరి రోజుచున్ దనదుపొంతను బెబ్బులిపిల్లలట్టుచూ
పఱులకుఁ దోఁపఁ గేల నొకపాటిది బెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసు"ఁ జూపెడిఁ జూడుఁడో బుధుల్.

చ. తిరుపతి వ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులు గున్నయేన్గులై
వఱలఁగఁ దేఱఁగాఁ దగినవారలు బెబ్బులిపిల్ల లెల్లమా
ర్తురు కపికుర్కురమ్ములయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధానమను "సర్కసు" చూపితివమ్మ, శాంకరీ ! తి. శా.

—• బ్రహ్మరథోత్సవానంతరము చెప్పినపద్యము •—

సీ. "కాసుచొప్పున నింతగా నార్జనముచేసి
తెంతఁ దెచ్చినను మాకింతలేదు
గడగడలాడి నిన్ గానఁగా నేతెంత్రు
గానఁబోయిన మమ్ముఁ గాంచుటరిది
ప్రీతితో నీకు నర్పింతురెంతైన మా
కింత యిచ్చియు నెంతు రెంతొ యనుచు
సేవించి నీకు వాంఛితము లిత్తురు సేవ
గావించినను మాకుఁగాసునీకు"

తే. గీ. అనుచు మును పెన్నఁడో యాడినట్టిమాట
కన్యథాత్వంబుగూర్చి సిగ్గందఁజేసి
తైన నేమయ్యె నీయుత్సవాదికమ్ము
లీవకై కొమ్మ ! యో వేంకటేశదేవ !

—• వేమవరమునుండి బయలుదేఱునప్పుడు చెప్పినవి •—

ఉ. కాశికనుండి యొండెడకుఁ గాల్గదలింపనివానిఁ గాశివి
శ్వేశుని దెచ్చి యొక్కయెడ నింటికిదాపున నిల్పె సద్యశో
రాశి భవత్పితామహుఁడు ప్రాజ్ఞుఁడు; తిర్పతివేంకటేశ పూ
రీశుల నీవు తెచ్చు టదియేమి విశేషము చెన్నయాగ్రణీ ! వెం. శా.

ఉ. ఎవ్వరు నిన్ గ్రహించిరొ బుధేంద్రులు రాజులయొద్ద వారిపే
రివ్వసుధన్ జెలంగునటు లెంతయు నోమిన చెన్నయాచలం
దెవ్విధినేనిఁ బేర్మి భరియించుచు మేల్ సిరినింపుమమ్మ, మా
యవ్వరొ ! యింకమాకు సెలవా ! యల వేమవరాగ్రహారమా! తి. శా.

—• తోఁవలో ననుభవపూర్వకముగాఁ దోఁచిన కల్పనలు •—

సీ. ఎక్కించితివిగదా ! యేగుచో మేనాల
సర్వత స్సుమవృష్టి సంకులముగఁ
బట్టించితివిగదా ! బ్రహ్మరథముఁగూడ
స్వస్తివాచనపురస్సరముగాఁగ
గల్పించితివిగదా గాఢోత్సవమ్ముల
వారాంగనా కదంబములతోడఁ
దాల్పించితివిగదా తలలపైఁ బాదర
జంబు నాబాలవృద్ధంబుగాఁగ

తే. గీ. దురభిమానగ్రహావేశధూమధూపి
తాప్రయోజకగర్తపురాంతరస్థి
తాత్మపద్ధతిపక్షానుయాయిసుజన
సంకలితనిత్యమూర్ఛ ! ఆసనపుఁజర్చ.

సీ. పాదరజం బాసపడక యూరక వంక
వంక దండముపెట్టువారు లేరు
బ్రాహ్మణత్వం బూడిపడ్డదే యాకసం
బందుండి యను కూళ లెందులేరు
భక్తిసారస్యపరిపత్తి సత్తావిత్త్వ
మలవడకున్న బ్రాహ్మణులు లేరు
పరమపాతివ్రత్య పరిపాకగరిమఁ జె
న్నెసలారకున్న గేహినులులేరు
తే. గీ. ఒక్క పద్ధతి దౌర్భాగ్యముండుఁగాక
అది యుపానదుపాయ సంపదకు నొదుఁగు
దూరగు లెఱుంగ రకట ! నీసొరు, సుకవి
వినుతసుఖభూమ ! యోకొండవీటిసీమ ! వెం. శా.

సీ. ఏయింటఁజూచిన బ్రాయికంబుగఁ జేతి
జిడ్డు వాయని మంచి గడ్డపెరుఁగు
ఏపొలంబరసినఁ గాఁపుటాండ్రు చరించు
పలుకఁబాఱినచాలు పంటచేలు
ఏబావిగనుఁగొన్న వేబాసనఁగఁ జాలు
నమృతంబుతోఁ బోరునట్టి నీరు
ఏగ్రామ మేగిన నింతలంతలుఁగూడఁ
బదధూళిఁ దలఁగోరు భక్తివారు
తే. గీ. బ్రహ్మశబ్దంబుదాల్చిన పాదుదండి
కుజనులను దాల్చు పద్ధతికౌఱకుఁ గాదె
పాదరక్షలు దాల్పంగవలయు నీదు
విధమెఱిఁగినామ ! యో కొండవీటిసీమ ! తి॥ శా॥

—• సుబ్రహ్మణ్యశాస్త్రి చెప్పిన యత్యాశుకవిత్వానంతరము •—

చ. ప్రకటతరాశుధారను సభాసదులందఱు మెచ్చుచుండ నా
యకమణి సంతసింపఁగ నయారె ! రచించినవాఁడవీవు వా

రక యరవిందసుందరమరందఝరంబు స్రవించుచుండు నీ
సుకవిత గాచుకోఁగదవె సుబ్బనశాస్త్రిజగద్ధితంబుగన్. తి. శా.

48. 22–9–1911 తేదీ పినపాటి శతావధానము 66 పద్యములలో.

—• అవధానారంభమందుఁ జెప్పినవి •—

ఉ. ఒక్కొకచోట నొక్కగతి నోజగదంబ! భవద్విలాస మ
మ్మక్క ఘటించు వస్తుచయమంతయు శక్తిమయంబు దానికిం
దక్కినవార లెందులకుఁ దా మసమర్థులటం చెఱింగి నే
నిక్కృతికిన్ గడంగెద నిహీ యనిపింపకుమమ్మ, శాంకరీ.

ఉ. మానియుఁ జేయఁబూనిరని మాపయిఁ గోపమదేల నీకు, మా
పై నెనరూను పేరిరకులపై ననురాగమదేల? యెట్టులో
పూనితిమిప్డు బొమ్మనినఁబోదువె? తోటశిరమ్ముఁ గ్రుక్కి జం
కూనఁ బనేమి రోకలి, కెటో నటియింపు శతావధానమా. వెం. శా.

మ. స్మయమేపార శతావధానకవితాసామ్రాజ్య మేలించి త
చ్ఛ్రయశోమూలముగాఁగ, నీపగటివేషాలెన్ని నాళ్ళింక, మా
పయి కేరే నరుదేర వారల నదల్పంజాలు ధీశక్తి యి
చ్చి యెటోమన్చుట నీక భారమగు నీచిత్తంబు కామేశ్వరీ. తి. శా.

—• తాళవృక్షసంగతయమునా — మాలినీ •—

శ్లో. నిరుపమదళశోభై స్తాళవృక్షై రుపేతా
వ్రజశిశుచరితానాం సాక్షిణీ యత్తటోర్వీ
కపికులలులితేలా భాతి యస్యాస్తు వేలా
మఘసమణివినీలా వాతి సా సూర్యబాలా.

—• బా సు గా రి చ ట్ట ము •—

మ. కలికిన్ గంటికిఁ బ్రీతిగొల్పునెడ వేడ్కన్ దేనినేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు; దానిపయి నెందేఁ బేర్మివో నప్పు డ
క్కలికిన్ పీడఁగవచ్చు; నొండొకట భాగ్యంబున్న విశ్వస్తతోఁ
గలియన్వచ్చును 'బాసు' చట్ట మురరీకారంబు గావించుచో.

—• వైదికనియోగులకు సఖ్యమునుగూర్చి •—

ఉ. ఎవ్వరువైదికుల్, మఱియు నేరు నియోగులు ? నొక్కవిప్రులే :
చివ్వకు డీకొనన్ గలుగఁజేటఁకఁ దక్కినజాతివారికిన్
నవ్వఁగ సందుగాదె ! యటునవ్వఁగఁజేయుట పాప్రిజ్ఞధర్మమే
యెవ్వగనైన నీ రిరువు రేకముగాఁ జరియించు టొప్పదే.

—• తెల్లవారుఝామున దీపములు •—

చ. కలుకులు భర్తలం గలిసి కంతునిమంతనముల్ యథేచ్ఛగా
సలుపుచుఁ గ్రిందమీఁదఁబడుచందము దాఁ గనులారఁ గాంచి వే
ల్వెలఁగనె సిగ్గుచే ననఁగ వేకువదీపపుఁగాంతు లెంతయున్
దెలతెలనాయెఁ దూర్పుదెస తెల్లఁబడెన్ శశి తెల్లనైజనెన్.

—• (సమస్య) దీపోఽయంహనుమానివ •—

శ్లో. పురం దదాహ సకలం । వరాంఢాసన్నిధాపితః
వాయునా పటలంనీతో । దీపోఽయంహనుమానివ.

—• "చత్వారఃప్రథయంతు" అను శ్లోకమునకుఁ దెలుఁగు •—

సీ. ఏపాణు లఖిలంబు సృష్టిఁజేసెడి బ్రహ్మ
ఫాలంబులన్ వ్రాయు వర్ణసమితి
ఏపాణు లొసఁగు నెంతేఁ జందనంబు శ్రీ
నళినాక్షిగండస్తనములయందు
నేపాణు లేపారు నేవేళ విద్రుమాం
కురముల నెనయు నంగుళులతోడ
నేపాణు లలరు నెంతేఁబాటలంబులై
కోకనదచ్ఛాయ గొమరుమిగులు
తే. గీ. నట్టిపాణులు నాల్గు లోకైకరక్ష
ణాదరుండగు నాదినారాయణుండు
శ్రేయములు మీకుఁ గూర్చి రక్షించుఁగాక
సభ్యజనులార ! సుకవితాసక్తులార !

—• "చరమగిరితురంగీ" అను శ్లోకమునకుఁ దెలుఁగు •—

చ. అల చరమాగమందలి యొయారపుఁబ్రేయసి ముట్టిచేత నిం
పలరఁగ గోకఁ జందురుని యందలిలేఁడి సుషుప్తిఁజెందెమున్
నెలలవి నిండి లోన ధరణిన్ ధరియించిన ప్రాచి పావురా
పలుకులపేరి హుంకృతు లపారముగా నొనరించు నద్దిరే.

—• (సమస్య) మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియున్ దేఁగదే. •—

శా. "కుంచాలన్ గొలిపించియిచ్చితినిగా గుగ్గిళ్లకై యుల్వలా
గంచాలం దిడఁబోకు మన్న మిపు డెక్కన్బోదు సంసారి పా
వంచాలం డిగి దప్పిగొన్నవిర, సుబ్బా! నీవ్వు వేవేగఁ దె
మ్మం"చాలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియన్ దేఁగదే.

—• (సమస్యా) అనుజో బభూవ తనుజోఽపి యోషితః. •—

శ్లో. నహి సంతతి స్తు నరకార్ణవాపహే
త్యతిదుఃఖ మాత్మపితరం నిరీక్ష్య సా
తనయా దదౌ స్వతనయం తత స్త్వహో
అనుజో బభూవ తనుజోఽపి యోషితః.

49. 1911 సం॥ గుంటూరు శతావధానము 43 పద్యములలో.

—• అవధానారంభమునఁ జెప్పినవి •—

చ. కలరుగదా! రసగ్రహణ కాముకు లీసభ నెంద ఱెందఱో
కలరుగదా! మహాకవు లకారణకారుణికుల్ మఱెందఱో
కలరుగదా! యథార్థగుణకౌతుకు లంచును బూనుకొంటి మిం
దులకు వయఃప్రియుక్తమగు దోసము చేసెడిచేష్ట సైఁపుఁడీ.

ఉ. చేసితిమో! యెవం డెఱుఁగుఁ, జేయనెలేదొ? శతావధానమం
బా! సకలేశ్వరీ! గతము లందఱు నమ్మరు, నేఁడెటో రసా
భాసముగాకయుండఁగఁ గృపన్గను "మెప్పటికప్పుడే యిటుల్
దోసిలినొగ్గుసీతఁ"డని తోఁచి త్యజించెదవేమొ శాంకరీ.

ఉ. ధారణ నేయుపట్టునను తావకమౌదయగాని కావ్యపుం
ధోరణియందు లేశమును దోడితరంబనపేక్ష్య; మొక్క చూ
పూరక మాపయిన్ గొలుపు మోజగదంబ! యిదెంత? సర్వమున్
ధారుణిదాల్చు నీదుబిరుదంబు నెఱింగియె దేవిఁ యించితిన్. వెం. శా.

చ. తల నరయందొడంగెఁ గవితావనితామణియున్ బతివ్రతా
తిలకము నీడుజోడయినదేయగుటన్ భయభక్తియుక్త కాఁ
గలదిఁక ధారణాతరుణి కారుణికత్వపుఁ బ్రేమఁ జూపఁగాఁ
దలఁచునొ, లేదొ! యంచు మదిఁదత్తఱ మిత్తఱిఁ గ్రొత్తగొల్పెడిన్.

ఉ. త్రిప్పితి వెల్ల దేశములు త్రిప్పినచోటులనెల్ల భంగపా
టెప్పుడు రాకయుండ జయమే సమకూర్చితి వన్న యూహతో
నిప్పుడు చేయఁబూనిన యొకించుక గర్తపురావధానమం
దెప్పటియట్ల నీదుదయయే మదిఁగోరితినమ్మ, యీశ్వరీ! తి. శా.

—• పెండ్లి, గుఱ్ఱిడ్డివాండ్రు కుంటివాండ్రు •—

సీ. "బోగలమేళంబు పుట్టెఁడుద్రవ్యంబు
వెచ్చించి వీరు తెప్పించినారు
సంగీతములు పాడు సానులఁ బిలిపించి
భూరిధనంబు గోల్పుచ్చినారు
బాంధవౌఘమునెల్లఁ బరువు మై రావించి
వింతగా విందు గావించినారు
ఊరివారికిఁ బొరుగూరివారికిఁ గూడ
సంభావనలఁ దుష్టి సలిపినారు

తే. గీ. గుడ్డికుంటుల కొకయింత కూడొసంగ
వెనుకఁదీయుచు న్నున్నారు వీర లకట"
యనుచుఁ బెండ్లింటి యెదుట నాహారవంబు
లాచరించెడి దీనుల నరయఁదెవఁడు.

—• పిడుగులు, వాన—మణిగణనికరము •—

దడదడఁబిడుగులుదగఁ బడునపుడున్
బెడిదపుఁజినుకులు విడివడిశిలలున్
బడ నెడనెడఁ దగుపథమున నడువన్
జడిసిరి మనుజులు జడి యురవడికిన్.

—• (సమస్య) ఉఱుకఁ దఱుమంగఁ దఱుమంగ నుఱుకుటయ్యె •—

తే. గీ. సరగ నాసేన యీసేన యురవడింపఁ
దాఱుమాఱయ్యె మాఱుతాకై రహించె
నాఱుపదియును బదియునాకై చెలంగె
నుఱుకఁదఱుమంగఁ దఱుమంగ నుఱుకుటయ్యె.

—• ఎండుచెట్లు—విధవలు •—

శా. ఎండై బెండు వడంగ నొప్పునల వీవృక్షాలముల్ వొల్చు వీ
డుండుంబో ! కడుముండమోపులకు నాయుర్దాయియౌతావునన్
రెండున్ వంటయొనర్పు సాధన మగుఞా వేయేల తజ్జాలముల్
నిండారఞా జరిగించుటే విధవ పెండ్లింండ్లారఁగాఁ జేయుటల్.

—• (సమస్యా) నిద్రా నైతి నిశా న యాతి తరుణీ నాయాతి కా యాతనా. •—

యాదూతీతు గతాప్రియానయనతస్సాద్యాపినాయాతివై
శీతాంశుః కిరణోత్కరై ర్నభ ఇత స్సర్వత్ర భాభాసతే
ఆగచ్ఛత్యతివేల మిత్యతితరాం నేత్రే నిమేషాతిథీ
నిద్రా నైతి నిశా న యాతి తరుణీ నాయాతి కా యాతనా.

—• (సమస్యా) ప్రియాసుతంనోర్ఘుతికామతంత్రే. •—

శ్లో. సఖేమయి ప్రీతిభరాలసాఽపి
రుదంత మాలోక్య శిశుం మృగాక్షీ
తదామనోయచ్ఛతిభాగళ స్తత్
ప్రియా సుతం నోర్ఘుతి కామతంత్రే.

—• పైదానికే పూర్త్యంతరం •—

శ్లో. షండః పుమాన్ కశ్చనభాగ్యశాలీ
వృణాతుకాంతాశ్శతశోఽఖిలాషాత్
గృహస్థమేనం రచయంతు వా కా
పిస్త్రియాసు తం నోర్ఘ్యతికామతంత్రే.

50. 10–9–1911 బ్రాహ్మణకోడూరు శతావధానము.

—• అవధాన ప్రారంభపద్యములు •—

చ. "వయసు గతించు చున్నదిఁక వ ల్దవధానము" లంచు మేము త
ద్దయు బతిమాలి యేటి కవధానములన్ సమకూర్చెదన్న "నా
దయ కొకఁడున్నె వార్ధకము తాత!" యటంచు వచించెదేమొ య
ట్లయిన "తథాస్తు" నీ యభిమతార్థమె తీర్చెదమమ్మ, శాంకరీ. తి. శా.

శా. ఊరేగించుటెకాక మాయెడల మీయూరెల్లఁ జూపించు వి
స్తారోదారపు గౌరవమ్మునకు నేచాయన్ బ్రతీకార మొ
ప్పారన్ జేయఁగ నేర్తు మేము! రసవద్వ్యాహారముల్ గొన్ని శ్రీ
వారింగొల్చి గడించుకొన్న వెటులో వాక్రుత్తు పూలింపుఁడీ. వెం. శా.

—• బ్రా హ్మ ణ కో డూ రు •—

మ. గణనీయుల్ ద్విజు లల్లరాజులు యశస్కాముల్ కిరాటుల్ లస
ద్గుణగంభీరులు కమ్మవారు తనరన్ దోరమ్ముగా ధాన్యపుం
గణముల్ గోట్లుగఁ బుట్లు పండఁగల భాగ్యంబెందుఁ బెంపారు బ్రా
హ్మణకోడూరుపురంబు చెన్నలరు లక్ష్మ్యావాసమై వాసిమై.

—• ఆంగ్లేయుల ప్రభుత్వము •—

శా. పాఱంజొచ్చె నృశంసవర్గములు, దైవారంగ నీరెల్లచోఁ
బాఱంజొచ్చె సమస్తమానవులకున్ బల్ సౌఖ్యసంపత్తి పెం
పారన్ జొచ్చె సితాస్యరాజ్యమున నాహా! యిట్టిరాజుల్ ముదం
బారన్ వర్ధిలఁగావలెన్ మనకు విద్యాసంపదల్ గావలెన్.

51. 1914 సం॥ లక్ష్మీనరసాపుర శతావధానము 50 పద్యములలో.

—• అవధానారంభమునఁ జెప్పినవి •—

క. ఏ మొక్కపాటిసంగతి
కేమెయి లోఁగ మని లోకమెల్ల నెఱుఁగు నీ
దే మాధారము తల్లీ!
కామేశ్వరి! నీవు గల్గఁగా వెఱపేలా.

చ. దినదినమున్ జ్వరార్తిమెయి దేహబల మ్ముడివోయి యున్న ప
ట్టున ననుఁ జెల్లయాంబిక కడుం బ్రియమారఁగఁ బిల్వనంపుటల్
మనమున ఖేదమోదము లమర్చుకతమ్మున "లంఘనమ్ములన్
మనుగుడు" పన్నసామెతకు మంచియుదాహృతి చిక్కె నేఁటికిన్.

ఉ. కాయబలంబు శాశ్వతము గాదు శరీరబలావలేపమే
ధీయువతీమణీహృదయ దీప్తికిఁ జాలిన పట్టుగొమ్మ స్వ
శ్రేయస మిచ్చగించు కవిశేఖరు లీ ద్వితయానుకూల్యమున్
బాయకయే వధానపరిపాటిని గోటను మీటు టొప్పగున్.

చ. జ్వరపడియున్న హేతువున సాయము నీ కొనరింపఁజాల నో
తిరుపతిశాస్త్రి! నీకు నల దేవి పరాంబిక యుండ వేంకటే
శ్వరుఁ డొనరించు సాయ మొక బ్రాఁతియె? నీవు దలంచినన్ ధరా
ధరములు పిండిపిండి యగు ధారుణి కుంగు నభం బభంబగున్.

ఉ. పూనుము కార్యభారమును "బూన సుదర్శన" మన్న దేవకీ
సూను కథావిధానమును జూపఱు లాత్మల సంస్మరింప నే
మౌనముఁ బూని నీశుభసమగ్రితకై జపియింపుచుందు నీ
పై నొకచూపుఁ దక్కుసభపై నొకచూపునుగా మెలంగుచున్.

చ. గురుపదపద్మభక్తి సమకూఱనివాఁడవు గావు దైవతా
దరము వహింప మానవు కృతజ్ఞత కాకరమై కృతఘ్నతా
భరతిమిరోపమర్దనదివాకరమూర్తివియై మెలంగునీ
యురవడి కెవ్వ రడ్డు కవితోరుధునీపతివోయి, శ్రీపతీ!

మ. జననీ! రమ్మి, శతావధానమ! భవత్సామ్రాజ్యసంపత్తి మా
దనియున్ మేమలదాని వీడుటకునై యత్నించినన్ దగ్గ నా
ధునిలేమిన్ మముఁ దాను వీడ దనియున్ దొల్దొల్త "బెల్లంబువం
డిన దీపో"య్యనియుఁన్ దలంచుజనులన్ దేలింపుమీసూక్తులన్. వెం.శా.

శా. ప్రాయంబెల్ల గతించుచుండె మతియుం బ్రాల్మాలుచుండెన్ భుతా
పాయంబైన భవద్దయారసము మాపై హెచ్చుచుండెన్ మహీం
ద్రాయత్తంబగు గౌరవంబునన పాయంజాల ముద్యాపిత
ప్రాయంబౌ నవధానముం బ్రిసవవై రాగ్యంబుచందంబునన్.

ఉ. ఏయమయన్నముం దినుచునే చదువెల్లను నేర్చి సర్వభూ
నాయకులం గరంచితివొ నవ్యవచోవిభవంబు మీఱఁగా
నాయమ చెల్లయాఁబ నిను నారయలేని యభాగ్యరేఖయుం
బోయెను నేఁటితో సుదముఁబొందుమ యింక శతావధానమా: తి.శా.

—• కుక్కుటేశ్వర స్తవము •—

శా. శ్రీరాజేశ్వరితోడఁ బీఠనగరీసింహాసనాధ్యాసియై
శ్రీరాజిల్లఁగఁ గుక్కుటేశ్వరుఁడు మించెన్ దివ్యదేలానదీ
తీరస్థాయి పితౄణమోచనపటుస్థేమాభిరామప్రథా
ధారాపూరితవారటత్పదగయాధాత్రీ ప్రదేశంబునన్.

—• లక్ష్మీస్తవః (పృథ్వీ) •—

సరోజనిలయాం సరోజనికరాం వరాం భాస్వరాం
మురాహితకుటుంబినీం సకలలోకసంచారిణీం
తుషారకరసోదరీ మమృతవారిధేః పుత్రికాం
భజామి చ నిజే మనస్సరసిజే సదా భార్గవీమ్.

—• (సమస్య) రంభలతోడ రంభ ఘనరాగమునన్ భయ మాపుడీ యనెన్ •—

ఉ. జంభరిపుండు తుల్యముని సల్పు తపంబు నడంచుపొంటె సం
రంభముతోడ నచ్చటికి రంభను బంపఁగ నామెయుం జెలుల్
దంభపుదృష్టిఁ జూడగను దమ్మని కోపఫలత్వలాయనా
రంభలతోడ రంభ ఘనరాగమునన్ భయ మాపుడీ యనెన్.

—• అలవాటులేక నస్యము పీల్చుట •—

ఉ. పట్టునుబట్టు నేరుపది పాల్పడమిన్ గళమందుఁ దూఱు సం
ఘట్టనచేత నెంతయు వికారముచే వమనంబు పుట్టుఁ జే
పట్టు నకాలజక్షుతవిపత్తులచేఁ దలదిమ్ము మూరకే
పెట్టెడువారితోఁ బొడుముఁ బీల్చుట క్రొత్తగ నభ్యసించినన్.

—• ప్రథమవర్షపాతానంతరాటవీస్థితి •—

సీ. నలుగడ ధూమముల్ చెలరేఁగఁ గాల్చు దా
వానలం బెల్లఁ జల్లాఱుచుండఁ
బచ్చని కెంపులు పఱచినరీతిగా
మురువైనతృణములు మొలకలెత్త
సెలయేళ్ళదాపునఁ జెరలాడు భీకర
వ్యాఘ్రాదిమృగములు బయలుదేఱఁ
గ్రొందీవగమియందుఁ గ్రొత్తకెంజిగిరింపు
కన్నులపండువై కానుపింప
తే. గీ. సంభవించిన తొల్కారిసమయమందు
నడవి నూతనమైనదో యనఁగఁ దనరు
దానిఁ జూచినఁ గాని యెవ్వారికైన
వర్ణనము సేయరా దిది వాస్తవంబు.

—• (సమస్య) వెలఁ జూపించి లతాంగి యేడ్చెనఁటః కన్నీరొత్తుచుం బయ్యెదన్. •—

మ. కలికిన్ రంభను రావణాసురుఁడు దుష్కామంబుమైఁ బట్టి వ
న్నెలుమీఱం దమకించి యా పిదప వానిం గోరులం గ్రుచ్చఁగన్
బొలుపుం బాయుచు నామె యాధనదసూనుంగాంచి యచ్చోటఁ గ్రొ
న్నెలఁ జూపించి లతాంగి యేడ్చెనఁటః కన్నీరొత్తుచుం బయ్యెదన్.

—• శరచ్చంద్రిక •—

ఉ ఆరయఁ బిండిభూమిపయి నాఱఁగఁబోసినయట్టులుఙ్ఞ దధిన్
బోరగిలంగఁ బోసినటు పుష్పచయంబుల నొక్కకుప్పగాఁ

జేరిచినట్లు సున్నమును జిల్కినయట్లుగఁ గానిపించె నా
శారదరాత్రులందు వికసన్నవసౌరభచంద్రచంద్రికల్.

—• ప్రకృతావధానముల ప్రస్తుతావస్థ •—

చ. పరువము తప్పుచుండినను బాయక నన్నిది వేచుచున్న దీ
వరుసగ నెన్నియేఁడ్లు గడపన్వలెనో యిఁక సన్యసింత మం
చురువడి బుద్ధిపుట్టు నటు లుండియు రాజులు పిల్చినప్పుడో
మరల జనించు దానిపయి మాననితీపి శతావధానికిన్.

—• అవధానాంతమునఁ జెప్పిన పద్యములు •—

ఉ. కొప్పరపుం గవీశ్వరులకోసము, వెంకటరామకృష్ణులన్
దప్పఁడుత్రోవనుండి సుపథమ్మునకున్ మరలించుకోసముం
దప్ప మఱొండుకోసరము తావకభారము పూనలేదు నీ
కప్పని తీర్చుకోర్కె యిఁక నక్కఱలేదు శతావధానమా!

సీ. సూర్యపత్నివిగాన సూర్యకించనతాత
పచ్ఛాయ యని పేరువడసినావు
రావువంశ్యవుగాన "రావుకష్టములాశ్రి
తుల"కన్న ప్రఖ్యాతి నలరినావు
వెల్లంకివంశ మావిర్భూతికృతిగాన
దుష్టపిశాచికాదూరవైతి
చెల్లయాంబవుగాన నెల్లవారును గల్వ
వల్లి చెల్లెలునాఁగఁ బ్రబలినావు
తే. గీ. పీఠుసాటి జమీందారు వెలఁతలెవరు
నిరుపమానగుణాలంబ నరకదంబ
నుత్యమానయశఃపూర సత్యవీర
శ్రితబహుకుటుంబ శ్రీరావు చెల్లయాంబ.

సీ. పూటపూటకు నొక్క పుట్టెడుబియ్యమ్ము
పాచకప్రకరమ్ము వంటవండె

హారిదాససుకవిగాయకసమూహములకుఁ
బర్జన్యుఁ డెఱుఁగని పంటపండె
సహనంబులేక దుస్తంత్రిముల్పన్ను దు
ర్మార్గుల కడుపులో మంటమండె
నతిభక్తియుక్తులై యాశ్రయించినవారి
కెల్లయభీష్టమ్ము లింటనుండె
తే. గీ. నేఁటి కఱువడియేండ్లను నీకు నిండె
నెల్ల యుత్సవములును జేయించుచుండె
నీవధూమణి రామమాంబావధూటి
శ్రితబహుకుటుంబ! శ్రీ రావు చెల్లయాంబ! తి. శా.

—• సెలవుసమయమునఁ జెప్పినవి •—

శా. మీరిప్పించు బహూకృతిన్‌గొని మదిన్ మీ మేల్గడుం గోరి మీ
సారజ్ఞత్వము నాత్మ మెచ్చికొని యిచ్చన్ సారెకున్ మీమహో
దారత్వమ్ముగణించి బందరుకు ఛాత్రిశ్రేణితోఁగూడ నే
నీ రాత్రిం జనుచుంటి శ్రీజనమతల్లీ! తల్లి! చెల్లాంబికా. వెం. శా.

శా. సంతోషమ్మునఁ దా మొసంగిన లసత్సమ్మానముంగొంచు మీ
కెంతే దీవన లిచ్చుచుఞ్ వదలలే కెట్టెట్టులో మీ పుర
ప్రాంతంబున్ బెడఁబాసి కాకపురికిం బైనంబుగావించు నా
యంతేవాసుల నన్నుఁ బేర్మిఁ గనుమమ్మా, రామమాఁబామణీ. తి. శా.

# అనుబంధము

1. శతఘంటకవిత్వము చెప్పుట మిగుల నరుదైనకార్యము. ఈ యాంధ్రదేశమ్మున నిట్టిపనులు చేసెడివారిలోఁ బ్రసిద్ధులు శ్రీమాన్ మాడభూషివేంకటాచార్యులవారును బ్ర॥ శ్రీ దేవులపల్లి సుబ్బారాయశాస్త్రిఁ తమ్మన్నశాస్త్రిగార్లును నైయుండిరి. పైవారు బాల్యవయస్సులోఁ బ్రస్తు తపుఁ బండితులవలె నీతంత్రమును సమర్థించినట్లుగావినము. ఇది బహు కష్టతరమగుపనియును బూర్వకవులలోఁ గూడ నొకరిద్దరిచే మాత్రమే చేయఁబడినట్లును గానుపించును....ప్రస్తుతపుఁబండితులు తర్క వ్యాకరణము లలో మంచి సమర్థులగుటచేత వీరు కేవలకవులుకాక విద్వత్కవులనియున్ జెప్పఁదగియున్నారు. వీరిఁబట్టియే వీరిగురువులగు బ్ర॥ శ్రీ॥ చర్లబ్రహ్మయ్య శాస్త్రులవారి పాండిత్యాదిక మూహింపవచ్చును........ఈయిరువురు పండి తులును.........శ్రీబాపము వెంకటరత్నముగారియింట నొకపరియును అష్టావధానముచేసియున్నారు. అందలి విశేషములు మఱియొకసారి ముచ్చ టింపఁదలఁచి యిప్పటి కీయుదంతము సాంతంబు చేసెదము........

(రాజయోగిపత్రిక)

చ. సురుచిరమాధురీమహిమశోభిలుచుండెడి యాశుధారచే
సరసులమానసమ్ములనుసస్యములెల్ల నిగుర్పఁజేసి పెం
పలరఁగఁ గోనసీమను మహాప్రతిభం గవి తేజరిల్లు నీ
తిరుపతివేంకటేశకవిధీరుల నెంచ విరించి శక్యమే.

.... .... .... .... ....

క. ధారుణి వీసద్యశ మే
పారెడు వరతారహీర హారాబ్జలస
చ్ఛారద నారదనారద
పారదముల గెల్చుచున్ సభాస్థలినెందున్.

విధేయుఁడు,

భాగవతుల కృష్ణశాస్త్రి. (అనియున్నది.)

3. శతావధానాటవిం జెండాడఁదగు. వీరి కవితాధార కిడియొక యడ్డని కాదు. వీరలు పదిశ్లోకమ్ము లెంతలోఁ జెప్పుదురో యను కుతూహలమ్ముచేతనే కోరితిని. అవి వారిరుపది నిమిషములలో నెరవేర్చిన సంగతి యిత్తటి యెల్లరి హృదయమ్ములకుఁ దేటతెల్లమకదా!

(దేశోపకారి పత్రిక)

4. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును దివాకర్ల తిరుపతి శాస్త్రిగారును విజయ సం॥ ఆషాఢ బ ౯ ఆదివారమురోజున నీబందరు పురమ్మున జరిగించిన శతావధానంబునను అష్టావధానంబునను గొంద అనేకభంగుల భంగములు కలుగఁజేసినను భంగములేమింజేసి వారిపైఁ దాత్పర్యపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. మాయలుగావు చూడఁగను మర్మ మొకించుక గానరా దిదే
చాయఁ బరీక్షచేసినను సభ్యులు కొందఱు సంశయాత్ములై
కాయము వాక్కుఁ జిత్తమును గట్టినిరోధముచేసి సద్గురుం
బాయక చెందు విద్యయని పల్కరు నామదిలోఁ దలంచెదన్.

చ. పురుషుఁడుగానిచో యశముఁ బొందఁడు సత్సభనంచు నెంచి తా
సరసిజపాణి శారద విశాలమనమ్మున నిర్ధరిత్రి నీ
తిరుపతి వేంకటేశు లను ధీరకవీంద్రుల రూపమొంది స
త్పురుషభాగ్భలన్ యశముఁబొందుచు నున్నదటంచు నెంచెదన్.

విధేయుఁడు. చల్లపల్లి రామచంద్రయ్య. (అనియున్నది)

శ్లో. యదపిహి గురువాక్యసక్త చిత్తౌ
తిరుపతి వేంకటశాస్త్రిణౌ వ్యధత్తామ్
త దధిగత కలాకలాపకానాం
హృది విధీధిత మహాద్భుతం బుధానామ్.

శ్లో. ఆశ్చర్య మేత దనణిష్ఠ మహో యదేతా
వష్టావధాన సరణిం సముపక్రమేతే

యచ్ఛబ్దశాస్త్ర జలధే రవధి ర్జగాహే
స్థిత్వాపి హంతవయసి ప్రథమప్రధానే.

శ్లో. సాహిత్యరీతి రనయో రభివర్ణనీయా
హంతా నుయుక్తశతపద్యవిధానకాలే
సాభక్తిరచ్యుతతరాత్మగురావుతస్యా
త్స్వోపాస్యదైవతవరోజనిసంస్కృతిర్వా.

శ్లో. శాబ్దంశాస్త్రం సకల మధికృత్వాత్మమేధామహిమ్నా
విద్వద్గేయం దిశి దిశి సమాసాద్య దీప్రం యశశ్చ
ఆచార్యాణామపి సుచరితం వ్యాపయద్భ్యామమూభ్యాం
మాతాపితౄభ్యాం స్సుకృత మధికం ఖ్యాపితం భాగ్యవద్భ్యామ్.

శ్లో. జనిత్వా కింనుస్యాత్కిమపియదిశాస్త్రం నవిదితం
న శాస్త్రేణా స్త్యర్థోనతు యది సదాచారనిరతిః
తయా నాప్యస్త్యర్థోనయది వినయో నో చతురతా
పరం తత్సా నేయం దధతి పద మస్మిన్ కవియుగే.

శ్లో. ఏకస్మిన్ క్షణమపి బుద్ధియోగభాజో
యోగీంద్రా ఇతి మహ దద్భుతం వదంతి
జ్ఞప్తిస్సా కథ ముపవర్ణనీయశక్తి
ర్యత్రాష్టౌమతి మధిరోరుహత్యథార్థాః.

శ్లో. ఏతాదృక్పటుతరధీపథప్రచారౌ
ధీరేంద్రౌ తిరుపతివేంకటాభిధానౌ
విందేతా మధిక మితో యశోవిభూతిం
నందేయు ర్విబుధవరా యథావిదిత్వా.

శ్లో. బృందావనే వాసవతా పురేఽస్మిన్
హిందూకలాశాలికపండితేన
రంగార్యకేణాఖ వినిర్మితేయం
పద్యావళీ సూనృతవాక్యహృద్యా.

## విద్యావిచిత్రములు.

6. దివ్యజ్ఞాన సమాజముయొక్క హిందూదేశశాఖకు సహాయకార్య దర్శియగు సిడ్నీ. వి. ఎడ్జి. దొరగారు ఈనెలలో నిచ్చటికి వచ్చినపుడీ కవీశ్వరులయద్భుతశక్తి కానందమునొంది యీసంవత్సరము డిశంబరు నెలలోజరుగఁబోవు దివ్యజ్ఞాన సామాజిక సాంవత్సరికోత్సవమునకుఁ బ్రీతిపూర్వకముగా నాహ్వానముచేసిరని విని యెంతయు సంతసించు చున్నారము.

ఇప్పుడిరువది సంవత్సరములకంటె మిక్కిలి యధికముగాని వయస్సుగలిగి సంస్కృతవ్యాకరణమందుఁ గాకినాడ, బందరు, మొదలగు పురములలో సుప్రసిద్ధులగు పండితులచేతఁగూడ శ్లాఘనీయమైన ట్లింగిక రింపఁబడి ఆంధ్రగీర్వాణ భాషలయందు మృదుమధురరీతిని మహాసభలలో శతఘంటకవిత్వము చెప్పుటయేకాక, అష్టావధానము వ్యస్తాక్షరి ఆకాశ పురాణము మొదలైన వైచిత్ర్యములచేఁ గూడ విద్వద్బృందములను మెప్పించి యిదివఱకే విద్వత్కవులని బిరుదొందిన బుద్ధిమదగ్రేసరు లిద్దరినిగూర్చి యెవ్వరైనను మిక్కిలి యుల్లాసముతోనే చదువుదురని నమ్ముచున్నాము. దివాకర్ల తిరుపతిశాస్త్రులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులు అను నీకవీశ్వరులు శతఘంటకవిత్వము చెప్పునపుడు, ఇద్దరిలో నొకరు ప్రథమచరణమును రెండవవారు ద్వితీయచరణమును తిరిగి యీవిధము ననేచెప్పి పూర్తిచేయుదురు. వీరి కవిత్వము పరీక్షించినచో పైనిచెప్పిన విధముగా నిద్దఱు చెప్పినట్లుగా పట్టుపడఁదగియుండదు. శతఘంటకవి త్వము అనఁగా నూఱుమందిజనులు వారివారి యిష్టమునుబట్టి కోరెడు నొక్కొక్క విషయమునుగూర్చి వారువారు నియమించెడి వృత్తములలోఁ గవిత్వముచెప్పుట. ఎవరు ఏయంశమునుగూర్చి యేవిధమైన పద్యము లను చెప్పుమనికోరినదియు జ్ఞాపకముంచుకొని యొక్కొక్కచరణము చెప్పుచువెళ్ళి తిరిగియు నేమియు నడుగకుండనే మొదటినుండి చివర వఱకు నెవరుకోరినపద్యములు వారికిఁ బూర్తిగాఁ జెప్పుచుండవల

యును. ఈకవులు సంస్కృతాంధ్రభాషలు రెంటియందును ధారాళముగ నాశుకవిత్వమును పైరీతిని జెప్పఁగా మే మీ పట్టణమున నాలుగైదుచోట్ల ప్రత్యక్షముగా కని వినియున్నాము. వీరిక్కడఁ జెప్పిన శ్లోకము లుకొన్ని యిందు వ్రాయుచున్నాము. వ్యస్తాక్షరి అనఁగా యేభాషలో నైనను ఒక వచనములోనివికాని పద్యములోనివికాని మాటలకు సంఖ్యలు వేసి వరుసవెంబడిని గాకుండ చెల్లాచెదురుగా ఒక్కొక్క మాటను దాని క్రమమయిన సంఖ్యసహితము కాగితపుముక్కలమీఁద వ్రాసి వీరు అష్టావధానము చేయుచున్న సమయములో నప్పుడప్పు డిచ్చుచురాఁ గాఁ జివరకు నాయామాటలను తిన్నగా కూర్చి యొప్పగించుట. ఈ పట్ట ణములో (1) యిష్, వైజ్, నిష్ట్, వాన్, సోల్, యెన్,బిడాయిటెన్టు, డాస్, యిష్, యిష్, సో, ట్రవరిష్, బిన్, అయెన్, మెర్కెన్, హౌస్, యెల్టెన్, లైటెఞ, డాస్, కంపెట్, నూర్, జౌస్, డెన్ అను జర్మనీ భాషయు (2) యూయం, తత్ర, సిడౌన్, తథాపి, వెరివెల్, తస్మా, న్మమాయా, శశీ, నోగోసార్, మదరాసు, కాయకరితం, హింగేందు, బాయేంచునం, నింగత్పూరయ, నింగకూచ, విడుదల్, నీవాడ నంటిం, గదా, కిస్వాస్తేమయిబో ల్తహూం, అజి, సునో, తక్సీర్, న, మేరే, ఉపర్, అని నానాభాషలలోని మాటలతోఁ గూర్పఁబడి "మిసలేని యస్ బలే శ్లోకమ్" అని నామధేయమీఁదగిన శార్దూలవిక్రీడిత రూపశ్లోకమును (3) హిందూ హైస్కూలులో ప్రధాన సహోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ ముత్తుఅయ్యరు గారు వీరిశక్తి నర్జునుని బాణవర్షముతోఁ బోల్చి వర్ణించుచు నూతనముగా రచించిన "అట్టావదానిగళ్ శెయ్యవల్లే మెన్ డ్రవై పుహూందు। తట్టామ లేశిలర్ తత్తళిప్పార్ విల్లితన్ శరంబోల్। ఎట్టెపుహూండుర్ పిన్నెట్టెట్టె ట్టెట్టింగివరై యొప్ప। ముట్టాదు శెయ్యవల్లారిల్లె యేయింద మొయిణిలత్తె" అను ద్రావిడభాషా శ్లోకమును వ్యస్తాక్షరి కొఱకుపయోగింపఁబడఁగానీమహా ప్రవీణులు క్రమమయినరీతిని జెప్పిరని వ్రాసినచో వీరల సామర్థ్యమును మాచదువరులు గ్రహింతురుగాక. ఆకాశపురాణము అనఁగా సభికులలో నొకరు ఏకథనైనను వినిపింపఁగా దాని నాధారముచేసికొని యీ కవులలో

నొకరు గ్రంథమును చదువుచున్నట్లుగా నప్పుడే కల్పనచేసి పద్యములను జెప్పుచుండఁగా రెండవవారు పురాణమును జెప్పుచున్నట్లు ఆ పద్యముల కర్థముచెప్పుట, నోబిలు కాలేజీలో బైబిలులోని యొక యితిహాసమును పేర్కొనఁబడినవి.

ఉపాధ్యాయోపయోగినీ పత్రిక

7. I am very pleased to add my testimony to the ability of versification and extraordinary powers of memory shown by the two pandits Challapilla Venkata Sastri Garu and Divakarla Tirupati Sastri Garu. I was especially struck by their readiness to extemporary poetry on all sorts of subjects.

Noble College
4th September, 1893.

(Sd.) Willam C. Penn, M. A.
Professor, History.

---

8. I was much pleased with the skill in versification and the wonderful powers of memory displayed by the two poets Ch. Venkata Sastri Garu and Divakarla Tirupati Sastri Garu, especially on the occasion of a meeting in our College Hall, when they exhibited their powers before a large audience.

Masulipatam.
15th September, 1893.

(Sd.) H. J. Tanner.
Ag. Principal, Noble College.

---

9. I have witnessed a public exhibition by Tirupati Sastri Garu and Venkata Sastri Garu of their wonderful power of astavadhanam or faculty of attending to Eight different things at a time.

I consider their power a very wonderful one and every one should avail himself of the opportunity of witnessing an exhibition of it.

These gentlemen while possessing the faculty of composing verses can also commit to memory words and sentences of foreign languages.

Masulipatam,
18th September, 1893. (Sd.) Sydney V. Edge.

---

10. I was present at an entertainment given by Ch. Venkata Sastri and D.Tirupti Sastri and derived great pleasure from their feats of memory. Professor Loisette must look to his laurels.

Masulipatam.
18th September, 1893. (Sd.) J W Hughfs
Assistant Collector.

---

11. I have much pleasure in stating that I was present at the remarkable exhibition given by D. Tirupati Sastri and Ch. Venkata Sastri, of the powers of memory they possess. It entirely excelled any thing I should have thought possible. Judging by ordinary standards and in additicn to feats of memory the sastries showed great powers of improvising verse in difficult metres and nimble wit in repartee.

Adyar, Madras.
28th December, 1893. (Sd.) Annie Besant.

---

## ప్రకటన

12. ఆర్యులారా! నెల్లూరు హిందూమహాజనసంఘమువారివలన శ్రీ విజయ సంవత్సర పుష్య శు ౧౫ ఆదిత్యవాసరమున పగలు మూడుయామములు మొదలు సాయంతనముదనుక నొక విద్వత్సభ జరిగించఁబడెను.

అందు గోదావరీమండలమునుండి విచ్చేసిన యిరువురు బాలసరస్వతులునాఁ దగిన పిన్నవయసులోనుండి శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన

విద్వత్కవి బాలకలానిధు లను బిరుదువడసిన బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిలవారిచేతను చెళ్ళపిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలవారిచేతను అష్టావధానము అతివిచిత్రముగఁ జేయింపఁబడెను. అందుఁ జేయఁబడిన యవధానము లీక్రిందఁ బొందుపఱచఁబడుచున్నవి.

౧. తొమ్మిదిమందికి వారువారు కోరుకొనిన వర్ణనలు వారువారు కోరుకొనిన శ్లోకపద్యములలో వారు ఏర్పఱచిన నియమములతోడను తెలుఁగున సంస్కృతంబున వారు నిషేధించిన యక్షరములు రాకుండ నవలీలగ నొక్కొక్క యక్షరమే చెప్పుమనినవారికి నొక్కొక్క యక్షరమువంతు నను మూడేసియక్షరములు గోరినవారికి నట్లేయును నొక్కొక్క చరణము చొప్పునఁ గోరినవారికి నట్లేయును మొదటి చరణము చెప్పుచుండ నంతట నిలిపి రెండవ మూఁడవ చరణములలో నొక్కొక్కపదము నడిగిన నట్లేచెప్పుచును నందులో నడిగినవారిచ్చిన నేదియో మూఁడక్షరముల పదమునుగూడఁ గల్పి చెప్పఁడనిన నట్లేయును నొనర్చుచుఁ గవిత్వము చెప్పఁబడినది.

౨. సభికులలో నొకరు యేదియో యొక జర్మనీదేశ చారిత్రము లోని యొక్క యితిహాసమును జదివి వినిపించిన నద్దానిని మనమందిడి కొని తిరుపతి శాస్త్రిలవారు సంస్కృతమున శ్లోకరూపముగ నొక్క పురాణముగా విరచించి రాగయుక్తముగ వినిపించుచుండ వేంకటేశ్వర శాస్త్రుల వారిచే నతిశాస్త్రీయ్యమ్ముగ దానికంతయు రాగయుక్తంబుగనే యర్థమ్ము వక్కాణింపుచు నాకాశపురాణము చెప్పఁబడెను.

౩. తెలుఁగు, అరవము, ఇంగ్లీషు మొదలగు నానాభాషలలోని పదములు ఇరువది క్రమముతప్పించి యొక్కొక్కపదమును దానికి వరుసలో నివ్వఁబడిన సంఖ్యసహితముగ నొక్క కాగితపుముక్కమీఁద వ్రాసి మధ్యమధ్యనిచ్చుచుండ నవియన్నియు వరుసగా మనస్సున నమర్చికొని యవధానాంతమందుఁ దప్పకుండఁ బ్రతిపదమును వినిపించుట యనెడు వ్యస్తాక్షరియును జేయఁబడెను.

౪. అనేకమారులుగ వేయివేయిసంఖ్యలుగ కనుజాటుగఁ గొట్టఁబడిన గంటల మొత్తము తప్పకుండ నెనుబదియొక్కటి యని చెప్పఁబడియె.

౫. వ్యాకరణశాస్త్రములో నొక పండితునితో శాస్త్రసమ్మతముగఁ బండితజనానుమోదమ్ముగఁ బ్రసంగంబు చేయఁబడెను.

౬. రఘువంశమ్ములో నొకవిద్యార్థికి నొక్కశ్లోకము క్రమముగాఁ బాఠముచెప్పఁబడినది.

౭. లోకవిషయములు చమత్కారముగ సయుక్తికముగ మధ్య మధ్య సభానురంజకముగ నడిగినవారితోడనెల్ల ముచ్చటింపఁబడినవి.

౮. చతురంగములో బాగుగనాడఁగలము అని పేరువడసిన యొక యిద్దరు గొప్పవా రొక్కప్రక్కనుండి యాడఁగ వారితోనాడి గొప్పగొప్ప మొహరాలనుగూడ నోడించి యెత్తులనడిగిన నిచ్చుచు నాడఁబడినది.

ఈ యవధానము లన్నియు నేలోపము లేక సమాప్తినొందిన పిదప సభ నాదరించి వచ్చిన విద్వజ్జనులలో బ్రహ్మశ్రీ గాదేపల్లి వెంకటరామ శాస్త్రులవారును బ్రహ్మశ్రీ పురుషిళ్ళ ఆదినారాయణ శాస్త్రుల వారును వేంకటగిరినుండి వచ్చిన బ్రహ్మశ్రీ వేమూరి శ్రీరామశాస్త్రులవారును సంస్కృతాంధ్రములలోఁ దమతమ సంతోషములఁ దెలుపుచు నుపన్యాసము లిచ్చిరి.

కుప్పచ్చి లక్ష్మయ్య, పెన్‌షండువోవరుసీయరు,

చ. అలరఁగఁజేసె నీసభ, నయారె! మహామతి వేయినోళ్ళతోఁ
జిలువలఱేఁడు వేఁడుకను శ్రీహరిసన్నిధి మాటలాడులా
గలవడ నేఁడు గోపవసుధాధిపు సన్నిధియందు సజ్జనా
వళులమనంబు లద్భుతము పాల్పడ వేంకటశాస్త్రి యెంతయున్.

బిరుసరాజు శేషాద్రిరాజు.

14. బ్రహ్మశ్రీ వేంకటసుబ్బాశాస్త్రులవారి యుపన్యాసము.

శ్రీమన్మహీమండల మండనాయమానే వేంకటగిరినగరే విజయసం వత్సర మాఘశుద్ధ చతుర్దశ్యాం మహారాజరాజశ్రీ వెలికాని వేంకటగోపాల రాయచరీకృతాయాం బుధజనవిరాజితాయాం మహాసభాయా మస్యాం శత ఘంటాకవిత్వ పారావారసంజాతకీర్తి శీతభాను ధవళీకృతదిగంతాభ్యాం పండితకులావతంసాభ్యాం తిరుపతివేంకట కవికులశిరోమణిభ్యాం విరచితం విశ్వాతిశా య్యష్టావధాన మవలోకయతా మస్మాకం సంజాత మానందాతి శయం వర్ణయితుం ద్విసహస్ర రసనావిలసద్వదనారపిందో౽నంతో౽పిన సమర్థ ఇతిమన్యా మహే వయ మేతత్పట్టణవిరాజమానా విద్వన్మణయః.

శ్లో. గోదావరీపరిసరా దిహచైత్రవంతా
నస్మాన్ స్వవాగమృతపూరతరంగమగ్నాన్
ఏతౌసమాచ కలతాం కిల దుష్కవీనాం
వాగాతపేన పరితాపిత కర్ణయుగ్మాన్.

శ్లో. సంధ్యాకాలనటన్మహానటశిరోదోధూయమానామర
స్రోతస్విన్యుదయత్తరంగవితతే ర్భంగ ప్రదా గుంభనాః
జాయంతే భువి కస్యవా తిరుపతి శ్రీవేంకటప్రాజ్ఞయో
ర్మృద్వీకాకదళీ సితామధురిమ సంవాదినీనాం గిరాం.

ఉ. పావని ! యొక్క స్నానమునఁ బాతకముల్ హరియింతురెంటిచేన్
ధీవరుఁ జేతువంచు జననీ ! నినుఁ గూర్చిన పల్కులెల్ల సం
భావనఁ జేయఁబుట్టిరి ప్రభన్ గవులిర్వురు, నీకిఁకేమి గో
దావరిః నీమహత్త్వములఁ దల్పఁగ నేరికి శక్యమిద్ధరన్ః

విజయనగరము, 20—9—95

తురగా వేంకటాచలము.
బి. యే. క్లాసు.

## 16. INTELLECTUAL GYMNASTICS.

(Reprinted from the Telugu Harp Dated 20th Sep 1895.)

The week has itself signalized by the advent here of the two famous impromptu poets Messrs. D. Tirupaty Sastry and Chellapilla Venkata Sastry of the Godavary District. On Saturday afternoon the 14th instant the upper hall of the Maharaja's College was a great centre of attraction, as our learned Visitors were to give their maiden performance in Vizianagaram. The assembly was a large and representative one and included most of the elite of the town. The poets are both very young men, evidently little above twenty. Both are simply clad and unassuming manners. As regards personal appearance, they are remarkably swarthy for Brahmans, but have pleasing intelligent faces and one of them in particular possesses prominent well developed nose that is so often the index to a clever brain. The performance on saturday was a capital proof of what these gentlemen could do in poetic line. Among the audience were many both able and willing to put them through their faces and trot them up and down the slopes of Parnassus. Twenty-five gentlemen were selected to do so and right vigorously did they perform their parts as will be seen from the miscellaneous character of the subjects they prescribed for versification. Each wrote on a sheet of paper the subject of a stanza as well as the particular metre and rhetoric required. One of the poets then began to extemporise the first line of a verse on each subject and after finishing the whole round twenty five, was called upon to supply the next lines not in the order in which the first were given out; but in a random and haphazard way which was enough to drive a person of ordinary intelligence crazy. This crucial test was devised by Mr.K. Ramanujachariar M.A;B.L: the learned Principal of the college, who before he

entered upon his distinguished career first as a student and then a teacher of English Literature had already won his laurels as a Sanscrit and Telugu Poet. The difficulty of the test was however completely surmounted and the first poet left it to his learned colleague to supply the remaining lines of the stanzas. This was done with equal success the glibness which the two hands dealt with these subjects being simply marvellous. Both in Telugu and Sanscrit their achievements caused astonishment and delight and they are justly looked upon as prodigies.

The following Sanskrit Slocas were read by Pappu Sastri

శ్లో. ఇమౌకవీశ్వరావుభౌ సమౌఫణీశ సన్నిభౌ
వరౌ ప్రశస్తవాక్సుధా భరౌ నిరస్తకాపథౌ
సమస్తపండితస్తుతప్రకీర్తిమండితౌ సదా
సదస్స్వవోత్కృపా స్వయం వికస్వరేపరస్వతి.

శ్లో. సహస్రవక్త్రోద్గతవాక్ప్రవాహ
ధాతుర్విధాతుః కృతచిత్రసృష్టేః
ముఖే కవిభ్యాం బహూపక్త్రితాయా
భారోజరాగ్రస్తమతేర్బభూవ.

17. శొంఠి భద్రాద్రిరామశాస్త్రిగారు రచించిన శ్లోకములు.

శ్లో. శ్రీజగ్గరాయాధిపతే స్సభాయాం
విధిత్సతోమంజు శతావధానం
కవీంద్రయుగ్మస్య సరోజయోని
శ్శతంశతంకిం విదధౌమనాంసి.

శ్లో. తిరుపతి వరవేంకటేశశాస్త్రి
ద్వయకృత సాధు శతావధానపద్యం
దశభిరిహగుణై కిమేకమేకం
గదితుమనాః ఫణిరాట్సహస్రవక్త్రః.

శ్లో. వేంకటేశ తిరుపత్యభిఖ్యయో
ర్నాన మేవ విదుషోస్సరస్వతీ
సంవిభజ్య తను మాత్మనోద్విధా
వర్తతే తదవధానసంవిధౌ.

శ్లో. గజాననషడాననౌ కిమథపర్వతో నారదో
రఘూద్వహయుగం భవే త్కిమథ తద్వితీయంభవేత్
సురేంద్రభిషజావహో గురుకవీకిమేతౌకవీ
ఇతిస్మహృదయేజనా భృశతరంహి సంశేరతే.

శ్లో. అష్టోత్తరశతనామభి రేతా వానర్చతుర్హి వాగ్దేవీం
తస్మాత్ఖలులేభాతే శతమష్టౌచావధానవర్యాణి.

శ్లో. శ్రీజగ్గరాయేంద్రసభాజనానాం
వితానరత్నప్రతిబింబితాని
చకాసతి శ్రీ మధురావధాన
సముత్కచిత్తా ఇవషేవరేంద్రాః.

శ్లో. శ్రీజగ్గరాయాధిపతే స్సభాయాం
యౌసంవిధత్తా మవధానయుగ్మం
తావేవచేత్త త్ప్రీతిభావిశేష
ముద్యోజయేతాం విపరీతమర్హౌ.

శ్లో. అచీకరద్య స్త్వవధానయుగ్మం
యేచాస్యజామాతృ సుతాదివర్గాః
యౌసంవ్యధత్తాంసచ తేచతౌచ
భూయాసురారోగ్య శతాయురాఢ్యాః.

18. సత్యవోలు సోమసుందరకవి విరచితములు.

చ. తిరుపతివేంకటేశ్వరుల దివ్యకలామహిమానుభావ మీ
తిరుపతివేంకటేశ్వరుల ధీవిలసత్ప్రీతిభావివర్తమై
పరిణతిచెందెఁ గాన రసవత్కవితాష్ట శతావధాన వి
స్ఫురణము మీఱె వీరలకు సూరిజనప్రభుః జగ్గరాడ్విభూ.

మ. వితతప్రజ్ఞ శతావధానతయు నేవేళన్ సహస్రావధా
నతయున్ గల్గిన వీరి చిత్తమునకే నాళీకనామంబులా
శతపత్రంబు సహస్రపత్రమనుటల్ సందర్భమౌఁగాక స
మ్మతమా ! యెల్లెడ మానసాబ్జమను సామాన్యోక్తి చర్చింపఁగన్.

సీ. ఎవరేమి వృత్తంబు లెన్నెన్నికోరిన
నాశుగా శ్లోకంబు లపుడె చెప్ప
నెవరెట్టికల్పన లెన్నెన్ని యిచ్చినఁ
జయ్యన పద్యముల్ చదివివైవ
నెవరేమివర్ణన లెలమితోఁగోరిన
నిమిషమాత్రమున వర్ణించిపలుక
నెవరేసమస్యల నింపుగా నొసఁగిన
నంతలో నవియెల్ల నలరఁగూర్ప
గీ. వీరిలో నొక్కరొక్కరె విమలధీరు
లిద్దరును గూడియున్నచో నెన్నఁదరమె
సరసతిరుపతి వేంకటేశ్వరులమహిమ
రావుకులదీప ! శ్రీజగ్గరాయభూప.

(Stamp of Gudwal Samastanam)

19. At the Sabha held at Gudwal in my presence on the 21st February 1896, two pandits named Brahmasree Chellapilla Venkata Sastri garu and Brahmasree Divakarla Tirupati Sastry Garu showed their skill in performing Satavadhanam. 57 persons seated in a row. They began one after another to give the poets subjects on which to compose verses. The subjects named by each member was chosen by him then and there. Some of the members asked them to compose Sanscrit verses and others Telugu. The pandits performed their task in the following manner.

Beginning with the first member they gave him first cherna of the verse on the subject given him; then proceeding to the next they gave him the first charna of the verse composed on his subject and in the same manner they gave the first charnas of the verses to all the other members in the order in which they had been given; after this they gave the members one after another the 2nd charnas of the verses; when this was finished they gave the members in the same order the second halves of the verses. The verses both Sanscrit and Telugu were of different metres. I was much pleased with the skill in versification and the wonderful power of memory displayed by the two Pandits.

(Stamp of Rajah in Parshi.)

GUDWAL,
9th March, 1896.

*Raja of Gudwal Samstan.*

చ. కరువలి పట్టియు న్నిషధకాంతుఁడు స్వర్గమునంటునట్టి పా
కరచనమించిరంచు మఱిఁ గఱ్ఱలుకూడఁ జిగిర్చెనంచు నం
దఱను టె కాని చూడముకదా ? మునుపెప్పుడొ చక్రపాణి సుం
దరియయి తీపిబువ్వనిడెఁ దా నమరాళికటంచు వారికే
సరసిజవైరియున్ సుధనొసంగెనటంచనుగాని గ్రంథముల్
తరిచి నిజంబొ కాదొ యిఁక దాని గనుంగొనువారులేరు గా
పురినరసాపురంబునను మొన్నను మీరు రచించినట్టి సుం
దరకవితాచమత్కృతి యొనర్చినవిందెటు సెప్పవాఁడ నె
ల్లరకును మోదమిచ్చె సకలంబగు శ్రోత్రులమోహపుచ్చె న
చ్చెరువును నించె మీకవితఁజెప్పఁదరంబె సుధోపమాన మో
తిరుపతివేంకటేశ్వర సుధీమణులార ! కవీంద్రులార మీ
యిరువురి పద్యముల్ పుడమినెల్లెడ నిల్చెడు శాశ్వతంబుగన్.

తే. గీ. ఉభయకవిమిత్రకవితయం దొకటిగాన
మర్థహీనంపుఁ బద మని యందుఁగాదె

ఆశుకావ్యంబునందైన సన్లైచెప్పి
మించి శిపు డీ యుభయకవిమిత్రు లౌర.

28th july 1896; (Sd) K. Narasimham,
Narasapur.

సీ. 'ఏభవ్యగుణులు' దేవీభాగవతము సు
ధీమణు లలర నాంధ్రీకరించి
రేసత్యరతులు కాశీసహస్రము సంస్కృ
తంబున వ్రాసి యశంబుఁ జెంచ
రేకవుల్ ధాతురత్నాకరంబు నొనర్చి
యందఱ కుపకార మాచరించి
రేమహామహులు కవీంద్రులెల్లరు మెచ్చు
కొను శ్రవణానందమునురచించి

గీ. 'రేమహాకవిసింహుల' నామము విని
యెడఁదఁ గుకవులు గడగడవడఁకుచుంద్రు
రట్టి తిరుపతివేంకటాహ్వయుల నెన్న
నలవియే మర్త్యమాత్రుల కవనియందు.

పాలతేరు 16–5–09.

ఇట్లు సుకవిజనవిధేయుడు,
వాహినీపతి సూరకవి.

శ్లో. తత్తాదృక్షౌ కవితాసుత్త విపక్షౌ లసత్ప్రజ్ఞౌ
వ్యాకరణపారగౌ వాజ్ఞ్నాకధునీసదృశ మమలహృదయంచ.

శ్లో. శ్రీమచ్ఛతావధానాష్టవధానాది ప్రశస్తవిషయేషు
శ్రీమత్తిరుపతి వేఙ్కటరాజౌ ప్రథమగణనార్హౌ.

శ్లో ఏతావ్రుక్కవిరాజౌ నపురాదృష్టౌ మయానచైవాన్యైః
జయతస్తిరుపతివేఙ్కటకవివర్యౌ కుకవిహస్తిపంచాస్యౌ.

శ్లో. కాశీసహస్రదేవీ భాగవతప్రముఖ సద్గ్రంథాః
స్వకపోలకల్పనాభిశ్చాంధ్రీకరణేన చ స్వచ్ఛం॥

శ్లో. పండితపామరముఖ్యాన్ సంతోషయితుంనిబద్ధ సద్దీక్షౌ
పరిభవతఆర్యౌ శ్రీమత్తిరుపతి శ్రీవేఙ్కటేశ్వరాభిఖ్యౌ.

శ్లో. ద్విజరాజౌ మద్దత్తం శ్లోకానాం పంచకంకృపయా
ద్విజరాజస్తంతుమివ స్వీకృత్యమహోముదం యాతాం.

పాలతేరు 16-5-1900 } పండితకవి ప్రియశ్రీదామరచిన వెంకటరాయః.

సీ. ఎఱుఁగని భాషలో నెరపె వ్యస్తాక్షరి
యహహ జ్ఞాపకశక్తి యని నుతింప
మాటలసందడి మఱపించి వాయించు
గంట లెన్నుటగాంచి గణుతిసేయ
నంతలోఁ జతురంగ మందెత్తువేసెడు
బుద్ధిచాతురిగాంచి పొగడుచుండ
కోరినపద్యముల్ కొనల నందీయక
ముందె చెప్పఁగ మోదమంది మెచ్చ
తే. గీ. నడుమను బురాణమును నర్థమడుగఁ జెప్పి
యౌర యష్టావధానము నాచరించి
మేల్మిఁబొట్టా పెదచ్చన మెప్పుగాంచి
రరసి తిరుపతివేంకటేశ్వర సుకవులు.

గజపతినగరం. దేవగుప్త సన్యాసిరాజు.

సీ. సంస్కృతాంధ్రమ్ములఁజక్కఁగమీప్రజ్ఞ
లనుజూపమోదంబుగను టెకాని
భాగ్యవంతులరీతి బహువిధసత్కార
ముల నాచరింపఁగఁ గలనెమీకు
విద్యాధికులభాతి విని మెచ్చుటయెకాని
సరసత నొప్పు తప్పరయఁగలనె
.... .... .... .... ....
తే. గీ. కుకవినికరంబుచాడ్పునఁ గూయఁగలనె
యేఁదునను మందుఁడను గాన నెఱిఁగి నాదు

చిన్ని విన్నపమాలించి యన్నలార
తగువిహితులార సుకవివతంసులార.

వి శా ఖ ప ట్న ము.
28—5—1900

వి ధే యుఁ డు.
మంతెన ఆదినారాయణమూర్తి పంతులు.

మ. ఇతఁ డాసేతుహిమాచలాంతర ధరిత్రీశానసంసత్స్థలీ
వృతదుర్వాదిజనోత్తమాంగపటలీవిన్యస్తపాదాంబుజో
ద్ధతిసంతోషితతన్నృపాత్తధనముక్తాహార భూమ్యాది స
త్కృతులన్ బేర్మివహించె నీసుకవిని న్గీర్తింపగాశక్యమే.

కేశనకుర్తి.
నిశ్శంకుల కృష్ణమూర్తి.

సీ. కడియమన్గ్రామంబు కాపురంబై యొప్పు
ధవళేశ్వరాన విద్యాభివృద్ధి
ఆసేతుశీతాచలాయతదేశంబు
వేఁడుకకై చూచు విపణివీధి
గద్వాలవిజయనగరమాది ప్రభు సభా
భవనముల్ క్రీడాభవనసమములు
నుభయభాషాకవిత్వోక్తి స్వభావసం
భాషణంబైన వాగ్భూషణంబు

తే. గీ. లే కవిగ్రామణికినొప్పు నెల్లయెడల
నట్టి వెంకటశాస్త్రి శుభాభిధాముఁ
డతులచతురతఁజేసె నష్టావధాన
మిప్పు డీపోలవరమున నొప్పుమీఱ.

చ. వడిగల వాక్ప్రవాహమును వర్ణనచేయుట కష్టమేమనం
గడియకు నూఱుపద్దెములఁ గల్పనఁజేసెడిశక్తి యుక్తికిం
గడియమువేయు రాజులకు గైవసమై దగుగేలు ముద్దుగా
విడివడి వచ్చుపల్కులును వెంకటశాస్త్రికె చెల్లియుండుటన్.

రెడ్డిపోలవరం.
వ్రాలు తెలియలేదు.

సీ. విజయనగరమున వేంకటగిరిలోనఁ
ప్రభులసమ్మానమ్ముఁబడసినావు
ఆత్మకూరు క్షితీంద్రార్పిత చంద్రిహా
రాది సత్కారమ్ము లందినావు
గద్వాలభూపాలకప్రదత్తంబైన
బంగారుపతకంబు బట్టినావు
ఆనేకిసంతిస్వహస్తాక్షరాంకిత
యోగ్యతాపత్రంబు నొందినావు
తే. గీ. మఱియు నితరమహీపతిమణుల పండి
తాగ్రిణులమన్ననకుఁ బాత్రిమైతివీవు·
"చంద్రునకు నూలి పో" గన్న సాటి నిద్ధి
గైకొనుము చెళ్ళపిళ్ళ వేంకటకవీంద్ర.
అనకాపల్లె. బులుసు పాపయ్యశాస్త్రి.

చ. ఘటికకు నూఱుపద్యములు కల్పననేయ సమర్థునాహ్వాయా
నటుల శతావధానములనైన నొనర్పఁ ప్రవీణుసంధ్య నా
నటదగజేశషాళి చలనభ్రిమదభ్రిధునీఝరీ సము
త్కటవచనప్రవాహు సముదగ్రిమహోభయసాహితీవధూ
విటుని సభామనోహరనవీనకథారచనాధురీణు ది
క్తటసముదీర్ణకీర్తిలతికాతతి శాబ్దికతార్కికవ్రిజో
ద్భటుఁబటుగానకోవిదుని బ్రాహ్మణసత్తము చెళ్ళపిళ్ళ వేం
కటకవిసార్వభౌముని దగన్ వినుతింపగ శక్యమే ధరన్.
ముక్కవిల్లి సాంబయనామకవి రచితం.

29. శ్రీమద్వేంకట పరబ్రహ్మణేనమః.

తే. గీ. వంగపెరటికి మసిబొమ్మవడువుదోఁప
వెంకటార్యుని సరసకవిత్వమునకు
దృష్టిదోషంబుదగులక దీప్తిగలుగఁ
బల్కెదనుగొన్నికొక్కిరి పద్యములను.

క. తిరుపతిఁ బాసిన వెంకన
స్థిరమతి వెంకనను బాయఁ దిరుపతి శోభా
కరతం బరగునె యనుద్వా
పరమెడయును నేఁడు మనకుఁ బరికింపంగన్.

ఉ. ఆశుకవిత్వమందు రసమబ్బుట దుర్లభమన్నయట్టి యీ
యాశ నిరర్థకంబనఁగనౌను స్వబాంధవ బుద్ధిచేత నౌ
నాశను లేనివాక్యముల నాడుటకాదు నిజంబువల్కెదన్
పేశల చెళ్ళపిళ్ళకుల వేంకటశాస్త్రిని నన్నుపార్యుఁగన్.

చ. యమకము నర్థగౌరవము నాళువు పేశలమైనశైలి పొం
కము రసపుష్టి సౌష్ఠవము కల్పన చాతురి వ్యంగ్యవైభవం
బమలత శాస్త్రసిద్ధతయు నాదిగగల్గు కవిత్వధర్మముల్
సమతనెసంగు చెళ్ళపిళ సత్కులవెంకటశాస్త్రి భారతిన్.

చ. ఉభయకవిత్వ తత్త్వనిధియున్ ద్రిముహూర్త శతావధానియున్
సభఁగలయట్టి సత్కవుల స్వాంతములం గరఁగింపఁజాలు వా
గ్విభవము గల్గువాఁడు గురువిద్యలకెల్లను బెన్నిధానమై
శుభకర చెళ్ళపిళ్ళకులసోముఁడు వెంకటశాస్త్రి యొప్పెడున్.

చ. ధనమనఁ బుత్రమిత్రపశుదారగృహాదికమౌనె వట్టి దం
ధనమిది శాశ్వతంబె "కవితా యది రాజ్యత అస్తికిం పర్యోజన" మితి సూక్తిచేత బుధసమ్మతమైన పచాద్యజంతసా
ధనమున స్నేహదంబు కవితాధనమే ధనశబ్దవాచ్యమౌ.

క. మనుగుడుపుల ముచ్చట లం
ఘనములఁ జెప్పికొననేల కవితాకష్టం
బునుబడితి కొన్నిదినములు
గనుక నితనికవిత కేను గౌరవమిడుదున్.

ఉ. నేను శతావధానము ననేక నృపాల సభాస్థలంబులన్
మానుగఁజేసి పెక్కు బహుమానములందితి శాంతినొందితిన్

మానసవృత్తి రోధకసమాధిని గావున నిద్ది నాగురు
స్థానమటంచు నెంచెదను స్వాంతము నిశ్చలమౌట దీనిచేన్.

చ. "దినమున కొక్క కబ్బమును దేటగఁ జెప్పెడువాని కొక్కరా
త్రిని నెడమీయఁగాఁదగునె తెంపుగ నూఱిటిఁ గూర్పనోపఁదే"
యనఁదగ దొక్కరే నిదురహానినిఁ బూనిన వానికేగతిఁ
మనమున స్ఫూర్తికిన్ బెఱదినంబున వచ్చును? నూఱుపద్యముల్.

తే. గీ. హద్దులేనట్టి వెంకటార్యమహిమంబు
నెన్న నామాటలకు శక్తియెట్లుగలుగు
నంతమింతయులేని యనంతమందు
దిరిగితుదిఁజూడఖగములకరయఁదరమె.

క. వియ్యంకుఁడు నాకగుటన్
నెయ్యమునన్ జెళ్ళపిళ్ళ నిర్మలకుల వెం
కయ్యకుఁ గట్నంబొసఁగితిఁ
జయ్యన నీపద్యమాలఁ జందిగుణముగన్.

క. త్వరితంబుగ నీఛందము
విరచించితిఁగాన నిందు విస్తృత దోషో
త్కరముండు దానిఁబెద్దలు
మఱచి దయారసముచేత మన్నింపఁదగున్.

ఉ. శ్రీమహాలక్ష్మిపాలితము సేవ్యము పండితకోటికర్థి సం
ఘామరభూజ మార్యజనతాదరణీయము శారదాపదీ
క్షౌమలమణ్డపంబు నగునంచుసుధీతతియిచ్చ మెచ్చును
గ్లాముప నెయ్యురార! తొవరాఁదలపూవుగఁ బూనుకాశికన్
నేమముతోడఁగొల్చి మదినిల్చిన కోర్కులనెల్లనంది యెం
తే మనవీనులందనదుతేజునరాజిలు పల్కుముత్తెపుం
గోమల కర్ణపూరములకుం దగువానిఁగఁజేసె నంచనన్
బూమెలుగావు వీని సరిబుద్ధిగలాఁ డలవేల్పునొజ్జ వే

మోములవాఁడితండె యగుఁ బూని యొకేతఱి నూఱుగంటముల్
నేమముదప్పకుండఁగ బలే! యటుకై తనుజెప్పెనౌర! యే
నోములనోచి గాంచిరొ తనూభవుగాఁ దలిదండ్రి లీమహా
ద్దాముఁడు వేఁకటేశ్వరుని దార్ఢ్యుఁడు గూర్పుచు గెల్పులీతనిన్
శ్రీమహాలక్ష్మి కొల్వుననుజేసెగదా? మనబోఁటివారికి
ట్లీమహనీయుఁడాదిగ ననేకులఁగాంచి వినోదమందు టెం
కేమెయిఁగల్గుఁగాన మన మేకముగా వచియింత మీపెకున్
దామరసాప్త జన్మఁడిడుత న్పచిరాయు వటంచు నిచ్చలున్.

ఉర్లాము. బంకుమల్లి మల్లశాస్త్రి.

శ్లో. భూమౌ కోపి న హీదృశ స్సుకవిరా ప్తే కాళిదాసాదయో
భూతా నోసమధీపరీక్షణవిధౌ ప్రత్యక్షతాం నోగతాః
ఊహ్యాః కి న్త్వనుమానత స్తదపి హా సత్సంశయాలంబనం
సో౽యం వెంకటసత్కవీందనిపుణః ప్రత్యక్షతా మశ్నుతే. ౧

శ్లో. లోకేయద్యపిసన్తు నామకవయ స్తేషాన్తునై తాదృశీ
రీతి ర్న్రిరసపద్యమాత్ర రచనాచాతుర్య ధుర్యాత్మనాం
అస్యాః శుస్ఫురదచ్ఛ నూతన మహాకావ్యామృతాంభోనిధేః
కోవావర్ణయితాస్తి వెంకటకవేశ్శేషం వినా మృగ్యతాం. ౨

శ్లో. లోకా స్సద్గుణచాతురీముపగతా సూక్తిప్రదా సుందరీ
సద్వృత్తా సరసా౽సమాసమగతా సాలంక్రియా శాలినీ
లోకానన్దవిధాయినీ సుకవితా నూనం హినోత్ప్రేక్ష్యతే
వ్రపే వెంకటసత్కవీశ్వరవరం నోచేదిదంకింభవేత్. 3

శ్లో. శ్రావం శ్రావమతీవలోలుపతయా శాతావధానీం గిరం
కర్ణాంద్ధికయా విదేశ విషయాంగస్తున్న శక్తావయం
ఇత్యేతన్మనసాతురాం సుజనతాం యా తద్విధిం కారయి
త్ర్యామోదం నయ తీశ్వరో౽వతుసదా తా మత్రి లక్ష్మ్యంబికాం.

వుర్లాము. చాగంటి సీతయ్యశాస్త్రి.

31. సంస్థానపండితులగు శ్రీమాన్ రంగాచార్యులవారిచే వ్రాయఁబడినది.

శ్రీ శోభనాద్రిస్వామిన స్సహాయోస్తు.

శ్లో. శోభనాచలశృంగారః శ్రీనృసింహావపుర్హరిః
సర్వదస్సర్వదాపాయాదప్పారాయమహీభృతః.

కృష్ణామండల మండనాయమాన నూజవీణ్ణగరాధినాథే శ్రీమన్నారయప్పారాయ ప్రభుతిలకపుత్రరత్నే సతతవిబుధగోష్ఠీ వినోదసహృదయహృదయే। పుత్రమిత్ర బంధుబృందప్రధాన పరిజనపరివేష్టితే। కాణాదపాణినీయాది సకల తంత్రపారీణపండితమండలీ పరిశోభితే। హూణభాషావిచక్షణై రధిగతసకలకలా కౌశలై రుపాధ్యాయా ద్యైతృబృందై రభినందితే। శ్రీరామచంద్రప్ప రాయ నామని నరపతిశేఖరే విజసభాభవన మలంకుర్వాణే। నృపవరానుదేశానుసారతః తథాస్థానవిపశ్చిత్ప్రవరై రభిచోదితః। అధిగతపాణినీ యాదితంత్రః। ఆంధ్ర గీర్వాణ భాషాద్వయకవితాకల్పనా కుశలః। గౌతమీసరిద్వర పరిసరవర్తీ శతావధాని బిరుదాంచితః। బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రీ సభాజనసంతోష సంధాయినీం। ప్రష్టృజనాభిలషిత పరిపూరణ కుశలాం। ఆంధ్రపద్యపంచాశతం। అపిచ అతివిచిత్ర వృత్తఘటిత గైర్వాణ పద్యపంచాశతం దినత్రయపర్యాప్తేనకాలేన అనతి పరిశ్రమ భాజాప్రయత్నేన విరచయన్ సభాస్తారాన్ అమితానంద సాగరసమ్మగ్నా న్కుర్వాణః। అదృష్టపూర్వాం। అతివైచిత్ర్యదాత్రీం అవధాన వైచిత్రీం అభిదర్శయన్ స్వబిరుదమన్వర్థయాం చకార। తతశ్చావధాన కలాసందర్శన సంజాత సంమోదసంభరితః। సరసహృదయః। శ్రీరామ చంద్రప్పారాయః। ఏలా లవంగ జాజీ క్రముక శకలసంమేళితనాగవల్లీపర్ణపూర ప్రదానపూర్వకం రాంకవసౌవర్ణరేఖాభిరంజిత పట్టాంబరాది సహిత షోడశాధిక శతద్వయముద్రికాః పారితోషిక మకల్పయత్ ఇతి। తదవధానసమయ సంకలిత హృద్యపద్యావళిః మంజువాణీ ముద్రాక్షరశాలాయాం సమ్ముద్రితా విజయతేతమాం. శ్రీ. శ్రీ. శ్రీ.

సీ. ఆశుధారనుమాట లట్టిట్టుగాకుండ
నూఱుపద్యము లొక్కనాటఁజెప్పె

సభికులందఱు మహాశ్చర్యంబునందగాఁ
గోరిన వృత్తముల్ కూర్పోనర్చె
నొనరనేర్చినదాని నొప్పగించినరీతి
నష్టప్టై కల్పన లమరఁజేసె
ఔర! జ్ఞాపకశక్తి నహహా! యేమనవచ్చు
ననఁగ నూటిని దుద నట్టెచదివె

గీ. రహిని శ్రీరామచంద్రప్ప రాయవిభుని
మందిరంబునదొరలునానందమంద
శంకలేకను వెంకటశాస్త్రిఘనుఁడు
మేలుభగవంతుఁడైనను మెచ్చుననఁగ.

సీ. ఆంధ్రగీర్వాణంబు లందెల్లవృత్తముల్
రవలు కెంపులుగాఁగ రాల్చిపోసె
వరుసగాఁదాఁజేయు వర్ణనలందున
నింపుసొంపులను వర్షింపఁజేసె
సమయ మబ్బినచోట శాస్త్రప్రమాణముల్
నూర్లకొలందిగ నూర్చిపోసె
సభికులహృదయాంబుజంబులనానంద
వార్ధిలోఁదేల్చి దెప్పలుగఁజేసె

గీ. వారు వారును వారును వర్ణనలను
కోరివేఁడినయట్టుల క్రుమ్మరించె
శంకలేకను వెంకటశాస్త్రిఘనుఁడు
మేలుభగవంతుఁడైనను మెచ్చుననఁగ.

సీ. చెప్పనా? యీతని శాస్త్రవిజ్ఞానంబు
మిసిమివన్నెలఁజిల్కుపసిఁడిగాదె
వ్రాయనా? యీతని వాక్యమాధుర్యంబు
కండచక్కెర పానకంబుగాదె

మెచ్చనా ? యీతని మేల్కవితాకన్నె
మించిరాజుల వలపించుఁగాదె
పొగడనా ? యీతని పూర్ణాకుధారను
రంగుమీఱిన పాలపొంగుకాదె

గీ. ఇట్టిప్రజ్ఞలచేత హా ! యేమిచెప్ప
నట్టెసభికులనెల్లదాఁ గట్టివైచె
శంకలేకను వేంకటశాస్త్రిఘనుఁడు
మేలుభగవంతుఁడైనను మెచ్చుననఁగ.

Raja's High School
Nuzvid, 22-2-03.

B. Bhagavanta Row,
Drawing Master.

33. శ్రీ పేరుందేవీసమేత శ్రీదేవాధిరాజస్వామినేనమః
శ్రీమతేరామానుజాయనమః
శ్రీవానాచలరామానుజయతీంద్రగురవేనమః.

శ్లో. సదా తనోతు మంగళం సవానశైలయోగిరా
ట్సమస్త లోకకాంక్షిత స్వపాదపద్మదర్శనః
వదంతి యస్యమందిరం రమాగృహం నటద్రమం
సమస్తలోకమానితం సరోజయుక్తదీర్ఘికం.

శ్లో. మధురకవినామభాజం
వానాచలయోగిరాజ మనఘం తం
మానవకేసరినామా
నమామి దాసోహ మన్వయం భక్త్యా.

శ్లో. వందామహేవిబుధ బృందానతాంఘ్రియుగవందారుదుష్కృతిహరం
కుందాభదంత మరవిందాననం శ్రితసుమందార భూరుహవరం
స్కందాదిసన్నుత ముకుందాంఘ్రి భక్తిరుచి సందాయిమానసతలం
భేదాభిదాదిమతవాదాపసుక్తి సరవానాద్రిలక్ష్మణమునిం.

శ్లో. శ్రీత్యన్తద్వయతత్త్వసారసరణీసంచారబద్ధాదర
శ్శ్రీమత్సౌమ్యవరాష్టదిగ్గజవరేష్వా ద్యాసనాధిష్ఠితః

వానాద్రీశకృపాఝరీజలనిధిః కారుణ్యపూర్ణోనిశం
శ్రీవానాద్రి కలిఘ్నులక్ష్మణముని ర్జేజీయతాం సంతతం.

శ్లో. శ్రీవానాద్రికలిఘ్న లక్ష్మణమునేఃప్రఖ్యాతవిద్వజ్జుషి
శ్రీమచ్ఛ్రీపతి వేంకటేశవిబుధౌ విద్వచ్ఛిరోభూషణౌ
గీర్వాణాంధ్రకళాకవిత్వరచనా చాతుర్యలీలాగృహౌ
లోకేఽదృష్టచరం సదస్యకురుతాం చిత్రావధానక్రమం.

శ్లో. శ్రీరామచంద్రాహ్వయభూపతీశ
సంచోదనా ద్వేంకట శ్రీపతిభ్యాం
కృతానిపద్యాని శతావధానం
విలోక్యకౌతూహల మాప్నుయామ.

శ్లో నాకశ్శ్రీగగనాద్రిలక్ష్మణముని స్సర్వజ్ఞచింతామణి
శ్రీరామానుజయోగిపుంగవ మహాసిద్ధాన్తసంధారకః
వేదాన్తాదిమసర్వతంత్రి చతురో యస్యాంరసజ్ఞాబుధా
స్తస్మాద్వేంకటశాస్త్రి వాగ్విహృతయే సైషా సభై వార్హతి.

శ్లో. లోకేతావ దనేకపండితవరైః ప్రోక్తా న్యనేకాన్యహం
పద్యాని శ్రుతవాన్ కదాపి న మయా స్తద్వత్వ మాలంబితం
యోగిత్వం కవివాగ్విజృంభణఝరీపీయూషసంసేకజ
బ్రహ్మానందజడీకృతోహ మధునా యోగంవినాఽఽలంబయే.

శ్లో. పూర్వం భోజవిమానితౌ కవివరౌ ద్వౌసుప్రసిద్ధౌతయో
రేకోఽభూ ద్భవభూతిరన్యకవిరా ట్ఛ్రీకాళిదాసాహ్వయః
తావుల్లాసయితుం పునశ్చనృపతివ్యూహం జరీజృంభితౌ
మన్యేశ్రీపతివేంకటేశ విబుధాభిఖ్యాం వహంతావితి.

శ్లో. ఇమౌకవీపూర్వకవీంద్రతుల్యౌ
వితీరితుం నాల మహం కదాపి
ఇమౌతు దేవాంధ్రకలాప్రవీణౌ
శ్రుతంకదా తత్కృథితాంధ్ర పద్యం.

శ్లో. శ్రీమచ్ఛ్రీపతివేంకటేశ కవిరాజ్ఞానావధానక్రియం
శ్రోతుం వీక్షితు మేకఏవ ఫణిరాట్ ఛక్తోహి చక్షుశ్రవాః
శ్లాఘాసూచి నిజోత్తమాంగచలనం కర్తుం సహస్రానన
స్సోప్యేవేతి విదామహే కువలయే నాన్యోస్తినద్వాపరః.
కింబహునా?

శ్లో. శ్రీమచ్ఛ్రీపతివేంకటేశ కవితా మాధుర్యభుక్తేః పరం
ద్రాక్షాక్షీరసమాభన న్మధుముధా మాధుర్యశూన్యాత్మకం
ఆశాలేశపరానరాస్సమభవన్ మోచారసాస్వాదనే
పీయూషే జనితంచ భేషజమతి ర్దేవాసురాపేక్షితే.

శ్లో. సన్మానసాంబురుహచింతితపద్మజేశ
స్స్వార్యాప్త విష్ణుపదసేవనలాలసాత్మా
భూయాదభీష్ట ఫలదస్సభికాగ్రగణ్యా
విద్వద్గణస్య గగనాచలరాజహంసః.

శ్లో. చిరంతనోక్తిమౌళియుగ్మతత్వ చింతకోత్తమ
పరిష్కృష్టవానభూధరేశ లక్ష్మణార్యయోగినః
కృపాకటాక్షవీక్షయా చిరంవిరాజతు క్షితౌ
సనూజవీడుభూపమౌళి రామచంద్రియప్పరాట్.

శ్లో. శ్రీవానాద్రియతీశాజ్ఞాం వహతా కలితా ముదా
రమానృసింహవిదుషా శ్లాఘాపూర్వకపత్రికా.

శ్లో. పరాభవాబ్ధి కుంభాచ్ఛతృతీయాయాం భృగోర్దినే
శతావధానంకలితం సభాయాం ఖాద్రియోగినాం.

గద్య. శ్రీనూజవీడాఖ్యపత్తనే శ్రీమత్తోతాద్రి రామానుజయతీంద్రాలంకృతే విద్వన్మణి గుంభితే సదసి శ్రీమదాద్రిజాధిరాజ శ్రీరామచంద్రాపరావుబహాదర్ జమీన్దారాఖ్య మహిపాలవర్యేణ పరిచోదితాభ్యాం శ్రీపతి వేంకటేశాఖ్యకవిమణిభ్యాం విరచిత శతావధానకవితా చాతుర్య సందర్శన సంతత సంజనితసమ్మోదభరితేన శ్రీమద్వానాద్రి కలిఘ్నలక్ష్మణయతీంద్రా

జ్ఞానుసారిణా శ్రీమత్తత్సన్నిధి శ్రీకార్యదర్శి విబుధవర్యేణ శ్రీమద్వీరలతా కులపయః పారావారరాకాశశాంకేన స్వస్తికరహస్తిగిరిమస్తకతల స్వస్తరు శ్రీపేరుందేవీ సమేత శ్రీదేవాధిరాజచరణ సరసీరుహాలాంఛిత శ్రీమత్కాంచీ పురనివాస రసికేన లక్ష్మీనృసింహాచార్య కవినా ప్రకలితా లిఖితా పఠితా ప్రదత్తాచేయం శ్లాఘాపురస్కృతిపత్రికా విలసతు తరాంసన్మదే.

34. I have some knowledge of Pandit Satavadhani Challapilla Venkata Sastri's poetic composition in Telugu, and consider them to be of high merit. They indicate an extraordinary command of both Telugu and Sanskrit; and their linguistic accuracy and easy flow are quite striking. His power of appreciating and enjoying true poetry is also noteworthy, and it is indeed this power which has made him the poet that he is. His wide and accurate knowledge of Telugu and Sanskrit, combined with his power of producing as well as appreciating good poetry, ought to make him a very worthy and useful teacher of Telugu in Colleges where that language and its literature are taught. He is both rational and critical, and is in no way an oldfashioned Pandit.

(Sd.) M. Rangachariyar,
Proffessor of Sanskrit and
comparative Philology
Presidency College.

Triplicane.
Madras, 25-1-08.

35. I am sincerely glad to record my impression of M. R. Ry. Venkata Sastrulu. I have read some of his published works with no less profit than pleasure. This morning he came to see me and I have spent over three hoursd with him, during which he recited to me a great many from his large store of verses still in M. S. form. They markedly display his versatile powers. He is one of three or four of his abilities I have come across these many years. Great as are his prodigious memory and the spontaniety of his extempore versification, which

many others have admiringly testified to what I specially value is his extensive, profound and accurate scholarship in Sanskrit and Telugu. Such is his vast and varied learning in both these languages, so lucid, simple and chaste is his style and so studded is his poetry with striking and sparkling gems of wit and fancy, that if his lot had fallen on olden days, and Macaenas of those days would have eagerly taken him into his patronage. What is now open to him and the like of him is only one of the higher panditships in our Colleges and they are but few. By his mastery of Sanscrit as a foundation for his Telugu learning, he will be quite an acquisition in the best of our Colleges He is, besides, young and vigorous enough (humanly speaking) to put in a service of over twenty years I heartily wish he would have an early chance and a successful one.

Lakeside
Kilpauk,
26th January 1908.

(Sd ) P Ananda Charyulu,
High Court Vakil,

36. Office of the Telugu Translator to Government.
MADRAS.
17th January 1908.

Tirupati Venkateswara Kavulu, are twin-poets of a high order, well known in the Telugu Districts, for their ready, off-hand intelligent and superior compositions in Telugu and Sanskrit poetry. Their works are not a few and they display the rare merit of appreciation of what real poetry is. Besides they are Satavadhanies, not as generally recognised by courtesy their actually tested exhibitions of their powers.

I have asked the Junior Pandit Venkateswarulu to teach an imaginery class in Amuktamalyada and Sringara Naishadamu, two of the great classical works in Telugu. He has satisfied me by giving critical notes to

the class on modern lines, bearing on all important points-Grammar, prosody, rhetoric, allusion etc., within the prescribed time. Any college may be of its aquisition of him.

S. Rungaiah Chetty.

37. I have much pleasure to state that the bearer Satavadhani Venkata Sastrulu Garu of Masulipatam is a well-known Telugu scholar. His poetical productions are good and his smoothflowing verses have won my admiration. This combined with his knowledge of Sanskrit makes him perhaps the best fitted to occupy a Telugu Pandit's Post in First Grade Colleges.

Puraswakam, 28th January 1908 } R. Krishnamachariar, Sub-Asst. Inspector of Sanskrit Schools MADRAS.

38. బందరు

శ్లో. సర్వాలంకారయుక్తా రుచిరతరగుణా సర్వరీతిప్రగల్భా
వాణీ కల్యాణశీలా పదగతివిలసచ్చారుమంజీరనాదా
శ్రీరమ్యే వేంకటేశే తిరుపతిసుకవౌ సా నరీనర్తినోచే
ద్వాచాం మాధుర్యమాసాం ప్రతికవిసులభం కిం భవే ద్ధారణావా.

శిష్టా నరశింహశాస్త్రిగారు.

చ. తిరుపతి వెంకటేశకవిధీరులు వీర ఉదార రాట్సభాం
తరపరికీర్తనీయ వితతస్ఫుటకీర్తులు వీరి నెన్నఁగాఁ
దరమె ! సమేధమానకవితామహిమంబు మహాద్భుతంబగున్
సరసిజభూలసద్వదనపత్వరనృత్యవిలోలవాగ్వధూ
చరణరణత్సునూపురవిశంకటచాఁరుఝణంఝణధ్వని
స్ఫురణమనోజ్ఞమై, తదభిశోభివతంసకహల్లకాగ్రిసం
చరదళిపక్షవిక్షతివశప్రసరన్మకరందబిందుమా
ధురిమ నెసంగి, యప్పలుకుఁదొయ్యలి బంగరువీణెకాయలం
బెరసిన గబ్బిగుబ్బకవబిత్తంపు న్విరిమల్లెదండలం

దరికొను కమ్మతావులకుఁ దానకమై విలసిల్లుచుండు న
ద్దిర నుడికారపుం బలుకుతేటలు రత్నపుమూటలై తగుం
దర మెటలేదు త చ్ఛతవధానముఁ జూడ మహామృతం బగున్.

అడివి సాంబశివకవిగారు.

చ. పరిచితభారతీప్రముఖపద్ధతులం దగ గద్యపద్యముల్
సరసవచస్థితిం దవిలి సర్వజను ల్నుతియింపఁ జెప్ప నె
వ్వరికగుఁ! బూర్వపుణ్యపరిపాకవశంబున, వీతకల్మషుల్
వరమతి నన్నపార్యుఁడును వాఙ్మయలోకవిధాత యజ్వయున్
సురుచిరబంధదక్షుఁడగు సూరివరేణ్యుఁడు శంభుదాసుఁడున్
వరకవితాపితామహుఁ డవంధ్యచరిత్రుఁడు పెద్దనార్యుఁడున్
వఱలఁగఁజూచి సంతసిలు భాగ్యములేని కొఱంత నేఁడు గా
మరలె సరస్వతీమహిత మంగళవిగ్రహులైన మీదయన్
"బరువము దప్పిపోయె" నని పల్కుడు మాటయెగాని బాగుగా
నరసినఁ జేవ దా నహరహంబును హెచ్చుచు దోఁచుచుండు మీ
యరుదగు బుద్ధిసీమల మహాప్రతిభాయతిఁజేసి యెన్నిటం
దరుగును కాంతివార్ధ్యములు తథ్యపు వజ్రపుతున్కకెయ్యెడన్!
సురుచిరవాఙ్మయాఖముల సూరిమనోబ్జము లుల్లసిల్ల నూ
ర్వ్వరికొకతూరిఁ బద్దెములఁ బూనిరచించిన భూరితేజు ల
త్యురుతర ఫేవిశాలులు సముజ్జ్వలవాగ్రచనావిశారదుల్
తిరుపతి వేంకటేశకవిధీరులు గైకొనుఁడయ్య మా నతుల్.

చెన్నాప్రగడ భానుమూర్తి బి. ఏ., యల్. టీ; గారు.

## 41. నరసారావుపేట.

సీ. చంద్రుఁ డెవ్వరికైనఁ జల్లగానుండఁడా!
పద్మాలభాగ్య మాపాటిగాక
వెలు గేరికైనను జెలువుగానుండదా!
గ్రుడ్డిగూబల నోము కొఱఁతగాక

కేలకంఠ తీయనివలపుఁ బుట్టింపదా !
పైత్యరోగుల పాపఫలముగాక
కోయిలగానంబు హాయిగానుండదా !
విరహుల దుర్దశావిధముగాక

తే. గీ. మీకవిత్వంబు మీలీల మీదుఫణితి
సరసులకుఁగాదె కర్ణరసాయనంబు
సరసతిరుపతివేంకటేశ్వరకవీంద్రు
లార శాశ్వతకీర్తివిస్తారులార.

ఉ. కూరిచినారు మంజురసఘూర్ణితదివ్యకవిత్వతత్త్వ మే
పార ననేకకావ్యముల నందఱుప్రాజ్ఞులు మోదమంద మీ
పేరులు సర్వదేశముల విశ్రుతముల్ వివరింపనేల మీ
ధారణకు న్నమస్కృతిశతంబులు తిర్పతి వెంకటేశ్వరుల్.

ఇట్లు, రాయప్రోలు సుబ్బారావు.

## 42. బాపట్ల.

మ. జితనానావిధబోధశోధనసమిష్టీభూతపాకాద్యలం
కృతిశయ్యామధురీతిగీతిఫణితిశ్రీమాధురీసాధురీ
త్యతిభాస్వత్కవితామహోఖురళికాహంయుప్రతత్యోచితీ
యుతులౌ తిర్పతి వేంకటేశకవి సింహుల్ ! స్వాగతంబీయదే.

మ. నితరామున్నతిభృత్కుకవ్యధిపనిర్ణిద్రప్రతాపోర్వజా
లతిరస్కుర్వ దహీనవర్షణుతు వేళాలోల నీరంధ్రపూ
రితవాఃపూర భరభ్రమభ్రమిత నీవృత్పుష్కలావర్తకా
యిత శ్రీతిర్పతి వేంకటేశకవి దంతీ ! స్వాగతం బీయదే.

మ. అతిమాధుర్యరసావగుంభనసమప్రారంభరంభాఫలా
ప్లుతసుస్వాదురసాయనప్రచురవిప్లుష్టప్రణాళీవిని
ర్మితసారస్వతమంజుళామ్రవనసమ్మీలల్లతాంతాంతవ
ల్గిత శ్రీతిర్పతి వేంకటేశకవికేకీ ! స్వాగతంబీయదే.

మ. కృతవిస్తారమనోహరపరిచర నిష్కృష్టోదధారావిసా
రతళద్ధాళధళీవిలాసిసుషమాప్రాగ్భారగోదావరీ
కృతనవ్యామృతపారణోపమిత నిష్కృష్టాళుధారాపరివా
హతరత్తిర్పతి వేంకటేశ్వరమరాళా ! స్వాగతంబీయదే.

మ. చెలుకుందోటల బాటనట్టనడుమం జెన్నారి చెల్వారు బం
గరు పూఁదేనియ యేటికొత్తరగలంగపరింపుఁ బెందిప్పలం
బల్పై యేఁపగు మావికైత నడిదీవంగూడి యుయ్యాలహే
ళిరహింబొల్చెడు కోయిలల్ కవులు ! హాళిన్ స్వాగతంబీయదే.

43. వే మ వ ర ము.

సీ. వీరితో నీర్ష్యచేఁబోరాడి యోడి కా
కవులు పర్విడిరి కాకవులకరణి
వీరిమిత్రత్వంబుఁ బెరసిన బహులబ్ధ
వర్ణులు బహులబ్ధవర్ణు లైరి
వీరి చెంగటఁ జదివిన సంపదధికవి
రాజు లత్యధికవిరాజు లైరి
వీరికై సభలుగావించు నుదార వి
ఖ్యాతు లుదారవిఖ్యాతు లైరి
తే. గీ. ఎన్నవీతిరుపతివేంకటేశ్వరాఖ్య
కవులయెడఁ దత్తదుద్యమకరిమముసల్పు
వారుతదీరితులెవయుచో వేఁతవీరి
పౌరిఢియిట్టిదియనుచుఁ జెప్పంగవలెనె.

అమరవాది రామయ్య, బాలేమర్తి.

సీ. రాచఠీవిగ నజసరిముసంచరించుచే
తిరుపతివేంకటేశ్వరమతంబు
నెక్కొని యెందేని రొక్కమార్జించుచే
తిరుపతివేంకటేశ్వరమతంబు

నాలిపై నాలుగా లీలఁ జరించుచే
తిరుపతివేంకటేశ్వరమతంబు
మూలనుండియునైన మొ్రిక్కించుకొనుటయే
తిరుపతివేంకటేశ్వరమతఁబు

తే. గీ. ఉద్ధతులగర్వమంతయునూడఁబెఱికి
బుఱ్ఱగొఱిగించితిరుమణిఁబూసినుదుట
తడికదాసళ్ళగాఁజేసి తఱుముటొకటె
యరయఁదిరుపతివేంకటేశ్వరమతంబు.

వంగల చిన్నికృష్ణయ్యశాస్త్రి, చిల్కలూరిపేటపోష్టు.

ఉ. తిక్కన ముద్దుపోకడ సుధీనుఁడు వెంకటశాస్త్రిగారికే
దక్కెను నన్నపార్యుమృదుధారయొ తిర్పతిశాస్త్రిగారికే
దక్కెను భారతప్రతిభ ధర్మముపట్లను గీరతమ్ముకే
దక్కెను దక్కరీఁడు లెగతాళియొనర్చిన నేమిలోటగున్.

సీ. పల్కుపల్కుకుఁ దేనెజిల్కు కుల్కెడు భవ
త్కవితాలతాంగి ముంగరకుగాని
చుట్టుగట్టుల జుట్టువట్టి యాడించుమీ
కీర్త్యబ్జనేత్రి పంకిణికిగాని
పరిపంథివిద్వ ద్ద్విపములవాఁగట్టు మీ
సాహితీమహిళ బేసరికిగాని
రాజరాజుల మందిరములఁబేర్వడిన మీ
ధారణాతరుణి యద్దముకుఁగాని

తే. గీ. గానివారలు కొందఱేదేని లేని
పోనికైలాటమెత్తంగఁ బూన నట్టి
సిగ్గిడులనాఁగినార్మీరు పగ్గెదనర
సరస తిరుపతివేంకటేశకవులార.

రాళ్ళబండి వెంకటసుబ్బశాస్త్రి.

సీ. గళమెత్తి విమలగంగాతరంగంబన్న
కంబుకంఠికి రంథ్రికలన నెఱపె
మొకమెత్తి వెన్నెలరకమన్న చంద్రాస్య
తెప్పవాల్చకసుధాదృష్టినెఱపె
పల్లెత్తి యిది 'చెల్లె! మల్లె'యన్న సుగంధి
నెత్తిపైకెక్కి రేకెత్తసాగె
కన్నెత్తి వెలిదమ్మికాడయన్ బద్మాక్షి
లీలఁ గేల్దోయి నూర్వేతొనర్చె

తే. గీ. నరరె కోవిదసంసచ్ఛతావధాన
విధులఁబ్రిధగన్న నెఱజాణవెలఁదిమిన్న
మీయశఃకాంత యెట్టియుపాయమరసె
సరస తిరుపతి వేంకటేశకవులార.

చల్లా పిచ్చయ్యశాస్త్రి.

చ. తిరుపతివేంకటేశ్వర సుధీమణులన్ నుతియించుటన్ననో
పరిపరి భక్ష్యభోజ్యముల పైపయి నట్టివె పెట్టినట్లయౌ
నరయఁగఁ బండితోత్తమ సహస్రములొనన విప్రకోటికై
విరివిగ సత్రముంచుటను వేమవరస్థుల నే స్తుతించెదన్.

కార్యముపూడి రాజమన్నారుకవి, శతావధాని.

48. శ్లో. పాకోరసాతిరేకో
ధారాలంకార సద్గుణాధారా
రీతిశ్శ్రుతార్యగీతి
శ్శ్రీపతివేంకటేశకవితాయాః.

శ్లో. పదవాక్యమణినిధానం
వధానమేతత్కృతం సమాధానం
యత్తువిపక్షాధీనం
ననుధీనంద్యంహివాగ్వధాధీనమ్.

శ్లో. స్తుత్యు క్తింపునరు క్తిం
ప్రేక్షం ప్రాచీనసద్గుణాపేక్షం
దర్శనముదయాదర్శం
కవయితో్రి రేతయోర్విదుఃకవయః.

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి. చందోలు.

సీ. పర్వదినమ్ములఁ బాధోధి రంగదు
త్తుంగభంగముల నుప్పొంగురీతి
ఖండనమం దర్జునుండు గాండివము క్త
చండకాండము లంపుచుండుభాతి
దితిసుతనుతుఁడు స్వాతీగతుండై క్షితి
యతులితాసార సంగతమగుగతి
శితికంఠజూటనిర్గతవినిర్మలసుధా
రసయుతత్రిభువనిర్ఝరిణికరణి
తే. గీ. సరససారసుబంధబంధురసువృత్త
కలిత మృదుమధురతరాశుకవనధార
నందఱనువిస్మయాధ్యతఁజెందఁజేయు
మీకుసములెవ్వరిఁకమీకుమీరెకాక.

జంధ్యాల చిన్నసుబ్రిహ్మణ్యశాస్త్రి.

## 50. పినపాడు.

సీ. మహితబ్రిహ్మగురూ క్తమంత్రశుద్ధినిగాంచి
శాస్త్రవిభూషణసమితిదాల్చి
రాజేంద్రిమకుట విరాజితపాదులై
సరిలేని బంగరు బిరుదులొంది
నరులెన్న గజవాహనంబుల నూరేగి
కవివరస్తుతిపాఠగరిమఁగాంచి
అకలంకధారణామకుటంబుధరియించి
దుష్టశత్రుమదంబుఁదూలఁజేసి

సీ. గళమెత్తి విమలగంగాతరంగంబన్న
కంబుకంఠికి రంథ్రికలన నెఱపె
మొకమెత్తి వెన్నెలరకమన్న చంద్రాస్య
తెప్పవాల్చకసుధా దృష్టి నెఱపె
పల్లెత్తి యిది 'చెల్లె! మల్లె'యన్న సుగంధి
నెత్తిపైకెక్కి రేకెత్తసాగె
కన్నెత్తి వెలిదమ్మికాడయన్ బద్మాక్షి
లీలఁ గేల్దోయి నూర్వేలొనర్చె
తే. గీ. నరరె కోవిదసంసచ్ఛతావధాన
విధులఁబ్రిధగన్న నెఱజాణవెలఁదిమిన్న
మీయశఃకాంత యెట్టియుపాయమరసె
సరస తిరుపతి వేంకటేశకవులార.
చల్లా పిచ్చయ్యశాస్త్రి.

చ. తిరుపతివేంకటేశ్వర సుధీమణులన్ నుతియించుటన్ననో
పరిపరి భక్ష్యభోజ్యముల పైపయి నట్టివె పెట్టినట్లయా
నరయఁగఁ బండితోత్తమ సహస్రములౌనన విప్రకోటికై
విరివిగ సత్రముంచుటను వేమవరస్థుల నే స్తుతించెదన్.
కార్యముపూడి రాజమన్నారుకవి. శతావధాని.

48. శ్లో. పాకోరసాతిరేకో
ధారాలంకార సద్గుణాధారా
రీతిశ్రుతార్యగీతి
శ్శ్రీపతివేంకటేశకవితాయాః.

శ్లో. పదవాక్యమణినిధానం
వధానమేతత్కృతం సమాధానం
యత్తు విపక్షాధీనం
నసుధీనంద్యంహివాగ్వధాధీనమ్.

శ్లో. స్తుత్యుక్తింపునరుక్తిం
ప్రేక్షాం ప్రాచీనసద్గుణాపేక్షాం
దర్శనముదయాదర్శం
కవయితోర్వి రేతయోర్విదుఃకవయః.

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి. చందోలు.

సీ. పర్వదినమ్ములఁ బాథోధి రంగదు
త్తుంగభంగముల నుప్పొంగురీతి
ఖండనమం దర్జునుండు గాండివముక్త
చండకాండము లంపుచుండుభాతి
దితిసుతనుతుఁడు స్వాతీగతుండై క్షితి
యతులితాసార సంగతమగుగతి
శితికంఠజూటనిర్గతవినిర్మలసుధా
రసయుతత్రిభవనిర్ఝరిణికరణి
తే. గీ. సరససారసుబంధబంధురసువృత్త
కలిత మృదుమధురతరాళుకవనధార
నందఱనువిస్మయాధ్యతఁజెందఁజేయు
మీకుసములెవ్వరిఁకమీకుమీరెకాక.

జంధ్యాల చిన్నసుబ్రహ్మణ్యశాస్త్రి.

## 50. పినపాడు.

సీ. మహితబ్రహ్మగురూక్తమంత్రశుద్ధినిగాంచి
శాస్త్రవిభూషణసమితిదాల్చి
రాజేంద్రమకుట విరాజితపాదులై
సరిలేని బంగరు బిరుదులొంది
నరులెన్న గజవాహనంబుల నూరేగి
కవివరస్తుతిపాఠగరిమఁగాంచి
అకలంకధారణామకుటంబుధరియించి
దుష్టశత్రుమదంబుఁదూలఁజేసి

తే. గీ. ప్రాజ్యనిరుపమ సుకవిత్వరాజ్యమందు
భాగ్యలబ్ధ శతవధాన భద్రపీఠి
వెలయుచుండెడి తిరుపతివేంకటేశ
సుకవివరచక్రవర్తులఁ జూడఁగలిగె.

ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి. శతావధాని.

51. గుంటూరు.

శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారు.

సీ. పదిమందిలోఁబట్ట పవలైన నిలువెల్ల
దోచి దోచని పచ్చిదొంగవాఁడ!
ఏరికైనను దిరుక్షౌరమ్ముచేయించి
పంగనామముఁబెట్టిపంపువాఁడ!
వడ్డిలోఁగాసైన వదలకంతకునంత
గుంజి గైకొను రాతిగుండెవాఁడ!
కడుఁబేదనని మొఱ్ఱలిడనెత్తి బొచ్చెనఁ
బెట్టిపొమ్మని యడ్డుపెట్టువాఁడ!
తే. గీ. పేరుగొప్పయెచూడఁగనూరుదిబ్బ
యనెడున్యాయంబునకులక్ష్యమైనవాఁడ!
సరసతిరుపతివేంకటేశ్వరులతోడ
మమ్ముదయఁజూడుమలమేలుమంగతోఁడ!

చ. వరమృదుశారదధార రసబంధుర బంధపబంధబంధనో
త్తరకవితన్ మతిశ్రమనిధాన వధానవిధానచాతురిన్
దిరుపతివేంకటేశ్వరులె ధీరులు సూరులు వీరలంచు నే
విరివిగవింటి మున్నిపుడు వీరినిగంటిని గంట నీసభన్.

చ. తలిరుపసిండి పూఁతనునుదళ్కులఁజిల్కెడు గుల్కులాఁడిమై
జిలుకుపిసాళి గందపుఁ బసందులయందము లొంచ నొక్కచో
బలుజిగిగల్గు క్రొంబసిఁడి పన్నెల కన్నెల చిన్నిపొన్నిచ
న్నులఁగయిఁబట్టి నప్పటివినోదము మోచమునూదునొక్క చో

వలపులనీను కఁవపుటనంటుల మింటికి నంటగెంటుతో
య్యాలినునులోఁదొడన్ గదియనందిన చందమునందు నొక్కచోఁ
దొలిమగనేఁతనాఁడొసఁగు తొయ్యలి గాటపు నెయ్యపుంగవుం
గిళలఁగలట్టియొత్తుడుల క్రిందగునందము చిందునొక్కచోఁ
దెలుఁగునఁగై తమల్లఁగల దిట్టలు తిర్పతి వేంకటేశ్వరా
ఖ్యులనుచు గాశికృష్ణకవి యుత్పలచంపకమాలికావళిన్
బొలుపుగఁ గూర్చి యెల్లరును మోదమునొందఁ గవిద్వయీగళం
బులఁ దవిలించెఁ బండితవిభూషితగ ర్తపురీసభాస్థలిన్.

52. బ్ర॥ శ్రీ॥ శిష్టా సీతారామశాస్త్రులు.

శ్లో. ఏతత్సూరివరోదితేషు బహుశః పద్యేషు సర్వే ష్వహో
దృశ్యంతేహ్యుపమాదయోఽపి సుగుణా ఓజఃప్రసాదావికాః
సామర్థ్యంస్ఫుటతాగిరాంచ గురుతాభిన్నార్థతా స్వీకృతా
నూనంతిక్కనసోమపాదికవిభిస్తుల్యా ఇమేసూరయః.

శ్లో. శాంత్యాదాంతిగుణేన కీర్తినిచయై ర్యుక్తా స్తపోవిద్యయా
శ్రీభిర్వాక్యపదప్రమాణనికరై ర్హృద్యాస్సతాంసమ్మతాః
గద్వాలేపి పిఠాపురేచనగరే చెన్నాహ్వయే సత్కృతాః
పూజ్యంతేస్మ పురేపురే బహువిధం గుంటూరు పుర్యాంయథా.

53. బ్ర॥ శ్రీ॥ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు.

మ. కలముంబట్టి కవిత్వమల్లు బుధలోకంబెల్ల వేనోళ్ళమీ
లలితంపుంగవితన్నుతించి రుచిరాలంకారముల్ భాషలో
పలిమేల్పల్కులఁగొల్లలాడె నీఁక నేవర్ణింతునేనిం దదు
క్తులనే యేకరుపెట్టఁగావలయుఁబంక్తుల్ పౌనరుక్త్యంబుగన్.

శా. పౌనఃపున్యముగాఁ బురాకృతములన్ వల్లించుకంటెన్ సదా
మౌనంబూని సుధారసంపుఁజవులన్ బాటించుమీకై తలన్
వీనుందోయిటిచేతఁద్రావుచును దృప్తింజెంది యద్దాన బ్ర
హ్మానందామృతవార్ధిదేలుటయె మేలంచున్ దలంతుం మదిన్.

54. బ్ర॥ శ్రీ॥ ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రులు.

క. అవధానుల కవధానులు
కవులకుఁగవులైన యీజగద్విదితులనే
దవిలి ప్రశంసించుటగన
రవినద్దమునందు జూపఱకుఁజూపుటగున్.

మ. మునువాల్మీకిగ్రహించి రామకథ నీభూలోకమున్ నిండఁజే
సినచాయన్ మునుపెవ్వరో యెరుగ వాసింగొన్న యీవిద్యనీ
జనవర్యుల్‌గ్రహియించి దేశములపైఁజల్లన్‌విజృంభించె నిం
పెనయన్ దీనికిమార్గదర్శకులు వీరేగాదె చర్చింపగన్.

మ. నిటలాక్షాంగతటోజ్వలన్నిలయనిర్ణిద్రాతిభద్రాయితో
త్కటలావణ్యతనూవిశేష విలసద్గౌరీకృపాసారసం
ఘటితానూనశతావధానకవితా క్రాంతాత్మలౌ వీరికిన్
పటుదీర్ఘాయువు శేముషీబలము శ్రీప్రాణేశ్వరుండిచ్చుతన్.

55. బ్ర॥ శ్రీ॥ పిరాట్ల వెంకటప్పయ్యశాస్త్రి

సీ. జగదాల వాలంబు శాస్త్రపాండిత్యమన్
శాతమౌక్తిచేఁజక్కపఱచి
కాకవిమద తృణకాండమెల్లనుగాల్చి
ముల్లోకముల గొప్ప యల్లుఁబెట్టి
కవితానదీరసకాండంబుచేఁ బద
నిచ్చి యే కవివరు లెసఁగనాత్మ
కీర్తిలతను నాట బూర్తిగా నది యల్లి
బిల్లిగ నల్లి రంజిల్లఁబూచెఁ

తే. గీ. శశివిబుధధునీశేషప్రసవముల నవి
తలనుగళమున ధరియించెఁదలఁపనీశుఁ
డట్టి తిరుపతివెంకటాఖ్యకవిమణుల
కీర్తిలతనెన్నగాబ్రహ్మకేనిదరమె.

మ. చతురంభోధి పరీతసర్వధరణీచక్రిస్థభూపో_త్తమాం
గతతానల్పకిరీటకోటిమణి సంఘాతేనమాలామహో
ద్యుతివిస్మేరపదారవిందులగు కవ్యద్దామగర్వాటవీ
హుతభుక్తుల్యుల నీ కవీశ్వరుల నెల్లో చూచుటబ్బెంగదా.

౮౬. బ్ర॥ శ్రీ॥ లంకా సుందరరామశాస్త్రి.

క. శ్రీమ_త్తిరుపతివెంకట
నామకవీశ్వరులనెన్న నలువకుఁదరమా!
పాముల తేనికిఁ దరమా!
కామారికిఁదరమ! తమ్మికంటికిఁదరమా!

శా. మీ ధీరత్వము మీగుణాతిశయమున్ మీపాండితీప్రౌఢియున్
మీ ధార్ష్ట్యంబును మీప్రబంధరచనల్ మీవాగ్ఝరీమాధురుల్
మీ ధీచాతురి మీగభీరమహిమల్ మీధారణాశ_క్తి యే
రీ ధాత్రీస్థలిఁ జెందువారు గలరే యెవ్వోపుటాల్ వేసినన్.

57. బ్రాహ్మణకోడూరు

ఉ. స్వాగతమయ్య! మీకు విలసత్కమనీయ యశస్సుధారస
శ్రీగురుతావిభూషిత విశేషనభోంతరరమ్యదీధితుల్
సాగరకన్యకాఘనకుచస్థలచందనచర్చితప్రభా
భ్యాగమరమ్యదేహులగు నార్యులు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ. స్వాగతమయ్య! సత్కవిహృదంతరదంతురితప్రభావసం
ధ్యాగమతర్పితాఖిలజనాహ్వచకోరులు దర్పవద్విరో
ధ్యాగతహుంకృతిస్ఫురదహంయులు నిస్తులితోరుశ_క్తిసం
ధాగరిమావధానకృతిదాతలు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ. స్వాగతమయ్య! మీకురచనాతిశయాన్వితకావ్య సద్యశో
భాగవిశేషవేష్టితవిభాస్వరలోకులు గౌరవప్రిధా

సాగరమజ్జదు_త్తమవిశాలయశస్కరిపుప్రభావు లం
హోగరిమ ప్రణాశనమహోయుత తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ రంగారావు, బి. ఎ. డిస్ట్రిక్టుకోర్టువకీలు.

మ. సకలాంధ్రావనిపాలకో_త్తమ సభాస్థానమ్ములన్ సత్కవి
ప్రకరమ్ముల్ దలలూఁచి మెచ్చఁగఁ గవిత్వస్ఫూర్తినైకావధా
నకళోద్భూతజయేందిరా ప్రథితసన్మానమ్ములన్ గాంచుచున్
"సుకవీభేంద్రమృగేంద్రు"లన్ యశముఁ గైకొన్నారు వీరిర్వురున్.

శిష్టా హనుమచ్ఛాస్త్రి.

సీ. ప్రతివాదిజన భయప్రదమైన యన్ముఖం
బంతేవసత్పాళి కమృతమొసఁగు
సభ్యులకడ లిడఁజాలెడుయద్వాణి
కబ్బంబులందు సౌఖ్యము ఘటించు
తథ్యాంశమన్న స్వతంత్రించు యద్ధాటి
మిథ్యాంశమన్నఁ దామిన్నకుండు
త్రైలోక్యరంగన_ర్తకియైన యత్కీర్తి
విబుధమనోగోష్ఠి విడువకుండు

గీ. నట్టిరు కవీశితలును శతావధాన
ధారణాధోరణీ చిత్రితప్రముఖులు
నస్మదీయగురూ_త్తములవని నాయు
వునుయశఁబును గనుచుంటవౌనరుఁగాత.

సీ. ఆంధ్రదేశావస్థితాశేషభూమిభృ
త్కోటీరమణిఘృణిఁ గూడియాడి
కవితాకృతానేకగణనీయ పూర్వపు
ఖ్యాతిశయంబుల జోతలంది
గోదావరీతీరకూలంకషామోఘ
పాండితీప్రథకు జీవంబు వోసి

కమనీయరచనాప్రకారకారణయశ
స్స్వీమంతినీలాస్య శేష మరసి

గీ. సరసరసపుష్టి భావత్కసత్ప్రబంధ
బంధబంధురతత్కవిత్వప్రభావ
భావగంగాప్రవాహభాస్వత్తరంగ
రంగకలనయఖండచిత్రంబునొసఁగె
సరస తిరుపతి వెంకటేశ కవులార.

సీ. అన్యాదృశంబైన యశమును గర్వించు
దోషజ్ఞబృందంబుఁ దూలనాడి
విషమపరీక్షావివేచనాప్రౌఢులౌ
సంస్థానపతుల సంశయము దిద్ది
భిన్నభిన్నరుచిప్రభేదముల్ గల్గు లో
కులనెల్ల నొక్కమేకున బిగించి
అష్టావధానశతావధానామర
భాషిత పాండితీబలము నొసఁగి

గీ. అఖిలదిక్కులజయవైజయంతికావి
జృంభణముమీకుముందుఁగై సేసియుంచు
తమపురాకృతపుణ్యంబుదరమెపొగడ
సరస తిరుపతి వేంకటేశ గురులార!

అవ్వారి సుబ్రహ్మణ్యం.

60. కాశీ కృష్ణాచార్యులు, శతావధాని.

సీ. "పట్టుమంచొక గీతపద్యమ్ము వ్రాయరా
దా! యేమి నోరు లేదాయెఁగాని
ఆశుధారయటన్న నసలె చూచేతఁగా
దా! యేమి ధారలేదాయెఁగాని

అవధానతంత్రంబులందు మాబుద్ధిపో
దా ! యేమి మేధ లేదాయెఁగాని
వాఙ్ముఖమ్మున మాదు వక్త్రమించుక సాగ
దా! యేమి మాటరాదాయెఁగాని

గీ. మాకు" ననుకొనుపండితు ల్మహినినెంద
రోకలరుగాని యీమేలుపోక లుట్టి
పడఁగ నవధానమొనరించువారుగలరె
ధరణిఁ దిరుపతివేంకటేశ్వరులుదక్క.

గద్య

ఇది శ్రీ.... కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర కృతంబగు శతావధానసారమ్మున సర్వంబును

సంపూర్ణము.



శ్రీమత్పరదేవతాయైనమః.




# శ్రీ
# తిరుపతి వేంకటకవి
## ప్రణీతము....

★

ప్రకాశకులు.
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిసన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం P.O. తూ॥గో॥జిల్లా.
1956.

ఇది

# విద్వాన్ చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రిగారి

పర్యవేక్షణలో ప్రచురింపబడినది.



మూడవ కూర్పు

వెయ్యి ప్రతులు

1956.



ముద్రణ:

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్,

ఆలమూరు, తూర్పుగోదావరి జిల్లా.

శ్రీమత్పరదేవతాయైనమః

# కలగూరగంప



## భక్తి.

### రంగేశ్వరుఁడు

శా. శ్రీరామామణి వక్షమందుఁ దనరన్ జెన్నొందుతన్నున్ జనం
"బౌరా! చంచలతం దొఱంగనిమెఱుం గర్థిన్ ధరింపంగఁ బో
ల్కీ రాజఘ్నన"మంచు వర్ణనలు తా రింపారఁగాఁ జేయ నా
శ్రీరంగమ్మున నుండు రంగఁడు యశశ్శ్రీలిచ్చు మా కెప్పుడున్.

### కృష్ణుఁడు

శా. శ్రీమన్మంగళదేవతాస్తనమిళత్స్నిగ్ధస్ఫురచ్ఛ్రీమదో
ద్దామాంకాంకితవక్షముం గని మదిన్ దాసీర్ష్యతో రాధికా
భామారత్నము పల్కకుండినను "గోపం బేల? నన్నేలు" మం
చామెన్ వేడుక వేఁడు కృష్ణుఁ డిడు మా కత్యంతసౌభాగ్యముల్.

### వేంకటేశ్వరుఁడు

ఉ. శ్రీమదఖండవైభవముచేఁ జెలువారెడి వేంకటాద్రిపై
సామజయాన శ్రీరమణి చక్కఁగఁ బాదము లొత్త నారదుం
"డోమహనీయసేవితగుణోజ్జ్వల" యంచు భజింపుచుండు ని
న్నే మది నమ్మినాఁడ దయ నేలుమి శ్రీకర, వేంకటేశ్వరా!

చ. శరదరవిందలోచన! లసన్మణియుక్తకిరీట! కంకణ
స్ఫురదురుబాహుశోభిత! విశుద్ధచరిత్ర! రమాంగనామనో
హర! హరపూజితాంఘ్రియుగ! యాశ్రితభక్తమనోనివాస! కి
న్నరగరుడోరగాదినుతనామవిరాజిత! వేంకటేశ్వరా!

—• జగదీశ్వరి •—

సీ. సారహీనపదార్థసంచయమ్మందు ని
స్సారమైనయది సంసారమకద ॥
అట్టిసంసారమం దజరుదరిద్రివిష్ణ్వాదు
లకునైనఁ దగిలికో ల్దప్పదుగద ॥
తగులుకొనినమీఁద ధనములేకున్నచో
గడెయైనఁ గాలమ్ము గడవదుకద ॥
కాలయాపనకుఁ దా ఘనుఁడయ్యు నీచునై
నను నాశ్రయించు టన్యాయముకద॥
తే. గీ. అట్టిపని కవిచంద్రుల కర్హమగునె?
నీ వెఱుంగని ధర్మ మెందేని గలదె
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ ॥
సీ. ఆశ్రయించినవారి నవలఁబొమ్మనిచెప్పు
టన్యాయమని మది నరయవాక్కా
అభిమానము గల విద్యావంతులకు దరి
ద్రత్వ మిక్కట్టని తలఁప వాక్కా
ధనహీనులకు ధనంబు నొసంగుట మహోప
కారంబనుచు మదిఁగాంచవాక్కా
ఎవరి కిచ్చినను గవీంద్రుల కీకున్నఁ
గలుగదు యశమని తెలియవాక్కా
గీ. సకలము నెఱింగి మాకు నైశ్వర్య మొసఁగ
జాగుచేసెద విది యేటి చంద మమ్మ!
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ!
సీ. దారిద్ర్యమునఁ గృశత్వదశ చెందెడివాఁడు
తనివి లేనట్టి సిగ్గునను మ్రిగ్గ,

సిగ్గుచెందినమీఁదఁ జెడిపోవుఁ దేజంబు
తేజంబు చెడిన దుస్థితి ఘటించు,
మీఁద నిర్వేద మాపాదిల్లు, నిర్వేద
మనుసరించిన శోక మినుమడించు,
నద్దాన బుద్ధికి హాని వాటిల్లు, ని
ర్బుద్ధియౌ పురుషుఁడు పొలియుఁ బిదప,

గీ. నిట్టిదుర్గతి కవులపై నెట్టువెట్టి
తమ్మ ? నీమన మెటు లొప్పెనమ్మ ? రమ్మ !
''కామధేనుస్మరణ'' నీదుకరుణ మాప
యని జిలుకవమ్మ ! యో జగదీశ్వరమ్మ!

సీ. గణియింతుమే ? మహైశ్వర్యగర్వాంధత
మసమలీమసులైన మనుజపతుల
నుతియింతుమే ? జగన్నుత్యవిద్యాప్రభా
వము నెఱుంగని మహీవలయపతుల
దర్శింతుమే ? కవిత్వప్రశంసావాస
నావాసితులు గాని నరపతులను
మన్నింతుమే ? సదా మానినీమధుపాన
ముఖదుర్వ్యసనులైన భూమిపతుల

తే. గీ. నెప్పుడేనియుఁ దప్ప దీ య ప్పటంచు
గొప్ప యగు నీకటాక్షమ్ము గుప్పితేని
''కామధేనుస్మరణ'' నీదుకరుణ మాప
యని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ !

సీ. త్వత్కటాక్షం బనుత్తమమహేంద్రత్వ ది
వ్యపద సంపాదనాపాదకంబు
త్వత్కటాక్షం బదభ్రభ్రశ స్తైశ్వర్య
ధనదతాపాదనాధాయకంబు

త్వత్కటాక్షంబు భాస్వత్సహస్రప్రకా
　　　శమహోధికృతి ముఖ్యసాధనంబు
త్వత్కటాక్షంబు విద్వత్తాకవిత్వాధి
　　　కత్వాదిసంధానకారణంబు

తే. గీ. ఇట్టిదని నీకటాక్షమ్ము నెఱిఁగి దీని
విడిచి యన్యుల నెట్లు సేవింతుమమ్మ!
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యిని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ!

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడైనఁ
　　　గవులతో సామ్యమ్ముగాంచఁగలఁడె!
ముజ్జగమ్ములనేలు పురుహూతుఁడైనను
　　　గవులతో సామ్యమ్ముగాంచఁగలఁడె!
నవనిధుల్ గల్గు మానవహయుండైనను
　　　గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె!
సార్వభౌమ్యముగల్గు జనపాలుఁడైనను
　　　గవులతో సామ్యమ్ము గాంచఁగలఁడె!

తే. గీ. హైన్యములకెల్ల హైన్యమైనట్టి దరిద్ర
హైన్యమొక్కటి వారికి శూన్యమేని
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యిని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ!

సీ. ఆర్చి చచ్చినఁగాని యన్యులకీక తా
　　　మనుభవింపని లుబ్ధజనుల విడిచి
వ్యాజ్యముల్ వేఁటలు నన్నమైపచరించు
　　　పరమపాతురిలను దుష్కృతుల విడిచి
రస మన నెట్టిదో యిసుమంతయైనను
　　　గలనైనలేని మొద్దులను విడిచి

హానివాటించు కార్యములొనర్పఁగ యత్న
ములొనర్చునట్టి కూళలను విడిచి
తే. గీ. అహహ ! దారిద్ర్యభారమ్ము నసఘులైన
కవులనెత్తినిబెట్టు టొప్పువునటమ్మ ?
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యిని జిలుకవమ్మ. యో జగదీశ్వరమ్మ !

సీ. బహుజన్మకృతతపఃపరిపాకమున మించు
నట్టి యుద్దండభాగ్యాతిశయమొ
భావికాలప్రాప్యఫలసూచకామేయ
మామకీనాదృష్టమహితకలయొ
అనిమిత్తజాయమానానూనకరుణాక
టాక్షవీక్షణ వైభవానుగమమొ
కామరూపకలాప్రకాశసౌభాగ్యసు
వ్యక్తీకరణచణప్రాభవంబొ
తే. గీ. కలను బ్రత్యక్షమైతి వేకారణంబొ
తెలియ దిది యూరకేపోదు దేవదేవి !
"కామధేనుస్మరణ" నీదుకరుణ మాప
యిని జిలుకవమ్మ, యో జగదీశ్వరమ్మ !

## జ్ఞా న ము.

—• ఆత్మబోధ (సంస్కృతమునకుఁ దెనుఁగు) •—

క. తపములచేఁ బాపమ్ములు
డిపి శాంతినిబొంది రక్తి డించి సదా ము
క్తిపదము గోరెడివారల
కుపకృతిగా నాత్మబోధ మొనరింతు మొగిన్.

గీ. మోక్షసాధనములలోన ముఖ్యసాధ
నంబు బోధయ ముక్తిపదంబు బోధ

లేకయుండినఁ గలుగదు; పాకమునకు
ననలమేకద ముఖ్యసాధనము జగతి.

క. అవిరోధి గానఁ గర్మం
బవిద్య నడపంగఁజాల దట్టి యవిద్యా
దవిలి తమంబును దేజం
బు విధమ్మైన జ్ఞాన మెలమిఁ బోఁగొట్టుఁజుమీ.

క. పరమాత్మం డజ్ఞాన
స్ఫురణమ్మైన భిన్నరీతిఁ జూపట్టెడిఁ ద
న్నిరసనము గలుగ మేఘా
వరణ మెడలు సూర్యపగిది స్వయము వెలుఁగున్.

గీ. జ్ఞాన మజ్ఞానకలుషతాకలితు జీవు
జ్ఞానవశమున నిర్మలుఁగా నొనర్చి
తానును నశించుఁ; గలుషమై తనరు జలము
చక్కఁజేసెడి కతకరజంబువోలె.

గీ. నిద్రవేళను స్వప్నమ్మ నిజముగాఁగఁ
దోఁచుభంగిని రాగాదిదుష్టమైన
సంసృతియుఁదోఁచు నజ్ఞానసత్తయందు
సత్యమై; యదివోవ నసత్యమగును.

గీ. అవ్యయుండును సర్వలోకాశ్రియుఁడు
నైన యీశ్వరుఁ డెందాఁకఁ గానఁబడఁడొ
జగము నందాఁక సత్యమై నెగడు; శుక్తి
యందు రజతంబు దోఁచెడునట్టిభంగి.

క. వ్యాపకుఁడును సదసచ్చి
ద్రూపకుఁడును సర్వసంగతుఁడునగు హరియం
దేపారు సర్వజంతు
వ్యాపృతి; కటకాదికము సువర్ణమునబలెన్.

క. ఆకాశము విధమునను హృ
షీకేశుండైన విభుఁ డశేషోపాధి
ప్రాకారుండై భిన్నుం
డై కనఁబడు నొక్కఁడగు నుపాధి నశింపన్.

గీ. జాతినామాశ్రిమాదు లీశ్వరునియందు
పాధిభేదమ్ముకతన నాపాదితమ్ము;
లకలుషమ్ము నమధురమ్మౌనౌ జలమ్ము
నందు రసవర్ణభేదముల్ వొందునట్లు.

క. పంచీకృతోచ్ఛభూతో
దంచితమై కర్మరచితమై తగు దేహం
బెంచఁగ సుఖదుఃఖమ్ములు
గాంచెడి భోగాలయమ్ముగాఁ జెప్పఁబడున్.

క. పంచప్రాణమనోబు
ద్ధ్యంచద్దశకరణయుక్తమగు సూక్ష్మంగం
బెంచ నపంచీకృతభూ
తాంచిత మిది భోగమునకు నగు సాధనమై.

గీ. అరయ నవాచ్యమైన యనాద్యవిద్య
కారణోపాధియని చెప్పఁగాఁ దగియెడి
నీ యుపాధిత్రయమ్మున కెవ్వఁ డన్యుఁ
డతఁడ వో! యాత్మయని చెప్ప నర్హుఁడెందు.

గీ. పంచకోశాదిసంబంధభావమునను
వస్తుతశ్శుద్ధమౌ పరవస్తువెలమి
నలరుఁ; దత్తన్మయమువలె నసితవర్ణ
వస్త్రయోగమ్ముకతన సుస్ఫటికమట్లు.

క. సకలగతుఁడయ్యుఁ బరమా
త్మ కనంబడఁ డెల్లచోట్ల మఱిఁ గన్పట్టున్

ప్రకటముగ బుద్ధియందే
ముకురాదులయందు బింబములవలె నెపుడున్.

ఆ. వె. కాయ చిత్త బుద్ధి కరణమ్ములకు నన్యుఁ
డై తదీయకృత్య మధిపుఁబోలె
నెవ్వఁడరయుచుండు నెల్లప్పు డతఁడవో!
యాత్మయనుచుఁ జెప్ప నర్హుఁడెందు.

క. కరణమ్ములు వ్యాపింపన్
బరమాత్మయు మూఢులకును వ్యాపారివలెన్
బరిదృశ్యుం డగు; మేఘో
త్కరము గదలఁ గదలునట్లు కనుపడు శశినా.

తే. గీ. ఆత్మ చైతన్యమును దగ నాశ్రయించి
కాయకరణమనోధీలు స్వీయకృతుల
వర్తిలుచునుండుఁ; బద్మినీప్రభునికాంతి
ననుసరించి మెలంగెడి జనులపోల్కి.

క. కాయేంద్రియగుణకర్మము
లా యమలుండైన సచ్చిదాత్మునియందున్
ద్రోయుదు రవివేకమ్మున
నీ యాకసమందు నైల్య మెంచెడిరీతిన్.

గీ. మానసోపాధిసంబంధమైన కర్తృ
తాదికం బాత్మయందుఁ బ్రమాదమునన
కల్పితంబయ్యె నుదకసంగతసుధాంశు
నందుఁ దద్గతచలనాదు లమరురీతి.

ఆ. వె. బుద్ధిసత్తయందవో! రాగమును నిచ్ఛ
యును సుఖాదికమ్ము నొనరుచుండు
నది యడఁగు సుషుప్తియందు నవియు లేవు
కాన నాత్మగములు కావుసూవె.

క. రవికిఁ బ్రకాశం, బగ్నికి
రవరవ, జలమునకు శీతలతయు స్వభావం
బవు విధమునఁ బరమాత్మకు
నవినాభావమున సచ్చిదాదులు వొలయుఁజా.

ఆ. వె. ఆత్మసచ్చిదంశ మరయంగ బుద్ధివృ
త్తియును వివేకవృత్తితోడఁ
గలిపెనేని గలుగుఁగా యహంకారమ్ము
కేవలాత్మ శుద్ధభావుఁ డెందు.

క. పరమాత్మకు వికృియ లే
దరయఁగ బుద్ధికిని బోధ మన సున్న యటం
చెఱిఁగియు జ్ఞాతృద్రష్టృ
త్వరీతులను జీవుఁ డకట ! తా మోహియగున్.

క. అరయుచు జీవునిఁగాఁ ద
న్ను రజ్జుసర్పత్వరీతి నూనముగాఁ దాఁ
బొరయు భయమ్మును నేనే
పరమాత్మ నటన్నమాత్రి భయము దొఱంగున్.

గీ. ఆత్మవలన వెలుంగు బుద్ధ్యాదికమ్ము
లాత్మ బుద్ధ్యాదికమ్మున కపృకాశ్యుఁ
డెలమిదీపము వస్తులు వెలుఁగఁ జేయుఁ
గాని యవి దీపతేజంబు గనుపఱచునె.

క. తనుఁదాఁ దెలియుట కన్యం
బనపేక్ష్యము బోధరూపుఁడగు నాత్మకుఁ ద
న్నును వెలిగింపఁగ దీపం
బున కొండు ప్రదీప మేల పొసఁగింపవలెన్.

గీ. "నేతి నేతి" వాక్యమ్ములచేత సకల
మైనయట్టియుపాధుల నవలఁ దోృచి

జీవపరమాత్మలకు సౌఖ్యసిద్ధినపుడు
వడయఁగా వలె నమ్మహావాక్యకలన.

మతము

—• శ్రీమదాదిశంకరులు •—

క. శంకరు సతతారాధిత
శంకరు వేదాంతశాస్త్రసాధితపంచి
త్పంకజభాస్కరు లోకా
లంకారు నుతింతు మదిఁ గలంక మెడలఁగన్.

గీ. ఎంతకాలమ్ము బ్రిదికిన నేమి ఫలము
జగతి కుపకార మెుక్కింత సలుపఁడేని
దానికై బాల్యమాదిగఁ దనదుజీవి
తమును వెచ్చించు శంకరుఁ దలఁపవలదె.

సీ. మండనమిశ్రితో మాటాడశక్యమే ?
భగవత్కృశాశక్తి ప్రబలదేని
భట్టభాస్కరుతోడ భాషింపశక్యమే ?
యెంతటిప్రతిభయు నెసఁగదేని
ఉపనిషద్భాష్యాదు లొనరింపశక్యమే ?
సర్వజ్ఞతారూఢి చనదయేని
అన్యకాయప్రవేశాలంబనము తేలి
కయె ? యోగపరిణతి గలుగదేని

తే. గీ. బ్రతికినదిచూడ స్వల్పమప్పావనుండు
సల్ప కార్యమ్ములకుఁ బట్టుఁ గల్పమేని
అతఁడు లేఁడననేల ? యేమయ్యె నిప్ప
టికిని మృతజీవుఁ డెల్లవారికి హితుండు.

చ. ఒరుల కెఱుంగరాని గతి నొండొకతేని కళేబరమ్మునన్
జొరఁబడి కామశాస్త్రపరిశోధనమున్ బొనరించి దాన వా
క్తరుణిజయమ్ము గై కొనుకతన్ బరిశీలనచేసి చూడ సం
సరణ మనాది జ్ఞానులను సైతము వీడదటంచుఁ దెల్పెడిన్.

చ. ఒకఁడననేల ? శంకరుమహోన్నతవర్తన మేది చూచినన్
సకలకళానివాస మగు చంద్రుబింబమునందుఁ బోలెఁ ద
క్కక యమృతంబు చిప్పిలుఁబె కన్పడు నయ్యనఘాత్ముఁగన్న త
ల్లికి మఱిఁదండ్రికిన్ జగతి లేరు మఱొక్కరు సాటి చెప్పఁగన్.

—• శ్రీ రా మ కృ ష్ణ ప ర మ హం స •—

మ. కరుణాదూరత నూరకే బలిగ నక్కాళీమహాదేవికై
నరులం జంపెడి వంగదేశపు ద్విజన్మస్తోమమం దెట్టులో
పరమార్థజ్ఞుఁడు రామకృష్ణుఁడు పరబ్రహ్మపరాంశమ్మునన్
ధరణింబుట్టెఁ దదీయ చిత్రచరితల్ ధ్యానింపఁగాఁ జెల్లవే.

సీ. చదువనేలేదఁట ! శాస్త్రములనొకింత
గురువయ్యె నేలాటి గురువులకును
అనుభవింపకయె యేలా చెందెనో విరక్తి !
యేవిరాగులు నేర రీ సమాధి
తనకన్న నితర మింతయు లేదని యెఱింగి
యును గాళికార్చనమును బొనర్చె
నీయుగమ్మునను లేనేలేని మహిమ లె
న్నెన్నియో చూపె నిరీహుఁడయ్యు

తే. గీ. ననుచుఁ జెప్పెద రయ్యనఘాత్మచర్య
విధినిషేధము లెఱుఁగక వేదవేత్త
లైన విద్వాంసులకును మాన్యతవహించి
తనరు శ్రీరామకృష్ణున కెనయె యొరులు.

శా. ఏ యోగీంద్రుని శిష్యుఁ డొక్కరుఁడు దా ద్వీపాంతరం బేగి వి
ద్యాయుక్తిన్ దగ వారి లోఁబఱచి "ధ్యేయం బిద్దియే" యంచు న
జ్ఞేయంబై చను తత్త్వముం దెలిపి యెన్నో దుర్మతాల్ మాపె సు
శ్రీయుక్తుం డల రామకృష్ణుసరి యేరీ జ్ఞాను లెందేనియుఁ ?

ఉ. వేదము పిచ్చి, శాస్త్రమన వెఱ్ఱి, యధర్మమ దెద్ది, యంచు వా
గ్వాదము సేయుసిట్టి కలికాలమునందును నెవ్వఁడో యొకం

డాదిమకాలమందు బలె నార్యుఁడు పుట్టఁగవచ్చు నంట దు
ర్వాదముగామి కియ్యనఘువర్తనమే యొకసాక్షి నాఁదగున్.

తే. గీ. వేదములు కష్టపడి వల్లెవేయనేల
శాస్త్రములలోఁ బరిశ్రమ సల్పనేల
రామకృష్ణ పరమహంసరాజు నోడువు
నట్టిబోధల నీయర్థ ముట్టిపడెడి.

—• శ్రీ వివేకానందస్వామి •—

సీ. పుట్టెనెవ్వఁడు హిందువులలోనఁ గాయస్థ
జాతిలో వంగదేశమ్మునందుఁ
జదివె నెవ్వం డొక్క సంస్కృతంబేకాక
యింగ్లీషు మొద లెన్నియేనిభాష
లరసె నెవ్వాఁ డొక్క యద్వైతమేకాక
భూమిలోఁగల మతమ్ములవియెల్లఁ
దిరిగె నెవ్వాఁ డాత్మదేశ మొక్కటె కాక
యఖిలమ్ములగు విషయమ్ములెల్ల

తే. గీ. నిహమునం గల్గు తుచ్ఛమౌ నిచ్ఛవిడిచి
బాల్యమాదిగ పరముకై పాటువడుట
తక్క నెవ్వాఁడెఱుంగఁ డితరము సుంత
ఆతఁడు వివేకయోగి దివ్యపదభోగి.

చ. ఎవనికి శక్యమౌ? మతములెల్ల విచారణనేయునట్టి హూ-
ణవరుల దేశమందున ఘనంబగునట్టి సభాస్థలమ్మునం
"దవసిని గల్గు మీ మతములన్నియు లేఁత" లటంచు ఖండనం
బు వొనరుపన్, స్వకీయ మతము న్నిలుపంగ, వివేకుఁ డక్కిసన్.

గీ. శంకరాదులు విజయంబు సల్పుచెల్ల
నాత్మరాజ్యమ్ము నంద, వీరట్లుగాక

యన్యదేశమ్ములకు నేగి యన్యమతము
వారి నద్వైతులుగఁజేయు ధీరవరులు.

గీ. ఇహమునకుఁ దక్కఁ బరమున కించుకేని
స్వప్నముననైన యత్నమ్ము సలుప నట్టి
హూణులను వేలకొలఁది దా నుద్ధరించి
జ్ఞానులనుజేసె నీ వివేకపర్రిభుండు.

శా. "మీసాల్వచ్చిన బాలురార !" యని, 'యెమ్మే' ప్యాసుగావించి బల్
వాసింబొల్చెడివారిఁ బిల్చి సభలో వాదమ్ము లేకే యుప
న్యాసంబిచ్చి "మత మ్మనంగ నొకయద్వైతంబ" యంచుం దగన్
దా సిద్ధాంతము సేయుధన్యుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్.

—• సమాజమువారి విజ్ఞాపనము •—

ఉ. హిందువులార ! మీమతమదెట్టిది, మీ రిపుడెంచుకోస మీ
చందమునన్ సమస్తము వెసన్ విడి దైన్యముపుట్టినిండులై
వందురుచుండియున్ బయికి వాసికి శీర్షములెత్తుచున్నవా
రిందుఁ గలట్టి సారమది యించుకయేని గ్రహించినారలే.

శా. ''టోపీ'' ల్వెట్టి "షరాయులం'' దొడిగి యెట్టోపొట్టకై వేసముల్
వే పూనుం డొకగంటయైన నెలకున్ ''వేదమ్ము తా నెట్టి ? దే
వ్యాపారం బట నుండు ? దానిచిగు రేయర్థమ్ము బోధించు?'' నం
చీపట్లన్ వ్యయముం బొనర్పుఁ డిది మీ కిప్పించు నుచ్చైర్గతుల్.

సీ. ధనవిహీనుఁడు ధనంబునుబొంది మోదించు
పైని నెద్దానికై వాంఛసేయుఁ
గాంతావిహీనుఁడు కాంత సంపాదించు
కొనుమీఁద దేనికై మనముఁ జొనుపు
సంతానహీనుండు సంతానమునుగాంచి
యులరుపై నెద్దాని నభిలషించు
రాజ్యవిహీనుండు రాజ్యమ్మునంది య
నంతరం బెద్దాని నాసఁజేయు

గీ. నట్టి యున్నత పదమును నందఁజేయు
పెద్ద "రైల్" యంత్రి మెయ్యెడ వెలయుచుండు
నదియ హిందూమతము దాని మొదలు తెలియ
కేల చెడిపోయెదరు వృథా యెఱుకవిడిచి.

గీ. మున్ను మనవారలందఱు దున్నపోతు
లిపుడు మతిమంతులము మన మెంతయేని
యనెడి దుర్భ్రాంతివలదు వారట్టిరేని
మనకుఁ దజ్జన్యులకుఁ దెల్వి యనువుపడునె !

చ. అడిగిన యాచకావళికి నంతయొ యింతయొ యిచ్చునట్లు సొ
మ్మిడు టొకలెక్కఁగా దిచటి కెప్పుడొ యొక్కపు దేగుదెంచి యి
య్యెడనగు సంగతుల్ వినుటయే కడు ముఖ్యము దానఁజేసి మా
పడెడి పరిశ్రమమ్ము ఫలవంతమగున్ మత మున్నతిం గనున్.

చ. ఎవఁ డుదయించి లోకులకు నెల్లరకున్ బరమాత్మసంగతిన్
వివరముగాఁ గఁ జెప్పి "సువివేకి" యనం జను నాత్మనామమున్
భవుకతరార్థయుక్తముగ భాసిలఁ జేసెనొ హూణభాషలోఁ
దవిలి పరం బొకించుకయుఁ దా మెఱుఁగంగ నశక్తులైన వా
రి విషయమై యెవండు సురవృక్షమునాఁగఁ బ్రసిద్ధిచెందె నిం
కెవఁ డవతారమందుటనె యెల్లరకున్ "మన వేదశాస్త్రముల్
ప్రవిమలముల్ మతెవ్వియును బావనముల్ జగమందు లే" వట
న్నవిషయ మాత్మకెక్కఁ జిననాఁడు మొదల్కొని యెవ్వఁ డెప్పుడున్
దవిలి పరానుషక్తుఁడయి ధర్మపుఁ జింతయొనర్చె నింకఁ దా
నెవఁ డిహవాంఛ మాని "పరమే వర" మంచుఁ జరించె నెవ్వఁ డీ
భువిని బరార్థమై తనదు బుద్ధిని విద్యను జీవితంబునున్
మివుల వ్యయించె నెవ్వనికి మించిన వేత్తలు నేఁడు లేరు; పూ
ర్వ విబుధులందు శంకరునివంటి మహాత్ముఁడుగూడ నెవ్వనిన్
శివకరు మెచ్చ నొప్పికొను; శ్రీయన నెవ్వనికిన్ దృణఁబు స

ర్వ విభవముల్ మఱెవ్వనికి వశ్యము; లట్టి వివేకయోగికై
యెవరు మఱెంత వ్రాసినను నెక్కుడుగామియుఁ దక్కువౌటయున్
దవులు సతం బొకండు జననంబును గాంచఁడయేని యొక్కఁడున్
మివులఁడు హూణవిద్యలను నేర్చెడివారలయందు హిందు; వా
శివునకు వా శివాత్మునకు శ్రీహరికిన్ దదభేదరూపుఁడౌ
ప్రవిమలయోగికి న్నతు లపారముగా నొనరింపఁ జెల్లదే
సువిమలులార! హిందుమతసూత్రిమెఱింగిన యోగ్యులార! య
న్యవిషయముల్ మఱెవ్వరికి నబ్బిననున్ మతసంగతుల్ విశే
షవిధిని భారతావని నొసంగెడివారికె యిచ్చినాఁడు లో
కవిభుఁడు; ముక్కుముక్కలుగ ఖండనసేయఁగ నీమతంబు దా
నవయదు, రూపుమాయదు, తనంతన వృద్ధిని గాంచ నేర్పు ని
క్కువ మిది దీనినే సతము గోరుఁడు బాగుపడుందు మీ రొగిన్.

— శ్రీకృష్ణ కథాసంగ్రహము —

చ. జననమునందె బంధనపు సద్మమునందున; వేఱుచోటికిన్
జనె; నటఁ గంసుపంపున వెసన్ బురుటింటికి వచ్చినట్టి పూ
తన చనుఁబాలు గ్రోలె; నది దా స్వకృతాఘముకల్మిఁ జచ్చెమీఁ
దను శకటాకృతున్ గెడపె దానవు; నాపయి గాలిరక్కసుం
దునిమెను; మీఁదఁ దల్లికి వినోదముమై సకలప్రపంచముల్
గనఁబడఁజేసె; ఱోలఁ దనుఁ గట్టినయప్పుడు రెండు మద్దిచె
ట్లను బడఁగొట్టె; వత్సుఁడను టక్కరిరక్కసు నుక్కఁజెక్కె; దు
ర్మనసు బకున్ హరించెఁ; బయి మట్టెను ధేనుకు, గార్దభాకృతిన్;
ఘనవిషపూరితున్ బిదపఁ గాళియు యోగ్యునొనర్చె; దావవ
హ్నిని నొగిఁ గ్రోలెఁ; బర్వతము నెత్తె, వధించెను శంఖచూడనా
ముని; నొక గుహ్యకున్ జదియ మోఁదె; వృషాసురు, వ్యోమకేశులన్
దునిమెను; గంసుఁ జంపెను; విధుద్యుతివక్త్రను రుక్మిణిన్ వరిం
చెను; మఱిఁ గొందఱన్ సతులఁజేకొనె; భూసుతు రూపుమాపె; న
ద్దనుజు చెఱన్వసల్చిన పదంపడి తన్ను వరించినట్టి కా

మినులఁ బదాఱువేలఁ గొనె; మేకొని బాణుని గర్వమూడ్చె; నిం
కను మఱికొందఱం దునిమెఁ గష్టుల దుష్టుల భ్రష్టులన్; మహా
మునియగు నారదుం డడుగ మోదముమైఁ దనలీలఁ గామినీ
జన గృహపంక్తి నొక్కమొగిఁ జక్కఁగజూపి నిరుత్తరున్ బొన
ర్చె; నితఁడె నందనందనుఁడు, శ్రీహరి యీతఁడె, యీతఁడే జగ
జ్జననము రక్షయున్ లయము సల్పు పరాత్పరునంశ, మీతఁడే
ఘనులగు పాండవేయుల కకారణబంధువు, వీనిచర్యలన్
గనుఁగొని చెప్ప శక్యమనఁ గా దెటువంటి మునీంద్రపాళి; కీ
యనఘుఁడు నేఁడు పుట్టె; నిది యందఱ కప్పటినుండి పూజ్యతఁ
గనె దిన, మి మ్మహామహానికై మన మియ్యెడ నేఁడు గూడి యీ
తని చరితంబు పాడితిమి ధన్యతఁ గంటిమి తప్ప కిక్కత
మ్మున మనకున్ బ్రమోదములు పొంపిరివోయెడి సభ్యులార! వం
దనము లొనర్పుఁడీ యెలమి నందునిపట్టికి గొల్లకుట్టికిన్.

—♦ భాష ♦—

ఆంధ్రమహాకవిప్రశంస

ఉ. శ్రీకరమాంధ్రభారతము చేయఁగఁ జేసె నెవండు నన్నయా
ఖ్యాకమహాకవిప్రవరు నంజలిబంధముతోడ వేఁడి; సు
శ్లోకుఁ డతం డుదారగుణశోభితుఁ డాంధ్రకవిత్వదివ్యధా
రాకుతుకీకృతాంతరుఁడు రాజనరేంద్రుఁడు వొల్చు నేఁటికిన్.

ఉ. ఏగతినో కవిత్వము ననేకులు సెప్పెడువార లుండ స
ర్వాగమవేది నన్నయమహాకవియే యని నిశ్చయించి యు
ద్యోగిని జేసె "భారత మహోదధి నీఁదు" మటంచు నెవ్వఁ డా
హా! గణుతింపఁ జెల్లదె మహామహు రాజమహేంద్రు నాతనిన్.

ఉ. చచ్చి శరీరమున్ విడిచి చన్న నృపుల్ గల రెందఱేని వి
ద్వచ్చయమాన్యమున్ సుకవివంద్యమునై తగు కీర్తికాయ మీ
సచ్చరితున్ భరించె నిది శాశ్వత; మీనృపు సన్నుతించి స
ర్వోచ్చపదంబుఁ గైకొనుట యొప్పదె యిప్పటి యాంధ్రజాతికిన్.

తే. గీ. రాజరాజనరేంద్రుండు పూజనీయుఁ
డైన నన్నయసుకవియు నాంధ్రభాష
భారతం బను నిధిలోన భద్రపఱచి
యుంచుటను గాదె మనకు సుయోగమబ్బె.

ఉ. నన్నయగారి త్రోవఁ గొని నవ్యగుణంబులు కొన్ని చేర్చి తి
క్కన్న మహాకవిప్రవరుఁ డాంధ్రికవిత్వము వృద్ధి చేసె; నె
ఱ్ఱన్నయు వీరి త్రోవఁ గొని యర్హత యింకొక కొంత యిచ్చె; స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహోదధినాఁ జను నాంధ్రిభాషకున్.

ఉ. పెక్కుమహాకవుల్ పిదపఁ బెక్కు పురాణము లాంధ్రిభాషలోఁ
దిక్కనగారి త్రోవను సుఖేహిత మొప్పఁగఁ జేసి రంతతో
నెక్కడఁ దెల్గుసేయ మది కెక్కు పురాణము లేక పోయె స
మ్యక్కృతికర్త నైషధమహాకవిమౌళి జనించె నంతటన్.

చ. ఇతని కవిత్వపుం గరిమ నెన్నఁగ నన్నయ యంతవానిఁగాఁ
గృతిమణు లెల్లఁ జెప్పుదు రహీనమహాకవితాసురాపగా
వితతమహీతలుం డితఁడు విశ్వజనీనము నైషధంబు కా
వ్యతతిశిరోవిభూషణము నాంధ్రిముచేసి యొసంగె భూమికిన్.

ఉ. ఈతనికాలమందుఁగల రెండవొ సత్కవు లందఱున్ మహా
ఖ్యాతిపరుల్ కృతిప్రివరకల్పకు లాఢ్యతరాగ్రిహారవి
ద్యోతను లుద్యదాశుకవితోద్ధతు లందఱియందు నీతఁడే
నేతగ ద్యోతిలెఁ దను మనీషిమణుల్ సతతమ్ము మ్రొక్కఁగన్.

శా. శ్రీనాథుండు యశశ్శరీరమును దాల్చెం గొంతకాలాన కా
పై నాంధ్రావని భాగ్యపుంగరిమకున్ బ్రాపై జనించెన్ రసా
నూనాత్యాశుకవిత్వ తత్త్వసతతోద్యోగప్రవీణుండు భా
షానంతుం డల పెద్దనార్యుఁడు బుధానందానుసంధాతయై.

ఉ. "ఆశుకవిత్వతత్త్వమిది యో నిది కా"దని కృష్ణరాడ్యశో
రాశిసభాస్థలమ్మున ధురంధరులౌ కవులున్ ధరాంగనా

ధీశుఁడు కృష్ణరాట్కవియు హెచ్చుగ మెచ్చఁగఁ బెండెరంబు సూ
రీశుఁడు పెద్దనార్యుఁడు గ్రహించె రచించె స్వతంత్రకావ్యమున్.

తే. గీ. ఆంధ్రకవితాపితామహు ననుసరించి
వసుచరిత్రంబు రచియించె బట్టుసుకవి
ధారలో భేదమున్నను దానికన్న
మిన్నయవి దీవిఁ బలువురు మెచ్చుకొంద్రు.

తే. గీ. నారికేళపాకమ్మున సూరివరుల
నలరఁ జేయు నాముక్తమాల్యద రచించి
నట్టి శ్రీకృష్ణరాయలయనుఁగు మేన
యల్లుని కవీంద్రుఁడగుచు శోభిల్లె బట్టు.

క. బట్టయ్యె వితఁడు నన్నయ
భట్టారకముఖ్యసుకవివరులకు దీటై
దిట్టయయి శ్లేషకవితకుఁ
బెట్టిన పేరై యశస్సు పెంచె జగమునన్.

ఉ. పిమ్మట నుద్భవించె నలపింగళి సూరన యాతఁ డెంతయున్
గమ్మనిపల్కులన్ గవిత కల్పనసేయు సుధీవతంసుఁ డిం
కమ్మహనీయు లెందఱొ జగమ్మున నాఁడుగలారు వారిలో
నిమ్మహితుండె పేరువడె నీతనిధార మహాద్భుతంబగున్.

ఉ. బమ్మెర పోతరా జనెడి భాగవతాంధ్రకవీంద్రునిన్ జగ
త్సమ్మతు రామభక్తు సరసప్రథితాంధ్రకవిత్వరాశి నీ
పిమ్మటఁ జెప్పఁగాఁదగదు పెద్దకవీంద్రుల కెల్లఁ బెద్దగా
నిమ్మహితున్ వచింపవలె నీతనిశక్తి యనన్యసాధ్యమౌ.

చ. ఘనమతు లెందఱో గలరు గాని యదేమొ తెనాలి రామకృ
ష్ణుని కవితామహత్త్వ మతినుత్య మటంచుఁ గవీంద్రులందు రా
యనఘుని ధాటిఁ జూచిన నహో! యనకుందురె యేరు గాని, యె
వ్వని నని యెన్ననేరుతు మహాను లనేకకవీంద్రు లుండఁగన్.

చ. విజయవిలాసకర్త సువివేకి మహాకవి యన్యజాతికిన్
ద్విజునకు నుద్భవించిన సుధీతిలకుం డితనిన్ మహాకవి
వ్రజ మసమానుఁ డంచును బ్రబంధము చూచి నుతింతు రింత ది
గ్విజయము గొన్న కావ్యమె భువిన్ రసధోరణిఁ గానరాదుగా.

గీ. స్త్రీలలోఁగూడఁ గొందఱు శ్లేషలాది
గాఁ గలుగు ప్రౌఢపద్ధతుల్ గలయఁగూర్చి
చెప్పిరొకకొన్ని కావ్యముల్ మెప్పుగనిరి
నాఁటి సుకవులచే ధరానాథ ుఖల.

మ. తతవిద్యారసికప్రచారుఁడగు శ్రీతంజాపురీవల్లభా
చ్యుత(శ్రీమద్రఘునాథభూపుదనుకన్ శోభిల్లె నానాఁట ను
న్నతికిన్ వచ్చుచు నాంధ్రసత్కవిత; పై నానాఁటక్షీణించుచున్
గతికిందక్కి యధోగతిం బడి యెటో కాలూఁది మూలం బడెన్.

ఉ. అంతట హూణరాజ్యపు సమాదరణంబునఁ జేసి యెట్టులో
వంత యొకింతతగ్గె నటువాడిన యా కవితాలతాంగికిన్;
సుంత విచార మాపె విడి శోభకు వచ్చెడునంత నేదియో
చింత యొకండు వచ్చె నది చెప్పఁగ నేల జగత్ప్రసిద్ధమే.

ఉ. దానిని దెచ్చి పెట్టిన విదగ్ధులుఁ గూడ మహోపకారమున్
బూని యొనర్ప నెంచిన ప్రబుద్ధులె కాని మతేరుఁ గారు ; వీ
ర్మానస మందు నొజ్జగను మాఱుపఁబోయినఁ గోఁతి యౌట సం
ధానము చేసె దేవుఁ డది తజ్ఞులు తీరుపఁ బూని రంతటన్.

తే. గీ. ఆంధ్రభాషాపరిషదాఖ్య నలరు మీదు
సభ విమర్శించి కవితకు సంభవించి
నట్టి కష్టమ్ము దీర్చె నోయనఘులార !
ప్రాజ్ఞులార; మదాప్రిస్పురీవాసులార !

సీ. మీయాంధ్రపరిషత్తు మేదినీనాథుల
యాదరణకుఁ బాత్ర మగును గాక

మీయాంధ్రిపరిషత్తు మేటివిద్వత్కవీం
ద్రులకు నానందమ్ము గొలుపుఁగాక
మీ యాంధ్రిపరిషత్తు జాయమానానేక
కృతుల కానందమ్ము నిచ్చుఁగాక
మీ యాంధ్రపరిషత్తు రాయలవారి యా
స్థానంబుతో గొండ్లి సల్పుఁగాక

గీ. దీనిఁ బోషించు నృపులకు, దీనియందుఁ
బట్టుదల గల్గి పనిచేయు పండితులకు
నాయురారోగ్యములనిచ్చి యాంధ్రికవుల
కబ్బములఁ బేర్మి మన్నించి కాచుఁగాక.

— రవీంద్రినాథఠాకూరు —

శ్లో. సర్వద్వీపవతంసచారుకవితామల్లీప్రసూనస్రజే
వాగీశాయ రవీంథ్రినాథకవయే కుర్మశ్శుభాశంసనం
హేలానిర్మితయాఽపి కావ్యసుధయా భాషాంతరీభూతయాఽ
ప్యామోదం వితనోతి య స్సుమనసాం సర్వప్రపంచేఽధునా.

శ్లో. టాకూరువంశాంబుధిపూర్ణచంద్రో
దేవేంద్రనాథస్య సుతో మహార్షేః
బంగాళహూణామరదేశభాషా
నిధిః పురోభాతి రవీంద్రినాథః.

శ్లో. ఖండేఖండే సగర్యామపిచజ నపదే దేశభాషా స్వనూక్తం
పుణ్యాదేకాగ్రిచిత్తాః పులకితవపుషో యస్య కావ్యం పఠంతి
వాగ్దేవీ యస్య వాచి క్షిపతి మధురురీం శీతలాం భూతధాత్రీ
సర్వేషామక్షియుగ్మం సపది వితనుతా మాతిథేయం రవీంద్రిః.

సీ. అఖిలదేశసముచ్చయంబైన బహుమతి
గణియించె నే సూరి కౌశలంబు

రసవత్కథానక ప్రసరణావిర్భూతి
కల్పించెనే కవికల్పనంబు
భరతఖండము కవిప్రభుజన్మఖని యన్న
ఖ్యాతిస్థాపించె నేఘనుని పేరు
సర్వవిద్యాగారచత్వరమ్ములయందుఁ
దాండవంబాడె నే ధన్యు కీర్తి

తే. గీ. సుకవితాశక్తి నట్టి భాసురగుణుండ
వరుగుదెంచితివయ్య ! మాపురికిఁ గాకి
నాడ కీనాఁటికి రవీంద్రనాథసుకవి
సార్వభౌమ ! యిదే నీకు స్వాగతంబు.

సీ. వంగరాష్ట్రము గర్వపడునట్టులు మహర్షి
దేవేంద్రనాథుఁ బుత్రీకరించె
భారతీయులు తుష్టిపడఁగ "నోబిలు ప్రైజు"
గైకొనె సరసమౌ కవనమందు
సర్వానుభవనీయసంగతుల్ చొనుపుచు
వర్షించెఁ బెక్కు కావ్యములు జగతి
నన్యఖండముల బ్రహ్మైక్యమ్ము వివరించు
గీతాంజలి రచించి కీర్తివడసె

తే. గీ. జ్ఞానమునయందెకాక యైశ్వర్యమందు
సైతము రహించె భాగ్యవిస్ఫూతి మెఱయ
నవసుధామూర్తికి రవీంద్రనాథుకీర్తి
కభ్యుదయ మబ్బుఁగాత నిరంతరంబు.

—• ఒ క క వ యి త్రి •—

మ. జననంబందితి సత్కవీట్కులమునన్ సత్సేవ కావించి పెం
చినకైతన్ బరమాత్మసాత్కృతిగ వాసిన్ సర్వమర్పించి స

జ్జనమాన్యత్వము గాంచి శాశ్వతయశస్సంతాన మార్జించితో
కనకాంబా ! సతులందు నీ కుపమ లోకంబందు లేదెందులన్.

శా. కాశీనాథునివంశదీపకుఁ డనంగా నెందుఁ బెంపొందు నా
గేశుం దేనును శ్రీపదాన్వయుఁడు శ్రీకృష్ణుండు లోనౌ సుధీ
వైశంపాయను లట్లు నీదుకవితన్ వర్ణించి నాఁడిచ్చునా
యాశీర్వాదము చాలదే ! సుకృతి బ్రహ్మానందమున్ జెందఁగన్.

క. ఉవిదకుఁ దిలకముకన్నన్
బ్రవిమలభూషణము లేదు ప్రారబ్ధమునన్
దవులదది నీకుఁ బోనీ
కవితిలకమవైతి లోటుగనుపడదింకన్.

—• ఆంధ్రకవులు •—

ఉ. సారతరార్థసంపదలు సారససారసరఃప్రసారము
ల్గా రసవత్తరంబుగ నిగారము గారము దోఁప సాహితీ
భారతి భారమంతయును భారతమం దిరవొంద నాంధ్రభా
షారమణీరమం గొలుచు సజ్జను నన్నయభట్టు నెన్నెదన్.

ఉ. తిక్కనసోమయాజికి నతిఁ బొనరింతుఁ గవిత్వలక్ష్మికిన్
దిక్కగువాఁడు, నన్నయ గతించినమీఁద నతండు చేయునా
తక్కినభారతంబును సుధామధురంబుగఁ దెల్గుఁ జేసి పెం
పెక్కినగొప్పవానికిఁ గవీశ్వర కామితరాజధానికిన్.

ఉ. భారతకృత్కవీశ్వరులపక్కని దాఁటఁగ రామి వారికిన్
మాఱటయా పనంగ నసమానతరప్రతిభాసమృద్ధి పెం
వార నరణ్యపర్వమును పాంతము చేసినమేటికిన్ సుధీ
హీరునకుం బ్రబంధపరమేశున కంజలి సంఘటించెదన్.

ఉ. భాగవతంబు సర్వరసబంధురమున్ దెలిఁగించినాఁడు స
ర్వాగమసారవేది జతరార్థముగాఁ జెయిసాఁచకే మహా
భాగుఁ డితం డటంచు నరపాలురు మెచ్చఁగ జీవితంబు సాం
పౌగతి నోమినాఁ డితరు లౌదురె పోతనవంటిసత్కవుల్ !

సీ. పసితనంబుననుండి బహురసప్రథితప్ర
బంధనిర్మితికిఁ బాల్పడినవాఁడు
నన్నయాదికకవీంద్రశ్రేణి కెనవచ్చు
పాండితీగరిమ చేపట్టినాఁడు
దేశంబు లన్నియుఁ దిరిగి తత్రత్యభూ
పతులసన్మానంబుఁ బడసినాఁడు
శయ్యాచమత్కారసంప్రదాయంబున
నతనుప్రతిష్ఠ చే నలరినాఁడు

తే. గీ. భాసురానూనకవితాప్రసారసార
తోషితాశేషభూపతిస్తూయమానుఁ
డతఁడు పొగడొందు శేముషీవితతకీర్తి
ధట్టచరితుండు శ్రీనాథభట్టసుకవి.

ఉ. కాతరభావ మించుకయుఁ గాని యెఱుంగనిపాండితీబల
స్ఫీతకథావిధానసరసీకృతచారుతరప్రబంధని
ర్మాతలు, సాహితీముదితమానవపాలకులై చెలంగు నా
కేతనమారనాదికవికేతనులన్ గణుతింతు నిచ్చలున్.

ఉ. సంగతచాతురీమహిమసారఘుమంఘుమితప్రసిద్ధస
ర్వాంగమనోహరాయు కవితారభటీపరిపూర్ణసర్వది
క్ప్రాంగణు హాస్యకృత్కవి ననర్గళచారుపదప్రయోగశా
లిం గణుతించువాఁడఁ గవిలింగని లొంగని భక్తిపెంపునన్.

సీ. ఆంధ్రకవిత్వమ్మునందుఁ బితామహ
ఖ్యాతిఁ గైకొన్న పెద్దన్న యొకఁడు
అంగనామధురాధరాకారసుకవితా
స్వాదిమ గలుగు ధూర్జటి యొకండు
ముద్దుమాటలచేత మోదమ్ము గలిగించు
నసమానసుకవి తిమ్మన్న యొకఁడు

తగుచతుర్విధకవిత్వంబులందును చారు
కీర్తి గాంచిన భట్టుమూర్తి యొకఁడు
తే. గీ. మొదలుగాఁ గలసుకవిసమూహమునకుఁ
దనసుధాసమకవితచేతనప్రమోద
మాచరించినకృష్ణరాయావనీంద్రు
నపరదేవేంద్రు నెంతు ననారతంబు.

ఉ. నాటకశైలి యాంధ్రకవనంబునకుం దలఁజూపఁజేయుచున్
మోటుతనంబు సూపనివి నూతనవర్ణన లుద్ధతిన్ మనః
పేటిక నిండుతుష్టి, కవివీరులకుం గలిగించినట్టి యా
మేటికవీశ్వరుండు కవిమిత్రుఁడు సూరనకున్ నమస్కృతుల్.

తే. గీ. మఱియు నాంధ్రప్రబంధముల్ మహితకీర్తు
లొనరఁ గావించి యాంధ్రలోకోపకార
మాచరించినసుకవుల కాచరింతు
వివిధనాములకు నృతుల్ వేనవేలు.

తే. గీ. పెక్కు లాంధ్రప్రబంధముల్ కుక్కుటేశ్వ
రునకు నంకిత మిచ్చి పేరుం బ్రతిష్ఠఁ
గొనినసత్కవిచంద్రుండు కూచిమంచి
తిమ్మకవి కిప్పు డే వందన మ్మొనర్తు.

తే. గీ. ఆశుధారాకవిత్వవిఖ్యాతిచేత
శతవధానవిధానప్రశస్తిచేత
మధురతరసుప్రబంధనిర్మాణమున య
శంబుఁ గాంచినవేంకటాచార్యుఁ దలఁతు.

చ. సరసతరప్రబంధము లసంఖ్యముగా రచియించి భూమిపైఁ
బరపి శతావధానము లపారముగా రచియించి సర్వభా
స్వర మగుకీర్తి నల్దెసల వ్యాప్తము జేయుచు సర్వదేశముల్
తిరిగిన వేంకటేశకవిదేశికు సన్నుతిఁజేతు నిచ్చలున్.

— చతుర్థాంధ్ర మహాజనసభ, కాకినాడ: —

శ్లో॥ వందేమాతర మార్యచుంబితపదా మాసేతుశీతాచల
ప్రఖ్యాతాం కమనీయశైలవిపినస్వాదూదకహ్రాదినీం
నైకస్వాదిమపూరపూరితఫలశ్మోరుట్ప్రమేతోర్వరాం
నానాభాషిత భూషితాంచ విదుషీం వీరప్రసూశేఖరాం.

సీ. అభ్రచుంబితశిరోదభ్రంబులగు పూర్వ
పశ్చిమోత్తరగిరిప్రతతిచేత
మధురనిర్మలపయఃప్రథితంబులౌచు సం
తతముగఁ బ్రవహించు నదులచేతఁ
దరులతాగుల్మకందవనౌషధీనిదా
నములచేఁ దగు కాననములచేత
సంపూర్ణసర్వసస్యప్రశస్యములైన
కమనీయభూమిభాగములచేత
గీ. సుప్రతోఁ దొమ్మిదింటి కింకొకప్రదేశ
మునకుఁ బోకుండ సంసారమును భరించి
శూరులును పండితులు నగు సుతులఁగన్న
తల్లులకుఁ దల్లి! భరతమాతకు జయంబు.

సీ. చాళుక్యభూపాలసర్వతోముఖరాజ్య
పరిపాలనంబున గరిమవడసి
కాకతీయనరేంద్రకలితసింహాసన
శాసనంబున సుప్రశస్తిఁగాంచి
అర్వీటివంశజాతోర్వీశ్వరప్రాభ
వమున నిస్తులిత వైభవముఁజెంది
విజయనగరరాజ్యవిక్రమసాహచ
ర్యంబుచే విఖ్యాతి నధిగమించి
తే. గీ. రెడ్డి రాజులచేత కీర్తిని వహించి
వెలమ సంస్థానములచేత వినుతికెక్కి

నేఁటి కాంగ్లేయ సామ్రాజ్యపాటవమునఁ
బ్రబలు మన యాంధ్రమాతకు వందనములు.

సీ. గోదావరీనదీపాదోదకముద్రావి
ఫలియించు కేదారవసతివలనఁ
గృష్ణానదీమహోత్కృష్టనీరపయో
గముచే ఫలించు భూగరిమవలనఁ
దుంగభద్రానదీతోయంబు సస్యసం
పూర్ణంబుగావించు పుడమివలనఁ
బెన్నాతరంగిణీసన్నుతామలనీర
నీరంధ్రమగుపంటనేలవలన

తే. గీ. మఱియు ఋషికుల్య మొదలైన ఝరులవలన
తనుజులను కష్టపడి పెంచుకొనుచు నాత్మ
గౌరవముతోడ తన పరివారిలోనఁ
దనరు మాయాంధ్రమాతకుఁ బ్రణతిశతము.

సీ. రాజరాజనరేంద్రుతేజోవిభూతితో
వెయ్యంబుగన్న నన్నయ్యవలన
మనుమసిద్ధినృపాలుమహనీయకీర్తిచే
మన్ననఁగన్న తిక్కన్నవలన
వనవేమభూపాలుఘనయశోలక్ష్మికిఁ
బట్టైన శ్రీనాథభట్టువలనఁ
గృష్ణరాయని కీర్తి కిరవులై పేరుఁజెం
దిన ఘనుల్ పెద్దనాదికులవలన

తే. గీ. మఱియు సోమన పోతన మారనాది
కవులవలనఁ గవిప్రసూఖ్యాతిఁగాంచి
యాంధ్రభాషాప్రపంచ మేమఱక నేఁటి
దనుక నిలిపిన యాంధ్రమాతకు జోహారు.

సీ. మనభాషతోడనే మనతల్లికి సపర్య
విసువులేకుండఁ గావింపవలయు
మనయింటి పెత్తనం బొనరించుచును మన
యమ్మయే మసలఁగాపాడవలయు
మనమండలంబున మనతల్లి వేఱ వ
సింపఁగా గృహముఁ గట్టింపవలయు
మన సహోదరులు సామంజస్యమున నేర్పు
చదువులే మనమెల్లఁజదువవలయు
తే. గీ. మనము గావింపఁదగు ప్రయత్నములెల్ల
సులభమగు రీతిగా మన సోదరులకు
మాతృభాషనె వార్త బంపంగవలయు
నాంధ్రదేశీయులార ! మాయన్నలార !

సీ. ఆంగ్లేయసామ్రాజ్య మధిపతిస్వాతంత్ర్య
ము నొసంగ మనకిది మొదటిమెట్టు
మనమెల్ల నైక్యసంపదమీఱఁ గావించు
మనపురోవృద్ధికి మనికిపట్టు
మనభాష యభివృద్ధిఘనతయు సర్వశా
స్త్రపరిపూర్తివహింప రచ్చపట్టు
మాతృసేవ త్యజించి మన మన్యసేవకై
దాఁటిపోనీయని తాళ్ళకట్టు
తే. గీ. మొనయు సంఘదురాచారములను నెట్టు
రాజభక్తిని గూల్పని రాతిగట్టు
స్వీయగౌరవ మరికట్టు చెంపపెట్టు
మానకుం డాంధ్రజనులార ! మనలపట్టు.

సీ. విభజించియును ప్రజాభిప్రాయమునుబట్టి
వంగదేశము గలుపంగలేదె

కోరినమాత్రి బేహారురాష్ట్రంబది
ప్రత్యేకముగఁ జేయఁ బడఁగలేదె
శాసనసభకుఁ బ్రజాప్రతినిధులను
నెన్నుకో నధికార మీయలేదె
అనుమతింపఁగలేదె హైందవంబగు విశ్వ
విద్యాలయంబు స్థాపించుటకును
తే. గీ. కోరికలుకోరినంత చేకూరలేదు
మాకటంచుఁ బ్రయత్నంబు మానరాదు
పట్టుదలమానకుం డాంధ్రిధట్టులార!
తెగువఁ జూపింపుఁడీ తెల్గుదిట్టలార!

సీ. మనపురోవృద్ధి సాధనము లాలోచించు
సభ లిట్టు లేటేట జరుగుఁగాత
మొలకలెత్తిన తెల్గు 'మూమెంటు' మనపెద్ద
యన్నల కభివృద్ధియగునుగాత
ఆబాలగోపాల మాంధ్రు లందఱు రాష్ట్ర
విభజన కేకీభవింత్రుగాత
సామ్రాజ్యశాసనసభలోన నీరీతి
తీర్మాన మొక్కటి తెత్రుగాత
తే. గీ. భాషలంబట్టి రాష్ట్రవిభాగ మొకటి
మొదటఁ గావించుదురుగాత! పిదప నిండి
యాను నాస్త్రేలియాఁబోలునట్టిదాని
నొనరుతురుగాత మన దొరతనమువారు.

—• ఆంధ్ర సాహిత్య పరిషత్తు. కాకినాడ. •—

తే. గీ. చెన్నపురమునఁ గాఁపుర మున్నయట్టి,
యాంధ్రిపరిషత్తునకు శుభప్రాప్తిరస్తు!
ఆంధ్రభాషకు వాదంబు లాడుచున్న
యుభయపక్షంబులకు నైక్య ముండుఁగాక!

సీ. ఆంగ్లేయభాషాంగ నానుకూల్యంబున
సరిలేని సాహిత్యగరిమ వడసి
దేవభాషాంగనా సేవనాబలమునఁ
దులలేని సౌభాగ్యకలనఁ గాంచి
నన్నయాదులు కవినాథు లేర్పఱచిన
యెనలేని మార్గంబు ననుసరించి
ప్రతివేశినుల నన్యపరిషత్కులస్త్రీల
ప్రతిలేని యాచారపటిమఁ గాంచి

గీ. ముద్దుబిడ్డలు మాటాడుసుద్దులెల్లఁ
జక్కపఱచుచు నభివృద్ధి కెక్కఁగాక :
ఆంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి
సద్యశోధక్క దిక్కులఁ జాటుకొనుచు.

సీ. దాతృత్వమందు రాధాతనూజాతున
కవల నేడాకు లెక్కువపఠించె
నపరిమితాదృష్టమందు సుదర్శన
ధరణిజానిని దలదన్ని మించె
బాల్యంబునంద సౌశీల్యాదిగుణముల
ధర్మరాజును దలదాఁటి మించెఁ
జిన్నతనంబునం దన్ని దిగంతంబు
లును తనకీర్తికామినికిఁ జూపె

గీ. నాంధ్రభాషను బోషించె నట్టిఘనుఁడు
రావుకులమణి శ్రీసూర్యరాయనృపతి
నేఁటియగ్రాసనాధిపుం డౌట చూడ
నాంధ్రపరిషత్తుచేయు పుణ్యంబు గాదె.

సీ. ఇంగ్లీషుభాషలో ఎం. ఏ; బి. ఎల్; దాఁక
ప్యాసుచేసిన మహాపండితుండు

సంస్కృతాంధ్రంబుల శతఘంటకవనంబు
పచరించినట్టి విద్వత్ప్రభుండు
ఆనందదంతీశ్వరాఖ్యరాజాఖండ
లుని కెంతయును బ్రీతి మనిన మేటి
విజయపురీహూణవిద్యామహాశాల
ప్రినిసిపల్ పదవి గాంచిన ఘనుండు
గీ. ధరఁ గిలంబ్యస్వవాయసుధామరీచి
యనఁగ నొప్పారు రామానుజార్యమౌళి
నేఁటియగ్రాసనాధిపుం డౌట చూడ
నాంధ్రపరిషత్తు సేయు భాగ్యంబు గాదె.

— ఆంధ్ర సాహిత్య పరిషత్తు, రాజమండ్రి —

మ. స్మయమానాంధ్రమయప్రసిద్ధకవితా సామ్రాజ్యపట్టంబు న
న్నయ కర్పించిన నీపయః ప్రస్మృతి కీనాఁ డాంధ్రసాహిత్యవా
ఙ్మయవల్లీతతి నాంధ్రలోకహృదయావాలస్థితన్ బెంచి భ
వ్యయశోభూతులు గూర్చు టొక్కవిషయంబా? తల్లి! గోదావరీ.

సీ. "చినఁగిపోయిన ప్రాఁతచీర కట్టక పట్టు
కోక లేటిక" యంచు గొణుఁగువారు
"ముసుఁగువేసి విభూతి నొసటిపైఁ బూయక
సింగారమే" లంచుఁ జెప్పువారు
"ఇష్టమైనట్టు లూరేఁగింప కేటికీ
పదసౌష్ఠవం" బంచుఁ బలుకువారు
"పది సువర్ణములు సంపాదింపఁ జాలక
కైసేఁతలే" లంచుఁ గనలువారు
తే. గీ. నీమతము నీస్వరూపంబు నీనియమము
పాడుసేయక యుండఁ గాపాడుఁగాత
మాంధ్రసాహిత్యపరిషద మహరహంబు
సరసగుణపేటి! యాంధ్రభాషావధూటి!

సీ. అష్టభాషలకు వాగనుశాసనుండైన
నన్నయ్యకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధమ్ముతో ముద్దుముచ్చటల్
తిక్కన్నకవి మున్ను తీర్చినాఁడు
పరువుగాఁ బల్లకీపై సర్వదేశముల్
శ్రీనాధకవి మున్ను త్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్
పెద్దన్నకవి మున్ను పెట్టినాఁడు
తే. గీ. అట్టికవితావధూటి కోయార్యులార!
యిచ్చవచ్చినయట్లు మీనచ్చినట్లు
నగలు నాణెమ్ములను బెట్టఁదగును గాని
సూత్రములు త్రెంపకుం డాంధ్రసూరులార!

భ క్తి

— శ్రీ సత్యనారాయణస్వామి —

సీ. ఇనుగంటిరామరాయని కొండయందు స్వ
యంవ్యక్తమయ్యె నేయనఘమూర్తి
తాజనించినదాది తత్పర్వతమునకు
రత్నగిర్యాఖ్య నేర్పఱచె నెవఁడు
అన్యసంసేవనం బంగీకరింపక
యినుగంటికులులఁ గైకొనియె నెవఁడు
ఎన్ని విఘ్నము లాఁగనున్న నవ్వాని నొం
టరి సేవకులచేత నణఁచె నెవఁడు
తే. గీ. తనదుభక్తుని నినుగంటిఘనకులీను
సుప్రకాశుఁ బ్రకాశుఁ బ్రోచుత మతండు
ఇంతకన్నను విభవమ్ము లెసక మెసఁగ
సత్యనారాయణస్వామి నిత్యమోమి.

ఉ. ఎన్నియొ యుత్సవమ్ములు మహిం గల వయ్యెడ కేగువార లా
పన్నత గాంచుటల్ గల దబద్ధము గాదిట నట్టిపీఠ మే

మెన్నఁడుఁగాని మందునకు నేనియుఁ గన్నది లే దొకప్పుడున్
విన్నది లేద, యీమహిమ వే; ఱిటువంటి శరణ్యు లుండిరే?

సీ. ఇనుగంటివంశపావను లైనరాజుల
ప్రాభవంబునఁ బ్రోవఁబడినవారు
సత్యనారాయణస్వామికళ్యాణోత్స
వంబులకై సాయపడెడువారు
బ్రాహ్మణభక్తి దైవప్రపత్తియుగల
వినయంపుఁగలిమిచే వెలయువారు
బరిమీఁద నిలఁబడి పఱచి బెబ్బులినైన
నడిదంపుఁ బోటుఁచే బొడుచువారు

తే. గీ. అన్నవరమునఁ గాఁపురం బున్న వారు
నేఁటికిని బూర్వపద్ధతి నిలుచువారు
పరమభక్తులు నైన యొంటరుల నెల్ల
సత్యనారాయణస్వామి సాఁకుఁగాక.

సీ. పదియారువేల గోపస్త్రీలపాలిండ్ల
నిల్లటం బుండిన యెమ్మెకాఁడు
పంపానదీతీరబాలపుష్పారామ
మాకందలలితపుంస్కోకిలంబు
మూఁడుకన్నులవేల్పు మొదలైన జేజేల
కెల్ల నీడ నొసంగు నల్లమబ్బు
సూర్యప్రకాశభాసురచిత్తసీరజం
బిల్లుగా నెపుడు వర్తిల్లుజాణ

తే. గీ. అన్నవరమునఁ గాఁపురం బున్న గేస్తు
రమ్యగుణుఁడైన సత్యనారాయణుండు
మమ్ము మా ప్రభువర్యుని మమతఁ జూపి
ప్రోచుఁగావుత మెపుడు ప్రభూతకరుణ.

## దశావతారములు

ఉ. మ్రుచ్చిలి వేదముల్ జలధి మున్గిన రక్కసు నుక్కడంపఁగా
మచ్చెమవై మహాజలధిమధ్యమునన్ జొరఁబాఱి యచ్చటన్
గ్రచ్చఱ వానిఁ జంపి యల కాంచనగర్భున కాగమంబు లం
దిచ్చిన నీచరిత్ర కివియే పదివేల నమస్కృతుల్ హరీ !

చ. జలనిధి పేరి హీరకలశంబున మంథరభూధరంబు పే
ర్గల యల కవ్వమున్ జొనిపి త్రాడుగ సర్పవిభున్ బొనర్చి దై
త్యులు సురలున్ మథించుతఱిఁ దోడన మంధర మప్పయోధిలో
పల మునుఁగంగఁ గూర్మమయి పైకెగనెత్తినదేవు నెంచెదన్.

చ. తపమునఁ బద్మసూతికి ముదం బొనరించి వరంబుగాంచి దే
వపతి నదల్చి దేవతల బాధలు పెట్టుచు హేమనేత్రుఁ డి
ట్టిపనులచేత భూమికి ఘటించెడి యాపదఁ బాపనెంచి యా
రిపుని కిటీంద్రమై త్రుటి హరించినదేవు హరిన్ దలంచెదన్.

చ. కొడుకు "హరీ! హరీ!" యనుచుఁ గోవిదమాన్యుఁడు సంస్మరింపఁగా
దుడుకుతనం బటంచుఁ బగతోఁ గొమరున్ గడు గోడువెట్టు నా
చెడుగును రూపుమాప నరసింహమవై యొకకంబమందునన్
బొడమిన సర్వలోకజనపూజ్యచరిత్రుఁ దలంతు నిన్ హరీ !

క. కడుఁ జిన్నివడుగవై మూఁ
డడుగులు పుడమిని బలీంద్రు యాచించిన యా
గడుసుందనంబు భక్తుల
యడుసుందనమున్ హరింప నగుఁగాక హరీ !

చ. ఇరువదియొక్కమాఱు ధరణీంద్రుల నుక్కడఁగించి రక్తసా
గర మొనరించి యందుఁ బితృకర్మ మొనర్చి మహానుభావుఁడై
పరశువు మూఁపునుండి యిలపై నిడి శాంతమనస్కుఁడై శివం
కరము దపం బొనర్చిన జగన్నుతు రాముని సంస్మరించెదన్.

చ. జనకుని యానతిన్ గహనపద్మములన్ పదునాలుగేండ్లు దే
వన మొనరించి యయ్యెడ నపాత్రుఁడు రావణరాక్షసుండు భా
ర్యను హరియింపఁ గోఁతులదొగన్ జలిగాఁగొని వానిసేన ప్రా
పున దనుజేంద్రుఁ గూల్చి యశముం గయికొన్న నిను న్నుతించెదన్

ఉ॥ ఘాతుకుఁ దల్లిదండ్రులను గాఱియబెట్టిన యుగ్రసేనజున్
మాతులుఁ గంసునిన్ గెడపి మధ్యమపార్థుని చిత్తశుద్ధికై
గీతలుసెప్పి కౌరవుల గీటడఁగించిన వాసుదేవు వి
ఖ్యాతుని సంస్మరించెద మహాత్ముని గృష్ణుని వీతతృష్ణునిన్.

తే. గీ. బుద్ధరూపంబుచేతఁ బ్రబుద్ధుఁడవయి
జనులఁ దత్కాలదుర్మతశ్రవణమనన
దుష్టులను శిష్టుల నొనర్చి పుష్టి జగతి
కొసఁగు నీకు నమస్కార మో మహాత్మ!

తే. గీ. దుష్టజనతాపరిభూతమై శిష్టరహిత
మై యధర్మభూయిష్ఠమ్మునైన ధరణిఁ
గలి హరించి ప్రోచుటకునై కలికిమూర్తి
వగుదువఁట! దేవదేవ! నీకగుతజయము.

—• శ్రీ సర్పవరపు భావనారాయణస్వామి •—

సీ. ఇందిరాసుందరీమందిరాంతఃపురా
శిందచారిమిళిందనందనములు
భక్తమానసవియత్పదవీనిరాయాస
సంచారభాస్కరస్యందనములు
అమరలోకాధిపప్రముఖమౌళికిరీట
కురువిందమాణిక్యకుందనములు
ఏకవారపరిసారాకులీక్రియమాణ
రక్షఃకులాంగనాక్రందనములు

తే. గీ. నీకటాక్షమ్ము లోక కొన్ని నెఱపుమయ్య!
కలితతులితేశ్వరత్వసంక్రందనములు
భావనారాయణస్వామి! పరమపురుష!
భక్తరక్షణ! నీ కివే వందనములు.

సీ. శ్రీవైష్ణవులు ప్రక్క సేవకై గుమిగూడ
గాయకుల్ సంగీతకములు పాడ
విప్రోత్తములు వెన్క వేదముల్ పఠియింప
నర్తనాంగనలు ముందఱ నటింప
వైవర్ణికులు బిట్టువాద్యముల్ వాయింపఁ
జూచువారలకెల్లఁ జూడ్కి నింపఁ
బ్రీతియింట మంగళారాత్రికల్ గ్రహియింపఁ
జందనగంధులు సంచరింప

తే. గీ. గరుడవాహన మెక్కి శ్రీవరవరముని
తోడ శ్రీదేవితోడను గూడి నేఁడు
భావనారాయణస్వామి బయలుదేరె
సర్పపురమున ముక్కోటిసమయమందు.

సీ. జోహారు, దుష్టరక్షోరాజశిక్షణ
దక్షచారుతరప్రతాప! నీకు
దండంబు, భక్తవత్సలకటాక్షవిలాస
జాలపాలితజగజ్జాల! నీకు
వందనంబు, దిగంతపాలమౌళికిరీట
పీఠితమణిపాదపీఠ! నీకు
మ్రొక్కులు, దేవతాపూజనీయాధిక
ప్రీయమాణవలచ్చరిత్ర! నీకు

తే. గీ. శరణు, నందూరి రాఘవాచార్యహృదయ
పంకజాతనివాసనిష్పంద! నీకు

గరుడవాహన మెక్కి నీగ్రామ మేగు
చుండు దేవుఁడ ! నారాయణుండ ! నీకు.

—• నారాయణదాసు •—

తే. గీ. ఎన్నియో వత్సరములాయె నేను నిన్నుఁ
గాంచి నారాయణుండ ! నీకథను వినియు
మాపర్లాకిమిడిరాయని సుకుమారిపెండ్లి
కారణమ్మున నినుఁ జూడఁగల్గె నేఁడు.

చ. కడియము వచ్చితంట ! ననుఁ గాంచెదిపూనికతోడ, నాఁడు మా
బుడుతని నడ్గితంట ! పొలమున్ జనెనంచు వచించెనంట ! వెం
బడిగ 'మొటారు' నెక్కి మును వచ్చినతోవనె యేగితంట ! మి
త్రుఁడ ! యల రాజరాట్పురికిఁ దొందరపాటిటు సేయ నాయమే.

క. తొందరపాటునకున్ ఫల
మందితి మావిభునిచేత నానీతుఁడవై
యిందఱిలో నేదెప్పఁగ
నందిచ్చితి వౌర ! యెంత చతురుఁడవోకో !

గానము

సీ. సంజీవరాయని సంగీత మెచ్చన్న
నాగరత్నము నేమనంగవచ్చు ?
నాగరత్నముపాట నాణెంబటంచుమా
కోటయ్య కేమాట గూర్పనొప్పు ?
కోటయ్యపాటయే గొప్పదటందుమా
సంగన్న నేమి యనంగనగును ?
సంగన్నపాటమే సరసంబటందుమా
కలుగునేమో వేఱొకండు ఘనుఁడు ?

తే. గీ. అదియునుంగాక గానరసాబ్ధి మునిఁగి
తేలలే కెట్టులో తేలి యోలి మరల

ముగ్గి మఱితేలి మఱిముగ్గి మొనసి తేలఁ
జాలకున్నట్టి సభ కేమి శక్తి గలదు.

క. సంగన్న యనుట కన్నను
సంగీతన్న యనఁ గొంత సంగతమౌ నీ
సంగన్న శాస్త్రిగారి న
నంగా వాయించి తపర నారదమౌనీ !

ఉ. మిగ్రింగునో, లేక ముక్కుగొని మిక్కిలినొక్కునో? లేక మీఁదికిన్
జెంగున దాఁటునో? యనఁ గుచేష్ట లొనర్చెడి వారి పాటలే
రంగుగనుండుచో వినఁ గరంబుఁ గుతూహల మబ్బు రామసు
బ్బాంగజుపాట శ్రోత్రముల కశ్రులకుణ్ణా ముద మూరఁజేయదే !

క. తెగఁబాడినపైఁ బాడెడి
వగయొద్దికలును ననంగు వగలఁ బొగులుపై
నొగిలిన మగువల కళలును
సొగియించున్ రామసుబ్బసూరి వరేణ్యా !

శా. కాంతమ్మాగతి జంత్రము న్నడుపుటన్ గాంతమ్మ గాఁ బాడుటన్
గాంతప్రక్రియఁ గీర్తనల్ నుడువుటన్ గాంతాస్వనం బూనుటన్
'గాంతయ్యా' యని యీతనిం బిలుతురో? కా కంతయున్ మున్నె వా
క్కాంతుండారయుఁగాన నీతని కిటుల్ గల్పించెనో? నామమున్.

ఉ. పాడినపాట యంతయును బ్రాణదమై తనరారినప్పుడే
సూడిదగా సుదృక్తతిని జొక్కఁగఁ జేసెడిఁగాక: గాన మే
జాడనొ యెట్టులో యొకటి చక్కఁగ నుండిన నేమి? యంతయున్
గాడిదగత్తరైన నది గానమె? గాయకుఁడౌనె యాతఁడుణ్ణా ?

క. తన కెదుట నున్నవారల
ననయముఁ దలలూఁపఁ జేయునాతఁడు దా గా
యనుఁడౌను గాక మాటికిఁ
దనతలఁ దాఁ ద్రిప్పికొనునతఁడు గాయనుఁడే ?

క. మునిసాములనఁగ నెందును
నను రాగము నందు వారలా ? నీగాన
మ్మునయందు వెఱ్ఱిమోహము
గను నీమునిసామి యెట్టిగానమ్మొకదా !

ఉ. బందుగుఁ డన్న కారణముఁ బట్టి వచించుటగాదు నిక్కమీ
చందపుగాత్రిమున్ మృదుళశైలియు హైదుషి గూడఁ గూడుటల్
వందల వేల దుర్ఘటము, వహ్వారె! లక్షలఁ గల్గు నేమొకో!
సందియ, మెంతయేనియును జిక్కఁగఁ బాడితివయ్య! లక్ష్మణా!

ఉ. గానమునఁ గవిత్వమున గాయన గాయనులన్ గవీంద్రులన్
ధ్యానమునఁ జపమ్మున మహాత్ములచిత్తములందు వెన్నెలన్
జ్ఞానమునందు మౌనమునఁ గల్గినశక్తినెవం డెఱుంగు ! వి
ద్యానిధులైనవార లెవరైనను వంద్యులు వంద్య లెమ్మెయిన్.

క. ధనకోటిపాట కేమి
చ్చిన ఋణమున్ దీఱఁబోదు చెప్పవలయు యు
క్తిని నొక్కఁడిచట నయ్యా
ఖ్యనె యిటునటు చేసి యొసఁగ గౌరవము గదా !

తే. గీ. తిత్తి మన్నింపఁ బడదొక్కొ ? దేవదారు
కఱ్ఱకును లేదె మిక్కిలి గౌరవంబు ?
గుఱ్ఱపున్ వెంట్రుకల కెంతగొప్పలేదు ?
విద్య గలవస్తువుల కెందు వెలియుఁ గలదె ?

మ. భువిలో విద్య లనంగ నెట్టివియొ, సంపూజ్యత్వ మవ్వానిలోఁ
గవు లెద్దానికి ముం దొసంగ వలెనో, కా కన్నియున్ విద్దెలో,
చవి యెద్దానికి నిర్వివాద్యమొ, యశస్సంపత్ప్రదం బేదియో,
యువతీగానము లెట్టివో తెలిసె నోహో ! నేఁటికిన్ గోటిరో !

క. ధనకోటికి ధనమిచ్చుట
మనవియె ! యది యట్టులుండ మన మండజమున్

ఘనతయు వినుతియు ని_త్తము
ధనకోటికి నొక్క లెక్క ధనమున్ గినమున్.

తే. గీ. మోహినీవేషధారియౌ శ్రీహరిఁగని
మోహవార్నిధిలో మున్గు బాహులేయ
జనకు ననిమి_త్తమగు కృపాధనమువలన
మోహినీగానసభ వృద్ధిఁ బొందుఁగాక.

ఉ 'కోటయగారు గానమున గొప్పవహించి' రటన్న యట్టి యి
మ్మాటకుఁ గోపమంది యొక మాన్యుఁడు నన్నుఁ దటాలునన్ నిరా
ఘాటత నెన్నియో గొణిఁగెఁ, గాని యదేమి పురాకృతంబొ ! యీ
పాటకు నామనమ్మున నపారముదంబు జనించినట్టి ల
ప్పాటకుపాటకున్ గలుగు పద్ధతి చొప్పడ దేమి సేతు ? "నీ
కేటికి గానపున్ విషయ మించుక యేని యెఱుంగ వూరకే
మాటికిమాటికిన్ దెలియు మానిసివోలె నటింతు" వందురా,
నోటికి బుద్ధిచెప్పికొన నూఱువిధాల యతించినన్ నిరా
ఘాటతఁబూని వాఁగుటకుఁగాఁ బ్రయతించిన నేమి సేతు ? నే
మాటలకేనియోర్చి తన మానసమందలి యూహతెల్పుచే
బూటకమాడ నోపువని పూరుష లక్షణమయ్యెనేని "యీ
కోటయగారు గానమునకున్ మన బందరునందు మేటి" యం
టేటికిహెచ్చగున్ ? జగతినెల్లెడఁ బేరువహించు యోగ్యుఁ డీ
మాటకుఁజాలఁడే ! యకట ! మాయప్రపంచములోన సత్యమౌ
మాటకుఁగూడ నెట్టి యవమానము వచ్చుచునున్న దద్దిరే !

చ. కనకయశాస్త్రి ! నీదయిన గాత్రము సర్వవిధాల మిక్కిలిన్
వినుతికిఁబాత్ర, మెంతయు గభీరము మేఘరవోపమంబు నిన్
వినుటకు నేఁడు చూచుటకు వీసము భేదము గానఁబోము ; గా
యనకశిరోవిభూషణమ వైతివి నీ సుకృతంబు స్వల్పమే !

తే. గీ. గాత్రముండిన జ్ఞానంబు గలుగఁ బోదు
జ్ఞానముండిన గాత్రంబు గలుగఁబోదు

రెండుగల్గినవాఁ డొక్కఁడుండు నూట
నాఁట, వారలలోఁ గడు మేటి వీవు.

ఉ. మోము వికారచేష్టలకుఁ బో గమకింపదు, గొంతు తపస్వరా
ఖ్యామయదోషమున్ గొనదు, హస్తము శస్తము, తంతివాద్యమం
దేమిట లోటు నీకు! స్వరమేగెడిపట్టునఁ బర్వతాగ్రపున్
భూములనుండి క్రిందఁబడఁబోవు ఝరంబు భరంబుఁ జూపెడిన్.

నా నా సం ద ర్భ ము లు

—• కాకినాడ మ్యునిసిపలు సంఘము •—

సీ. అనుకూలసభ్యుల నరసి నేమించుకోఁ
గల్గిన పౌరసంఘంబు గల్గి
ప్రజలమాటలఁబట్టి పట్టణసౌభాగ్య
మొనగూర్చు మంచిసభ్యులును గల్గి
పట్టణం బభివృద్ధిపఱచుచుఁ బరిశుద్ధి
సలిపెడి యుద్యోగిజనులు గలిగి
సకలకార్యమ్ములు సవరించుకోఁగల
మేటియైనట్టి 'ఛైర్మను' గలిగి
తే. గీ. అన్నిపట్టణములకంటె మిన్నవగుచుఁ
గీర్తిపడయుచు సుజనైకగేయమైన
గౌరవమ్మున కిక్కవై కాకినాడ
'మ్యునిసిపల్' సంఘమా! వృద్ధిబొందుమమ్మ.

సీ. 'ఓటర్ల' భయపెట్టి చాటులంచములిచ్చి
సభ్యతాపదవి కాసపడువారు
అధికారులగువారి యాశ్రయబలమున
"మెంబరీషిప్పు" కాశించువారు
సభకు విగ్రహపుష్టిసలుపుచు యజమానుఁ
డేదిచెప్పినఁ జేతులెత్తువారు

చదువుసందెలురాక పదిమందిలోఁ దలఁ
దిప్పికోఁగోరి యత్నించువారు

తే. గీ. సభ్యతాపద మాసించు సమయమందు
దప్పఁ దమవీధిచూడని ధన్యతములు
నీకు మెంబర్లుకాకుండఁ గాకినాడ
'మ్యునిసిపల్' సంఘమా! వృద్ధినెనయుమమ్మ!

—• జ ర్మ నీ యు ద్ధ ము •—

సీ. కదనప్రసంగంబు కలలోనిదగుటచేఁ
గనుమాటుచెందిన కత్తిపోటు
ప్రస్తుతావస్థకుఁ బనికిరాకుంటచేఁ
బ్రేఁతగిల్లిన ధనుఃపాటవంబు
సౌఖ్యానురక్తి విస్తారమైయుంటచేఁ
బ్రిలుమాలిన మేటి బాహుబలము
అవసరం బిసుమంతయైన లేకుంటచే
మాయమైపోయిన మంత్రిశక్తి

తే. గీ. మరల మనమెల్ల నొకసారి స్మరణసేయ
సమయమేతెంచె నిప్పు డా 'జర్మనీల'
దోర్మదం బడఁగింపఁ బదుండు పదుఁడు
రండు! లెండయ్య! సంగ్రామరంగమునకు.

—• ఒ క ప్ర శ్న •—

మ. కవితాశోచ్యులు మాననీయులనియున్ గవ్యగ్రిఖుల్ తాదృశో
క్తివిశేషమ్మను నోఁచికోరనియునున్ దెల్లమ్ముగావించు నీ
దు వివేకమ్మున కీపుర మ్మఖిలమున్ దుఃఖించెడున్ దీని నే
నఃవివేకమ్మున మెచ్చఁ జేసెదవొ? యోసుబ్రియ, వాకుర్చ్చుమా!

మ. కవినా, నెట్టిఁడొ? కాకవిత్వకలనాకష్టుండునా, నెట్టిఁడో?
కవియే, మాన్యుఁడొ? కాకవిత్వకలనాకష్టుండె. తా మాన్యుఁడో?

సువివేకుల్ గుఱితింపనేర్తురు, శోచ్యుల్ నేర రీకర్మ, మీ
వా? విశేషించి వివేకి, వేటిభ్రమ నీ కోసుబ్బరాయా! యిటన్.

శా. శాఖైక్యభ్రమకల్మి మానసమునన్ జాడ్యంబు జన్మించి యా
లేఖన్ దాదృశరీతిగా నడపెనో? లే కన్య మేమున్నదో?
మౌఖర్యమ్మున మ్రోఁగు బందరుపురిన్ మన్నించి వాక్రుచ్చు భూ
లేఖాగ్రేసర, సుబ్బరాయ! తెలియన్‌లే నేను నీ భావమున్.

శా. నీ తేజం బభివర్ణనీయము కడు న్నీ తెల్వి మాన్యమ్ము నీ
చాతుర్యంబు కవీంద్రగణ్యము యశస్సౌందర్యమ్ము నీరీతి నీ
కేతాదృఙ్మతిభేద మెట్లొదవె? నెంతే దూఱెడిన్ లోక మీ
పాతిత్య మ్మెటు దాఁటెదో? తెలుపు సుబ్బారాయ! నాతోడుతన్.

శా. ఆలేఖన్‌గని బంద రట్టుడికి న ట్లాబాలగోపాలమున్
"జాలున్ జాలునుబో!" యటంచు నెచట జ్ఞాల న్నినున్‌దూఱు, నీ
శీలంబెట్టిది, తెల్వియెట్టి, దకటా! చేతమ్ము తానెట్టి? దా
యీలోప మ్మొనరింపఁ గారణమదేమీ! తెల్పు సుబ్రాణ్మణీ!

శా. సామాన్యుండవుగా; వుదారుఁడవు వాక్చాతుర్యధుర్యుండవున్
ధీమన్మౌళివిభూషణుండవు జగద్విఖ్యాతపాండిత్యవా
గ్భూముల్ మాన్యులుగాక కాకవులు నీకున్ మాన్యులెట్లైరి? నీ
యామోదం బదియెట్టిదో? తెలుపుమయ్యా, సుబ్బరాయాగ్రణీ!

శా. ఉండుంగాక స్వశాఖగౌరవము, లేదాకొ్క? మహాపాండితీ
శౌండీర్యమ్మున నట్టి పేర్మి లవలేశమ్మున్ గటా! దీని కా
క్కొండున్ మెచ్చినవాఁడు గన్పడఁడు; నీ కార్పణ్య మిట్లింతలో
బండారమ్మును బైటపైచె నెటు సుబ్బారాయమంత్ర్యగ్రిణీ!

మ. జరిగెన్ బో పొరపాటు, దీని కెదియో శాంతిన్ వచింపంజనున్
బొరపాటే యిదిగాకయున్నయెడ నిష్ఠో, రేపో, తద్ధేతుతా
స్ఫురణమ్మున్ వెలిఁబుచ్చి బందరుపురీశోకంబు నాఁగన్ దగున్
ద్వరలో నిందులకున్ గడంగఁదగు సుబ్బారాయ! వేయేటికిన్.

శా. నా కాలేఖకతానఁ బోఁదగినవిన్నాణమ్ము లేశమ్మునున్
లేకున్నన్ నిను శోచ్యుఁగానొడువు నాలీలన్ సహింపంగరా
కేకాంతమ్మున నీకుఁ దెల్పితిని; నీవేమేని బ్రత్యుక్తిచే
లోకమ్మున్ దనియించు పద్ధతుల నాలోచింపు సుబ్బారాయఁడా.

శా. శాఖాగౌరవమూని యెందఱు యశస్సన్న్యాసమున్ గాంచిరో
మౌఖర్యమ్మున మ్రోఁగు గర్తపురిసీమన్ గర్బమున్ జూడు! వి
ద్యాఖర్వుల్ కడుమాన్యులై సుకవితాధన్యుల్ తదన్యత్వధీ
రేఖన్ జేరిరె? సుబ్బరాయ, యెటు లీరీతిన్ లిఖింపించితో!

శా. చాలున్ మూలములేని తప్పుకవితాసంసార మం దీఁదుటే
వాలాయమ్మును వృత్తిగా మెలఁగు క్రొత్రం బక్కటా! మాన్యమై
హేలాపాలితదిక్కటాహకవితాహేవాకధీవైభవుల్
తూలమ్మెనియుఁ గాకపోయి రెటు లీ దుఃఖమ్ము, సుబ్రాణ్మణీ!

మ. ఎవనిన్ స్వప్నమునందుఁ గన్గొనినచో నేవారి వాచాలతా
ద్యవివేకంబులు రూపుమాయునొ కటా! యవ్వారు మాన్యుల్, మహా
కవి నీకట్టిఁడు కాఁడ; యే ఘనులు దుఃఖంబందరో దీనికిన్
సువివేకం బఱఁజేయకే నొడువుమా, సుబ్బారాయమంత్ర్యగ్రణీ!

మ. అవధానం, బవధానమం చఱచి యేయార్యుండు రాఁబోవు వా
ర్త వినంగాఁబడఁగానె పాఱఁగఁ ధీరమ్మన్యులో కాకవుల్
కవితాలోకమునందు మాన్యులె? యటుల్ కాతర్యముంగూర్చు నా
కవివర్యుండటుకాఁడె? యెట్టు లిది? చక్కన్ దెల్పు సుబ్బారాయఁడా!

శా. నీకే తోఁచెనొ? యెవ్వరే నొడివిరో? నీవంటి ప్రాజ్ఞాశయుల్
లోకంబున్ దురపిల్లఁజేయు నయశోలోలత్వపున్ మ్రానికిన్
బ్రాఁకన్ గోరుదురే! యటేని జగతిన్ బ్రాజ్ఞత్వ మెందుండునో?
వాకుచ్ఛంగదవయ్య! నాకిపుడు సుబ్బారాయమంత్ర్యగ్రణీ!

శా. నీశాఖన్ జనియింపనంతటనె వన్నెల్ దక్కు నే? తెల్పు, స
ర్వాశామండలమండనాయితయశఃప్రాగ్భారధౌరంధరీ

పై శాల్యపశ్రీథమానుఁడౌ సుకవి, గవ్వల్ నీకుఁ జుట్టమ్ముౖలై
యీశత్వమ్ము వహింతురే కవితయం ? దేమయ్య, సుబ్రాయఁడా!

శా. చుట్టాలన్న మహాభిమాన మది యచ్చో నున్నచో వారికిం
బెట్టఁ పందగు భక్ష్యభోజ్యములు నీ పెంపెందు నింపొందఁగాఁ
బట్టుంబుట్టము లిచ్చి పుచ్చఁదగు, సంబంధంపు బాంధవ్యముల్
రెట్టింపందగు నంతెకాని యొరుఁ గారింతయ్య, సుబ్రాణ్మణీ !

శా. పీయాహూతికి నేను వచ్చు నెడల న్నిన్నప్పుడే "యేమి య
న్యాయం బియ్యది" యంచుఁ బెండ్లిసభలోనం బేర్మిఁ బ్రశ్నించి పై
నీ యాంతర్యము బైటఁబెట్టి పురము న్నీ చేతఁ దన్పింతుఁ గా
నీ; యట్లబ్బమి నేఁడు గోరవలసెన్ నిన్ సుబ్బరాయాగ్రణీ !

శా. లోకం బొప్పిన నొప్పకున్న నెటు లాలోచించియో వ్రాసి తా
కాకవ్యగ్రణులంత మాన్యులని నిక్కం బస్మదీయాగ్రమం
దాకాంక్షించెడు బందరుం దనిపి నీవవ్వారికిన్ మాన్యతన్
నా కన్యత్వము సంఘటించెదవె యన్నా ! సుబ్బరాయాగ్రణీ!

శా. ఏసారస్యము లేని పిప్పికవితన్ "హీహీలు" లోకమ్ములో
ధీసంపన్నులు సారెకున్ గురియ, వందిస్తోత్రముల్ సేయు మీ
దాసుల్ మాన్యులె ? కాకవిత్వకలనాదైన్యంబుమాయించు వి
ద్యాసంపన్నులు కారె మాన్యు! లిది యన్యాయమ్ము సుబ్రాయఁడా!

శా. నీ కీసంగతి లేశమున్ దెలియదో? నీకంటికిన్ జూపకే
యేకష్టాత్ముఁడుగాని ముద్రణమునం దీతప్పు గల్పించెనో ?
లే కీపాకము నీకె తోఁచినదొ? యాలింపం బ్రియత్నించు నీ
లోకంబుం దనియించి నీనోడువు వెల్గుంగాక సుబ్రాణ్మణీ !

మ. "ఎవఁ డాపండితుఁ?" డన్నయంతఁ దెగనీ ల్గింతేల? మీ కక్కటా!
కవితామర్మ మెఱుంగరైతిరి వృథాకారుల్ వృథాపల్లిదాల్
వివిధమ్ముల్ లిఖియించుచుంటి రెవఁ డావిద్వాంసుఁ డీలాటిదు
ష్టవిధుల్ నేర్పినవాఁడు? చెప్పఁ దగదే? సర్వజ్ఞు నా ధీవరున్.

మ. ఎవఁడాతం? డతఁ డెందునుండు? నతఁ డేయే విద్దెలన్ మేటి? పే
రెవ? రూరెయ్యది? యీసమస్యయెడఁ దప్పేలా నిరూపించె? స
త్కవియేనా యతఁ? డైనచోఁ దమకు మిత్రంబెట్టులయ్యెన్? వృథా
డివిడివ్వుల్ లిఖియింపనేల ? చెపుఁడా! డీకొందు మా సూరితో.

మ. 'ఎవఁ డాపండితుఁ' డన్నఁ దప్పగునె ? యేమీ తెల్వితేటల్! వృథా
శివముఁ బూని దురాగ్రహగ్రహముఁలై "సీ" యంచు విద్వద్వరుల్
"తువుతు" వ్వంచు నిరాకరింపఁదగు మీ దుష్పంకపుంబ్రిల్లదా
"లవుమే"లంచని మెచ్చు నాతఁ డెవఁడయ్యా! యెవ్వఁడెవ్వండయా?

మ. 'ఎవఁ డాపండితుఁ'? డెవ్వఁ, డెవ్వఁ, డతఁ డేఁడీ, యేఁడి? సాక్షాత్తుగా
శివుడో, బ్రహ్మయొ, చక్రిపాణియొ? భవ త్సేవ్యుండు చెప్పండు! మీ
కవనమ్మున్ సభ నిల్పునేని యపు డ క్కావ్యాగ్రణీపాదవా
ర్భవముల్ శీర్షమునన్ ధరింతు మతఁ డెవ్వం, డెవ్వఁ, డెవ్వండహో!

మ. సవి శేషమ్ము నెఱుంగనప్డు పయిపై సవ్వార్లు గావించి యి
ష్టవివేక మ్మది బైటఁబడ్డయపు డేలా రాఁడు విద్వత్సభా
భవనప్రాంగణసీమ? కెవ్వఁ డతఁ? డెవ్వండో వచింపుండు? ధీ
రవరేణ్యుల్ విని సంతసించెదరు సారజ్ఞత్వమున్ మెచ్చుచున్.

మ. ఎవఁడెవ్వం, డతఁడెవ్వఁ? డెవ్వఁ,డలవాఁడెవ్వాఁ, డెవం డెవ్వఁడోఁ
యవివేకమ్ములు గిల్కనేల? స్పృహణీయాత్మున్ మహాభాగు ధీ
రవరున్ దెల్పఁ దతండు మాకవితయుఁ రాపాడుఁగా; కమ్మహా
కవి పాడేయొనరించుఁగా; కతఁడె మ్రొక్కంబూనుఁగా కమ్మెయిన్.

మ. 'ఎవఁ డాతం, డెవఁడాతఁ,డెఁవ్వడతఁ, డేఁడీ? యేఁడి? రాఁడేమి?భా
రవియా ? భూరవియా? సభాస్థలికి మీరల్ రా నొనర్పుండు, తా
రవలోకింతురు పండితాగ్రణులు, కయ్యం బూరకే సారెకున్
గవినిందుల్ పొసఁగింప నేమియగు? వక్కాణింపుఁడప్పండితున్.

మ. 'ఎవఁ డాతండు?' వృథా మిమున్ జెఱిచె; మీ రింకేమిసేయంగలా?
రెవని న్నమ్మిన వాఁడు మీయెడల నిష్ఠేయయ్యె; మీసల్పు దు

ర్వ్యవసాయం బిఁక నెట్లు నెగ్గుఁ? జెడినారయ్యా గడేకార్లు! మీ
బవరమ్ముల్ జెడె మందభాగ్యులరు, మీపాట్లింక నెట్లున్నవో!

మ. ఎవని న్నమ్మితి రాది, నాతఁ డటులయ్యె, న్నేఁ డితం డిట్టుల
య్యె, వివేకం బది సున్నయైనయపు డీట్లే బంగరున్ జేతఁ బ
ట్టి వృథా మన్నగుఁ, బైడి పాడువడఁగొట్టన్ జాలు మీవార్తలం
దెవఁ డానందముఁ జెందు నాతనిని మీరి ప్డేని వాకుర్చుఁడీ !

మ. 'ఎవఁ డాతండు?' భవత్పరాభవము నేఁ డెట్లో నివారించువాఁ
డవివేకంబునఁ గొర్విత్తెచ్చికొని నేఁ "డల్లల్లబీ" రన్నచో
వెవఁ డేమేడ్చెడు, గొంతువట్టికొని నప్డేవాఁడు చొచ్చున్ సభా
భవనంబున్! వనరోదనంబు లిఁక మీపక్షమ్ము రక్షించునే ?

మ. 'ఎవఁడాపండితుఁ' డెవ్వఁ డెవ్వఁడెవఁడో?యెవ్వండొ?యెవ్వండొ?దు
ర్భవులన్ జేర్చుక తప్పువార్తలను బతార్లింపఁగాఁజేసి మా
నవధర్మమ్మును పీటిబుచ్చుచు దురాంధ్యమ్మందునన్ మగ్గి కా
కవియో, ఘూకవియో, యనందగు సుకీకాంతుండతం డెవ్వడో!

—• దాదాబాయి నౌరోజీ •—

శా. యుష్మత్పాపవశమ్మునం గలిగె నయ్యో ! పారసీకాంబుజ
గ్రీష్మాదిత్యుఁడు సర్వజాతిమతసంకీర్త్యుండు నీయిండియా
భీష్మాచార్యులు దాదబాయి యనుచుం బేర్గొన్న నౌరోజి కా
యుష్మత్త్వావధి; పెద్దదిక్కెవరు? నీ కోహో యిఁకన్ భారతీ !

సీ. జాతీయభావసంస్కారంబు గావించె
నఖిలభారతవర్ష మైక్య మొంద
"హౌసాఫుకామన్సు" నం దొక "మెంబరై"
భారతావని కెల్లఁ బేరు దెచ్చె
బ్రితికెఁ దొంబదిరెండుసత్సరమ్ములు సుజ
నశ్లాఘ్యమౌ జీవనమ్మ్తోడ
హిందూజనులు వృద్ధి నొందుసంస్కారంపు
ఘంటాపథంబు సంఘటిలఁజేసె

తే. గీ. మనుజమాత్రిందెః మతిదేవమంత్రి దాద
భాయినౌరోజి మన పెద్దభాయి యఱిగె;
తల్లిభారతభూమికిఁ దగనికడుపు
మంటగల్పించె; దుఃఖాబ్ధి మనలముంచె.

సీ. అంబరచుంబితాయామంబు గల్గు ఘ
నాలయ మ్మొక్కటి కూలిపోయె
గౌరవం బెనయుచక్కనిహర్మ్యరాజంబు
కడుజీర్ణమై నేలగలిసె నొకటి
ఒక సౌధరాజంబునకుఁ గల్గెగల్పితా
పప్రథ గల ప్రతిబంధకంబు
తక్కిన పెక్కు సౌధంబులలోపలి
ప్రాకారకుడ్యముల్ పగులఁజొచ్చె

తే. గీ. పలుగృహంబులు పాడుగాఁ బాలుపడిన
వనుచుఁ దలపోయకమ్మః యున్నంతలోనఁ
జిన్నయిలు పెద్దయిల్లుగాఁ జేసికొనుచుఁ
బాసిపోకమ్మ భారతీః భరతభూమి.

తే. గీ. ఐహిక సుఖమ్ము వదలియు నచట "దాద
బాయినౌరోజి" శాంతాత్మ పరమసుఖము
గొనుచు మనసేమ మెల్లఁ గన్గొనుచు మిగులఁ
బాటుపడుఁగాక కైవల్య పదమునందు.

శా. జంబూద్వీపమునందు మేల్భరతవర్షంబందు ముఖ్యంబు చూ
డం బాత్రింబయియున్నదీ భరతఖండం బిందు మున్ముందు ను
ద్దండుల్ పుట్టిరి, పుట్టుచుండిరిపుడు దాదాబాయినౌరోజిపీ
ఠం బెవ్వారిసి నెక్కఁజేసెదవొః వేడ్కన్ జూచుకో భారతీః

— హంటరుదొర ప్రిన్సిపాల్ —

ఉ. 'హంటరు' గొప్పమేటి యని యాద్యులు మాటికిఁజెప్ప వించు నీ
వంటిపరీక్షకుండు తలఁపన్ మఱియొక్కఁడు గాఁడటంచు మా

వంటికవీంద్రులన్ దెలిసి వచ్చినకార్య మొనర్తువంచు ని
ష్కంటకమైన పేర్మి నినుఁ గానఁ గవచ్చితి వేంక టేశుఁడన్.

తే గీ. రాజు లెందరనో చూచి రాణ నలరి
యిపుడు నీదర్శనమున కే నేగుదెంచి
యుంటి నాదువిద్వత్తకు యోగ్యమైన
పదవి నిడి గౌరవింతువం చెదఁ దలంచి.

క. 'బీ. యే.' కే కాదు సుమీ!
పాయక 'యెమ్. యే.'కు దాని పైతరగతికిన్
ధీయుతులు మెచ్చఁ బాఠం
బీయన వచియించు దాఁప నేమిటి కిచటన్.

—• మల్లాడి సత్యలింగము •—

క. మల్లాడి సత్యలింగం
బెల్లెడఁ వెదఁజల్లినట్టి యాధర్మము వ
ర్ధిల్లుత! సూర్యుఁడుఁ జంద్రుం
డెల్లలు నన్నంతవఱకు నెసకం బెసఁగన్.

శా. సంపాదించుట దానికిం దగిన సంస్కారోపయోగంబు గా
వింపం బూనుట దానికిన్ మఱియు నిర్విఘ్న ప్రచారంబు యో
జింపం బూనుట సత్యలింగమునకే చెల్లెన్ సమస్తంబు చే
యింపన్ గల్గిన కాకినాఁడసుకృతం బేమంచు వర్ణించెదన్!

ఉ. శ్రీకరుఁ డుత్తముండు దురిశేటికులాంబుధిశీతరశ్మి వి
ద్యాకరుఁడై నదాత వినయంబు నయంబును గల్గుప్రోడ యీ
పాకటధర్మము న్నడుపుభారము శేషగిరీంద్రుఁ డూనె ధ
ర్మాకృతియౌ వదాన్యమణి యాదెయరెడ్డియుఁ దోడుపీడగన్.

తే. గీ. వేనవేల్ దానధర్మముల్ వేడ్క మీఱ
స్వయముగాఁ జేయఁగల్గిన చతురమతులు

ధర్మకర్తలుగానున్న ధర్మమునకు
లోప ముండునె? మఱియింతప్రాప్తిపుగాక.

ఉ. అందఱుఁ గోరఁగాఁదగిన వన్నము, విద్య, సదాస్తికత్వ మీ
చందము సర్వమున్ దెలిసి సత్యవదాన్యుఁడు సత్యలింగ మ
న్నందకు సార్థకంబుగ మహాత్ముఁడు ద్రవ్యము నిచ్చిపోయె ని
ర్నిందితచిత్తులైన మహనీయులు ధార్మికులెల్ల మెచ్చఁగన్.

సీ. అఖిలపాంథశ్రేణు లనుభవింతురుగాక!
పుష్టితుష్టిగ మృష్టభోజనంబు
చదువుకొందురుగాక! సకలవిద్యార్థులు
సర్వవిద్యలు లోకసమ్మతముగ
కాచియుందురుగాక! కాణపంగ్వంధాది
దీను లన్నార్థులై దినదినంబు
అన్న సంప్రాప్తిచే నఖిలభూతశ్రేణి
సుచిరకాలము తృప్తిఁ జొక్కుఁగాక!

తే. గీ. ఇట్టి సుకృతంబుకతన నీవృగ్విధప్రి
దాత యల సత్యలింగాఖ్యధార్మికుండు
మరల భూలోక మరయని సురవరేణ్యు
పట్టణనివాసభాగ్యంబు వడయుఁ గాక.

— నండూరి రంగనాయకులు —

శా. సంగీతమ్మనఁగాని కొండొకమహా సాహిత్యపున్ ధోరణీ
భంగింగాని ప్రసక్తిలేదు భగవద్భక్త్యున్నతిన్ దక్క నే
మింగానంబడ దిట్టిఁడయ్యుఁ బురి "మేల్! మే!" లంచు శ్లాఘింపమా
రంగం డెక్కుడుపేరు గైకొనియె శ్రీరామాయణంబందునన్.

ఉ. ఉండిరి శిష్యు లెందఱొ మహోన్నతమౌ కృషి సల్పి విద్దెలోఁ
గొండొకపేరు గైకొనినకోవిదు లీతఁడు వారిలోన నా
క్కండును గామి నిశ్చయమకాని గురూత్తమభక్తి నేకల

వ్యం; డటుగాన సీతనికి నుత్తమకీర్తి ఘటిల్లె నింక రం
గం డెటకేగ నేమియగు గండరగండఁడు భక్తిపెంపునన్.

చ. గురుఁడు నటేశుఁ డీతనికిఁ గొండొక యాతనిఁ గొల్చి నాట్యపుం
గరిమమునం బ్రశస్తి గనినాఁ డలవిద్దియలోన హాస్యపుం
బరిమళమందు సీతనికిఁ బాండితి మిక్కుట మిట్టిభక్తిసం
స్ఫురణము పూర్వజన్మకృతసత్కృతిలభ్య మటంచు నెంచెదన్.

చ. నలువదియొక్క నాఁడులు ఘనాఘనవర్ణుని రావణాంతకున్
దెలుఁగునఁ దేటతెల్లముగ స్త్రీపురుషుల్ గుమిగట్టివచ్చి యొ
క్కలలిఁ బ్రపంచమున్ మఱచి కైవసమై విన రంగనాయకుల్
సలలితరీతిఁ బాడు టది శాశ్వతకీర్తిని గాంచుఁగావుతన్.

ఉ. నందురిరంగ నాయకులు నా కొకశిష్యుఁడు గాకపోయినన్
మెండుగ నాయెడం గలుగుమేదురభక్తిని వెల్లడించి శి
ష్యుండ నటంచుఁ బేర్కొనెడిచొప్పున కే నిటు లొంగి వానికిన్
గొండొకదీవనల్ సలిపికోలున కియ్యెడ కేగుదెంచితిన్.

ఉ. ఈతఁడు సెప్పుఁగాక కత లెన్నియునేని ఘటించునట్టిప్ర
ఖ్యాతులు లేనిచో నతనికౌశల మేగతిఁ బైకివచ్చు? న
వ్యాతచరిత్రులన్ దెలుపఁ బోలుఁ గదా! యొకకొంత నా కటం
చీతఱి వారలన్ గుఱిచి యించుక యిందుఁ బ్రశంస సేసెదన్.

సీ. అర్చకోత్తముఁడు గోపాలార్యవరుఁడు పె
ద్దింటివంశ్యుండు సుధీరుఁడొకఁడు
వంకినేని కులుండు వరగుణుండైన వేం
కటసుబ్బయాభిఖ్యఘనుఁ డొకండు
వాకచర్లకులుండు ధీకలితుఁడు రామ
చంద్రనామకుఁడు నిస్తంద్రుఁ డొకఁడు
కలిమిపట్టగు మహంకాళి వంశ్యుండు శ్రీ
రాము లనెడిగుణరమ్యుఁ డొకఁడు

తే. గీ. నడుముగట్టుక నిలుచుండినారుగాన
హేలపురిని సంతానగోపాలుఁగుడిని
రామపట్టాభిషేక మీ రహిని జెలఁగె
నోముఁగావుత వీరి నీయుత్సవంబు.

సీ. శిష్యుఁడు రంగఁడు చెప్పిన రామాయ
ణపుహరికథ కారణమున నన్నుఁ
బట్టాభిషేకసంబంధ్యుత్సవమునకు
సబహుమానముగ నిచ్చుటికి వచ్చు
నట్లుగా ఘటియించి నలిని శ్రీ పెద్దింటి
కులుఁడు గోపాలార్య కోవిదుండు
వంకినేనికులుండు వరమతి పెద్దవేం
కటసుబ్బయాఖ్యుండు ఘనుఁడు శ్రీమ
హంకాళి శ్రీరాము లనఘుండు శ్రీవాక
చర్ల వంశ్యుఁడు రామచంద్రిరావు
తే. గీ. పరమభక్తిని సేలువు వస్త్రములును
గనక కంకణము నొసంగి ఘనతరముగ
మేళతాళములొప్ప మేల్! మేః లనంగ
మున్న యూరేగఁజేసిన ముచ్చట యిది
శాశ్వతంబయి ధరణి నెసంగుగాక
ఘనత సంతానగోపాలు కరుణఁజేసి.

తే. గీ. ఆలయంబిది యభివృద్ధి నందుఁగాక
భక్తజన మెల్లెడల వృద్ధిఁ బరఁగుఁగాక
దేవభక్తుల కన్యోన్యభావగరిమ
మెఱుకపఱచెడి సత్కృతుల్ జరుగుఁగాక.

—• ఆంధ్రనాటకసమాజము, కాకినాడ •—

ఉ. ఆడితి వాంధ్రినాటక సమాజమ! పాండవ నాటకంబు నీ
ప్రోద్రిడతనంబు నీనటనపుంబొలుపున్ గని గ్రింథకర్త లె

గ్గాడక లగ్గులాడిరి యితోధికమైన యశఃప్రిసక్తిం దూం
గాడుము కాకినాడఁ జెలువారుము నాఁటికి నాఁటి కెచ్చుగన్.

సీ. అఖిలాంధ్రి దేశవిఖ్యాత నాటకసమా
జంబుల మిగులయశంబుఁ గొనుచు
సకలాంధ్రికవిరాజచారునాటక సంప్రి
దర్శనంబునకు నిదాన మగుచు
నిఖిలాంధ్రిరంగవర్ణితమైన పద్ధతిఁ
బాత్రోచితికి నుతిపాత్రి మగుచు
సర్వాంధ్రిలోకహృత్సరసీజములపట్ల
విలసత్సహ స్రాంశుబింబ మగుచుఁ

గీ. గాకినాడను గొందఱు ఘనులచేతఁ
బ్రికటితంబైన యాంధ్రినాటకసమాజ
మవని దేశోపకారపర్యాప్త మగుచుఁ
దనరుఁ గావుత మా చంద్రితారకముగ.

—• విశాఖపట్టణములో జరగిన ఐదవ ఆంధ్రిదేశ గ్రింథాలయ ప్రితినిధుల
మహాసభయందుఁ జదివిన పద్యములు •—

సీ. మీకున్న ధనశక్తిమేరకుఁ దగినయో
చితిగల్గు పొత్తముల్ చేర్పుఁడయ్య
ప్రిత్యాలయంబునఁ బ్రితిదినంబు పురాణ
పఠనగౌరవముఁ గాపాడరయ్య
పగలు రాఁజాలని బడుగువారలకు రా
త్రులఁ బాఠశాలలు నిలుపరయ్య
తమ సేయుపనుల నాదర్శంబుగాఁగఁద
క్కినవారి సేఁత తర్కింపుడయ్య

గీ. భారతీసేవ సేయంగఁ గోరుఁడయ్య
నిచ్చలును మాతృభాష మన్నింపుడయ్య

గ్రంథభవనంబులను జేర్పఁ గడఁగుఁడయ్య
తథ్యమతులార! ఆంధ్రసోదర్యులార!

ఉ. ఒక్కొకచోట నీకరుణ నొక్కొకరీతిగ నుంచుచుందు వే
దిక్కునఁ దావకీనమగుదీప్తి వెలుంగుచునుండు దానికిన్
జక్కనితెల్వి వచ్చునని సజ్జనులే వచియింతురిగాన మా
పక్కకువచ్చి పల్లెల నివాసము సేయఁగదమ్మ! భారతీ.

—• చంద్రోదయము •—

శా. అధ్యాసించె శశాంకబింబ ముదితంబై తిర్యగంతశ్చల
ద్రిధ్యాకారపయోధరస్థగితమధ్యస్థానమై తారకా
వీథ్యాదిన్ సురతావసానవిగళద్వేణీశిరోజావళీ
మధ్యాచ్ఛాదితపాకవైరితరుణీ మాణిక్యతాటంకమై.

—• సాలగ్రామ చింతామణిగారి కుమారుని వివాహసమయమునఁ
జెప్పిన పద్యములు •—

మ. కలుగున్ గావుత సంపదల్, సిరియుఁ జక్కన్ గల్గెడింగాతఁ దా
నొలయుంగాత మరోగతాబలముతో నొప్పారు నాయుర్బలం
బలరుంగావుత భద్రముల్ సతములై యాయుస్సుతోఁబాటుగా
లలి నీకోడలికిన్ గుమారునకు సాలగ్రామ చింతామణీ!

మ. నిను శిష్యత్వమునందుఁ గైకొనిన మాణిక్యాంకున్ బేర్మి ని
న్నును గన్నమ్మకు రాజరత్నమునకున్ శోభాయమానమ్ముగా
ననుఁగుంబుత్రివి పెండ్లికిం బిలిచి సీదా విద్దియన్ మాకుఁ జూ
పిన చింతామణికిన్ శుభంబు లిడుతన్ వెన్నుండు శ్రీరత్నమా!

—• ఆణివిళ్ళ వెంకటశాస్త్రిగారు •—

ఆ. వె. కైతయేగాని గీతియేగాని సభను
గోలనాపఁగలేనిచో గోలగాదె;
గోలనాపెను బ్రహ్మయిల్లాలు తనకుఁ
దోడుగానుంటచే బ్రహ్మ నేఁడు సభను.

తే. గీ. వారణాసినామకమగు వంశమందుఁ
బుట్టె నీబ్రహ్మ యితఁ డెట్టిపట్టునందుఁ
గోటిజనులున్న సభనైన గోల నాపఁ
గలఁడు నిస్సంశయ మ్మసి కఱకు గాదె!

తే. గీ. ఆణివిళ్ళయొ? లేకున్న గోణెబిళ్ళ
యో? యెవఁ డెఱుంగు నిటువంటి యుత్సవంపు
సమయముల నిట్టి గాయకోత్తములఁ బిలువ
నంపి సభకు సంతోషంబు నింపకున్న.

తే. గీ. అమలకవనాన నగ్రిహారముల గములు
తెచ్చి వంశస్థులకు నిచ్చె ధీవరుండు
వేంకటమనీషి, యద్దాని వివర మెఱిఁగి
కర్చు సేయఁదొడంగె వేంకటమనీషి.

—• మల్లేశ భక్తసమాజము, కొన్నిపద్యములు •—

శా. శాస్త్రాభ్యాస మొనర్చుటో? సభలలో శాస్త్రార్థముల్ సల్పుటో?
నిస్త్రాసమ్మన వేయిమందికయిన న్నేర్పొప్పఁగాఁ బద్యముల్
శస్త్రోత్సర్జనరీతిఁ గుప్పుటయొ? దేశా లేగుటో? కాక ది
గ్వస్త్రా! నిన్ను వశమ్ము చేసికొను భాగ్యం బెన్న మల్లేశ్వరా!

మ. కలకాలమ్మును నాదు గర్భమున వీఁక న్నిల్వుమీ యంటినా?
బలిమి న్నాదగునింట బంటుతన మాపాదించి రమ్మంటినా?
తులలేనట్టి విసమ్ము దార్లిపుమని నీతో నంటినా? లేక, నీ
తలహస్తం బిడఁబోతినా? యిఁకను నాతప్పేమి? మల్లేశ్వరా!

సీ. కుశలమల్లంపల్లిగోత్రసంజాతుండు
మల్లేశపూజాభిమానహృదయుఁ
డురుసద్గుణాఢ్యుండు గురుసుధీమండల
పూజనాసక్తుండు భూమిసురుఁడు

పాపాంబికాసతీపాపయారాధ్యత
పఃఫలం బత్యంతపావనుండు
శంభులింగాభిదస త్తమరామలిం
గానుజుండును సుధీమాననీయుఁ
డానందసాంద్రచిత్తాబ్జుండు భైరవ
కరుణాకటాక్షవీక్షణబలుండు
మల్లేశభ క్తసమాజసంస్థాపకుం
డస్మద్ధితుఁడు భైరవాభిధుండు
తే. గీ. ఆత్మభైరవముద్రాక్షరాలయమునఁ
గూరుచుండి యొకప్పుడు కూర్మిదనర
దీనిఁ జేయుమటంచుఁ బ్రార్థింప దీనిఁ
దెలుఁగునను జేసినారము; దీనిపేరు
మహిత మల్లేశనక్షత్రమాలయండ్రు
కవులు తిరుపతివేంకటాఖ్యవరమతులు.

—• దివ్యజ్ఞానసమాజము •—

శ్లో. "యూరప్"ఖండనివాసకో నిరుపమో విద్యాసుధావారిధి
స్త్యక్త్వాత్మీయమతం యథార్థధిషణ"స్విడ్నీ వియెడ్జ్యా"హ్వాయః
అస్మాకం మత మేవ యు క్త మితివై సంబోధయత్యాదరా
త్సర్వే హిందుమతానుసారిమనుజా స్తం శ్లాఘయేయుఃపరం.
శ్లో. పూర్వం శంకరముఖ్యై రుజ్జీవిత మస్మదీయమత మేతత్
ఇహతజ్జీర్ణప్రాయం పునరుజ్జీవయత్యేష హూణోపి.
శ్లో. గీర్వాణభాషాధ్యయనం వరం స్యా
దిర్థం భృశం ప్రోక్తమనేననూనం
ఇదం సమాలోచ్య తథైవకర్తుం
బాలాయ తం తా ము సభ క్తి యుక్తాః.
చ. జనకుఁడు దా "మిష"న్మతవిచారమువాఁడయి యొప్పుచుండఁగా
మనమత మే మనమ్మనను మంచి దటంచును నెంచి బోధచే

సిన సుగుణాబ్ధి హూణుఁడగు "సిడ్నివియడ్జినిఁ" జూచియైన నె
మ్మనమున హిందుసన్మతము మన్ననఁజేయుఁడు బాలకోత్తముల్.

క. ఈదివ్యజ్ఞానసమా
జాదినిమిత్తం బనంగ నలరెడి "నాల్కా
డా"దుల నీ "సిడ్నివియె
డ్జీ"దొర నెల్లప్డుఁ బ్రోచు శ్రీపతి కరుణన్.

—• ఏలూరు 'కాంగ్రెస్సు' సభ •—

క. పన్నుఁట! యాపై నింకొక
పన్నుఁట! యామీఁద నొక్కపన్నుఁట! యాపై
పన్నుఁట! పైపన్నుఁట! పై
పన్నుఁట! వర్తకుఁ డిఁకెట్లు బ్రతుకం గలఁడో.

ఉ. అక్కఱవేళ నీ రిడినయాతనిపా లొకకొంత, పైపయిన్
బొక్కెడి తీరువాయియను భూతముపా లొకకొంత, యాపయిన్
దక్కఁగలట్టి పన్నులకు దాపినపా లొకకొంత, హాలికుం
డక్కట! యప్పుపా లగుచు నాలివి బిడ్డల నమ్ముకోవలెన్.

—• జిల్బేరుదొర—యానాము •—

సీ. శేషునిఁ బోలి "లెక్చెరు" చెప్పఁగాఁజాలు
"జిల్బేరుగా" రొక్కచెంత నొప్ప
నతని "లెక్చెరు" విని యలరు నా నావిధో
ద్యోగస్థులును మఱిం కొకట నలరఁ
దెలియదేమందురాదేవుఁడా! "ఫ్రాన్సు భా
షయనుమాదృశులొక్కచక్కిఁదనర
"ఫ్రాన్సు"భాషనుమీఁదఁబఱియింతునంచును
బల్కువారలునొక్కపక్కనెసఁగ
తే. గీ. సర్వదేశసమాచారసంగతులను
సర్వజనులకు విస్పష్టసరణి వెలుక
పఱచుటకుఁ గాదె యీసభ జరుపఁబడియెఁ
బొలుపుమీఱెడి యానాముపురమునందు.

సీ. పదియునెన్మిదియునాఁబరఁగు ద్వీపములఁ బ్రి
బలులైనవారమ "ఫ్రాన్సువారు"
శ్వేతముఖాఖ్యఁ బ్రసిద్ధిఁగాంచిన హూణ
వరుల పైవారు మా "ఫ్రాన్సువారు"
ప్రజలమీఁదనె కార్యభరముంచిరాజ్యమ్ము
పచరించువారు మా "ఫ్రాన్సువారు"
కలియుగమ్మను సత్యకాలమ్ముగను నొన
ర్పఁగఁబూనినారు మా ఫ్రాన్సువారు.
తే. గీ. పన్ను హెచ్చించి ప్రజలకు బహువిధముల
బాధఁ గల్పింపఁబోరు మా "ఫ్రాన్సువారు"
పలుపలుకు లాడ నేల? బిడ్డలకుఁ దల్లి
వంటివా రెల్ల ప్రజకు మా "ఫ్రాన్సువారు".

సీ. అంగవంగాదిదేశాంతరమ్ముల కేగెఁ
గాన నీతఁడు బహిష్కార్యుఁ డనియుఁ
బొగయోడపై సముద్రగతి నీతఁ డొనర్చె
వెలి యీతనికి వేయవలయు ననియు
హూణసంపర్కమ్మునొందె నీతం డనా
చారుఁ డీతని కసత్కార మనియు
నన్యభాషను భోజనాదివేళలఁగూడఁ
బల్కువాఁ డీతఁ డప్రాశ్యుఁ డనియు
తే. గీ. మనమతస్థు లొనర్చు నిందను సహింప
లేక మనహిందువులు భూమిలోకమందుఁ
గొంతయైనను మఱియు నొక్కింతయైనఁ
జూచియెఱుఁగరు చూడరు చూడఁబోరు.

ఉ. కన్నులు గల్గియుండియును గన్నులు లేని విధమ్మునన్ జగ
మ్మున్నది, లేనిపోనియుపయోగము లీమతమందు నుంటచే

నన్నియు నొక్కరీతిగనె యాశ్రయణం బొనరించుహూణు లా
న్నన్న ! మఱెట్టిపుణ్యముల నంది జనించినవారలో కదా !

సీ. బుద్ధిచేతనకాదె ! పొగ సహాయముచేసి
నౌకల నీటిలో నడపుటెల్ల
బుద్ధిచేతనకాదె ! పొరుగుదేశములకు
నంతలో వార్తలనంపుటెల్ల
బుద్ధిచేతనకాదె ! భూమినల్లకలఁ గా
ల్వలు పాఱఁగాఁజేయఁ గలుగుటెల్ల
బుద్ధిచేతనకాదె ! పొగబండి నొక్కొక్క
గంటలో దూరమ్ముగడపుటెల్ల

తే. గీ. అట్టిబుద్ధులు హూణులయందకాని
హిందువులయందు లేవనియేవచింపఁ
గాని మనహిందువులబుద్ధి కార్యకార
కత్వమును బొంద దిది యేమి కర్మఫలమొ !

తే. గీ. అట్టిహూణులయందు ముఖ్యమగునట్టి
దెద్ది యన్నను ? లోకోపకృతికిఁ బాటు
పడుట, యయ్యది ధనమున బలిమికతన
బుద్ధివలనన నొనరింపఁ బోలుఁ గాదె !

చ. ఇది యిటులుండు నిప్డు వచియింపఁగఁబూనిన దెద్ది యన్న ? న
ర్వదిపయిమూఁడువే లనఁగఁ బర్వెడి "మైలు"లదేశ మీతఁ డిం
తదమకఁ గాళ్ళచేఁ గడచి తద్దయు నచ్చట నచ్చటన్ ముదం
బొదవఁగఁజేయు చిత్రముల నొప్పుగఁజూచె మనుష్యమాత్రుఁడే !

సీ. జనియించినాఁడు "ఫ్రాన్సు" నుదేశమునబాల్య
మంద విద్యాభ్యాసమందినాఁడు
అటుమీఁదఁ గొన్నాళ్ళచటఁ దనదేశము
నందుండు రీతుల నరసినాఁడు

అటుమీఁద సర్వదేశాంతరముల నుండు
చిత్రముల్ జూడ వాంఛించినాఁడు
వాంఛించి తా నింతవఱ కఱువదిమూఁడు
వేలమై ళ్ళేగియు వెలసినాఁడు

తే. గీ. ఏగి యందలి చిత్రిమ్ములెల్లఁ జూచి
నాఁడు చూచినవెల్ల నందఱికిఁ జెప్పి
నాఁడు మన కీదినము చెప్పినాఁడు గానఁ
బ్రియకరుఁడుగాఁడె ప్రజకు 'జిల్బేరు'గారు.

క. ఏకోనవింశతిశతా
ఖ్యాకలితాబ్దమ్మునందుఁ గానున్న సభన్
జేకొని 'లెక్చెరు' నీయఁగ
నీకష్టం బోర్చి దేశ మీతఁడు దిరిగెన్.

— ఆకొండి రామమూర్తిగారు —

మ. కవిత న్నైపుణిగాంచి చక్కఁ జదరంగంబాడఁగా మించి గా
నవిధిన్ బద్యములన్ బఠింపఁదగు విన్నాణంబు నార్జించి. వం
శవశంబై యెడఁబాయకున్న యల భైషజ్యమ్మునన్ జక్రివ
ర్తివినై యొప్పితె, రామమూర్తి! శమితార్తీ! కీర్తికి న్మూర్తివై.

— శ్రీ రంగేశ నవరత్నమాలిక —

శా. దారి న్నీచులు పూలు లంచమిడినం దానం బ్రమోదింతు వౌ
రౌరా! యెంగిలిపం డ్లొసంగినను వింతౌ మోదమూం బొందెద
య్యారే! "లంచములేనిమాట" యను సామ్యంబే నిజంబాయెఁ గా
శ్రీరంగేశ్వర! నీవుదక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. దారిద్ర్యంబునఁ బొట్టకూటికయి నిన్ దర్శింపఁగాలేదులే
యౌరా! కట్టఁగ బట్ట లిమ్మనుచు ని న్నాసింపఁగాలేదులే
ధారాళంబగు నొక్కమాట విను నీ తత్వంబు నేఁ గోరితిన్,
శ్రీ రంగేశ్వర! నీవుదక్క మఱి వేఱే లేరు దిక్కెవ్వరున్.

శా. క్షారంబౌ విషముండు గుంటయొ, మహాసర్పంబొ, లేకున్న నా
భీరాగారమొ, గోష్ఠమో, మలినగోపీపీనవక్షోజమో ?
యేరీతిన్ వసియింతు నామనమునం దేలాగు కాలాగునో ?
శ్రీరంగేశ్వర ! నీవు దక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. భారంబౌ గిరిమీఁదఁ బెట్టి నిను నే బాధింపఁగాఁబోనుగా,
నా రథ్యంబులఁ దోలుమం చననుగా, నాకార్యసంసిద్ధికై
నారీహత్యను గట్టుకొమ్మననుగా, నాతప్పిదం బేమియో ?
శ్రీరంగేశ్వర ! నీవుదక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. దారం దొంగిలినట్టివాని యనుగుందమ్ముండనా, తండ్రితో
వైరం బొందినవాఁడనా, మఱియు నెవ్వాఁడ న్ననుం బ్రోవఁగా !
భారం బేయగు నీకుఁ బాప, మయినం బాలింపకే తీఱునే,
శ్రీరంగేశ్వర ! నీవు దక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. నేరంబు ల్గడుఁ జేసినాఁడననుచు న్నిక్కంబుగా నీదుచే
తోరాజీవమునందుఁ దోఁచినను నాతో ముచ్చటింపంగ నీ
వే రేయైనను వచ్చి కూక లిడరాదే ? నేను వద్దందునే ?
శ్రీరంగేశ్వర ! నీవు దక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. "ధారంబోయుము సర్వలోకముల నౌదార్యంబుతో" నంచు నేఁ
గోరంబోదునటంచు భీతివడి నాకుం దర్శనం బీయవో !
క్రూరుండంచుఁ బరిగ్రహింపవో, మదిన్ గోపమ్మొ? చెప్పంగదే
శ్రీరంగేశ్వర ! నీవు దక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్.

శా. సారంబౌ భవదీయనామమును మెచ్చ న్నోరూరురా, దెంతొ ని
స్సారాలాపములన్ వచించుటకు వాచాలత్వము ల్మెండు చే
తోరీతిన్ మరలింప నాతరమె ? నాతో నీకు వాదేల ? యో,
శ్రీరంగేశ్వర ! నీవుదక్క మఱి వేఱే లేరు దిక్కెవ్వరున్.

శా. ఘోరంబైన తపంబుఁ జేయుటకు నాకున్ శక్తినీవీయలే
దేరీతిన్ గనుఁగొందు నిన్ను ? నిఁక నే నెవ్వారలం జేరుదున్

గారుణ్యం బెదనుంచి నిక్కముగ వేగన్ నన్ను రక్షింపుమా!
శ్రీరంగేశ్వర! నీవుదక్క మఱి వేరే లేరు దిక్కెవ్వరున్!

—• బందరు హిందూహైస్కూలులో మఱ్ఱిచెట్టు కొట్టినప్పుడు చెప్పినవి •—

సీ. నీపైననివసించు నీపుల్గులెల్ల నిం
కేచెట్టుచేరునో? యెఱుఁగరాదు
నీయాకు లాసించు నీభీదలెల్ల ని
య్యేడ నెంత గుందిరో? యెఱుఁగరాదు
నీనీడ నాటాడు నీబాలురెల్ల నిం
కేపాట్లు పడుదురో? యెఱుఁగరాదు
నీపాల కేతెంచు నీపౌరులకునెల్ల
నిం కేదిగతియొ? మాకెఱుఁగరాదు

తే. గీ. అన్నిమాటల కేమి? నీయం దొకింత
యేని యపరాధమును లేక యిట్టులైతి
వక్కటా! యేండ్లు నూరైనయట్టి నీకు
వగవ నేటికి? దుఃఖ మాపంగలేము.

సీ. ఊరెల్ల దిబ్బైన యుప్పెనగాలి కా
క్కింతేని చలియింప కిట్టులుంటి
వాపైని వర్షమావంతేని లేకున్న
కఱవు లెన్నెన్నియో కడపియుంటి
వవసరమ్మునకు నీదొకొమ్మ లెందఱెం
దఱు గొట్టినను దానఁ దలఁకవైతి
వింతేల? మొన్నఁ జెప్పెన్నియో వడిన యా
గాలికేనియును దూఁగాడవైతి

తే. గీ. వక్కటా! పాపవువిధాత యనపరాధి
వైన నీపాలమున నిట్టు లడఁగు మంచు
వ్రాసియ నష్టేలపోయెదు వాదు మాకు
వచ్చుటకు నుంటి విన్నాళ్ళు వటకుజంబ.

ఉ. "ఆటకు పీ" లటంచు నిను నక్కట ! కొట్టిరి నెట్టవంటగా
నేటికి నడ్డమైతి వది యించుకలేదు సరేగదా ! భవ
త్పాటవకారణమ్ముననె బాలురు నేద యొకింత లేక యీ
యాటల నెల్ల నాడి రిపు డౌగతి మా కెది ? వృక్షరాజమా.

తే. గీ. "అకట ! యెదురైనవారి నెన్నమ్మ గొట్టె"
నన్న సామెత నిజమయ్యె, నహహా ! నీయ
వస్థ చూచిన; నీవు దూరస్థలమున
నున్నజీవింతు వేమొకో ? కొన్నినాళ్ళు.

శా. హిందూస్కూలున నున్న నీయెడల మాకేకాదు మాదేశిక
స్కందుల్ మున్నగువారికేని( గనరే కన్పట్టి దావంత, యీ
నిందన్ బైకెటు పోవనిత్తు ? మది మానెత్తిన్ బడన్ వేయు మే
మెందున్ గ్రీడల గెల్చు జేసుమి ! నినున్ హింసించె వృక్షేశ్వరా.

—• తుమ్మచెట్టు •—

మ. అమలంబై రసవత్తమంబగు ఫలంబాలేదు, నీచెట్టు చెం
త మనుష్యుల్ నిలువంగనోపరు, భవత్పర్ణంబు లింతింతలే
సి, మెయిన్ గంటకరాశి, నిన్నెటు సృజించెన్ బ్రహ్మ ! నీవెందుకో
సము జీవించుట తుమ్మచెట్ట ! నిను వృక్షంబంటయే తప్పిలన్.

—• అశ్వత్థస్తోత్రము •—

శా. శ్రీలోలుండు గుణాకరుండు త్రిజగత్క్షేమానుకూలుండు స
చ్ఛీలపాప్రియకు( డార్తరక్షణకళాసింధుండు నశ్వత్థమ
ధ్యాలంబాత్ము(డు విష్ణుదేవు(డు సమస్తైశ్వర్యసంధాతయై
పాలించున్ జెలికాని సూర్యవిభునిన్ భైషజ్యచింతామణిన్.

క. శ్రీయును గోరినకోర్కులు
నాయాసము లేక లోక మంద(గ నేదే
నీ యోజించి సురాత్మక
మై యెస(గు పదార్థ మొకటి యానతియీవే.

వ. అంచు వినయావనతుండై ప్రార్థించు నారదునకు విరించి యిట్లనియె.

తే. గీ. నాయనా! దేవమౌని! నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిషబాధకమ్ము
తలఁచిచూడఁగ నశ్వత్థతరువు తత్ప్ర
దక్షిణమ్మున నగు మేలు తరమె పొగడ.

సీ. అరయఁగా నశ్వత్థతరువు దక్షిణమున
రూపింపఁబడియుండు రుద్రమూర్తి
నారాయణుండు పొల్పారుఁ బశ్చిమమున
నొప్పారుచుందు నే నుత్తరమునఁ
బూర్వదిక్కునయందు గీర్వాణపతియును
నఖిలగీర్వాణులు నలరుచుంద్రు
స్కంధంబులం దుపస్కంధములందును
గోవులు విప్రులు గొరలుచుంద్రు

తే. గీ. పత్రములయందు మౌనులు పరఁగుచుంద్రు
దీనిమూలంబు వేదముల్, దీనిపాలఁ
గల్గుచుండెడి జన్నముల్, నాల్గు దెసల
నదులు నదములు సరసులు నుదధు లుండు.

గీ. పాలఁ బొల్పారి మఱి ఫలభరము లేక
చల్లనీడల నిడు వనస్పతివి నీవు
అమ్మ! నినుఁ గొల్చి మానవుఁ డఖిలసుఖము
లైహికాముష్మికంబుల నందఁగలఁడు.

గీ. మిలమిలఁ జలించు కెంపారుదళము లొదవి
ఆదినారాయణస్వామి కాశ్రయమయి
బోధిసత్త్వోజ్జ్వలం బయి పొలుచు నీకు
వందనమ్ములొనర్తు నశ్వత్థదేవ!

గీ. తక్కుయోగ్యతలట్లుండఁ దరువులందు
నీ వరిష్టనాశకమవై నెగడి ధన్య

తమతఁ గంటివి విష్ణువు తవిలినీదు
పట్టున వసించుకతన నశ్వత్థదేవ !

గీ. వ్యాధు లీగెడిపాలు నీవలనఁ గలవు
శ్రీయు విన్నాశ్రయించి వర్తించుచుండు
వింత నిజమనియెఱుఁగుదు రెల్లవారు
శ్రీల సమకూర్చి మమ్ము రక్షింపుమమ్మ !

క. ఏకాదశరుద్రులు నా
కౌకః ప్రభుపైన విష్ణు వష్టవసుమయ
శ్రీ కిరవు పావకుండున్
నీకళ నీ కంజలి యవనీరుహరాజా !

గీ. అగ్నిగర్భ ! శమీగర్భ ! యజ్ఞగర్భ !
కనకగర్భ ! ధరాస్థలీగర్భ ! దేవ
గర్భ ! యోయి ప్రజాపతీ ! కడఁగి నీకు
వందనమొనర్తుఁ బ్రోవు మశ్వత్థదేవ !

గీ. ఆయువు బలమ్ము వర్చస్సు యశము మఱియుఁ
బశువసుప్రజావృద్ధియు బ్రహ్మతేజ
మాధిరాహిత్యమును బ్రజ్ఞ మేధయు నిడి
చక్కఁ గాపాడు మము వనస్పతివరేణ్య !

గీ. సతము వరుణుండు నినుఁ జక్క సాఁకుఁగాక
యెల్లపుడు వృష్టి నిన్నాశ్రయించుఁగాక
యెసఁగుఁ గాక నీచుట్టును దృణసమృద్ధి
అన్నిటను నీకు సుఖము చెన్నారుఁగాక.

క. చెడుకలలున్ జెడుచింతలుఁ
జెడుశకునమ్ములును శత్రుచేష్టితములు మా
యెడ నడుగిడకుండఁగ నీ
వడఁగింపుము సర్వకాల మశ్వత్థంబా !

క. దుస్స్వప్నహారణమునకున్
సుస్స్వప్నప్రదమునకు వసుప్రదమునకున్
నిస్స్వత్వహారమునకు నతి
హారిస్వితదురితంబు ! నీకు నశ్వత్థంబా !

క. నీమూల మబ్జగర్భుఁడు
నీమధ్యము విష్ణుమూర్తి నీయగ్రంబో,
సోమార్ధమౌళి వృక్ష
స్వామీ ! యశ్వత్థ ! నీకు స్వస్త్యయనంబుల్.

క. దేనిన్ జూచినమాత్రన
మానున్ రోగములు తాకుమాత్ర నఘహారం
బౌ నాశ్రయింప నాయు
శ్శ్రీ నెగడెడు నట్టి నీకుఁ జేతులు మోడ్తున్.

తే. గీ. "ఓమహాభాగ, యశ్వత్థ ! యోమనోహ
రాంగ, సుప్రియదర్శన ! యాశ్రయింతు
నోజ నా శత్రువులకుఁ బరాజయమ్ము
నాకు దిగ్విజయమ్ము సంతతము నిడుము.

క. ఆయుర్దాయము సంతతి
శ్రీయున్ ధనధాన్యసుఖసమృద్ధియు సతమున్
నీయడుగులు గొల్చెడినా
కోయశ్వత్థతరురాజ ! యొసగం గదవే.

గీ. ఇట్లు వేఁడెడివారల కిహపరములు
కొఱఁదవలేకుండుఁ జుమ్మి నారదమునీంద్ర ;
ఋషులు వేదమూల మ్మని యెఱిఁగి రావి
చెట్టును బరాత్పరునిగ నర్చింతురెలమి.

క. గురుఁ జంపి విప్రుఁ గెడపియు
దరిద్రుఁడయి రోగియై పిదప నీస్తవమున్

బరఁగ నొకలక్షజపమున్
జఠిపిన నరుఁ డందు సుఖము సత్యము మౌనీ!

గీ. ఎట్టి పాపోపహతచిత్తుఁడేని యీవస్రి
తమున కధికారి యన, నిఁక స్థండిలశయ
నుండును హవిష్యమాత్రాశనుండు బ్రహ్మ
చారియును వశియైన విచారమున్నె?

తే. గీ. ఏకహస్తప్రమాణమ్మనేని రెండు
చేతులంతయునేని ధరాతలమ్ము
గోమయమ్మున నలికి ముగ్గు లిడి రావి
"నో" మని యజింత్రు పురుషసూక్తోక్తవిధిని.

క. మౌనమ్మును గొని యశ్వ
త్థానోకహమున్ బ్రదక్షిణాచరణమునన్
మానించి విష్ణునామ
ధ్యానమ్మున నందుఫలము నందఁగవచ్చున్.

తే. గీ. పదమునఁ బదాంతరం బేగి పరఁగ హస్త
చేష్టలాఁగి వాక్కున నుతిఁజేయుచును మ
నమ్ము ధ్యానమ్మునం దిడి నాలు గంగ
ముల నిటు ప్రదక్షిణము సేయవలయునంద్రు.

క. ఎవఁ డశ్వత్థస్థాపన
మవనిన్ గావించు వాని యన్వయము తిరం
బవు ధనము నాయు వొలయున్,
దివికిన్ జనువారు తత్పితృప్రవరు లొగిన్.

ఆ. వె. రావిచెట్టునీడ రహినొక్కవిప్రుని
గుడువఁబెట్టెనేని కోటివిప్ర
వరుల కన్న మిడిన పరమార్థ మబ్బెడి
నరయ మింత నిక్కమగు మునీంద్ర!

తే. గీ. అనఘ ! యశ్వత్థతరుమూలమం దొనర్చు
జపము హోమంబు దేవతార్చనము నక్ష
యంబగు ఫలమ్ము నిడు నని యజుఁడ నేను
జెప్పుచుంటి నీమాటయుఁ దప్పఁగలదె !

క. మును నొడివినగతి రావిని
జనుఁ డాశ్వాసింప నది ప్రసన్నంబై వా
నిని దగనాశ్వాసించున్
మనమున నిది యెఱుఁగుమయ్య మౌనిప్రవరా !

తే. గీ. జన్నమొనరించుపాంటె నశ్వత్థతరువు
గొట్టి స్వర్గమ్ముఁ జను; వృథాకొట్టు నెవఁడు
వానిపితరులు నరకానఁ బడుదు; రొక్క
రావిపూజ సమస్తసురలను దనుపు.

—• గద్యకవిత. (తవిటిరొట్టెనుండి) •—

ఉ. గద్యము పద్యగౌరవము గాంచదు; బ్రహ్మరథమ్ము పట్టరీ
గద్యకవిత్వచాతురికిఁ; గన్నుల నీరు వృథాగ జార్చుచో
హృద్యవిచారు లెల్లరును నీతఁడు యోగ్యుఁడు గాఁడటందు రే
వాద్యము వీణకున్ సరిగ వచ్చునె. ప్రాజ్ఞు లెఱుంగకుందురే ?

క. కుక్షింభరులో, సాక్ష
ద్భిక్షాటకులో, మఱెట్టి పేదలొ పద్యం
బక్షీణగతిని జెప్పెడి
దీక్షితులే మేటికవులు, దేబెలె వారల్ !

తే. గీ. తద్దినముఁబెట్టువారల తమ్ములబలెఁ
బద్దెపుం గవులకు వెక్కగద్దెపుఁగవు
లింద్రు స్త్రీ శూద్రజనులకు నుపకరింత్రు
వారు పిట్టకథలు చెప్పువారు గాఁగ.

క. "అనఁగా ననఁగా నొక రా"
జనుతెరఁగున గతలుసెప్పు టదియొక తప్పే !

తనయూరుఁ బేరు నెన్నఁడు
గనని వినని కవుల దూఱఁగాఁ బనియేమో ?

గీ. దశకుమారచరితముఁ గాదంబరియును
లోనుగాఁగల రచన లీ మానవులను
బోలువారలు వ్రాయరు; పురుడు గాదు
వారికిని వీరికిని వారు పద్యకవులె.

మ. అల కాదంబరి పద్యకావ్యముగఁ జేయన్ శక్యమే ? చేయుచో
నిలువన్నేర్చునె దానిమాధురి ? నిదానింపన్ వశెన్ గాని యీ
యలఁతుల్ గిల్కిన వారికేమితెలియున్ ? హాస్యంబులన్ జేయువా
రలకున్ దజ్ఞుల కెంతదవ్వోకో, విచారజ్ఞుల్ విచారింపరే !

ఉ. విందుమకాదె మున్ గణికవేశులపచ్చడిఁ బెట్టి రాజరా
జుం దనియించె నొక్కసతి, సూరులు కొందఱు నట్లె గద్యలో
నం దమ కూర్పు నేర్పున ననన్యరుచిన్ రచియించియుంచి రా
యందములెల్లవారలకు నబ్బునె ? రోఁకటిపాటగాంద్రకున్.

గీ. గద్య వలదన; మయ్యది గట్టువాఁడు
పద్యకవులను దిట్టుట పాడియగునె ?
పద్యకవి గద్యకవియౌట బట్టు; గద్య
కవికిఁ బద్యముగట్టుటగాదు సులువు.

గీ. అట్లుగాక యెట్టెట్టులో యంతమాత్రఁ
బద్యకవి యగునొక్కొ ? యాపద్దెములకు
బ్రహ్మరథ మేరుఁ బట్టరు, జిహ్మగులకుఁ
బద్యకవులంత చేఁదు గావలయునొక్కొ !

క. ఒకసారిగాదు పదిసా
ర్లకటా ! చే యెటులువోవు నటులే వ్రాయన్
గకవికలు సాఁగుననుకొను
చకితుల సాహసములింకఁ జక్కంబడుతన్.

గీ. ఎవని కేళ క్తినిచ్చునొ. యెవ్వఁ డెంత
పెట్టి పుట్టెనొ, యెఱిఁగిన పెద్దలెవరు ?
కొలిఁబెట్టి నె త్తిని గోఁకికొనఁగనేల ?
నదియు సజ్జనలక్షణం బగునొ యేమొ !

క. పరనిందకుఁ బోవని యీ
పరమార్థజ్ఞులకు జ్ఞానపటిమనొసఁగి పో్రి
చు రమాపతియు నుమాపతి
కొలివిన్ దలగోఁకికొనని గోష్ఠిఁదెలుపుచున్.

ఉ. వస్తువసారమయ్యు నొక పట్టునఁ బాకవిశేషసౌరభ
స్వ స్తికమై రసజ్ఞలరసజ్ఞులకుం జవిగొల్పినట్లె యే
నిస్తులుఁడో యొకానొకఁడు నేర్పున గద్యము వ్రాసికూడ "మేల్ !
శ స్తమహో ! కవిత్వ''మను సద్యశమున్ వహియింప నేమగున్.

ఉ. రాముఁడు గడ్డిపోచను గరంబునఁ దాల్చిన నంత నస్త్రమై
గోమడఁగించి కాకవినిగొట్టి వెసన్ గను లొట్టఁజేసె; శ్రీ
రామునిపోల్కిఁ జేతుమని రాఁదగునే మతియొక్కఁజోదు ? వి
ద్యామహిమ మ్మెఱుంగని వృథారటకుల్ రటియింప నేమగున్.

ఉ. గద్యము పద్యపున్రుచిని గాంచుట నిక్కమయేని త్యాగరా
జాద్యనవద్యగాయకకృతాంచితసత్కృతు లిచ్చు మోదమున్
సద్యమయిచ్చు గద్యమటు సల్పగరాదొకొ. వారి సత్కృతుల్ ?
విద్యల తారతమ్య మవివేకు లెఱుంగరు వ్రాతు రేదియో.

ఉ. "పద్యము, గద్యమున్ రుచికిఁ బట్టులె'' యంచు లిఖించి యెన్నియో
హృద్యవచఃప్రబంధముల నీ జగమెల్లను నించు పో్రిడ యీ
గద్యము నంత వాడమికిఁ గారణ మేమొ రసజ్ఞుఁ డైనచో
సద్యమ చెప్పనేర్చు; విరసప్రిక్రృతుల్ సురసజ్ఞులౌదురే !

గీ. పద్యములు చెప్పగాలేని ప్రాజ్ఞులెల్ల
గద్యములు గట్టుదురుగాక ''గతియులేని

యమ్మలకు గంజి పానక" మగునుగాక !
యొరుల వృథగ దూఱుట నోటి దురదయొక్కొ ?

గీ. "మాడరన్" శైలి వారసమర్థులనుట
కెవ్వ రొప్పరు; వారెన్నదేని "క్లాసి
కిలు"గఁ బద్యమ్ములను వ్రాయు కీర్తి ధనులఁ
దిట్టరే ? తిట్టిరేని నిందితులుగారె !

క. దేనిరసము దానిది యను
చో నేరును మాటలాడఁ జూడ; రసూయన్
లో నూని కాఱు లఱచిన
చో నోరడఁపమియు నొక్క శూరతయొక్కొ ?

గీ. పద్యసౌష్ఠవ మంతగాఁ బట్టువడని
భాషలకు గద్యమే గొప్పపదవి; పద్య
మెంతయో హృద్యమైయున్న నితరభాష
లేల ? యీ యప్రతిష్టకుఁ బాలుపడుట.

గీ. పుట్టలో నెన్ని పుట్టవు, పురువు లకట !
పుట్టఁ బుట్టియు నొకమాలఁ డెట్టిపేరు
దెచ్చికొనె! బద్యమాహాత్మ్యదీప్తి కింత
కన్న సాక్షిని గోరువా ర్గలరె ? యొరులు.

క. కలిగిన వారికి వందన
ములు మిత్రులు వారు మాకు, మొఱకులగుచు ని
ష్కలుషుల నూరక దూఱెడి
తెలువుల కవ్వారు తెలిపి ధీగఱపఁదగున్.

—• ప్రాచీన గురుశిష్య పద్ధతి •—

శా. "బెంచీ"లక్కఱలేదు; "గేమ్సు" మొదలౌ "ఫీజుల్"విననేరావు, పా
మ్మంచున్ నిర్ధనుఁ దోఁచిపుచ్చరు గురుల్; "ప్యా"సైననే లాభమిం
దంచున్ నేమములేదు; మీ చదువునం దాలోకమీలోకమున్
గాంచన్ వచ్చెడి నార్యులార ! మిమ్ముమ్రొక్కన్ జెల్లు నెక్కాలమున్.

ఉ. కుక్కల నక్కలం గుఱిచి కోళ్ళఁ బొTheళ్ళ గుఱించి కాక మీ
రెక్కడఁ జూచినన్ దిరిజగదీడ్యచరిత్రుని దేవునిన్ మహా
భక్తికమై నుతించు సురవాక్కులు శిష్యులకిచ్చి వారి దౌ
వాక్కును, దేహమున్, ధనముఁ బావనముం బొనరింతురొప్పుగన్.

ఉ. చెప్పులకాళ్ళు, ముండితపు శీర్షము, శూన్యలలాటమున్, మఱిన్
గొప్ప బడాయివేషములుఁ, గుచ్చులపాగలుఁ, గోట్లు, గంధమం
దొప్పెడి పట్టముల్ గలుగునొజ్జలు శిష్యులు నీకు లేరు; మా
యప్ప! చిరాయువై బ్రతుకు మమ్మరొ, వేదమ! నీకుమ్రొక్కెదన్.

ఉ. చాపలె యాసనంబులఁట; జందెములే వరవారవాణముల్
పాపము పాపఁజాలు నదిపట్టులు శాలలు; పుణ్యలోకముల్
చూపెడి మాలికల్ మెడకుఁ జుట్టినపట్టము; లర్థమీమియే
ప్రాపగు జీత మిట్టిగురువర్యుల శిష్యులమ్రొక్కుటొప్పదే!

క. ధనవంతులకన్నను ని
ర్ధనవంతులె ప్రీతిపాత్రితములగు శిష్యుల్
వనమాలిఁదెల్పుచే చదు
వన మాలిమి నెగడు మీకు నంజలిసేతున్,

సీ. అరుణోదయ మ్మగునప్పుడ మేల్కాంచి
యాత్మానుసంధాన మాచరించి
ఆపగాదులకేగి యట స్నానమొనరించి
రవి త్రియీమయుని కర్ఘ్యములొసంగి
తముఁబోలి వర్తింపఁ దగుశిష్యగణములు
వెంబడిరాఁగ గృహంబుఁజేరి
నిన్న దండెమ్మపై నించిననీర్కావి
పుట్టముల్ ధరియించి భూతిదాల్చి
గీ. దేవతార్చన మొనరించి దేవదేవ
నామపూర్వకముగ వేదనాదమును ద

దంగవిజ్ఞానమును శిష్యు లనువదింపఁ
గాల మేగించు పూజ్యుల గారవింతు.

చ. నృపతులు వచ్చి దూరమున నిల్చి నమస్కృతిఁజేసి పూ_ర్తిగాఁ
దపమును వేచి యాపయిని దగ్గఱకుం జనుదెంచి "మీకునే
ది పనియొ తెల్పుఁడీ యిపుడె తీర్చెద" మన్న, "మఱేమి లోటుతే
దపరిమితంబ సౌఖ్య" మనునట్టి తపస్వుల మిమ్ముఁ గొల్చెదన్.

ఆ. వె. చంకజోలితోడఁ జనుదెంచునట్టి వి
ద్యార్థిఁగాంచి బ్రహ్మ యరుగుదెంచి
నట్లు సంతసించి యన్నమ్ము పెట్టు ప
త్రివ్రతామణుల నుతింతు భక్తి.

ఉ. "వారలు మీకు విద్యనిడ వారములేమిడఁజాలమే" యటం
చాఱని పేర్మి దేవుగతి నారసి భుక్తినిబెట్టి విద్యపైఁ
దీఱనియాసఁ జూపెడి విధి ప్రతిమానుల నగ్రహారపుం
బాఱుల వారిగేహినులఁ బాయనిభక్తినుతించి మ్రొక్కెదన్.

శా. ఏరాజుం గన నిచ్చలేమి 'నెటులో యీపొట్టఁ బోషించియే
తీరంగావలె' నంచుభైక్ష్య మది యెంతే శ్లాఘ్యమంచెంచి యా
చారంబొప్ప గృహంబు లేగి వెనుకన్ ఛాత్రవళుల్ రాఁగ సం
సారంబీఁదుచు విద్య నేర్చెడి మహాసంస్కర్తలన్ మ్రొక్కెదన్.

క. భృతకోపాధ్యాయులఁగని
మతిలో నేవమ్ముగాంచు మాన్యులకున్ బ్రో
న్నత వేదశాస్త్రవిద్యా
రతులకు నతులిడుదు రాజరాజనతులకున్.

మ. శుచియౌ వేషము, శుద్ధమౌ మతము, సంశుద్ధంబు దేహం, బని
ర్వచనీయంబగు పాండితీగరిమ, ద్రవ్యంబం దనాసక్తి, పూ
ర్వ చరిత్రంబులయందు భక్తియును, ఛాత్రశ్రేణిపైరక్తి గ
ల్గు చతుర్వేదుల సాంగులన్ నిరతమున్ లో నెంచి కీర్తించెదన్.

మ. ఘను లుద్యోగులు వచ్చి "మీసుతునకున్ గన్యామణిన్ మేటులౌ
ధనధాన్యాదులతోడ నిచ్చెద" మనన్ దత్కన్యఁ గైకో మనం
బున నిష్టంబదిలేక "మీర లతులుల్ పూఁబోఁడి మీకన్నె మే
మనఁగా రిక్తుల" మంచుఁ దప్పికొను మిమ్మర్చింతుఁ బుష్పమ్ములన్.

చ. ధనమును భూమియుఁ దమకుఁ దామయి యిచ్చెడిరాజులుండ "నం
దనులకు విద్యరాదు ధనధాన్యవశంవదులైన" నంచుఁ గై
కొనక యెటో కుటుంబమునకున్ భృతి గూర్చుచు నిస్పృహత్వమే
ధనముగఁ గాలముంగడపు ధన్యులఁ బూర్వుల నాత్మనెంచెదన్.

ఉ. రా జరుదెంచునప్పటి కరంటులతోఁటకు గొప్ప త్రిప్పుత
మ్మాజనపాలుఁ డొయ్యఁగని "యార్య! కృతార్థుఁడనైతి మీకు స్వ
ర్భూజము లెక్కలే దయిన భూమియొ ద్రవ్యమొ స్వీకరించి మా
తేజముఁ బెంపుఁ" డన్న గణుతింపని సూరుల నాశ్రయించెదన్!

ఉ. "పుట్టితిమెట్టులో యిచటఁ బుట్టినయూ రెటు వీడవచ్చు ని
ప్పట్టునస్తే వసించి బుధవర్యులఁ జేసెదఁగాక! శిష్యులన్
బెట్టెద నేన యన్న" మని పేదతనంబనుకోక దాతలం
బట్టి స్వశిష్యులన్ బెనుచువారి నుతించి యఘంబు త్రుంచెదన్.

ఉ. పెట్టెలులేవు కల్గినను బీగము సున్న విభూతిసంచియే
పట్టుదొకండు భూతినిడు బంగరపుంగని గాఁగ రాజరా
జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు నిచ్చువేలుపుం
జెట్టుల మద్గురూత్తములఁ జెప్పి మఱొక్కరి నెట్లు చెప్పెదన్.

—• హరినాగభూషణంగారికి వాగ్గేయ కారరత్న బిరుదు •—

ఉ శ్రీహి మవన్నగాత్మజయు సింధుకుమారికయున్ విరించి త
న్మోహినియున్ గజాస్యుఁడును బూర్ణతరాయురపారగానవి
ద్యాహృదయంగమత్వసుతదారసుఖమ్ము లొసంగి ప్రోతు రీ
శ్రీహరినాగభూషణు నజేయుని శ్రీహరినాగభూషణుల్.

చ. జనకుఁడు గాయకుం డనుట సత్యము యందము శైశవంబునం
దునసె గతించినప్పుడు సుతుం జదివించుట యెట్లు ? లింక నొ
క్కనికడ శిష్యుఁడై యితఁడు గానము నేర్చినయట్లు లేద యీ
తని ఘనగానపాండితి స్వతఃప్రసృతం బకుతోఽభిభూతమున్.

శా. సంగీతమ్ము ప్రధానవిద్య యటుపై సాహిత్య మద్దానితో
సంగాతమ్మనకున్ గడంగె నటుపై సంసారముల్ నెట్టఁగా
'నాంగ్లో' ముంగిట వాఁకిటన్ నిలిచెఁ గావ్యపర్జ్ఞ మాభూషణున్
శృంగారమ్మువఁ దక్క భక్తియెడలన్ శిక్షించె దక్షత్వమున్.

చ. ఒకచనుబాలు గ్రోలిన బుధోత్తము లెందరొ యుందురేగాక యిం
కొక చనుబాలమాధురియు నొండొక గ్రోలిన మేటి యీతప
స్విఁకఁగడు గాత్రపుంబటిమ చేకుఱు టబ్రమె ! యిట్టిఁడయ్యు గా
యకుఁ డనిపించుకోఁ గలిగె నంతియ వేఱొకవాదు లేదహో !

తే. గీ. ఏకపత్నీవ్రతస్థుఁ డనేకపత్క
శాకటోర స్తపీనాధుఁ డేకశంకు
లేనివాఁ డీతఁడని సభ లేచి చెప్పఁ
దగిన హరి నాగభూషణుఁ డెగడు నెవఁడు ?

తే. గీ. త్యాగరాజపదాంభోజరాగి యితఁడు
ఆగమాంతాఁగనామణీభోగి యితఁడు
వాగగోచరాత్మానందభాగి యితఁడు
ఆగమెఱుఁగని మేటివిరాగి యితఁడు.

తే. గీ. నాగభూషణుఁ డనుపేరు నందనునకుఁ
జనకుఁ డెప్పుడు పెట్టెనో సత్యసంధుఁ
డపుడె యాతని కళలెల్ల నావహించెఁ
గావలయుఁ; గానిచో నిన్ని కలియు టెట్లు !

శా. నాదాంతమ్మన మున్ను మిన్నయగు విన్నాణమ్ము నార్జించి పై
వేదాంతమ్మనఁగూడఁ దాదృశమహావేత్తృత్వపర్యాప్తి సం

పాదింపన్ దొరఁకొంటి వక్కతననే వాక్కున్ మఱిన్ గేయమున్
స్వాదుశ్రీకముగా వెలార్చి బిరుదున్ సాధించితో భూషణా!

క. వాగ్గేయకారకత్వపు
నిగ్గులు నీయంద కాక నేను మఱొకటన్
నెగ్గట దుర్ఘట మనుచున్
బిగ్గఱగాఁ జెప్పువాఁడఁ బెద్దల యెదుటన్.

సీ. అగ్రాసనాధిపత్యము వహించిన మేటి
దాక్షిణాత్యుఁడు గానతత్త్వవిదుఁడు
యూరపుఖండంబు హూణభాషకుఁబోలె
దక్షిణదేశంబు తావు గాన
విద్య కట్లగుటచే విజ్ఞతాపర్యాప్తి
దాక్షిణాత్యులయంద తవిలియుండు
నట్టి విజ్ఞుఁడు మన కగ్రపీఠమునందు
వేంచేయు టది సుకవిజనహితము

తే. గీ. పయిపయి విశేషము లెఱుంగువారు పలువు
రుండవచ్చును గాని యొక్కం డెవండొ
తక్క నెల్లరకును గళాతత్త్వ మెఱుక
పడ దనుచుఁ దజ్ఞులగువారు నుడువుచుంద్రు.

—• కాకినాడ కాలేజిదగ్గఱ వారియంత్రము •—

ఉ. ఎల్లదిశాముఖంబుల నహీనకళం జరియించు కృష్ణభూ
వల్లభు దానలక్ష్మికి నుపాయనమీయఁ బురీపురంధ్రి తాఁ
గొల్లఁగ మంచిముత్యముల కోవలు దాల్చెనటంచు నెంచె నా
యుల్లము వారియంత్రవివరోద్గతశీతలశీకరావళిన్.

మ. పురమధ్యంబునఁ గృష్ణభూవరుఁడు సొంపుల్గుల్కఁ గాలేజి ద
గ్గఱఁ గట్టించిన వారియంత్రమునఁ జక్క న్వెడల్ పాఱు శీ
కరముల్ తన్నృపతిన్ వరించిన యశఃకాంతాశిరస్సీమ న
వ్వరుఁ డామోదముమీఱఁ బోసెడు తలంబ్రాలో యనం బొల్చెడున్.

క. పురవీధి మిత్రతతితో
నరుగుచు నందూరి రాఘవాచార్యం డా
దరమున నడిగిన విని య
త్తఱిఁ దిరుపతిశాస్త్రి యాశుధారన్ జెప్పెన్.

—• శ్రీ అన్నవరము సత్యనారాయణస్వామివారి దేవస్థానము •—

శా. నానాఁటన్ భవదీయవైభవము చిన్నంబో కవిచ్ఛిన్నమై
యీనాటం గల దేవతాస్థలములందెల్లన్ శిరోభూషయై
యానందమ్మిడె గాని యిందనుక దేవా! నేఁ డదేమో కడున్
మౌనంబూనె నిటుల్ వచించిన ననున్ మన్నింపు సత్యప్రభూ!

మ. "కలికాలం" బన వత్తువేమొ, యది నిక్కంబే యగుంగాని యీ
కలికాలానకె నీవు దైవతమవై కాపాడఁగాఁబుట్టి యి
ప్పలుకుల్ వల్కితివేని నవ్వరాకొ! గీర్వాణాధిపుల్; పూర్వపుం
గలిమిన్ వే గలిగించికొమ్ము నిజమున్ గన్పెట్టి సత్యప్రభూ.

మ. ధన మున్నప్పుడె నాస్తికిం దిగిన మా తత్త్వమ్ము నూహించియే
మన కెట్టెట్టులొ నైఁచి తుట్టతుద కానాస్తిత్వతత్త్వమ్ము మా
కనులం గట్టినయట్లు తోఁచెడి గతుల్ గల్పించితో, ముందు నీ
పనికిన్ మోసమువచ్చు మేల్కొనుము దేవా! సత్యనారాయణా.

మ. ఇనుఁగంట్యన్వయుఁడౌ ప్రకాశన్పృఁపుడే యీ నీదు దేవస్థలం
బున ధర్మమ్మొనరించుపట్టునఁ గడుం బుణ్యుండు నిర్ణేత యా
తని లోపంబొ, మఱేరి లోపమొ! భవత్సంస్థాన మీ యేఁడు మా
కనులన్ దన్పదు దిద్దికొమ్ము కడువేగన్ సత్యనారాయణా!

శా. ఆవేదధ్వని, యామహామహుల శాస్త్రారావ, మాసత్కవీ
శావేశోక్తులు, కర్ణముల్ దనుపు నాయాగాయకస్ఫీతి, యా
యా విన్నాణపు గాయనీగరిమ మేదయ్యా! మహాభాగ! నీ
యీవింబట్టియె తగ్గె సర్వమనుకొమ్మీ! సత్యనారాయణా!

శా. నీకుం బెండిలి యంచు బ్రాహ్మణులు రానీ పోని వేతొక్కచో
రాకల్ తీర్థము స్వార్థముగా గలియునన్ రాఢిన్ మది న్నిల్పి యీ
నీకళ్యాణముఁ చూడవచ్చెదరు మన్నింపంగ మే మోప మో
హో! "కంచిన్ గరుడాళ్ళ నేవ" యిది గాదో సత్యనారాయణా!

శా. నీదౌ పెండిలికిన్ సదస్యమహమే నిర్ణిదర్శిమౌ ప్రాణ మ
య్యా, దేవా? యది వేదనాదమయమం దంతర్గతంబై సదా
నీ దివ్యాకృతి వొల్చు దాని నెటులో నేర్పొప్పఁ దగ్గించి నీ
కీ దూ షేము ఘటించినాము; నిజ ముంతే సత్యనారాయణా!

శా. "దాసుల్ చేసిన తప్పు దండములతోఁ దగ్గున్" నమో దేవ! శ్రీ
వాసిన్ గూర్చుము; నీసదస్యము కడున్ భాస్వద్యశస్ఫీతమై
భాసిల్లన్ బొనరించుకొందుము, క్షమింపన్ వేఁడుచున్నారు శ్రీ
వాసా! యీపయిఁ దప్పొనర్చిన క్షమింపంబోకు సత్యప్రభూ!

శా. ఎన్నేఁ గార్యము లుండుఁగాక, యవి మే మేమాత్రమున్ జూడ కో
యన్నా! నీదు సదస్యపున్ మహమునే యం దగ్రగణ్యమ్ముగా
మన్నింపం బ్రియతింతు; మీనుడి నెటో మన్నించి నీవై భవం
బు న్నిల్పన్ గమకింపు మెప్పటి ధనమ్మున్ దెమ్మ సత్యప్రభూ!

మ. "వెల లన్నింటికిఁ దగ్గుహేతువునఁ బృథ్విన్ దగ్గె ద్రవ్యంబు లో
కుల, కాహేతువుచేత రాఁబడియు నీకున్ దగ్గె నీయేఁ డటం
చెలమిన్ దృప్తిగొనంగవచ్చు నటులౌటే నిక్కమౌఁగాక మా
వలనం గల్గిన తప్పు దెల్పితిని దేవా! సత్యనారాయణా!

మ. ఒకటే మాట, భవత్ప్రతిష్ఠ యది మంత్రోచ్చారణాధీన. మం
దుకు వేదంబులు, దానికిన్ ద్విజులు నెందున్ మూల; మవ్వారి పూ
జకుఁ దాఁ బుట్టె సదస్య; మం దెదియొ వ్యాజ మ్మొండు గల్పించి వా
రికి నైరాశ్యము గొల్పు నీవికృతి నిర్బీజంబు సత్యప్రభూ!

మ. కపటం బెందునుగూడఁ గూడదు భవత్కైంకర్యమందన్ననో
యెపుడున్ గూడదు "కూడ" దంచనుట కీవే సాక్షి నీయుత్సవం

బిపు డీయేఁ డిటులౌటకున్ గతము వేఱే యున్నదే! మాకు ని
క్కపు బుద్ధిన్ గరుణించి నీయశ మెటో కాపాడుకో దేవరా.

మ. అతిరిక్తుండగువాఁడుగూడ సుతుకళ్యాణమ్మునందున్ సద
స్సు తఱిన్ వచ్చినవారి కెల్లరకునిచ్చున్ శక్తి యున్నంతలో
మతిమన్ముఖ్యులమయ్యు మే మటులు సన్మానింప నుంకింప కీ
గతి నీకున్ ఘటియించినార మని యల్గంబోకు సత్యప్రభూ!

శా. ఊరుం బేరును లేని గుట్టకు భవద్యోగమ్మునన్ జేసి చే
కూరెన్ మేరువుకన్న గొప్పఁదన; మాగొప్పందనం బీపయిన్
నీఱై పోవునా యేమొ! యంచు మదిలో నేఁ డబ్బెడిన్ భీతి, మా
భీరుత్వమ్ము నడంపఁగావలయు నీప్రేమమ్ము సత్యప్రభూ.

శా. నీవీడున్ మఱి నూఱివీడు నివియే నే నెప్పుడుం దప్ప కే
దేవా! వచ్చుచుఁబోవుచున్నయవి; నీతేజంబుఁ దత్తేజమున్
శ్రీవిభ్రాజితమౌటకై సతతమున్ జేతమ్మునం దెంతు; మ
ద్భావం బిచ్చుత నీగిరీంద్రమునకున్ భద్రమ్ము సత్యప్రభూ!

శా. కొండ ల్లేవొకొ, గుళ్ళు లేవొ! మఱి యాగుళ్ళన్ శివుండో, రమే
శుండో లేఁడొ! భవద్గిరీంద్రమునకే శోభావిభూతుల్ మహో
ద్దండస్ఫూర్తి నెసంగె; నట్టి మహిమల్ తత్తత్స్థలంబందు నెం
దుండెన్ నీవ వచింపు మీవయిపునం దొక్కంట సత్యప్రభూ!

శా. గద్వాలాదుల కేగి పండితులు పెక్కండ్రెట్లు సంభావనా
ముద్వృత్తన్ గనుచుండ్రొ, అట్టులె భవద్భూధ్రమ్మునన్ సత్కవుల్
విద్వాంసుల్ గనుచుండ్రి గౌరవము; నిర్వేలమ్ము త్వద్ధర్మకృ
చ్చిద్వాల్లభ్యము, దానఁ జేకుఱె యశశ్శ్రీ నీకు సత్యప్రభూ!

శా. లక్షల్ వచ్చెడి ఱేఁడ్లు పొందని యశోలక్ష్మిన్ భవత్సత్కృపా
వీక్షన్ జేసి ప్రకాశభూవిభుఁడు సేవించెన్ ధ్రువం; బీపయిన్
దీక్షంబూని ధనమ్ము దేకునికి నేది త్రోవ తత్తత్కళా
ధ్యక్షుల్ వచ్చిన గారవించుటకు? రత్నాహోర్యరాజేశ్వరా!

మ. ద్విజులన్ వీడి ద్విజేతరప్రభుని నీతేజమ్ము కామించి భూ
ప్రజ మెచ్చంపగురీతి నింతదనుకన్ వర్ధిల్లి, యీయేఁట న
క్కజమౌ భక్కిని వెన్కఁబట్టుటకునై కంపించి తన్మూలమౌ
వృజినంబున్ దొలఁగింపనెంచి యిటు నావిజ్ఞప్తి సత్యప్రభూ.

మ. సిరి వక్షస్థలిఁ బాదుకొల్పిన నినున్ సేవించు నిన్నంటిభూ
వరు శ్రీమంతుఁ బ్రికాశరాయని యశోభాగ్యాన్వితుం జేసి నీ
చరణారాధన ముత్తమోత్తమముగా సాగించుకోవయ్య, త్వ
చ్చరితన్ దచ్చరితన్ గవిప్రవరు లాస్వాదింప, సత్యప్రభూ!

మ. అసిధారావ్రతమూని నీగుడికి ధర్మాధ్యక్షుఁడై దోసపుం
దెసకున్ లేశము వోక భక్తిగరిమన్ దీపించు నిన్నంటిభూ
మిసతీనాథుఁ బ్రకాశరాయని సముచ్చలద్యశోవైభవ
ప్రసరున్ జేసి జగన్నుతుల్ గొన నినుం బ్రార్థింతు సత్యప్రభూ!

శా. నీసంస్థానమునందుఁ బండితుఁడనై నేనుండుటంజేసి నీ
కోస మ్మే నిటు సారె మ్రొక్కి యిడుదున్, గోపింపకయ్యా! భవ
ద్దాసున్, శ్రీ యినుగంటివంశ్యు, గుణవత్తామాన్యు నోలిన్ యశ
శ్శ్రీసంపన్ను నొనర్చి కన్గొనుము తత్క్షేమంబు సత్యప్రభూ!

—• నూజివీడులో శివలెంక వీరేశలింగముగారి సాముద్రికము •—

మ. విమలంబైన మనీష జాతకములన్ విజ్ఞుల్ పరీక్షించి యం
శము లేలాగు వచింతురో, యటులె హస్తంబున్ విలోకించి స్ప
ష్టముగాఁ జెప్పెను బుద్ధిమంతుఁడు బుజుస్వాంతుండు వీరేశలిం
గము శ్రీమచ్ఛివలెంకవంశజుఁడు నేఁ గన్గొంటి నిక్కమ్ముగన్.

—• చీరాల, శ్రీ కూర్మదాసుగారు, సప్తాహమహోత్సవము •—

శా. సంసారమ్మున బ్రుంగి కట్టువడి నిచ్చల్ చచ్చుచున్ బుట్టుచుం
హింసాపారము గానలేని జడులన్ వీక్షించి తద్దుఃఖవి
ధ్వంసమ్మున్ గలిగింపనెంచి యొకనిన్ దద్భీతు సృష్టించి మీ
మాంసం దీర్చితి భక్తసంతతికి రామా! కూర్మదాసావనా!

శా. నీ పాదంబులు సర్వభూతములు గా నీ కీర్తిఁ దెట్లయ్యెనో
యాపద్బాంధవ! తాను బాదములుగా నంచున్ విచారింతు; నీ
కేపట్లన్ బనిపాటు లున్నయెడ నిక్లే యెచ్చటో డాఁగి త
ద్వ్యాపారమ్ములు చేసికొందువొకొ రామా! కూర్మదాసావనా!

మ. గరుడాశ్వారనఁ బక్షిమాత్రుఁడె కదా! కైకొంటి వవ్వాని నీ
వరుగంగాఁ గరణమ్ముగా; వృధగ నీ వవ్వాని యన్నన్ దిర
స్కరణంబున్ బొనరించి తిప్పు డది తీర్చన్గాదె తత్తుల్యుపై
నరుగంజొచ్చితి 'దేశదేశములు రామా! కూర్మదాసావనా!

—• రాజమండ్రి ఇన్ కంటాక్సు ఆఫీసరు •—

ఉ. ఏ వొకరుండ నిప్పు డొకయించుక కైతము నల్లువారిలో
ధీనిధినైన నౌదు, గడతేటిన శ్రీనిధిగా గణించు మీ
పూనిక కక్కజంపడితిఁ; బూర్తిగ మీ రటు విశ్వసించి నా
పై నెనరుంచుటన్న నది భాగ్యము; శ్రీనిధులైన మీదు చూ
పానుకతాన నా కిఁక మహత్తరభాగ్యము గల్గునేమొ! వి
ద్యానిధులైన సత్కవుల కన్నము వస్త్రము గల్గుటే మహా
శ్రీనిలయత్వ మబ్బుటని చెప్పుదు రార్యులు, హానిలేనిఁ దా
మీనుడి కాదు కాదన; రదేమన, నాంగ్లకవిత్వమందు న
న్యాను లనేకు లుండియును నొక్కరుగాని విశేషభాగ్యముం
బూనినవారు లే రవియె బుద్ధిమదగ్రిణు లాడ వింటి నే;
నే నిలువేలు పంబిక నొకించుక లచ్చినె కోరుకొంటిఁగా
నీ నెఱిచ్చి నిమ్మనుచు నెన్నఁడుఁ గోరఁగలేద; యాపెయుం
దా నటులే యొసంగె, నిది తథ్యమ; దానన తృప్తిఁజెంది సం
తానము శిష్యవర్గము ముదంబుమెయిన్ జదివించుచున్ బర
ధ్యానపరుండనై దినము లాఁదట నెట్టెదు నన్నెటో కవీ
శానునిఁగా గణింపక విశాలధనాలయుఁగా గణించుచో
నేను మఱేమియుం బలుక నేమగు! వృద్ధుఁడనొకతాన నే

మేని లిఖించి మీమదికి హెచ్చినసో మోదముగొల్పు శ_క్తియుం
దా సది తగ్గ; నర్వదికి దాఁటిన యిట్టి వయస్సునన్ భవ
న్మానసముం గలంపఁగల మంచి కవిత్వము సెప్పనే_ర్తునే!
దీనికతాన నాకలిమి తెల్లి మదెట్టిదొ మీరెఱింగి భూ
జానికి నేఁ గరంబిడఁగఁజాలెడివాఁడనొ కాదొ చూచి నా
యీనుడులెల్ల నమ్మఁదగునేనియు నమ్ముఁడు, నమ్మరేని మీ
మానస మెట్లువచ్చు నటు మాకు విధింపుఁడు; రాజుపూనినన్
దా నొక లోపముండునె? విధానమెఱింగిన సత్ప్రధాను లే
మే నొనరింపఁబూన నటులేయగు; మీ కగుఁగాక భద్రముల్.

—• శ్రీ దావులూరి ఉమామహేశ్వరరావుగారు (రాజమండ్రి) •—

ఉ. శ్రీమదుమామహేశ్వరుఁడు చిన్మయరూపుఁడు లోకక_ర్త స
ర్వామయహారి చంద్రమయమైన శిరోమణిఁ దాల్చు వేల్పు స
త్స్వామి యుమామహేశునకు సారతరాయురుదారసంతతి
స్వామికమైన సంపద నొసంగి యొసంగఁగఁజేయుఁగావుతన్.

—• శ్రీ సోమెన కామేశ్వరరావుగారి కుమా_ర్తె వివాహము. రాజమండ్రి •—
(బలిజేపల్లి సీతారామయ్యగారి పాటకచ్చేరీ)

క. కామేశునిల్లు సీతా
రామేశుని పాట పెండ్లి రామునిది మహా
శ్రీమెఱసెడి లలితాంబిక
యీమెయిఁ దాఁ బెండ్లికూఁతు రిది వర్ణ్యమగున్.

క. నారాయణదా సనియెడి
ధీరుఁడు రసికుండు మిగులఁ దేజస్వి కళా
పారమహోదధి సభ్యుఁడు
వేఱుగ వర్ణింపవలెనె విద్యాగరిమల్ ?

తే. గీ. చక్కఁగాఁ బాడెదవటన్న సడిని వినుటె
కాని వినలేదు నేను నీ గాన మెపుడు ;

ఇపుడు సోమేనకులుఁడు కామేశరావు
కూఁతు పెండిలి దీర్చె నీకొదవ సఖుఁడ !

—• నారాయణదాసు హరికథ •—

తే. గీ. దాసు నారాయణునకు నీతండు, వీని
దాసు లెల్లెడఁ గల హరిదాసు లెల్ల;
నొక్క హరిదాసులేకాదు, నిక్క మితని
యెడల నాదృతిలేనివాఁ డెవఁడు బుడమి !

తే. గీ. ఇతఁడె యాశీర్వదించె దంపతుల నితని
కేను దీవనలిచ్చెద, నితఁడు ప్రకృత
దంపతుల పిల్లలకు వివాహంపుఁ దఱుల
నిలిచి యీలాగె హరికథల్ సలుపుఁగాక.

—• బందరు సభలో పింగళి లక్ష్మీకాంతము యం. యే. కి ఆశీర్వచనము •—

శా. శ్రీకిన్ దావుగఁ గీర్తికిన్ దెఱవుగా శ్రేయోనిధానమ్ముగా
నాకల్పం బలరారు సత్కవిత కత్యంతమ్మనుఙా బాదుగా
లోకస్తుత్యపదమ్ముగా శుభయశోలుంటాకుఁగాఁ జేసి ల
క్ష్మీకాంతుండు కృపాళుఁడై మనుచు లక్ష్మీకాంతు నశ్రాంతమున్.

—• కే. యస్. గిరిరావు కొడుకు చి॥ మాధవరావు జ్వరములో నాశీర్వచనము• —

శా. శ్రీ కల్యాణపరంపరాదిసకలశ్రేయమ్ములన్ గూర్చి వి
ద్యాకూలంకషభాగ్య భోగ్యగరిమన్ బ్రాపించి దీర్ఘాయురు
ద్రేకమ్మున్ గరుణించి మాధవుఁడు నీ దేహమ్ము మాత్రైన యీ
నీకుఱ్ఱన్ మన మాధవున్ మనుచుతఙా నిక్కమ్ము నాదీవనన్.

—• వడ్డాది సుబ్బారాయకవిగారి సన్మానసభలో, రాజమండ్రి •—

చ. సుకవితయే యుపా:స్యముగ సూనృతవృత్తియె తోడునీడగా
సకలమనీషిసమ్మతయశమ్మె ధనమ్ముగఁ గాలుద్రవ్వ వై
రికి నెదురొడ్డకున్కి గుణవృద్ధత మున్నె గణించి నేఁడు వా
ర్ధకము నలంకరించు వసురాయనికిన్ సుచిరాయు వబ్బుతన్.

మ. అసిధారావ్రతమూని జీవితము విద్యాగోష్ఠిచేఁ బుచ్చి యీ
వ్యసన మ్మొక్కటఁ దక్క నేవ్యసనమం దాత్మ న్నియోగింప కా
ర్యసమాదృత్యవలంబియై ధనియుఁ బూర్ణానందియై యొప్పు మా
వసురాయుండు చిరాయువై మనుత విద్వాంసుల్ కవుల్ మెచ్చఁగన్

—• "సూక్తిసుధానిధి" యను బిరుదమునుగూర్చి •—

క. స్వీకర్త సుబ్బరాయఁడు
వ్యాకర్తయు వేంకటకవి యాంధ్రవచోభా
మాకాంతుఁడు శ్రీయుత రా
ధాకృష్ణుఁడు దాత బిరుదు తగినది బళిరే!

—• కవిగండపెండారము శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారు •—

మ. మొదలే తొందర, అందు వార్ధకము, తన్మూలమ్మున న్నల్లమం
దది దా నెమ్మది నెమ్మది న్నిలువనీ, దాపట్టు లేకున్నచో
మెదలన్ శక్యముగాదు నాస్థితిని నే మీ కిప్డు వ్రాకుచ్చితిన్
గద! యధ్యక్షత కే నెటుల్ తగుదు వక్కాణింపుఁ డార్యోత్తముల్!

చ. గురువులు పల్వురుండినను గొంకక నేఁటికి నిల్చియున్న మ
ద్గురుఁ డొకరుండె శ్రీపదుఁ డకుంఠితతేజుఁడు కృష్ణమూర్తి; యీ
గురునకుఁ జేయు నుత్సవము గోరికిమైఁ గనుఁగొంటకన్న సం
బర మొకఁ డుండఁబో దనుచుఁ బాల్పడి నిల్చితి నగ్రపీఠికన్.

—• గండపెండారమును దొడుగునప్పటి పద్యములు •—

తే. గీ. మూరురాయరగండపెండారధారి
కృష్ణకవిరాజు పెద్దన కిచ్చె గండ
పెండరము; నేఁడు శ్రీతెల్గుపృథివిప్రజల
కతనఁ గైకొనె మరల విప్రతను బడసి.

ఉ. శ్రీపదమైన వంశమున శ్రీయలరారుట కొ్రత్తగాదుగా
నీ పదమంద వొల్చునెడ నెక్కుడుగా నది మించు నేఁడు మా
శ్రీపద కృష్ణ పాదసరసీరుహమం దది వొల్చుటన్ దదా
ఖ్యాపరమైన యర్థ మది సార్థకమయ్యెఁ గవీంద్రనుత్యమై.

చ. అనితరసాధ్యమైన భరతాన్వయపుణ్యచరిత్రి తెల్గు బా
సను వెలయించినా ర్మగురు సత్కవు; లీకవిసార్వభౌముఁడో,
తన యొకచేతిమీఁదుగనె తత్కృతి నిర్వహణంబొనర్చి మిం
చెను; గవిగండపెండరము చేతి కొసంగుదుమొక్కొ, కాలికో!

—• మధురగీతాభిజ్ఞ సురభి శివసుబ్రహ్మణ్యయ్యరునాగరత్నము పాటకచ్చేరీ, రాజమండ్రి •—

శా. అబ్రంబయ్యెడి నాకు నోమధురగీతాభిజ్ఞ! సద్గానవి
ద్యాబ్రాశీ! నిను మెచ్చఁగాఁగలనె! నే నల్పజ్ఞుఁడన్; నిన్ను నా
సుబ్రహ్మణ్యుఁడె మెచ్చఁగావలయు; నే స్తోత్రిన కిట్లాడ, నో
సుబ్రహ్మణ్యుఁడ! నాగరత్నములె సంశోధించు నీ విద్దియన్.

తే. గీ. అజ్ఞులగువారు మెచ్చుటకన్నఁ గడు న
భిజ్ఞులగువారి మచ్చులె పేరుదెచ్చు;
గాన విద్వాంసులగువారు దీని నెఱిఁగి
ప్రాజ్ఞసమ్మతికయి పాటుపడఁగవలయు.

—• కడియం రైల్వే స్టేషన్‌మాష్టరు గాలి కోటయ్యగారు •—

ఉ. పాటిలుఁగాక కోటయకు భద్రము లెక్కడి కేగిన, న్నిరా
ఘాటముగా నిరామయతఁ గైకొని పిల్లలు జెల్లలున్ గడుం
దేటయుఁ దెల్వియుం గలిగి తేఁకువఁ బొల్తురుగాక; దంపతుల్
మాటికి నట్టి సంతతిని మన్నుచుఁ గందురుగాక మోదమున్.

—• ఆశీర్వచన పద్యములు (ఏలూరు.) •—

తే. గీ. నాగభూషణుఁ డతని సౌందర్యవతియు
నాగభూషణు నతని సౌందర్యవతిని
ఆత్మనాహూనురాగమాహాత్మ్యగరిమ
నెల్లవిధముల రక్షించు టేమివింత!

ఉ. బొడ్డునఁ బుట్టువంది జగముల్ సృజియించుచుఁ గన్నయట్టి యా
బిడ్డలఁ దల్లిదండ్రి లిలుపెత్తనమున్ వహియించి పెంచ "బల్

దొడ్డ గృహ స్థితం'' దని బుధుల్ నుతియింప రహించు ధాత యీ
బొడ్డుకొలమ్ము దంపతులఁ బ్రోచుతఁ బుట్టినయిల్లు వర్ధిలన్.

ఆ. వె. ఎల్ల యవయవమ్ము లేమహాసాధ్వికి
మంగళప్రదత్వమహిమ నలరు
నట్టి సర్వమంగళాంబికాసత్కృప
జంపతులకు సుఖ మొసంగుఁగాక.

—• పెండ్లికుమారుని పినతండ్రి బాపిరాజు చేసిన యవధానసభ •—

చ. ఘటకుఁడు బాపిరాజు కవికాండము మెచ్చ సభాస్థలమ్మునం
దటునిటు తూఁగిపోక యిపు డష్టవధాన మొనర్చె; ధారణా
పటిమకు నద్భుతంపడి ''సెబా'' సని మెచ్చెను చెళ్లపిళ్ల వేం
కటకవి; వీనికిం గలుగుఁగాత మితోఽధికమైన భద్రముల్.

ఉ. కోమటులందు ధార్మికు లకుంఠితకీర్తు లువారులున్ మహా
శ్రీ మితిమీఱు గేస్తులును జెన్నలరారుట యెందుఁ గందు; మీ
ధీమహితుండు పండితవిధేయుఁడు సత్కవి బాపిరాజు కా
వ్యామృతమాని కీర్తి నలరారెడి సంపద కింపుగొల్పెడిన్.

ఆ. వె. మునుపు వైశ్యులందు వినఁబడె వైశాఖ
పట్టణమున సుకవివరుఁ డొకండు;
ఇపుడు రాజమండ్రి నేలూర మఱికొన్ని
చోటులందుఁ గలరు సుకవు లిందు.

—• శ్రీమంత్రిప్రెగ్గడ నరసింహముపంతులుగారి కుమారుని వివాహము రాజమండ్రి •—

శా. మంత్రి ప్రగ్గడ దావులూరికులసంబంధమ్ము లీరీతనే
సంతోసమ్మున కాటపట్టులయి నిచ్చల్ పెండిలుల్ శోభనో
దంతమ్ముల్ మఱి బారసాలలును ననన్యప్రక్రియన్ గూర్చి ది
గ్దంతుల్ సత్కవు లిచ్చు నాశిషములన్ గైకొంచు వర్ధిల్లుతన్.

—• శ్రీయాదవోలు జమీందారుల తాలూకు క్రొత్తవారింట వివాహము •—

శా. భాషాకాంతుఁడు ధత్సతీమణియు, నంబాదేవి తద్భర్తయున్,
వేషంబుల్ పదిఁ గొన్న వేల్పతని దేవీరత్నమున్ నిత్యసం

తోషంబున్ నెగడించి యాపిపప సత్త్రోకంబుఁ గల్పించి యీ
శేషారావును దత్సతీమణి శచిన్ జెల్వార రక్షించుతన్.

—• ఈ వివాహ సందర్భమందే పొడుగు రామమూర్తి వీణ •—

ఆ. వె. పొడుగు రామమూర్తి గిడుగు శ్రీరామమూ
ర్తికిని గూడ కర్ణతృప్తికలుగు
నట్లు వీణయందు నారావమునుబుట్టఁ
జేయఁగలఁ డటంచు జెప్పఁగలను.

ఆ. వె. ఇంటిపేరు మాత్రమే పొడుగో, లేక
విద్య గూడఁ బొడుగొ ! వినిన పిదపఁ
గాని నిశ్చయింపఁగారాద యనుకొంటి;
వింటి, సంతసంబుఁ గంటి నేఁడు.

—• శ్రీజలగం రామయ్యగారి కుమారుని వివాహము (జీడిగుంట) •—

శా. శ్రీరంజిల్లెకి యాయువున్ సిరియు సచ్ఛీలంబు సంతానవి
స్తారంబున్ సుఖముఁ యశోగరిమమున్ సౌభాగ్యముం గూర్చి యా
శ్రీరామప్రభుఁ డమ్మహాత్మ సతియా సీతామహాలక్ష్మియున్
శ్రీరామున్ వరుఁ దత్సతీతిలకమున్ శేషాంబికం బ్రోచుతన్.

—• పైవివాహమునందే హరికథకుని గూర్చి •—

తే. గీ. జీడిగుంటకుఁ బేరొనఁగూడు పొంటెఁ
బుట్టె గోదావరీకూలముననితండు
రామమూర్తికి గొడుకయి రామకీర్తిఁ
బాడ లక్ష్మీపతి యను నాహ్వాయముతోడ.

—• బెజవాడ వెంకటస్వామి నాయుడుగారు •—

చ. తుల జననంపురాశి యటఁ దోయజమిత్రుఁడు సౌమ్యుఁడున్ వ్యయ
స్థలిఁ గుజశుక్రు లాయపుఁబదమ్మునఁ గేతువు నెన్మిదింట ను
త్పలసఖుఁ డైదిటన్ శిఖియు భాస్కరి రెండిట జీవుఁ డుండ ని
శ్చల బెజవాడవంశమున జన్మము వేంకటసామి కైకొనెన్.

ఉ. జాతకచక్రిమందలి పరిశస్తగ్రిహమ్ములకల్మినో, పురా
భూతసుకర్మపున్ గతినో, పుణ్యులు తల్లియుఁ దండ్రి నోఁచు న
య్యాతతమైన నోముల మహత్తరపుణ్యముచేతనో, కవి
వ్రాతము మెచ్చుకోఁదగినవాఁడయి వేంకటసామి వర్ధిలెన్.

తే. గీ. సప్తసంతానములు గూడ సంఘటింప
వెంతవారికిఁ గూడ స్థలాంతరమున
నిన్నియును గల్గెనఁట ఔ ! యెంత సుకృతి
యొకొ్కా ! మన వెంకటస్వామియొక్కపుట్టు.

ఉ. అన్నిటికన్న నీతనికి నాయువు విద్దియ ముఖ్యవిద్య దీ
న న్నడుమున్ బిగించుక యనాథలపాలిటి కల్పవృక్షమై
వెన్నునువంచి కష్టపడి విత్తమునందలి యాశ వీడి పే
రెన్నికగాంచె నీతఁ డని యెల్ల రెఱుంగుదు రే నెఱుంగుదున్.

ఉ ఈకొాలమంద యీతనికి నెన్నియొ రెట్లధికుల్ గలారు, నే
నాకమనీయులం దొకని నార్యజనస్తుతు బాపనయ్య సు
శ్లోకు నెఱుంగుదున్; మఱియు లోఁగఁ డితం డని కూడఁ జెప్పఁగా
వాకు లవంబు జంక దిది వాస్తవమౌట లిఖించితిన్ జుఁడీ.

క. ఈతనికిన్ భగవంతుఁ డ
నేతాదృశమైన యాయువిద్దైశ్వర్య
శ్రీతోఁ దూఁగు నపత్యో
ద్భూతియుఁ గరుణించి పేర్మిఁ బ్రోచుంగాతన్.

—• అర్ధవరము శ్రీసాగిరాజువారి యింట వివాహము •—

చ. ఇరవుగ సాఁగిరా జగము లెల్ల భరించెడి సామి లోకశం
కరుఁడు చిరాయువుం జెలిమి కల్మియు బల్మియు సంతతిన్ గరం
బరుదుగ సాగిరాట్కులమునం దుదయింపఁగఁజేసి బ్రోచు వా
విరి వరు రామరాజు సతి వెంకటసుబ్బమ యన్ వధూమణిన్.

—• ఈ వివాహమునం దిరువురు రాజులు పురాణము చెప్పుట •—

చ. కుశలవులన్ రఘూద్వహులు కూరిమి నాకుజశిష్యు లిర్వురున్
విశదముగాఁగ రామకథ విన్కియొనర్చి రటంచు విందు; మా
యశ మది త్రుప్పువట్టె నిపు డాక్రియ రాజకుమారు లిర్వు రా
ర్యశతపరీతమైన సభ హాయిగఁ జెప్పి రిటన్ బురాణమున్.

—• కీ॥ శే॥ వడ్లమన్నాటి నరసింహశర్మ కూఁతురు
చి॥ సౌ॥ ఇందిరాదేవి పెండ్లి •—

ఉ. శ్రీయలరారఁ దండ్రి నరసింహుఁడు సత్కవియై కడుంగడుం
బావనుఁ డన్వయోదయము పాదుకొనంగఁ గుమారిగాఁగఁ దా
నేవిమలాంగిఁ గాంచె నల యింతియ యీబిడ, యట్టి యిందిరా
దేవికిఁ గృష్ణదేవి కలదేవుఁ డొసంగెడుగాక భద్రముల్.

శా. నీయన్నన్ జనకుండు నాకు నొక యంతేవాసిమాత్రుండె కాఁ
డోయమ్మా! సుతనిర్విశేషుఁడయి యెంతో భక్తి వర్తించెఁ; ద
చ్ఛ్రీ యెల్లన్ భవదాకృతిన్ బ్రతిఫలించెన్ దల్లి! నీ కబ్బవే
శ్రేయస్సుల్! పితృరూపిణుల్ సుతలు సుశ్రీభాక్కు లౌ టబ్రమే!

తే. గీ. దామరాజు కృష్ణుండు రాధామనోహ
రుండు నీభర్త యిందిరా! రుక్మిణిబలె
నఖిలశుభములఁ గైకొని యలరుమమ్మ!
కవులు మీపేరులకు సార్థకత నొసంగ.

మ. కవికిన్ గూఁతురవై జనించితిగదా! కళ్యాణిరో! ముందు నీ
కవు భాగ్యోదయమున్ గణించి యిట నాయందు న్నిమిత్తత్వమున్
ఉపులంజేయఁదలంచి యీశుభమునన్ దన్వంగి! నీ తాత నన్
సవిశేషమ్ముగఁ బిల్చెఁ; దీవనల నిచ్చల్ వొంది వర్ధిల్లుమా!

ఉ. పుట్టినయిల్లు మెట్టినిలు పూర్వకముకన్న యశోవిశేషపుం
బట్టయి నీదు వర్తనము భామల కొండొక మేలుబంతిగాఁ

జుట్టము లెల్ల నిన్నుఁ గనుచున్ ముదమందఁగఁ బుత్రపౌత్రులన్
బట్టము గట్టుదాఁక నొక భంగమునుంగన కేలు మిందిరా !

—• పై పెండ్లిలో గానసభ •—

(హరి నాగభూషణము, అశ్వధాటి రామమూర్తిగార్లు.)

శా. ఎన్నో నాళ్ళయిపోయె నిందు సభలో నీనీవు మానాగభూ
షన్నం గూడి చరించు ముచ్చటలు; కన్నారంగ నీయశ్వధా
టి న్నేఁ గన్గొని నేఁటికీసభను నాడెందంపుఁ గుం దాజె నో
యన్నా ! మేల్ ! బళి ! రామమూర్తి ! యిఁకదీర్ఘాయుస్సు నీకబ్బుతన్.

ఉ. ఎంతటి యశ్వమైన నది యెక్కెడి రౌతునుబట్టి యుండు నీ
వెంతటివాఁడవైన ఫలమేమి ? సమర్థుఁడు గాయకుండు నీ
చెంతను బాడకున్నఁ; జెలిచెయ్యులు నేర్పరియైనయట్టి య
క్కాంతుని మోలఁ గాక పెఱకొంతుని మ్రోల ఫలింపనేర్చునే !

మ ఇతరపాత్రిణి కలభ్యమైన వగరా నెవ్వాఁడు వాయించు ను
ద్ధతమౌ ఫక్కి ఫిడే, లతండు హరిసద్వంశ్యుండు వర్ధిల్లుఁగా
కతులాయుష్కృత నాగభూషణుఁడు దీవ్యద్భవ్యతేజంబు సం
తతియున్ సంపదయున్ నిరంతర మనంతంబై తనుం గొల్వఁగన్.

—• సుసర్ల నాగేశ్వరశాస్త్రి. సింహాద్ర్యప్పలాచార్యులు, రాఘవయ్యచౌదరి
వీరల కచ్చేరీ, బందరు •—

తే. గీ. దక్షిణామూర్తిశాస్త్రులు ధన్యుఁడయ్యెఁ
గొడుకు నాగేశుకతన నిక్కువము నేఁడు ;
ఆయనకుఁ గల గానవిద్యాభిమాన
మింత యంతని చెప్పఁగా నెవ్వఁ డోపు !

తే. గీ. శరభశాస్త్రులు మనదు దేశమున లేఁడు,
అనెడి లోపమ్ము దీర్చె సింహాద్రిబుధుఁడు;
మనము దక్షిణమున కేగు టనవసరము,
ఉత్తరస్థులమై కూరుచుంద మింక.

ఆ. వె, కమ్మవారిలోనఁ గలరు భూపతులు హా
లికులుఁ గవులుఁ గూడ; లేరు పేరు
గన్న "బ్రమ్మరు" లను కవుచు రాఘవచౌద
రి దొలఁగంగఁజేసె నిది నిజంబు.

—• పడమటి గోదావరి జిల్లా ప్రశిడెంటు బడేటి వెంకటరామయ్యగారు •—
(తాళ్ళపూడి సభలో)

మ. ఇతరుం డొక్కఁడకారణాపకృతిగా నేద్వేషమో పూని జీ
వితహానిన్ బొనరింపఁ దా సదయుఁడై వెన్వెంటనే వారి జీ
వితముల్ నిల్పిన యుత్తమాశయుని నవ్విప్రోత్తమాస్యాస్తరు
ద్గత మాశీస్సు బడేటివంశజుని వేంకట్రామయన్ బ్రోచుతన్.

క. ఇతడు గవర్నరుకడ స
భ్యతఁ గాంచిన మేటి; నేఁటి యధికృతి యా స
భ్యత కెక్కుడగునె! కడుయో
గ్యత దైవం బితని కిచ్చుఁగాక సతమ్మున్.

మ. ఎవఁడున్ గట్టుకపోఁడు, యోగ్యుఁడను పేరే కోరఁగాఁదగ్గ; దా
నవమున్ బోలెఁ బ్రభుత్వపున్ గరిమ మాస్వాదించువారిన్ గడున్
శివమెక్కించి నటింపఁజేయు; నెటులో చేఁజిక్క కప్పట్ల మా
నవుఁ డెందెందుఁ జరింప వాఁడు మిగులన్ ధన్యుండు మాన్యుండునౌ.

జాగృతి పత్రికకు ఆశీస్సు.

మ. కలుగుంగావుత మీదు 'జాగృతి'కి నిక్కంబైన సత్కీర్తి పే
ర్వెలయుంగావుత సౌరభాష కిది పృథ్విన్ గౌరవం బిచ్చుచున్
గలిదోషంబు లడంచి దేశమునకున్ గళ్యాణ మీఁగల్గుచున్
జెలగుంగావుత దేశదేశముల వాసింగూర్పఁగాఁ జాలుచున్.

—• పిండిబొమ్మ పద్యములు •—

సీ. పిండి బొమ్మకుఁ బేరుపెట్టి పుత్రకుఁ డంచు
మనిచె ము న్నలసర్వమంగళాంబ

తనపుత్రుఁ డంచుఁద త్తద్వేషభాషలఁ
గల్పించెఁ బిదప గంగాధరుండు
తల్లికిఁ దరువాతఁదల్లియై పోషించె
నమ్మ చెల్లనఁగ దివ్యస్రవంతి
స్వగణాధిపత్యంబు సంక్రమింపఁగఁ జేసె
నోఁచినయీశ్వ రానుగ్రహంబు

గీ. బ్రహ్మ సభ నెన్నఁ దగినసభ్యత్వపదవిఁ
బొందెఁ బినతల్లి కమలానుభూతిఁ జెలఁచు
వెఱ్ఱి మొగము గాకున్నచో విఘ్నపతికి
వేల్పు లెవ రీడు మా బొజ్జ వేల్పుదొరకు !

క. ఎలుక తురంగమ్మఁట ! పా
ములు నగలఁట ! మొగము దంతిమొగమఁట ! దయ్యం
బులు పరివారంబఁట ! నీ
కలషుప్రాభవము పట్టుటరిది గణేశా ?

గీ. బ్రహ్మ సభలోన నీ వొ కబ్రహ్మచారి
వనెడి సత్కీర్తి వచ్చుగాఁ కరసిచూడ
నేఁగలంకాడ రత్నంబు నెనయు నందు్రి
సిద్ధియును బుద్ధి యెవ్వరో చెప్పుమయ్య?

క. అందము కలిగిన వేలుప
వందునొ ! సద్వంశభవుఁడ వందునొ ! ధీరుం
డందునొ ! ఏమందునొ ! నీ
చందం 'బిదమిత్థ' మనఁగఁ జాల గణేశా !

గీ. క్రౌంచ పర్వత భేది శరవ్య వేది
మఱియు షాణ్మాతురుండు గుమారుఁ డుండ
నీశ్వరుఁడు నీ కొసంగె విఘ్నేశపదవి
వ్రేలె డున్నావొ ! లేవొ ! గర్వింపవలదు.

గీ. నలుగుఁ బిండివి బొమ్మ వైనావు మొదట
భూభృతాత్మజ చేపట్ట పుత్రికుండ
వైతి వా రాజమౌళికి భూతపతికిఁ
బ్రాక్తనాదృష్టమునకు దృష్టాంత మగుచు.

గీ. నిన్ను పీఠికలో నుంచి సన్నుతింపఁ
దగిన వాఁడ వే గానియుద్ధం బొనర్చి
శత్రువుల గెల్చి భక్తరక్షణముఁ జేయఁ
జాల వెటు లబ్బెడు ననాథ శరణ బిరుదు ?

గీ. భారతము వ్రాయ జాలు భవచ్చరిత్ర
వినిన నూరాఖ్య గల వాఁడ వనుచుఁ దెలియు
వైదికాచారపరత సంభావితముగ
నొకటలంబోదరుండవై యుండుమయ్య !

గీ. భూపతిని వేడఁ బోయిన భూమి యొసఁగు
ధనపతిని వేడఁ బోయిన ధన మొసంగు
విఘ్నము లొసంగుఁగాన నీ విఘ్నపతికి
వేడు కొనరింతు "జోహార్లు" వేయిసార్లు.

గీ. అంచు నవనాగరికులైన యల్పకవులు
దుర్యశము నీకుఁ దెచ్చుచుందురు మహాను
భావుఁ డవునీవు తావకావ్యాజమహిమ
యిట్టి దని యెన్ను వారలకేమి యెఱుక ?

సీ. నీ యేన్గు తలకాయ నిఖిల లోకము లేలఁ
గల బుద్ధిగల దంచుఁ దెలుపు కొఱకు !
నీ రూప వికృతి యోంకార వాచ్యంబైన
దివ్యమూర్తి యటంచుఁ దెలుపు కొఱకు !
డాకేల నున్న యుండ్రంబు బ్రహ్మాండ మి
య్యఱచేత నాడింతు ననుట కొఱకు !

కడుపు నిండుగ మోదుకంబులఁ దినుట బ్రి
హ్మాండ పూరిత కుక్షి వనుట కొఱకు !

గీ. ఎలుకతత్తడి భక్తుల యెడలనీకుఁ
దెలియు చురుకుఁ దనంబు బోధించుకొఱకు !
నీ కు నీదృశ రూపంబు నిల్పినారు
తొంటిజడదారులో యొంటి పంటివేల్ప !

గీ. స్వచ్ఛవర్ణంబు స్వచ్ఛవస్త్రంబు శుద్ధ
విస్మయుఁ డవీ వటంచు భావించు కొఱకు
నద్వితీయుండ వంచు నీ యద్వి తీయ
భావ మెఱిఁగించు కొఱ కొంటి పంటి వనుట !

గీ. ప్రికృతి యగు మాయలో నుండి సకల జగము
సృష్టిచేయంగఁ బడుట యోజించు కొఱకు
మా మహాదేవి మేని యామలకపిష్ట
ము న జనించిన వాఁడ వీవనుట సూవె !

గీ. భద్రి మనఁగ శుభంబు తద్వారమునకు
భాద్రి మని పేరు దానికాస్పదము భాద్రి
పదము కావున నానెల భవ దఖండ
పూజకొఱ కేర్పడియె శంభుపుత్రి ! మున్న-

గీ. నాల్గు పురుషార్థములలోన నాల్గవపురు
షార్థ మెనఁగెడి చిన్మూర్తి వనుచు మఱియు
శుద్ధవిజ్ఞానరూపప్రసిద్ధుఁ డవని
చాటుచున్నది శుక్లపక్షంపుఁ జవితి.

గీ. సిద్ధియుం బుద్ధి నీ పాదసేవఁ జేయు
ధీనిధుల కెల్ల కార్యసిద్ధియును బుద్ధి
గలఁగు నంచును బోధించుఁ గానియెట్లు
బ్రహ్మచారిత్వమునకు లోపంబు దెచ్చు ?

గీ. పర్వతం బొందు భేదించు ప్రజ్ఞ చూపు
నట్టి కొడుకుండ నంతరాయాధిపత్య
మీశ్వరుఁడు నీకొసంగుట యేమితప్పు ?
విఘ్నపర్వతదంభోళి వీవు కావె - ?

—• భగవత్సత్తామీమాంస •—

శా. ఉన్నావో ? మఱి నీవు లేవొ ? యెటులే నూహింతునీయున్కి, యా
పన్నంబయ్యె జగమ్ము. ధర్మమునకున్ ప్రాప్తించెఁగష్టమ్ము, ము
న్నెన్నండే నిటులయ్యెనో ? యిటులుకానేలేదొ ? సౌజన్య సం
పన్నుల్ వేలకొలందినేఁడురక చావం బోవుచున్నారహో ?

మ. అపుడెప్డో దనుజేంద్రపుత్రకుఁడు ప్రహ్లాదుండొకండుండె నేఁ
డపురూపంబిది - యెల్లవారలును బ్రహ్లాదుల్, మఱిన్ వింత, దా
రపరీతుల్, సుతయుక్తు, లీశ్వరకళారంగమ్ము, లివ్వారలన్
విపరీతమ్ముగఁ జావమోదెదరు పృథ్వీ భృద్భటుల్, దేవరా !

మ. కలవో ? లేవొ ? యటన్న సందియముతోఁగంపించె మున్నేనుఁ గ
వ్వల నీసత్త ధ్రువమ్ము సేసితివి నీవాత్సల్యమున్ జూపి, యే
న్గులు నేఁడక్కట ! వేనవేలు మది నిన్నున్ నమ్మి సంద్రమ్ములో
పల దూఁకెన్, గ్రసియించె నక్రములు దేవా ? ప్రోవరావే ? వెసన్.

శా. పూవుల్ సోఁకినఁగందుదేహము గడుఁ బూతమ్ము శీలమ్ము స
త్సేవాతత్పరమైనస్వాంతము, మహాశ్రీకమ్ములౌ గేహముల్
దేవా ? నిస్తులభోగభాగ్యములతో దీపించు నీ దృష్టునుల్
నీ వాత్సల్యములేకనేఁ డకట ? బందిన్గాంచి రిబ్బందులన్.

మ. మగవారిన్ దలపెట్టనేల ? మహిళా మాలాశిరోభూషలై
తగు సాధ్వీమణులెందఱో వివశలై దావాగ్నిలో దూఁకి రే
వగనీలోకము నుద్ధరించెదవొ ? దేవా ? నీవులేవన్న దు
ర్భగ వాదంబు ధ్రువంబుకాఁగలదు ప్రోవన్రావయే నీపయిన్.

మ. మదిన న్యాయమటం చెఱింగియును సామ్రాజ్యాధి కారంపు "రై"
లది పట్టానొగిపీడి కీడ్వదెడి యయ్యంశఁబు గుర్తించియుం

దుది నేమౌదుమొ యన్నభీతి విడి దండ్యుల్ గానివారిన్ మహా
పద పాల్సేసెడి యయ్య కేయిడుమయున్ బాటిల్లదే ? కేశవా !

శా. ఆలున్ బిడ్డలు గల్గియున్ మనుజుఁడై యన్యాయమున్ న్యాయమున్
జాలంగాఁబము దేశికోత్తములతోఁజర్చించి యార్జించి యి
ష్టీలీలన్ జెడు పొట్టకోసము "కసాయీ" వృత్తిఁగైకొన్న స
చ్ఛీలాగేసరు నేమిసేయవలెనో ? చెప్పంగదే కేశవా ?

మ. ధర నత్యుత్కట పుణ్యపాపములకున్ దత్తత్ఫలావాప్తి చే
కుఱు నీలోకమునంద, యన్ననుడికిన్ గొంతేని సార్థక్యపుం
గరిమమ్మున్ గనఁజేయకున్న నెటు లీ కష్టాబ్ధిలో మున్గు ధీ
వరవంద్యుల్ గడతేరఁగాఁగలరు ? దేవా ? చేవఁ జూపింపవే ?

మ. ఇటు లన్యాయపుఁదీర్పుసెప్పి ఘనులన్ హింసించు నాయయ్య కె
వ్వటికిన్ దీరని యంతనొప్పి మదిలో నాటింపవే ? యట్టి సం
కటమున్ గాంచినమీఁద బుద్ధి గలుగున్ గష్టంబు నానెట్టిదో ?
స్ఫుటమైతోఁచుఁ గళత్రిమేని సుమతిన్ బోధించు నామీఁదటన్.

శా. నోళుల్ కొండొకలేని మేకలను గొంతుల్ గోయుచున్ వృద్ధిమై
నాలుంబిడ్డ లెసంగఁగాఁ గటికవాఁ డత్యంతమొప్పారు న
ట్లో లిన్నేఁటికథావిధానమున నుద్యోగస్థులున్నారు స
చ్ఛీలావాలములైన మానవుల హింసింపంగ నుద్యుక్తులై.

మ. నెల లంతంతకు నిండుసట్టి వనితల్ నీళ్ళాఁడఁగాఁ బుట్టి నిం
డులకుం బోవుటచూతు - మావనిత లిప్డో ? బందిఖానాల క
ర్మిలిమైఁ బోయెదరయ్య ? దేశమునకున్ మేల్గూర్పఁగానెంచి - యి
క్కలి సైరించుట నీకుఁబాడియగునే ? కాపాడు లక్ష్మీధవా ?

శా. దేశక్షేమముకోసమై సుజను లుద్రేకమ్ముతోఁ గష్టవా
రాశిన్ దూఁకఁగఁ గొందఱాఘనుల నాఱన్ జేసి యాత్మీయ కు
క్ష్యాశాపూర్తికినై కడంగెదరు దేవా ? చూడుమీ యెంత దు
ర్దేశం బియ్యది - యిట్టి పెద్దలకు బుద్ధిన్ జెప్పరాదో కదే ?

శా. అమ్మా? గర్భిణివయ్యు నీ వకట? కారాగారమున్ జేరి దే
శమ్మున్ గావఁదలంచి తెంతటి మహాసాధ్వీ వతంసంబవో?
కొమ్మా? కైకొనుమమ్మ? దీవన భవత్కుక్షిన్ గుమారుండు గా
నిమ్మై కృష్ణుఁడె పుట్టుఁగాక! కుజనోద్వృత్తిన్ నివారింపగఁన్

—• కుందమాలా సమర్పణము •—

(బందరు ఖొజ్జిల్లిపేట శ్రీ నాగేశ్వరస్వామివారి ఆలయములో 2-12-3 తేదీని "కుందమాలా" నాటకకృతి సమర్పణము జరిగినప్పుడు తద్రచయితయగు బ్ర. శ్రీ. సర్వా శేషయ్యగారిని ఆశీర్వదించుచు బ్ర. శ్రీ. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారీ క్రింది పద్యములను జదివిరి.)

మ. ఇట మున్నొక్క కృతిన్ రచించియిడె నాకీ శిష్య డిప్లోమతా
క్కటి యాంధ్రీకరణం బొనర్చి భగవత్కైంకర్యముంజేసె, నె
ప్పటికిన్ మంచిగఁ గాలముం గడుపు 'సర్వా' వంశసంజాతు వేం
కటశేషయ్యను సర్వదా మనుచుతన్ గంజాక్షుఁడుల్లాసియై.

మ. ఇతఁ డింగ్లీషునఁగూడ మేటియయి యా యీయాంధ్రభాషన్ బ్రవి
ష్టత యార్జించియు, నంతఁబోక తఱితో సాధించె గీర్వాణమున్
మతిమంతుండితనిన్ విశేషముగ నేమన్నించి మాటాడరా
దతియోగ్యుండు "కవీ"ట్పదంబు గొనఁగా నర్హుండగుంగావుతన్.

క. స్వకులాచారరతుఁడు ని
ష్ఠకుఁడగు వైదికపువిద్య సంపాదించెన్
సుకృతియు సద్వ్రతములయెడ
నకలంకంబైన శ్రద్ధయలరు నితనికిన్.

తే. గీ. కలుగుఁగావుత వీనికఖండయశము
వెలయుఁ గావుత సంతతి వీనికిప్పు
డున్నకంటెను హెచ్చుగా, మిన్నయైన
భాగ్య మారోగ్య మాయువుఁ బ్రబలుగాక!

—• కీర్తికాయులు నాదెళ్ళ పురుషోత్తమకవిగారి సుగుణములు •—

క. ఋషివలె జీవించెను. పూ
రుషోత్తముడితండనన్ గరువమున్ మఱియే
శషభిషలు నెఱుంగఁడు పూ
రుషోత్తముఁడు సర్వదా పురుషసత్తముఁడై.

క. అతిశాంతుం డతిదాంతుఁడు
కృతకృత్యుఁడు సుకవి యెన్నియేని విషయముల్
మతినెఱిఁగిన విద్వాంసుఁడు
స్తుతియింపఁదగిన పూరుషుఁడు సుకవులకున్.

తే. గీ. పట్టణనివాసియేయయ్యు, పల్లెటూరి
యాతిథేయులపయిచేయి యగుచు, కాల
మొక్కరీతినిగడపె నత్యుత్తమముగ
పూరుషోత్తమకవి యెంతధీరవరుఁడొ.

తే. గీ. బులుసు శ్రీ అచ్చయబ్రహ్మ మున్నశాస్త్రి
లోనయిన బిరుదమ్ములు పూనకయె చ
రించెననివిందు మిపుడు చరించెను పురు
షోత్తముఁడు పురుషోత్తముండో; యనంగ.

క. ఒకనికిలోఁగని శాంతియు
సకలమ్ము నతిక్రమించు చండత కడువై
దిక కర్మనిష్ఠయుఁబరో
పకృతియు పురుషోత్తముని స్వభావగుణమ్ముల్.

తే. గీ. ఆత్మగౌరవమునకు రవంతయేని
లోటుగల్గెడిచో స్వర్గలోకమేని
యాతఁడొల్లండితని కెట్టులేగునొక్కొ!
ఇటుపయిని జీవితంబనియేఁ దపింతు.

ఆ. వె. బ్రాహ్మణత్వమునకు పరమదారిద్ర్యంబు
దాపరించినట్టి తరుణమందు
మార్గదర్శియగుచు మనిన శ్రీ పూరుషో
త్తముని చరిత మిగుల ధన్యతమము.

తే. గీ. ఎన్నియో గ్రంధములొనర్చె నెంతమంది
కో గురుత్వమ్ము సల్పె నోహో యనంగఁ
గడపె జీవిత మెపుడెఱుఁగఁడు రవంత
యేని దైన్యమెక్కడఁ గలరిట్టి కవులు ?

క. కవినని యాచింపఁడు "కా
దవునని" వాదింపఁడతిధు లరిగిన నిచ్చెన్
సవిశేషమ్ముగ నిప్పిం
చె వివేకముగల్గువారి చేనెక్కుడుగన్.

తే. గీ. వేదశాస్త్రమ్ములందలి విధులు భగవ
దాజ్ఞలే యైనచో దప్ప కబ్బితీరు
పూరుషోత్తమకవికెదో పుణ్యలోక
మిందులకు లేదు సందియ మింతయేని.

క. బందరుపురమున కిఁక నీ
యందముఁ జందమ్ముగలుగు నట్టి యశము కూ
ర్పందగు సత్కవి దొరకుట
సందేహాస్పదమటంచు జాలివొడమెడున్.

తే. గీ. ఏలసంశయింపఁ గవలె నితనికున్న
సుగుణములు గల్గియున్నాఁడు సుతుఁడుకూడ
వానికాయురారోగ్యముల్ వఱలఁజేసి
ఈశ్వరుం డెల్లలోపమ్ము నేఁగుఁగాక !

— కీ॥ శే॥ శ్రీ గిడుగు పంతులుగారు —

ఆ. వె. గిడుగురామమూర్తికి న్నాకు స్నేహంబు
కలదు కొంత రిపుత కలదు కొంత,

భవతు దానికేమి? పండితు నీదృశు
నితరుఁ జూచియెఱుఁగ నెపుడునేను.

ఉ. ఏగుటకేమి స్వర్గతికి; నెల్లర కెప్పుడొ తప్పనట్టిదే,
బాగుగఁ గాలముంగడపి పండితమండలి మెప్పుగాంచి యు
ద్యోగముచేసి సర్వవిధ యోగములంగని వృద్ధుఁడైన ఆ
యీ "గిడు"గన్వవాయజుని యేగుటయున్ గవి వర్ణనీయమే.

శా. అంతో యింతో పరిశ్రమంబు గలవారందందు నున్నారు ధీ
మంతుల్ తెల్గున సంస్కృతంబునఁ గడున్ మాన్యాత్ముఁడీతండు, స
ర్వాంతర్వాణులలోన మేటి కడునిర్వ్యాజాంతరంగుండు వా
ణ్యంతేవాసులలోన నిట్టిఁడెచటన్ బ్రాపింపఁ డం చెంచెదన్.

ఉ. తిట్టిరి పల్వురీ యనఘుఁ దిట్టినవారల దిట్టఁబోక యే
పట్టును దానుబట్టెనొ స్వపాండితి దానికెదారవోసె నె
ప్పట్టున దానికోసమె యభంగురమౌ కృషి సల్పెధన్యుఁ, డీ
దట్టునిఁ బోలఁగాఁదగిన తజ్ఞుని నేను మఱొక్కనిన్ గనన్.

ఉ. ఇంతటి లక్ష్యవేత్తృతకు నింతవివేచన కింత సత్యవా
క్చింతనకున్ మరొక్కరుఁడు చిత్తము నొప్పఁగఁ జెప్పినట్టు నా
స్వాంత మెఱుంగ. దియ్యనఘుఁ డాత్మవిపక్షులఁగూడఁ బేర్మిమై
నెంతయుఁగారవించు నిజమిట్టిరు పండితులందు నుందురే?

శా. ప్రాణంబిచ్చెడువాఁడునేననిన, నేనత్యంత శత్రుండ. వి
జ్ఞానం బీయన దొప్పికొంచు నెదియో ఘర్షించువాఁడన్ ననున్
దా నేలేశముఁ దూలనాఁడఁడు స్వసిద్ధాంతమ్ము బోధింప నెం
తేనిన్ యత్నమొనర్చువాఁ డితనిపాం డిత్యంబు వర్ణ్యమ్మగున్.

ఉ. ఈయన కున్నపాండితిని నేశతభాగముకూడ నాకు లే
దే యని యేను జింతిలుదు నెందుకొ అక్కట ! కొంద ఱూరకే
యీయనఁ దూలనాడెద, రహీనుఁ డితండు తెలుంగుబాస లోఁ
తీయన అబ్ధిలోఁ తల మహీధరమే యెఱుఁగున్ ధ్రువంబుగన్.

తే. గీ. ఇతని సిద్ధాంతములవల్ల నేదొ ముప్పు
తెలుఁగునకు మూడు ననుకొని తెగడువారు
పలువు రున్నారు నాకట్టిభయము లేదు
ఇతనివాదాన గలదు సూనృతముకొంత.

తే. గీ. ఏప్రయోగమ్ము లేదని యెవ్వరన్న
నాప్రయోగంబు చూపించినట్టి దట్టు
డీతఁ, డీయన బోలుమనీషి నేను
జూచియెఱుఁగను జూడను జూడఁబోను.

వ. ఓరామమూర్తి సచివాగ్రణీ!

ఉ. క్రొత్తపథంబు ద్రొక్కితివి కొందఱు నీకనుయాయులైరి వి
ద్వత్తమ! నేఁటి "హోమొపతి" వైద్యమునుంబలె నీమతంబు జా
గ్రత్తకు నెక్కుచున్నయది కాలమహత్త్వమెవండెఱుంగు? నీ
వేత్తృతకు న్నమస్కృతులు వేలకు వేలొనరింపఁగావలెన్.

తే. గీ. పత్రికలలోన నెక్కడఁ బట్టి చూతు
మేని నీక్రొత్తమార్గమే గానఁబడెడి
దీని కాచార్యుఁడవు నీవు తెలుఁగువార
లెందఱో నీకు శిష్యులై రిద్ధచరిత.

మ. అనఘా! మీ "గిడు" గన్నవాయ మది ధన్యంబయ్యె నీభూమి నీ
జనిచే ధన్యతగాంచె మిత్రులు నినున్ శ్లాఘింప నేమయ్యె నీ
గొనముల్ శత్రులుగూడ మెచ్చెదరు నీ కూలంకషప్రజ్ఞ య
బ్బునె మాబోట్లకు లక్ష్యజాలమునకుం బుట్టిల్ల వీవెమ్మెయిన్.

తే. గీ. "శోభన" పదమ్ము గర్భంపు శుభమహోత్స
వమును జెప్ప దటన్న యవ్వారివాద
మరసి సుకవిలక్ష్యము చూపినట్టి నీదు
ప్రజ్ఞ యేనిఘంటునకును రాదు ధ్రువము.

స. గడపితి వెల్లకాలమును గావ్యములం బఠియించు చిప్పుడి
ప్పుడు గడు వృద్ధభావమును బొందియు మానవు తత్పరీక్ష నీ
పడుచుఁదనంబు నే నెఱుఁగ వార్ధక మొక్కఁటియే యెఱుంగుదున్
గిడుగుకులీన! కైకొనుము కీర్తిశరీరము నక్షతమ్ముగన్.

—• శ్రీ॥ ఆదిభట్ల నారాయణదాస నిర్యాణము •—

గీ. బ్రదుక దగినంతకాలమ్ము బ్రదికి కులము
వన్నెకెక్కించి – జగతికిఁదన్నుఁ దెలిపి
అరిగె మత్సోదరుండు నారాయణుండు
తనదుపేరిదేవునిఁ జూచుతలఁపు వొడమి.

ఉ. గాయకమాత్రుఁడన్న నటు గాఁడితఁ డందమెలర్ప సత్కృతుల్
సేయఁగలాఁడు వాక్పటిమచే నుతికెక్కినవాఁడు భాషలే
వో యయిదాఱునేర్చిన మహోదయుఁ డక్కట! పోయెనేమి? నా
రాయణదాసు ముక్తుఁ డతఁ డట్టిఁడు భూస్థలి పుట్టఁబోఁడిఁకన్.

క. శ్రుతిసతి "నసపునరావ
ర్తతే"యనుచుఁ బలుకు పలుకు తథ్యమయేనిన్
హితుఁ డల నారాయణదా
సు తరించెన్ మరల నతనిఁ జూచుట యెట్టుల్?

—• మి త్ర లే ఖ •—

క. శ్రీమంతుఁడు నయవిద్వ
త్సామంతుఁడు సత్యవాదతత్పరమతి శ్రీ
సోమేనకామేశునకు ని
రామయదీర్ఘాయు వబ్బు నైశ్వర్యముతోన్,

క. కుశలోపరి వ్రాయందగు
విశేషములు వ్రాయుచుంటి వృద్ధత్వము నన్
వశపఱచుకొన్నయది పర
వశమగు సేవనికిఁగూడ భయమగు ననఘా.

గీ. దొసఁగు నాపొత్తమందు నెందులవమేని
లే దెఱుంగుదు జయ మవలీల నాకుఁ
గలుగుఁగోర్టున నిట్లయ్యుఁ గంపమొదవుఁ
గారణం బామయము వార్ధకమును ననఘ ?

శా. తప్పుల్ వట్టె దురూహతోఁ గురుఁడు తత్తల్లక్ష్యముల్ చూపి నేఁ
దప్పుల్ గావవి యంచుఁ దెల్పితిని సత్యం బద్ది ఖండింపరా
కిప్పంత స్సనువంచితున్ సలుపఁగా నేమేమొ యత్నించు నే
నిప్పల్లన్ వెనుకాడినంత దొసఁగానే? మద్యశస్స్ఫీతికిన్.

చ. అకపటవృత్తి కీర్తినిడు నంతియకాని తదన్యమార్గముల్
కృపణతదక్కఁ గీరితినొకించుకయున్ గలిగింప వేరు స
త్యపథముదప్పి కుత్సితపథమ్మునఁ గీరితి నొంద నెంతు రా
నిపుణులు సర్వథా జననినిందకుఁ బాత్రులు నేనెఱుంగుదున్.

ఉ. కీరితిఁ గోరు మానవుఁడు కేవలమున్ ముకుసూటినొప్పు మేల్
దారినె సంచరింపవలెఁ దక్కిన వంకరతోవ్రివలో ? దురా
చారులకోస మేర్పడియె సర్వము నీవునెఱుంగు దీసమా
చారము నాయకారణపు జంకునకొప్పవు నే నెఱుంగుదున్

తే. గీ. ఏను గెల్చితినని లోకమెల్లఁ నెఱుఁగు
నెఱుఁగకుండినవా రెవరేనియున్న
నిప్పుడీ యభియోగమే యెఱుఁగఁజేయుఁ
బండితాచారమగునె ? యీ గండతనము.

ఉ ఎప్పుడుపుట్టెనో ? పృథివి యెవ్వఁడెఱుంగుఁ గళావివాద మ
ప్డప్పుడు పండితుల్ సలుపు టన్నదియున్నది గెల్పునోడునున్
దప్పనివేగదా ? యపుడు తద్విషయంబున నోడి కోర్టులో
మెప్పునకై యతించు నలమేటికవిన్ వచియింప్ప మొక్కనిన్

తే. గీ. భట్టుమూర్తిశీర్షమ్మును భదిర్రియకవి
తన్నెనని చెప్పికొందుర్రి సదస్థలమున

నట్టిపని నేగమేయయ్యె నతఁడు కోర్టు
కేగఁ దోడంది కోర్టునకేగు నెవఁడు.

ఇంతకుమించి దైన్యమిఁక నెందుజగమ్మున నుండఁబోదు నా
స్వాంతమెఱుంగు సత్కవి యశస్వియె యయ్యెనయేని నిక్కమీ
పుంతను గాలుపెట్టఁ డిదిపూర్వయశ మ్మడఁగించు నెట్లొసా
ధింతముగాక యంచుఁ జెడుతెన్నునఁ బోదురు కొంద ఱుగ్రులై.

ఉ. కరణము చచ్చుచున్ దనపగ న్నెఱవేర్చుకొనంగ మున్నుబున్
దురకల కోపవహ్నిఁ బడఁద్రోసియు నుపాయ మొనర్చెనంచు ఫీ
వరులు వచింతు రాతనికి వచ్చెనె ? సద్యశ మెప్డుగూడ వం
కరనడకల్ యశంబిడవు కాలిడ రట్టిపథాల ధీవరుల్.

చ. మును తణికెళ్ళసుబ్బన యమోఘపుఁబాండితి కోడి యేమియున్
దనకిఁకఁ ద్రోవతోఁప కపథానఁ బ్రయోగమొనర్చె నంచుఁ దా
వినఁబడు సుబ్బపండితుని విజ్ఞతకే అదిసాక్ష్యమిచ్చు న
ప్పునినొనరించు పండితునపప్రథకున్ గుదురై వెలుంగుచున్.

చ. "క్రిమినలు" గాదుబో ? "సివిలుకే" యనుకొందము "కోర్టు" వెంట బం
తముగొని పండితుల్ దిరుగు దైన్యముచూచి భవాదృశుల్ "నమో
నమ" యని లోన లజ్జపడి నల్వురలో ననకొన్నను న్ రహ
స్యముతటి మందలింపరె? యశస్వికిఁ గోర్టు ప్రశస్తిగూర్చునే.

చ. అసువుల రక్షనేఁతకయి "హాస్పట" లేగె నటన్నచో సమం
జస మగుఁగాని సత్కవి యశమ్మునకేగెను గోర్టటన్నచో
రసికులు నొచ్చుకొంద్రు కవిరాజచరిత్రల నిట్టివార్తలీ
రస వినరావు యూరపుధరన్ విననౌనొ ? మఱేమొ ధీవరా.

ఉ. పుట్టెఁడునాముదం బొడలఁ బూసుకపొర్లిన నెవ్వఁ డెంతఁ దాఁ
బెట్టుకపుట్టెనంతెకొ నుఁ బేరధికానకు భోక్తగాఁడు తా
కట్టువిభూషణం బిడెడికాంతికి వ్యాజపుఁగీర్తికిన్ భువిన్
బుట్టదు శాశ్వతత్త్వ మిది పూర్వులెఱింగి చరించి రొప్పగన్.

## —• ఆశీస్సు •—

(చిరంజీవి విశ్వనాథ సత్యనారాయణ కవిసామ్రాట్టునకు నా యొసఁగిన
గుడివాడ సన్మాన సభనాటి ఆశీర్వచన పద్యములు)

ఉ. ఒజ్జయు నొజ్జగారి గురు లుండిన కాలమునంద శిష్యుఁ డు
ద్యజ్జయశాలియై, జగము "ధన్యుఁడితం" డని మెచ్చుగాంచు నే
యొజ్జకు సంతసంబొనగఁ దూర్జితుఁడే యగునేని యొజ్జ; సం
పజ్జయ దీర్ఘజీవిత సమన్వితుఁడౌత మితండు నానుడిన్.

ఉ. ఏనుఁగునెక్కి- బోర్లఁబడి యే నెపుడో జగ మేలినాఁడ, నేఁ
డానుడి బూజువట్టినది అయ్యది "యిట్టి" దటంచు శిష్య స
న్మానము కల్మి సత్కవి సమాజము లీ గుడివాడ సత్సభా
స్థానమునం దెఱుంగుటకు సంతసమందెద నో సభాసదుల్.

చ. మునుపల రామకృష్ణు యశమున్ ద్విగుణీకృతమై రహింపఁజే
సె నల వివేకమౌనియని చెప్పుదురేకద ? ఖండఖండముల్
వననిధులుం దరించుట కుపాయము శిష్యులె దేశకాలికిన్
జనని యొసంగెఁ కాళికయె ఛాత్రుల నాకుఁ గుశాగ్రబుద్ధులన్.

చ. ముసలితనంబునన్ జన సమూహము తన్ గని వెక్కిరింప నీ
రసమగు వాక్కుతో సభకు రాఁ బనిలేదు గురుండు, ధీమద
గ్రసరులు శిష్యులున్నయెడఁ గాఁదగు కార్యము వాండ్రె తీర్చి తా
రొసఁగుదు; రొజ్జమోయునెడ నున్నతమౌ యశమెంతయేనియున్.

మ. "తనకున్ దగ్గనివాండ్రు గాపలయుఁ బుత్రచ్ఛాత్రు" లంచున్గదా :
ఘనచిత్తుల్ మదిఁగోరుచుండుదురు భాగ్యంబబ్బె నీ వార్ధకం
బున నాకంకినదీ యశోభరము, నేమోయన్ సమర్థత్వ మి
చ్చునుగా కా జగదంబ నా సలుపు తత్ప్రోత్రింబు సార్థంబుగన్.

ఉ. ఛాత్రులు పాత్రులై యశము సంకలితంబొనరించుచున్ గళా
సత్రము సాఁగఁజేయుటకు సంతసమందని దేశికుల్ మహీ
ధాత్రిని గానరారు; గురు ధామము దెల్పఁగ సాక్షి సర్వథా
ఛాత్రుఁడె వానిశ్రేయమది సర్వవిధంబుల నొజ్జశ్రేయమే.

ఉ. విద్దియ నేర్చి రెండతొ వివేకులు బాలురు నన్నుఁగొల్చి; నా
విద్దియకున్న విల్వకుఁ బవిత్రతఁ గూర్చిరి, విశ్వనాధుఁ డే
ప్రొద్దును దానియందు మనమున్ లగియించి విశిష్ట భావముల్
దిద్దయు సేకరించెఁ గవితారచనన్ స్ఫురియించు సీరుచుల్.

శా. నా మార్గమ్మనుగాదు శిష్యుఁడయినన్ నా తాతముత్తాతలం
దేమార్గమ్మను గాదు వీనిదెదియో? యీ మార్గ మట్లౌటచే
సామాన్యుండనరాదు వీనిఁ గవితా సమార్తిత్వ మాహేతువై
యీ మచ్ఛిష్యుని దావరించినది నే నెంతే ముదంబందెదన్.

ఆ. వె. ఇతనిఁ కబ్బుఁగాక యింతకంటెను యశం
బింతకన్న విజయ మింతకన్న
సిరియు సంపదయును శ్రేయంబు నాయుష్య
మక్కటాన నాకు నగుత ముదము.

—• గురువిజ్ఞప్తి •—

| | |
|---|---|
| బ్ర॥ శ్రీ॥ మ॥ మ॥ ధ్యా॥ ద్యనేక బిరుదాంకితులు—కవిసార్వభౌములు బాల్యగురువుల చరణ సన్నిధికి | క్షీరసాగరం బెజవాడ కృష్ణాడిస్ట్రిక్టు |

శిష్యపరమాణువు నమశ్శత పురస్సరముగా నొనర్చుకొను విజ్ఞప్తి

గురువరేణ్యా?

ఉ. ఎందుకు మీకు నాయెడల నింతటి యాగ్రహ? మీరు విశ్వనా
ధుండెగి మర్శనంపు మిషదూరితి రద్ది యయుక్తమౌట నే
నందుల కొప్పఁజాలక యధార్థము మీ కెఱిఁగించినాఁడఁ గో
ట్టెందుకు? బండితుల్ దెలుపరే? కల సత్యము నిర్వచింపరే?

మ. అనుమానింపక "పాముకాటు" మొదలౌ నశ్లీలముల్ విశ్వనా
ధునికావ్యమ్ము విమర్శచేసెడి మిషన్ దోషజ్ఞ బృదం "బిసీ"
యనిరోయన్ లిఖియించి "కోర్టు"కడ కేయాస్యమ్ముతో మీరలే
గను నంకింతురొ? శిష్యుఁడేగునెడఁ జక్కన్నెగ్గ నార్యోత్తమా!

చ. వయసునఁ జాలపెద్దలయి వాక్కులు చిన్నలు గూడ నొచ్చుకో
నయినవి వ్రాసినారలుగదా ? అతఁడందుకుఁ గోర్టు కేగుచో
బయలగు నెల్ల తత్త్వము ; స్వభావవినమ్రుఁడటుల్ పౌనర్పుఁ డ
య్యాయొ ? విజమాడినందులకు నార్య ! గురూ ! ననుఁ గోర్టుకీడ్తురే ?

చ. సుకవి కువాదమున్ సలుపు సూక్తుల "కజ్ఞుఁడటన్నమాత్రిఁ గో
ర్టుకుఁ జనుటొప్పునే ? యిది యొరుల్ గని మెత్తురె ? నైజపాండితిన్
బ్రికటనఁజేసి స్వీయమగువాదము నిల్పుకొనంగఁ జూచుటే
పరికృతమగాని, యన్యగతి భావ్యముగాదని మీరెఱుంగరే ?

ఉ. కోపము వచ్చునేయనుఁడు ! కోపమువచ్చినమాత్రి వానికే
యాపదయో ఘటించు నుడులాడి శపించుటె కర్జమొక్కొ ? వి
ద్యాపటిమంబు చాలకవృధా దొసఁగుల్ వెలిపుచ్చి నిల్పుకో
నోపక కోర్టుకేగుటకయో ! కవులే రురరీకరింతురో ?

ఉ. ప్రత్యయమైన "చుంచు" వును బండితులెల్ల "రిసీ ! యిసీ" యనన్
వ్యత్యయమైన పక్కికను వ్యాఖ్యకుఁ దార్చితి, రద్ది యజ్ఞతా
గత్యనుకూలమంటి నదికాదనరామిని సర్వధా ! అసం
స్తుత్యపుఁదోవఁ గోర్టరుగుచోఁ గవులేమను కొందురోగురూ !

క. "సివిలో క్రిమినలొ ?" మీకున్
గవితా సామ్రాజ్యమిచ్చుఁగాకది జయమే ?
కవు లీవలెఁ గైకోవలె
శివ ! శివ ! కోర్టేల ? కవులిసీ ! యనరొక్కో ?

క. మీయంతటమీరై యని
సేయమొదలువెట్టి జయము చేకుఅనియెడన్
బాయనియాసునఁ "గోర్టు" ప
లాయింతురె ? యిద్దిమెచ్చు "లాయరు" లుండ్రే ?

తే. గీ. "లాయరులు" దీనియెడల నెల్లరును విముఖు
లన్నమర్మంబు పత్రికయందు "బారు

బాపు' సర్వమ్ము వ్రాళ్ళతోఁ బంపినట్టి
"శాంతిసందేశమె" వచించెఁ జాలదొక్కొ?

తే. గీ; కలరు విద్వాంసు లెల్లడఁ గలరు కవులు
వారు మీవాదమును మెచ్చవలయుఁగాని
"కోర్టు" కవివాదములు తీర్చుకొనుటకుఁ బుట్టి
లేదు మీకేను జెప్పవలెనె? మహాత్మ!

తే. గీ. స్వయముగా నేను దండెత్తి వచ్చినట్లు
వ్రాసితిరి "స్పర్ధచే విద్య వర్థిలు" నని
యుంటచే నేను కల్గించుకొంటి ననఘ?
లేదు దీన దోసము లవలేశమేని.

క. వృధగా మచ్ఛిష్యుని మీ
రథమునిగా నపవదించు నట్టినుడుల్ బల్
వ్యధ కల్గించుటచే మీ
పథమునకే నడ్డుపడితిఁ బాతకమె? గురూ!

తే. గీ. ఎవ్వరు జటాయువును "చనుమీవటంచుఁ"
బ్రేరణము చేసిరానాఁడు పిల్చియార్య?
మీరు పెట్టెడి యిడుమలు కోరుటునకుఁ
ద్రిప్పుచేకద? లేఁ దొకో? దేవుఁడవల.

క. పడకగది వీడలేఁ డని
యెడఁదన్ బూ_ర్తిగ నెఱింగి యె_త్తితి రీయె
"త్తడియేన్దాసుఁడ" నన్నన్
విడువరనియె తోఁచు మీదు వేరపు దీరుల్.

క. ఏకవి యీకలియుగమం
దే కాదేయుగము నందు నేవియుఁ "గోర్టు"
ప్రాకారములోఁ గవితా
శ్రీకిన్ గల్యాణమహముఁ జేసె యశముతో.

తే. గీ. నన్ను విద్యలో నోడించు తెన్నుగానఁ
బడక మంచియుపాయమ్ముఁ గడన సల్పి
నట్టిమీ నైపుణికి సదా నతులొనర్తు
సన్నుతింతు - స్తుతింతు నో సార్వభౌమ!

తే. గీ. కోర్టువారిచ్చు యశమది కొంతయుండు
గాక పండితమండలి వీఁక నొసఁగు
యశముగూడ నార్జింపఁగా నభిలషింపు
దేను మిమ్ముఁ బ్రార్థించెడి దింతెదేవ?

## శ్రీ మృత్యుంజయస్తవము

శంభో! మహాదేవ! శంభో! మహాదేవ!
శంభోమహాదేవ! గంగాధరా!
మృత్యుంజయా! పాహి మృత్యుంజయా! పాహి
మృత్యుంజయా! పాహి మృత్యుంజయా!
నీవంటి దేవుండు, నావంటి దీనుండు,
నైవాస్తి దేవేశ మృత్యుంజయా!
ఏపుణ్యమోకాని, యీపుట్టువందబ్బె
నీపాదసద్భక్తి మృత్యుంజయా!
పాపాటవుల్ గాల్చుఁ, దాపత్రియంబేర్చు,
నీపాదసద్భక్తి మృత్యుంజయా!
నీ పేరు విన్నంత, నేపాఱు నాపత్తు
వేపాటి రూపాఱు మృత్యుంజయా!
హాలాహలముఁ బ్రమింగి, యాలేఖులను బ్రోచు
నీ లీల నేనెంతు మృత్యుంజయా!
కాలుం బడందన్ని, బాలున్ జరాయుష్య
ఫాలున్ గృపం జేయు మృత్యుంజయా!
భీమాహ్వయంబేడ, నీహార్దవంబేడ,

ఏమాట కేమాట మృత్యుంజయా !
కామున్ మసింజేసి, కామాక్షి మోహించు,
నీ మాయ చిత్రింబు మృత్యుంజయా !
గిరియందు వసియింతు, గిరికేలధరియింతుఁ
గరళంబు భరియింతు, మృత్యుంజయా
శిరమునన్ భూషయై, మఱికన్ను నీకయ్యె,
నరవింద రిపుఁడెట్లు మృత్యుంజయా !
ధరియింతు వెలిబూదె, గురుభూతి భక్తులకుఁ
బొరినిత్తు విదియెట్లు, మృత్యుంజయా !
దురితాత్ములకుఁ గూడ వరమిత్తు తపియింపఁ,
గర మక్కజముగాదె ! మృత్యుంజయా !
భస్మాసురుండెట్లు, పాత్రుండు నీకయ్యె,
వరమిచ్చితివిదేవ ! మృత్యుంజయా !
తపియించుచేతప్పఁ, గృపజూపుటకు వేఱు,
నెపమక్కరయలేదె ! మృత్యుంజయా !
నీలీలలకునర్ధ, మేలాగు గ్రిహియింతు
బాలేందుధరదేవ మృత్యుంజయా !
దారుకావనలీల; తఱచి చూచినవేళ,
మర్థమే కాదుగద ! మృత్యుంజయా !
సంసార హింసారి, రంసాపరుల్ త్వత్ప్ర
శంసం గనఁబోరు మృత్యుంజయా !
ఇష్టంబిడుంగాన, రిష్టంబడంగింప,
శిష్టాది గురువీవు, మృత్యుంజయా !
విరులిచ్చు వారలకు, సిరులిత్తు కరులిత్తు
హరులిత్తువో దేవ ! మృత్యుంజయా !
తలఁపులో నీపేరు, దలఁచినంతన యాప
దలు పటాపంచలౌ మృత్యుంజయా !

సంతానవంతులకు, సంతానమే భవ
చ్చింతాపరత్వంబు, మృత్యుంజయా !
తెలిసియో తెలియకో, తలమీద నొక బిల్వ,
దళమేయఁ బ్రేమింతు, మృత్యుంజయా !
నీవంటి దేవరను, నేవేల్పులం జూడ,
నీకు నీవేసాటి, మృత్యుంజయా !
నిను స్మరించుకతాన నే మృత్యువును నెట్టు,
నే నిట్టులున్నాడ, మృత్యుంజయా !
కవచంబు తావకం, బవుగదా పఠియింపఁ
గవచంబు శివ దేవ ! మృత్యుంజయా !
యీవౌదు రిక్తుండ, వేనాఁడు నినునమ్మి,
దేవ ! రిక్తుఁడుగాఁడు మృత్యుంజయా !
శ్రీలిత్తువేకాని, వాలాయమును నీవ,
దేల ? యీవు విముక్తి మృత్యుంజయా !
సంతసంబేకాని సంపదంధులఁ జేసి
జననింద నొకఁగూర్తు, మృత్యుంజయా !
సిరి కేశవున కిచ్చి, గరళంబు గ్రసియించి,
సురలఁ గాపాడి తట మృత్యుంజయా !
కలరయ్య ! యీదృశులఖిలలోకముల నీరుఁ
జెప్పఁబోఁగానీవె మృత్యుంజయా !
కల యలంకృతులలో, పలన నన్వయము నిన్ .
వలచి పుట్టంబోలు ! మృత్యుంజయా !
కలరు వేల్పులు కోట్ల కాలఁది నొక్కండేని
కలఁడె; మృత్యుంజయుడు మృత్యుంజయా !
కల పురాణములలో, పల మూడుపాళ్ళనీ
ఘనతవర్ణించునో, మృత్యుంజయా !
నీదాక నెందులకు, నీ భార్యయేయిచ్చు

నిఖిలమంగళములో మృత్యుంజయా!
అష్టమూర్తివి నీవ, రిష్టవారకుఁడ వు,
త్కృష్టంబు నీమహిమ మృత్యుంజయా !
జ్ఞానులను రక్షించు ఘనులుండ్రుగాక అ
జ్ఞానులకు దిక్కీవు మృత్యుంజయా !
కన్నప్ప యేమంత, జ్ఞానివానికి ముక్తి,
కరుణించినావీవు మృత్యుంజయా !
అంకిలుం డత్యంత పంకిలుం డవ్వాని
నాదరించితివీవు మృత్యుంజయా !
కొలఁది భక్తికిఁగూడ, నెలమిగాంచెదవీవు
కలరే భవాదృశులు మృత్యుంజయా !
నినునమ్మి చెడిన మానిసిని నేఁగనబోను
నిక్కంబు నామాట మృత్యుంజయా !
ఏరాతి పైనేని; నీరూపు భావింప
నెదురౌదు వీవంత మృత్యుంజయా !
పావనాత్ములబ్రోచు, దేవతల్గలరయ్య
పాపాత్ములకీవె మృత్యుంజయా !
హరులిత్తు సిరులిత్తు నాయురారోగ్య భా
గ్యములిత్తు భక్తులకు మృత్యుంజయా !
కోటులకుఁ బడగెత్తు నాటుకోటులు నీదు
పదభక్తులనివిందు మృత్యుంజయా !
అతనికీవిచ్చితివి వేదాది విద్యలు
వేదమది నీనిట్టూర్పు మృత్యుంజయా!
బ్రహ్మాండ నిర్మాత బ్రహ్మయాతని నీవు
పరిభవింపఁ జేసితివి మృత్యుంజయా !
నాట్యంబునకు నీ వనాదిదేశికుఁడవై,
నావింత నిక్కంబు మృత్యుంజయా !

గూడూరి వియ్యన్న కోరుటంజేసి యి
ట్లీడించెఁ జెళపిళ్ళ మృత్యుంజయా!
నీపేరనే యమ్మనీషిపార్మసిని ని
ర్మించె నీభక్తుండు మృత్యుంజయా!
అతఁడు నీయందు నాయందు మిక్కిలి భక్తి,
మెలగువాఁడెఱుఁగుమో మృత్యుంజయా!

—• తెలుగు సేఁత •—

సీ. కరములరెంట మృగము నక్షవలయంబు
ధరియించు వాని హస్తద్వయమున
నమృతకలశ లంటి అన్య హస్తద్వయి
నవివంచి అభిషేకమందు వాని
నంక విన్యస్తమౌ హస్తద్వయమ్మున
నమృత కుంభద్వయ మమరువాని
లేఁత చందురుని దాల్చిన కిరీటమువానిఁ
బుండరీకాసనంబు గలవానిఁ

గీ. బరము గైలాసపర్వత భాసమాను
సూర్యచంద్రాగ్ని నేత్రు నిస్తుల చరిత్రు
మృత్యువు జయించినట్టి యమేయు నభవు
దేవు శివు భజియింతు సుదీర్ఘభక్తి.

—• గాంధీజీ నిర్యాణము •—

మ. మెడకున్ గుంపటి లింగకాయబలె నెమ్మిందాల్చు పైఁ గూడఁ "గ
ద్గడ" లాడించుహిమాని వొల్చు నల "లండన్" పోర్తిలిలో గూడ నె
క్కుడు "డ్రస్సున్" ధరియింపకుండ నృపుఁ గన్గొనేగె గాంధీమహా
త్ముఁడు; తాదృశులు గేస్తులందు మన హిందూదేశ మందుండిరే.

తే. గీ. ఆతఁ డవధూత మార్గమ్ము ననుకరించు
నదియె బోధించు నితరుల కలవియగునె;

గేస్తులకు దాని తత్త్వమ్ము, కేవలమొక
గాంధికేచెల్లె నాతఁడీ కాలపు ఋషి.

ఉ. పాతుకపోయి దేశమునుబట్టి పలార్చు విదేశవాసులన్
నేతల నీతులన్గఱపి నెమ్మదిగాఁ దొలఁగించినట్టి యా
చాతురి కెంత మెచ్చిన రసజ్ఞకుఁ దృప్తిజనింప, దిట్టివి
ఖ్యాతులు మున్నుపుట్టరు యుగంబుల నెన్నిట నెన్నిచూచినన్.

తే. గీ. అతని భుక్తియు మఱియు నల్లతని రక్తి
అతని భక్తియు మఱియు నల్లతని శక్తి
అతని ముక్తియు వేఱు లోకాతిశాయి
అతని చరితంబితరులకు నందఁబోదు.

ఉ. ఆస్తికుడయ్యు గాంధిఋషి నాఽస్తికు భంగిని దోచుచుండు చే
దస్తములేని యాతని యుదారత దుర్గ్రహ, మమ్మనీషి వి
ధ్వస్తసమస్త భిన్నమత వర్తనుఁ డాయన తత్త్వమున్యథా
వస్తుకమౌనటుల్ దెలియువారలు మృగ్యు లెఱుంగఁ జెప్పితిన్.

క. చండాలుం డేనియు, బా
పండేనియు గురుఁడటంచుఁ బల్కెడు ధీమం
తుం డలశంకరు నట్టిఁడ
ఖండుఁడు గాంధి యన నొరులుగా రతని సముల్.

ఉ. గాంధి మహాత్మకుం డనఁగఁ గారణజన్ముఁడు, తన్మనంబు దు
ర్గంధులపట్లఁ బూర్తి విముఖంబని లోకమెఱుంగు నా కృపా
సింధుఁడు వంగదేశము నశించుట కెంత కృశించి సొక్కెనో
అంధమనస్కులా మొఱకు లారయనేర్తురె? గోపలాళనుల్.

తే. గీ. ఎందఱో వచ్చి రెందఱో కృష్ణదేవుఁ
డవతరించిన పుట్టింట నగడుగుడిచి
రక్కతమున స్వరాజ్యము లాంగిలేయు
లిడక తప్పని విధి యయి యిచ్చినారు.

## — ఆశీర్వచనము —

ఉ. పోతనవంటి పుట్టు కవి - పుట్టి పెరింగినసీమ దాతృతా
ఖ్యాతికి నాలయంబు - విజయంబు గురూత్తమ పాదభక్తికిన్
నేత మహాహమ్మదీయుఁడు - మనీషుల గౌరవమున్నచోటు - దు
ర్జాతులు త్రొక్కరానిది "నిజాము" పవిత్రము - రాజ్యమారయన్

క. సరిహద్దు సీమలకుఁ బోరిఁ
బోరిన్ గలవచ్చు నల్లపుడు "నైజాం" దు
ర్భర పీడా పరిభూతిన్
మొలకులకున్ లోగదెట్టి ముత్తెదువయో!

తే. గీ. అనఘుఁడగు రామదాసు భద్రాద్రియందు
రాము నెలకొల్పియెచట నేరామునకును
లేనివైభవమును దన మేనిడి ఘటి
యించు - కీరితి యెపుడు రహించుఁగాక!

క. కులగిరులు క్రుంగిపోయిన
నల భద్రాచలము చిన్నదయ్యు రహించున్
కల భక్తకోటిఁ బ్రోచుచుఁ
దలపై రామాలయమును దనరెడి నన్లే

క. "నైజాము" మండలమునకు
రాజగు "నుస్మానియాకు" రాజిల్లుత! స
త్తేజం బాయుర్వృద్ధియు
శ్రీ జాని యనుగ్రహమున సిరియునితోఁ బిన్.

క. కలవాని గొలుచు భూపతి
కలవాఁడై యెసఁగువాఁ డఖండుం డాఖం
డల తుల్యుఁడో? పైవాఁడో?
కలవాఁడై సర్వధా ప్రకాశిలుఁగాతన్!

తే. గీ. ఓ తెలంగాణమా ! నీకు నున్నతదశ
పట్టనున్నది - పట్టిన దిట్టియోగ
మక్షిగోచరమై - వ్యర్థమగుటలేదు
వృద్ధిఁజెందుము సర్వధా వి_స్తరిలుచు.

—• విశాలాంధ్ర అవతరణ •—

నేడు విశాలాంధ్ర అవతరణమహోత్సవం ప్రారంభమవుతున్నం దుకు చాలా ఆనందపడుతున్నాను. చారిత్రికంగా ఆంధ్రుల మహోన్నత దశలు గుర్తునకు వచ్చినప్పుడు అస్వాతంత్ర్యపుటనైకమత్యపు పరిస్థితులు హృదయవిదారకంగా తోచకమానవు. "శతాంధాఃకూపంప్రవిశంతి" గా నాయకత్వం వహించేవారి ఆజ్ఞలు ప్రజానీకానికి శిరోధార్యాలై తేనే కార్యసాఫల్యం ఏర్పడుతుంది. అట్టి శ_క్తికి విశాలాంధ్ర నిర్మాణం-నాందియై క్రమంగా శుభోదయంగా పరిణమించుగాక!

వచ్చినట్లేవచ్చి-అంతలో మఱికొంతకాలంపాటు స్వరూప ప్రదర్శన కెందుకో సిగ్గుపడుతున్న—ఆంధ్రికూడ సర్వావయవభూషితురాలై, వచ్చుట కిది మార్గదర్శియగుగాక !

గాంధీమహాత్ముని యేకైకనాయకత్వంలో భారతదాస్యవిమోచనాన్ని సాధించిన కాంగ్రెసుసంస్థయే సర్వవిధాలా నేటివిశాలాంధ్ర మహాసభకు ఆదర్శమగుగాక !

క. శీలమునకు పాలనమున
కాలంబనమగుచు ప్రజలకతిసుఖదంబై
పాలింపంబడుఁగాత! వి
శాలాంధ్ర రహించుఁగాత! జగతీస్థలిలో.

క. ఏలెడివారికి మఱియుఁ
బాలింపంబడెడి ప్రజకు భాగ్యోదయమై
శీలముగల యువతులకువి
శాలాంధ్రరహించుఁగాత! జగతీస్థలిలో.

క. "కాలోహ్యయంనిరవధిః
శీలశ్చతథైవ" యనుచుశీలవతులువి
ద్యాలంబినులలరంగవి
శాలాంధ్రరహించుఁగాతః జగతీస్థలిలో.

క. శ్రీలకుఁదానకమయిజే
జేలకునున్ సైతమంతు చిక్కనిభోగ
శ్రీలున్ భాగ్యశ్రీలువి
శాలాంధ్రిగడించుఁగాతః జగతీస్థలిలో.

ఆ. వె. అవతరించుగాతః మానాటియుత్కృష్ట
దశలు తెనుఁగు వారి ధైర్యమందు
కార్యదీక్షలోని శౌర్యమ్ముగవగూడి
ప్రభుత యుద్ధరింపఁబడునుగాతః

క. ఒకరినినొవ్వంజేయక
యొకరిపయిన్ బక్షపాతముంచక శాంతిన్
బ్రకటించుచు స్వాతంత్ర్యము
నకు యత్నించుటకు బూవినన్ శుభములగున్.

గీ. ఒకప్రజారాజ్యమున మనముంటిమిప్పు
డనినపాలకులము మనమైతిమన్న
మాట-కావునమనలోన మనమెరాష్ట్రి
మును జెలిమితో విభాగించుకొనుటలెస్స.

గీ. అదివిశాలాంధ్రిగా బుట్టువందుకొఱకు
నాటుచున్నాము నేడు పునాదులిచట
వీనిపైమేటిసౌధముల్వెలసి తెనుఁగు
వారికి సుభిక్షమున్ గూర్చిప్రబలుఁగాత.

క. సరిహద్దులేరు పాటగు
వరుసనునైజాముతెనుఁగు భాగముమనలో

స్థిరమౌఁగావుతః మెప్పటి
కరమరికలులేని స్నేహమభివృద్ధిగొనన్.

ఇట్లే యావద్భారతమున్ను భాషాప్రయుక్తరాష్ట్రవిభజన సిద్ధాంతాను సారంగా విభాగింపఁబడుటతో సుఖశాంతులు సంపదలు అభివృద్ధియై రత్న గర్భయను పేరు సార్థకమౌగాతః మనియాశీర్వచించుచున్నాను.

—• ఉగాది సందేశము •—

చ. అవని "నవోనవోభవతి" యంచు సమస్తము శోభఁగాంచి యెం
దు విలసనమ్ములన్ నవవినోదములన్ బ్రజలార్ద్రచిత్తులై
సవనములన్ బొనర్చి దివిషద్గణముఁగా బరితృప్తిగాంచున
ట్లు వివిధమార్గముల్ నెఱపి లోకము సౌఖ్యకరం బొనర్చుతన్!

సీ. ఎన్నియోయిప్పంటి కేగియుండెయుగాదు
లీయుగాదిని బోలవేవిగూడ
మనతాతముత్తాతలును వారిముత్తాత
లెఱుఁగరిట్టియుగాది నెపుడుగూడ
స్వపదంబునెవరు రాజ్యపదంబుతోఁగూర్చి
పలుకరు-వినరౌరుల్ పలికిరేని
వినరును; పలికినఘనులను వారి-తు
రచిపెద్ద తప్పని-యఘమనియును

గీ. అట్టిభారతీయులునేఁ టికాత్మరాజ్య
పాలనంబన నెట్టిదో ప్రీతిభమెఱియ
నేలుచున్నార లంతలో నెసకమెసఁగ
వచ్చినది యీయుగాది సంవత్సరాది.

సీ. ఓపికఁ బట్టి మాయోగమ్మ క్షేమమ్ముఁ
గాంచవచ్చితివే? ఉగాదితల్లి!
ఎన్నాళ్ళకెన్నాళ్ళకీక్షించితిమి విన్న
వత్తువటంచు నెవ్వరును దెలుప

రెవరియాశీస్సులాయీమమ్ముఁ బ్రేమించి
యిట్టిసుయోగమ్ము నెనయఁజేసె
తెలుపఁగదమ్మ! మాతెనుఁగుఁ దల్లిరో! భార
తీమతల్లిరో! నిన్ను దేశదేశ

గీ. ములసుబాలించుఖండముల్ బలెనె శీర్ష
మెత్తిచరియించునట్లుగా నేముసేతు
మమ్మ! మాప్రతిభను నీకునరయఁజేతు
మెఱుఁగుదువుగాక! మాదుమనీషబలిమి.

తే. గీ. "తగినసామగ్రిలేని యత్తటి బృహస్ప
తియును దృణమునుజేయఁడద్ది గలయప్డు
వజ్రమగునెద్దియేని" యన్ పలుకు నేఁడు
తెల్లమయితోఁచె నోభారతీమతల్లి !

సీ. మరచితినో యమ్మ! మాపిన్నముత్తాత
చెళపిళ్ళ నరసింహశేఖరుండు
నిన్నుగురించితిక్కన్న పెద్దన్నలు
నన్న్యలు గాంచిన యట్టిముదము
కాంచెనో లేదో? మాకాలానకీనాటి
కిట్టిసుయోగ మీదృశ్యషుదము
ననుభవింపఁగఁ జేసెనమ్మ నీరాక యెం
తేనియు నభినంద నీయమయ్యె!

గీ. నయ్యెసంస్తవనీయమ్ము నయ్యెశుభద
మేదియునుగాకపోదు మనీషిజనుల
మెచ్చునకుఁ బాత్రమైన నీమేల్మిరాక
భారతీమతల్లిరో! నీకు స్వాగతంబు.

— శివసంకల్పమస్తు —

మ. శివమర్థించెద నిన్ను నీ పెనిమిటిన్ నీ భక్తబృందమ్ము, వై
భవమూహించెద నీ కటాక్షకలనాభాగ్య మ్మెదన్ నిల్పి నీ
ధవు నారాధనసేతు మాధవునకున్ దాసాను దాసుండఁజూ!
శివసంకల్పక మాత! మన్మనమునిన్ సేవించుతన్! సర్వదా.

మ. తను భావానగురుండు శుక్రుఁడును దుర్దారిద్ర్య విధ్వంసకుల్
ఘనులున్నారలగాములిచ్చు గురుయోగమ్మల్ భవద్వేద్యముల్
నిను సేవించెడి కీటమేనియును నిర్ణిద్రింబు నారోగ్యమున్
గనుఁగా "నామనమేలకాదు శివసంకల్పమ్ము" కాత్యాయనీ.

మ. కరి నక్రానకుఁ జిక్కినట్లు జననీ? కల్యాణి? నే రోగ దు
ర్భర నక్రానకుఁ జిక్కితిన్ వయసువార్ధక్యమ్ము నీయూఁత మి
త్తతి నాకౌత శరణ్యమర్థిని భవద్దాసుండ భక్తావనీ!
శరణన్నన్ దయఁజూపి ప్రోచుటయె నీ సంపత్తు కాత్యాయనీ!

మ. కవులున్నార్పలుమంది నన్నుఁబలె నీకారుణ్య మర్థించు రు
గ్భవు లున్నట్టులు లేదు సర్వమును మద్భారమ్ము నీ శీర్షమం
దవునన్లే నిడి సంసృతిన్ మెలఁగి శ్రేయస్సుల్ సమార్జించెదన్
శివ సంధాయిని! హృద్గతాఘములు నేఁజెండాడెదన్ నీకృపన్.

శా. ఏదోజన్మమునెత్తి కాని సుకృతంబేనిం దదర్థంబు నే
నీదేహమ్మున నుండి భుక్తిగొనఁబోఁడెవ్వాఁడు నోయంబ? నా
ప్రాదుర్భూతి గ్రహస్థితిన్ దెలిసికో నాశ్చర్య మీప్వంద్వమే
నీ దేహంబుననుండి కొంటినిజుమీ? యీశాని? కాత్యాయనీ?

"తన్మే మనశ్శివ సంకల్పమస్తు!"

— గ ద్య —

ఇది శ్రీ....కింకపీందిృఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బులయిన చాటుపద్య సర్వస్వంబునుగల కలగూరగంప
నామకగ్రంథంబున సర్వంబును సంపూర్ణము.

శ్రీ మత్పరదేవతార్పణమస్తు!

# * ముఖ్యమైన సవరణలు *
## నానారాజసందర్శనము

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 19 | యామ | యాగమ |
| 11 | 21 | నూన | సూన |
| 35 | 2 | దుఃకట్లుంనే | కట్లుండునేః |
| 40 | 22 | మహ | మహః |
| 74 | 1 | యటి | యట్టి |
| 74 | 25 | రాకృ | రాపకృ |
| 79 | 2 | తుల్ | తులు |
| 79 | 2 | తులు | తుల్ |
| 79 | 17 | శ్లోక | స్లోక |
| 80 | 2 | గాంద | గాంచ |
| 89 | 26 | చిన్న | చిన్ని |
| 91 | 2 | మువ్నై | మొవ్నై |
| 96 | 21 | చంద్రా | చంద్ర |
| 105 | 4 | లశలన్ | ల్దశలన్ |
| 118 | 22 | మ్యడ్డు | మ్మడ్డు |
| 121 | 25 | దిద | దిద్ద |
| 131 | 3 | దైతా | ద్వైతా |
| 131 | 5 | భు్తం | భుక్తిం |
| 133 | 22 | మిత్వే | మిత్యే |
| 140 | 21 | ర్మముల్ | ర్మమ్ముల్ |
| 155 | 6 | షయల | ట్టినయల |
| 173 | 11 | పింపు | పించు |
| 174 | 24 | మెచ్చె | వచ్చె |
| 178 | 17 | ద్భుమై | ద్భువమై |

# శతావధానసారము

| పేజీ | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 15 | లొల | లొన |
| 60 | 18 | డ్లిడ్లు | డ్లిండ్లు |
| 69 | 6 | ధితా | ధిగతా |
| 69 | 23 | పసంత | వసంత |
| 87 | 7 | య్యావి | య్యాది |
| 97 | 21 | శ్రీ | శీ |
| 105 | 17 | వ్యమె | వ్యమై |
| 106 | 17 | నంత | సంత |
| 107 | 6 | ధధా | దధా |
| 111 | 14 | ఖిశా | ఖిసా |
| 149 | 18 | షభా | షసభా |
| 149 | 23 | విధీధిత | విదధీత |
| 150 | 1 | బల | జల |

# కలగూరగంప

| | | | |
|---|---|---|---|
| 92 | 15 | పెరే | పేరే |
| 99 | 9 | షఁద | పంద |
| 100 | 22 | న్నాఁదు | న్నాఁడు |
| 100 | 24 | నేఁగుఁ | నీఁగుఁ |
| 112 | 7 | నెట్టు | నెట్టి |
| 112 | 11 | వేనా | వేవా |
| 112 | 26 | ఝిచ్చి | యిచ్చు |